# Argument



This thesis traces the evolution of the novel in Telugu and formulates a critical canon for the evaluation of the Novels which have been written in Telugu This Thesis assesses some of the wellknown Novels in Telugu and presents a comparative estimate of the successful and the unsuccessful efforts in Novel writing. It is hoped that this will rouse a lively interest in the Telugu Novel and help both the common reader and the Scholar to evaluate the novels that they have read and arrive at judgments of their own. The most important points that have been made in the course of each chapter of this thesis are indicated hereunder :–

CHAPTER I (The Indigenous Back ground, Sanscritic)

The Characteristics of prose fiction in modern Telugu Literature have been traced, for the first time, by the writer of this Thesis, in part to the Vedic and Buddhistic Literatures and in part to the Folklore and Folk Tales of ancient India The influence of Harshacharita, Kadambari and other well known sanscrit works, is delineated and the elements common to them and modern Telugu Novels such as the autobiographical element, the sense pause underlying the division of the work in the chapters and the topping of a chapter with a suggestive quotation have been dwelt upon for the first time in this Thesis. The distinctive features of Akhyayika and Katha are fully discussed in this chapter. This chapter presents, in historical retrospect, the development of the concepts underlying the growth of fiction in Sanscrit, which reflected in to Telugu at a later date and tests the validity of the contentions made in this regard.

CHAPTER II (The Indigenous Back ground, Telugu)

This Chapter discusses the techniques of telling a story employed in Telugu Epics and the later day Kavyas with the help of examples culled from various works and points out their incidence in modern Telugu novels The growth of Telugu prose is dwelt upon, in order to explain the appearance of the novel on the Telugu Literary scene. The Gadyaprabandha is revealed as the Telugu novel in its embrionic state.

CHAPTER III (The Foreign Back ground . Novel in World Literature)

This chapter considers the impact of the Western Novel, specially the English, the German, the French, the American and the Russian on the Telugu Prose fiction and proves conclusively, through the evaluation of the impulses at work on the literary scene, such as the Neo-Romanticism, Humanism, Realism, Neo-classicism, that the Telugu owes to its Western models also a great deal more than it cares to acknowledge.

CHAPTER IV (The Foreign Back ground . Novel in Telugu Literature)

This chapter splits itself into three parts respectively dealing with ·

i) The history of the Novel as a form of Literature;

ii) The history of the Telugu Novel and

iii) The appearance of the first novel in Telugu as a child of an extraneous spell cast by the Western Novel.

The contending claims made by Viresalingam Pantulu and others for the honour of being the first novelist, in Telugu, are critically examined.

CHAPTER V (Telugu Novel of the Modern Times, in the Making)

The flowering of the Indian renaissance in the various areas of Telugu Literature is explained and the factors that have contributed to it are critically judged in the introductory part of this chapter The novels of this period are evaluated with reference to their special characteristics and features and classified in accordance with their genre and arranged in the chronological order. The novels produced with and without the active support of public agencies such as book-trusts and journals are evaluated and their respective merits and demerits pointedly indicated. The production and popularity of certain kinds of the novel are traced to the aims and objects of the agencies that have encouraged the writing of them. The dominance of the social and the realistic novels is explained in terms of new ideas that have been imbued and assimilated by the Indian creative writers.

CHAPTER VI (The development of the Novel in Modern Era, I (1920-'47)

The spread of Western thought and the values of western culture, through the medium of English Language and Literature, the claims and needs of the growing middle class, the permeation of Western ideologists are referred to and critically considered as common impulses underlying the various kinds of the Novel. The distinctions in respect of style, technique, & purpose between one kind of the novel and another are brought out and inquired into.

This chapter explains the success or otherwise of the social, political and other genres of novels. A frank criticism of the novels of the period is offered and positions, in the history of the Evolution of the Novel, to them are assigned.

CHAPTER VII (Post Independence Era I - (1947-1953)

This chapter indicates how such public agencies as Radio, the university and the public trust and the press, have promoted Novel-writing and sets forth how the attainment of Independence has influenced the growth of the Novel in Telugu. The popularity of certain kinds of the novel such as the political, the

sociological and the Politico-sociological is accounted for and their distinctive features discussed. Particular attention is paid to a consideration of the interplay and mutual influence of the elements of the novel such as character and Incident, time and space. A Comparative study is for the first time, made of the Social, Historical, Period. Dramatic and Action Novels with particular reference to plot, Action, Character, Time and Space and such other ingredients of the Novel with a veiw to evaluating their contribution to the evolution of this form of Literature.

CHAPTER VIII (Post Independence Era II (1953-1957)

This chapter makes a note of the strides taken by the Novel during this period and discusses the development of the political, historic, pedagogic and social novel during this period.

CHAPTER IX (Post Independence Era III (1957-1962)

The progress made by political, social and psychological novel, during this period, is assessed in this chapter and comparative study of their succusses and failures is made.

CHAPTER X (Some outstanding Novels)

In this chapter the outstanding novels is Telugu are examined with a view to pointing out their distinctive traits. This chapter establishes the superiority of the psychological novel over the other kinds of the novel, especially the modern social novel, through a critical analysis of their respective qualities and attainments. An attempt is made to prove the lasting significance of the portrayal of the inner life that is found in the psychological novel and to answer the critics who have glorified the sociological at the expense of the psychologica novel.

CHAPTER XI (Some outstanding Novelists)

The achievement of six popular novelists ,—

1. Chilakamarti

2. Bapi Raju

3. Viswanatha

4 Chalam

5. Gopichand and Butchi Babu — is critically examined in this chapter and the impact of their works on the reading Public, is broughtout.

CHAPTER XII (Some outstanding Characters)

The most outstanding characters of the Telugu Novels are discussed and their popularity accounted for.

CHAPTER XIII (Sum up)

This chapter sets forth the following :

(a) A brief comment on the various kinds of the Novel.

(b) An assessment of the achievement of the Novel with reference to Theme and Treatment.

(c) An examination of the various influences at work and techniques employed in Telugu Novel Writing.

(d) An evolution of the Art and Craft of the Telugu Novel.

(e) Some suggestions in respect of Themes which have not so far figured in the Telugu Novel

The author of this Thesis hopes that his work will not only acquaint the reader with the aspects of the Telugu Novel but also interest him in the reading of, at least, the Masterpieces of Telugu fiction. A classified reading list of select Telugu Novels is appended hereto, for the benefit of the reader.

—The Author.



**కృతిభర్త**



మాన్య శ్రీ పి. వి. నరసింహారావు, బి.యస్‌సి., యల్ యల్. బి.
ఆంధ్రప్రదేశ ముఖ్యామాత్యులు

ప్రథిత సౌమ్య మూర్తి
పాండితీస్ఫూర్తికి
అగుత 'పీ. వి.' కీర్తి
కంకిత మిది

**కృతికర్త**



డా॥ బి. వి. కుటుంబరావు, ఎం. ఎ., బి.ఇడి., పిహెచ్. డి.
ఆంధ్రశాఖ - ఉస్మానియా విశ్వవిద్యాలయము

# ఆంధ్ర నవలా పరిణామము




డా॥ బి. వి. కుటుంబరావు,

ఎం. ఏ., బి. ఇడి., పిహెచ్. డి.

# ఆంధ్ర నవలా పరిణామము

[ప్రథమ సంపుటము]



ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి

డాక్టరేట్ పట్టము నొందిన సిద్ధాంత గ్రంథము



డాక్టర్ బొడ్డపాటి వేంకట కుటుంబరావు

ఎం. ఏ., బి. ఇ. డి., పి. హెచ్. డి.

రీడర్, ఆంధ్రశాఖ,

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

సర్వస్వామ్య సంకలితము

ప్రథమ ముద్రణము : 1200 ప్రతులు

1, జూన్ 1971



గాయత్రీ ప్రచురణము (౧)

మూల్యము : రు. 30 లు



ప్రతులకు

డాక్టర్ బి. వి. కుటుంబరావు

1-9-295/1/3A/2 విద్యానగరు, హైదరాబాదు—44

ఆంధ్ర ప్రదేశము

---

దీప్తి ప్రెస్-హైదరాబాదు-1.

# I

## ప స్ప శ ము

విషయపఠనమునకు నాలుగేండ్లును రచనమునకు రెండేండ్లును వెరసి యాఱేండ్లు రమారమి పరిశ్రమించి నడుమనడుమఁ దఱచుగఁ బర్యవేక్షకులైన[1] యాచార్యులతో బ్రధానాంశములనుగూర్చి చర్చించుచురాఁగా, నేఁటి కీ సిద్ధాంతగ్రంథరచనము పూర్తి యైనది.

నానానగరములలోఁగల యెన్ని గ్రంథాలయములు, గ్రంథమాలలు, బహుభాషలలోఁగల యుగాది త్రైమాసిక మాస పక్ష వార దినపత్రికాదికము, నవలోడనము చేయఁబడినవో, యెందఱెందఱు రచయితలు స్వయముగఁ గలిసికొనఁబడిరో, యిందలి యథోజ్ఞాపికలవలనను గ్రంథాంతమున నీయఁబడిన యుపజీవ్యగ్రంథమాలిక[2]వలనను బండితులకు సుగ్రాహ్యము కాకపోదు.

తృతీయప్రకరణములో బ్రముఖపాశ్చాత్యదేశములలోని యాధునికనవలాపరిణామమును జెప్పి, పిదప మన భాషానవలలపై దాని ప్రభావమును జెప్పుట మొదట నుద్దేశింపఁబడెను. కాని గ్రంథవిస్తరభీతిచే నా యా దేశముల నవలాపరిణామము లనుబంధములలోఁ జేర్పఁబడినవి. అందుచే వాని సారసంగ్రహముమాత్రము తృతీయప్రకరణమయ్యెను. మన నవలపైఁగల పాశ్చాత్యప్రభావ మెల్ల రెఱుఁగుదురు; ప్రాచ్యప్రభావ మెల్ల రెఱుఁగరు. ద్వైమాతృకమని నిరూపింపఁబడిన మననవల యెంతవఱకుఁ బ్రాచ్య ప్రభావమునకుఁగూడ ఋణపడియున్నదో నిర్ధరింపఁబడుట యిందొక క్రొత్తసంగతి. కావుననే ప్రథమప్రకరణములో నా యంశమును మాత్రము విస్తరించిచెప్పుట జరిగెను.

కథానికాపరిణామమునుగూర్చియు నీ గ్రంథమునఁ బరిశీలించుట యాదిలో నుద్దేశింపఁబడినది. అందుచే నెడనెడఁ గథానికాప్రసంగముకూడ నవలాకథానికల తారతమ్యనిరూపణాద్యవసరములయందుఁ జేయఁబడెను.

నవలాసాహిత్యోత్పత్తివికాసములనుగుఱించి చెప్పుటయేగాక యా సాహిత్యమును సవిమర్శనముగా బఠించుమార్గముల సూచించుటవలనఁ బాఠకుల కభినందన సామర్థ్యమును బెంపొందించుటకూడ నీ గ్రంథపరమోద్దేశము. తన్మూలమున సర్వవిధముల నవల కొక యున్నతస్థాయి సంపాదించుటకిందుఁ బ్రయత్నము జరిగెను. ఈ గ్రంథమందలి విషయమూ, నవ్యమైనది. దానినిగుఱించియూ, యింత యెత్తున నిదియే ప్రథమగ్రంథము. ఇది యథాశక్తిని నిర్వహింపఁబడె ననవలెనేగాని కేవలము నిర్దుష్ట మనుట యహంకరించుకొనుట యగును.

'నవల'యను పదమొక సంకేతముగ గ్రహింపఁబడి పెక్కు సమాసములలో సంస్కృతపదముగ వాడఁబడకతీరలేదు. రమారమి పావుశతాబ్దినుండి రచయితలు

---

1. Supervisor of Researches.
2. List of books consulted or Bibliographical–Notes.

ప్రజలుగూడ నట్లు వాడుకచేయుచున్నారు1. కావున 'నవలాసాహిత్యము, నవలానాటకములు, నవలాకథానికలు, నవలారచనము నవలాకర్త'వంటి బహుసమాసములలో నాకారాన్త స్త్రీలిఙ్గముగ నవలాశబ్ద మావశ్యకమును శ్రవణసుఖమునుబట్టి ప్రయోగింపఁబడుట క్షంతవ్యము.

'తెలుఁగు-ఆంధ్రము'నను పదములు పర్యాయపదములుగ నిందు వాడఁబడినవి. ఐతిహాసిక, చరిత్రాత్మక, చారిత్రిక చారిత్రక పదములుగూడ 'నవలకు' విశేషణములైనపు,డిందు సమానార్థద్యోతకములుగ వాడుకచేయఁబడెను. అట్లే యొకానొకవాదపరముగఁగాక సాధనసామగ్రి యను నర్థమునందు వాడఁబడినపుడు ప్రతీకసంపత్తి యను సమాసము సాంకేతికసంపత్తి యను సమాసమునకుఁ బర్యాయమైనది. వాదపరమైనపుడు 'ప్రతీకవాద'మనియు విద్యాపరమైనపుడు 'సాంకేతికవిద్య' యనియుఁ బ్రయోగింపఁ వెలువిషయము. సకృత్తైన యీ పై రెండు సందర్భములయందు వినా సంకేతము ప్రతీకము ననుపదము లిందుస్థూలముగఁ దుల్యార్థద్యోతకములు. ఇంకనుగొన్ని యిట్టి వానిని గుఱించి యాథోజ్ఞాపికలు వివరింపఁగలవు.

పదకము,పతకము, కథాసంవిధానము, కథాసన్నాహము, కథయొక్కబందుకట్టు కథబందుబస్తు మున్నగు పదములును సమాసములును స్థూలముగఁ బర్యాయపదములవలె నిందు వాడఁబడుట పునరుక్తిచే నొకేమాట విసుగుగొలుపకుండుట నిమిత్తము.

ఇందలి తేదీలు చాలవఱకుఁ బ్రభుత్వమువారి 'గెజెటు'లనుబట్టి యీయఁబడినవి. పిదప నవలలనుబట్టియు గ్రంథసూచికలనుబట్టియుఁ బత్రికలనుబట్టియుఁ గొన్నినిర్ణయింపఁబడెను. తెలిసినచోటులయందు నవలారచనాకాలము ననుసరించియుఁ దెలియనిచోటులయం దధికముగ నవలాప్రచురణకాలము ననుసరించియుఁ నీ గ్రంథప్రకరణములలో సమీక్షార్థము నవలల క్రమము నెన్నుకొనుట యయ్యెను.

అర్థానుస్వారశకటరేఫములతోగూడి వ్యాకరణసాధువైనభాష యిందలి విషయమున కనువుగాదని హితైషులు కొందఱు చెప్పిరి. కాని దశాబ్దులుగ నుపాధ్యాయ వృత్తిలోనున్న నాకుఁదద్భిన్నమైన భాషవ్రాయుటయే కుదురకపోయినది. మఱియు నిది సిద్ధాంతగ్రంథము నగుటచే యథాశక్తి వ్యాకరణ సాధువైనభాషక్షమింపఁదగినదియే! ఆ భాష యెందేని సడలినచో బునరావలోకనముపుడు సవరింపఁబడును. నేఁ డధికార తారతమ్యమునుబట్టి శ్రుతిసమధిగత్వమేర్పడుచుండుటచే వ్యాకరణనియమ పాలనము గల భాషను శ్రుతిపేయమనిగాని శ్రుతికటువనిగాని నిర్ణయించుట కష్టముగ నున్నది

ఆ యా నవలలలోని విషయగాఢత్వము ననుసరించి శైలి కఠినము నాతికఠినము, సరళము గూడ నగుట సుజ్ఞేయము. మఱియు నిందలి రమారమి రెండువేలపుట లోక

1. "నవలా రచనము" విడమర్తి సత్యనారాయణమూర్తిగారి వ్యాసము—భారతి-పుట 539, ధాత, వైశాఖము.

నాఁడు వ్రాసినవికావు. ఒకేభావస్థితి[1] నేండ్లతరబడి చిక్కఁబట్టుట బహుదుస్సాధముగదా! దుర్గ్రాహ్యమైన పారిభాషికపదములకుఁ జాలవఱ కాంగ్లమున సమానార్థము లధస్సూచికలలో నిం దీయఁబడినవి.

విమర్శనము రచయితకుఁ గాక రచనకే ప్రాధాన్య మీయవలెను. కాని కొన్ని తావులలో గవుల యాశయాదుల నెఱుఁగుట యావశ్యకము. అనివార్యమగు నట్టి యెడలందు సాధ్యమైనంత మెలఁకువతో సద్విషయములయందే యీ గ్రంథమున దృష్టి సారింపఁబడినది. సదసమ్మిశ్రితముగదా, జీవితము! అసద్విషయ ప్రసక్తి యనివార్య మైనపుడు సాధ్యమైనంతవఱకు దేశకాలపరిస్థితులనే గాని, వాని లబ్ధమనఁదగు వ్యక్తి నిందు నిందించుట జరుగలేదు. ఎచ్చటనేని యే రచయితయేని యొకవేళఁ బరిహాసింపఁబడెనేమోగాని, దూషింపఁబడలేదని చెప్పవచ్చును.

అప్పుడప్పుడు మన నవలలలో గొంత యనుదాత్తత యున్నచో వీలయినంత వఱ కది మన జాతిపరమగు జీవితసత్యమును దాఁపక చెప్పివేయుటవలన నేర్పడిన సుగుణముగనే పరిగణింపఁబడినది.

స్వతంత్రరచనలకుఁ దోడ్పడిన కొన్ని నవలల విషయమున దప్ప ననువాదములకుఁ బ్రత్యేకమైన ప్రాధాన్య మిం దీయఁబడలేదు.

తఱచుగఁ బ్రకరణారంభములయం దా యా యుగములలోని సాంఘికరాజకీయ సారస్వతాదిపరిస్థితులు చర్చింపఁబడినవి. ప్రకరణముల మధ్యలో వానివాని పరిణామ మనఁదగిన నవలల విషయమే యుటంకింపఁబడెను; మఱలఁ బ్రకరణాంతరములయం దా యా యుగలక్షణములతో నవలాపరిణామము నన్వయించుటకుఁ బ్రయత్నము జరిగినది.

రమారమి పందొమ్మిదివేల సంఖ్యాపరిమితిగల నవలలనెల్లఁ బరిశీలించుట యీ రచనోద్దేశమే కాదు. ఆ యా విధములుగల నవలలకుఁ బ్రతినిధులనఁదగునవి మాత్రమే యిందు సమీక్షింపఁబడుట కదియే హేతువు. లఘువివరణపూర్వకమైన సూచికల[2]లో నీయఁగల సామగ్రి యింకను గలదు. ఇప్పటికే యిది విపులార్థవివరణ మైనది. అయిన నింకను గొన్ని ప్రకరణముల నిందుఁ జేర్పవచ్చును. అనుదినవిజృంభణము నొందు నిట్టి విషయమును గూర్చి యంతయు వ్రాసితి ననుకొనుట వెఱ్ఱితనము. ఉత్తరోత్తర రాఁగల లక్ష్యములను బట్టి లక్షణము లేర్పడుచుండఁగలవు.

ఈమూఁడు వ్రాఁతప్రతుల నెంతసవరించినను గొన్ని లేఖక ప్రమాదములు నిలిచిపోవుట తటస్థించెను. అవి విశ్రాంతిగ సరిదిద్దుకొనఁబడునని మనవి.

---

1. Mood.
2. Catalogue method of Index.

ఈ మూఁడుప్రతుల కన్నఁగా నాలుసంపుటములకు (6000 పుటలకు) సాధువైన ప్రతులను చెకిసగముగ వ్రాసిపెట్టిన నా శిష్యుఁడు, చిరంజీవి, జి. శ్రీశైలమునకును నా ప్రథమపుత్రిక, చిరంజీవిని, బొడ్డపాటి లీలాజ్యోతికిని నా యాశీశ్శతములు.

ఇట్లు
బుధవిధేయుఁడు
రచయిత.

3-7-1962.
2. P. M.

# ప్రస్తావము

*(ప్రథమ ముద్రణము)*

రెండు భాగములుగల యీ యావద్గ్రంథమునకును సాధుప్రతి రెండువేలపుటలది వ్రాయుటకు నాలుగుమాసములు పట్టఁగా, నందులో సగ మగు నీ ప్రథమభాగమును ముద్రించుటకు నవమాసములు నిండినవి. ఆంధ్రప్రదేశములోని కెల్ల మఱియు హైదరాబాదులో దెలుఁగున గ్రంథ మచ్చుగుటకు భగీరథప్రయత్నము చేయవలయును.

ఈ సిద్ధాంతగ్రంథముద్రణవిషయములో బెక్కు కష్టనిష్ఠురములు సహించిన దిక్షా ముద్రాలయయజమానులైన శ్రీ మామిడి రామిరెడ్డి బి. ఏ., బి. జె., గారికిని, తన్ముద్రణాలయనిర్వహణాధికారులైన శ్రీ దేశిరాజు పుండరీకాక్షుఁడుగారికిని నేను శతధా సహస్రధా కృతజ్ఞుఁడను. అట్లే, యీ ముద్రణాలయోద్యోగు లందఱకును నా పడిన ఋణము నంగీకరించు చుంటిని. విశేషించి చివరిదశలో స్వల్పవ్యవధియందు మిక్కిలి శ్రద్ధతో దీని విషయమున బహుప్రయాసముల కోర్చిన యుత్సాహి, చి॥ దేశిరాజు వేంకట సుబ్బారావునకు నా దీవనలు. యథాశక్తిని దీని కొక్క దినములో ననుబంధముల నాయత్తపఱచి యిచ్చిన చి॥సుబ్బారావునకును, నాపుత్త్రికలు శ్రీమతి. డా॥ బి. లీలాజ్యోతి, ఎం.ఏ, పి. హెచ్ డి., శ్రీమతి. బి. స్వాహాదేవి, బి.యస్ సి., ఎమ్. ఇ., శ్రీమతి. ఉమాబాలలకును మదాశీఃకృతసజీవపుష్పహారమాలికలు.

ఈ గ్రంథరచనకుఁ బూనిన దాదిగ నన్ను బ్రోత్సహించిన సుహృద్వరులకును సహృచ్ఛుభామణులకును నా ప్రణామపుష్పాంజలులు. నాకు డాక్టరేట్ పట్టము ప్రసాదించిన యధికారివర్గమునకును నీ గ్రంథముద్రణకుఁ దోడ్పడిన సంస్థలకును నా నమోవాకములు.

1-6-1971.
హైదరాబాదు.

బి. వి. కుటుంబరాయశర్మ.
గ్రంథ కర్త.

# ఆంధ్ర నవలా పరిణామము

## ప్రథమ భాగము

## విషయ సూచిక

# ప్రథమ ప్రకరణము

## స్వదేశీయ పూర్వరంగము — సంస్కృతము

1. వేద బౌద్ధవాఙ్మయముల పూర్వ రంగము
2. కాదంబరీ హర్షచరితాదుల నుండి కథాఖ్యాయికల లక్షణాదికము
3. ఆంధ్రనవలా ద్వైమాతృకత్వము



# ఆంధ్ర నవలా పరిణామము

# The Evolution of Novel in Telugu

## ప్రథమ ప్రకరణము

*[ఆఖ్యానము—ఆఖ్యాయిక: వేద బౌద్ధవాఙ్మయములు]*

ఓంకార రూపమగు వేదములయందు భారతీయుల ప్రాచీనతమ ఛందో రూప కవితా బీజము లున్నవి.1 అట్టి ప్రాచీన కావ్యములలో సైతము గద్యము పద్యముతో సమ్మిళితమై యున్నది. తదుపరి బ్రాహ్మణములలో బురాతన హైందవార్యుల ప్రథమ గద్య రచన లగపడఁ గలవు. వేదములకును యజ్ఞ తంత్రములకును గల పరస్పర సంబంధమును విశద పఱచుటయే బ్రాహ్మణముల ప్రయోజనము.

కావున, తంత్రసంబంధమైన యాఖ్యాన2 (తాంత్రికాఖ్యాన) ములును వెలసినవి. ఋగ్వేదసంహితయందు దార్శనిక దృష్టిగల శ్లోకములే గాక శ్రవ్యదృశ్య కావ్యపరదృష్టిగల శ్లోకములు నున్నవి. అయినను నివి ప్రధానముగ సంవాదరూపకథా

---

1. పాశ్చాత్య దేశములలో బ్రాచీనమైనవి గ్రీకు రోమక సాహిత్యములు. అట్టివానిలో గూడఁ బద్య కవితయే ప్రథమ కావ్యరూపము నొందినది.

2. (a) ā-khyana, am, n. telling, Communication, Pān;kap; Kaths & C; the communication, of a previous event (in a drama), Sah; a tale, story, legend, Br; Nir; Pān & C.

(b) ā-khyanaka, am, n. A short narrative, Pāncat; Kad; (1) F. N. of a metre (being a combination of the Indravajrā and Upendravajrā) ఈ కొరాస్తమైనచో ఛందో విశేషమనుట, చంద్రమోహన ఘోషుని 'ఛందస్సార సంగ్రహ' సమ్మతమునని యీ దిగువనే చూపఁబడును. ఆ ఖ్యానకీ = ఉపజాతి ఛందో విశేషమ్. (పుట 50, పంక్తు 17, 19; పుట 70, పంక్తి 21. ఛందస్సార సంగ్రహమ్) 'ఆ ఖ్యానికీ వార్తాహారి కోచ్యతే' (హ) పుట 50- పంక్తి 15; పుట 70- పంక్తి 20.(Vide, Chandah Sāra Sangrahah, Compiled by Chandra Mōhana Ghōsha, M. B. B. A., Calcutta 1893, Hare Press, Culcutta.)

(c) ā-khyānayā, Nom.P. (Ind. P. nayitra) to communicate. M. Bh-XII, 2452.

(d) ā-khyāpaka, min, making known, L.

(e) ī-khyapana, am. n. Causing to tell, R. V. 72 (Cotophon.)

(f) ā-khyāyikā, F. a short narrative, Pān IV 2,60 comm. Sāmkhyak. & C ℮-yika, (metrically shortened in comp) M. B. H. II, 453.

(g) ā-khyāyin, telling, relating Mn. VII, 223; Sak. ('A Sanskrit English Dictionary' by sir. Monier Williams. Page 129, Column 2, Ed ౮౭

ప్రసంగ లేశములు. అందుచే వీనిని సంవాద శ్లోకము లనఁదగును. కాని వీని నాఖ్యాన శ్లోకము లన్నవారును గలరు.1 ఒక్క భారతీయ సాహిత్యమునందే గాక తదితర సాహిత్యములయందుఁ గూడ బహు పురాతనైతిహాసిక కావ్యములు చంపువు* లగుటచే నవి యీ వాదమునకుఁ జేయూఁత నొసఁగు చున్నవి. కాని వేద వాఙ్మయము ప్రధానముగ ఛందో శ్రయ మగుట నిర్వివాదము. ఋగ్వేద సంహితలో గద్య పద్యాత్మకాఖ్యానములు రెండును గుడియెడమలుగ నెన్నఁడెన్నఁడో యుండి యున్నను, దద్గతగద్య మాఖ్యానవిదులకు2 ముఖస్థముగాక నష్టప్రాయ మగుట యసంభవమును గాదు. పోఁగా, ఋగ్వేద మందలి సంవాద ఋక్కులవంటి దృశ్యకావ్య విశేషములు భారతీయ సాహిత్యమునందు జేనంట చేనంటఁజిక్కుచుండునని మాక్స్ ముల్లర్, సిల్వెయిన్ లేవి3 జోహ్, హెర్ టెల్ 4 యల్. వాన్ ష్రోయిడర్5 ప్రభృతి పండితులు వాదించుటయు సత్యసమ్మతము. ప్రాక్తన మానవుని గేయసాహిత్యమునుండి దృశ్యకావ్యాదికమును, గథా సాహిత్యమునుండి యాఖ్యానాదికమును దమ తమ వస్తువులను స్వీకరించి, భిన్న భిన్న రూపరేఖలతో గ్రమక్రమముగఁ బరిణతము లయ్యె నన్నను దప్పురాదు. ఊర్వశీ పురూరవుల వృత్తాంత మనునది వస్తువుచే నొక్కటియయ్యు ఋగ్వేదములో6 సంవాద రూపమునను, శతపథ బ్రాహ్మణములో7 నాఖ్యాయికా రూపమునను8 గోచరించుట దీనికే సాక్ష్య మిచ్చుచున్నది.

---

1 H. Oldenburg పండితుని వాదమిది. ఋగ్వేదమున నాయా సందర్భములలో బనివడిన పాత్రల ప్రసంగములకు సంబంధించిన విషయములను జెప్పుటకు గద్యము తోడ్పడుటయు, నట్లుతోడ్పడిన గద్యశకలములు కాలక్రమమున నశించి పద్యము మాత్రమే కంఠపాఠ మగుచు వచ్చుటయు నీ వాదమున కుపస్కారకము.

* చంపూ కావ్యము, 'గద్య పద్యమయి'-యని దండియే చెప్పినాఁడు. (Kãvyãdarsa, 1-31, Edited by Rāmākrishnamāchāriar, Srivāni Vilāsa press, Srirangam, 1910).

2. "ā-khyānavidas" (Knowers of the narratives) are mentioned in the Aita reya Brāhmana (III-25) as a special class of Literary men.

3. Sylvain Lēvi, Letheatre Indien, Paris, 1890. PP. 301 FF.

4. Joh, Hertel. W. Z. K. M. 18, 1904, 59 FF, 137 FF; 23, 1909, 273 FF; Indische Marchen, Jena, 1921, PP 344, 367 F.

5. L. Von Schroeder, Mysterium und Mimus ūn RgVeda, Leipzig, 1908.

6. R. V. X—95.This is a Poem of eighteen stanzas, consisting of a dialogue between Purūravas and ūrvasi.

7. Satapatha Brāhmana (Sāyanāchārya Bhāshyam) XI, 5, 1. Also see translation of Eggeling, S. B. E. Vol 44, PP. 68, FF.

8. A-Barth, (R. H, R. 19, 1889, B: O.F...Oeuvres,11, 5F) has already compared the ākhāyana of Purūravās and ūrvasi in the Satapatha Brāhamana, with the ballad of king Rasāla, in Temple's 'Legends of the Punjab.'

తలుచుగ నితిహాస పురాణాఖ్యానముల పేరిటి కథావిధానము లర్థవాదము[1] లలో బ్రధానాంగములుగ నుండును. ఇవి భావనాపటిమకుఁ బరాకాష్ఠములుగ నుండుటయుఁ గలదు. వీనిలోఁ బైఁ జెప్పిన ఊర్వశీ పురూరవుల వృత్తాంత మాఖ్యాన రూపమునఁ దొలుదొల్త శతపథ బ్రాహ్మణమం దెడారిలో నీటి బుగ్గవలె లభించినది. ఇందుచేఁ బ్రాచీన సంస్కృత వాఙ్మయమున నాఖ్యానమునకు దీనిని బ్రథమోదాహరణముగఁ జెప్పక తప్పదు.

జల ప్రళయానంతరమున మను వెట్లు యజ్ఞసంభవయగు నిడాదేవి వలన మానవ జాతి పునస్సృష్టికి హేతుభూతుఁడై నదియు మఱల నా శతపథ బ్రాహ్మణమునం[2] దాఖ్యాన రూపముననే కలదు.

ఇవి యన్నియు వైదిక వాఙ్మయమునఁగల గద్యాఖ్యానములకుఁ బ్రథమోదాహరణములే యైనను నెడపదడప ఛందస్సమ్మిశ్రితములు గూడ నగుట మఱవరానిది.

ఐతరేయ బ్రాహ్మణమున శునశ్శేఫోపాఖ్యాన మున్నది[3]. ఇందలి గద్యమున నెడనెడఁగల ఋక్కులు, గాథలు భాషా ఛందస్సుల విషయమున నితిహాసములతో సామ్యముఁ గలవి. ఈ శునశ్శేఫుని కథ నాఖ్యానమని శతపథ బ్రాహ్మణమే పేర్కొన్నది. ఐతరేయ బ్రాహ్మణ కాలమునాఁటికే యీ యాఖ్యానము పరంపరయా రాజసూయాధ్వరముల యందు శ్రవణశ్రావణ యోగ్యములగుట వలనను,

---

1. The explanation of meaning.
2. Satapatha Brāhmana (1, 8, 1) translated by Eggeling S. B. E Vol 12, PP 216 FF- (Oxford.)
3. āitarēya Brāhmana, VII—13, 48, English translation by Max Müller; "History of Ancient Sanskrit Literature," 2nd Ed. London, 1860. PP 408, FF; Also by M. Hug and by A. B. Keith, in their respective translations of āitarēya Brāhmana.
   ఆఖ్యానము స. వి. అ. స. 1. చెప్పుట, కథనము; 2. పూర్వ వృత్తకథనము; 3. ప్రతివచనము,-ప్రత్యుత్తరము; 4. భారతము మొదలగు ఆర్షమహాకావ్యముల నడుమవచ్చెడి కథావిశేషము; 5. కథ, ఆఖ్యాయిక. స.వి. ఆ. స్త్రీ. యథార్థముగా జరిగిన కథను జెప్పెడి గద్య గ్రంథ విశేషము (హర్షచరితాది-ఆఖ్యాయిక, కథ అని రెండు తెగలుగా గద్య కావ్యములను విభజించి బాణుని హర్షచరితము ఆఖ్యాయిక యనియు, తదితరములగు కాదంబర్యాదులను కథ యనియు, ఆలంకారికులు చెప్పుదురు. దండి యీ రెంటికి భేదము పాటింప లేదు; సూర్యరాయాంధ్ర నిఘంటువు, ప్రథమ సంపుటము, పుటలు 386, 387, (1936.)
4. The ākhyāna (tale) of Sunahsēpha, as one belonging to the Rājasūya is also related in the "Sānkhyāyana Srauta Sūtra" 15, 17 FF. Also it is mentioned as one of the ākhyānas to be related at the Purushamedha, Ibid, 16, 11, 1-3. It is further referred to, in the Srauta sūtra of Kātyāyana, Apastambha and Baudhāyana. See, keith, H. O. S. [H. O. S.= Harward Oriental Series] Vol 25,PP 29, F., 40 F., 61 F., 67. Ed by Ch. R. Lannean.

జరిత్ర కందని నరబలి ప్రసంగ మిందుండుట వలనను, దీని పౌరాతన్య మింతింత యన రాదు. కొన్ని ధర్మనీతి వర్తనములను, గొన్ని కొన్ని విధులను బోధించు నీ యాఖ్యానము ప్రాచీనమయ్యు, నిర్వహణ విషయమున నర్వాచీనములగు నాఖ్యానముల కంటెం దీసిపోని చిక్కందనము ను, చికిలిదనమును గలది.

శతపథ బ్రాహ్మణములో వాగ్బుద్ధులకు జరిగిన.[1] సంవాద మొకటి యాఖ్యాన రూపమున వర్ణితము. ఆ తమ వివాదములో బ్రజాపతి బుద్ధినే తనకంటె నెక్కుడుగా జెప్పి, తన్ను గొంచెపఱచెనన్న మిషపై వాక్కు, ప్రజాపతికిం దాను హవిర్వాహ్యాము గాంజాలనన్నది. అట్లు వాక్కు నిరాకరించుట వలననే యజ్ఞాదులలో బ్రజాపతికి సంబంధించిన మంత్రములు బిగ్గఱగ నుచ్చరింపం బడవని చెప్పుట కీ యాఖ్యాన ముదాహరింపం బడెను. సాధారణముగ యజ్ఞ యాగాది క్రతువులకు సంబంధించిన విధుల వివరణమునకో, లేక-విధుల సమర్థనమునకో యిట్టి యాఖ్యానము లుద్దేశింపం బడినవి. వీనికి బీజ భూతములైన పూర్వ గాథలను గాని, బహు పురాతన జనశ్రుతులను గాని వీని నుండి సంగ్రహ పఱచుట యనునది యేమంతగా సాధ్యమగు పనికాదు.

సోమలతను (స్త్రీని) గంధర్వు లపహరించిన యాఖ్యాన[2]. మింకొకటి స్త్రీ చాపల్యమున కుదాహరణముగఁ జెప్పఁ బడినది. తన్ను బ్రార్థించి నుతించు దేవతల యందు కంటె, నాట్యగానములచేఁ దన్ను సంతోషపఱచు గంధర్వులయందే సోమలత యెక్కువగా మక్కువఁ గొనుట స్త్రీ దౌర్బల్యమునకును, బాహిరాటోప ప్రియత్వమునకును సార్వకాలిక చిహ్నముగ నిలిచిపోయినది. ఇట్లొక వ్యక్తిగతమైన గుణమును వర్ణించుటకో, యొకా నొక వ్యవస్థదేని, ద్రవ్యముదేని, మూలాధార తత్త్వమును వివరించుటకో చెప్పఁబడినవానిని పురాణములనియు, దేవమానవ సంబంధులగు కథల నితిహాసములు, నాఖ్యానములు, నారాశంసులు[2]. ననియుఁ బూర్వులు వ్యవహరించినట్లు సునిశిత పరిశీలనచే విశ్లేషింప వచ్చును.

పురాణమనఁగా బ్రాఁతది. ప్రాఁత కథలు, గాథలును, గాలక్రమమునఁ బ్రత్యేక లక్షణ లక్షితములైన కొన్ని గ్రంథములును బురాణ పదవాచ్యములైనవి.

బ్రాహ్మణములయందుఁ బొడకట్టు నాఖ్యానేతిహాస పురాణములను బట్టి పరిశీలింపఁగా, నొక్కటి వ్యక్తపడఁగలదు. మన భారతీయు లీ మూఁ పదములను నియ

---

1. Satapadha Brāhmaṇa. 1, 4, 5, 8–12. Translated by J. Eggeling, S. B. E., Vol 12, PP. 130 F.
2. Ibidem. III, 2, 4, 2–6. Translated by J. Eggeling, S. B. E, Vol 26–P 53., cf· Sat–III, 2, 1, 19 FF.
3. Nārāsamsi. Max Müller, 'History of Ancient Sanskrit Literature'–2nd Ed, London, 1860–P. 344. Cf. Sat. XI–5, 6, 8; 7, 9.

మితార్థమునందుఁ బ్రయోగింపలేదు. ఒక్కొక్కప్పు డివి పర్యాయపదములు; వేఱొకప్పు డివి భిన్న భిన్న కథావిధాన సూచకములు. సంస్కృత మహాభారత మితిహాస మనియుఁ, బురాణమనియు, నాఖ్యాన మనియు, మూఁడు విధములుగా నవతారికలోఁ జెప్పఁ బడినది. ఆంధ్ర భారతమును గూడ నైతిహాసికు లితిహాసమనియుఁ బరమ పౌరాణికులు బహు పురాణసముచ్చయం బనియుఁ గొనియాడినట్లున్నది 1. పిమ్మట మహాభారత పారిజాత మమితాఖ్యానక2 శాఖలంబొలిచి నట్లును జెప్పఁబడెను. వీనినిఁ బట్టి యేకాలమునందుకూడ నాఖ్యానేతిహాస పురాణములనెడి పదములను3 మనవారు నియతార్థమున వాడుక చేయలే దనుట సుస్పష్టము.

కాఁగా, 'ఇతిహాస వేదము, లేక ఇతిహాస పురాణము' నను పేరిట నొక గ్రంథ మున్నట్లు గెల్‌నర్ 4 ప్రభృతి పాశ్చాత్య పండితులు కొందఱు వాదమును గూడఁ గట్టుకొని వచ్చిరి. అయ్యు, వీరెల్లరు నుదాహరించిన యా కౌటిల్యుని5 పలుకులే, యితిహాసమనఁగా నొక కావ్య ప్రక్రియయే గాని, యొక ప్రత్యేక కావ్యము గాదని నిరూపించుచున్నవి. అందుచేఁ, బ్రాచీన యుగములలో నితిహాస మనఁగాఁ, గొంత భేద మున్నను గూడ, నాఖ్యానాదులవలె నది కథలు గాథలు గల యొకానొక కావ్య విశేష మనియే యిప్పటికి నిర్ధరింపవచ్చును.

పోనుబోను బరిశీలింప బుద్ధుని కాలమునాఁటి వఱకు నైతే మిట్టి గద్య పద్యాత్మకములైన యాఖ్యానేతిహాసములును బురాణములును కొన్ని సాహిత్య ప్రక్రియలుగా మనలో గలవని స్థిరపడుచున్నది. రామాయణ పద్మపురాణముల యందేగాక, బౌద్ధమత జాతక కథలలో నితిహాసములలో గూడ ఋష్యశృంగో పాఖ్యాన మొకటి6. యుండుట దీనికి నిదర్శనము.

ఆఖ్యానేతిహాస పురాణ గాథల (నారాశంసుల) ప్రసక్తి బ్రాహ్మణముల యందును, నుపనిషత్తుల యందును, విస్తారముగఁ గలదు. పిమ్మట, క్రీ. పూర్వ మైదవ శతాబ్ది నుండియుఁ గూడ జైన బౌద్ధ వాఙ్మయములు నీతిబోధకములగు నాఖ్యానకముల వంటి వానిని గొన్నిటిని హిందువులకుఁ ద్రవ్వి తలకెత్తినవి. త్రిపిటకముల

---

1. శ్రీ మదాంధ్ర భారతము, సంపుటము 1. ఆది, ప్రథమ. అవతారిక, పుట 5, ప. 32, వావిళ్ళ-1954.
2. Ibid, ఆది, ప్రథమ, పుట 13, పు. 66, వావిళ్ళ-1954.
3. On these terms, C. F. Emil. Sieg Die Sagenstoffe des Rg. Vēda und die indische Itihāsā tradition, I Stuttgart, 1902, Introduction.
4. K. F. Geldner, Vedische Shedien I. PP. 209-F.
5. I, 5. P. 10.
6. Tirtha yātrā Section (Section of Pilgrimages) III, 8-15.

పురాతన మాతృకలయందు భారతము పేరే రాదు. కాని, బ్రాహ్మణములలో నగపడుచు నితిహాసములకు దారితీయు పద్యాఖ్యానములు సూత్రమున్నవి. బ్రహ్మజాల సుత్తములో నాఖ్యానముల పఠనమును గూర్చి పేర్కొనఁబడెను[1].

బుద్ధ భగవానుఁ డశ్వలాయను (అస్సలాయను)ని కుల వ్యవస్థను గూర్చి ప్రశ్నించిన[2] సుత్తమున నించుక సంవాద మున్నది. కాని, చోరాగ్రేసరుఁడగు నంగులిమాల యర్హతుఁడైన సుత్తము[3] గద్య పద్య మిశ్రితమైన శుద్ధాఖ్యానము. రాజగు మహాదేవుఁడు[4] ప్రథమ పలితకేశ దర్శనముననే రాజ్య పరిపాలనము పరిత్యజించి సన్యసించిన గాథయు నిట్టిదే! భారతమున యుధిష్ఠిరుని వలెనే సంయుత్తములో[5] బుద్ధుఁడును యక్షప్రశ్నలకు సమాధానించిన ఘట్టమునఁ గల మారసంయుత్తము, భి[క్కు]ణుని సంయుత్తములు[6] యందలివి గద్య పద్యాఖ్యానములనఁ దగును. గద్య రూపముగల బోధల[7]లో నెడపడప పద్యములును బద్య మయమగు వానిలో గద్య రూప[8]ములు నుండుటయే గాక కేవల సంవాద రూపములును, శుద్ధాఖ్యాన రూపములును నగునవి కొన్నియు, మఱల వానిలో గద్యపద్య సమ్మిశ్రిత రూపములు కొన్నియు ననాది కాలమునుండి యున్నట్లుఁ బొడగట్టుచున్నవి. సద్ధర్మ సదాచార బోధకమును నైతిహాసికమును నగు హైందవ సాహిత్యమునఁగల ప్రక్రియ లన్నియు బౌద్ధ సాహిత్యముననుగలవనుట, యొక్కమాటలో నిజము చెప్పుట. ప్రాచీన కాలమునాఁటి ధర్మోపదేశప్రభావముగల పవిత్ర గేయ కవిత్వమునుండి బుద్ధదేవుని జీవితాంశము లెట్లితిహాస రూపము నొందినవో యట్లే మతపరముగాని గద్య పద్యాఖ్యానములనుండి వీరరసోపేతములగు నితిహాసములు నుద్భవించినవి.

మొత్తముమీఁద బౌద్ధాఖ్యానముల యందెల్లెడలను వస్తువునకుఁ బ్రాణము పోసి దానిని వినువారి కన్నులఁ గట్టుటకు సంవాదము పనికి వచ్చినట్లుఁ దోఁచుచున్నది. ఇట్లు గానిచోట, నొక సంగ్రహమైన యుపోద్ఘాతమో లేక సంక్షిప్త లఘువాక్య విన్యాసమో యుండఁగలదు. సంవాద పద్యముల నడుమ నాఖ్యానపద్యములఁ బ్రవేశపెట్టుట యాఖ్యానముల క్రమ పరిణామములో నింకొక యంతరువు.

---

1. 'A History of Indian Literature'-Vol. I, by M. Winternitz, Ph. D., PP 471, F. N. 4; Ed. 1927.
2. Assalāyana-Sutta. No. 93.
3. Ibid, No. 86.
4. Makhādēva Sutta. No. 82, (This recurrs in the Jātakās.)
5. X, 12.
6. Māra Samyutta and Bhikkuni-Samyutta see, Windische "Mara und Buddha", pp 87 FF., 132 FF.
7. Sermons.
8. Sundarika "Bharadvaja-Sutta" Sela-Sutta and others are the examples.

తరువాత సంస్కృత భారత రచనము క్రీ. పూ. నాల్గవ శతాబ్ది నుండి క్రీ. శ. నాల్గవ శతాబ్ది పర్యంతము వ్యాపించినది. కాన భారతేతిహాసాదుల యందును నాఖ్యానకములు పెక్కు చోరవ చేసికొన్నవి[1].

ముం దితిహాస రచనములకుఁ ద్రోవతీసిన యాఖ్యానములు క్రమ క్రమముగ నితిహాసములతోఁ గుడియెడమలుగ వర్ధిల్లుచు నొక్కొక్కప్పు డితిహాసములలో నంతర్లీన మగుచుఁ బొందిన పరిణామ మిచ్చట గమనార్హము.

మత ధర్మ సంప్రదాయ సృష్టిరహస్యాదులను బోధించుచు దేవ, మానవ యోగీశ్వరుల చరితముల నుగ్గడించుచు, బూర్వము కాలక్రమమున నష్టప్రాయములైనట్టి గ్రంథముల పునస్సృష్టియే పురాణములు, నుపపురాణములు ననవచ్చును. పోనుబోను మాహాత్మ్యములు, స్తోత్రములు, కల్పములు, నాఖ్యానోపాఖ్యానములును, మొదలైనవి పురాణముల పేరిటి గ్రంథజాలమునం దంతర్భాగములై పోయినవి. అఖ్యానవిదులను[2] గూర్చి వేర్వేర్వు బ్రాహ్మణములయు, సూత్రపురాణ యుగములయు సాహిత్య గవేషణముచేసి యాఖ్యానముల రూపలక్షణములను గూర్చి తెలుపఁ గల్గిన—పండితార్థమిది.

ఆఖ్యానములు ధర్మనీతి వర్తనాదిక ప్రబోధకములై యున్నవి. ఒక్కొక్క యెడ నివి సంవాద సహితములు. వేఱొక యెడ ఛందోబద్ధములుగ నున్నవి. ఆఖ్యానమునకుఁ గొలఁదిగనో గొప్పగనో చారిత్రక ప్రాతిపదిక యుండును. ఇది యొక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగఁ బ్రారంభించి "యాఖ్యాన విదు"లనెడి సాహిత్యవేత్తల శాఖకు నెలవొసఁగినది. తుదకు సర్వసాహిత్య ప్రక్రియలలో సమ్మిశితమై, యెచ్చటఁ జూచినను దానేయై యన్నిటికిని మూలకంద మనిపించుకొన్నది. "క" ప్రత్యయము చేర్పఁబడుటచే నాఖ్యానము కంటె నాఖ్యానక మించుక చిన్నదైన కథా విశేషమనఁ దగును. హర్ష చరితాద్యాఖ్యాయికలకుఁ బూర్వమున్న కొన్ని యాఖ్యాయికలకు నీయాఖ్యానములు మూలబంధములేమో యనుటయు సత్యమునకుఁ జేరిక.

---

1 భరతముని తన నాట్యవేదమునను "ఆఖ్యానము" అను పదమును వాడుక చేసెను. కాని యది కావ్య లక్షణములగు ముప్పది యాఱింటిలో నొకటిగఁ జెప్పఁబడినది. ప్రశ్న పూర్వకముగఁ గాని, యప్రశ్న పూర్వకముగఁ గాని, ఒక నిర్ణయముచేయుట భరతముని మతమున నాఖ్యానము, ఇది మనకంత ప్రస్తుతముగాదు. (డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు—నాట్యశాస్త్రము—పుట 446 (1959)

2. See. P. 2. F. N. 2 of this Thesis.
ఈ విషయమును Keith పండితుఁడును S. K. Dē పండితుఁడును నిరాకరింతురు.
See, Keith in J. R. A. S, 1911, p 1979 Also See S. K. Dē Deccan, in 'A Volume of Studies in Indology'-Poona Oriental Series No. 75. Presented to Prof. P. V. Kanē on his 61st birthday, 7th May 1941., ā Edited by S. M. Katre and P. K. Gōdē, Oriertal Book Agency, Poona-2, India. pp 112, F. 1.

వేదముల యందలి యాఖ్యానములకును, గద్యకావ్య భేదమగు నాఖ్యాయిక లకును[1] సంబంధమే లేదన్న వా రున్నారు. ఒకదాని కొకటి దారి తీయుటయే వీనికిఁ గల సంబంధమని గమనింపవలెను. కావున వీని పరస్పర సంబంధమును సంగ్రహముగ నిట్లూహించుట యుక్తము.

కాత్యాయనుఁడు తన వార్తికలో 'ఆఖ్యాయికలు' అని బహు వచన రూపమునఁ గూడఁ బ్రసంగించెను[2] పిదపఁ బతంజలి తన యిష్టుల (వివరణముల) లోను, సుమనోత్తర, భైమరథి, యనువానినే గాక వాసవదత్తను, మూఁడవ యాఖ్యాయికగా బేర్కొనెను. తత్ పాఠకులను "వాసవదత్తికు"[3] లనియు వ్యవహరించినాఁడు. కాని. వాని కర్తలను గూర్చి లోకమున కేవియుఁ దెలియదు. అట్లే, వరరుచి విరచిత 'చారుమతి'[4] యు మన కుపలభ్యము కాదు. 'శూద్రక కథ'ను గుఱించి గాని, దీని కర్తలై కాళిదాసునకుఁ బూర్వులైన 'సోమిల రామిలు'లను గుఱించి గాని, శాతవాహన రాజగు హాలునకు సమకాలికుఁడగు శ్రీ పాలితుని 'తరంగవతి'[5]ని గుఱించియుఁ గాని, మనకుఁ దెలియరాదు. 'చారుమతి'ని గూర్చియేగాక క్రైస్తవ శకారంభమునకుఁ జెందుననఁదగు 'మనోవతి-శాతకర్ణి హరణము'లను రెంటిని గూర్చియు, భోజుఁడు ప్రసంగించినాఁడు. బాణ సుబంధులే, తమకుఁ బూర్వమాఖ్యాయికా కర్త లుండినట్లు నుడివిరి. బాణుఁడు పేర్కొన్న భట్టార హరిచంద్రుని, కాళిదాససుబంధు బాణుల తోడి వానినిగా బ్రాకృత భాషా కవి 'వాక్పతి'[6]యు (క్రీ. శ. 9 వ శతాబ్ది) బ్రశంసించినాఁడు. ఆఢ్యరాజును గూడ బాణుఁడు గద్యకావ్యకర్తలలో నుత్తమునిగా బేర్కొనెను.

---

1. తొలుత నాఖ్యాయికా కథ లనునవి భిన్నప్రక్రియలుగాఁ బరిగణింపఁబడినట్లు బృహత్కథ, పంచతంత్రమను పేళ్లే చెప్పుచున్నవి. పంచతంత్రమునందలి వానిని కథ లనిరి. కాని, మఱల పంచతంత్ర కథలకు రూపాంతరములైన వాని నేలకో తంత్రాఖ్యాయిక లనిరి. అందుచే బోనుపోను ఆఖ్యాయికా కథలకుఁ గూడ నిర్ణీతగుణ భేదమును లోకము పాటింప లేదు.
2. సిద్ధాంత కౌముది–తద్ధితే చాతుర్థిక ప్రకరణము; సూత్ర 1270, పుట 492, 493, బాలమనో రమ సీరీస్ No. 1. Ed. 2. (1929)
3. Ibid.
4. భోజుని 'శృంగార ప్రకాశము'న వరరుచిదైన 'చారుమతి' నుండి యొక శ్లోకము మాత్ర ముదాహృతము.
5. This is a Jain religious story or Dharma kadha of Srīpadalipta or Srī Pālitta, who must have flourished before the 5th century A. D. The work is lost, but its romantic love story is preserved in the 'Tarangalola' composed in Prakrit Verses in 1643 A. D. E. Leumann has translated it. (Tarangalola). According to the translator, E. Leumann. Padalipta, the author of 'Tarangavati', lived as early as the 2nd or the 3rd Century A. D. See, 'A Volume of Studies in Indology' Poona, Oriental Series No. 75, pp 112, 113.
6. క్రీ. శ 9వ శతాబ్ది

కావున బాణుఁడు గాని, హరిచంద్రుఁడు గాని యాఖ్యాయికకుఁ గేవలము పితృపాదులు గారు. వస్తువును జానపద గేయ సాహిత్యము నుండియు, రూపములను బ్రాహ్మణములలోని గద్యము నుండి[1]యు సంతరించుకొనుచు, లౌకికాలౌకిక కల్పనలతోఁ గథ నల్లుకొనుచుఁ, గ్రమక్రమమున సంస్కృతమున నాఖ్యాయిక యొక యాకృతినిఁ దాల్చినది. ఆఖ్యానము పద్య ప్రధానము; ఆఖ్యాయిక గద్య ప్రధానము; దానినుండి యిది యెట్లుఁ బరిణమించు ననిన కీత్ పండితుని వంటి విమర్శకులున్నారు. కాని, ప్రధానముగ నిది యెంత గద్యరూపమైనను నిరంతరము పద్యము తన ప్రభావమును దీనిపైఁ జెఱఁగని ముద్రగ వేయుచునే యున్నది. అనఁగా, భావనోదాత్తమగు కావ్యత్వ గౌరవము గద్యమునకుఁ బద్యకావ్య ప్రభావముననే యుపలభ్య మనుట[2] కావున సంస్కృత గద్య కావ్యము ద్వైమాతృకము. అది వస్తువు నటు జానపద సాహిత్యమునుండి గ్రహించినది ; రూప విధానముల నిటు వేదవాఙ్మయ ధారలగు పద్యకావ్యముల నుండి స్వీకరించినది.

ఇట్లనుటచే వేద వాఙ్మయమున నాఖ్యాయికా ప్రసక్తి యున్న దనుకొనరాదు. కాని, సూత్రయుగమును బరిశీలించినచో సాంఖ్యసూత్రములు[3] యందాఖ్యాయిక వంటి యాఖ్యానగుచ్ఛము లున్నవి. అటు బౌద్ధ వాఙ్మయము నవలోకించిన యెడల చంద్రకీర్తి[4] యార్యదేవుని[5] దైన 'చదుశ్శతిక'[6]ను గూర్చి చేసిన వివరణమునందు మత

---

1. సంస్కృతాఖ్యాయికకు జనకస్థానముగా గ్రీకు గద్య కావ్యములను గొందఱు బేర్కొందురు. కాని లక్ష్యలక్షణ సమన్వయము చేసి సంస్కృత పద్య గద్యముల పరస్పర సంబంధమును నిరూపింప వచ్చును. అదియుఁగాక, గ్రీకు గద్య కావ్యములు గొల్పినంతటి యాసక్తిని సంస్కృత గద్యకావ్యములు గొలుపవు. గ్రీకు గద్యకావ్యముల శైలియు సరళము. ఇట్టి కారణములచే గ్రీకు గద్యకావ్యములు సంస్కృత గద్యకావ్యములకు మూలములు కావు. సంస్కృత రూపకముల విషయమున గ్రీకు ప్రభావము నంగీకరింప వచ్చుఁగాక!

2. క్రీస్తు శకారంభమునకుఁ బూర్వము (150) నుండియు నాఖ్యాయికలు గలవనుటకు మహాభాష్యమున పతంజలి పేర్కొన్న 'వాసవదత్తా—సుమనోత్తరి'లే నిదర్శనములు. రుద్రదామని శాసనము (150 A. D.), హరిసేనుని (345, A. D.) శాసనము, సముద్రగుప్తుని అల్లాబాదు శాసనము (4th Cen. A. D.), మున్నగు వానిలో గల గద్యమునందుఁ బద్య కావ్యలక్షణములు గోచరించు చున్నవి. కాళిదాస, భారవి, కుమారదాసుల కవితా ప్రభావ ముద్ర సంస్కృత గద్యకావ్యములపైఁ గలదనుట యప్రష్టవ్యము. ఆంధ్రభాష యందును, పద్య కావ్యగత కఠిన సమాస భూయిష్ఠ దీర్ఘ వచనముల నుండి గద్య కావ్యము లేర్పడుట మున్ముందు జూడఁగలము.

3. Sãm-khya Sũtra, Book IV.
4. A Scholastic and a good Buddhist-Commentator.
5. Aryadēva is a mighty champion of the Purely negative method of establishing 'Monism,' See, 'Nirvãna' of Stcherbatsky, p 66.
6. A philosophic treatise that deals with Buddhistic dogmãs and doctrines.

సూత్రములును తాత్త్వికార్థములును గూడ నాఖ్యాయికా ప్రాయములై నీతి పుంజ మంజరులతో గుబాళించుచున్నవి. బాణుని హార్ష చరిత లోకాతిగయశము గన్నది. అట్టి హార్ష చరితము ననుకరించిన సోడ్డలుని 'యుదయ సుందరీ కథ1'ను గూర్చి వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఇఁక మన యాంధ్ర ప్రభువును, వీరనారాయణ బిరుదాంకితుఁడును నగు వేమ భూపాలుని గూర్చి వామన భట్ట బాణుఁడు రచించిన 'వేమ భూపాల చరిత2 నుండనే యున్నది కాన నిట్లు వేద బౌద్ధ వాఙ్మయములయందధికముగ నాఖ్యానమును గూర్చియు, బహ్వాల్పముగ నాఖ్యాయికా ప్రాయములగు నాఖ్యానములను గూర్చియుఁ దెలియనగుచున్నది. ఇట్లనుట, యాఖ్యా నాఖ్యాయికలకు జన్యజనక భావము నంటఁగట్టుట కాదు. ముందే చెప్పినట్లుగ నవి వీనికి దారితీసినవి; లేదా, కాలక్రమమున మార్పులకు లోనై యవియేయివిగా బరిణమించినవి. కాదా, యాకాలమున వానికిఁ గల స్థానము నీ కాలమున నివియాక్రమించి ప్రత్యామ్నాయములైనవని భావము.

---

## భాషావినియోగము : కావ్య విభజనము

*సంస్కృత ప్రాకృతాపభ్రంశములు*

## 2

కావ్యగత భాషను బట్టి భామహుఁడు కావ్యము నింకొక విధముగ3 (నవఁగా ముత్తెఱఁగులని) విభాగించి నాఁడు. "అపభ్రంశ ఇతి త్రిధా" అన్న శ్లోక4 మిచ్చట ముఖ్యమైనది. ఇం దపభ్రంశ మనఁగా నొక ప్రత్యేకభాషయని భామహుని భావ మే మాత్రమును గాదు. సంస్కృతే తరమైన యొకానొక భాషా కుటుంబమే యిందాకాంక్షితము. అపభ్రంశమను పేరుచేతనే యా యంశము సూచ్యము. ఇది యథార్థమే యగుచో, ప్రాకృతమనఁగా నొక భాషాకుటుంబమును గాదు; ఏ దేని యొకానొక

---

1. From Sōddhala's own account of himself in the first ucchvāsa, we learn that he was of the Vālabha Kāyastha family of Gujarat and flourished under the patronage of the ruler of Konkaṇa, probably between 1026–1050. See, 'History of Sanskrit Literature'–by S. K. Dē. pp 431–432 (1947).
2. క్రీ. శ. 1403–20.
3. "పునః అన్యథా విభాగః"......"తేనతత్ త్రైవిధ్యాత్ కావ్యంత్రివిధం భవతి"— కావ్యాలంకారము–పుట 8. D. T. Tātāchary's Edition—1934.
4. "ప్రాకృతం సంస్కృతం చైతద్ అపభ్రంశఇతి త్రిధా"-Ibid,[I-16 b] P. 8 (1934)

మాండలిక మగును ; ప్రాయశః మహారాష్ట్రియైనను గావచ్చును. భామహుని కాలమున నిస్సంశయముగ నిది యొక ప్రసిద్ధ భాషయై యున్నది. కావ్యతా గౌరవమును గడించిన పద్య సాహిత్య మిందు సృష్టింపఁ బడెను.

దండి భామహుని కంటెఁ జిన్నవాఁడై యతనికి సమకాలికుఁడై యుండును. కావ్యాదర్శమునం దుట్టంకింపఁబడిన సారస్వతాంశములు చాలవఱకు భామహుని కావ్యాలంకారమునను స్థూలముగఁ బ్రత్యక్షమగు చున్నవి. కావ్యము సంస్కృత ప్రాకృతా పభ్రంశ భాషలచే జతుర్విధము1 దండి యభిప్రాయమునఁ గావ్యముల యందైనచో నాభీరాదుల భాష యపభ్రంశ మనఁబడుచున్నది. కాని శాస్త్రముల యందైనచో సంస్కృతే తరమైన భాష యపభ్రంశ మనఁ బడును2.

భాషా వినియోగమును బట్టి విశ్లేషము చేయుచో భామహుఁడు చెప్పినట్లుఁ గావ్యము త్రివిధము గాక చతుర్విధమని దండిమతము3. అప్పుడవి సంస్కృత, ప్రాకృత, (మహారాష్ట్రి), అపభ్రంశ, మిశ్ర కావ్యములని వ్యవస్థితము లగును. మిశ్ర కావ్య మనఁగా సంస్కృత ప్రాకృతమిశ్రమో, ప్రాకృతాపభ్రంశ మిశ్రమో కావచ్చును. అట్లు మిశ్రమగుట యాయామండలముల వ్యవహారములను బట్టి యేర్పడఁగలదు. కావున మిశ్రమును మాండలిక మన్నను దప్పురాదు. నాటకాదులందలిభాష మిశ్రము. ఇదియు దండి యేర్పాటే ; భామహుఁడు చేయలేదు. భాషా ప్రయుక్త కావ్య విభజన సందర్భములో గథా ప్రసంగము రాఁగా సంస్కృతమునందును సర్వభాషల యందును గూడ కథను జెప్పవచ్చునని దండియే నుడివినాఁడు.

వామన మమ్మటులు భాషా పరముగఁ గావ్య విభాగమును గూర్చి యేమియుఁ జెప్పరైరి. ఇఁక రుద్రటుఁ డున్నాఁడు. వివరణములలో భిన్నాభిప్రాయులైనను భామహ దండ్యాచార్యు లిర్వురును మూఁడే కావ్య భాషలను సూచించిరి. రుద్రటుఁడో యాఱు

---

1. "తదే తద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతం తథా అపభ్రంశశ్చ మిశ్రం చేత్యాహు రార్యాశ్చ తుర్విధమ్"—దండి—కావ్యాదర్శము (I-32)
2. "ఆభీరాది గిరః కావ్యేష్వపభ్రంశ ఇతి స్మృతాః శాస్త్రేషు సంస్కృతాదన్య దపభ్రంశ తయోదితమ్" కావ్యాదర్శము (I-36), Vādi Ghanghola's Commentary Educational Publishing Co., Madras—1930
3. "కథాపి సర్వభాషాభిః సంస్కృతేనచ బధ్యతే
భూత భాషామయీం ప్రాహు రద్భుతార్థాం బృహత్కథామ్"
కావ్యాదర్శము (I-38). Ed 'by Dr. Belvalkar S. K. (Poona) (1924).
'ప్రాహుః,' అనుటచే బృహత్కథ దండి కాలము నాఁటికే నష్టప్రాయమని తోఁచుచున్నది.

భాషలను బేర్కొనెను. "మఱియు భాషలను బట్టి వాక్యము షడ్విధముగా విభక్తము. అది ప్రాకృతము, సంస్కృతము, మాగధి, పైశాచి, శూరసేని, యపభ్రంశము నగును. అపభ్రంశము దేశ దేశములను బహుధా పునర్విభాగము నొందును"—అని రుద్రటుని యభిప్రాయము.

—o—

## కావ్య విభజనము

### వస్తువు

### 3

వస్తువును బురస్కరించుకొని విభజనము జరిపి భామహుఁడు తిరిగి కావ్యము చతుర్విధ మనెను. అందొకటి :-

(౧) ఉత్పాద్యము- ఇది దేవతాదుల పూర్వవృత్త స్తుతిపరమైనది.

(౨, ౩, ౪.) కళా సంబంధులు శాస్త్ర సంబంధులు నగునవి మూఁడు తెలుఁగు లైన కావ్యములు.

భామహుని యనంతర మలంకార శాస్త్రములో నీ విభాగము నష్టప్రాయమైనది. అయ్యును దీని ప్రసక్తి పిమ్మటికాలమునఁ బెక్కు పర్యాయములు రాకపోదు.

## ఆఖ్యాయికా కథాదులు

కావ్యాదు లైదు విధములని భామహుని ఉక్తి1 (అ) సర్గబంధము (ఆ) అభినేయార్థము (ఇ) అనిబద్ధము (ఈ) ఆఖ్యాయిక (ఉ) కథ యని వాని పేళ్ళు. ఇది పూర్వ విధానములవలని విభజనము కంటె ముఖ్యమైనది. విశేషించి యాఖ్యాయికా కథల పరస్పర సంబంధ నిరూపణమును, వాని పరిణతియు మనకుఁ బ్రకృతము. కావున నిట్టి విభాగము ప్రస్తుతానుశీలమున కతిప్రధానము.

---

"సర్గబంధో ऽ భినేయార్థం తథైవాఖ్యాయికా కథే
అనిబద్ధంచ కావ్యాది తత్పునః పంచధోచ్యతే"॥
భామహుని కావ్యాలంకారము, పరిచ్ఛేద I, శ్లో. 18. Edited by D. T. Tātāchārya, P. 9 (1934).

(అ)

సర్గబంధమనఁగా సర్గలుగ విభాగింపఁబడిన మహాకావ్యమని[1] స్థూలముగ సర్వాలంకారిక సమ్మతము.

ప్రతినాయక గుణకీర్తన విషయము[2] మున్నగు తావుల యందించుక దుర్వ్యాఖ్యానము చేసినను మొత్తము మీఁద భామహుని మతమునే దండియు నవలంబించినాఁడు వామనుఁడు. సర్గబంధమును గూర్చియే నిర్వచింపలేదు. ముందుఁ గావ్యమును గథాఖ్యాయికా మహాకావ్యాదులని విభజించుటయే వామనునకు హృదయంగమముగ లేదు[3].

రుద్రటుఁ డుత్పాద్యానుత్పాద్యములుగను, మహాకావ్య లఘుకావ్యములుగను విభాగించి కావ్యముల వివరణములను సంపూర్ణముగ వర్ణించెను. ఈతని నిర్వచనములను లక్షణములను బరిశీలింపఁగా భామహ దండ్యాచార్యుల మతములనే యితఁడవలంబించినాఁడని ధ్రువ పడకపోదు. అది యట్లుండ కావ్య పరిశీలనాపరమైన భావపరిణామమును గూర్చి గదా మన ప్రస్తుత గవేషణ! అట్టి యభ్యుదయ మాతని దీర్ఘనిర్వచనములలో నెచటను సూచింపఁ బడలేదని చెప్పనగును. అంతియే కాదు.

---

1. "మహాకావ్యం సర్గ బంధః తస్యసర్గై ర్నిబధ్యమానత్వాత్" అని తర్క-వాగీశులు.

2. "గుణతః ప్రాగుపన్యస్య నాయకమ్"—దండి, కావ్యాదర్శము, I, 21. Dr. Belvalkar, S. K. Poona, (1924).

   "నాయకం ప్రాగుపన్యస్య"— భామహుని కావ్యాలంకారము, పరి1—శ్లో22a D. T. Tātāchārya P. 10 (1934).

   "వంశవీర్య శ్రుతాదీని"—దండి కావ్యాదర్శము. I పరి—శ్లో 22 Dr. Belvalkar, S. K. (Poona). (1924).

   "వంశవీర్య శ్రుతాదిభిః"—భామహుని కావ్యాలంకారము—పరి 1—శ్లో22a D. T. Tātāchārya (1934).

3. "యద్ ఉత కథాఖ్యాయికే మహాకావ్యం ఇతి తల్లక్షణంచ నాతీవ హృదయంగమం ఇతి వుపేక్షితం అస్మాభిః తదన్యతో గ్రాహ్యమ్." వామనుని కావ్యాలంకార సూత్ర వృత్తి, అధి 1—అధ్యా 3—వృత్తి 22.

రుద్రటున కైదు వందల యేండ్ల పిదప విశ్వనాథుని కాలమునకుఁ గూడ సర్గ బంధము (మహాకావ్యము)ను గూర్చిన భావములలో బరిణతి కను పట్టదు1.

## (ఆ)

### అభినేయార్థము

ఈ కావ్యభేదము రెండవది. ఇది అభినయింపఁ బడునది. దీనినే రూపకముగఁ బ్రదర్శించుటయనియు, నాటకమనియు నందురు. నాట్యశాస్త్ర గ్రంథములలోనే గాని యాలంకారిక గ్రంథములలో నీ యభినేయార్థమును గూర్చి సమీక్షింపరాదన్నది, సర్వ త్రాంగీకృతము. ఈ రీతిగ భామహ దండ్యా చార్యు లిద్దరును నాట్య గ్రంథ పాఠకులను దత్తదుచిత సాహిత్య పరిశీలన కుద్బోధించిరి2 అయ్యు నాటకములు బహుభాషలలో రచింపఁ బడినవని యొక్కచోట మాత్రము దండి నుడివెను3 కాని వామనుఁ డొక్కఁడే

1. దండి వలెనే సాహిత్యదర్పణ కారుఁడు విశ్వనాథుఁడును "సర్గబంధో మహా కావ్య" మ్మనెను. "ఆదౌ నమస్క్రియాశీర్వా వస్తునిర్దేశ ఏవవా" అనునది "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి తన్ముఖమ్" అను కావ్యాదర్శ సూక్తివంటిదే గదా!
[1–14b Belvalkar, 1924].
"ఇతిహాసోద్భవమ్ న్యృత్తం అన్యద్వా సజ్జనాశ్రయమ్" అని విశ్వనాథుని నిర్వచనము. "ఇతిహాస కథోద్భూత మితరద్వా సదాశ్రయమ్" అన్న దండి [1–15a Belvalkar] నిర్వ చనమునకుఁ బునశ్చరణము కాదనఁ గలమా? "చత్వార స్తస్యవర్గాః స్యుస్తేష్వేకం చ ఫలం భవేత్" అనెడి విశ్వనాథోక్తికి "చతుర్వర్గ ఫలాయత్తం" అనెడి [1–15b] దండ్యుక్తి తోడను, "విప్రలంభౌ వివాహశ్చ" అను విశ్వనాథుని పల్కునకు [ప్రతాప రుద్రీయము, పుట 96] "విప్రలంభైర్వివాహైశ్చ" అనెడి [1–17a Belvalkar] దండి పల్కుతోడను గల పోలికలు గమనార్హములు.

2. నాటకం ద్విపదీ శయ్యా రాసక స్కంధకాదియత్
ఉక్తం తదభినేయార్థం ఉక్తోZ న్యైస్తస్య విస్తరః"
భామహుని కావ్యాలంకారము, పరి I శ్లో 24 D. T. Tātāchārya P. 11, (1934).
"మిశ్రాణి నాటకాదీని తేషా మన్యత్ర విస్తరః"
దండి కావ్యాదర్శము, పరి I శ్లో–31, పుట 30. B. O. R. I = Bandarkar Oriental Research Institute.Ed. 1938.
భామహ దండ్యాచార్యు లిర్వురును 'విస్తర' అనునొక పదమునే వాడుట గమనింపఁ దగినది.

3. "సంస్కృతం సర్గబంధాది ప్రాకృతం స్కంధకాదియత్
ఓసరాది రపభ్రంశో నాటకాదితు మిశ్రకమ్"—దండి, కావ్యాదర్శము, పరి I, శ్లో. 37, B. O. R. I. Ed. 1938· Page 36

దశ రూపకములు విస్తృతములును, సర్వకావ్యరూపాతి శాయులును నన్నవాఁడు[1] అందును నాటకము ప్రథమ గణ్యమనెను.

(ఇ)

ప్రతి పద్యమునను స్వయం సమగ్రతఁ గల శతకాదు లనిబద్ధకావ్యములు. వామనుని పద్యకావ్యద్వయ విభజనాపద్ధతిని గూర్చి చెప్పినప్పు డితఃపూర్వ మీవిషయము ప్రస్తావితము.

(ఈ, ఉ)

ఆఖ్యాయికా కథలు

భామహుని మతమునఁ బంచవిధ కావ్యవిభాగములో నాఖ్యాయికా కథలు తృతీయ చతుర్థస్థానము లాక్రమించినవి. ఇప్పుడు మన గవేషణలో నివి ప్రధానములు. కావున సర్గబంధా భినేయార్థా నిబద్ధముల సంగతి ముందుగా సంగ్రహ పఱుపఁ బడెను. విపుల విచారణార్థ మాఖ్యాయికా కథలను గూర్చిన చర్చ యిఁక నొనరింపఁ బడును.

ప్రస్తుతేతివృత్తముతో వైరస్యములేని శబ్దప్రయోగమును, ననుకూల స్పష్టార్థమును శ్రవ్యమగు పదజాలమును గల్గి యుచ్ఛ్వాసముల పేరి ప్రకరణములు గల గద్య మాఖ్యాయిక[2] "ప్రకృతానాకుల శ్రవ్యశబ్దార్థ పదవృత్తినా" అన్న శ్లోకమున

1. "సందర్భేషు [ప్రబంధేషు] దశరూపకం (నాటకాది) శ్రేయః"
వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి। అధికరణము—3 అధ్యా, వృత్తి 30, పుట 37—Benares Skt, series No. 140. (1908).

2. ప్రకృతానాకుల శ్రవ్య శబ్దార్థ పదవృత్తినా।
గద్యేన యుక్తో దాత్తార్థా సోచ్ఛ్వాసాఽఖ్యాయికా మతా ॥ (౧)
వృత్త మాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టితం
వక్త్రం చ ఽపరవక్త్రంచ* కావ్యే భావ్యర్థశంసిచ॥ (౨)
కవేరభిప్రాయ కృతై రంకనైః కైశ్చిదంకితా **
కన్యాహరణ సంగ్రామ విప్రలంభోదయాన్వితా ॥ (౩)
నవక్త్రా ఽపరవక్త్రాభ్యాం యుక్తానోచ్ఛ్వాస వత్యపి
సంస్కృత సంస్కృతాచ్చేష్టా కథాఽపభ్రంశ భాక్ తథా ॥ (౪)
అన్యైః స్వచరితం తాస్యాం నాయకేన తునోచ్యతే
స్వగుణావిష్కృతిం కుర్యాదభిజాతః కథంజనః?
భామహాలంకారము I. శ్లో 25—29. (౫)

కర్థము కొందఱింకొక విధముగఁ జెప్పుదురు1. ప్రకృత, అనాకుల, శ్రవ్య, అను విశేషణములను శబ్దార్థ పదములను విశేష్యములతో గ్రమముగ నన్వయించుట యోగ్యమని తోఁచెడిని. అప్పుడు 'శబ్దార్థ పదము'లు మూఁటికి 'వృత్తి' యనుదానితో నన్వయము. అది యట్లుండెను. ఇట్టి యాఖ్యాయిక నాయకఖ్యాత స్వవృత్తము.

ఇందు విరళముగ వక్త్రాపరవక్త్ర ఛందోవిశేషములు నుండవచ్చును; దోషముకాదు. కథార్థమును సకాలమున సూచించుటయే యీ ఛందముల పరమోద్దేశము.

ఆఖ్యాయిక సంస్కృత భాషా వినిబద్ధము గావలెను :—

ఇఁక నాఖ్యాయికకంటెఁ గథ భిన్నమైనది. ఇది యుదాత్తార్థమును సత్కవి కల్పనావిభూషావహ వస్తువిలక్షణత్వమును గలది.

కన్యాహరణము, సంగ్రామము, విప్రలంభము, నాయకాభ్యుదయము మున్నగు వాని వర్ణనములతో గూడినది కథలోని వస్తువు2.

---

\+ కావ్యాదర్శ (1–24) వ్యాఖ్యలో తర్కవాగీశుఁడు 'స్వచేష్టితం' అను దాని నుదాహరించెను. అట్లే యాశ్లోక ద్వితీయ పాదమందలి 'యస్యాం' అను (తస్యాం అనుటకు బదులు) దండి పదమును జీవానంద విద్యాసాగరుఁడు గూడ వ్యాఖ్యానించుచు నుదాహరించెను.

* 'కాలే' యనుటకంటె "కావ్యే" యని పఠింప వలెను. హర్షచరిత్ర పీఠికలోని దశమశ్లోక వ్యాఖ్యయందు శంకరుఁడీశ్లోకము నిట్లుదాహరించెను. యాస్మిన్ (వక్త్ర ఛందస్సులో) ఆఖ్యాయికా కృద్భిర్భావివస్తు సంసూచనాయ వాగ్విరచ్యతే తథాచ భామహః వక్త్రంచా పరవక్త్రం చ కావ్యేకావ్యార్థశంసిని "ఇతి". ఈ వాక్యమునుండి సాధుపాఠము కావ్య మని గ్రాహ్యము.

** "కృతైః కథా (కథ)నైః కైశ్చిదంకితా" అని ప్రతాపరుద్రీయముకూర్పున త్రివేది. కావ్యాదర్శము (I-30) వ్యాఖ్యలో తర్కవాగీశుఁ డీపాదమును "కవేరభిప్రాయ కృతై రంకనై రంకితా కథా" యని యుదాహరించెను. "సంస్కృతం సంస్కృతా" అని త్రివేది
\+ పాఠము.

1. Seã, S. K. Dē ā-khyāyikā and kathā [in Classical Sanskrit Literature.]
2. కావ్యాదర్శ [1–29] వ్యాఖ్యలో తర్కవాగీశుఁడు "స్వగుణా విష్కృతింకుర్యా దభి జాతః కథం జనః" అన్న తుది పాదమును ఆఖ్యాయికతో నన్వయించును: ఇది ప్రమాద కృతము.

ఇంతకు భామహుని శ్లోకములనుండి యాఖ్యాయికా కథల విస్పష్ట విభేదమును గ్రహించుటకు వీలులేదు. కాని యా కొంచెములో గొంచెము సామ్యభేదముల నిట్లు గ్రహింప వచ్చును.

సామ్యము :-

ఆఖ్యాయికా కథలు రెండును గద్యకావ్య రూపములు.

భేదము :-

ఆఖ్యాయికలోని వస్తువు నాయకునిచే ననుభూతము. అందుచే నిదమిత్థ మైనదిగా వస్తు వుండవలె నన్న నియమము లేదు; ఆంతులును లేవు.

కాని కథావస్తు ప్రవృత్తి యట్లుగాక కన్యాహరణాదులచేత స్థూలముగ సంయుతమై యున్నది; అందుచే దాని స్వభావము చర్వితచర్వణముగా నుండును. కథ సూక్ష్మాంశములలో గాదుగాని రేఖామాత్రముగ నుపలబ్ధార్థము (దత్త వస్తువు) గలదగు చుండుటయే దీనికి హేతువు. నియమితమైన పరిధిలో గథా శరీరనిర్మాణ విషయమున గథకుని కల్పనా శక్తి ప్రాధాన్యము వహించు నవుట మాత్ర మిందుచే రూఢము. "కవేరభిప్రాయ కృతై రంకనైః కైశ్చిదంకితా" యన్నకవి పలుకులలో నీయర్థ ముద్దేశింప బడియే యున్నది.

ఆఖ్యాయికలో యథార్థముగ భూతకాలమున బ్రవర్తిల్లిన యంశముల తోడనే మనకు బ్రసక్తి; ఇంకొక విశేషము; ఇది నాయకవృత్తమే గాదు. నాయకఖ్యాత స్వవృత్తము. అనగా స్వీయానుభవముల కథనమును, గృత్యముల ప్రశస్తిని నాయకుడే ప్రకాశకము (ఖ్యాపనము) చేయుట యాఖ్యాయికా లక్షణమన్నను తప్పుకాదు1.

కాని కథలో నాయకుడే కథకుడు కానక్కఱ లేదు; అన్యుడేని కావచ్చును2.

పైగా నాఖ్యాయిక యనేకాధ్యాయములుగ విభజింప బడును. వాని నుచ్ఛ్వాసము లనియే పేరు. ఇవి వక్త్రాపర వక్త్ర శ్లోక ఛందస్సులతో3 నారంభింప బడును. సకాలమున భావి కథార్థమును సూచించుటయే యుచ్ఛ్వాసములయం దీ శ్లోకముల పరమ ప్రయోజనము.

---

1. Autobiographical method of a story.
2. Narrative method of a story.
3. వక్త్రాపరవక్త్రే పవాఠ (బాణుని హర్షచరిత—పుట 115) Ed. P. V. Kanē.

కథయం దుచ్ఛ్వాసాదిక విభజనములేదు ; భావ్యర్థ సూచియైన వక్త్రాపర వక్త్రా ఛందో నియమమును లేదు. భాషనుగుఱించి భామహుని మతము ప్రధానమైనది. అతఁడు కథ సంస్కృతము నందే వ్రాయఁ బడవలెనను నియమము లేదనెను. అపభ్రంశము నందుకూడ వ్రాయవచ్చుననెను. ఇచట నపభ్రంశ మనఁగా నొక భాషయే కాదనియుఁ బ్రాకృత భాషలన్నియు ననియు భామహుని హృదయముగా[1] స్థూలార్థమున స్వీకరింప వలెను. ప్రఖ్యాత బృహత్కథయే కథాలక్షణమునకు భామహుని లక్ష్యమని నిరూపింపలేము ; కాని నిదర్శించిన వారనుకొన వచ్చును. ఈ బృహత్కథ పైశాచీ ప్రాకృతమున విరచితమని దండి యభిప్రాయము[2].

భామహుని కథాఖ్యాయికల నిర్వచనము నాచార్య దండి తన కావ్యాదర్శములో నిశితముగ విమర్శించినాఁడు[3]. దాని సార ముదాహరింపఁ బడును :-

"పద్య పాదములుగా విభజింపఁ బడని పద సంతానము గద్యము. ఇది యాఖ్యాయిక[4] యనియు, కథ[5] యనియు రెండు విధములఁ బరిగణింపఁబడినది. ఈ రెంటిలో నాఖ్యాయిక కేవలము నాయకునిచే (మాత్రమే) చెప్పఁబడు వృత్తముఁ గలది. నాయ కేతరునిచే గూడఁ జెప్పఁబడునది కథ. ఇట్టి కథయందుఁ దన్ను గూర్చి తాను జెప్పుకొన్నను నది యథార్థమగుచో నాయకునకు స్వచరిత్ర వ్యావర్ణన దోషమంటదు."

కథయందుఁ గవిపల్కులు తోడుగాఁ గథను జెప్పువా రెవ్వరన్నది ప్రధానాంశముగఁ జేసి దండి ముందు చర్చించినాఁడు. కథలో నాయకుఁడు కథకుఁడు కాదన్న భామహుని వాదము దండిచే నిరస్తము. 'నాయ కేన' యని భామహుఁ డన్నదానికి 'నాయకేన ఇతరేణవా' యని దండి ప్రతిహతముగల్పించెను. భామహుని నాయకేతర వాదము నపాస్త మొనర్చుటకు దండి యింకొక హేతువునుగూడఁ జూపుట గమనింపఁ దగ్గది. "నాయకుఁడే కథ చెప్పుచు నొకవేళ స్వగుణ వర్ణనము చేసికొనినను

---

1. సంస్కృతం ప్రాకృతం చైత (భామహాలంకారము, పరి I–శ్లో 16). దపభ్రంశ ఇతి త్రిధా–

2. "భూతభాషామయీం ప్రాహురద్భుతార్థాం బృహత్కథామ్" (కావ్యాదర్శము, I–38 శ్లో).

3. "అపాదః పదసంతానో గద్యమాఖ్యాయికాకథా
   ఇతి తస్య ప్రభేదౌ ద్వౌతయో రాఖ్యాయికా కిల
   నాయకే నైవ వాచ్యాన్యా నాయకేనేత రేణ వా
   స్వగుణా విష్క్రియా దోషావా త్ర భూతార్థశంసినః." ।
   దండి కావ్యాదర్శము, పుట 26–I–23, 24 Bh. O. R. I. = Bhandarkar Oriental Research Institute (1938).

4. Chronicle

5. Tale.

నది యాత్మస్తుతి పరాయణత వలననే యనుట యెట్లు పొసఁగును? ధీరశాంతుఁడై యుండి కేవలము వృత్త కథాంశము నవికత్థనత్వముతో గ్రంథస్థ మొనర్చు కొఅకది కావచ్చును గదా"!

పిమ్మట రెండవ యంశమును గూర్చిన చర్చ :-

"ఆఖ్యాయికయుఁ గేవలము నాయక ఖ్యాతమే1 కానక్కఅ లేదనుచు బామహుని దండి విమర్శించును. ఆఖ్యాయికలో గూడ (కథయందువలె) నితర పాత్రలు సైతము కథనము సాగించుట కలదు. కావున దానికి నాయకుఁడే యర్హుఁ డనిన నియమము పాటింపఁ బడలేదు. (నాయక స్వచేష్టిత వృత్తమే గాక యాఖ్యాయి కలో దదితరుల వృత్తాంతమును వచ్చును గదా! ఇంతకుఁ గథకుఁడు నాయకుఁడే యగును; లేదా తదితరుఁ డగును. కావ్యవిభేద పరిగణనమున కిది యేమంత కారణముగా నుపకరించును?"

భామహుని గూర్చి దండి చేసిన ఛందో విషయక విమర్శ మూఁడవది. "వక్త్రా పరవక్త్ర వృత్త వినియోగమును, నుచ్ఛ్వాస (నామక)విభజనమును మాత్రమే యాఖ్యాయికా స్వరూప స్వభావ నిరూపణమునకుఁ బ్రధాన కారణములగుచో, కథా స్వరూప స్వభావములకు మాత్రమే యవి యెడపడడప కారణములు గారాదు? కథలో సైత మార్యాది ఛందస్సు లెడనెడఁ దోఁచును గదా! ఈ వక్త్రాపరవక్త్రము లేల కూడవు? కథలోని భాగములను లంభాదులనుచున్నారు గదా! ఆఖ్యాయిక యందలి వానిని ఉచ్ఛ్వాసములే యననేల? ఇట్టి భిన్న వ్యవహారముల వలని ప్రయోజనమేమి?"

సర్గబంధ సందర్భమున భామహ ప్రోక్తములైన పదముల కపార్థము చేసినట్లే యీ సందర్భమునను దండి బుద్ధి పూర్వకముగ దుర్వ్యాఖ్యానము చేసెను. నాయకేతరులు గూడ నాఖ్యాయికలో నప్పుడప్పు డాఖ్యానము సాగించుట భామహుఁడు కాదనలేదు. కాకపోయినచో, వారు మాత్రము నాయకునిచే బరిచితులు గావలయును.

---

1. "అపిత్వ నియమో దృష్టస్తథా ప్యన్యై రుదీరణాత్
అన్యోవక్తా స్వయంనేతి కీ దృగ్వా భేదకారణమ్ ॥
వక్త్రంచా పరవక్త్రంచ సోచ్ఛ్వాస త్వంచ భేదకమ్
చిహ్న మాఖ్యాయికా యాశ్చేత్ ప్రసంగేన కథాస్వపి ॥
ఆర్యాదివ త్ప్రవేశః కిం న వక్త్రాపరవక్త్రయోః
భేదశ్చ దృష్టో లంభాది రుచ్ఛ్వాసో వాస్తుకిం తతః ॥
కావ్యాదర్శము I, 25, 26, 27, Br. O.R. I. (1938).

వక్త్రాపర వక్త్రి శ్లోక విషయమునను నుచ్ఛ్వాస విభజన విషయమునను దండిది మిక్కిలి సాధువాదము వలెఁ దోఁచును. నిజమే. ఈ యల్పవ్యత్యాసము లాఖ్యాయికా కథల విశేషలక్షణముల నిర్ణయమునం దేమంత ప్రాధాన్యము గలవి ? ఈ సందర్భమునందు కూడ నార్జవమైన భామహుని దృష్టి కంటె భిన్న దృష్టిని దండి ప్రసరించి నాఁడని పరిశీలనమున వెల్లడి కాకపోదు. ఆఖ్యాయికలలో నెచటనో యెడప దడప వచ్చువృత్తములను గాదు, భామహుఁడు వక్త్రాపర వక్త్రములనుట. ఉచ్ఛ్వాసములకు శీర్షి కలుగా నుండఁ దగిన శ్లోకముల ననెను. వృత్తము పేరుగాని, యధికరణము పేరుగాని యేమంత ప్రధానము గాక పోవచ్చును. కాని తన్నామకరణ విషయమునందే మనకుఁ గొన్ని సమస్యలు పొడమును. వాని పరిష్కారము స్థలాంతరమునఁ బ్రయత్నింపఁ బడును.

మొత్తము మీఁదఁ గావ్యాదర్శమున దండి యాఖ్యాయికా కథల విలక్షణత్వము, కథకుఁడెవరన్న సంగతికిఁ గాని ఛందో విశేషణమునకుఁ గాని, ప్రకరణ విభజనమునకుఁ గాని సంబంధింపదని నిర్ణయించి, యందుచే గధాఖ్యాయిక లనువానిని గేవలము భిన్ననామ వ్యవహృతములైన యొకే సాహిత్య ప్రక్రియ[1] గానే నిర్ధరించి యుండెను.

అంతేగాదు. కావ్యాదర్శ టీకాకారుఁడైన తర్కవాగీశుఁడు శ్లాఘించునట్లు గరువచందముతో దండి భామహుని నిరసించుచు 'నింకను బెక్కు తెఱఁగులైన కథలు కూడ నుండవచ్చు[2]' నని గద్దించినాఁడు.

అట్లు భామహుఁడు చెప్పిన యాఖ్యాయికా విశేషగుణములకు విస్పష్టమైన విలక్షణత్వ మేదియు లేదని చూపి కథను గూర్చియు మహా ఘనముగ నతఁడు పల్కిన వానిని విశ్వసింపరాదని దండ్యాచార్యుఁడు నిరూపింపఁ బూను కొనెను. కన్యాహరణ-సంగ్రామ- విప్రలంభాభ్యుదయాది వర్ణనములును రచయిత యొక్క కల్పనాశక్తి చిహ్నములైన తదితరాంశములును, గథావిశిష్ట లక్షణములనుట భామహాచార్యులకు సమ్మతము. దీనికి దండి సమాధాన మిది ; కన్యాహరణాదులు సర్గబంధాదుల (మహా కావ్యముల) యందును గాననగును. అవి ప్రత్యేకించి కథకే విశేషగుణములు గావు.

---

1. 'తత్కథాఖ్యాయికే త్యేక జాతిస్సంజ్ఞా ద్వయాంకితా" (కావ్యాదర్శము I, 28). Bh. O. R. I. 1938.

2. "అత్రైవాంతర్భవిష్యంతి శేషాశ్చాఖ్యాన జాతయః" (కావ్యాదర్శము, I—28). దీనికిఁ దర్కవాగీశుని టీక:—"అత్ర అత్రైవాంతర్భవిష్యంతీతి భావిప్రయోగాత్ ప్రౌఢివాదేన భేద ప్రతిపాదనం గ్రంథకృతో నతువస్తుతః ప్రామాణికతమైర్మునిభిరపి తత్త్ద్భేదాభ్యుపగమాత్. యథా అగ్నేయే I— "ఆఖ్యాయికా, కథా, ఖండకథా, పరికథా, తథా కథానికేతి మన్యంతే గద్యకావ్యం చ పంచధా" ఇతి ఏవం కథాఖ్యాయిక యోరపి అభిన్నత్వ ప్రతిపాదనం ఏతన్మూలకం చేతి మంతవ్యం".

గద్యములో కథకుఁడు తన కల్పనా సామర్థ్యముచేఁ గథలో సాధింపఁగల వైలక్షణ్యమేదేని యున్నచో, దానిని మహాకావ్య (పద్య) కవియు నౌచిత్యభంగము రాకుండ నితర సాహిత్య రూపములలో గూడ సాధింపఁ గలఁడు. ఇంతకు సిద్ధహస్తునకుఁ దన ధ్యేయమును సాధించుట యందుఁ దోడ్పడని సామగ్రి గాని, సందర్భము గాని, సన్నివేశము గాని, శిల్పము గాని యుండునా?1

తుట్టతుదకుఁ గథా ప్రయోజితమగు భాషా విషయకమైన భామహుని వాదమును గూడ దండి ప్రత్యాఖ్యాత మొనరించెను. సర్వభాషల యందును సంస్కృతముతో బాటుగఁ గథ నిబంధింపఁ బడును. అద్భుతాంశములు గల బృహత్కథ భూత భాషా2 మయమని చెప్పఁబడుచున్నది3.

భామహుని కంటె దండి 'అపభ్రంశ' మను పదమును సంకుచి తార్థమున వాడుక చేసెను. అందుచే తత్సందర్భ మందలి భామహుని పదములు భిన్నార్థ ద్యోతకము లగుచున్నవి. ఈ యనుద్దిష్టమైన యపార్థమును భామహునిదిగా భాసింపఁ జేసి తదర్థమును దండి 'సర్వభాషాభిః' అనుటవలన నిరాకరించుచున్నాఁడు.

'సంస్కృతేన చ' యనిన దండిపదములలోని పరిపూర్ణ భావము భామహుని పదములతో దత్సందర్భమునఁ బోల్చిననే గాని గ్రాహ్యము కాదు. దండి పదప్రయోగము ('సంస్కృతేన చ' అనుదాని) నుండి యొక యవహేళనచ్ఛాయ ప్రసరించుచున్నది. "అపభ్రంశ" మనుదానికి బరిమితార్థమును గల్పించి, 'సంస్కృతము నందును గొంతగ నపభ్రంశము నందును గథ వ్రాయఁబడు' నన్న భామహుని మతమును ఖండించుచున్నట్లు బృహత్కథా ప్రసంగమును దార్కాణించి, పైశాచి యందు మాత్ర మది లిఖింపఁ బడలేదా ? యని విరమించెను. కావ్యాదర్శము నాఁటికి ప్రసిద్ధ గ్రంథమనఁదగు నీ

---

1. "కన్యా హరణ సంగ్రామ విప్రలంభో దయాదయః
సర్గబంధ సమా ఏవ నైతేవైశేషి కాగుణాః
కవి భావకృతం చిహ్నం అన్యత్రాపి నదుష్యతి
ముఖం ఇష్టార్థ సంసిద్ధౌ కింహి నస్యాత్ కృతాత్మనామ్"—
[కావ్యాదర్శము I—29, 30, Bh. O. R. I. (1938)]

2. భూత భాషయనఁగా పైశాచి.

3. "కథాపి సర్వభాషాభిః సంస్కృతేన చ బధ్యతే
భూత భాషామయీం ప్రాహురద్భు తార్థాం బృహత్కథామ్"
[కావ్యాదర్శము I—38, Bh. O. R. I. (1938.)]

బృహత్కథనుగూర్చి మనకేమియు నేడు తెలియరామి చాల దురదృష్టము. ఇది పైశాచీ (మహారాష్ట్రీ) ప్రాకృత) భాషలో గూర్పఁ బడిన దనుటకుఁ బెక్కు సాక్ష్యము లున్నవి1.

గద్యకావ్య2 విశేషములుగా నాఖ్యాయికా కథలను బేర్కొనినను వామనుఁడు విశేషించి నిర్వచనమేదియు నిచ్చియుండలేదు. ఇట్టి కావ్య విభాగ మేమియు నంత ప్రధాన మైనదిగ నతనికిఁ దోఁచక పోవచ్చును.

పై నుదాహరించినట్లు దండి ఖండించినను నుత్తరోత్తర కాలమునందలి యలంకార శాస్త్రజ్ఞు లెవ్వరు గాని పూర్వ పూర్వుల గద్యకావ్య ద్వయ విభజన పద్ధతిని విడనాడ లేదు. నిజమునకు విపర్యాసము ల నంగీకరింపని సంప్రదాయబల మట్టిది.

రుద్రటుఁడు కథను గూర్చి సాకల్యముగ సమీక్షించి యీ క్రింది విధమున సంగ్రహ పఱచెను3.

"ఛందో రూపమున దేవగురు పూజానంతరము కథాకర్త (మహా) కథలో తన కర్తృత్వమును4 తన వంశమును గుఱించి కూడ సంగ్రహముగ (ఆఖ్యాయిక యందువలె విపులముగా గాక) వర్ణించుకొనఁ దగును.

పిదప నుత్పాద్య కావ్యమునందు వలెనే పుర నగరాది వర్ణనా పురస్కృత కథా శరీరమును మృదూచ్చారణము గల్గి సరళాక్షర యుతమై యనుప్రాసా లంకారప్రాయ మైన గద్యరూపమునందుఁ గూర్పవలయును. కథారంభమునందుఁ గవి పరిపూర్ణమైన వేఱొక ప్రాసంగిక కథను జెప్పి దానిని నిపుణముగ నాధికారికకథతో ననుసంధింప నగును. అట్లు రెండు భాషలలో జెప్పుచో నాకథ గద్యమందు మాత్ర ముండరాదు. దానికి కన్యాలాభముతో సమాప్తి. విన్యస్త సకల శృంగారమునకు నాకథ పరాకాష్ఠ.

---

1. See Hall's Introduction to his edition of "The vāsavadatta" [Culcutta 1859, Bibliotheca Indica].
2. Gadya-Kāvyās are commonly called Romances.
3. శ్లోకై రిహ కథా యామిష్టాన్దేవాన్గురూన్నమ స్కృత్య
సంక్షేపేణ నిజం కులమభి దధ్యా త్స్వంచ కర్తృతాం ॥
సాను ప్రాసేన తతో భూయో లఘ్వక్షరేణ గద్యేన
రచయేత్ కథాశరీరం పురేవ పుర వర్ణక ప్రభృతీన్ ॥
ఆదౌ కథాంతరం వా తస్యాం, న్యస్యేత్ ప్రపంచితం సమ్యక్
లఘు తావత్ సంధానం ప్రక్రాంత కథావ తారాయ ॥
కన్యాలాభ ఫలాంవా సమ్యగ్విన్యస్త సకల శృంగారాం
ఇతి సంస్కృతేన కుర్యాత్ కథా గమ గద్యేన చాన్యేన".
రుద్రటుని కావ్యాలంకారము, అధ్యాయ XVI, 20-23.
"తేన సుజన_ఖల స్తుతి_నిందాదికం చా7బి దధాఁదితి సూచ్యతే" అని నమిసాధువు (టీక)

ఆఖ్యాయికను గూర్చి యితోధికముగ నందే వివరింపఁ బడినది1. దాని సంగ్రహ మిది :-

మున్నిరువదియవ శ్లోకము నందుఁ జెప్పఁబడినట్లే "ఛందో మార్గము"న దేవగురు పూజానంతర మాఖ్యాయికా కర్తపూర్వకవి గుణకీర్తనముచేసి కావ్యనిబంధన వ్యవసాయమున తన యల్పత్వమును జెప్పుకొనును. అయ్యును దద్రచనో ద్దేశమున కొక రాజకుమారుని యెడఁగల భక్తియో యొక మహనీయుని యుత్కృష్ట గుణ కీర్తన ప్రయత్న వ్యర్థత్వమునో తదితర ప్రబలాంశమును దేనినో కారణముగా జెప్పఁ బూనును. అది గద్యములో గూర్పఁబడుట యొక లక్షణము. కవి కావ్యమునఁ దన వంశావళి వర్ణనము చేసినను జేయవచ్చును; కాని పద్యరూపమునఁ గాదు. మహా కావ్యములు సర్గలుగా నెట్లో, యట్లే యాఖ్యాయికయు నుచ్ఛ్వాసములుగ విభజింపఁ బడుట యొకగుర్తు. ప్రథమేతరోచ్ఛ్వాసారంభములయం దాధికారిక కథాసూచక ములగు నార్యచ్ఛందో నిబద్ధములగు రెండు శ్లోకములు రచింపఁబడును. అవి పరస్పర సంబంధులగు శ్లోకములు. స్థూలముగ నుచ్ఛ్వాస కథను సూచించుటయే వాని స్వభావము.

భూత వర్తమాన సంబంధియై నిగూఢముగనున్న విషయమును గూర్చిగాని, యావిష్కృతమై యున్నను భవిష్యత్ సంబంధియైన విషయమును గూర్చిగాని, కవి సంశయ ప్రకటన మొనర్పవలసి వచ్చిన యెడల తత్సంశయ విచ్ఛేదమునకై యా సంశ

---

1 పూర్వ వదేవ నమస్కృత దేవగురుర్నోత్స హేత్ప్రి తేష్వేష
కావ్యంకర్తుమితి కవీన్ శంసే దాఖ్యాయికాయాం తు ॥ ౧
తదను నృపేవ భక్తిం పరగుణ సంకీర్తనేzథవావ్యసనమ్
అన్యద్వా తత్కరణే కారణ మక్లిష్ట మభిదధ్యాత్ ॥ ౨
అథతేన కథైవ యథా రచనీ యాఖ్యాయికాపి గద్యేన
నిజవంశంస్వంచా స్యామభి దధ్యాన్న త్వగద్యేన ॥ ౩
కుర్యాదత్రో చ్ఛ్వాసాన్సర్గ వదేషాం ముఖేష్వనాద్యానామ్
ద్వే ద్వేచార్యే శ్లిష్టే సామాన్యార్థే తదార్థయా ॥ ౪
సంశయ శంసావసరే భవతో భూతస్య వా పరోక్షస్య
అర్థస్య భావి వస్తు ప్రత్యక్షస్యాపి నిశ్చితయే ॥ ౫
సంశయితుః ప్రత్యక్షం స్వావ సరేనైవ పాఠయేత్ కంచిత్
అన్యోక్తి సమాసోక్తిశ్లేషాణా మేకముభయం వా ॥ ౬
తత్రచ్ఛందః కుర్యా దార్యా పరవక్త్రి పుష్పితాగ్రాణామ్
అన్యతమం వస్తువశా దథవాన్య న్మాలినీప్రాయమ్ ॥ ౭

కావ్యాలంకారము XVI, 24-30.
Kāvya māla Series 2, Bombay, 3rd Ed.(1928).

యాత్మ్మని సమక్షమున నెవరేని యితర పాత్రచే నన్యోక్తినో, సమాసోక్తినో, శ్లేషాలంకారమునో పల్కింపనగును. అట్టిచో నార్యాపర వక్త్ర పుష్పితాగ్ర ఛందస్సులలోనొక దానిని గాని సందర్భమును బట్టి ప్రచురముగ 'మాలిన్యా'ది వృత్తములను గాని కవి ప్రయోగింప వలెను.

ఇంత పరిపూర్ణ వివరణపూర్వక వర్ణనము చేసినను గథాఖ్యాయికల నిర్వచనము నందు రుద్రటుఁడు చెప్పిన నూత్నాంశము లేవియు లేవు. ప్రారంభ శ్లోకముల విషయమున మాత్రమితఁడించుక విశేషాంశముల నుట్టంకించెను. భామహ దండ్యాచార్యులీ విషయము నెత్తుకొనలేదు. అందుచే భామహాదుల నాఁటి యాఖ్యాయికా కథలకుఁ బ్రారంభ శ్లోకోదాహరము నియతమా ? కాదా ? యన్న సంశయ మేర్పడు చున్నది.

ఇది యిట్లుండ నాఖ్యాయికలో నాయకుఁడా నాయకేతరుఁడా కథ నడపుట ? యన్న యింకొక ప్రథానాంశమును రుద్రటుఁడు స్పృశింపనే లేదు. రుద్రటుని కాలము నాఁటికి గూడ[1] నీ విషయమున నంత పట్టుదలయే యున్నచో నతఁడట్లు దానిని విస్మరించియే యుండఁడు. కావున గద్యకావ్యములలో గథసాగించునాతఁ డెవ్వరన్నది యొక లక్షణ విశేషముగా రుద్రటుని నాఁటికిఁ బాటింపఁ బడలేదనుట నిస్సందేహము. దీనితో గొంతగా గథ యొక పరిణామ దశకు వచ్చినది. ఈ పరిణామము స్థలాంతరమున విశదీకరింపఁ బడును.

ఇతర ప్రముఖాలంకారికులు కథాఖ్యాయికలను రెంటిని రెండు భిన్న గద్యకావ్యములుగా భావింతురు. ఇంతకుమించి యేమియుఁ జెప్పక పోయినను 'ధ్వన్యాలోక లోచన'కర్త యప్పుడప్పుడు కథాఖ్యాయికలను బేర్కొనెను. పద సంఘటనా ప్రస్తావనలో నానంద వర్ధనాచార్యులు సమాసముల దైర్ఘ్యమును బట్టి సంఘటనా గుణ విశేషము లేర్పడునన్నను. సమాస రహితము, లఘు సమాస సహితము, దీర్ఘ సమాస సమేతముగా పద సంఘటనము త్రివిధమని యానంద వర్ధనుని మతము[2]. ఎందులో నే సంఘటనము ప్రాయోజ్యమన్నది యాయా సాహిత్య ప్రక్రియను బట్టి నిశ్చయింపఁ బడును. ఈ కావ్యభేదములలో సర్గబంధాభినే యార్థాఖ్యాయికా కథలు పేర్కొనఁబడినవి. ఇవి యే కావ్య విశేషములు. ఈ క్రమముననే భామహుఁడును చెప్పినాఁడు. గద్యకావ్య నియమములు పద్యకావ్య నియమముల కంటె భిన్నములు గావచ్చును గాక ! గద్య విషయమున సర్వము ఘటనా విధానమును బట్టి యుండును.

---

1. క్రీ. శ. రమారమి 825—875.

2. "అసమాసా సమాసేన మధ్యమేన చ భూషితా
తథా దీర్ఘసమాసేతి త్రిధా సంఘటనోదితా" ॥
ధ్వన్యాలోకము, పుట 164—ఉద్యోతము 3, కారిక 5.

ఈ పద్ధతితో లఘుదీర్ఘ సమాస రచనమునకు లక్ష్యమైనది యాఖ్యాయిక. కథ కూడ స్థూలముగ నిట్టిదే యైనను రస ప్రతీతి కిందుఁ బ్రాధాన్యము గలదనుట మఱవరాదు1. ఈ సందర్భములో రసప్రసక్తి గల కథలను గుఱించి చెప్పిన నియమములు సమాసౌచితి గల యాఖ్యాయికల విషయము నందును గ్రమముగఁ జెల్లును. కావున రౌద్ర రస స్ఫూర్తికి దీర్ఘ సమాస రచన చేయవలెను2. శృంగార రసాభి వ్యక్తికి సమాసము లుండరాదు. ఒక్కొక్కప్పుడు రౌద్ర వీర కరుణ శృంగార రసములు గూడ నాఖ్యాయికలో బ్రతీయ మానములగుట కలదు. అప్పు డనివార్యముగఁ గవి పై నియమము లనే యనుసరింపవలయును. దానిచే నెల్లప్పుడు రసభేదమును బురస్కరించుకొనియే పద సంఘటన మేర్పడఁ గలదు.

ఇంచుక భోజుని3 మతమును బరిశీలింతము. ప్రాతస్మరణీయులు స్వర్గీయ మానవల్లి రామకృష్ణ కవి చరణులు (కవి గారు) భరతకోశమునం "దాఖ్యాయికా శ్రవ్య కావ్యమ్" అని నిర్వచించు భోజుని మతముగా దాని నిట్లు వ్యాఖ్యానించిరి. కన్యాపహారణమును, సంగరమును, స్త్రీ పుంస సమాగమమును, నభ్యుదయమును గలిగి నాయకుని చరితము నాయకుని చేతనే [స్వయముగ] గాని తదనుచరునిచే గాని చెప్పఁబడి, యెడనెడ ఛందో గీతికలుండి యుచ్ఛ్వాస విభజనతో సంస్కృత భాష యందు గద్యాత్మక మైనట్టి కావ్య మాఖ్యాయిక." ఇట్టిదాని యుదాహరణములు హరిచంద్రుని "మాధవిక"యు, బాణుని "హర్షచరిత"యు నని చెప్పిరి4. కావున

---

1. "ఏ తద్వ ధోక్త మౌచిత్య మేవ తస్యా నియామకమ్
సర్వత్ర గద్య బంధేపి ఛందో నియమ వర్జితే" ॥
కావ్యమాలా 25, Bombay, 4th Ed. (1935).
రస బంధోక్త మౌచిత్యం భాతి సర్వత్ర సంశ్రితా
రచనా విషయా పేక్షం తత్తు కించిద్విభేద వత్" ॥
[Id–iii–8, 9. Ed Bombay (1935).]
2. రౌద్రాద్భుతాది విషయమోజః—ధ్వన్యాలోకము. P. 165, Line 10
Kāvyamāla 25, 4th Ed, Bombay (1935).
3. క్రీ.శ. 1005–54.
4. ఆఖ్యాయికా శ్రవ్య కావ్యమ్
"కన్యాపహార–సంగర–సమాగమాభ్యుదయ భూషితం యస్యాం నాయక చరితం బ్రూతే
నాయక ఏవాన్యవా నుచరః
వక్త్రాపర వక్త్రవతీ సోచ్ఛ్వాసా సంస్కృతేన గద్యేన సాఖ్యాయికేతి కథితా మాధవికా
హర్ష చరితాది.
మాధవికేతి హరిచంద్రస్య గద్యకావ్య మిత్యూహ్యతే" యని కీ.శే. మానవల్లి రామకృష్ణ
కవిగారి టీక.

భరత కోశమ్ — పుట 48.
(S. V. Oriental Series - no 3 - 1951) Tirupati.

నాఖ్యాయికా కథల విభేదము కొంతగ క్షీణింప నారంభించిన దన్న యభిప్రాయ మొకటి దీనిని బట్టి మనకుఁ గల్గుచున్నది.

హేమచంద్రుని మతము [క్రీ. శ 1088-1172].

హేమచంద్రుఁడు1 కావ్యానుశాసనమునం దష్టమాధ్యాయమునఁ గావ్యభేదములను ప్రేక్ష్య శ్రవ్యములుగా వర్గీకరించి తత్ప్రేక్ష్యమును పునః 'పాఠ్యం గేయంచ' యని ద్విధాకరించినాఁడు. అందు పాఠ్యమునఁ బ్రకరణాది దశరూపకములును, సట్టకాద్యష్టాదశోపరూపకములును వక్కాణింపఁ బడినవి. గేయము 'డోంబి'2 కాదికము.

ఇఁకఁ గావ్య ప్రధాన భేదములలో మిగిలిన రెండవది శ్రవ్యము. ఇందలి విభాగము గద్యము. ఈ గద్యమునుండియే యాఖ్యాయికా, కథా, నిదర్శన, ప్రవహికా, పరికథా, ఖండకథా, బృహత్కథాది వచనరచన లుప్పతిల్లినవి.

అందు మనకుఁ బ్రస్తుతమైన యాఖ్యాయిక3 ప్రవిరళ పద్యనిబద్ధము. ఇందుఁ బ్రకరణము లుచ్ఛ్వాసములుగఁ జెప్పఁబడును. ఈ యుచ్ఛ్వాసముల నాగతార్థ సూచ

---

1.




2. డోంబి యనఁగా రూపక భేదము (మోనియర్ విలియమ్సు).

3. 'నాయక ఖ్యాత స్వవృత్తా భావ్యర్థశంసి వక్త్రాదిః సోచ్ఛ్వాసా సంస్కృతా గద్యయుక్తా ఆఖ్యాయికా' యని హేమచంద్రుఁడే వృత్తియందు నుడివెను.

ధీరప్రశాంతస్య గాంభీర్య గుణోత్కర్షాత్ స్వయం స్వగుణోప వర్ణనం నసంభవతీతి అరాత్ యస్యాం [అర్థాద్యస్యాం] ధీరోద్ధతాది నాయకేన స్వకీయ వృత్తం సదాచార రూపం చేష్టితం కన్యాపహార సంగ్రామాభ్యుదయ భూషితం మిత్రాది వ్యాఖ్యాయతే అనాగతార్థ శంసీని చ వక్త్రాపర వక్త్రాద్యాదీని యత్ర బద్ధ్యతే యత్ర చ అవాంతర ప్రకరణ సమాప్తా, ఉచ్ఛ్వాసా బద్ధ్యంతే, సా, సంస్కృత భాషా నిబద్ధా అపాదః (Not Metrical) పద సంతానో గద్యం తేన యుక్తాయుక్త గ్రహణాత్ అంతరాంతరా ప్రవిరళ పద్య నిబంధేపి (Sparcely used, Though) అదుష్టా ఆఖ్యాయికా యథా హర్ష చరితాది".

కావ్యానుశాసనము, అధ్యా 8. 405-408 పుటలు, కావ్యమాలా సంపుటము, ద్వితీయావృత్తి, 1934.

కములగు వక్త్రా పరవక్త్రార్యాది[1] వృత్తములతో నుపక్రమింపఁబడును. దీనియందు ధీర శాంతేతరులగు [ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత] నాయకులు మాత్రమే యాఖ్యాతలు.

(a) ఆఖ్యాయిక నాయక ఖ్యాతము :-

దశకుమార చరితాదులయందు నాయకులే తమ తమ సాహస వృత్తాంతములను వర్ణించుకొని యున్నారు. కాని బాణుఁడు హర్ష చరితమున నించు మించుగ రెండున్నర యుచ్ఛ్వాసములలోను, 'కాదంబరి' యందు 'కృత్యాది' శ్లోకముల యందును దన కథనే చెప్పుకొని యున్నాఁడు. కావున నాయకుఁడు గాని, కృతి కర్తగాని, యాత్మ చరిత్రను వర్ణించుకొన్నప్పు డదినాయక ఖ్యాతముగా నురరీ కృతమని కొందఱ వాదము. దశకుమార చరితము కథకుఁ జక్కని యుదాహరణము. కథ విషయమున నాయకుఁడు గూడ [ఇతరుఁడే గాక] గథఁ జెప్పవచ్చుననిన దానికి దశకుమార చరిత్ర లక్ష్యమగును గాని యాఖ్యాయికా విషయమున దాని నుదాహరింపఁ దగదు. ఏకాంత మున నాత్మీయులతో జెప్పినచో నాఖ్యాయికలో నాయకుఁడు కథకుఁడైనను దోషము కాదన్నది యింకొక పక్షము.

ముందు దశకుమార చరిత మాఖ్యాయికకు లక్ష్యమే కాదు; బే (వే) తాళ పంచ వింశత్యాదులవలెఁ గథానక[2] మగును.

(b) ఉచ్ఛ్వాసవతి :- (ఉచ్ఛ్వాస వంతము) :-

ఆఖ్యాయికలోని యాశ్వాసము లుచ్ఛ్వాస నామకములు. ఈ విభజన కథ కుండదని యనే కాలంకారి కాభిప్రాయము. (ఉన్నచో వానిని లంభకము లందురు.)

---

1. 'ఆర్యాది' యనుట, హేమచంద్రుఁడే చెప్పిన 'యనుష్టుప్పు' నకు గతి కల్పించుట కొఱకు.

2. పెక్కు చిన్న కథలు గల గ్రంథము కథానకము. ప్రతి కథయందును వేతాళుఁ డొక సమస్య కల్పించును. [See, 'Jambhaldatta's Version of the Vētālapanchavimsati, a Critical Sanskrit text in transliteration from the 1st Story 'How Prince Vajramukuta married Padmāvati' to the 25th Story.
'How the king was unable to solve the riddle of the mixed relationships and how the Goblin aided him in outwitting Kshāntisila,' with an introduction and English translation by M. B. Emeneau, Ph. D. yale University. Pub. by American Oriental society 1934. Also see 'Tales from Vētala Panchavimsati' retold in 'easy sanskrit' by S. N. Shastry and H. V. Kocher, Indore, 1948.

(c) ఈ యుచ్ఛ్వాస ముఖమున వక్త్రాపర వక్త్రార్యానుష్టుప్పులను మాత్రా ఛందస్సులుండుట పరిపాటి.

(d) ఈ ఛందస్సులు భావ్యర్థ శంసులగుట ముఖ్యము.

(e) ఆఖ్యాయిక సంస్కృత భాషయందే రచింపఁ బడవలెను.

(f) ఇది ప్రధానముగా గద్యకృతి. చెదురుగ శ్లోకము లుండుట యాఖ్యాయికా తత్త్వమునకు విరుద్ధము గాదు.

భట్ట భాణుని హర్ష చరిత మాఖ్యాయికకు నుత్తమోదాహరణము.

కథయు నాయకఖ్యాతమే :-

ఈ విషయమును గూర్చి హేమచంద్రుఁడే తన వృత్తియందు చర్చించినాఁడు. కథ నాయకఖ్యాతమగుట యెట్లు పొసఁగునన్న మీ మాంస వచ్చుచో దానిని బరిష్కరింప వచ్చును.

ధీర ప్రశాంతుఁ డవి కత్థనుఁడు [ఆత్మస్తుతి పరాయణుఁడు కాదు] గాన ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలితులు, కన్యాపహార-సంగ్రామ-సమాగమాభ్యుదయములను గూర్చియు, మిత్రాదులను గూర్చియుఁ, గథారూపమునఁ జెప్పఁ బడవలె ననుట సాధారణవిధి. కాఁగా ధీరశాంత నాయకునిచే స్వకీయ వృత్త కథనమైనను, సదాచార రూప మేని, ధర్మ బద్ధమేని యగుచో నా కథఁ జెప్పఁ దగుననుట విశేషవిధి. ఏలన నతఁడట్లు స్వగుణవర్ణనము చేయుట యాత్మస్తుతి పరాయణత చేగాదు; ధీరశాంతుఁడై యుండి కేవలము వృత్త కథాంశమును గర్వరహితుఁడై గ్రంథస్థము చేయుట కొఱకు.

నడుమ నడుమ నతి విరళముగఁ గథా భాగములోఁ బద్య (శ్లోక)ము లున్నను దోషము లేదనుట యపవాదము.

[సంపూర్ణ] పద్యమయి కథకు 'లీలావతి' [1] యుదాహరణము. గద్యమయి కథకుఁ 'గాదంబరి' యుదాహరణము.

---

1. యా నియమిత గతి భాషా దివ్యా దివ్యోభయేతి వృత్తవతీ కాదంబరీ వ లీలావతీ వ వా సా కథా కథితా ।

Bhōjā's 'sringāra prakāsa. IX, 19. Lilāvati–katha is written in verse. This is mentioned in vāgbhata's 'Alankāra–Tilaka' also. It is said that it is the work of Bhushana–Bhatta tanaya [Kutūhala] [c. 800 A. D]. Also see, late M. R. Kavi's critical essay on. Lilāvati katha' in Telugu. [Bhārati, 1926]. The same Lilāvati of Kutūhala [c. 800 A. D] with Prākrit text and an anonymous sanskrit commentary critically edited for the first time with introduction, Glossory, Notes, etc. It is a stylistic Romantic Kāvya (story) dealing with the love story of king Sātavāhanā and Lilāvati, a Princess from Ceylon. This book is Published in the 'Singhi Jain series' [Bombay-1949].

ఈ యీ విశేష విధు లిట్లుండఁగా సర్వసాధారణ విధులను బట్టి కథకీ క్రిందివి ప్రధాన లక్షణములు :-

(అ) ధీరశాంత నాయక మగుట[1] :-

ధీరశాంతుని వృత్తము కవిచే గాని యితరపాత్రచేగాని వర్ణింపఁ బడవలెను. అనఁగా సాధారణముగఁ దన్నుగూర్చి తాఁ జెప్పుకొనఁడు.

(ఆ) కేవల గద్యమయ మగుట :-

ఎక్కడనో యెడప దడప పద్యములుండుట దోషము కాదు.

(ఇ) సర్వ భాషల యందును జెప్పనగుట :-

సంస్కృతము, ప్రాకృతము, మాగధి, శూరసేని, పైశాచి, యపభ్రంశము లలో నీకథ యుండ వచ్చునని హేమచంద్రుని వృత్తియే చెప్పుచున్నది. ఆఖ్యాయిక వలెఁ గేవలము సంస్కృతము నందే యనుట కాదు.

గద్య కావ్య ప్రధాన భాగములైన యాఖ్యాయికా కథల విషయమే గాక యుపాఖ్యానాదులను గూర్చియు హేమచంద్రుని భావము లీ క్రింద సంగ్రహముగ నొసఁగఁబడు చున్నవి :-

I. ఉపాఖ్యానము :-

ధర్మోపదేశ బుద్ధితో నేదేని ప్రధాన కథా భాగము నందొక యవాంతర కథను బ్రవేశ పెట్టినచో నది యుపాఖ్యానము[2] [లేక-యుపాఖ్యానకము.]

II. ఆఖ్యానము :-

పై యుపాఖ్యాన మేకపాత్రాభినయ సంగీతముల మూలమునఁ జెప్పఁబడినచో నది యాఖ్యానము. 'గోవిందాఖ్యాన' మిందుల కుదాహరణము.

1. Noble-hearted and easy going type of hero as the Pivot or the Central figure.

2. రాను రానీ యుపాఖ్యానాఖ్యానములే నేఁటి కథానిక కొక విధముగఁ బ్రాతి పదిక లనఁ దగును.

నిదర్శన కథ :-

నీతిబోధకమై తిర్యక్కులయు, నల్పమానవులయు జీవిత సంబంధి కథ నిదర్శనము. విష్ణుశర్మ విరచిత ప్రసిద్ధ పంచతంత్రము, దామోదరగుప్తుని 'కుట్టనీ మతము'1 ను 'నిదర్శనము'నకు నుదాహరణములు.

IV ప్రవహ్లిక :-

ఇది యిర్వురు పాత్రల సంవాద రూపమున నడచునట్టి కథా విశేషము.

V పరికథ :-

బహు సన్నివేశములు బహు రీతుల వర్ణింపఁ బడిన విచిత్ర కథయే పరికథ.

VI సకల కథ :-

ఇది నాయక స్వీయకార్య ఫలానుభవ పర్యంతమైన పరిపూర్ణ కథ (నాయక స్వచేష్టిత ఫలభుక్తి పర్యవసాయి).

ఉపకథ :-

ప్రసిద్ధేతివృత్తమునుండి యొకానొక పాత్రచరిత్రయే చిత్రింపఁ బడుచో నది యుపకథ.

బృహత్కథ 2:-

---

1. కుట్టనీమతము[ = శంభళీమతము]-Kāvyamāla–Part III (1887). The Kuttanīmata is an interesting quite early and definitely datable treatise on Indian Parnography. It is the advice of a hetaira of Dāmōdaragupta, minister of Jayāpīda of Kashmir. [A. D 779-813]. The book shows an young girl, how to win gold for herself by the use of all the arts of flattery and feigned love, while preserving throughout a mere desire for wealth. Kalhana mentions Dāmōdara Gupta as a Poet and Mammata and Ruyyaka cite verses from him as do the anthologies showing that his work won considerable fame. From the point of view of Literary History it has the interest that it depicts a representation of Harsha's Ratnāvali in an effective and realistic manner. The anthor's style is simple but not inelegant. [see, A Hist. of Sanskrit Literature, PP. 236-237, by A.B. Keith, Oxford University Press, (1953).

2. Kāvyānusāsana, by Achārya Hēmachandra Vol II, part II, notes by Rāmachandra. B. Athavale. M.A. published by sri Mahā vira Jaina Vidyālaya, Bombay, First edition 1938, 273-275.

బహువ్యక్తుల జీవితచిత్రణము గలిగి యద్భుత సన్నివేశ మయమై లంభకాది పరిచ్ఛేదములు గలది బృహత్కథ[1]. వీని వీని యందు మనకు ముఖ్యమైనవి సందర్భమును బట్టి యాయా తావులలో విమర్శింపఁబడును.

హేమచంద్రు ననంతరము ప్రసిద్ధాలంకారికులలో నీ విషయమునఁ బేర్కొనఁ దగిన యతఁ డమృతానంద యోగి. ఇతఁడు 'అలంకార సంగ్రహము' నందు[2] కథ కల్పితవృత్తాంతముఁ గలదనియు నాఖ్యాయిక సత్యార్థము గలదనియు జెప్పినాఁడు ప్రాచీన నైఘంటికుఁడమరుఁడు[3]ను విశేషించి దీనిని గూర్చి యేమియుఁ జెప్పలేదు.

అనంతరాలంకారికులలో బదునాల్గవ శతాబ్ది వాఁడగు ప్రతాప రుద్రీయకర్త విశ్వనాథుఁడు తక్క, తక్కిన వారి సంగతినే యెత్తుకొనలేదు. విశ్వనాథుఁడైనను సంప్రదాయాను సారముగఁ జెప్పఁబడుచు వచ్చిన విషయములనే చెప్పెను. కాని యాఖ్యాయికా కథల కంతగా విశేషలక్షణముల నేమియుఁ జెప్పలేదు[4].

---

1. "ఉపరికథ, బృహత్కథ అనునవి లేనేలేవు. బృహత్కథ యొక గ్రంథ నామము కాని కథా భేదము కాదు" అని శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి 'కావ్యాలంకార సంగ్రహము' [నరస భూపాలీయము] ద్వితీయాశ్వాసము, పుట 266 లో నధోజ్ఞాపిక. [ద్వితీయా వృత్తి ఫిబ్రవరి, 1959]. బృహత్కథ నొక కథా విశేషముగ హేమచంద్రుఁ డంగీకరించినాఁడు ఉపకథా-పరికథ లనువాని సంయోగముచే శ్రీ రాయప్రోలువారు పొరఁబడి 'యుపరిథ' యని యొక దానిని సృష్టించి యుండవచ్చును.

2. "గద్యంతు గదితం ద్వేధా । కథాచాఽఖ్యాయికేతి చ
కథా కల్పిత వృత్తాంతా । సత్యార్థాఖ్యాయికా మతా"
[అమృతానందయోగి 'అలంకార సంగ్రహము' పరి I, శ్లో-15. Sri Venkateswara Oriental Series No. 150]. అమృతానందయోగి క్రీ. శ. సుమారు 1250 వాఁడు. ఇతఁ డాంధ్రుఁ డనియుఁ బైముద్రణ పీఠికలో చెప్పఁబడినది. Also See 'History of Classical Sanskrit Literature' by Dr. M. Krishnamāchariar, p. 790, [Ed 1937] wherein it is mentioned as Follows – 'Alankāra Sangralaha' by Amritānanda Yogın. [Ed Culcutta, Translation into English, Dc XXII 8604].

3. 'ఆఖ్యాయికోప లబ్ధార్థా ప్రబంధ కల్పనా కథా' అని అమరకోశము [I, 5, 5-6].

4. "యత్ర వక్త్రాపర వక్త్ర నామానౌ వృత్త విశేషౌ వర్ణ్యేతే, సోచ్ఛ్వాస పరిచ్ఛిన్నాఽఽఖ్యాయికా హర్ష చరితాది", రత్నాపణ సహితమ్, ప్రతాపరుద్రీయమ్, కావ్య ప్రకరణమ్, పుట 93, వావిళ్ళ (1917).

కాని విశ్వనాథుఁడీ క్రింది వివరణములఁ గొన్నిఁటి నిచ్చుచున్నాఁడు1. కథయందు రసవంతమైన వస్తువు గద్యములో నిర్మింపఁబడును. కథయందుక్వాచిత్కముగ నొక యార్యావృత్తముగాని వక్త్రాపర వక్త్రములు గాని యగపడ వచ్చును. కావ్యాది యందు నమస్క్రియా రూప పద్యమును దుర్జన స్వభావ వర్ణనాదిక పద్యమును నుండ వలెను. ఇందులకుఁ గాదంబర్యాదులు నిదర్శనములు.

ఆఖ్యాయికయుఁ గథవంటిదే. కవివంశ కీర్తనముగాని యన్యకవి చరిత్ర వర్ణనము గాని దీనియందించుకఁ బద్యరూపము నఁ జేయవచ్చును. ఇందాశ్వాస విభజనము కలదు. ఆ శ్వాసారంభమునందుఁ గావ్యార్థ సూచనకై యన్యాపదేశముగ నార్యా వక్త్రాపర వక్త్ర శ్లోకములలో నేదేనియుఁ జెప్పఁబడును. హర్ష చరితాదు లిందుల కుదాహరములు.

---

1. కథాయాం ** సరసం వస్తు గద్యైరేవ* వినిర్మితం ।
క్వచిదత్ర భవేదార్యా క్వచిద్వక్త్రాపరద వక్త్రకే
ఆదౌ పద్యై ర్నమస్కారః ఖలాదేర్వృత్త కీర్తనమ్ ।
యథాకాదంబర్యాదిః ॥
ఆఖ్యాయికా కథావత్ స్యాత్ కవేర్వంశాను కీర్తనమ్ ।
అస్యాం చవృత్తం పద్యం క్వచిత్ క్వచిత్
కథాంశానామ్ వ్యవచ్ఛేద ఆశ్వాసేతి బద్ధ్యతే ।
ఆర్యా వక్త్రాపర వక్త్రాణాం ఛందసాయేన కేనచిత్
అన్యాపదేశే నాऽశ్వాసముఖే భావ్యర్థ సూచనమ్ ।
యథా హర్షచరితాదిః ॥
అపి త్వనియమోదృష్టస్త్రాపి అన్యైరుదీరణాత్ ఇతి దండ్యాచార్య వచనాత్ కేచిత్ 'ఆఖ్యాయికా నాయకేనైవ నిబద్ధవ్య' ఇతి ఆహుః తత్ అయుక్తం ఆఖ్యానాదయశ్చ కథాఖ్యాయి యోరేవాంతర్భావాన్న పృథగుక్తాః యదుక్తం దండినైవ అత్రైవాంతర్భవిష్యంతి శేషాశ్చాఖ్యాన జాతయః" ఏషా ముదాహరణమ్ పంచతంత్రాది। [సాహిత్య దర్పణము, IV–332–336a].
** 'సరసవస్తువు'ను ప్రమదదాస మిత్ర పండితుఁడు కవితాంశమని యనువదించుట పొరపాటు. [See, 'Mirror of Composition' a translation of Sāhityadarpana by Dr. Ballantyne and Padmadā Dāsa Mitra, (1956)·
Krishnamāchariyar's [In the Introduction to subanhū's Vāsavadatta, Srirangam, (1906)] Nirnaya sāgara Press Edition, Correctly reads "గద్యైరేవ." The edition of the **"Bibliotheca Indica"** reads పద్యైరేవ. Peterson's translation is also defective for, he reads a different meaning into the words "పద్యైరేవ" వినిర్మితం. [See Edition of Kādambari by Peterson, Introduction Part II, P. 69]. Miss Ridding's translation !of Kādambari P. XII with respect to this] is also incorrect.

ఆఖ్యాయిక నాయకుని చేతనే నిబద్ధవ్య మనిన కొందఱ వాద మయుక్తము. ఇందు నాయకేతర పాత్రలును ప్రసంగించు1 చుండుటచే నట్టి నియమము చెల్లదని దండియే చెప్పినాఁడు. ఆఖ్యానాది గద్యకావ్యములు కథాఖ్యాయికాంత స్థితములే గానఁ ప్రత్యేక ముగఁ జెప్పఁ బడలేదు. ఈ రెంటియందును శేషించిన యాఖ్యానాదిక కథా ప్రక్రియ లంతర్భూతములై యుండునని దండి చెప్పనే చెప్పెను. పంచతంత్రాదులిందుకు లక్ష్యము.

ఈ తుది పలుకులలో విశ్వనాథుఁడు దండితో నేకీభవించును. కాని ఆఖ్యాయికా కథ లభిన్నములన్న వాదమునే పరామర్శింపఁడు; ఆఖ్యాయిక నాయకఖ్యాత వృత్త మనుట యయుక్త మనునే గాని తన్నిర్వచనమును విమర్శించునంత పర్యంతము పోలేదు2.

మొత్తము మీఁద విశ్వనాథుని నిర్వచనములు సమంజసముగ లేవు. పూర్వాలం కారికుల దృష్టిలో ప్రధానమైన వస్తువును గుఱించి యేమియు నితఁడు చెప్పఁడు. యథార్థములు, పురాతనములునైన యాఖ్యాయికా కథాభేదము లెన్నఁడో విస్మృత ములైనవని మనమిందు వలన నూహింపఁగలము.

గద్యకావ్య ప్రధాన ప్రక్రియలైన యాఖ్యాయికా కథ లీరీతిగా నాలంకారికులచే క్రమముగ నిర్వచింపఁబడుట యిట్లుండెను. ఇఁక గద్యాఖ్యాయికల యథార్థ పరిస్థితిని గూర్చియు వాని సామ్య భేదములను గూర్చియు నేమైన గ్రహింప శక్యమగు నేమో

1. "నాయకేనైవ వాచ్యాన్య నాయకే నేతి రేణవా
స్వగుణా విష్క్రియాదోషోనాత్ర భూతార్థ శంసినః
అపిత్వనియమోదృష్ట స్తత్రాప్యన్యై రుదీరణాత్
అన్యోవక్తా స్వయం వేతి కీదృగ్వా భేదకారణమ్" ॥
కావ్యాదర్శము - పరి 1—శ్లో 24, 25. Bh. O R. I (1938)

2. ప్రతాప రుద్రీయమున నగస్త్య విద్యానాథుఁడు కథను గూర్చి చెప్పనేలేదు. మహా కావ్య మును నిర్వచించిన పిమ్మట గద్య పద్య కావ్య భేదములను బేర్కొనెను. గద్యమునకుఁ గాదంబరిని, బద్యమునకు రఘువంశమును నుదాహరించిన పిమ్మట నిట్లు చెప్పెను :—
"అసర్గ బంధం అపి యదుప కావ్యం ఉదీర్యతే
అసర్గబంధ రూపం—సూర్య శతకాది
గద్యపద్యమయం కావ్యం చంపూరితి అభిధీయతే
వక్త్రం అపరవక్త్రం చ సోచ్ఛ్వాసత్వం చ భేదకం
వర్ణ్యతే యత్ర కావ్యాంగై రసా వాఖ్యాయికా మతా"
హర్ష చరితయే యుదాహరింపఁ బడుటచే విద్యానాథుని యెడఁ గూడ దండి ప్రభావమే విదితము.

యత్నించుట యుక్తము. ఈ విషయమును జర్చించిన వారిలో భామహుఁడే ప్రాచీన తముఁడు. కాని భామహ విధానమునుఁ బట్టి యాతనికిఁ బూర్వులే యీ చర్చలను సాగించిరని యూహింపఁ గల్గు చున్నాము. భామహ దండ్యాచార్యులకుఁ బూర్వమే గద్యకావ్యము లుండెను. అవి ప్రధానాంశముల యందుఁ బరస్పర భిన్నములు. అందుచే నాలంకారికులు వీనిని భిన్న భిన్న నామములచే వ్యవహరించుట సమంజసమే ! ఈ విషయ ముల కుదాహరణము లక్కఱలేదు. మనసాహిత్యశాస్త్రము లోని నిర్వచనములు నాఁటి కావ్యవిభేదము లెట్లుండెడివో తఱచుగ స్పష్టీకరించునవిగాలేవు. వీనిలో ప్రధాన లక్షణములు సంకుచితముగనున ప్రధాన లక్షణములు విపులముగను గన్పట్టుచున్నవి.

ఏ దెట్లున్నను నొక్కటి మాత్రము సత్యము. ఆఖ్యాయిక బహు పురాతన కావ్య రూపము. దీనినుండి విచిత్రరూప పరిణతి నొందినది కథ. మన పూర్వుల యభిప్రాయ ములో నాల్గంశములకుఁ బ్రత్యేక ప్రాధాన్య మున్నది :- అందొకటి యితివృత్తము. కథకుఁ డెవ్వరన్నది రెండవ ప్రస్తవము. ఉచ్ఛ్వాస విభజనాదికము మూఁడవది. ప్రథమే తరోచ్ఛ్వాసారంభముల యందలి భావ్యర్థసూచకమైన వక్త్రాపరవక్త్రి శ్లోకములచర్చ తుది విషయము.

చివరి రెండంశములను ముందుఁ బరికింతము. కేవలము ప్రకరణము నామకరణము నందును, దద్గత ఛందో విశేషము నందునే సర్వ నిర్వచనసారమున్న దనుకొనుట సాధారణ బాహిరపుదృష్టికి సమంజసముగ దోఁపదు. కాని యాఖ్యాయిక యుచ్ఛ్వాస నా మాంక విభాగములు గలదగుటయు నందుఁ బ్రత్యేక ఛందస్సులు ప్రయోగింపఁ బడుటయు నరయఁగా నవి సంజ్ఞా మాత్ర ప్రయోజనమే గలవనియు వానితో నిర్వచనమున కనుశయమే లేదనియుఁ జెప్పరాదు.

ఆఖ్యాయికా తత్త్వముతో నీ రెంటికెట్టి సంబంధములేదనియుఁ బ్రకరణమున కేనామమైన నేమి ? యందే ఛందస్సులు వాడిన నేమి ? యనియు వాదించుట బుద్ధి పూర్వకముగ దండి భామహు నపార్థము చేసికొనుట వంటిది.

వక్త్రాపర వక్త్రి ఛందస్సుల పుట్టు పూర్వోత్తరములను గూర్చి మనమేమియుఁ జెప్పలేము. కాని యాపేళ్లే యవి పరస్పరసంబంధము కలవని చెప్పును. వక్త్రి మనఁగా మన మనుకొను ననుష్టుప్పు శ్లోకమేమో[1] ! 'వక్త్రి'ము'ను గుఱించి పింగళుఁడు చెప్పిన

---

1. "శ్లోకమనఁగా అనుష్టుప్పు అను భావముండినట్లు తోఁచును. రామాయణమునందు వాల్మీకి ముఖమున వెడలిన 'మానిషాద ప్రతిష్ఠాం' అను దానిని గూర్చి యా మహర్షియు,నాతని శిష్యులనుగూడ నాశ్చర్య చకితులై పరిపరి విధముల హర్ష ప్రకటనము చేసిరి. వాల్మీకి యన్న మాటలు 'పాదబద్ధోఽక్షరసమః తంత్రీలయ సమన్వితః । శోకార్తస్య ప్రవృత్తో మేశ్లోకో భవతు నన్యథా".ఇది తప్పక శ్లోకమే యని వాల్మీకి కొనియాడినది అనుష్టుప్పు. కావున దానికే పూర్వ కాలమున శ్లోకమను విశేష సంజ్ఞ యుండెనేమో ।

లక్షణము (తొమ్మిదవ శ్లోకము)ను బట్టి యీ యర్థము నూహింపఁగలము1. శ్లోకమన్న పదమునే పింగళుఁడు వాడుక చేయలేదు. ప్రత్యేకచ్ఛందో విశేషమునకుఁ గాక సర్వ ఛందములకు సాధారణ నామముగాఁ బురాతన కాలమున సంస్కృత భాషలో శ్లోకమను పదము ప్రయుక్తము. క్రమముగా వక్త్రిమున కితిహాసములలో బ్రయోగింపఁబడు నొకానొక శ్లోకముగా రూఢియోగము కలిగెను. బాణుని హర్ష చరిత్రములోని వక్త్రి ఛ్ఛందము2 సాధారణ శ్లోకము కంటె నెక్కుడు భిన్నము గాక యుండుటయే మన యీ యూహకు నాధారము.

వక్త్రిచ్ఛందస్సులోని ద్వితీయ చతుర్థ పాదముల యందలి యుపధావర్ణములు సాధారణ శ్లోకమునందలి వానికంటె దీర్ఘము లగుట యొక్కటియే యీరెంటిలోని వ్యత్యాసము. ఇది తప్ప వక్త్రి ద్వితీయ చతుర్థ పాదములు3 పథ్యా కంద పాద రూపము నొందును.

U—UUU— --U—U—UU— —U
U—U—U— — — —U—UU— —U

ఈ పైది వక్త్రిచ్ఛందః ప్రస్తారము.

తొల్త శ్లోకమనునది యున్నట్లును పిదప దానిలో గొన్ని మార్పులఁ గల్గింపఁగా వక్త్రిమను ఛందస్సు సృజింపఁ బడినట్లును భావింపఁ దగును. పురాతనాలంకార శాస్త్ర ముల యందాఖ్యాయికా కథల ప్రసక్తి వచ్చినపుడీ 'వక్త్ర' మను పదమును జూచు చున్నాము. ఆఖ్యాయికాది సాహిత్య ప్రక్రియల కర్హమైన ప్రామాణికత్వము నాపాదిం చుట కొఱకే నూత్న చ్ఛందస్సులు సృష్టింపఁ బడినవి. 'అపరవక్త్ర' మను ఛందస్సును గూడ బాణకవియే హర్ష చరితమునందుఁ బ్రయోగించెను. (వక్త్రాపరవక్త్రి ప పాఠ). ఈ కారణముచే నీరెండు నేదో విధమైన సంబంధముఁగలవిగా బాణకవి భావించె నన వచ్చును. మొత్తము మీఁదఁ బురాతన కాలమునందలి యపరవక్త్రాచ్ఛందో రూపము వేఱు. ఛందశ్శాస్త్రము లావిర్భవించిన తర్వాతి యపరవక్త్రి రూపము వేఱు. అది యీ క్రిందఁ బొందు పఱుపఁబడుచున్నది :—

UUUUU—U—U—UUUU—UU—U—UU
UUUUU—U—U—UUUU—UU—U—UU

1. Pingalā's 'Chandas Sāstra' consisting of 'Sūtrās' distributed over eight books is the earliest and the most important work in Sanskrit Prosody.
2. Nirnaya Sāgar Press, P. 125.
3. కందము — ఒకానొక వృత్తము — దీని భేదము లాఱు — కందము, పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘన చపల. తద్విశేషములు—సమగీతి, ఉద్గీతి, ఉపగీతి, ఆర్యా గీతి. ఇదియే సహజకంద మనఁబడును. చూడుఁడు, అప్పకవీయము.

ఆఖ్యాయికలో గథకుఁడెవ్వరన్న ప్రశ్నపుట్టఁగా 'వృత్తం...... స్వచేష్టితం' అను సూక్తిచే నందు నాయకుఁడు తన ప్రవర్తనను దానే వివరించుకొనునని భామహుఁడు నుడివెను. కాని కథా విషయము రాఁగా నది (కథ) నాయకఖ్యాత మగుట యెట్లని విప్రకారము చేసెను. నాయకేతరుఁడే కథను జెప్పవలెననుచు నభిజాతుఁడైన వాఁడు స్వగుణా విష్కృతికిఁ గడఁగు టెట్లని కూడ విప్రతీపముగఁ బ్రశ్నించెను. ఆత్మగుణ కీర్తన మాఖ్యాయిక యందు దోషమై, కథయందు నాయకునకు గుణమగునా ? ఇది విప్రతిపత్తి ధీవచన మనిపించు కొనదా ? ఒకచో నొకపనికి నింద్యుఁడు గాని నాయకుఁ డింకొకచో నాపనికే నింద్యుఁడగుట పొసఁగునా ? అని వాదింప వచ్చును. కాని యీ వ్యత్యయము తన్మాత్రమే కాదు. ఏలన నాఖ్యాయికలో నాయకుఁ డాత్మానుభవము లను వర్ణించును. అనఁగా నది యథార్థ వృత్త కథనము; ఒక తెలుఁగైన స్వీయ చరిత్ర. లక్షణతః పరామర్శించినచో నాయకుఁడాత్మ చరిత్ర వంటి దీనిలో నుత్కృష్ట గుణము లను, మహోఘన కార్యములనే వర్ణించుకొనునని యేల మన మూహింప వలెను ? సాధారణ గుణములను గించిన్మాత్ర ఘన కార్యములను గూడ వర్ణింపవలసి వచ్చునని యేల యూహింప రాదు? కావున నాయకఖ్యాతమగు నాఖ్యాయికలోని స్వీయ చరిత్రయందుఁ గేవలము నాయకుని సుగుణ కీర్తనమే యుండు ననుకొనరాదు. మంచి చెడులన్నియు నాత్మకథలో వచ్చును. ఇం దభిజాతుఁడు గావుననే నాయకుఁ డాత్మాను భవావిష్కరణములలో న్యాయముగ గుణాగుణములను గూడఁ జెప్పఁగలఁడని విశ్వసింపఁదగును.

కథసంగతి వేఱొక విధము. కథలోని యితివృత్తము కల్పితము. అందుచేతనే దీని నుత్పాద్యమనిరి. ఈ విలక్షణత్వము వలననే యిందలి నాయకుఁడు భిన్నగుణ దర్శితుఁ డగుచున్నాఁడు. కథలోని నాయకుఁ డనన్యసుగుణ సంపన్నులయుఁడుగా జిత్రింపఁ బడుట సమ్మతమే యని మఱవరాదు. అందాతఁడే వాచకుఁడగుచో నాత్మగుణ సంకీర్త నమునకు దిగజారక తీరదు. అది యథార్థవృత్త కథనము గాదు గావునను, నతని గుణము లాపాద్యములుగావునను గథ నాయక ఖ్యాత స్వవృత్తమగుట దోషముగా బరిగణింపఁ బడినది. నాయకుఁడు స్వచేష్టితమగు యథార్థ విషయమును జెప్పుచోనది దోషము గాదన్న దండి వాదముతో నిది సంవదించు చున్నది.

కావున నాఖ్యాయిక స్వీయచరిత్రము వంటిది. ఇది యిట్లగుటను బట్టియు, శ్రవ్య కావ్య విశేష మగుటను బట్టియు, నుచ్ఛ్వాసములుగ నిందలి భాగములను విభజించుటను గూర్చి యిచట పునః పరిశీలనము జరుపవలెను. ఈ యుచ్ఛ్వాస విభజనమునకును, నాయక కథనమునకును బరస్పరసంబంధమున్నది. ఉచ్ఛ్వాసమను పదమునకు (బహి ర్ముఖశ్వాసము)[1] ఊర్పు వెలికిఁ బుచ్చుట యని యభిధార్థము. దీనిని బ్రకృతమున

1. ఉచ్ఛ్వాసమున కంతర్ముఖ శ్వాసమనిన [ఊర్పులోనికిఁ గొనుట యనిన] యర్థమున్నను నది విశ్రాంతి, విరతి యను నర్థమీయదు. కాన నిచట గ్రాహ్యము కాదు.

కన్నయింతము. ఆఖ్యాయికలోని యావద్వృత్తము నొక యూర్పున (ఉచ్ఛ్వాసములో) నాయకుఁడు చెప్పఁజాలఁడన్నది సత్య సమ్మతముగఁదోఁపకపోదు. కావున ఉచ్ఛ్వాసనము[1] లావశ్యకములు. అందుచే నాఖ్యాయికలోని యుచ్ఛ్వాసముల పేరిఁటి యీ పరిచ్ఛేదముల పరిమితి కథనసౌలభ్యమును బట్టియు, కథకసౌకర్యమును బట్టియు నిర్ణీతము. ఉచ్ఛ్వాసమను పదమునకు ముందు 'ఊర్పు'నియుఁ బిదప 'విశ్రాంతి' యనియుఁ దర్వాత గ్రంథ విభాగమనియు నర్థములు సమకూరుచు వచ్చిన వన్నమాట. ఈ రీతిగఁ గావ్యగతములై కొనసాగిన యుచ్ఛ్వాసములు, వేనికవి బావ్యర్థ సూచనగల వక్త్రాపర వక్త్రి శ్లోకములతో నారంభించి యథార్థవృత్త నిర్వహణముచే నేదోవిధముగ నసంపూర్ణములై ముగియుచున్నవి.

ఆఖ్యాయికలో దన చరిత్రను నాయకుఁడు తానే చెప్పుకొనును. 'వృత్తమాఖ్యాయతే తస్యాంనాయకేన స్వచేష్టిత' మ్మనిన భామహుని వాక్యములోని ప్రతిపద ప్రాముఖ్యము పరిగణనీయము. ఇతివృత్తము కల్పితము కాదు; యథార్థముగ జరిగిన దానిపై నాధార పడినది. ఉచ్ఛ్వాసముల పరంపరలో దాని పునశ్చరణము జరుగును. 'ఆఖ్యాయతే'[2] యనఁగా కథనము నెఱపుట, పునశ్చరణము చేయుట, వెల్లడించుట యనియే యర్థము. నాయకుఁడు స్వచేష్టితము నిందు పునః పఠన మొనర్చును గాన నిట్టి కావ్య విశేషము నాఖ్యాయిక యనిరి.

మఱి కథా స్వభావమే వేఱు. కథలోని వస్తు వించుమించుగ నుత్పాద్యము' నాఁటి కథను నేఁటి 'నవల' యన్నను నేఁటి నవలకుఁ ప్రాతిపదిక యన్నను దప్పుకాదు' ఇట్టి కావ్యరూపముల యందలి విశిష్టతయే మఱికొన్ని విలక్షణ సాహిత్య ప్రక్రియల యావిష్కరణమునకు దారితీసెను. మానవ విజ్ఞానమునకు సంబంధించిన సమస్త శాఖలను శాస్త్ర ప్రణాళికాబద్ధ మొనర్చుట కాభిముఖ్యమధికముగ నుండియున్న భారత దేశము నందిట్టి ప్రత్యేకప్రక్రియ నిర్ణీత వికాసమునకు దోహదము లభించుటయందు కొఱఁత లేదు. కావునఁగథ (సంగతి) యాఖ్యాయికకంటె భిన్నమై మహాకావ్య (సర్గబంధ)ముతో సామ్యము నొందినది. నాయక స్వచేష్టిత-యథార్థవృత్త కథనమే సాగవలె నన్న నియమము లేమిచే నాయకుని వ్యక్తిత్వమునకు (ఆఖ్యాయికలో కంటె) గథలో ప్రాధాన్యము తగ్గెను. తత్స్థానము నం దాలంకారిక రచనమునకుఁ ప్రాధాన్యము పెరిఁగెను. ఇఁకఁగథ యందు దేనిని వర్ణింప వలయు నన్నది ప్రశ్న. వ్యక్తి విలక్షణత్వము తోడను,సహజ వైవిధ్యము తోడను చిత్రింపఁ దగిన నాయక స్వచేష్టితము గాక కన్యాహరణము, తత్పరిణామ

1. Pauses.
2. ఆఖ్యానాదులు పూర్వవృత్త కథనము లగుటవలన నాఖ్యాయికా రూపాంతరములే యగును. భారతము మున్నగు నార్ష మహా కావ్యములలో నడుమ నడుమ వచ్చెడి కథావిశేషము నాఖ్యాన మందురు. ఇది పద్యమేని గద్య మేనియుఁ గావచ్చును.

రూప యుద్ధము తదనంతర విప్రలంభము, పర్యవసానమునందనివార్యమగు నాయ కాభ్యుదయమును వర్ణింపఁబడవలసి వచ్చెను. నాటకాదుల వలె నన్ని సాహిత్య రూపము లును సుఖ పర్యాప్త సమాప్తములగుట విశిష్టతయు, గమనార్హ విషయమును గూడ. ఇట్టికథ కవి భావనా పటిమకు, నూహాశక్తికిని ప్రత్యేకముగ స్వేచ్ఛా విహార సీమ.

భామహుఁడీ సందర్భమునఁగొన్ని 'యంకణముల'ను గూర్చి ప్రసంగించును. నిజమున కా యంకణములనఁగా నేమో చెప్పుట దుస్సాధము. కాని వీని వలన కవి భావనా జన్యములైన కొన్ని వర్ణనములను గథా ప్రత్యేక లక్షణ (అంకణ) ములుగా భామహుఁడు చెప్పనుద్దేశించెనని మన మూహింప వచ్చును.

"కన్యాహరణాదిక వర్ణనము మహాకావ్యములలో గూడఁగలదు; అది యొక కథకే విశిష్ట లక్షణము కాఁజాలదు" అని దండి భామహోక్తిని బ్రత్యాదేశము (ప్రత్యాఖ్యానము) చేసెను. తక్కిన యాలంకారికులు కూడ 'తందానతాన' యని యీ విధమగు పాటయే పాడిరి. కథ సంగతిలో నిది సత్యముగాదు. మఱల భామహ వచనమును దండి దుర్వ్యాఖ్య చేయుట కిది దృష్టాంతము. సర్గబంధాదులలో గూడ నిట్టి కన్యాహరణాది వర్ణనము లుండవని భామహుని హృదయము కాదు. అట్టి వానిలో వర్ణనములకు నిర్ణీతములై యున్న స్థానములు వేఱని యతని యభిప్రాయము. మహాకావ్యములలో నట్టివర్ణనముల కప్రధానత్వమును గథలో బ్రధానత్వమును గలదు. మహాకావ్యములు వస్తుతః ప్రణయ సంబంధులు కూడఁగావు; అవి దేవనృపాదుల యద్భుత కావ్యకీర్తన సంబంధులు. కాని కథ యన్ననో తత్త్వతః వర్ణన ప్రాధాన్యము గలది. అదియుఁగాక యీ యాఖ్యాయికా కథలలో భావవ్యక్తీకరణ విధానమునందే బహు భేదమున్నది. వీనిని భిన్న భిన్న కావ్యరూపములుగా బరిగణించుటకీ యొక్క భేదమే చాలును.

అనుటకు వీలున్నచో నాఁటి కథయే నేఁటి నవల యని యనవచ్చును. ఇది సమంజ సమే యగుచో నిందు శృంగార రసము పుష్కలముగఁ బోషింపఁబడుచున్నది. ఇది తథ్యమనుట కనేకోదాహరణములున్నవి. కావ్య భేదములను గూర్చి ధ్వన్యాలోక మించుక జెప్పెను1. కథ, శైలియం దాఖ్యాయిక నొక విధముగఁ బోలినను వేఱొక విధముగఁ దన ప్రత్యేక లక్షణమగు వర్ణనా వైశద్యమును గాని, శృంగార పోషణమును గాని యేమరరాదని విశ్వనాథుని పలుకు. ఈ విషయమునే రుద్రటుఁ డింకను స్పష్టీక రించెను. కథ కన్యాలాభ పర్యవసాయి గావున శృంగారము సర్వాంగ శోభితమగుట

---

1. Dhvanyālōka with Lōchana & Bāla Priya commentaries. The Kāshi Sanskrit Series 135 [Alankāra section no. 5] PP 326 & 327. (1940). Also see Ananda Vardhanā's Dhvanyālōka or theory of suggestion in Poetry, 3-8,9- PP 68, 69 by Dr. K. Krishna Murty (1955).

దాని ప్రధాన లక్షణమని యతని నిర్ణయము. విన్యస్తసమస్త శృంగార శోభితమగుట దాని ప్రధాన లక్షణమని యాతని నిర్ణీతి. సాహిత్య దర్పణము 'కథాయాం సరసంవస్తు గద్యైరేవ వినిర్మిత' మ్మనుట యిందుచే నన్వర్థము.

కథాస్వభావము (కథ యొక్క స్వభావము) పైఁజెప్పినట్లు భిన్నమగుటచే నందలి భాషా స్వరూపము గూడ నాఖ్యాయిక యందుకంటెు భిన్నమైనచో నందా శ్చర్యములేదు. ఇందు నాయకుఁడే కథకుఁడు కాదు; అవిచ్ఛిన్నముగఁగథన ముండును. ఆఖ్యాయిక యందుకంటెఁ బరిస్థితులు వేఱు. అందుచే నుచ్ఛ్వాస విభజనమే లేదు. పరిచ్ఛేదములే లేనప్పుడు వానికి వక్త్రాపరవక్త్ర శ్లోకారంభము నుండదు గదా! కాని కథాప్రసంగమం దెక్కడనో నడుమ నేవేని శ్లోకములు రావచ్చును. ఇవి ఆఖ్యాయిక యందు కూడఁ జెల్లును. ఇందు మూలమునఁ గథా స్వభావములో నెట్టి మార్పును రాజాలదు. ఈ శ్లోకముల విషయమున దండి భామహుని పలుకుల కెట్లపార్థమును గల్పించెనో మున్ను దెలిసికొంటిమి. కథ నాయకేతర ఖ్యాతమన్న విషయమునఁ గూడ నిప్పుడట్లే దండి భామహవచనము నన్యథాకరించి ('నాయకే నేతరేణవా' యని) యితరుఁడే యననేల? నాయకుఁడైనను గథ చెప్పవచ్చును; అది యేమంత యత్యంత వ్యత్యాస సూచక విషయ మన్నట్లుఁ ద్రోసి పుచ్చుచున్నాఁడు1.

భామహునితో బోల్చి చూచినపుడు "ఇతరేణవా" యనుటచే దండి కథా విశిష్ట తకే నష్టమాపాదించు చున్నాఁడు. ఆఖ్యాయికవలె నాత్మ కథకాదు గాన నాయ కేతరుఁడు కథనడపుటయే కథా వైశిష్ట్యమని నిరూపించితిమి గదా! కథలో గథకుఁ డెవ్వరన్న సంగతి నప్రధానముగఁ జేసి యాఖ్యాయికా కథలకు భేదమే లేదని నిరూ పించుట యిచట దండి యుద్దేశము.

ఉచ్ఛ్వాస విభజనము, తన్ముఖ ప్రయుక్త శ్లోకములు, కథకుఁ డెవ్వరన్న సంగ తియు మున్నైనవి ప్రాయశః కథాఖ్యాయికల భేదమును సంబంధమును [భామహ దండ్యాచార్యుల] నాఁడు నిర్ణయించుటకుఁ దోడ్పడిన ప్రధానాంశములని యూహింప నగును. కాని యొకటి గుర్తించుట ముఖ్యము. సాహిత్యశాస్త్రమొక మహాసామ్రా జ్యము వంటిది. అందనేక విషయములలో ననేకవిపర్యాసములు గల్గినవి. అట్లే కాల విపర్యయమున నాఖ్యాయికా కథలను గూర్చిన యభిప్రాయములును మాఱెను. మార్పులు కథను మాత్ర మంతగ లోగొన లేక పోయినవి. ఆ వశపడమికి దాని లేఁ ద్రాయమే హేతువన్నను దప్పుకాదు. కాలక్రమమునఁ బూర్వాభిప్రాయములను మార్చుకొని యాఖ్యాయిక స్వతత్వరూపమును గావ్యాదర్శము నాఁటికే కోల్పోయి నది. నాఁటి సాహిత్య రూపములలో నాఖ్యాయికా భేదము లెన్నియే నుండిన నుండ

1. దండి; కావ్యాదర్శము [I-24] Bh. O. R. I. (1938).

వచ్చును. అది సురూఢము. బాణునిచే స్వయముగఁ గథాఖ్యాయికలని క్రమముగఁ జెప్పఁ బడిన కాదంబరీ హర్ష చరితలు తనకుఁ బూర్వమే కూర్పఁబడి యుండినచో దండి కావ్యస్వరూప నిరూపణ విశ్లేషాదులు నేఁడు మనకు లభించు కావ్యాదర్శము నందు కంటె భిన్నమార్గమున నుండెడివి.

రమారమి క్రీ. శ. 620 నాఁటికి బాణుని హర్షచరితమే మనకు లభ్యమగుఁ బురాత నాఖ్యాయిక. ఆ దినములలో నాఖ్యాయికా రూప మెట్లుండెనో తెలిసికొనుటకు హర్షచరితమును శాస్త్రీయ దృష్టిచే బరిశీలింపవలెను[1].

శ్లోకరూపమైన యేకోనవింశతి శ్లోకములతో హర్షచరిత మారంభించును. ఈ యాఖ్యాయి కారంభశ్లోకములను గూర్చి రుద్రటుఁ డేమన్నదియుఁగూడ నిచ్చట నను సంధానించుట కర్తవ్యము. ఇతఁడు చెప్పిన నమస్క్రియా పూర్వక కవిస్తుత్యాది విశేషము లన్నియు హర్షచరితయందు బాణుఁడారంభ శ్లోకములలో నిష్కృష్టముగఁ బాటించినవే కావున నిచట సంగ్రహించినఁ జాలును. రుద్రటుని లక్షణమునకు బాణ హర్షచరిత్రమే లక్ష్యమగు చుండుటచే రుద్రటుని భావములో నాఖ్యాయికా స్వరూపము హర్షచరిత్రకుఁ బ్రతికృతి యనకతీరదు గదా !

భామహుఁడు గాని దండిగాని యారంభ శ్లోకముల ప్రసక్తి నెత్తుకొన లేదు. అందుచే ముందీ యాఖ్యాయిక పూర్వుల భావములో ఛందః ప్రారంభము కలది యో కాదో కూడ సంశయాస్పదమే ! ప్రథమోచ్ఛ్వాస ముఖమున నీ రెండు శ్లోకములును భామహుని మతమును బట్టి కానరావు. అందుచే దత్రత్య మన్యమై యుండును. తిరిగి హర్ష చరిత్ర పరిశీలనకు వత్తము. పైఁ జెప్పిన శ్లోకముల తరువాత గద్య కథా భాగము వచ్చును. ఈ యాఖ్యాయిక యసమగ్రము. అష్టమోచ్ఛ్వాసముతో నాఁగి పోయినది. "ఉచ్ఛ్వాసాన్తేఽ ప్యఖిన్నా స్తే యేషాం వక్త్రే సరస్వతీ, కథ మాఖ్యాయికా కారా న తే వంద్యాః కవీశ్వరాః" అని కృత్యాది దశమ శ్లోకమునఁ జెప్పుటచే హర్షచరితలోని పరిచ్ఛేదముల నుచ్ఛ్వాసములపేరిఁట బాణుఁడే వ్యవహరించెనని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. ఇచట ప్రథమేతర పరిచ్ఛేదములలో నుచ్ఛ్వాస, వక్త్రాపర వక్త్రములను మూఁడు పదములు సందర్భించును. ప్రథమోచ్ఛ్వాసము పాండితీ వైభవ ప్రదర్శకముగఁ బ్రారంభమగును. తదితరోచ్ఛ్వాసములు శ్లోక ద్వయారంభములుగలవి. ఈ శ్లోకములు భావ్యర్థ సంసూచకములగుట గ్రహింపఁదగును. వాని వాని ఛందస్సులు తృతీయ చతుర్థోచ్ఛ్వాసములలో [మొదటివి శ్లోకవృత్తములగుట తప్ప] సర్వము నార్యా వృత్తములు.

1. See Kāne's edition, 1918.

కావ్యారంభ గద్య, కవి కుటుంబ విషయక వివరణాత్మకము. ఇది తృతీయోచ్ఛ్వాస పరివ్యాప్తి గలది. ప్రథమోచ్ఛ్వాసమున బాణకవి తన వంశక్రమమును దన యౌవనమును గుఱించి ప్రసంగించును. ద్వితీయోచ్ఛ్వాసమున (కృష్ణభూపతి వలన) నితనికి రాజాస్థాని యందుఁ బ్రవేశము లభించును. తృతీయమునఁ గవి స్వదేశ గమనమును, నాతని బంధు జనమునకు హార్ష చరితము జెప్ప నుపక్రమించుటయుఁ గలదు. ఈ తృతీయోచ్ఛ్వాసము నందే ప్రధాన కథ యారంభించి యష్టమోచ్ఛ్వాస ముతో నిలిచిపోవు చున్నది.

ఉచ్ఛ్వాసముల నడుమఁ గూడ నెడ నెడఁ గొన్ని ఛందస్సు లున్నవి. సర్వ సాధారణముగఁ బురాతనాలంకార శాస్త్రములో ప్రధానములని చెప్పఁ బడిన వక్త్రాపర వక్త్రార్య ఛందస్సులే యవి. కాని వస్తు నిర్మాణమునందేని నిర్వహణమునందేని యవి తోడ్పడ లేదు.

ఈ యంశములను గూడ రుద్రటుఁడు చెప్పిన వానితో బోల్చి చూచుకొన్న యెడలఁ బునస్సంపూర్ణ సమన్వయము కుదురును. రుద్రటుని మతము నైతము గద్య రూపమునఁ గవికృత స్వీయ వంశానుక్రమ వర్ణనమును విధించును. కాని యిది యాఖ్యాయికల కెల్లఁ బ్రత్యేక లక్షణమని భావింపఁ గలమా ? అట్లు భావించుట సులభసాధ్యము కాదు. అందువలన రుద్రటుఁడు హార్ష చరిత్ర విషయముననే సాధారణ ధర్మముగా నుల్లేఖించి నట్లగ పడెను. రుద్రటుని యా వస్తు విన్యాస విచిత్ర విధానమును బట్టి మఱియు నింకొక సంగతి గూడ గ్రహింపఁ గలము. రుద్రటుని కాలమునాఁటికే యాఖ్యాయికలఁగూర్చుపద్ధతి పురాతనమైనట్లును బూర్వపండితుల యెడఁ గల మన్ననచే నది సత్సంప్రదాయముగ మాత్రమే యాదరింపఁ బడుచున్నట్లును నూహింప నగు చున్నది.

ప్రత్యుచ్ఛ్వాస ముఖమునను గవి రెండార్యా వృత్తములు సంధానించుట కూడ రుద్రటునకు సమ్మతము. హార్ష చరితమున దీనికించుక వ్యత్యయముగ శ్లోకచ్ఛందము (అనుష్టుప్పు) లుండుట మున్నే చూపితిమి. దానిని బట్టి యాఖ్యాయికా కర్తలు రుద్రటుని యీ సూత్రము నంత నియతముగ గ్రహింపనక్కఱ లేదని విదితము.

బాణ రుద్రటుల కుచ్ఛ్వాసాంతర్గత చ్ఛందోవిశేష నియమమునం దేకగ్రీవాభిప్రాయము కుదురుట తుట్టతుది సంగతి. రుద్రటుఁ డుచ్ఛ్వాసముల నడుమ నిదియే ఛందస్సని దేనిని గూడ నిర్ణయింపలేదు. కాని వక్త్రాపర వక్త్రార్యా వృత్తములు ప్రాయికముగ వినియోగింపఁ బడినవి. హార్షచరితకు నీ విషయమే వర్తించు చున్నది.

హార్ష చరిత యందలి యాఖ్యాయికా లక్షణములు భామహుని లక్ష్యమునకు సమన్వయించునా యని పరిశీలించుట మఱియు ముఖ్యము. ఈ సందర్భములో సుస్పష్టమైన సమైక్యమును వ్యక్తపఱచు కొన్ని యంశములు లేకపోలేదు. హార్ష చరితమున

నుచ్ఛ్వాస విభజన ముండుట యొకటి. ఇందు ప్రథమేతరోచ్ఛ్వాస ముఖమునఁ గావ్యార్థ సూచన గల ఛందో భేదము లుండుట రెండు. వస్తు వుత్పాద్యముగాక నాయకునిది గాని, నాయ కేతరునిది గాని స్వచేష్టిత వృత్తమగుట (యథార్థ వృత్త కథన మగుట) మూఁడు.

కాని యీ మూఁడవ యంశమును బరీక్షించినచో మనకు హర్ష భామహుల మధ్య ప్రధాన భేదమే గోచరించు చున్నది. హర్షచరితమున నాయకుఁడు (హర్షుఁడు) తన చరితము నుల్లేఖింపలే దనుట విస్పష్టము. కాని హర్ష వర్ధనుని జీవితాంశములను స్వయముగ నెఱిఁగిన వ్యక్తి వర్ణించినాఁడు. హర్ష చరితయందు బాణుఁడు తన వంశ క్రమము నభివర్ణించు కొనినను, నందలి యాతని విషయములు హర్ష దేవునకు సన్నిహిత సంబంధము గలవియే యైనను దదాఖ్యాయికకు నాయకుఁడు మాత్రము బాణుఁడు కాజాలఁడు. ఆ గ్రంథము పేరే హర్ష చరిత్ర. అసమగ్రమగు నీ కావ్యము నాతిదీర్ఘ మగుటచే నందలి కృతిపతి స్వీయచరిత్ర దీర్ఘముగఁ దోఁచు చున్న దేమో !

ఛందో విశేష సంబంధమైన దింకొక భేదమున్నది. భామహుఁ డుచ్ఛ్వాసారంభమున వక్త్రాపర వక్త్రముల గుఱించియే ప్రస్తావించెను. హర్ష చరితమున బాణుఁడిచటఁ బ్రాయికముగ నార్యావృత్తములనే హత్తించును; వక్త్రాపర వక్త్రము లెప్పుడు గాని యిందుచ్ఛ్వాసముల మధ్యనే కూర్పఁ బడినవి. ఛందో రూపమున కంటెనా ఛందస్సు యొక్క భావ్యర్థసూచకధర్మము భామహునిదృష్టిలో బ్రధానమని మునుపు సూచింపఁ బడియే యున్నది. కావున నిది పై దాని యంతటి ప్రధాన భేదము కాదు.

అయ్యు నీ పర్యాలోచనమును బట్టి ముఖ్య విషయ మొకటి గోచరించుచున్నది. అదేమన, భామహుని యాఖ్యాయికా లక్షణములకు హర్ష చరితము పరిపూర్ణ లక్ష్యము కాదనుటయే. ఈ సందర్భమున భామహునకు లక్ష్యమైన దేదేని పురాతనాఖ్యాయిక యినాలోక భాగ్యము నొందని దొకటి యుండ వచ్చును[1].

కావున మన కలభ్యమైన యొకానొక పుర్వాఖ్యాయికా లక్షణమున కనంతరము లభించినది క్రీ. శ. ఏడవ శతాబ్దిలో భామహుని యీ నవ్య లక్షణము. దండి యాఖ్యాయికా కథా విభేదమే నిరాకరించినను భామహుని బురస్కరించుకొని యెల్లరు నాఖ్యాయికనొక ప్రత్యేక ప్రక్రియగా బరిగణించిరి. అందుచే నాఖ్యాయికా ప్రధాన లక్షణముగా నీ క్రింది వానిని బొందు పఱపవచ్చును :-

---

1. భామహుఁడు బాణునకుఁ దర్వాతివాఁడన్న కొందఱ వాద మిందు మూలమున నపాస్తము.

(1) ఇతి వృత్తమైతి హాసికము (చరిత్రాత్మకము.)

(2) నాయకుఁడే కథకుఁడు గా నక్కఱలేదు.

(3) ఉచ్ఛ్వాస విభజన మున్నది.

(4) ప్రథమేతరోచ్ఛ్వాస ముఖ ప్రయోజిత వృత్తములు భావ్యర్థ సూచకములు. (ఇవి తఱచుగ నార్యా వృత్తములు.)

(5) కృత్యాది, సాహితీ గౌరవ క్షమమైన ఛందః ప్రారంభము గలది.

ఇతః పరమైన కావ్య భేదము కథ. ఇది నేఁటి భారతీయ భాషలలోని 'నవల' వంటిదని మున్నే వక్కాణింపఁ బడినది. సుబంధుని వాసవదత్తయు, బాణుని కాదంబరియు మన కుపలబ్ధములైన పురాతన కథారూపములు. కథాలక్షణ నిర్ణయ విషయములో నాఖ్యాయికలోవలె నంత క్లిష్టత యుండదు. అయ్యుఁ బై రెండు కథలను బరిశీలించి లక్ష్యలక్షణ సమన్వయము చేయవలెను. అప్పుడిఁక నాఖ్యాయిక యనఁగా నేఁటి యైతిహాసిక నవలను బోలునది యనియుఁ గథయనఁగా నేఁటి భారతీయ నవలను బోలునది యనియు బహు స్థూలముగ పొందు పఱుప వచ్చును.

సుబంధుని వాసవదత్త :-

ఇది యుపోద్ఘాత రూపమైన పంద్రెండార్యా వృత్తములతో బ్రారంభమగును. ఇందు సరస్వతికిని గృష్ణునకును శివునకును గ్రమముగ నమస్క్రియ జరుగును. పిమ్మట మానవుని పాప స్వభావమును విక్రమాదిత్యుని యనంతరము లోకము నీరసమగుటయు వచింపఁ బడినది. అనంతరము సుకవిస్తుతి. అంతట కవి కావ్య కల్పనా ప్రసక్తితో బద్య భాగము ముగియును. గద్యభాగము నందలి సంగతుల నిచట వివరింప నావశ్యము లేదు.

సుబంధుని కావ్యము నందు నిబంధింపఁ బడిన కథారూపము భారతీయ సాహిత్యమునం దెందును బొందుఁ బడలేదనుట సర్వత్రాంగీకృతము. ఇందుచే కనీసము సూక్ష్మాంశముల యందైన నీకథ యుత్పాద్య మనుట సాహసము కానోపదు. పూర్వ లాక్షణికుల దృష్టిలో మఱి యిదియే యాఖ్యాయికా కథలకుఁ బ్రధాన భేదము. భామహుని నిర్వచన మందలి 'కవేరభిప్రాయ కృతైరఙ్కనైః కైశ్చి దంకితా' యన్న వాక్యమీ యంశమునే స్పష్టీకరించి యుండవలెను. నాఁటి కథ యందు నేఁటి నవలా విశిష్ట లక్షణము లున్నవనుటకు భామహుని 'కన్యాపహరణ సంగ్రామ విప్రలంభోదయాదు' లుండవలెనన్న నుడియే నిదర్శనము.

దీని నిట్లుంచి వాసవదత్త నొక కథగా నంగీకరించుటలో బూర్వాలంకారిక మతమునందుకంటె నీష ద్విలక్షణమగు నొకానొక యంశమును వక్కాణింపవలెను. మొత్తము మీఁద నీకథలోని వృత్తాంతము లన్నియుఁ బ్రశాంతముగ నడచిన వనక

తీరదు. కథాంతరమందు వినవగు సంగ్రామ ప్రసంగ మేమియని ప్రశ్నించు వారికి దానికిఁ గథా వస్తు పరిణామముతో నెట్టి సంబంధమును లేదని సమాధానము. అదియే గాక యీ సంగ్రామ వృత్తాంతము మనకుఁ బ్రస్తుతము గాదు. దాని నట్లుంతము. వాసవ దత్త పితృ గృహామునుండి కొనిపోఁబడుట సరిగా గన్యాహరణమే (అపహరణమే)యని వాదమునకై యంగీకరించినను దన్మూలమునఁ గల్గిన సంగ్రామమును గూర్చి యొక వాక్యమునేని వినము. సంగ్రామమునకు యుద్ధమనియే యిచ్చట సందర్భ శుద్ధిగల యర్థము. కన్యను (ఆహరణ మనఁగా) బలాత్కారముగ నపహరించిన ప్రకరణములో 'సంగ్రామ' పదమున కర్థాంతర మేదియు జెప్ప రాదుగదా!

ఈ విషయమున రుద్రటునకుఁ గొన్ని భిన్నాభిప్రాయములున్నవి. అతఁడు 'కన్యాహరణము'నకు బదులు కన్యా లాభమనును. "ఆహరణ లాభము"లకుఁ గల యథార్థభేద మూహ 'నీయము. ఆ 'పదావేశుణ'[1] యిట్లుండ' రుద్రటుఁడు సంగ్రామ, మును గూర్చియే ప్రసంగింపఁడు. ఇది యత్యంత ముఖ్యాంశము. ఈ హేతువులచే భామ హుని కథాలక్షమునకు సుంబంధుని వాసవదత్త లక్ష్యము కాదనుట సుగమము. కన్య యొక్క యాహరణముచే గల్గిన సంగ్రామమున్న యేదేని మఱియొకకథ భామ హుని నిర్వచనమునకు దృష్టాంతమై యుండవలెను.

అప్రధానమైన యితరాంశములలో వాసవదత్త, భామహామతానుసారముగనే యున్నది. నాయకుఁడు కథకుఁడు గాఁడు; ఉచ్ఛ్వాస విభజనము లేదు; నిర్విరామముగఁ గథ 'కంచికిఁజేరును'. భావ్యర్థశంసి యగు ఛందఃప్రమేయమే యిటలేదు. కథా భాగమునందు మాత్రము మూఁడు తావుల నేడు[2] ఛందస్సులు వినియోగింపఁ బడినవి. అవి వక్త్రాపర వక్త్రములు మాత్రము గావు. బాణుని కాందంబరి :-

ఇది కథకు రెండవ ప్రాక్తనోదాహరణము. ఈ కథ కవిచేతనే బరిసమాప్తి మొందక పోవుట వేఱొకమాట. అతని పుత్త్రుఁడు భూషణభట్టు దీనిని సాంతమొనర్చెను. అది ప్రకృత మంత ప్రధానము కాదు. వాసవదత్త కంటె నీ కథ క్లిష్టమే యైనను రూపమున రెంటికి సామ్యమున్నది.

దేవగురు నమస్క్రియా పరమైన వంశస్థవృత్తములే యుపోద్ఘాతముగా గద్యమునఁ గథ యారంభించును. కథా సర్వస్వము నిచట సంగ్రహించుట యక్కఱ మాలిన పని.

---

1. 'పదాదానోద్ధరణం ఆవేశణమ్'.

2. ప్రథమ పర్యాయమొక ఆర్యావృత్తము, రెండు శార్దూల విక్రీడితములును, రెండవతూరి రెండు శిఖరిణీవృత్తములు నొక స్రగ్ధరయును, మూఁడవసారి యొక యార్యా వృత్తమును, సుబంధుఁడు వినియోగించినాఁడు.

ఆఖ్యాయిక విషయములో హర్షచరిత మెట్లో కథ విషయములో 'గాదంబరి'యు నట్లే రుద్రటునకు లక్ష్యమని సులభముగః దార్కాణింప వచ్చును. ఉపోద్ఘాతరూప శ్లోకములను గూర్చి రుద్రటుఁడు 'ఇష్టాన్ దేవాన్ గురూన్' నమస్కృత్యా, యనెను. మఱియు నీతని మతమును బట్టి కథాకర్త పద్య సంగ్రహమున నాత్మవంశావళిని వర్ణించుకొన వలయును. ప్రధాన గద్యకథ యింకొక చిన్నకథతో వలనారంభించి కన్యా లాభముతో సమాప్త మగుచున్నది.

ఇందుచే వాసవదత్త వలెనే కాదంబరియు నొక నవల (యనఁదగిన కథ). ఇందలి వస్తువు కల్పితమే కాని యైతిహాసికము గాదు. వాసవదత్త వలెనే యిందును సంగ్రామ ప్రమేయమే లేదు.

ఆఖ్యాయిక యైతిహాసికము, మఱి కథ కల్పిత వృత్తము గలది. ఇందుచే మొదటి దానితో నేఁటి భారతదేశ భాషల యందలి యైతిహాసిక నవలా సాహిత్యము నకును, రెండవ దానితో నేఁటి భారతదేశ భాషలయందలి కల్పిత నవలా సాహిత్యము నకును రేఖామాత్రముగఁ బోలికలున్నవి. వీనిని వానికి దాయ బంధువు లనఁదగును.

ఆఖ్యాయిక విషయములో హర్షచరిత్ర మెట్లో కథవిషయములో గాదంబరీ వాసవ దత్తములు గూడ నట్లే భామహుని లక్ష్యమునకు లక్షణములు గావనుట నిశ్చయము. మనకింత దనుక లభింపని యేదో యొక బహు పురాతనగ్రంథ మీతని కథాలక్ష్యమున కుదాహరణము గావచ్చును[1].

కాఁగా రుద్రటుని నూతనమత మీ యీ క్రింది లక్షణముల వెల్లడించు చున్నది:-

(1) కథేతి వృత్తము చాల వఱకుఁ[2] గవి కల్పితము (ఉత్పాద్యము) ప్రియా సమాగమ పర్యవసితమగు ప్రణయగాథ.

(2) కథయిత నాయకుఁడు గాఁడు.

(3) ఇం దుచ్ఛ్వాసాది విభజనము లేదు.

(4) గ్రంథారంభము నందుఁ బద్యసాహిత్యావతారిక యుండును.

---

1. దీనితో బొందిపొసఁగెడి మఱికొన్ని కారణములుకూడ నుండుటవలన బాణుఁడు భామహు నకుఁ బూర్వుఁడనుట విశ్వస నీయముగా [లే]దు.

2. పూర్తిగఁ బేళ్ళు మార్చి 'బృహత్కథ'లోని కథనే 'కాదంబరి'లో బాణ మహా కవీంద్రుఁ డును జెప్పినాఁడు. కావునఁ గేవల ముత్పాద్య మనునది మృగ్యము; దుర్లభము. అందుచే నుత్పాద్య మనఁగా సర్వాంగీణముగఁ గల్పిత మనలేము. కథాపంజర మితిహాసాదుల యందుఁ బ్రసిద్ధమైనను గవి కల్పిత వాక్య పరిపూరిత మైనచో దత్కావ్య ముత్పాద్యమే యగును. "పంజర మితిహాసాది ప్రసిద్ధం అథవా తదేకదేశం వా పరిపూరయేత్ స్వవాచా" యనియే రుద్రటుని మతముగూడ.

ఇంతకు భామహుని పురాతన కథా లక్షణముల కంటె రుద్రటుని యీ నవ్య కథా లక్షణములు పరిణతములై ప్రగతి వివక్షితములై యున్న వనుట సారాంశము.

ఇందుచే బరంపరగా వచ్చు గద్యకావ్య రూపములను భామహుఁడు వివరించి కొన్ని లక్షణముల నేర్పఱచె ననియుఁ బిమ్మటివారు వానిని విపులీకరించి రనియు కాదంబరికి నన్వయింపని కథాలక్షణములను బట్టి విదితమగు చున్నది. దండికాలమునాఁటి కున్నదాని నున్నట్లుగా జెప్పవలె నన్నచో బాణునకు బ్రహ్మరథముపట్టు దండికి భామహాదులు చేసిన యాఖ్యాయికా కథలనెడి ద్విధాకృతియే నచ్చలేదు. రుద్రటుఁడు దండివలెఁ బరిస్థితులను బ్రతిఘటింపక వానికిఁ దలయొగ్గినను గొంత పరిణామమునకుఁ ద్రోవ తీసెను. హేమచంద్రుఁడు సంప్రదాయ పాతికుఁడే యైనను గొన్ని క్రొత్తవి జెప్పి సమన్వయ మార్గము నవలంబించినాఁడు. ఇఁకఁ గడమ యిర్వురును భామహాదులనే యనుకరించిరి. కాన వారు వృద్ధవాదానుసారులని పైనఁ జెప్పనే చెప్పఁ బడినది.

పోఁగా సంస్కృత గద్యకావ్యములు గ్రీకుల గద్యకావ్యానుసారులను 'యమ్. గాబ్లెట్ అల్వైల్లా', 'పీటర్ సన్' ప్రభృతి పండితుల వాదమును నిస్సారమైనదే! గ్రీకుల యాఖ్యానములలో గథకే యగ్రతాంబూలము. సంస్కృతమున నట్లుఁగాదు1. కథకుఁ బ్రాధాన్యమే లేదు విశద విపులములగు వర్ణనలు, దీర్ఘ సమాసములు, శాబ్దికతయు నిండెక్కుడు. గ్రీకులు నాయకుని సాహసకృత్య పరంపరకుఁ బ్రాముఖ్యమిత్తురు. శబ్దముపైఁ గాని, ప్రకృతి వర్ణనపైఁ గాని వారు చూపు నిలుపరు. సంస్కృతమున నాయకుని నైతిక, శారీరక, బుద్ధి సంబంధి లక్షణముల వివరణ మధికము. అన్నిటి కంటెఁ బ్రధానవ్యత్యాస మింకొకటి కలదు. అది యుత్పత్తికిని గ్రమ వికాసమునకును సంబంధించినది. సంస్కృతమున గద్యకావ్యమిట్లు బ్రాహ్మణముల లోని గద్యభాగముల నుండియు ననుస్యూతముగా వచ్చుచుఁ బ్రాయికముగఁ బద్యకావ్య లక్షణావలంబి యైనది. కాని గ్రీకుల యాఖ్యాయిక యట్లుఁగాదు. అది పురాతన స్వరూపము నొకపెట్టున నిరసించి కథనేతిహాస రూపములను స్వీకరించుట కేమాత్రము నాలసింప లేదు. దీనికిఁ దోడు శృంగారరస మందులో జాల ముమ్మరము2.

---

1. In his introduction to the Kadambari Prof. P. Peterson outlines a comparision in some important points between the Kādambarī and lecuippe and Elitephon and holds with M. Goblet Alviella that the Indian Romance was directly, borrowed from the Greeks. *'Hellenism in Ancient India'* by G. Benerjee, also argues in a similar way. But M. F. Lacote discusses the connection of Greek and Indian Romances and differentiates their orgin and qualities.

2. 'History of Classical Sanskrit Literature' by M. Krishnamāchāriar, P. 440-441. (1937),

ఆయా కారణములచే సంస్కృతమున నాఖ్యాయికా కథల యుత్పత్తులును వాని బరిణామములును సక్రమముగ నున్నవి. ఇట్లవి క్రమ బద్ధము లగుటయే కాదు; బీజము నుండి విచ్ఛిత్తి యెఱుఁగని వికాసముఁ గూడ నొందినవి. అవిచ్ఛిన్న[1] ప్రభావము గల యాహేతువును బట్టియే నేఁటి యైతిహాసిక కల్పిత నవలల కివి మూల ప్రకృతులు, మూల కందములు, మూల బంధములు నగుచున్నవి.



1. అనఁగా, గ్రీకుల యాఖ్యాయిక బీజమునుండి యాకస్మికముగ విచ్ఛేదన మొందెననుట.

# ద్వితీయ ప్రకరణము

## స్వదేశీయ పూర్వరంగము — ఆంధ్రము



౧. ఇతిహాస కావ్యాదికము నుండి ఆంధ్ర కథా శిల్పాదిక నిరూపణము

౨ ఆంధ్ర వచన వాఙ్మయ పరిణామము

౩. ఆంధ్ర గద్య ప్రబంధ రూప ప్రథమాంధ్ర నవలావతరణము

# ద్వితీయ ప్రకరణము

## స్వదేశీయ పూర్వరంగము – ఆంధ్రము

## [ Indigenous Background-Telugu ]

శ్రీ వ్యాస భగవానుని సంస్కృతమహాభారత మమితాఖ్యానములతో గూడిన మహాభారతమై యాంధ్రమున చంపూరూపము నందినది. తద్గత వచన రచనలు పోను పోను ప్రబంధ యుగము నాఁటికి సాముదాయిక బలము చేత క్షీణించియు, రీత్యుత్కర్ష చే నాధునిక నవలా రచనమున కొంకదెసఁ దోడ్పడినవి. దక్షిణాంధ్రమున రచనలు శయ్యాపాటవము లేనివయ్యుఁ దమ సాముదాయిక బలముచే నేఁటి నవలా సాహిత్యమున కింకొక దెసఁ దోడ్పడినవి. ఇట్లు ద్విదళబీజము గలది మన నవలాసాహిత్య మహావృక్షమని యీ భాగమున నిరూపింపఁ బడును.

I ఆంధ్ర జాతి :–

పురాత నాంధ్రు లాటవికు లైనట్లుఁ బ్రప్రథమముగ నైతరేయ బ్రాహ్మణమున నుల్లేఖింపఁ బడినది[1].

II ఆంధ్ర దేశము :–

సంస్కృత మహాభారతాది గ్రంథములలో గళింగాంధ్ర దేశముల ప్రశంస కలదు.

III ఆంధ్ర రాజ్యము :–

ఆంధ్రులు మహా సామ్రాజ్య స్థాపకులై వర్థిల్లినట్లుఁ జంద్రగుప్త మౌర్యచక్రవర్తి యాస్థానిలో నున్న గ్రీకురాయబారియగు మెగస్తనీసు ప్రబలసాక్ష్యమును బట్టియు, నశోకుని శాసనములను బట్టియుఁ దెలియు చున్నది.

IV ఆంధ్రుల మతము : బౌద్ధము:-

తనచే వ్యాప్త మొందింపఁబడిన బౌద్ధ ధర్మము నవలంబించిన వారిలో భోజులు, పిటినికులు మున్నగువారితో బాటుగ నాంధ్రులు నున్నారని యశోకుఁడు పదుమూఁడవ శిలాశాసనమున వ్రాయించినాఁడు.

---

1. *ఆంధ్రుల చరిత్ర*, ప్రథమ సంపుటము. 17, 28 పుటలు.

V ఆంధ్ర సామ్రాజ్యాభివృద్ధి :-

పిమ్మట నాంధ్ర చక్రవర్తులు మగధ సామ్రాజ్యమును జయించి యావద్భారత దేశ వాణిజ్యమును, వలస రాజ్య రక్షణమును నిర్విఘ్నముగ నిర్వహించిరి.

VI వాఙ్మయాభి వృద్ధి :-

సామ్రాజ్య విజృంభణముతోఁబాటు వాఙ్మయ విజృంభణము జరుగుట యెందును గలదు. కాని ప్రాచీ నాంధ్రవాఙ్మయస్వరూప మిదమిత్థమని తెలియుటలేదు. ప్రథమాంధ్ర రాజులైన యాంధ్రవంశ్యులు చాల వఱకు బౌద్ధ మతావలంబులు. కావున వీరికి సంస్కృతము నందు కంటెఁ బ్రాకృతము నందభిమానము మెండు. వారి రాజభాషయుఁ బ్రాకృతమే : ఆనాఁటి యాంధ్రరాజుల శిలాశాసనములలో గడు చిన్నవైన వాని యందు[1] సైతము ప్రాకృతమే యగపడుచున్నది. తెలుఁగు, గ్రామ నామములలోనే కనవచ్చును[2].

ఆ నాఁడార్య బ్రాహ్మణులు సంస్కృత ప్రాకృతములను వాడుకొను చుండెడి వారు. రాజకీయ భాష మాత్రము ప్రాకృతము; వ్యావహారిక భాషలుగా మాగధి, పైశాచి వంటి ప్రాకృత భేదములు[3] దేశభాషలు[4] గూడ నుండినవి పైశాచి యనఁగా ప్రాచీన ద్రావిడ భాష. ఆర్యులు దీని నపహసించెడి వారు. ఆంధ్రరాజులీ పైశాచిలో గ్రంథములు వ్రాసియు, వ్రాయించియు, దేశ భాషలను ప్రోత్సహించి రనుటకు బృహత్కథా[5] వృత్తాంత మిచ్చు సాక్ష్యము చాలును.

ఆంధ్ర సామ్రాజ్యము క్షీణింప పల్లవు లాంధ్ర దేశము నేలిన నాఁడును బ్రాకృత ప్రాబల్యమే[6] కన్పడు చున్నది.

---

1. ధరణికోట, భట్టిప్రోలు, ఘంటసాల మున్నగు గ్రామముల యందున్న చైత్యములలోని తాళ్ళమీఁదఁ జెక్కఁబడిన చిన్నచిన్న శాసనములలోగూడఁ బ్రాకృతమే వాడఁబడెను.
2. ప్రాచీనాంధ్ర గ్రంథములు చీనా చక్రవర్తుల గ్రంథ భాండారములలో నున్న సైన్నాళ్ళ నుండియో వినుకలియేగాని నేఁటికిని కనుకలి లేదు.
3. ప్రాచీన మహారాష్ట్రి, పైశాచి, అపభ్రంశము మున్నగునవి ప్రాకృత భేదములు.
4. తెలుఁగు మున్నగునవియై యుండవలెను.
5. ఈ బృహత్కథ సుబంధ, బాణ, కాళిదాస, శ్రీహర్షాది కవుల కావ్యేతి వృత్తములకు మూలాధారము.
6. ఇటీవలి కొన్ని పల్లవ శాసనములలో సంస్కృతముండుట గణనీయముకాదు. ఏలన నది లక్షణ విరుద్ధము, ప్రాకృత పద భూయిష్ఠము నగు సంస్కృతము.

ఏడవ శతాబ్ద్యారంభమున నాంధ్ర దేశము విష్ణుకుండినుల నుండి తూర్పు చాళుక్యుల హస్తగత మైనది[1]. తూర్పు చాళుక్యుల శాసనములు కొన్ని తెలుఁగు వచనములో గలవు. అది మొదలు వైదిక ధర్మావలంబులగు చాళుక్య నృపులు నాల్గైదు శతాబ్దు లాంధ్ర దేశమును భాషను గూడ నేలిరి[2]. ఆ దినములలోనే యుభయ భాషా కావ్య రచనాభిశోభితుఁడగు నన్నపార్యుఁడు రాజరాజుసభలో "మధుమధుర రస భావ భాసుర నవార్థవచనరచనా విశారదులైన మహాకవులు[3] నున్నా రని వర్ణించినాఁడు.

శ్రీసత్యాశ్రయ ప్రముఖ చాళుక్య నృపాలుర కాలము నుండియుఁ బ్రోత్సాహ మునొందిన వైదిక మతముతోబాటు దేశభాషలును విజృంభించినవి. నన్నపార్యుఁడు భారతమును జంపువుగ రచించినాఁడు. క్రమక్రమమున బ్రబంధ యుగములో వచన రచన మొక విధముగ గుణముచే గరిష్ఠమయ్యును వైపుల్యముచే గనిష్ఠమైనది. చంపువులలోని వచన మిట్లు క్షీణించుటకు హేతువు లేక పోలేదు.

ఒక్క సంస్కృతమున నేమి ? అన్ని వాఙ్మయముల యందును జ్యేష్ఠతా గౌరవము ఛందస్సున కున్నది. ఛందో బద్ధములగు పద్యకావ్యముల తరువాతిదే గద్యమునకుఁ గల గౌరవము. అట్టి పద్యమయ కావ్య కర్తృ యశః ప్రాప్తి యగుట వలననే "యుత్తర రామాయణము"ను, 'బుధారాధన విరాజి' యగు తిక్కన సోమయాజి తొలు దొల్త పరిపూర్ణ పద్యకావ్యముగఁ గూర్చుట యేర్పడినది.

---

1. తత్పూర్వమే తెలుఁగున వచన రచన మున్నదనుటకు రేనాటి చోళులవియు బాణరాజులవియు, వైదుమ్బులవియు, శాసనము లాధారములు.

2. ప్రాచీన చాళుక్యరాజుల శాసనములు సంస్కృతి మున నేయున్నవి. కాని, యనంతర చాళుక్యుల శాసనములలో శాసన కాలమును గ్రామ సీమాదుల విభజనమును సూచించి నపుడు తెలుఁగు పదములే యగపడుచున్నవి. ఇంద్రకీల పర్వతము మీఁదివి రెండు చాళుక్య శాసనము లిందుల కుదాహరణములు. ఒకటి చాళుక్య భీముని [క్రీ. శ. 909] ది. *ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక*-సంపుటము-7, సంచిక 4. రెండవది అమ్మరాజు విష్ణు వర్ధనుని [క్రీ. శ. 918-925] నమ్మూరి గ్రామ దాన శాసనము.
మూఁడవది యుద్ధ మల్లుని బెజవాడ శిలా శాసనము [*ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక*, సంపుటము 6, పుటలు 49-88]. మఱియు ఏడు వాడల పాలెపు శాసనము నాల్గవది. [2-10-1922, ఆంధ్ర దిన పత్రిక]

3. *శ్రీ మదాంధ్ర మహాభారతము*. సంపుటము 1-ఆది, ప్రథమ, పుట 2, వచనము 8, వావిళ్ల వారి ప్రకటనము [1954]

ఆ దినములలో నట్లు వ్రాయుట యొక్క ఘనత. ఆ దినములలో నననేల?1 కంకంటి పాపరాజునాఁటికిని2 క్రీ. శే. కందుకూరి వీరేశలింగముపంతులు నాఁటికిని గూడఁ జంపువుగా ప్రబంధము వ్రాయుట సరసత్వము గాదన్న యొక్క యభిప్రాయ మున్నది3. కాని వచనము లేక వర్ణనము చెప్పుట కష్టమన్న తలఁపు తిక్కనార్యునకు లేక పోలేదు4; అనుభవమును గలిసి వచ్చినది.

ఇఁక భారతాంధ్రీకరణములో చంపూ పద్ధతి యొరవడిగా నుండనే యున్నది. దానినేల వీడవలెను. కావున భారతమున "మహా కవిత్వదీక్షా విధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్-" అని తిక్కనార్యుఁడు పలికెను.

కవిబ్రహ్మ యాంధ్ర కావ్యములలో వచన ప్రయోగము నెంత పరిహరింప రాదను కొన్నను వచనముల పరిమాణము మొత్తము మీఁదఁ గ్రమక్రమముగాఁ దరుగుచు వచ్చినది5. అట్లు క్షీణించి క్షీణించి నాయక రాజుల పోషణమున నుజ్జీవింపఁ

---

1. ఆ దినములలోనే కాదు. తిక్కనార్యుని నిర్వచనోత్తరరామాయణములో గొంత కథా భాగము మిగులగా దాని నేకాశ్వాసముగా "జయంతి రామ భట్ట కవి" ముగించుచు నిర్వచనముగనే వ్రాసినాఁడు.
2. వరుసం దిక్కనయజ్వ నిర్వచన కావ్యంబై తగం జేసెను
 త్తర రామాయణ మందునున్ మఱి ప్రబంధం బూని నిర్మించు చే
 సరసత్వంబని ప్రాజ్ఞులార ! నిరసింపం బోకుఁడీ ! రాఘవే
 శ్వరు చారిత్రము లెందఱెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే !
 [కంకంటి—ఉత్తర రామాయణము 1 ఆ. ...14 ప. 1951]
3. నిర్వచన ప్రబంధముల కొఱకు గావ్యముల కొఱకు *నాంధ్రవాఙ్మయసూచిక ముద్రిత గ్రంథముల పట్టికలు* పుటలు 99, 100, 207, 208 చూడఁ దగును. ఇందెనిమిది కావ్యప్రబంధ ములున్నవి. వీని యన్నిటి కంటె క్రీ. శే. కొక్కొండ వేంకటరత్నము పంతులు "*శ్రీ బిల్వేశ్వరీయము*" నేఁటి నిర్వచన కావ్యములలో బేర్కొనఁ దగినది.
4. వచనము లేకయ వర్ణన
 రచియింపఁగఁ గొంత వచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
 ప్రచయము పద్యములన పొం
 దుచితంబుగఁ జెప్పు టార్య యుచితంబనరే !
 [నిర్వచనోత్తర రామాయణము I ఆ,.......ప]
5. ఆంధ్ర చంపూ కావ్యములలో, క్రీ. శ 11వ శతాబ్ది నుండి 17వ శతాబ్ది వఱకు వచన భాగము లెట్లు 46 శాతము నుండి 4 శాతము (%) వఱకు క్షీణించినదియు దెలియుటకు. కీ.శే. గొబ్బూరి వేంకటానందరాఘవరావు "*ఆంధ్రగద్యవాఙ్మయచరిత్ర*" పుట 34లో నిచ్చిన పట్టికఁ జూడ దగును (1923).

బడి దక్షిణాంధ్ర వాఙ్మయములో వచన మొక ప్రత్యేక శాఖగా విజృంభించెను[1]. పందొమ్మిదవ శతాబ్దిలో పొటమరించిన మన వచన కథా సాహితి గ్రంథరాశిగా శోభిల్లి నను శయ్యా పాటవముచే నతిశయము గల యాంధ్ర ప్రబంధ గద్యముల నుండి రూప జవ సత్త్వములను గొన్నది. అట్లే యనంతర ప్రబంధ యుగమున వెలసిన వచన గంధ ముల రాశి నుండి సాముదాయిక బలమును. సంతరించుకొని, విజృంభించు చున్నది. ఆంధ్ర వచన కథా సాహిత్యమున కటు ప్రబంధ వచనములును నిటు దక్షిణాంధ్రయుగ వచన వాఙ్మయమును దేశీయములగు పూర్వరంగములు. సంస్కృతమున[2] గద్యసాహిత్య మెట్లో యట్లేయాంధ్రమునఁ గథా సాహిత్యమును ద్వైమాతృకము. ఈ సామ్యమును బట్టియైన వారి యాఖ్యాయికలకును మన కథా సాహిత్యమునకును గల సాజాత్య సారూప్యముల నూహింపఁ గలము.

ఇంకొక విశేషము; ఆచార్య దండి చంపూ[3] కావ్యమును బేర్కొనెను. సంస్కృతాలంకారికులలో వామనాచార్యుఁడు గద్య[4] రచన మూఁడు విధములుగా చెప్పినాఁడు[5]. తెలుఁగున చంపూ పద్ధతి నవలంబించిన నన్నపార్యుఁడు భారత భాగము లోని గద్యముల యందు పైఁ జెప్పిన వామనుని గద్యవిశేషమగు వృత్తగంధిని బాగుగఁ బాటించెను. నన్నపార్యుని గద్యములు పెక్కు మాత్రాచ్ఛందో బద్ధము

---

1. తంజావూరు సరస్వతీ మహల్ పుస్తక భాండాగారము, కాకినాడలోని యాంధ్ర సాహిత్య పరిషద్భాండాగారము, మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, నాంధ్ర విశ్వవిద్యాలయ లిఖిత పుస్తక భాండాగారము (వాల్తేరు) నందును నీ గ్రంథ జాల మున్నది.

2. సంస్కృతమునఁ గథ (నవల) యైన "కాదంబరి"యే "మహాశ్వేత" పేరిఁట నాంధ్ర మునను మొట్ట మొదట నవలయగుట భావింపఁ దగినది. ఇఁక కన్నడిగులు నవలను "కాదంబరి" యనియే పిలుతురు.

3. "గద్య పద్యమయీ కాచిచ్చంపూరిత్యపి విద్యతే". (లేక) గద్య పద్యమయం కావ్యం చంపూరి త్యభిధీయతే. దండి—కావ్యాదర్శము—1 పరి—శ్లో 31. [డా॥ యన్. కె. బెల్వల్కర్, పూనా—1924]

4. స్థూలముగ 'గద్య, వచన' పదములను బర్యాయ పదములుగ వాడు చున్నాము. కాని, యీ ప్రత్యేక ప్రకరణమున వామన మతాను సారముగ గద్య రచన మనఁగా మాత్రా ఛందస్సు ననుసరించి నడచునది యను నర్థము నందు గ్రహింపవలెను.

5. "గద్యం వృత్తగంధి చూర్ణ ముత్కలికా ప్రాయంచ
పద్య భాగవత్ వృత్త గంధి"...
[వామనుఁడు]

లుగ నుండుట సర్వత్ర విదితము1. కావున నన్నయది మార్గకవిత్వ మగుటచే సంస్కృతా లంకారికులు చెప్పిన గద్య ప్రభావ మాతని యాంధ్రముపై ముద్రిత మగుట సహజము. తన్మాత్రముచే యావదాంధ్ర భాషా సాహిత్యమునను వెలసిన చంపువులలోని గద్య రచనలు సంస్కృత మార్గమునే యవలంబించెననుట యెట్లు పొసఁగునని వాదింప వచ్చును. ఇతిహాస పురాణము2 లన్నియు వేద సముపబృంహితములు. అందును భారతము పంచమ వేదము. ఆంధ్రమునను దానికా ప్రతిష్ఠ కలదు. ఆ పద్ధతులే యాఖ్యానముల యందుఁ కూడ వెలసినవి. ఇదియుఁ గాక, నాఁడు ప్రజాకవి యనియు దేశీయ రచనా నిర్మాత యనియు నేఁడు మనము ప్రశంసించు శైవ కవి పాలుకురికి సోమ నాథుఁడు గూడఁ జాల వఱకు సంస్కృత భూయిష్ఠ రచనమునే చేసినాఁడు.

మఱి తెనుఁగు సాహిత్యమున దేశి రచనలు విస్తరిల్లక పోలేదు. అయ్యుఁ జంపూ విధానములో నడచిన ప్రబంధ వాఙ్మయమే ప్రకృష్ట స్థాన మాక్రమించినది. కావుననే తరువాతి ప్రబంధ కవులు గూడ వచనమును సంస్కృత సమాస భూయిష్ఠముగఁ జేసి వేసి, ప్రాచీనాలంకారికులు చెప్పిన గద్య లక్షణమునే పాటించిరి. ఈ కారణమును బట్టియు సంస్కృత గద్య సంప్రదాయ ప్రభావ మొక విషయమున మన గద్య రచనపై ముద్రిత మైనదని చెప్పఁ గలము. మఱి దక్షిణాంధ్ర గద్య వాఙ్మయ ప్రభావ మింకొక విషయ మున నని చెప్పనే చెప్పితిమి.

వీనికిఁ దోడు భారతీయ భాషలలో గొన్ని సమ కాలిక వాఙ్మయముల యందిట్టి నిదర్శనము లున్నవి.

వంగ భాషలో గద్య కవిత్వమనఁ దగిన వచన రచనము సాగినది. అట్లే 'ఒరియా' భాష యందును సాగెను. కన్నడమునను నిట్లే. ఆంధ్ర ప్రబంధముల లోని గద్య కవిత్వమనఁ దగిన వచన రచనల వంటివే పైఁ జెప్పిన యా యా భాషా సాహిత్యముల లోను నవలా రచనకు మార్గదర్శకము లయినవి.

ఇన్ని కారణములను బురస్కరించుకొని భారతాదులలోని యాఖ్యానములు మొదలు, ప్రబంధముల లోని గద్యాల వఱకు మన కథా సాహిత్య నిర్మితికి విషయము నందును, విధానము నందును దోడ్పడిన వని చెప్పఁ గలుగు చున్నాము.

---

1. శ్రీ నిడదవోలు వేంకటరావు గారి "ఆంధ్ర వచన వాఙ్మయము", పుటలు 4,5. మఱియు, "నన్నయ యుగము నాఁటి తెనుఁగు వాఙ్మయము", అను వ్యాసము 1950_సంవత్సరాది సంచిక. అట్లే, "తెనుఁగు కవుల చరిత్ర"లో నన్నయ యుగమను ప్రకరణమును జూడనగును.

2. ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప బృంహ్యతే.
[వ్యాస మహాభారతము, ఆది పర్వము, 1_293].

అగుచో, నాఖ్యానోపాఖ్యానములు చంపూ రూపమున నితిహాస ప్రబంధాదులలో నున్న కథలు గదా! వచన యుగారంభములో నిట్టి యాఖ్యానములలోని కథలే కొన్ని వచనకావ్య రూపమును, మఱికొన్ని కథాసాహిత్య రూపమును నొందినవి. అందుచే నాఖ్యానమనఁగా కథా సాహిత్య మనియా? యన్న ప్రశ్న పుట్ట వచ్చును. బ్రాహ్మణములలోని యాఖ్యానములకు సంస్కృత వాఙ్మయమున వెలసిన యాఖ్యాయికలకుఁ జెప్పిన సంబంధమునే యాంధ్ర వాఙ్మయ విషయమునఁ గూడఁ జెప్పుకొనవలెను. అనఁగా, వానికి జన్యజనక సంబంధము లేదు. కాని, యొకదాని కొకటి ప్రత్యామ్నాయమైన సంబంధము గలదన్న యచ్చటి మాటయే యిచ్చటను జెల్లును. ప్రత్యామ్నాయ సంబంధమనఁగా నొకదాని కొకటి ప్రతినిధికాగల సంబంధము. ఆ యాఖ్యానములకీ యాఖ్యానములు, ఆ యాఖ్యాయికలకి కథా సాహితియు, సంబంధులగుచో మన నవలను గాని కథను గాని 'యాఖ్యాయిక' యనఁ జెల్లునా? యని ప్రశ్న రావచ్చును. చెల్లినదని దానికి సమాధానము. ఇటీవలి వఱకుఁ బెక్కు నవలలకీ వ్యవహృతి చెల్లినది. పెక్కురు నవలా కర్త "లాఖ్యాయిక" యని తమ పుస్తకములను వ్యవహరించిరి[1].

తెలుఁగు నందింకను వెనుకకుఁ బోయినచో నవలకు గద్య ప్రబంధమనెడి పేరగపడు చున్నది. గోపాలకృష్ణమ సెట్టిగారి 'శ్రీ రంగరాజు చరిత్ర' నాఁటికిని[2] వీరేశలింగము పంతులు గారి 'రాజశేఖర చరిత్ర' గ్రంథరూపము నొందు నాఁటికిని గూడ[3] నవలయను పేరాంధ్ర భాష యందధిక ప్రచారమున లేదన వచ్చును. ఆ పేరు వైకల్పికముగ నుండె ననుటకు వీరేశలింగము పంతులు గారి రచనలే[4] సాక్షిభూతములు. అయి

---

1. "కొండపల్లి ముట్టడి" [The seize of Kondapalli] దీని ముఖపత్త్రముపై "చరిత్రాత్మకమగు నవల"యని యున్నది. పీఠికలో 8వ పంక్తియందు, రచయితలు తమది 'యాఖ్యాయిక' యని మఱల ననిరి. [చూడుఁడు:—"కొండపల్లి ముట్టడి—1929 శ్రీశేషాద్రి రమణ కవులు, శతావధానులు, పబ్లిషర్స్—వెంకటరామ్ అండ్ కో] ఇట్టివెన్నో యుదాహరణము లున్నవి.
2. "హిందువుల యాచారము తెలుపు నట్టి నవీన ప్రబంధము". "కేవల గద్యాత్మకము లయిన తెనుఁగు ప్రబంధములు విశేషము లేమిం జేసి యిది తెనుఁగు విద్యార్థులకు నయిత ముపయోగించునని తలంచెద".
   *శ్రీ రంగరాజు చరిత్ర*—ఉపోద్ఘాతము (1872)
3. క్రీ. శ. 1880.
4. "ఈ వఱకు మన యాంధ్ర భాషలో జనుల యాచార వ్యవహారములను దెలుపుచు నీతి బోధకములుగా నుండు *వచన ప్రబంధము* లేవియు లేకపోవుట, యెల్ల వారికిని విశదమయియే యున్నది గదా!"—*రాజశేఖర చరిత్ర*ము, పీఠిక—(1880).
   *రాజశేఖర చరిత్ర*ము వలన వట్టి పొగడ్తలేగాని తమ కేమియు రశ్మిరాలేదని చెప్పుకొనుచు పంతులు గారిట్లనిరి: "అందుచేత నిప్పుడు, *నవల లనఁబడు వచన ప్రబంధ*ములను వ్రాయు ప్రయత్నములను మానివేసితిని.
   *స్వీయ చరిత్రము*—రెండవ భాగము, పుటలు 143, 144 (1915)

నను నవలా రచనమును గూర్చి వారికి నాఁడు వచ్చిన ప్రోత్సాహకరమైన యాంగ్ల లేఖలను బట్టియు[1], వారి నవలను సమీక్ష చేసిన యాంగ్ల పత్త్రికలను బట్టియు[2], 'శ్రీరంగరాజు చరిత్ర' నాఁటికే దానిని గుఱించి ప్రకటించిన నాఁటి చెన్న రాష్ట్రపు 'గెజెటులను' బట్టియు[3], 'నవల' యను పేరు గూడ వచన ప్రబంధముల కగపడు చున్నది. ఆదిలో నీ వచన ప్రబంధ మనఁబడెడి దానిని సంస్కృతము వచ్చిన తెలుఁగు పండితు 'లాఖ్యాయిక' యనియు, నాంగ్లము నేర్చిన తెలుఁగు పండితులు 'నవల' యనియు వ్యవహరించిరి. అట్లే, కాలక్రమమున నాంధ్రములోని యా 'వచన' ప్రబంధ మునకాంగ్ల భాషలో 'నవల' యను వ్యవహారము ముందేర్పడి యాపేరే క్రమముగ నాంధ్ర భాష యందు కూడ రూఢి నొందినది.

అదియే గాదు. నవలకుఁ జిత్త్రాఖ్యాన మన్న పేరును జెల్లుచున్నది. సంస్కృతము నందలి యాఖ్యాయికల వలె నిది కొంత యథార్థ వృత్త కథనము నగును. ఆ సంస్కృతము నందలి కథవలెనే యిది కొంత కల్పితేతి వృత్తము గలదియు నగును. కేవల యథార్థము, కేవల కల్పనము ననునవి ముందే దురూహ్యములు[4]. యథార్థ వృత్త మనెడి పంజరమున కవి కల్పన తోడి వాగ్వ్యాపారముండుట సర్వజన సుగ్రాహ్యము. కావున నాఖ్యాయిక గాని కథాసాహిత్యము గాని యథార్థము, కల్పితము ననఁబడినచో నది ప్రధానముగ యథార్థ విషయము గలది, ప్రధానముగ కల్పిత విషయము గలది యనియే యీ ప్రకరణమున మన వివక్ష.

బ్రాహ్మణములలోని యాఖ్యానముల యందలి పాత్రలు స్వపర చేష్టితములను గూడ వర్ణింతురు. పురాణేతిహాసములలోని యాఖ్యానముల యందుఁబాత్రలును తా మొరుల వలన నెఱిఁగిన విషయముల నింకొకరికిఁ జెప్పుట తఱచుగ నుండును. కావున స్వపర ద్వయ చేష్టిత వర్ణనము గూడ నందుండు ననవచ్చును.

---

1. పంతులు గారికి శ్రీసమర్థి రంగయ్య సెట్టిగారి లేఖ (8-2-1875) - "Can you not undertake the writing of an original *Novel* in Telugu?" Id. P. 140. (1915)
2. "We may well say that *Rajasekhara* marks an era in the annals of Telugu literature.*It is the first Telugu Novel that has yet appeared* and as an attempt in a new direction, we must consider it a success ".— *The Hindu*- (1878)
3. "This is apparently the first attempt ever made in this part of India, at Novel writing in Telugu Prose" — Ft- *St.* G. G. Vol-I - P. 23 Suppliment, june 15, 1873-
4. యథార్థ కల్పిత విషయముల చర్చ రానున్న ప్రకరణములో జరుగును.

మఱి యాఖ్యాయిక నాయకుని స్వచేష్టిత కథనము గలది గదా! ఆఖ్యానము గాని, నవల గాని యట్టిది యగునా ? యని యింకొక శంక కలుగ వచ్చును. సుఖాంత మగుచో నేదియైన నట్టిది కావచ్చును ;.కష్టమేమియు లేదు. పోఁగా, నాఖ్యాన కథలకు నాఖ్యానాఖ్యాయికలకును భేదము లేదా యన్నచో విధాన భేద వివక్షచేత నున్నది. కాని వస్తు దృష్టిని లేదు. ఆఖ్యానములకు నిలయ మగు సంస్కృత భారతము నందే యాఖ్యాయికా కథలు పేర్కొ నఁ బడినవి[1]. ఆ యీ కారణములచే నాఖ్యానము, చిత్రాఖ్యానము, నాఖ్యాయిక, కథ మున్నగు పదములు వస్తుసంబంధులుగఁ గథా సాహిత్యమున కనుప్రయుక్తమైనచో నుపలక్షకముగఁ దప్పు కాదు. కాల క్రమ పరిణామమున పై ప్రక్రియల యందాలంకారికుల కాలము నాఁ డగపడిన కొన్ని లక్షణములకును తర్వాతి కాల లక్షణములకును గొంత వ్యత్యాస మేర్పడినచో, నేర్పడినది. అది వేఱు విషయము. కాని యవియే దీనికి దారి చూపిన వనుటకుఁ గాని, దీనిని జదివినపుడవి తలఁపునకు వచ్చుననుటకుఁ గాని, యభ్యంతర ముండరాదు. ఉపలక్షకముగఁ గాక నిష్కృష్టముగఁ జెప్ప వలయు నన్నచో, నాఖ్యానాదులు కథా సాహిత్యమున కుద్దీపకము లైన వందును. అనఁగా వానికి దీనికి నొక ప్రేమ లెడము; మేనమామ పోలిక కలవి యనుట. ఇందుచే నీ యాఖ్యానములు వస్తువు చేతను, గుణము చేతను, నింకఁ జెక్కు తెఱఁగుల చేతను గూడ, మనలో మొదటి పద్యకథాసాహిత్యమునకును, బిమ్మట నేఁటి గద్యకథాసాహిత్యమునకును నెట్లుఁ దోడ్పడెనో యికఁబరిశీలింపఁ దగును.

ఇందుచే నన్నపార్య తిక్కనార్యాదుల యాఖ్యానముల లోని యనంతముఖ శిల్ప సంపదను గూర్చి బహుసంగ్రహముగ నుల్లేఖించుట యుక్తము. ఇది రాను రాను మన కథాసాహిత్యమున కెట్లు రిక్థమై పెట్టుబడి ధనమైనదో తెలియఁగలదు.

నన్నపార్యుని ప్రసన్న కథా కలితార్థయుక్తి[2]నిఁ బరిశీలించినచో గొంతగ నాతని కథానిర్మాణ శిల్పసంపద వెల్లఁడి కాఁగలదు. అది యాతని యితిహాస రచనాధికార పరీక్షా కషణము.

---

1. Mahã bhãrata ( II. 11-38) [Bombay Edition]. But Winternitz has shown [J. R. A. S. =Journal of Royal Asiatic Society, 1903, PP 571-72] that the Stanza is interpolated.

1 నన్నపార్యుని భారతోపాఖ్యానములలో మూఁడు నాల్గింటికిఁ బ్రతిపద రసవ్యాఖ్యలనఁ దగు విమర్శనలు "నన్నయ గారి ప్రసన్న కథా కలితార్థ యుక్తి" యను పేరిఁట, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు వ్రాసిరి. ఇందు కొంత కథా శిల్ప పరీక్ష జరిగినది. ఈ సందర్భమున నది చూడఁ దగిన గ్రంథము.

కావునఁ దొలుత భారతాదులగు నితిహాసములలోని యాఖ్యానోపాఖ్యానము లన్నియు నొక మూసలో బోసి యచ్చొత్తి నట్లుండవు. కొన్నివైదికములైన కథలు; కొన్ని రాజులవి; మఱికొన్ని ధర్మబోధ (ధర్మోపదేశకములు); కొన్ని లౌకికములు, వేని తీర్పు వానిది. ఆ భిన్నత్వమునందే శిల్పరచనోత్కృష్టత యుండును. *పాంచాలీ పరిణయ వృత్తాంతమును* బరామర్శింతము :

'పాంచాలీ పరిణయము' ప్రారంభముననే పాండవులు ధౌమ్యుని బురోహితునిగా వరించుట యను విషయము వచ్చును. క్రాంతదర్శనము గల్గి ముందు రానున్న దానితో ప్రస్తుతము ననుసంధానించు కొనుచుఁబోవుట, కథాకథనచమత్కార ములలో నొకటి. ఈ కూర్చుకొను కూర్పు నంగాంగి సాంగత్య మందుము. అది కథ కొక తీర్పును దిద్దును. దానిని శిల్ప పరిభాషలో 'సుషమ' యందుము.

లక్కయింటినుండి తప్పించుకొనిన పాండవులకుఁ ద్రోవలో నడుమ నొక గంధర్వుఁ డగపడును. వాని పేరంగారపర్ణుఁడు. ప్రసంగ వశమున నాతని వలనఁ బాండవు లగ్నిమాహాత్మ్యమును బ్రాహ్మణసాంగత్య మహిమయువినిరి. విని, పురోహితు నొకనిని వరించుటచే తదమకు సర్వార్థసిద్ధి యగునని యెఱిఁగి తపోనిష్ఠితుఁ డగు ధౌమ్యుని గోరికోరి, యెట్టకేలకుఁ బురోహితునిగా బొందిరి. బ్రాహ్మణుని తోడనున్న క్షత్త్రియు నెట్టి పాపమును బొందదని పాండవులు గ్రహించిరి. స్వయం వరమునఁగా, గామ వ్యాపారము. దీని వలననే క్రోధాధికము పెరిఁగి పాండవులకు గౌరవులతో యుద్ధము ప్రవర్థిల్లఁ గలదు. ఇట్టి పట్టులలో హితమును గఱపుచు శ్రేయః కాంక్షి కాఁగల పురోహితు నెన్నుకొన్నట్లుఁ జెప్పుటలో బాండవులకుఁ గల దూర దృష్టియు, వృద్ధసేవా తత్పరతయు వంటివానిలోని సౌజన్యమును నన్నపార్యుఁడు చూపఁ దలఁచినాఁడు. మన మాతని దూరదృష్టి నభినందింపఁ గల్గినాము.

పాంచాలీ సంవరణ సందర్భములో బాండవులు పురోహితుని బోధనము నను సరించి ప్రవర్తింతురు. కావునఁబాపమాచరింపరు. ఒకవేళ నాచరించినను నది వారలను జెందదు. పురోహిత వరణమును ముందుఁ జెప్పుట యందుఁ గల ధర్మ రహస్య మిది. దీనిని గవిచెప్పఁడు. ఆ చెప్పక పోవుటయే చమత్కృతి. దానిని మనము సమన్వయించుకొన్నచో శిల్పచాతురి యని గుర్తింపఁ గల్గుదుము.

ఇచ్చట నన్ని కథలకును మూలబలముగా నింద్రసేన కథ నొక దానిని నన్నయ కూర్చెను. ద్రౌపది కేవురు భర్తలగుట యందలి ధర్మమును శాస్త్రార్థము చేయునపుడీ యింద్రసేనకథ సమస్తమునకును మూలబలమగుచున్నది. ఇంద్రసేనకు భర్త మౌద్గల్య మహర్షి. ఆమె యాతనివలన కామోప భోగములఁ దనియక పిమ్మటి జన్మలో శివు నేనుమారులు 'పతి, పతి' యని యర్థించును. ఈ జన్మలో ద్రౌపది యైన యామె యందుచే నేవురి భర్తలను శివవరముచే దొల్లి సంపాదించు కొనెనను గాథ

ముందుగా వ్యాస భగవానుఁడు ద్రుపదునకుఁ జెప్పి, తదుపరి పంచేంద్రుల కథ నుడివి నట్లు నన్నపార్యుఁడు కల్పించినాఁడు.

ఇందుచే క్లిష్టమైన పంచేంద్రోపాఖ్యానము కంటె సులభమైన యింద్ర సేన కథను ముందుగా జెప్పి నన్నయ ద్రౌపది కైదుగురు పతులగుట యన్న గాథను సుగమము సులభీకృతము సుప్రసన్నమును జేసినాఁడు.

మఱియు నేఁడు మూలగ్రంథమున లేనిదైనను నీ సులభమగు నింద్రసేన కథను ముందుగ వర్ణించి సుగమ దుర్గమార్థములను ముందువెనుక చెప్పినట్టి క్రమము తన శిల్పమార్మికత యని యిందువలన విశదపఱచినాఁడు నన్నయ.

ఈ కథల కూర్పులో రసధ్వనిని గూడ నన్నయ తన శిల్పమున కెట్లు విధేయ ముగఁ జేసెనో విచారింతము.

కథా కథన చమత్కారమే ప్రసన్న కథా కలితార్థ యుక్తి. అనఁగా, గథలో బ్రసన్నత యుండుట. దీనినే కవితలో బ్రసాద గుణమందుము. అలంకారమే కవి తాత్మ యను వారి ప్రసాదగుణమువలన రసచర్వణమగు నందురు. అందుచే బాంచాలీ పరిణయమందునఁ బ్రత్యేకముగఁ బ్రధానరసమని యొకటి ప్రపంచితము కాక పోయినను, నన్నపార్యుని కవితలో బ్రసన్నతయను గుణముండుటవలన రసము ప్రతీయ మానమగుచున్నది.

అటుల నీఘట్టమునం దభివ్యక్తమగుఁ బ్రధానరసము శృంగారము. అంగియైన యీ శృంగారము నాయికానాయకుల పరముగ నన్వయింపఁబడవలెను. మన యీ కథయందలి అంశములను బట్టి పాండవులనేవురఁ బెండ్లియాడుటకొఱకే ద్రోవది జన్మించినది. కావున నాయికయగు నామెకే ముందుగ రాగోదయమైన దన్నట్లు గల్పింట సుందరము. 'అయ్యాలరి బ్రహ్మచెయ్ది పరమార్థ' మగుటచే, పాండవపంచకము పంచశరాహతిఁ బాల్పడి ద్రౌపది నభిలషించెను. ఇందుచే సర్వలాక్షణికసమ్మత ముగ నాయికయందు ముందుగను, నాయకుల యందుఁ బిమ్మటను గ్రమముగ హృదయంగమముగ ననురాగ ముప్పతిల్లి, యది వివాహముగఁ బరిణమించినది.

కర్ణదుర్యోధనాది ప్రతినాయకుల యందు శృంగారాభాసము కూడ మనో హరముగఁ జిత్రింపఁబడి చదువరుల కానందముగూర్చుచు బ్రతియోగపద్ధతిని నాయికా నాయకుల ప్రీతియోగము నినుమడింపఁజేయుచుండుటయు నొక మహత్తర శిల్ప రహస్యము.

ద్రౌపదిదైన పంచభర్తృకత్వవిషయమున నీసందర్భములో గథకుఁడు వెలా ర్చిన శిల్పసంపద యనల్పము. పూర్వ జన్మసంబంధమును బట్టియు, శివునివరమును బట్టియు, పంచేంద్రోపాఖ్యానమును బట్టియు, యమేంద్రుల కోర్కెలను బట్టియు,

నై తంతువుల పోలికలను బట్టియు, నిట్లుఁ బతులేవురగుట బరమధర్మమని నిరూపించుటకై మొదటినుండియుఁ గారణపరంపరను బన్నుకొని వచ్చుట కథకుఁ జిక్కదనమిచ్చు సాధన సంపత్తి. నేఁటికిని మన కథాసాహిత్యములో దీనిని నిర్భరత యని యవశ్యము మన్నించుచున్నాము. వ్యాసుని నియోగము, కుంతియానతి, ధర్మార్జునుల ధర్మజ్ఞత, సనాతనాచారము, దివ్యశక్తులున్న మానవుల విషయము నగుటవలన నీ పంచభర్తృకత్వవిషయమును గథకుఁడెంత సోపపత్తికముగ గ్రథించెనో మనము పరిశీలించినచో జాలును. సహృదయ విమర్శకు లాకథనసామర్థ్యమును దదౌచితిని బ్రశంసించి, తమ ధర్మమును నిర్వర్తింపఁగలరు. దానిని ధర్మమట్లుఁ జూపుటయే కథలో విమర్శకులకు ముఖ్యము. యథార్థముగ నది ధర్మమగునో కాదో నిర్ణయించుట కావ్యకర్తల పనియు, విమర్శకుల పనియుఁగాదు. అందలి ధర్మాధర్మ నిర్ణయకార్యము ధర్మశాస్త్రకర్తలయు, ధర్మస్థానములయుఁ జాలఁబడఁగలదు.

ఈ పాంచాలీ పరిణయ సందర్భముననే యుద్ధము ప్రవర్తిల్లినది. అందు కృష్ణుని పాత్రపోషణములో గథకునకుఁ బ్రధానములగు మానవ మనోధర్మ పరిజ్ఞానము, లోకజ్ఞతయు వెల్లడి కాఁగలవు. యాదవులను స్వయంవరమునఁ బాల్గొన నీయమియు, బ్రాహ్మణులఁజూచి యెల్లరాశ్చర్యపడునపుడు ముందు బలరామునిలోఁ బరచుటకై యతనికి వారిని భీమార్జునులుగా దెల్పుటయుఁ గౌరవులకు భీతిఁగొల్పుటయుఁ బాండవుల నూఱటనొందునట్లుఁ బరామర్శించుటయు, ననునవి శ్రీకృష్ణుని బాత్రపోషణకు హేతువులగుట మనకు ముఖ్యముగాదు. పురాణాదులలో భగవంతుఁడైన కృష్ణుఁ డీకథకుని చేతిలో నాదర్శప్రాయుఁడైన లౌకికవ్యక్తియై మనకు నిత్యసన్నిహితుఁడగుటచే బ్రియమును గూర్చుట ముఖ్యము.

## -: నలోపాఖ్యానము :-

ఆఖ్యానము పూర్వవృత్తకథనము. ఉపాఖ్యాన (క) ము ప్రధానకథలో వచ్చెడి యవాంతరకథ తనవలెనే కష్టము లనుభవించినవారు పూర్వముండిరని ధర్మరాజు తెలిసికొనుటకు బృహదశ్వుఁడు చెప్పుచున్న యుపకథ యిది. వేద్యము నలుని వృత్తాంతము. ఎవరి కొఱకు ? ధర్మజుని కొఱకు. ఎట్లువిదిత పఱుపఁబడినది ? ప్రధానముగఁ జేసిన దమయంతిప్రయత్నములమూలమున, దనవలన భార్యగాక, భార్యవలనఁదాను కష్టనివృత్తిఁబొందిన యొకనిచరిత్ర విననపుడేగదా, తన్నుమీఱి కష్టపడిన వారున్నారని ధర్మజుఁ డూఱడిల్ల గలుగుట ! మఱి దమయంతి చరిత్రయా యిది ? కాదు దమయంతీ కృతయత్న ఫలభోక్తయగు నలుని చరిత్రయే ! కథలో భార్యాభర్తలది సాధనసాధ్యసంబంధము. ఇందు దమయంతి యనుభవించిన కష్టభాజన జీవిత వర్ణనమువలనను నామెకే ప్రాధాన్యమిచ్చుచున్నట్లగపడును. ప్రధానుల పనుల నితరులచే చేయించిపెట్టి వారిగౌరవమును గాపాడుట లోకసామాన్య

ధర్మము. అందుచే దమయంతికిఁ గథోత్తరభాగమునఁ బ్రాధాన్యమిచ్చి, లోకసాధారణ వ్యాపారమునుండి కళారహస్యసూత్రము నొకదానిని నన్నపార్యుఁడు ప్రవచించినాఁడు. పూర్వలోక గ్రంథమునకుఁగాని, యాధునిక లోక కథకుఁ గాని యీ యీ లక్షణములనుబట్టి పేరిడుమని నిర్ణయించునపుడు వారి వారి మనోవీధులలో బ్రధానముగఁ "బాఠకుల నాకర్షించుట యెట్లు? అను సంశమే యుండును. అప్రధానమైన దానిని జెప్పిప్రధానమైనదానిని వ్యంజింపఁజేసినపుడు వాచ్యముకంటె మనోజ్ఞమైన వ్యంగ్యము, పఠితల మనోముకురముల యందుశాశ్వతముగ హత్తుకొనిపోఁగలదు.

ఈ నలోపాఖ్యానమును బూర్వార్థమనియు, నుత్తరార్థమనియు విభాగింపవచ్చును. ఈ రెండుభాగములయందు ననేకాంశములు వచ్చును. కేవల మొకే యంశమునందు వ్యగ్రత లేమిచే నేఁటి పరిభాషలో గథానికవంటిది యనలేము. అనేకాంశములున్నను నవి యేకతః సూత్రితములై నలదమయంతుల జీవితవృత్తాంతమును జెప్పుచున్నవి. కావున నవలవంటిదిది యనవచ్చును. ఇందు పూర్వార్థమున ముఖ్యముగ హంసదౌత్యము, నలదౌత్యము, దూత్యము, వనగమనము నని నాల్గు సుందర సన్నివేశములు గూర్పబడినవి. ఉత్తరార్థమంతయు దమయంతి కష్టమయ జీవితమును దమయంతీకృత భర్తృ సంపాదనయత్నకార్యసిద్ధియుఁగలది.

ప్రథమ ఖండమందున్న నాల్గు సన్నివేశములలో హంసదౌత్యము మొదటిది. ఈ హంస సుచిత్రమైనది. కథకుఁడు దా చెప్పుదానినిబట్టియు దాని ప్రవర్తనమును బట్టియుఁ బరిశీలింపఁగా ( వాయుమండలములనుండి యవతరించినది గనుక ) నీ హంసరూపమున వాయువుతనువుగాగలిగిన దేవతాత్మ, భూలోకమున నవతరించె నన్నస్ఫూర్తి కలుగుచున్నది. దానినొక స్వరాట్టు లేదా యొక పరమహంస యనుకొనవలెను. ఇట్టి వానిని మనయూహావధికి వదలుట యేగాని చెప్పుకొనుచు బోవుట కథనవైఖరికాదు.

ఈ యూహకైన నొక హేతువుండవలెనుగదా యన్నచో, నదియున్నది. దమయంతికి నలునకు సంగమకారణభూతయైన కలహంస[1] మది. అనఁగా వారి సంగమకారణమే జన్మగాఁగలదూత యని చమత్కృతి. ఈ హంస మఱియింకొక కారణమునకుఁ బనికిరాదు; వచ్చుచో బంచతంత్రాది కథలలోని పక్షులవంటిదిగా దిగజారి పోవును. అట్లుఁ గాకుండుటకొఱకై నిరుపపత్తికముగ మనము కల్పించుకొనుట ధర్మమా ? లేకేమి యుపపత్తులున్నవి. ఈ హంస పరమశివుఁడని శివ పురాణాంతర్గతమైన యూహుకభిల్లుని కథవలన విశదము.

1. ఆరణ్య. ద్వితీయ. సంపుటము 2, పుట 50, పద్య 18, వావిళ్ళ-1955.

రెండవది నలదౌత్యము. దమయింతీనివేశంబుఁ బ్రవేశించునపుడు నిన్నెవ్వరు వారింపనోడుదురని యింద్రుని వచనము. అందుచే నశంకితుఁడై నలుఁడు దమయంతీ గృహముసొచ్చినాఁడు. నలునిరూపు బయలుగాకుండఁ జూడవలసిన బాధ్యత దేవతలది. కావున వారాతనిని సాధనముగాఁ జేసికొన్నను వెంటనంటి యుండితీరవలసివచ్చినది. సరే వారు సర్వాంతర్యాములు, సర్వవ్యాప్తులును. అట్లు వారు కాపాడుచుండ "నతనిని జూచి యితఁడపూర్వమనుజుఁడెందుండి వచ్చెనోయనుచు" లతాంగులెల్ల నదరిపడనేల ? తమపనినిమిత్తమునఁబోయి నలుఁడు దమయంతినిజూచి కందర్ప శరావిద్ధుఁడైనప్పుడుగూడ దేవత లాతనిరహస్యమును గాపాడుదురా ? నలుని ప్రవర్తనపై దేవతలు తమతమ యధికారముంచుకొనిరన్న మాట. అతఁడువెంటనే విరహవ్యథ నడచుకొని తాను తానై దూతనని తెలిసికొనవలెను. ఇది యంతయు నూహితవ్యమైన యర్థమే.

పిదప నాల్గవసన్నివేశము ముఖ్యమైనది1. అది వనగమనము. ఆస్థితిలో నున్న మహా పతివ్రత కామనిశాతశరాహతుఁడైన యాకిరాతుని కంటి కేక్రమమున సౌందర్యాధిదేవతగా నగపడెనో, తన్మహాభిక్రమమంతయుఁ గథకుఁడామె స్నానానంతరవర్ణనలో గ్లప్తముగ గుప్తపఱచినాడు. ఈ పాపచింత కామెశపించుట, వాఁడుదగ్ధుఁడగుటయు మెఱపుమెఱసినట్లు జరిగిపోవును. సార్థవాహులలో నామెను వెక్కిరించినవారున్నారు. దీనావస్థలోనున్న స్త్రీనిజూచినపుడట్లు నిరాదరణము చూపు మందబుద్ధులు నాఁడును నేఁడునున్నారు. వారి వారి ప్రకృతులనుబట్టి రాత్రి నిద్రపోవునపు డేనుఁగులు దబాటునవచ్చి వారిపైఁబడి చంపినవి; వికలాంగులను చేసినవి. ఏనుఁగులనఁగా నజ్ఞానస్వరూపములు. అజ్ఞానులకుఁ దత్తదుచిత వేదన తప్పదు. ఆమెను "నీవు దేవత" వని నమస్కరించినవారు మరణింపలేదు. అనఁగా ధర్మప్రవర్తనమునకింకను లోకమునఁదావున్నదన్నమాట.

ఇందు కిరాతునియు, సార్థవాహులయుగతి వలన ధర్మప్రవర్తనమునుగూర్చి కాంతాసమ్మితముగా కావ్యోపదేశము జరిగినది. ఇన్నిశతాబ్దులుగడచిన పిమ్మట నేఁడుమాత్ర మేసాహిత్యప్రక్రియగాని, యేదోయొక ప్రధానాశయము లేక రాణించు చున్నదా ? ఈ కాంతాసమ్మితబోధ2కుఁ బాశ్చాత్యులందఱు సుముఖులే యన్నచో నది సాహసముగాదు.

కథలో నుత్తరభాగము నలదమయంతు లిర్వురు విడివడి యుండుట, యావత్కథకుఁ బ్రాణభూత మీ ఘట్టము. పూర్వభాగమందలి సన్నివేశములవంటిదికాదిది. నాయికానాయకులు పడినకష్టములు తత్సంబంధసామగ్రియు నిందుముఖ్యము.

1. ఆరణ్య, ద్వితీయ, సంపుటము 2, పుట 53, వచనము 38, వావిళ్ళ 1955.
2. Delightful instruction.

నిజమునకు కష్టముల పరీవాహము దమయంతిపాలు ; కష్టములలోఁతు నలునిపాలు. కష్టముల మొత్తమామెపాలఁబడుటచే దమయంతియందు కార్యకరణము ప్రదర్శింపఁబడినది. కష్టములలోఁతనుభవైకవేద్యము ; అందు కార్యకరణ మంతగా నుండదు. భార్యను భర్త సంపాదించుకొనవలయును; అట్లుఁగాక తన్నుభార్య సంపాదించుకొనవలసిన దుస్థితి యిపుడు నలునిది. ఇట్టి భర్తయందుఁ బ్రవర్తన మెట్లుఁ జిత్రింపఁ బడఁగలదు? కాని యతఁడు బాధపడుట లేదని యర్థమా ? కాదు. పరిస్థితుల కధీనుఁడై, వివశాత్ముఁడైయుండి లోలోపల బాధపడుచుండును. ఆబాధ ననుభవించుటయే యతనివంతు. నలదమయంతుల దిందు సాధ్యసాధన సంబంధము.

ఇందుచే నీ యుత్తర కథా ఖండమున నాయికయందే కార్య కారణభారము మోపఁబడినది. అది సామాన్యభారముగాదు. అటు భర్తృగౌరవాదులు కాపాడుచు నిటు 'బాహుకుఁడే' నలుఁడని తానుగుర్తించి పోల్చుకొనుచు మాతాపిత్రాది లోకమున కామె వెల్లడించుచుఁ బోవలసివచ్చినది. ఈ కార్యభారములో ననేకపర్యాయములు క్లిష్టసమస్యల నెదుర్కొనుటయు వానిని బరిష్కరించుకొనుటయు జరిగినది. అందు దమయంతి పరముగఁ దీవ్రసమస్య లుద్భవించినవి. బాహుకుఁడే నలుఁడని పరిష్కరించుకొనుటలో గ్లిష్టమైన యంతర్ద్వంద్వము ప్రదర్శింపఁబడినది. ఏ సాహిత్యప్రక్రియకిది వన్నెఁగూర్పదు ? ఇది మన యాఖ్యానములలో నిబిడముగనున్నది. కాని నిగూఢము. పాఠకులు సునిశిత పరిశీలనము బఱపినచో నిది మనకుఁ బూర్వులనుండి యుపలభ్యమైనదే యని తెలియకపోదు. అంతర్ద్వంద్వాదులు నిబిడమయ్యు, నిగూఢమైయుండుటచేతనే యాఖ్యానాదులది విచిత్రమైన రచన మనుచున్నాము. ఇందు మనమే ప్రశ్న పుట్టించుకొని, మనమే సమన్వయించుకొనవలెను. వారిది సంయమము నెఱిఁగిన శైలి. పరువముచెడని, వెలితి యెఱుఁగని రచనా పటువులైన వచన కావ్య ప్రక్రియలు నేఁడున్నచో నవి మన యాఖ్యానములకు దాయబంధువులు. అట్టివి లేక యిట్టివి పుట్టవు.

ఎంత సంయమచిత్తులకును గ్లిష్టదశలు ప్రాప్తించును. అనసూయాసుంధతులు దమయంతీచంద్రమతులు మున్నగు మహాజ్యోతు లెట్టివో మన జాతికిఁ దెలియవచ్చినదియు, నవి నేఁటికిని సజీవములై మనహృదయములలో మెలఁగు నదియు, నీ యంతర్ద్వంద్వములలో నవి యవలంబించిన పరిష్కార మార్గమునుబట్టియే ! కవికుల చక్రవర్తియైన కాళిదాసు యొక్క శకుంతలను ఋత్త్రిపరిగ్రహతుమురాలిగా నిర్ణయించిన యంతఃకరణప్రవృత్తియే నన్నపార్యుని యొక్క బాహుకుని గూడ దమయంతీపరిగ్రహయోగ్యభావందితనలునిగా నిర్ణయించినది.

ఈ సన్నివేశముననే యింకొక రహస్యము కలదు. బాహుకనలత్వమున మనఃక్షోభము నొంది యొంది యున్న దమయంతి, కేశిని క్రమ్మఱి వచ్చి చెప్పఁగా సంతసించి, యొక నిశ్చయాతి నిశ్చయమును బ్రాపించును. ఈ సంగతి కవిచెప్పునా?

చెప్పరాదు. "సందియ మేల ? సర్వగుణ సంపదఁ జూడఁగ బాహుకుండు భూవంది తుఁడైన నైషధుఁ డవశ్యముఁ దానగు"1 నన్న హఠాత్ప్రారంభము నందామె యధిగమించిన దృఢనిశ్చయము తళుక్కు మనుచున్నది. నేఁటికిని మన కథాసాహిత్యమునం దీహఠాదారంభమే శిల్పేందిర. ఒక విశిష్టమైన యారంభము, నొక విశిష్టమైన సమాప్తియుఁ గథాసాహిత్యమున నేఁడు గూడ జీవలక్షణములుగా బాటింపఁ బడుచున్నవి.

కథా సంవాద విధానముల బోధయు మన కాఖ్యానాదులలో గర్భితమై యున్నది. దమయంతి బాహుకు నొద్దకుఁ గేశినిని రెండు పర్యాయములు బంపినది. మొదటిసారి వృత్తాంతము కేశినీ బాహుకుల సంవాద రూపమునఁ గలదు. రెండవసారి కేశిని తాబోయి వంటఁజేయు చుండఁగా నలుని జూచి వచ్చిన వృత్తాంతము, కథన రూపమునఁ గలదు. దానిని దానివలె దీనిని దీనివలె చెప్పుటయే సంవాద కథన రీతుల యౌచితీనిష్పత్తుల నెఱుఁగుట. నాన్యతో దర్శనీయమైన యీ పరిజ్ఞానమే నేఁటికినైతము మనకథాసాహిత్యజ్యోతికిఁ బ్రాణము పోయు చున్నది.

మనః ప్రవృత్తి నిదానము గూడ మన కాఖ్యానాదు లిడిన భిక్షమే. తన మాఱిన రూపము శాశ్వతముగ మాఱుట యగుచో నలుఁడు తాను నలుఁడ నని యంగీకరింపఁడు. అంగీకరించిన నేమి ప్రయోజనము? దమయంతికి బాహుకుఁడైనను నలుఁడు నలుఁడు గావచ్చును గాక ! తమ యిర్వురి నడుమను లోకమున్నది; కులప్రతిష్ఠలున్నవి. వానికి బాహుకుఁడు నలుఁడు గాఁడు. పునః సమాగమమునకు వీలు కుదరదు. అందుచే నట్లుండిపోవనైన నుండిపోవును గాని, తన బాహుకత్వము శాశ్వత మైనచో నలుఁడు నలుఁడనని చెప్పుకొనఁడు. దమయంతికి రహస్యము దెలియును. అతఁడిచ్చట నలుఁడనని యంగీకరించినాఁడు; తన హృదయగత భావములను గోపనము చేయలేదు. కావున దమయంతి చేసిన మనః ప్రవృత్తి నిదానము తిన్ననైనది.

క్షుభితాత్ములు మనోవృత్తుల నెంత మూఁచూడఁగల్గినను దమ నిశ్చితాభిప్రాయముల కెంతటి యంతరాయము గల్గినను వారి కేర్పడుచుండు విశ్వాస కాంతి పుంజనముననే యొక యవిశ్వాసపరిధియుండును. అ ట్లవిశ్వాస పరివేష్టమగుటచేతనే దద్విశ్వాస ముపాధిభేదమువలన మఱియుఁ బ్రకాశ్తి నొందఁ గలదు.

---

1. ఆరణ్య, ద్వితీయ, సంపుటము 2, పుట 72, పద్యము 203. వావిళ్ల (1954).

దమయంతికి బాహుకుఁడే నలుఁడన్న విశ్వాసమున్నది. కాని యనుమాన భస్మావృతమైన హోమాగ్నికణ మది. ఈ మనస్తత్త్వ మానాఁటికి మన యాఖ్యానములలో గాని నేఁటి మన కథాసాహిత్యమునఁగాని పెక్కు అగు నాయికా నాయకుల కవస్థానుగుణమై యావహిల్లుచునే యుండును. ఇది విశ్వాస దీప కళిక చుట్టునుండు నొక యవిశ్వాస ధూమరేఖ. ఇది జీవితము నందెంత సత్యమో కళయందు సహిత మంత సత్యము. కవిత్వమునకు, నభినయమునకు, సర్వకళలకు నంతస్స్పర్శ కావలెనందుము. అనఁగా నూఁటికి నూఱుపాళ్ళంతర్విశుద్ధి యని కాదు. కవిగాని, సహృదయుఁడుగాని, తాను రామఁడ ననుకొన వలెను. నటుఁడు గాని, సామాజికుఁడు గాని, తాను దుష్యంతుఁడ ననుకొనవలెను. అది మధుమతీ భూమిక. కాని యీ యనుకొనుటలో మఱల తాను దానన్న పరిజ్ఞానలేశ ముండవలెను. ఇవిగాక కొన్ని వచ్చిపోవు భావశకలము లుండును. అవి పరిస్థితి ప్రభంజనమునఁ దేలియాడు భావతూలికలు. ఈ భావశబలత్వమును గూర్చియు మన లక్షణగ్రంథములు చెప్పిన దానికి లక్ష్యములు మన పూర్వాఖ్యానములలో ననంతముగా నున్నవి. కుంతికిఁ గర్ణుఁ డుదయించినాఁడు. వాని నచట దించి పోవలెనని బుద్ధిపొడముచున్నందుల కామెకు వగపు; ముందా యూహ యేలగల్గెనని వగపు. క్షణ మమర్ష, హాసము, క్షణము చింత, క్షణమానందము, మున్నగు వానిచే గలుగు నంతర్ద్వంద్వము వలన పాత్రలు జవము జీవము గలిగి తొణికిసలాడ నిచో నేఁడును మనల నాకర్షింపవుగదా? కావున సజీవ పాత్ర చిత్రణమునకు భస్మ మధ్యమున నగ్నిపుంజముండుట వంటి మనఃస్థితియు, నంతర్బుద్ధ పరిష్కారదక్షమైన మనః స్థితియు మున్నగు నవి సాధనములు.

విషయవివరణ సంగ్రహతలనుగూర్చిన మాట యొకటి. అది శకుంతలా నిరాకరణోద్యోగ ఘట్టమైనచో నచట దుష్యంతుని విస్రంభార్థ భావవివరణమౌచితీ విలసితము. అది శకుంతలకు భర్త్రభిముఖత్వ వాంఛగల ఘట్టమైనచో, నచట భావ సంగ్రహత యౌచిత్య పోషకము. తన ధర్మపత్నిని దన విరహ భార వినమ్రముగా జూచుటయందే పతిదైన యాభిముఖ్య సర్వస్వము నిమిడియుండును. అక్కడ కాళిదాసుని శకుంతలయు నిక్కడ నన్నయ దమయంతియు, భర్త్రనుకూల వాంఛా సనాథలు. కావున సర్వ బావములను సముదాయించి చూపవలసిన యావశ్యకము లేదు. సంగ్రహతా వైపుల్య వైశద్యాది లక్షణానుకారి గాని రచయితకు రాణయు, నట్టి రచనకు భావపోషక రంజనయు రావు.

అనంతముఖ శిల్పసంపద యొక నలోపాఖ్యానము నందే లేదు. శకుంతలోపాఖ్యానమును గూడ బరిశీలింపవలెను. "ఇది మునికన్య యేని మఱి యేలకో! యీ లలితాంగి యందు నాహృదయము తద్దయుందగిలె" నన్న పద్యమున్నది. అతఁడు సందేహించి యామెను జన్మవృత్తాంత మడిగినాఁడు. ఆమె చెప్పినది. సందేహ

నివృత్తియైనది. అప్పుడు "ఇది మునినాథ కన్యయని యెంతయు నిస్పృహా వృత్తి నున్న నాహృదయము" అని యింకొక పద్యమున్నది. ఇవిరెండును సందేహమున కాద్యంతములలో జెప్పఁబడినవి; తుల్యారంభములు గలవి. ఆరంభోపసంహారముల యందు తుల్యతఁ జూపుట నేఁటి కథా సాహిత్యమునం దొకశిల్పధర్మము. మానవ జీవితము మనమనుకొనునంతటి తులితము[1]ను, బరిపూర్ణవర్తులాకారము[2]ను గాదనెడి వాదము వేఱు. ఆవాదానుసారముగ హఠాత్సమాప్తములగుఁ గథాసాహిత్య ప్రక్రియలు నున్నవి.

## -:ఋష్యశృంగుని చరిత్ర:- [3]

ఈ కథ యదమ్యా వికారమున కుదాహరణము. ఋష్యశృంగుఁడున్న చోట వర్షములు కురియును. అతఁడిప్పుడు తండ్రియాశ్రమములో నగరముల నెఱుఁగని తపస్వియై యున్నాఁడు. అంగదేశములో వానలు లేవు. ఇందుచే నిచట కాయవ రావలెను. ఆశ్రమ మనఁగా నాత్మనిష్ఠ. నగరమనఁగా శరీరనిష్ఠ. అది స్త్రీ పుంస విభేదము లేనిది; ఇది యది కలది. నివృత్తిమార్గములో నున్నవానిని బ్రవృత్తిలోనికి దింపవలె నన్నమాట. ఇంద్రియ ప్రవృత్తి యగోచరము కాఁగా నేర్పడినది యాత్మ వృత్తి. ఆ యాత్మ వృత్తిలో నున్న నివృత్తాత్ముని బ్రవృత్తాత్మునిగా జేయుటకు సర్వసాధారణ ప్రజ్ఞచాలదు. దానికొక క్రమపద్ధతి నవలంబింపవలెను. లోకవృత్త మెఱుఁగని వానికి శరీర గత వాంఛల రేకెత్తించుట యందుఁ పూనెడి సక్రమ పద్ధతియే యీ కథానిష్ఠ శిల్పసామగ్రి.

---

1. Symmetrical.
2. Rounded whole.
3. ఆఖ్యానము, ఉపాఖ్యానము, చిత్రాఖ్యానము, తంత్రాఖ్యానము, కథ, వృత్తాంతము, సంగ్రహము, వివరణము, చరిత్ర, సంవాదము, వర్ణనము, అభివర్ణనము, ఇతిహాసము, ప్రకారము, క్రమము, వ్రతము, సంవాద ప్రకారము, గీత, (హంసగీత, సంపుటము 6, భారతము, పుట 221) విధము, వివాదము-ఇట్టివే మనకు భారతమునఁ దఱచుగ వచ్చు పదములు. ఇవి వివిధ సాహిత్య ప్రక్రియలగుచో, వీని కెట్టి నిష్కృష్టార్థమును గాని, మన లాక్షణికులు యాయా కాలములలో నవి పొందిన విపరిణామార్థములను గాని, మనకై పొందుపఱచి యుండుటలేదు. ఇచ్చినంతలోఁ 'దృష్టార్థ కథన మాఖ్యానము; శ్రుతార్థకథన ముపాఖ్యానము' వంటివి తప్ప, కడమవి నైఘంటికు లిచ్చినవే ప్రమాణములు. వానినిచ్చుటఁ బేర్కొన నక్కఱ లేదు. అవి భిన్న భిన్న ప్రక్రియలై విశిష్టార్థ ప్రయుక్తములైనచో వాని లక్షణమును బూర్వులు మన కందీయ లేదను కొనుటకంటె మనము ముందు యుగముల వారికిఁ దోడ్పడుటకై యిట్టి నేఁటి ప్రక్రియలలో గొన్నిటి లక్షణములనైన నిరూపించుటయే యీ గ్రంథమున మన కర్తవ్యము.

ఆక్రమ మిట్టిది:-

(౧) వారకాంత ఋష్యశృంగుని బ్రబోధించుట లోకములోనికి జార్చుట.

(౨) విభాండకుఁడు కొడుకగు ఋష్యశృంగుని బ్రబోధించుట.

(౩) తరుణి మునినందనుని జిత్తమునకు వైకృతము చేయుట.

ఈ మూఁడు దశా విశేషముల చుట్టును గథ పరిభ్రమించి పరిపోషణమొందినది. వేశ్యచేసిన యౌవన రహస్య ప్రబోధము లౌకికమైనది. దాని నుపరంజన మందుము. ఋష్యశృంగుని లోకము లోనికి జార్చుటయే దాని యుద్దేశము. అనఁగా నింద్రియ ప్రవృత్తాత్ముని జేయుట. నైతిక పతనము నాతఁడు పొందలేదు. మనోరాగ రంజనమే పొందెను.

ఆమె యాలింగనముచే దనయందుద్బుద్ధమై ప్రబుద్ధమైన శక్తియేదో యతనికే తెలియదు. అది లైంగిక జ్ఞానాతీతమైన యొక మనః ప్రవృత్తి. భావుక లోకమున కది యూహాగమ్యము. దానిని జిత్రించుటయే కవికిఁ బరీక్షా స్థానము. ఒక స్వరూప ఫలావగతి [జ్ఞానము] లేని యొక శక్తి, యొక మనోవృత్తి తన యందున్నదని పాత్ర గ్రహించునట్లుఁ జిత్రించుటయుఁ గాదది. ఆ యాలింగన ప్రక్రియా కేళీ ప్రబోధము వలన వాని శరీరము తన్మహో విషయాభిముఖమై ప్రజ్వరిల్లిన దన్నట్లు లిఖించుట యది. అనఁగా వారకాంత ప్రబోధముచే బ్రవృత్తి కాభిముఖ్యము గల్గింపవలెను. ఇచటఁ గథకునిచే బ్రబోధ శబ్దము, తత్పూర్వము నిద్రాణమై యున్న యొక శక్తిని రెచ్చగొట్టుట యను లౌకికార్థమునం దనుప్రయుక్తము. అతని యమాయికత గుర్తించి సత్కారముగొనుటకు నియమమేర్పఱచినది. ఆ బీజావాపమే తదుపరి దశలలో బరిణతి నొంది కార్యసాధనకు హేతువైనది.

యథార్థమైన ప్రబోధ మాత్మ విషయము. అది రెండవ దశ. ఆ ప్రబోధము తండ్రివచ్చి చేసినాఁడు. కుమారుని దేహేంద్రియ భ్రాంతిని నివర్తింపఁ జేసి, యాత్మ జ్ఞానమును బ్రవర్తింపఁ జేయుటకుఁ గొడుకును మఱలఁ బ్రబోధించెను. తపోవిఘ్నకారులగు రాక్షసుల కృత్యమనినాఁడు తండ్రి. కొడుకున కది చాలును. తపస్య దేవతాలక్షణము. దాని కెదురొడ్డుట రాక్షస లక్షణము. ఈ వేశ్య తపోవిఘ్నకారిణియేగదా మఱి! వేశ్య చేసినట్టి యౌవన దశాగత దేహేంద్రియ జ్ఞాన సంబంధి ప్రబోధము నిజమునకుఁ బ్రబోధమే కాదు. తండ్రిచే మఱలఁ బ్రతిష్ఠింపఁ బడిన ఋష్యశృంగుని దైనయీ స్త్రీ గతవాంఛా సర్వవిరహిత విచిత్ర తపస్సహిత మనోవ్యాపారమే యథార్థముగఁ బ్రబోధమని చెప్ప వీలైనది.

పిమ్మటిది మూఁడవదశ. తరుణివచ్చి మఱల నతని చిత్తమును వైకృతము చేసినది. ఇది సర్వజనులకు యౌవనోదయ వేళా విశేష సంభవ వికారమే! ఈ ముని తనయునకు మాత్రమది క్రొత్తది. ఏలన, లోకమువార మెప్పుడు తద్వికారమునందే నిష్ఠిత బుద్ధులమై యుండి దానినే ప్రబోధ మనుకొనుచున్నాము. ఈ వైకృత భావ సాతత్యము నిత్యానుభూతి విషయముగా నుండుట వలననే మన మట్లనుకొనుట. ఋష్య శృంగుని సంగతి మనవంటిది కాదు. అతఁడు జన్మచేతఁ, బరిసర ప్రభావముచేత శరీర గత వాంఛా విక్రియాపేతమైన పరిస్థితిగత నిష్టాగరిష్ఠుఁడు. కాని తొలుతఁ దన యందా కోర్కెలు లేనితన మున్నదని యాతఁడెఱుఁగఁడు. వారకాంతవలన నా లేనితన మున్నదని తెలిసి కొనినాఁడు. తండ్రి వచ్చి యా లేనితన మున్నదన్న భావమును బోగొట్టి వికారమును బాపి తత్ స్థానమున మఱల ప్రబోధమును బ్రతిష్ఠించినాఁడు. దీనితో మఱల వారకాంత కొంత క్లిష్ట దశను బ్రాపించినది. ఆమె యతనిని మఱల ప్రబోధింపవలెనా? అక్కఱ లేదు. అది యిదివఱకే జరిగినది. ఇపుడు కేవలము వికృతిగొల్పుటయే, ఆ వైకృతము సేయుట యామెకు వెన్నతో బెట్టిన విద్య. దానితో ఋష్యశృంగు నంతటివాఁడు తండ్రితో జెప్పక యంగదేశము జేరుకొనెను. ఈతని వికార దుర్ధమత వలన నాదేశపు రాజు కోర్కెదీఱునట్లుఁ జిత్రించుట కథాకథన మర్మ మెఱుఁగుట.

ఈ మధ్యదశాపోషణము ప్రథమాంత్యదశా పోషణముకంటె కష్టసాధ్యము. ఎట్లన, లౌకికమైన వికాసము బాహిరము నుండి యంతర్గతమగును[1]. ఇప్పుడితనికిఁ గావ[2]లసినది యలౌకిక వికాసము. దీని నంతరమునుండి బహిర్గతము చేయవలసి వచ్చినది. ఇది కథకుని వర్ణనాచాతురికి నికషము[3]. అందువలననే యాకుమారుని యమా యికతయు, నా తండ్రి సంయమిత వాక్కును బరీక్ష కాఁగునట్లుఁ జిత్రింపఁ బడినవి. ఆమె చల్లిన యా మాయాపుష్పములు చెదరి "యశిప్రకర నిషేవన మొప్ప" నుండుట మున్నగు వర్ణనలలోని వైశద్యము వలనఁ గథా కర్తకుఁ గావల సిన లోకపరిశీలనా నైశిత్యమెంతయో కూడ వెల్లడి యగుచున్నది. లోక పరి జ్ఞాన విరహితుల రచనలు నేఁడు మాత్రము మన్నన నొందుచున్నవా? ఆ జ్ఞానమె ప్పటికిఁ గూడఁ గథకునకు సామగ్రి సంపదయే!

---

1. Manifestation of the outer-Inner.
2. Manifestation of the Inner-outer.
3. అలౌకిక విజ్ఞాన మాత్మసంబంధి. లౌకికము మనస్సంబంధి. ఈ విషయములు "తెఱచిరాజు" నవలయందు నిరూపితము. అం దాత్మనిష్ఠితమైన జ్ఞానమును వాసంతి మనః పర్యంతము వ్యాపింపఁ జేసికొనును; కిరీటి మనోనిష్ఠితమైన విషయము నాత్మ పర్యంతము వ్యాపింపఁ జేసి కొనును.

నేఁటి మన కథాసాహిత్యమునకుఁ గథా కథన విషయమునఁబూర్వులుచెప్పిన యాఖ్యానోపాఖ్యానము లెట్లుఁ దోడ్పడినవియు సౌకన్యాఖ్యానము[1] ను బట్టి కూడ నిఁక నిరూపింపఁబడును.

సౌకన్యాఖ్యానము యౌవన పదమునకుఁ బర్యాయ పదము. తద్విషయమును విపులముగ వివరించుట గాదు, కథకుని ధర్మము. దాని నించుక సూచించుట, పటువుగ దాని పరిణామమును నిరూపించుటయు. నతని కర్తవ్యములు. కడువ్యస్తముగ నున్నట్లుఁ గొన్ని విషయముల నగపఱచి వాని కొక సమీచీనతఁ గల్పించుట యిందలి మర్మము.

తండ్రియగు శర్యాతితో విహారార్థము పోయి సుకన్య పుట్టగ్రొప్పించుట పడుచుఁదనఁపు పనియే. చ్యవనుఁడు సద్యస్సంజాత బుద్ధి సంభ్రమయగు నామెను శిక్షింపక సేన కేల నిరోధము చేయవలెను ? ఇతఁడు మాత్రము సామాన్యుఁడా ! కీలెఱిఁగి వాఁత బెట్టు వాఁడు ; సుకన్య తనకు భార్యగా దగినదని యిదివఱకే యెఱిఁగిన వాఁడు. ఆమె కగపడని వాఁడు, శర్యాతి కగపడి నీ కూఁతును బరిగ్రహించి గాని క్షమింప ననెను. పోని యౌవన దోషమొక్కటివినా సుకన్య యందితర దోషము లున్నవా ? తండ్రి సైన్యనిరోధముఁ బాప నామె కృశ త్వగస్థిభూత శరీరు నతివృద్ధుని బెండ్లియై భక్తితో బరిచర్యలు చేయుచున్నదే ! పోనిమ్మని చ్యవనుఁ డూరకొనెనా ? ఊరకొన్న భార్యను గికురించుట పతి కొక క్రీడ. అందుచే నామెను బరీక్షించుటకై యాశ్వినేయులను బుచ్చెను. ఇది యంతయుఁ గవి కథలో జెప్పఁడు. మనము కల్పించు కొనుటకు వదలి వేయును, వారువచ్చి తన్ను "నీ వయో రూపములకుఁ దగినవరు వరింపుము ; మేము వానిఁ దెచ్చెద" మనిరని సహింపనిదై భార్య చెప్పఁగా, బతి యగు చ్యవనుఁడు సంతసిల్లెనఁట ! రహస్య మందున్నది. పతికి సతిపాతివ్రత్యము సంతోష హేతువే గదా ! సంతసిల్లి చ్యవనుఁ డామెను వారి మాట కొడంబడు మని పంపెను. ఆమె వివేకవతి; భర్త యభిప్రాయము తెలిసి కొన్నది. వారు దేవతలు. పతి యువకుఁ డగును. పోనిమ్మని పోయి, తనకు యౌవనవరు గావింపు మన్నది. వారు ప్రబోధించి నట్లు రూపవంతుని గూడఁ గావింపు మని యామె కోరదు. ఆమె ప్రవృత్తి యట్లు మాఱినది, భర్తకు యౌవనము లేక పోయినను నామెకు దిగులు లేదు. ఆశ్వినులతో సరః ప్రవేశము చేసి యౌవన వంతుఁడు మాత్రమే యై రూప వంతుఁడు గాని తనపతి తనకు నిట్టి నిల్వున తెలియుచునే యున్నాఁడు. వారు "మా యందు నీ వలచు వానిని వరియింపుమ" నఁగా నామె భార్గవునే వరించినది, చ్యవనుఁ డామె యందేగాదు ; ఆమెను దనకు భార్యగా నిచ్చిన శర్యాతి యందును,

1. ఆంధ్ర మహాభారతము – ఆరణ్య – ఆశ్వాసము 3. పుట 113, వావిళ్ల (1955)

దన్ను లబ్ద యౌవనుని జేసిన యాశ్వినుల యందును గూడ నీ సన్నివేశముచే బ్రీతుఁడై నాఁడు. అప్పుడాతఁడు మామ చేత యజ్ఞము చేయించి యాశ్వినులను సోమపానార్హులను గావించెను.

నేఁడును జీవత్కథలో స్థూలాంశములే పై కగపడును. చ్యవనుఁడు సుకన్య యందలి కోర్కెచే నట్లు చేసెనని సూక్ష్మపరిశీలనమునఁ గాని విదితము కాదు. కథా గత భిన్నాంశములను సమకూర్చుకొన్నఁ గాని యిది స్ఫురింపదు. ఇది నేఁటికిని మన నవలా కథానికలలో బాటింపఁ బడు శిల్పరహస్యమే. దీనిని బూర్వాఖ్యానముల నుండి మనము దాయధనముగఁ బూర్వపుణ్యముగా బుణికి పుచ్చుకొంటిమి.

"ఎఱుక గలరె? తరుణుల" ని తండ్రి వగచినందులకు సుకన్య యెంత జ్ఞానవతి యైనదని మన కానందాతిరేకము గల్గి తీరవలెను. సుకన్యాశీలమును బరిశీలింపఁగా నామె ఋషిదేవతాగత సమాదర బుద్ధి; యథార్థ ప్రవర్తనఁ గలది; దైవ భీతి గలది. పితృ గౌరవము గాపాడునది; ఒకప్పుడు రూపయౌవన గర్వితయే. కాని యాగర్వములో గూడఁ దత్సౌందర్య గుణమును యౌవనావస్థను విడి విడిగా జూచి తనయాత్మ వస్తువుతో వాని కెట్టి సంబంధము లేదని విస్పష్టముగ గ్రహించిన దనెడి యొక యూహను మనకుఁ దుదకుఁ గల్పించు యోగీశ్వరి యైనది.

ఒక వేళ నాశ్వినులు చ్యవనుని బంపున రానే లేదంటిము. చ్యవనున కేదేని లాభము చేసి తాము నొక లాభము పొందుటకై వారే వచ్చిరన్నను దప్పులేదు. దేవతాత్ములకు ఋష్యాత్ములు సువిదితమగుట యాశ్చర్యమా? అదియ కాని యెడల నిట్లుఁ గథయేసాగదు. ఏదో యిట్టి దానినే మనము కల్పించు కొనవలెను.

ఈ రీతిగఁ గథాపదకమొకటి వేసి నన్నయ తన వచోవైఖరిచేతను, ననల్ప భావము నల్పాక్షరములలో నిక్షేపించి మాటలాడు తన పాత్రల మాటల చేతను యావత్కథలోని శిల్పమును స్ఫురింపఁజేయును. రసధ్వనివలె దీనిని గథా ధ్వని యన్ననవచ్చునేమో!

నన్నయ పాత్రలు చాల వఱకు దేవతాసములు; నియమిత వాక్కులు. ఉత్తమ కథా శిల్పులందఱి వలె నీతఁడు పాత్రల ప్రవర్తనచే (మాటలచే గాదు) వారి వారి గుణములను ద్యోతకము చేయును. ముగ్గురు నల్గురు పాత్రలు ప్రతి యాఖ్యానములోను జాల కొద్దిగ మాటాడెదరు. దానివెనుక పెద్ద కథయు నొక పెద్ద పదకము నేర్పడి వారు మెలఁగిన మెలకువ యంతయు నీ కొంచెపుఁ బరిధిలో బ్రకాశించుట యనునది యుండును. ఒక పెద్ద కథకుఁ బదకము పన్నుకొనియు నన్నయ తత్కథా పీఠముగ నేదియుఁ జెప్పఁడు. చదువరుల యాసక్తి చూఱఁగొను

గుణమిందున్నదని నేఁడొక విశేష లక్షణముగ మన కథా సాహిత్యములో దీని నారాధించుచునే యున్నాము. కథలో సందిగ్ధత[1] యని దీనికి నేఁడు బ్రహ్మారథము పట్టుచునే యున్నారు.

పాత్ర యొక పని చేయును. అది లోకసామాన్యముగా గన్పింప వచ్చును. విమర్శించినచో నందొక యసామాన్యతయు భాసించును. ఆ యసామాన్యతనే కథాశిల్పి యుద్దేశించును. పైఁగా నది యావత్కథకుఁ బ్రాణభూతముగా జేయఁబడును. ఈ రహస్యమును జదువరి గుర్తించుట కెచ్చటనో కొన్ని యెడలఁ గథకుఁడు కొన్ని వాక్యములు కూర్చును. వీని నన్నిటిని సమాహార భావనచేత సహృదయుఁడైన పాఠకుఁడు సంధానించు కొన్నప్పు డందలి శిల్పము వెలయఁగలదు. లేదా లేదు. చదువరి యప్రౌఢుఁడైన నతని పాలిటి కది యాఖ్యానముగాదు ; నవలయుఁగాదు ; పారాయణ మగును ; వ్యర్థకాలక్షేప మగును.

పాత్ర ప్రవర్తనలు, సన్నివేశోచితానుభావ వర్ణనములు, గుణాధాయక మైన శబ్దప్రయోగాద్యౌచిత్యపాలనము మున్నగు నవన్నియు నొక్క నన్నపార్యుని యాఖ్యానముల నుండి యేమి యెల్లరినుండి యుదాహరింపవచ్చును. ఎంత యుదాహరించినను, బ్రధానాంశ మొక్కటే ! అది మన యాఖ్యానాదులనుండి యెఱుఁగ కయే కొన్ని గుణములు గ్రహించితి మను నంశము. అందుచే నిఁక ముందుఁ గడు సంగ్రహముగఁ గొలఁది మంది కవుల నుండియే తార్కాణములు చూపుట వారి వారి మహనీయతలకు న్యూనత నాపాదించుట కాఁ జాలదు.

తిక్కయజ్వవంటి యితిహాస రచనాధి కారము గల మహాకవి ప్రపంచ సాహిత్యమున లేఁడు. అతని క్రాంత దర్శిత్వ మట్టిది. హోమరు, డాంటీల వంటి వారు గూడ నీతని ముందు నిల్వలేరు. అపర్యుషిత ప్రతి జ్ఞుఁడగు తిక్కనార్యుని యాఖ్యానములు మనకు నేర్పిన కథాశిల్పమును బహురేఖామాత్రముగనే చెప్పఁగలము. అవి నన్నయాదులలో బూర్వము చూపఁబడిన వగుచో నిఁక మఱియుఁ గ్వాచిత్కముగఁ జెప్పుకొనుచు పోవుటయే యుచితము.

తొలుతఁ గావ్యకర్తలలో గవిబ్రహ్మయుఁ దర్వాత మూఁడు వందల యేండ్లకు లక్షణకర్తలలో రసగంగాధరకారుఁడు పండితరాయలును గావ్యశిల్పము పేరెత్తినవారు. ఉత్తమ సాహిత్య సృష్టికుండవలసిన మహాశయ మంతయు శిల్పమునఁ గథనమే యని భావించిన కవులలో దిక్కన జ్యేష్ఠుఁడు, శ్రేష్ఠుఁడును గూడ. ఇతని యశము కౌముది. ఇతని యాఖ్యాన శిల్పము రత్నము. యావదాంధ్ర కవులకును మణిప్రవాళముల

---

1. Suspense.

సంయోగము నందువలెఁ దిక్కనార్యుని మనోజ్ఞ శిల్ప యశము నందు వ్యామోహ ము ప్రబలెను. కీచక కథా వృత్తాంతము నందు కావ్యాశయమెట్లు శిల్పాధీనమైన దియు దృష్టాంతీకరింపఁదగినది.

(౧) కావ్యాశయ శిల్పాధీనత :-

కీచకకథయం దీశిల్ప హేతువును బురస్కరించుకొనియే తిక్కన మహా ప్రతిభ పరాకోటినంటినదని సర్వే సర్వత్రాంగీకృతము. ఆకథ విషాదాంతమా? మరణాం తమా? యన్న వివాదము మనకుఁ బ్రస్తుతముకాదు.1

యావత్ప్రపంచముచేతను ముక్తకంఠముగఁ బ్రశస్తిఁగన్న సుప్రసిద్ధ గ్రంథము లలో నొక విశేషాంశము సాధారణ ధర్మముగా నున్నది. మానవ కోటిచే నైక్య కంఠమున నంగీకృతమైన పరమపవిత్ర మానవ జీవిత లక్ష్యముల కా గ్రంథజాల మాద ర్శక మగుటయే యా సాధారణ ధర్మము. అందువలననే దేశకాల వ్యవస్థాతీతముగ సమస్తమానవులచేత నా గ్రంథరాశి పూజింపఁ బడుచున్నది. సర్వమత గ్రంథము లును, వాల్మీకము, హోమరుని ' ఈలియడ్ ', డాంటీ ' డివైన్ కామెడి ' మున్న గుఁ బ్రమాణ గ్రంథములవలెనే యొక నిత్య నిర్వికల్ప నిర్విరామమగు మానవ జీవితాదర్శమును గీచకవధయు సువ్యక్తపఱచు చున్నది.

రామాయణమందు స్థాపింపఁబడిన ధర్మవిజయము నెఱుఁగని వారుండరు. అధర్మ కర్మాచరణవలని విపత్పరంపరా పరిణాహ పరిణామమునకును బేరు ' ఈలి యడ్ ' 2. ఇంద్రియ లౌల్యము కంటె ధర్మబంధమే పవిత్రమనుట కథ్యాహారమై నది, ' డివైన్కామెడి ' 3.

మానవ జీవిత మందు నిత్యము నాత్మేంద్రియములకు జరుగుచుండు సంగ్రా మమే కీచక వధయం దభివర్ణితము. కీచకుని వధతో మానవ ప్రకృతి గత నిత్య సత్యా క్లిష్ట ప్రకాశమునకు సర్వతోముఖప్రాప్తి కల్గినది. ఇది మహావిషయము; మహా ద్విషయమును. సాధారణమానవకోటికి సద్ధర్మ సదాచార నిరతి గల్గుటకై యా యుపా

1. భారతీయ సాహిత్యము లోని మరణాంత కథలకును బాశ్చాత్యులు 'Tragedies' అను వానికిని గల సామ్యభేదముల చర్చతో మన కిచ్చటఁ బనిలేదనుట.

2. ఇది హోమరు రచన. ఇందు హెలెన్ నాయిక. ఈమె త్రైలోక్యసుందరి. అత్యుత్కట కామపీడితయై యీమె పతిని బరిత్యజింపును; అతిలోక సుందరుఁడగు 'ప్యారిసు' తో బలాయనమై విపదబ్ధి పాలగును.

3. దీనిని డాంటి రచించినాఁడు. 'డాంటి బియాట్రీసు'ల ప్రేమ సౌశీల్య పవిత్రత యిం దుల్లేఖింపఁబడినది.

ఖ్యాన మనంత ముఖ శిల్ప సామగ్రితో జికిలి చేయఁబడినది. అత్యుత్తమాఖ్యాన నిర్మాతకుఁ గావలసిన యాశయ సిద్ధి కిది సజీవోదాహరణ మన్నఁజాలును. ఇందలి సన్నివేశములను, పాత్ర ప్రవృత్తిని విశద పఱచి తన్మూలమున సాధింపఁబడిన లక్ష్య సిద్ధిని, నాఁటి నుండి నేఁటి దనుక మన కథా సాహిత్యముపై ముద్రితమైన దాని ప్రభావమును నిరూపింపఁ గలము. ఈలోకోపదేశత్వముచే నుజ్జీవితమైనపుడే యది సాహిత్య పద వాచ్యము కాఁగలదు.

(౨) పాత్రల పరిపూర్ణ వికాసము :-

సంజయ శ్రీకృష్ణుల రాయబారములు, కథాసాహిత్య స్రష్టకుఁ గావలసిన విజ్ఞానమున కుద్బోధకము లనుట సత్యము. కవి విజ్ఞాన మనఁగా [1] మానవ ప్రకృతి యెన్ని ముఖములు గలదో యన్నిటి లోఁతును గ్రహించి సమస్తశాస్త్ర నిపుణతయు, సర్వ కార్యదక్షతయు నలవఱచుకొని తదను గుణముగ లోకయాత్ర నెఱపుట. అనుష్ఠానము లేని కేవల శాస్త్రజ్ఞానము, శాస్త్రజన్యజ్ఞానము వలె సంపూర్ణ సిద్ధి నొసఁగఁ జాలదు. అట్టి పరిపూర్ణత నొందని కవి రచించు పాత్రలు పరిపూర్ణ వికాసము గలవిగా నుండవు, సాహితీ సంపదయు వైదికధర్మ పరిజ్ఞానమును. లోకజ్ఞతయుఁ దిక్కనకు వలెఁ బెక్కుఁ గవులకుఁ గథాకర్తలకుఁ గూడ నుండవచ్చును. కాని సంజయ శ్రీకృష్ణుల రాయబారములలో గనఁబడెడియావిజ్ఞాన పరిపూర్ణత యించుకంతయైనను నేఁడు మన కథాసాహిత్య మందున్నచో నది మనకుఁ దిక్కనాది పూర్వకవులిడిన భిక్షయే యనక తీరదు.

(౩) సుదృఢ బంధము :-

ఉత్తర దక్షిణ గోగ్రహణాదుల యందేమి, దరహాము మీఁదఁ జెప్పిన యుద్ధ పంచకము నందేమి సూక్ష్మముగా జూపి నభిమన్యు వధ యందేమి, యగపడు క్రాంత దర్శిత్వము మన వారి కాదర్శప్రాయమై యున్నది. ఇది ఋషులకు లభించు సమన్వయ దృష్టి, అలవోకగ నెచట స్పృశించి చూచినను మన కథాసాహిత్యములో నేఁడు పాత్ర చిత్రణమునందు వస్తుభావైక్య మగపడు చున్నయెడల నది తిక్కన నిర్దుష్ట దర్శనమువలన మనకు లవలేశమైన నలవడిన దని చెప్పవలెను. పల్వురి తోడి యుద్ధ ఘట్టములలో నొకేరీతిమెఱయు నభిమన్యుఁడు మొదలగు వీరాగ్రణుల మూర్తులలోని జీవమును జవమును మన కనుల యెదుట నేఁటికిని మెఱయుచున్నది. అవి మన కథా సాహిత్యము నం దవయవావయవి దృఢ బంధము నెలకొల్పి సర్వాంగ సౌష్ఠవమును సమకూర్పఁ గలుగు చున్నవి. ఈ క్రాంతదర్శనము లేనికథ యంగాంగి సంగతి రహితమై శిథిల బంధమునకు నిదర్శన మగును. నిర్దుష్టమైన దర్శన మున్నకథ, ఘటనా సన్నివేశాది విధాన రమ్యమై యాపాదచూడమును మనోజ్ఞము కాఁగలదు

1. Poets Culture.

(ల) రచయిత నిర్లిప్తత :-

కావ్య శిల్పమున రూప చిత్రకారులు1 పాత్ర చిత్ర [భావచిత్ర]2 కారులు నని రెండు తరగతులవారి నేర్పరుతుము. ముందుగా రూప చిత్రణ మను నది రేఖా మాత్ర చిత్రణ3 మనియు సూక్ష్మాంశ సహిత చిత్రణ మనియు4 ద్వివిధము. ఈ రెండవ పద్ధతికి నిశితమును స్వాభావికమును నగుభావనా విధాన మలవడి యుండవలెను.

ఇఁక పాత్ర చిత్రణము కూడ రెండు తెగలు. ఒకటి ప్రత్యక్ష విధానము;5 రెండు పరోక్ష విధానము.6 కవితా శిల్పమునఁ బ్రత్యక్షపాత్ర చిత్రణము సాధారణ ముగ నాఖ్యానాదుల యందు కనఁబడుచున్నది. ఇందుఁ కవి పాత్రల గుణావగుణ ములను విశేషణముల మూలమునఁ బేర్కొని తానొక తీర్పరియై దుష్టులనియు శిష్టుల నియుఁ బాత్రల వర్గీకరించి, సంతృప్తి నందును. పరోక్ష చిత్రణ పద్ధతియం దేజీవి కర్మఫలము నాజీవి యనుభవించు నట్లుఁ జేయుఁ బరమాత్మవలె రచయిత తటస్థుఁడుగా మాత్రమే యుండును. తిక్కనార్యుఁ డీపద్ధతిని మూలమునుండి గ్రహింపలేదు. మనము మాత్ర మీ తాటస్థ్యము నతని నుండి నేర్చితిమి. ఈ నిర్లిప్తత నేర్వని వారు ప్రత్యక్ష రీతి నవలంబించి తమ కావ్యములలో దామే న్యాయ నిర్ణేతలై పోవుదురు. వారిని రెండవజాతి శిల్పులందుము. నేఁటి మన కథాసాహితిలో రచయిత యెంత నిస్సంగుఁడైన నంత యుత్తమ శ్రేణి శిల్పి. ఏతాదృశమైన యంతర్లీన వ్యక్తిత్వ శిల్ప సంపద యందు మనము తిక్కనార్యునకే ఋణపడితిమి.

## —౹ అర్థ స్ఫురణము ;— 7

అక్షర రమ్యతను బ్రసన్నతను మన సాహిత్యము నన్నపార్యు నుండి గ్రహించి నట్లే యర్థ స్ఫురణమును దిక్కన నుండి గ్రహించినది. ప్రౌఢశిల్పిభావము, శబ్దము నంటి వెళ్ళదు. భావమునంటి శబ్దము నడచును. ముందుగ నతఁ డేభావమును జెప్పు చున్నాఁడో గ్రహింపఁ గల్గిన గాని యా యర్థము స్ఫురింపని మాట సత్యము. అనఁగా రచనాశిల్పమున విపులార్థ వివరణ ముండదు8. సూచ్యర్థ సూచన

---

1. Picture Painters.
2. Character creators.
3. Out line drawing.
4. Attention to details.
5. Direct Method.
6. Indirect Method.
7. Suggestivity.
8. Suggests but not amplifies.

ముండును. ఆ సూచ్యమును మనము కల్పించుకొనవలెను1. అర్థస్ఫూర్తి లేని యక్షర రమ్యతకు రసవద్ఘట్టములలో దావుండదు2. నేఁడు మన వచన రచన లర్థస్ఫూర్తిచే శోభిల్లుచున్న వన్నచో దద్గుణ పోషణ మనకుఁదిక్కనార్యాదులనుండి పరంపరయా ప్రసాదితమైన వ్యసనము.

*నాటకీయత :—*

రూపకాది దృశ్యకావ్యములకుఁగల యనేక లక్షణములచే నేఁటి మన కథా సారస్వత మలరారుచున్న యెడల నదియు మనకు నాటకీయవ్యసని యనఁదగు తిక్కయజ్వనుండి సాంక్రామికముగ లభించిన గుణమే! "గౌతమీ లుబ్ధక సర్పమృత్యు కాల సంవాదము"3వంటి యక్లిష్టనాటక లక్షణ లక్షితములగు సంవాదములఁ బోషించుట, కథయిత యగుఁ దాను దూరముగఁ దటస్థుఁడై యుండి కథాంశమంతయుఁ బాత్రలచే సన్నివేశములచే నున్మీలన మొనర్చుట, చతుర్విధాభినయ వర్ణనాదులచే బాత్రలను మన కనుల యెదటఁ బొడగట్టునట్లుఁ జేయుట, పాత్రల మనోరీతుల మన మనో ముకురములలో నభివ్యక్త పఱచుట, సంఘటనా సన్నివేశాదుల కుచితమగు భాషావినియోగముచే పాత్రపోషణ సాగించుట, యెన్నఁడో జరిగిన కథాంశములను [ఏమాత్రము జరుగని వానిని గూడ] మన కన్నుల యెదుట నిప్పుడు జరుగుచున్నట్లుగ దేశ కాలాదులను బట్టి కల్పించుట, మున్నగు నైంద్రజాలిక విద్యలన్నియు మనకు 'మూషిక మార్జాల సంవాద ప్రకారము'4 మొదలయినవి చెప్పిచూపిన కవి బ్రహ్మ శిల్పేందిరా వరప్రసాదాసాదితములే! యన్న, నది కేవలము నిజము చెప్పుట. ఈ నాటక లక్షణ విలసితమైన వస్తువు సరసము. ఇది లేనిది నీరసము.

## —: వ్యక్తివిలక్షణత్వము :—5

దీని ననేక విధముల బిల్చుచున్నాము. కొందఱు మూర్తిమత్త్వ మందురు; మఱి కొందఱు వ్యక్తిత్వ మందురు. ఎట్లుఁబేర్కొనఁబడినను నిది పఠితృ హృదయమునఁ జెఱఁగని ముద్రవేసినపుడే యా రచనము చిరస్థాయి యగుట యనిమఱవరాదు. ఒక రచయిత తాను లౌకిక పారలౌకిక జ్ఞానములకు సీమాభూమియగుట, యొక విద్యలో నొకశాస్త్రములో కూలంకష ప్రజావంతుఁ డగుట, యొక మనోవ్యాపార

1. Art lies in Concealing art.
2. It is only in the idle parts, that the dictum can be elaborate.
3. భారతము — సంపుటము 7, అనుశాసనిక—ప్రథమ, పుటలు 1—4. వావిళ్ల (1955)
4. "మూషిక మార్జాలంబుల సంవాద ప్రకారము"—భారతము—సంపుటము 6, శాంతి, తృతీయ, పుట 110, వావిళ్ళ (1955).
5. Personality.

నిదానమునందు నిష్ణాతుఁ డగుట, యనుగుణములను బాఠకుని మనస్సునకు హత్తుగొన చేయుట యీ వ్యక్తివిలక్షణత్వ ప్రభావముననే! ఇది లేని వాని కావ్యమో కథయో విస్మృత జీర్ణపథమునఁ బడిపోవును. చదువరులపై శాశ్వత ప్రభావము నెలకొల్పుట కీ శక్తి రచయితకు శ్రీరామరక్ష. పెట్టనికోటయైన దీనిని పరంపరాగత మొనర్చినది, తిక్కన. దీనిని గల కథకుఁడు కలవాఁడు; లేనివాఁడు లేనివాఁడు.

## -: వర్ణనలు :-

భౌతిక వర్ణనల యందుఁ గాని మానసిక వ్యాపార వర్ణనల యందుఁగాని యౌచితి నెఱిఁగి వైశద్యమును వైపుల్యమును మన సాహిత్య పరులు నేర్చిరన్న, నది తిక్కన నేర్పిన విద్య యనక తప్పదు. ప్రకృతి వర్ణనలకు నితివృత్తమునకు నభిన్నాధ్యావసానము చేయునట్టి ప్రజ్ఞలో దిక్కనార్యుని కవితా శిల్పము పరాంకోటి నందుకొన్నది. నేఁడు కథా సాహిత్యాభిమానులు ప్రకృతిని వర్ణించు నపుడు ప్రకరణ మునకు సంబంధము లేని వర్ణనములఁ గావింపనిచో, నక్కడ తిక్కయజ్వముద్ర కలదని భావింప వచ్చును. ప్రకృతా ప్రకృతముల యభేద నిశ్చయముచే నధ్యవసాయము చేసి రసవత్త సంపాదించిన సాహిత్య ప్రక్రియ యేది రసధుని గాదు? ప్రకృతి ప్రకరణ ములను భిన్నములుగా జేయు కథా సాహిత్యమును భంగించుచునే యున్నాము. దాని కెన్నడు నుదాత్తత రాదు.

## -: భావ నిగ్రహము :-

శాంతత్వ గాంభీర్యాది గుణ విశిష్టములైన పాత్రలఁ జిత్రించునపుడు నిరుద్ధ భావావేశమును బ్రకటింప వలెను. మనో వికారములను బొంగి పొరల నిచ్చు పాత్రలు నిరుద్ధావేశమును జూపలేవు. తా నే మనో వికారములను సూచింప నెంచెనో తత్తదనుగుణముగ నిర్నిరుద్ధావేశముల కనువగు ప్రవర్తనలను బదజాలమును గూడఁ గథా సాహిత్యకులు నిర్ణయించు కొనవలెను. విరటుని వంటి భావావేగిని, ధర్మజుని వంటి వచస్సంయమిని బ్రసాదించిన తిక్కన యా యా ప్రకరణములను బట్టి మధ్యేమార్గము గల ప్రవృత్తులను సృష్టించునట్టి యెట్టిశక్తి మనకీయలేఁడు?

## -: పరిహాస కుశలత :-

ఎంత గంభీరుఁడైన పాత్రగానిండు; అతఁడు జీవితమును మధురముగఁ జేయు నీషద్ధాస్యరసమునం దౌచితినిఁ బట్టి కొంఅవడని వాఁడుగ నుండవలెను. రసస్థితి నొందఁ గల హాస్యమును సృష్టించు శక్తి మన కథా సారస్వత స్రష్టలకు మహాకవుల నుండి యుపలబ్ధమైన దనుట తప్పుకాదు. వారు బ్రహ్మేంద్రాది దేవతలనే యొక్కమాటలో పరిహాస రసికులఁ జేసిచూపిన నిదర్శనము లున్నవి.

## -: జాతీయము :-

అవస్థానుకూలమైన పదవాక్యసంయోజనముచేతనే యేకార్యము గాని రాణించు చున్నది. అది శబ్దబ్రహ్మవేత్తలగు మన పూర్వ మహా కవుల కావ్యము లందుఁ బుష్కలము. ప్రజానిత్యవ్యవహారమునకు సన్నిహితముగ నున్న సాధురూపములు గల భాషయే తిక్కన వాడినాఁడు. అటు భావము వెల్లడి కాలేదని వెలితిదనము గల భాష గాని, యిటు భావములకు భారమనిపించు భాషగాని వాడరాదు. మన కథా వాఙ్మయమున నేఁ డీదోషము లేని యెడల భాషా భావములకు విరుద్ధము గాకుండు నట్లుఁ జేసి పరువము సడల నీయక జాతీయ మెఱిఁగి ప్రయోగించిన తిక్కనాది మహా నీయుల చలువయే యిదియుఁ గూడ మనకనుట లెస్స.

తిక్కయజ్వ కార్యదీక్షయు, దక్షతయుఁగల మహా మంత్రి. లౌకికవ్యాపారముకావ్యవ్యాపారమును జాల సన్నిహితములు. అందలి నేర్పు నిందలి కూర్పులో బ్రయోగించుట ప్రతిభకు లక్షణము. మిత భాషితయు, బ్రయోగ కౌశలమును, నిర్వహణ ప్రావీణ్యాదులును మంత్రులకుఁ బెట్టని సొమ్ములు. వీనినే తిక్కని తన కథన విధానమునఁ జతురముగ నెలకొల్పి చూపినాఁడనుట జీవితమును గావ్యమును సమన్వయ పఱచుట.

ఆధునిక కథా వాఙ్మయ కల్పలత కుపఘ్నములు గాగల కొన్ని సద్గుణములను సంగ్రహ పఱచి తద్గుణోపగతికిఁ దిక్కనార్యుని కవితోపచికీర్ష యిపుడు హేతువుగా నిరూపింపఁ బడినది.

ఎఱ్ఱన సోమనార్యులను గూర్చి వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. వారుతిక్కన సోమయాజికి శిష్య తుల్యులు. వారి యూర్వశీ నరకాసుర సంవాదముల వంటివి, ఘంటాకర్ణునికథల వంటివి, విప్రార్భకులను గృష్ణుఁడు బ్రతికించిన వృత్తాంతములవంటివి, ద్రుతగతియు సంభాషణచాకచక్యమును బాత్రలప్రత్యక్షీకరణకౌశలమును గథాసారస్యతమున కెంత ముఖ్యమో నిరూపించినవి.

శ్రీనాథుని[1] సుశీలో పాఖ్యానము, గుణనిధి సుకుమారుల కథలు :-

గుణనిధి, సుకుమారుఁడు మున్నగువారి కథలలో గొంత తిన్నని తీర్పున్నది. అయినను బ్రబంధ యుగ సూచకముగ శైలికేగాని కథాశిల్పమునకు శ్రీ నాథుడు ప్రాధాన్య మీయలేదు. శ్రీనాథయుగము నందలి దగ్గుబల్లిదుగ్గనయు, మాడయ్య

1. చూడుఁడు-డా॥ కొకర్ల రామనరసింహము కవిసార్వభౌముని 'కథా కథన కౌశలము': ఆం. సా. ప. ప. సంపుట 44 సంచిక 2, పుట 92 (1955).

కవియు1, రాయల యుగము నందలి మాదయ్యగారి మల్లనయుఁ2 బ్రబంధ వర్ణనా చాపల్యమునకు దారితీయక, కథావేగమును గుంటుపఱవక సుందరశిల్పము వెలార్చిరి.

శ్రీ కృష్ణరాయల యాముక్తమును గూర్చి ప్రస్తావించుచో గథా శిల్పమును రెండు విధములుగా విభాగింప వలెను. ఇతివృత్త కథనము మొదటిది. భౌతిక ప్రకృతి వర్ణనాదికము రెండవది. ఈ రెంటికి నన్యోన్య మైత్రి కలుగు రీతిగా గథకు వర్ణనలు పరిపోషకము లగుట లేదు. కావునఁ గేవల మితివృత్త కథన విషయమే యిందు ప్రసంగింపఁబడును. కావ్య నిర్మాణ మందలి యవయవ సమష్టి సౌష్ఠవము భిన్న ప్రజ్ఞా పరిశ్రమల ఫలము. దాని ప్రసక్తి మనకేల ? కేవల కథా ప్రణాళిక కడు బిగి బిగిగ జటిలముగ ననుస్యూతమై కమ్మెచ్చునుండి తీఁగె సాగుచున్నట్లు నిబ్బరముగను, సూటిగను నడచు చున్నది. పొందిక గల యితివృత్తముల నతికి బిగువైన యల్లికగా గథాబంధనమిందు నెఱవేర్పఁ బడెను. ఏతాదృగ్గాఢ బంధనము పెద్దన తిమ్మనార్యు లలో గూడఁ గానరాదు. ఈ విషయమున నాముక్తము కంటెఁ బింగళివారి పిన్నది ప్రవీణతఁ గన్నది.

కథా నివేదనమున నూపిరి సలపని వేగము రాయల యుపాఖ్యానములది. ప్రతిపద్యమునను గథాంశములను నిర్వక్రమమున గ్రొత్తముగ నుడువుచుఁ గథ కంతరాయము నిసుమంతయు రానీయమియే రాయల యాదర్శము. కావుననే కథన కందము లాముక్తమునఁ బ్రచురముగ నభిమానింపఁ బడిన వనవచ్చును3. పాండ్యసభలో విష్ణుచిత్తుఁడు గొన్న గెలుపునం దీయతిత్వరితగతి యున్నది. 'ఖాండిక్య కేశిధ్వజ సంవాదము' కేవలము ప్రాసంగికమని తెలియునంతటి గమనవేగముగలది. యథావసరముగఁ గ్రోడీకరణ కౌశలముచే శ్రోతృ పఠితృ హృల్లసన చాతుర్యమును మన కథాలతాంగి నేఁటికిని జూపఁగల్గుట రాయల యాఖ్యానములను హృద్గత మొనర్చుట వలననేయని యొప్పుకొనవలెను. యావత్కావ్య సర్వావయవ సమన్వయమున రాయ లీశక్తి నేలకో చూపలేదు. అందుచే గథాశిల్పమున విరళబంధ మేర్పడినది.

---

1. ఈ కవి 'మైరావణ చరిత్రము'ను మూఁడాశ్వాసముల పద్య కావ్యమును రచియించి లేబెళ్ళ గోవ మంత్రి కంకితము చేసెను. (1503-1508).
2. 'రాజశేఖర విలాస' కర్త.
3. 'ఆముక్తమాల్యద' లోని 805 పద్య జాతులలో 200 కందములున్నవి. ప్రాచుర్యమును బట్టి చూచినఁ గందపద్యరచన రాయల కెక్కుడభిమాన మనుట కిది నిదర్శనము. "ఆముక్తమాల్యద"—"పర్యాలోకనము" నందు శ్రీ ఈ యుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు గారి "ఆంధ్ర సాహిత్య సౌరభ భూమిక" పుట 53లోని పట్టికను బరిశీలించునది. "ఆముక్తమాల్యద : పర్యాలోకనము"—ద్వితీయావృత్తి (1958).

దానికిఁ గారణము మూలకథాసంబంధరహితములైన యాఖ్యానములు, ఋత్వాది వర్ణనములు, తద్విషయమునకుఁ బ్రస్తుతము గాదు. కథా సాహిత్య ప్రవంతికి గమన వేగము నేర్పినవి, రాయల యాఖ్యానలహరులనుటయే మనకుఁ బ్రకృతము. మార్కండేయ పురాణాంతర్గతమగు వరూథినీప్రవర వృత్తాంతమును బెద్దనార్యుఁడు గొనెను. ఇది సార్వజనీన ప్రేమభాజన మగు కథ. పెద్దన శిల్పితనము కథాశరీరమును బోషించి యలంకరించుటయందు ముఖ్యముగఁ గానిపించుచున్నది. కథా విషయ మునఁ గాంతి సాంద్రతలను సంధానించుటయే పెద్దన విశేషముగఁ జూపిన నైపుణ్యము. కాంతి యనఁగాఁ జిగిఁ, సాంద్రత యనఁగా బిగి. రసపుష్టిచే నీజిగియు భావ సంభృతిచే నా బిగియుఁ గథావల్లిక యల్లికకుఁ జేకూర్పఁబడినవి. సిద్ధ ప్రవరులయు వరూథినీ ప్రవరులయు సంభాషణములు, కథానంధానచతురతకుఁ దార్కాణలు. తిక్కన పెద్దన సూరనార్యుల సంవాద మనీషా నికషమునఁ బరిష్కృతమై సానలు దీరినవే మన నేఁటి కథా వాఙ్మయబద్ధ సంవాదములు. పాత్రపోషణాదుల విషయము వేఱు.

కథా నిర్మాణమున ననౌచితిని మనుచరిత్రలో జూడఁబోము. వరూథినీప్రవరుల కథయు వరూథినీ మాయాప్రవరుల కథయుఁ బైకి భిన్నముల ట్లగపడును. వరూథినియే యీ రెండు కథలకును సంధాత్రి. ఆమె యైంద్రిక భోగయుత కాముకత్వమున కనుగుణ సాఫల్యము కల్గుటయే యిందలి వస్త్వైక్యము. మొదటి కథకు ఫలితము రెండవది. ఇతివృత్తము కథారూపమున విస్తరింపఁ బడునపు డంతరమున గథలు వచ్చును. కాని యవి మూలకథ కుపకరించువఱకే పరిగ్రహింపఁబడును. ఒకే పాత్ర భిన్నకథలను గలుపునట్టి నియమమును బాటించినదే ప్రబంధములయందలి వస్త్వైక్యము. పురాణ ములలో నిది దరహాము మీఁద జెప్పినచో వస్తుభిన్నత. ప్రబంధములలో నిది భిన్నత వలెఁ దోఁచుచు సంధాననియమబద్ధమైన వస్త్వైక్యము ; నేఁడు మన కథాసారస్వత ములో నట్లుఁదోఁప నీయని యుపకథల వైవిధ్యమునుండి సహజముగ నేకతః సూత్రింపఁ బడిన యేకత్వము.

తిమ్మనార్యుని పారిజాతాపహరణమునందలి యితివృత్త మొక్కటే భావ కిరణము. అది మానవజీవితసంబంధమగు భార్యా భర్తృ భావ వికాసజన్యమైనది. ఈ యేకైక భావ ముజ్వలితమగును ; కాని విస్తరింపఁ బడదు. అనఁగా నేకైక వస్తు విది. త్రైవ్యైక్యమునిందు వెదకరాదు. సంవాద లక్షణమును, పాత్ర చిత్రణచాక చక్యమును తిమ్మనార్యుఁడు మనకు దీని ముఖమున నేర్పినాఁడు. ఇట్టి లక్షణత్రయముచే భాసిల్లు హీరాంకురముగ మన కథావాఙ్మయమగుట కీ పారిజాతాపహరణమే ప్రాణభూతము. రుక్మిణీ కృష్ణుల ద్యూతక్రీడతో నారంభించిన ప్రథమాంకము, నారద ప్రవేశము పుష్పప్రదానములతో ముగియును. ఈ యంకము నుండి సత్యాంతః పురాంకమునకు మనము పర్వెత్తవలెను. అచ్చట నాటకోచిత పాత్ర సంభాషణలు విని మూఁడవ

యంకమునఁ బుణ్యవ్రత శాంతులముగా గలము. మఱి దారిలో ప్రబంధ వర్ణనము లడ్డురావా ? యన్నచో, ప్రబంధము వినుటకు సిద్ధమైన వారికి నాటకప్రదర్శనా నందము సంధానించి నందులకా ? యీ విమర్శన యని సమాధానింతుము.

తెనాలిరామకృష్ణుని నిగమశర్మోపాఖ్యానాదులు కథానికకుఁ గొనమెఱుపుఁ గఱపు నొఱపు నెఱపినవి.

తిమ్మనార్యుని గూర్చిపైఁ జెప్పిన లక్షణముల యందేగాక, పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయాది గ్రంథములు వస్తుసంవిధానము నందుఁ కూడ నగ్రగణ్యములు, అందు "కళాపూర్ణోదయము" మహనీయ కథా సంవిధానమున కాయుగమునఁ బెట్టినది పేరు1. అది యటు స్వర్గమునకు నిటు పాతాళమునకుఁ దాళము వేయఁగల సంవిధాన ఘటన మన్నచో జాలును. ఆ జాణతనముచే నిర్భర కౌతూహల నిష్పత్తి వెల్లి గొల్పుటయే మనకు నేఁ డాశయము. ప్రత్యేకించి ప్రభావతీ ప్రద్యుమ్నములో సూరన విష్కంభము నంతర్నాటక (అంకావతార) మును గూడఁ గల్పించి, ప్రబంధమును రూపక శిల్పమయ మాణిక్యాంకుర మొనర్చెను. అట్లొనర్చి యా శిల్ప మాకల్పము కథాసాహిత్యమును రూపకకల్పమొనర్చుట కుపాదేయమని నిరూపించినాఁడు.

ఇది యిట్లుండ జక్కన విక్రమార్క చరిత్రయు2, సూరన కళాపూర్ణోదయ మును, సవరము చిన నారాయణ నాయకుని కువలయాశ్వచరిత్రయు, దామరల వేంగళ భూపాలుని బహుళాశ్వ చరిత్రయు, ననంతామాత్యుని భోజరాజీయమును, మాడభూషి వేంకటాచార్యుల భరతాభ్యుదయమును బద్యరూపనవల లనియే ప్రసిద్ధిఁగన్నవి. ఉద్దండ పండితకవి యగుటచే నాంధ్రిని భాషార్భటీ రంగములోనికి దించిన శ్రీనాథునితో భాషాంతరీకరణయుగ మంతరించినట్లు దిక్సూచిగఁ జెప్పవచ్చును. అతని హరవిలా సము కేవల మాంధ్రీకరణముకాదు; అట్లని స్వకల్పితముగాదు. అది పూర్వకావ్యములలోని కథలనుగొని కల్పించిన యాఖ్యాయికలమంజరి. కథాచరిత్ర పరిణామములో నిది యొకానొక యంతరువు. భారతాద్యార్ష మహాకావ్యేతిహాస పురాణముల నడుమ వచ్చెడి యాఖ్యానములను స్వీకరించి ప్రబంధములుగఁ గూర్చుటతో దరువాతి యంతరువు రాయలయుగము నం దారంభమయ్యెను. తిమ్మన సూరనార్యుల చేతిలో నాఖ్యాయి కల యందలి మహనీయ కథాశిల్పము రూప కల్పమై మెఱసినది. కావున నాఖ్యాయికా గుచ్ఛములగు ప్రబంధముల నుండి రూపక లక్షణములు పొడసూపు చుండఁగా దానిటు

1. ఈ యుగమున స్వర్గీయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి "మధుకర విజయ" మపర కళాపూర్ణోదయము.
2. కీ॥ శే॥ కురుగంటి సీతారామయ్య భట్టారకుల చిననాఁటి "అలంకార తత్త్వవిచారము" తుది పుటలు చూచునది.

ప్రబంధగమ్యమును నటు ప్రబంధకథను విడివిడిగా స్వీకరించి పెంపొందించుకొని సంవాద పోషణమున రూపరేఖలు తీర్చుకొని మన కథాసాహితీ నర్తకి నేఁడు పృథగ్విధ భంగిమలు పోవుచున్నది.

మున్ను నుడివినట్లు దక్షిణాంధ్ర వాఙ్మయ పురస్కృతమై వెలసిన నవ్యకథా సాహిత్యక ధారలకు, మెకంజీ మహోదయుని యుగమునందలి వచన గ్రంథములును, ప్రాతస్స్మరణీయుఁడగు 'బ్రౌను దొర యుగము' నందలి కథా వాఙ్మయమును 'చిన్నయసూరి-కొక్కొండ వెంకటరత్నయుగము 'నందలి వచన వాఙ్మయమునుగూడ గమక మిడినవి. పై యుగములలో నటు నంజారాజ చరిత్రము[1] వచనమునఁ గావ్యమయ్యె నెంతగఁ దోడ్పడినదో, యిటు "తెలుఁగు వెలుఁగు ముగద కత" యను "శ్రీమదాంధ్ర కవితావేదిని" గూడ నవలా రూపమై యుండి యంతగఁ దోడ్పడినది.

నోరి గురిలింగ శాస్త్రి (౧) జైమిని భారతము, (౨) భారతము (౩) రామాయణ వచనాది గ్రంథములును; శతఘంటము వెంకటరంగ శాస్త్రి (౧) ఆంధ్ర వచన భాగవతము, (౨) ఆంధ్ర వచన భారతము ; తంజనగరము దేవరాజు [దేవ పెరుమాళ్ళయ్య] (౧) ఆంధ్ర వచన భాగవతము (౨) ఆంధ్ర వచన భారతము ; మాడభూషి వెంకటాచార్యులు "మదన మోహన చరిత్ర" మున్నైనవి ప్రధానముగఁ బ్రౌఢ గద్యాభ్యున్నతిఁ గలవి. ఇవి ప్రథమ దశలో మన యాంధ్ర నవలలకు మార్గ దర్శకములయ్యెను.

ఔత్తరాహులలో వంగ మహారాష్ట్ర భాషల యందును, దాక్షిణాత్యులలో ఒరియా. తమిళ, కన్నడ భాషల యందును గూడఁ బ్రబంధము లాధారముగఁగల ప్రౌఢ గద్యము వెలసి యా యా కథా సాహిత్యములకు గమన వేగమిడి నట్లింతకుఁ బూర్వమే వక్కాణింపఁ బడెను.

---

1: ఆంధ్ర వచన వాఙ్మయము. (P P 107–110). Also vide Catalogue of Books Published in Madras Presidency Volume 2, P. 9, Reg. No. 139–Supplimentary publication, Feb 8, 1881. The date of issue of this attempt at novel-writing in a style intended more for the learned than for the multitude, is 12–3–1879.

## -: ప్రథమాంధ్ర నవల :-

ఇట్టి యాదర్శములతో సంస్కృత కథా ప్రాతిపదిక గలిగి[1] యవతరించినట్టి ప్రథమాంధ్ర నవల[2] కీ॥ శే॥ కొక్కొండ వెంకటరత్నము పంతులు "మహాశ్వేత"[3]. ఇది గ్రంథ రూపమున నచ్చు పడలేదు. సంపూర్ణముగ వ్రాత ప్రతియు లభింపదు. లభించినంతవఱకు నీతి వృత్తము ప్రసిద్ధము, మధురము; వాతావరణము సజీవము; మనోజ్ఞమైన సన్నివేశ రచనము. గతము నుండి వర్తమానము లోని

---

1. కన్నడ భాషలోగూడ మన కగపడు నంతవఱకు మొట్టమొదటి నవల సంస్కృత కథా ప్రాతి పదికగలదియే: అది యనువాదముకాదు. దానిపేరు "ముద్రామంజూష"; కర్త—కీ. శే. కెంపునారాయణ; ప్రకటనము 1823. ఆంధ్రము కంటె కన్నడ మీ విషయమున ముందడుగువేయుట ముదావహము గదా!

2. కీ. శే కొక్కొండవారి "మహాశ్వేత" క్రీ. శ. 1867 లో విరచితము. "వైజయంతీ" పత్రికలో నసంపూర్తిగఁ బ్రకటితము. చూడుఁడు:— "కీ. శే. కొక్కొండ వేంకట రత్నము పంతులు"-ను గూర్చి శ్రీ నిడదవోలు వేంకటరావుగారి వ్యాసములు. తెలుఁగు విజ్ఞాన సర్వస్వము: మూఁడవ సంపుటము; తెలుఁగు సంస్కృతి; పుటలు-114, 115,-తెలుఁగు భాషాసమితి-మదరాసు (1959); 'భారతి' పుట 364—[క్రీ శ. 7.7 1951] ఆంగ్లనవలను బ్రాతిపదికగా గల 'రాజశేఖర చరిత్ర' కంటె, నెక్కుడుగా భారతీయ ప్రభావముగల్గి, కాదంబరిలోని మహాశ్వేత వృత్తాంతము ప్రాతిపదికగనున్న యీనవల, పదునొకండు సంవత్సరములు ముందుగా రచింపఁబడినది.

3. ఇది మనభాషలో మొదటి నవలయని కీ. శే. శివశంకరపాండ్యాగారు, 'వేంకటరత్నము గారి జీవితచరిత్ర' లో నిట్లు వ్రాసియున్నారు:—

"In 1867, he [Venkata Ratnam pantulu] composed the first Telugu-Novel named "Mahāswēta", founded on the pleasant story of Kādambari, the master piece of Bāna Bhatta in Sanskrit" అనియు, నిందులో కొంతభాగము ప్రకటితమైనది" యనియు, నాంధ్రవచన వాఙ్మయమున శ్రీ నిడదవోలు వేంకటరావు గారు [పుట 123 నందు (1954) లో] వ్రాసియున్నారు. కీ. శే. శివశంకర పాండ్యాగారు The Biography of Kokkonda Venkata Ratnam "[వేంకటరత్నముగారి జీవిత చరిత్ర] యని యొకటి ప్రకటించినచో, నాకది లభింపలేదు. "The Rise and progress of Telugu prose literature" అని యొక [కరపత్రము వంటి] చిన్న పుస్తకము నాంగ్లములో క్రీ. శ. 1867 నందు వారు ప్రకటించిరి. అం దాఱవ పుటలో, 3—7 పంక్తులుగా శ్రీ నిడదవోలు వేంకటరావుగా రుదాహరించిన పై పంక్తులు గలవు.

కొక సంప్రదాయధారను ప్రవహింపఁజేసి భావిని సుసంపన్నము చేసి పెట్టఁ గల శక్తి దానిలో నున్నదన్నఁ బ్రస్తుతమునకుఁ జాలును. దీనిని గూర్చి నాల్గవ ప్రకరణము నందు "ఆంధ్ర నవలా చరిత్ర" యను భాగమునఁ దెలిసి నంతవఱకు నుటంకింపఁ బడును. సాహిత్య ప్రక్రియల విషయమున సమీచీనమగు నవ్యతా దర్శనము గలిగియుఁ బ్రాచీన సంప్రదాయములను బ్రాచీన సాహిత్య ప్రభావ సమష్టితో బరిమళింపఁ జేయ వలె ననెడి వాతావరణము నెలకొని యున్న దినములవి. ఆ ప్రభావము గలదియే మన తొలి నవల; 'మహాశ్వేత'. ఆ వాతావరణమే ప్రథమాంధ్ర నవలావతార మునకు స్వదేశీయ పూర్వరంగము.

# తృతీయ ప్రకరణము

## వైదేశీయ పూర్వరంగము — ప్రపంచ నవలా సాహిత్యము — తెనుఁగున దానితో బోలికలు



# తృతీయ ప్రకరణము

## వైదేశిక పూర్వరంగము : ప్రపంచ నవలా సాహిత్యము

## [ Foreign Background: Novel in World Literatures ]

వైదేశికనవలయు నవలాకారులయుఁ బ్రభావ మిటీవలియుగములలో మన నవలావాఙ్మయమునం దధికముగ గోచరించు చున్నది. కావున భిన్నభిన్న దేశముల నవలాసాహిత్యస్వరూపముల మన మెఱుఁగవలెను[1]. అప్పు డాసాదృశ్యములను బట్టి గాని, వివిధదేశములయందలి యేయే సాంఘికరాజకీయాది పరిస్థితుల ప్రభావమువలన నానావిధములైన నవల లుద్భవించినవియు, వానివాని ప్రభావము మననవలలయం దేరీతిగ గోచరమగునదియు మనకు విశదముగఁ దెలియరాదు. అట్లే యప్పుడుగాని మనవారిలో నెవరెవ రేయే వైదేశిక నవలాకర్తల ననుకరించిరో యెవరెవ రేయే నవలామార్గముల కున్ముఖులోగూడఁ దేటపడదు. అట్టివి తెలియనిచో వారివారి యాశయములనుసైతము సూచింపఁజాలము. తావత్ప్రయోజనాపేక్షచేతఁ దొలుదొల్త నాంగ్లేయుల నవలాచరిత్ర సంగ్రహపఱుపఁబడుచున్నది.

ఇంకొక్క విశేషము. ఇంగ్లాండునందుగాని అమెరికారష్యాలయందుగాని మఱి యేదేశమునందుగాని యొక్కొక్కప్పుడు సాంఘికరాజకీయార్థిక నైతికాదిసమస్యలొక్కటిగఁగాని సామూహికముగఁగాని పొడచూపవచ్చును. ఆయా సమస్యలప్రభావముగ వానికిఁ బరిష్కారమార్గములుగ, వానికిఁదిరస్కారములుగను బురస్కారములుగనుగూడఁ గొన్ని సారస్వతప్రవృత్తు లుద్భవింపవచ్చును. అందు కొన్నికొన్ని వైఖరులు వేరూరఁగలవు. మఱికొన్ని నిర్మూలము లొందనుగలవు. వానివాని సంవృద్ధిస్థితి లయము లెట్లున్నను వానిస్వరూపపరిశీలనమును వానివాని గుణాగుణనిర్ణయమును గూడ నిచ్చుటనేజరుగును. అట్లుఁజేయుటచేత నీయీ స్థితిగతు లేర్పడిగాని యేర్పడక యూరకయే కృత్రిమముగఁ గల్పింపఁబడిగాని మననవలలలో బోనుపోను నాయా ప్రవృత్తిభేదములు ప్రతిబింబించినప్పుడు లేక నిర్హేతుకముగ ననుసరింపఁబడినప్పుడు వానివానినిఁక మునుముందు తీవ్రముగ నిరసింప నక్కఱలేదు. ఇందుమూలమున వ్యక్తిగతముగనో నవలాపరముగనో స్తుతించుట నిందించుటయనునవి సహితముచాలవఱకుతగ్గిపోగలవు. విమర్శన, వస్తువుతోగాని వ్యక్తులతో బుజుసంయుక్తము కాదు. ఆయా పరిస్థితులప్రభావమైన యాయావిధానమునుగాని నవలనుగాని సహేతుకముగ నప్పటికప్పుడే విమర్శించుటవలన నింకొకప్రయోజనమున్నది. అది యేదేశమైన నేభా

1. ఇవి విపులముగ (౧–౫) ననుబంధములలో దెలుపఁబడినవి.

షయైనను విషయమునకుఁ గట్టువడి భూతతఃపరిశీలించుటయనెడి ప్రయోజనము : ఆత్మాశ్రయముగఁగాక వస్త్వాశ్రయముగ విమర్శించుటయనెడి ప్రయోజనము. అందు వ్యక్తిగతరాగద్వేషము లుండవు. మఱియుఁ బిమ్మట నాపరిస్థితులు మన భాషలో నేర్పడినను వానినెట్లు పరీక్షింపవలెనో ముందుగనే మనము బాటవేసికొనుచుంటి మన్నమాట. దీనిచే మున్ముందు సాధ్యమైనంతవఱకు వ్యక్తిగతనిందాస్తుతులుగూడ నేర్పడవు. ఆయా సాహిత్యోపాయములు వానివాని యావశ్యకతానావశ్యకతలను బట్టియు వానివాని సహజత్వ కృత్రిమత్వములను బట్టియుఁ బ్రయోజన నిష్ప్రయోజ నములనుబట్టియు మాత్రమే విమర్శింపఁబడఁగలవు. అంతేకాదు విదేశ భాషలలోని యాయా నిదర్శనములనుబట్టి మనభాషలో నీయాప్రయోగముల జయాపజయములు గూడ స్థూలముగ నిర్ణయము కాఁగలవు. మనదేశమునఁ బ్రత్యేకపరిస్థితులు మననవల లలో విశిష్టవిధానములు నున్నపు డవి తత్తదుచితరీతినే పరామర్శింపఁబడుటయు ధర్మము. ప్రత్యక్షముగను బరోక్షముగనుగూడ వైదేశికములైన యాయానవలల ప్రభావము మన నవలలపై ముద్రితమైయున్నప్పుడు నానావిధములైన యాయావాతా వరణములను వానివానికనుకూల ప్రతికూలమైన ప్రతిఫలములనఁదగు సృష్టివిధానముల నుగూడ మనము తెలిసికొనక తీరదుగదా ! ఈ ప్రకరణములో బ్రధానములైన కొన్ని విదేశములయందలి యాధునిక ప్రముఖనవలలనుగూర్చి చెప్పుటయేగాక యేయే దేశ ముల నవలలవలన మన నవలలలో నేయే ప్రభావము లేర్పడినవియు సాధ్యమైనంత వఱకు సంగ్రహపఱపఁబడును.

## -: ఆంగ్ల నవల లక్షణములు : తెలుఁగున వానికిఁ బోలికలు :-

(1) ఇంగ్లండునం దిది నవలలయుగము. ఒక్క-ఇంగ్లాండే యననేల ? ప్రపంచ భాషలలో నెల్ల స్థూలముగ నిట్లే ! ఆంధ్రమునను గూడ నిది నిజము. నవలాకర్తల యుగము దాఁటిపోయినది. వస్తువునకు విధానమునకుఁ బ్రాధాన్యమేర్పడెను. ఏదో లిఖింపవలెనుగదాయని వ్యాపారదృష్టితోగాని యితరదృష్టితోగాని లేఖకులు రచనలు సాగించుదినములు కావివి. వృత్తవర్తిష్యమాణ సాంఘికరాజకీయమతవిద్యావిషయి కాది పరిణామములనుగూర్చి చేయవలసిన రచనలుపెక్కు-. దానికై యవలంబింపఁబడు నట్టి విధానములుమ పెక్కు-. అందుచే నిది మన భాషయందుగూడ నవలలయుగ మనక తప్పదు.

స్వీయచరిత్రవిధానమున నడచు నాత్మాశ్రయ నవలలయందలి తీరనిలోపము లాంగ్లేయులకును మనకును సమానములే ! దీనితో నంతఃపరిశీలనయేగాని రచయితకు బాహ్యపరిశీలనావశ్యకము తప్పిపోయినది. ఇతని యింద్రియము లంతర్ముఖములుగాని బాహిర్ముఖములుగావు. ఈమన స్త్రీత్వనవలాకర్తలు యోగీశ్వరులుగాని యాత్మజ్ఞానులు.

వీరికి పరేంగితజ్ఞానమును శూన్యము. అది జిజ్ఞాసయుగాదు; తమలోదాము త్రవ్వు కొనుట, పూడ్చుకొనుటయు; త్రెంపను ముడియిడను వృథగాగాలముదీరిపోవును. రసభావచిత్రణ మిట్టి నవలలలో నుండదు. మానవత్వముతో దీనికి సంబంధము శూన్యము. ప్రధానముగ మనస్తత్త్వశాస్త్ర సూక్ష్మనిరూపములతో నీ నవల సరిపుచ్చుకొనును. దీనిని శాస్త్రమన్నను దప్పురాదు. అదికూడ నిరాశాజుగుప్సలను సూచించు శాస్త్రము. ప్రాక్తన కాలము విధించినయాంక్షలను నిషేధములను నిరసించి యాజాతి నవల లైంగికవిషయావిష్కరణమును స్వైరవిహారమును బ్రోత్సహించినది.

ఆంగ్లమున నూతన కాల్పనికత ప్రతిపాదించిన యాధ్యాత్మికదృష్టి మన నేటి కొందఱ రచనలలోగూడఁ గాననగును. జీవితసంగ్రామమును సస్మితులై, ధీరులై. నిర్వహించిన నాయకులు నవలలో నొకవిధమగు నవ్యోత్సాహమును బ్రకటీకరించిరి. కుట్టాన్, వీరభూపతి, ధర్మారావు, బద్దన్న సేనాని, సీతారామయ్య, సారధి మున్నగు నొక విశ్వనాథవారినాయకుల నుదాహరించినను బ్రస్తుతమునకుఁ జాలును. ఈ నూతనకాల్పనిక నవలలవలననే కథాసన్నాహము, పాత్రనిర్మాణము మున్నగు వానిలో నైపుణ్య మలవడినది. సర్వవిధశిల్పసంవృద్ధియు సమకూడినది.

క్రీ.శ. 1920-1947 నడుమ నాంగ్లవిద్యాధికులయందే మనదేశమునఁ బాశ్చాత్య సంస్కృతిపై నిరసనయు జాతీయభావప్రేరణయుఁ గల్గినది. ఈ మార్పులవలన మనుజులై కవివీరులైనవారిలో కొంద ఱీనవలాకర్తలు.

వీరివలన లాభములిట్లుండఁగ మఱికొందఱవలనినష్టముల నారయుట మనధర్మము. రచయిత తనయనుభవమునకు దూరమైనట్టి విషయముల బొంతకుఁగాని తన ప్రకృతికి విరుద్ధమైనట్టి విషయములజోలికిఁగాని పోరాదనుట నిస్సందేహము. ఇంగ్లాండునం దాత్మప్రియవాదులకువలె మనదేశమునందును సాధారణశక్తియుక్తులకుఁ బెక్కుసౌకర్యము లేర్పడినవి. నవలాప్రక్రియ స్వస్వప్రవృత్తుల కనుకూలమైనను బ్రజ్ఞతో దానినే పట్టిలార్చినవారు నున్నారు. ఆ కౌశలము నస్థానపతిత మందుము. మఱి యెట్టిప్రజ్ఞగాని యెట్టిరచనాధికారముగాని లేనివారు కల్పించిన నవలలవలన సాహిత్యకప్రమాణములకుఁ గలిగిన నిగతివిషయములో మన నవలయం దాంగ్లనవల పరిభావమే ముద్రితము.

ఈ శతాబ్దిపరార్థమునఁ బ్రపంచమునం దేర్పడిన యభిరుచియే వేఱు. దీనిని ప్రపంచ ద్వితీయసంగ్రామపరిణామ మనఁదగును. ఇది సంప్రదాయములపై దిరుగఁబాటు; నాయకాదులయం దనేక దోషములుండునట్లు నవలల నిబంధించుట; సంప్రదాయదృష్టిచే నవి మహాదోషములు. కాని మనము వాని సేవగించుకొనక పోవుట

యొకనవ్యత. "ఆ నాయకునిగాని నాయికనుగాని చూచిన జాలిగల్గుచున్నది ; ద్వేషము కల్గుటలేదు." అని మననైతికపరిమాణముల పతనమును పట్టియిచ్చుటయే యానవ్యతయు. ఈ లక్షణ మాంగ్లనవలలకువలెనే యాంధ్రనవలలకును పట్టుబడినది.

వృద్ధాచారమెల్ల నికృష్టమని నిరసించు వీరిభాషయే వేఱు. అంతటిస్వేచ్ఛ పూర్వపునవలలలో గనజాలము. మునుపటి భాషకంటె నీ నవలభాష చాలగ్రొత్త. అది చదివినవారి కిది విపరీతముగ నుండును. అందును గ్రొత్తరీతియగుటచేత విరసమై వేళాకోళ మాడుచున్నట్లుండును. ఇక విషయగౌరవము మాట. తలవిలువ నోరుచెప్పును. విషయము గొప్పదైనచో పలుకు పేలవముగ నెట్లుండగలదు ? అనగా వస్తుగౌరవముతోబాటు భాషాగౌరవమునుగల యే కొలది పాటివో నవలలు వెలువడ లేదనికాదు. స్థూలముగ జెప్పవలసినచో లఘురచన మీ దశాబ్దిధర్మము. లఘు హృదయుల కది యుక్తమని కొందఱు. కాదు అది పారశ్యము : ఆర్జవమున కది గుఱుతు : అని మఱికొందఱు.

వీనివీని నిర్ణయము వారివారి దర్శనపథములనుబట్టి యేర్పడుచున్నది. వారికిగూడ నొకవిధముగ బరాయణత లేదనరాదు అది రాజకీయసాంఘికకాది విభిన్న రూపములు దాల్పవచ్చుగాక !

ఈషణ్మాత్రమేని సాహిత్యజ్ఞానము లేనివారుసహితము నవలారచనకై పూనుకొనుటయందును నాదర్శకవాదమునుండి యాత్మప్రియంభావుకవాదములోనికి నవల దిగజారుటయందును నోరులపోషణకై తహతహపడు ధనకామనగల పాత్రలసృష్టి యందును నవ్యకాల్పనికతాలక్షణబాహుళ్యమందునుగూడ మననవల మఱల నేటి యాంగ్లనవలలతో సాటియగుచున్నది.

రాజకీయ స్వాతంత్ర్య సంపాదనమునకు నిన్నమొన్న భారతదేశములో నింగ్లండు తోడ్పడెను. అట్లే సారస్వతస్వాతంత్ర్యసంపాదనమునకుగూడ నేడాంధ్ర ప్రదేశములో నది బాగుగదోడ్పడుచున్నది. మొత్తముమీద నిందులకు గథాసాహిత్యాభ్యుదయమే ప్రబలసాక్ష్యము.

## ఫ్రెంచి నవల లక్షణములు : తెలుగునవానికి బోలికలు

ఫ్రెంచి నవలలవలె నాధునికాంధ్రనవలాప్రక్రియయు మిక్కిలి వైయక్తికము. కావున సమకాలికజీవిత సాగరవాహాములు నందలియాటుపోటులు నిందు ప్రతిబింబించుచున్నవి. ఫ్రాన్సుదేశము మానవోద్యమము[1] నుఱ్ఱూతలూగించిన యూయెల.

---

1. చూడుడు :— నవ్య మానవ వాదం: క్రొత్తలౌకిక దృక్పథం: భావవిప్లవానికి కృషి అవసరం. [హ్యూమనిస్ట్] ఆంధ్ర దినపత్రిక, పుట 8, ఆదివారము, నవంబరు 21, 1954.

ఆ యుద్యమము ప్రథమప్రపంచయుద్ధానంతరము పాశ్చాత్యనవలాసాహిత్యములో జొచ్చినది. పిదప మనపై( బరోక్షప్రభావము నెఱపెను. అది మొదలు జర్మను నవలయందువలె మన నవలయందును మానవోద్యమమును సంతర్ద్వంద్వమును బ్రబదర్శితములు. ఈ మానవోద్యమము మహాత్మగాంధి యవతరణముతో భారతరాజకీయములలోజొచ్చి తొలుత మనపై( బ్రత్యక్షప్రభావమును జూపినది.

స్థూలముగ నీ శతాబ్ది రెండవపడియందు నెగడిన యౌత్సుక్యాధిక్యము పిమ్మటి కాలమున గోచరింపదు. ధర్మాధర్మములమధ్య సంఘర్షణ చిత్రించు నైపుణిలోగల తారతమ్యఫలితమిది. 'ఏకవీర' నవలలో ధర్మశృంగారవిజయమునకై స్త్రీ పురుషులు బలిదాన మగుదురు. 'వేయిపడగల'లో నరిషడ్వర్గమునకును ధర్మమునకును సంఘర్ష ముత్పత్తిల్లును. ఆ సంఘర్షము చిత్రింప(బడుటవలననే యట్టివానికి గౌరవము. ఇంగ్లండు ఫ్రాన్సు మున్నైనన పాశ్చాత్యదేశములనుండి యొక్కొకప్పుడు ముందు( బ్రత్యక్షముగ వంగహిందీభాషాసారస్వతములును నాపిమ్మట( బరోక్షముగ నాంధ్రసారస్వతమును నిట్టి శిల్పధర్మములను సంస్కారములను నలవఱచుకొన్నవన్నను లోపము రాదు. నే( డనువాదములు పెక్కుసూటిగనే జరుగుచున్నవి. కాన నే(డిది మనపై వెలయు( బ్రత్యక్షప్రభావము.

సాహిత్యకులు కానివారుసహితము నవలలురచించు నాచారము ఫ్రాన్సునందును గలదు. కాని మనభాషయం దున్నంత వైపరీత్య మితరదేశముల భాషలలో గానరాదు.

## అమెరికను నవల లక్షణములు: తెలు(గున వానికి( బోలికలు

తొలిఫ్రెంచినవలాప్రభావ మమెరికనుల మీ(దనువలె నాంగ్లేయుల ప్రభావము మనపై ముద్రితమైనది. అది యాదర్శవాదమునుండి దూరముచేసి నూతనకాల్పనికతయు నాత్మప్రియంభవిష్ణుతయు మన కలవరచె ననవచ్చును. కాని నే( డమెరికనుల కొకరీతిగ సుస్థిరమైన జాతీయత సాధ్యమైనది. వంగభాషలో రవికవీంద్రాదులు నట్టిదానినే చే(బట్టిరి. ఆంధ్రభాషయందుకూడ జాతీయతసాధించుటకు( బ్రయత్నములు పెక్కుజరిగినవి; జరుగుచున్నవి. విశేషించి విశ్వవిద్యాలయములు జాతీయతాప్రబోధకములైన విషయములు(గూర్చిన నవలలస్పర్ధ నేర్పఱచి యందుత్తమములైన వానిని బహూకరించి పాఠ్యగ్రంథములుగ నిర్ణయించు చున్నవి. అట్లే యాంధ్ర వారపత్త్రిక,[1] ఆంధ్రప్రభ, నవ్యసాహితీసమితి మొదలైన వెన్నో పత్త్రికలు సంస్థలు దేశమునాలుగుచెఱ(గులయందును నవలలపోటీమూలమున జాతీయతను సాధించు తీవ్రనిర్విరామకృషిలో నిమగ్నములై యున్నవి.

---

1. కథానికల ద్వారమున జాతీయతను బ్రబోధించు విషయమున 'జాగృతి', 'ఆంధ్రప్రదేశ్' మున్నగు ననేకపత్రికలు, పాఠశాలలు, కళాశాలలునుగూడ( బరిశ్రమ(జేయుట ముదావహము.

సాంఘికరాజకీయాదిదృష్టులచేత నవలకు జాతీయత శాబ్దికశరీరముగావచ్చును. కాని శిల్పదృష్టిచేత నవలకుఁ బాత్రపోషణము భావాత్మ యగుచున్నది. ఈ శరీరము నకు నాభావాత్మకును సుదృఢబంధమును గుదుర్చుటలో నాంధ్రనవల కమెరికనునవల యాచార్యకము నెఱపెను. జాతీయతకు భంగమురాని పాత్రపోషణమును గావించిన కారణముచే నమెరికను నవలాకర్తలవలె మనవారుఁగూడ నెంతటిసృష్టికర్తలో యంతటి సంఘజీవనవిమర్శకు లగుచున్నారు.

వాస్తవికతాభిమానమే వ్యావహారికభాష కాభిముఖ్యము. గ్రాంధికభాషా వైముఖ్యమునందు కూడ నీరెండుభాషల నవలలకును సామ్యమున్నది. కాని యీ సామ్య మేర్పడుటకుఁగల హేతువులలో భేదమున్న ట్లగపడును. తనభాషలో సర్వ లక్షణములు నాంగ్లేయప్రభావమయము లగుటచే నమెరికా తననవలలలో స్వత్వరూప ప్రకాస్తికై వ్యావహారికమును వాంఛించినది. కాని మనము వైదేశికప్రభావమునకు దాసులమై గ్రాంధికమును దిరస్కరించి, వ్యావహారికమునకుఁ బట్టముఁగట్టుచున్నామని యొక వాదము. నిజమునకు వ్యావహారికరచనలు మనలో బాశ్చాత్యప్రభావమునకుఁ బూర్వమునుండియుఁ గలవని కీ. శే. గిడుగు రామమూర్తిపంతులుగారు చూపిన యు దాహరణము లసంఖ్యాకములు. కాని, వాని కాదరము రాలేదనుటయు సత్యము.

కావున వ్యావహారికాభిరుచిని విజాతీయమనిగాని జాతీయతాభావపురస్కృత మనిగాని ధ్రువముగఁ జెప్పలేము.

సమకాలికజీవితచిత్రణమే నవలాకర్తకుఁ బరీక్షాస్థానమని నమ్ముటయందును సార్వకాలికములకంటెఁ దాత్కాలికనవలలకే బ్రహ్మరథముపట్టుటయందునుగూడ నీ రెండుభాషలలో సామ్య మున్నది.

## జర్మను నవల లక్షణములు: తెలుఁగున వానికిఁ బోలికలు

అనేకమనకృత్యములకుఁ బూర్వరంగమై బహుసంస్కృతులకు నిలయమైన జాతి సంస్కృతికి భార్గకేంద్రస్థితి వహింపఁగల యొకానొక ప్రధాననగరము నాఁడు జర్మనీ దేశమునకు లేనట్లే నేఁ డాంధ్రదేశమునకును లేదు. నవలలలోని రంగరచనము వాతా వరణసృష్టియు నెప్పటికప్పుడు రాజధానీనగరములతోబాటు మనకు మాఱిపోవక తప్పుటలేదు.

ఒక నూతనచైతన్యము, నొకపారమార్థికవిప్లవమును రమారమి యీ శతా బ్ద్యారంభమునందు జర్మను యువకుల నెట్లు మేలుకొలిపినదో యట్లే యాంధ్రయువ కులను మేలుకొలిపినది. తా మా ప్రబోధముచే చైతన్యవంతులై తిరిగి తమజాతి

1. వ్యావహారిక భాషావశ్యకతకై కీ.శే. గిడుగు రామమూర్తిపంతులు తాను విదేశములలోని యుదాహరణములు చూపుట దీనికి మూలము.

కంతకును భాషాపరముగ, సంస్కారపరముగ నా మేలుకొలుపులు పాడినవారు కీ. శే. గిడుగు రామమూర్తిపంతులు, కీ. శే. వీరేశలింగముపంతులు, కీ. శే. గురజాడ అప్పారావు పంతులునను ముగ్గురు. వీరిని 'నీప్చి'వలె నాందోళనకర్త లనవలెనో లేక నిర్మాణదక్షు లనవలెనో ముందు శతాబ్దియే ధర్మాసనముండి నిర్ణయము చేయఁగలదు.

వాస్తవికతాభిమాన మమెరికాదేశమునఁ బ్రభవించి జర్మనీదేశమునందుఁ బ్రణుతింపఁబడి ప్రథమప్రపంచసంగ్రామానంతరము మన దేశభాషలచేతఁ బ్రశంసిత మయ్యెను. అయ్యు నిది రాజకీయకారణములచే జర్మన్‌భాషయం దొకసంప్రదాయమును నెలకొల్పఁ జాలకపోయినది. మన భాషయం దట్లుఁగాదు; ఒక సంప్రదాయమును బాదుకొలిపె ననవచ్చును.

జేమ్స్‌జాయిస్1, మార్‌సెల్‌ప్రౌస్ట్2, ప్రభృతులవేగాక డాబ్లిన్, హెర్‌మన్ బ్రోచ్3 ప్రముఖుల రచనలుగూడ వెలువడకున్నచో వైషయికాంశముల క్రోడీకరణమును లైంగికశాస్త్రరూపాంతరమును ననఁదగు శ్రీచలముప్రభృతుల నవలలు మన భాషలో వెలువడియుండెవి కావు.

## రష్యను నవల లక్షణములు: తెలుఁగున వానికిఁ బోలికలు:-

సోవియటురష్యాయందు తొలిదశలో నవలారచయిత వ్యక్తిత్వరహితుఁడు. అందుచే వ్యక్తివిశేషము లనఁదగిన పాత్రలు సృజింపఁబడలేదు. నేఁటికైన నట్టివిగల వనుట ప్రష్టవ్యము4. మన భాషలోగూడ వ్యక్తిత్వచిహ్నితములైన పాత్ర లొక పదిపంద్రెండువినా నవలలలో నధికముగ లేవన్నను దప్పురాదు.

రష్యాయందు రెండవదశలో నవలాకర్త సాధారణప్రజాపక్షవాది. కావునఁ బ్రజలనవలలు వెలువడె నందురు. ఇచ్చట నొక వైచిత్ర్యమున్నది. నవలాకర్తను బరిపాటిప్రజాపక్షవాదియనుట యాతని నైతికరాజకీయదృక్పథములను బట్టిగాని, శ్రామికవంశసంభూతిని బట్టికాదు. ఇది మన నవలవిషయముననను జెల్లును. కొందఱు స్వయముగఁజాల ధనాఢ్యులు; బీదలపాటులఁగూర్చి రచించి ప్రజల నవలలు రచించినా రనెడి కీర్తిని గుత్తగొందురు. రాజకీయరంగస్థలియందువలెనే సారస్వతరంగస్థలి యందును గలవారే లేనివారిపక్ష మవలంబించి వారి యాదరగౌరవములకు గుఱియగుచున్నారు.

---

1. ఆంగ్లేయ నవలా కర్త.
2. ఫ్రెంచి నవలా కారుఁడు.
3. జర్మను నవలా రచయితలు.
4. 'షోలొకొహొవ్' విరచితములగు నవల లిందుల కపవాదములు.

ఉత్తరోత్తర రచింపఁబడఁబోవు నవలకు సమాధాన మనఁదగునవల ముందుగనే వెలువడుటయనెడి విషయమున నొకటిరెం డుదాహరణములలో మననవల రష్యను నవలను బోలును. "సప్తపర్ణియు" "తెలఁచిరాజు"ను గొన్నివిశేషములలో నిట్టివని తజ్ఞులందురు.

సాంఘికరాజకీయవిద్యావిషయికాది విప్లవప్రబోధకములగు నవలలు రష్యాయందు ద్వితీయదశలో రచింపఁబడినవి. మనలో విప్లవమనరాదుగాని, యిట్టి సంస్కారప్రబోధము లనఁదగినవి నేఁడు కొల్లలు. విశేషసాధారణాంశముల సువర్ణసమన్వయమునందుకూడ మననవలలు వారి ననుకరించుచున్నవి.

మననవలలలో వినఁబడునట్టి సామ్యవాద సమాజవాద సిద్ధాంతములును క్రియాస్వాతంత్ర్య మానవతాప్రాశస్త్యాది నినాదములును[1] రష్యాలో నుద్భవించినవాని ప్రతిశ్రుతులే యనఁదగును.

సారస్వతము కేవలము ధనికులవలన ధనికులకొఱకై చేయఁబడు ధనికుల సృష్టి కాదన్న ప్రతిషేధవాద మొకటి వారిరాజకీయచైతన్యప్రతిఫలనముగా వెల్వడినది. సాహిత్యమనఁగా బుద్ధిపూర్వకమైన ప్రజాసామూహికప్రయత్న మనెడి ప్రతిశ్రుత భావము, మనలోగూడ నేఁడు రష్యనువిధానములవలననే ప్రచురీకృతము. అందువలన రసానుభూతి వైయక్తికముగాక సామూహిక మగుచున్నది.

కారణాత్మకత, సాంఘికసామరస్యము, జ్ఞానదాయక కల్పనాశక్తియుక్తియు ననుమూఁడు లక్షణములు సోవియటునవల కత్యాధునికములు.

భావనాపరికల్పితమగుగ్రంథము జ్ఞానాత్మకముగ నుండవలెనని రష్యనుసాహిత్యోద్దేశము. అనఁగా భావనాత్మకరచననుండి చరిత్ర, సాంఘికశాస్త్రములను వేఱుచేయరాదు.

సాంఘికపునర్నిర్మాణ మనునది రష్యాలో జరిగెను. కావున రష్యనునవల యా వాస్తవికతకుఁ బ్రతిబింబము గాఁగలదు. ఆ ప్రతికృతిని జూపుటయే దానిసిద్ధాంతము. అది మహాకావ్యము లనఁదగు పెద్దనవలల నిర్మాణమునకుఁ దోడ్పడెను. అందొక పదకమని యుండదు. అది ప్రజలవిపులచరిత్ర. మన నవలలయందుఁ జివురించు వాస్తవికవాదమునకు మూలము రష్యనుసాహిత్యమున వేరూరియున్నది.

వారి వ్యావసాయిక పారిశ్రామిక నవలలవైపుల్యము మన సర్వవిధ నవలలును బొందుచున్నవి. నవల సంపుటములుగవెలువడుట వీరిసంప్రదాయము. అది వంగభాషా ద్వారమున మనకు సాంక్రామికము. తెలుఁగున బృహద్రూపములగునవలలును సుదృఢ

---

1. నినాద మనుట రష్యాయందివి పరిశుద్ధములు గావనుట నిమిత్తము.

బంధరహితములగునవియు నను క్రమణికనవలలు[1] నంచెలనవలలును[2]గూడ రష్యనుల సామ్యవాద సామాజికవాదపూర్వక రచనాప్రభావజనితము లనకతీరదు.

వర్తమానకాలములో గొన్నికొన్ని ప్రధానమైన దేశములయందలి నవలల పుట్టుపూర్వోత్తరములగూర్చి యిందు తెలుపఁబడినది. ఈ తెలుపుటయందుఁ బరోక్షముగ వానివాని ప్రభావము మన నవలలపై నెట్లునెఱపఁబడినదియుఁ జూపుటయే ప్రధానోద్దేశము. కావున నా యా చోటుల వీలైనంతగ మననవలలు వైదేశికనవలలతో నెట్లుఁ బోలుచున్నదియుఁగూడ సంతరింపఁబడెను. ఆ పోలికలు కాకతాళీయములు; వానిని ప్రభావము లనవచ్చునా? యనువారి కొక్కటేసమాధానము. వసుధైక కుటుంబమునఁ బ్రభవించిన యుద్యమములుగాని మహాప్రవక్తలుగాని ప్రశాస్తలుగాని తమతోదామడఁగారిపోవుట యరుదు. తత్తత్ప్రతిధ్వను లించుకకాలవ్యత్యాసముతో దుర్బలమైగాని ప్రబలమైగాని ప్రత్యక్షసిద్ధములు గావచ్చును; పరోక్షవృత్తులు గావచ్చును; లేదా యొకటియై వేఱొకటివలెఁ బ్రమోహింపను వచ్చును. కాకతాళన్యాయములైన పోలికలను బ్రభావములని భ్రమించునెడల నాభ్రమ లోకమొకక్రమబద్ధమైనదని విశ్వసించుట వలన నేర్పడినభ్రమ; లోకమునఁ గార్యకారణసంబంధ మున్నదని యొక ప్రత్యయము నిల్పుటవలనఁ గల్గినభ్రమ యని యంగీకరించుటయే దీనికిఁ బర్యవశేషము.

1. Serial Novels.
2. Relay Novels, attempted in Broad Casts.

# చతుర్థ ప్రకరణము

## వైదేశిక పూర్వరంగము : ఆంధ్ర నవలా సాహిత్యము



# చతుర్థ ప్రకరణము

## వైదేశిక పూర్వరంగము : ఆంధ్ర నవలా సాహిత్యము

## [ Foreign Background: Novel in Telugu Literature ]

౧

### -: నవల పుట్టు పూర్వోత్తరములు :-

సంస్కృతములో నాఖ్యాయికయనఁగా జారిత్రకకథ; కథయనఁగా నుత్పాద్యమైన యితివృత్తము; నేఁటి మననవలల వంటిది. అందుచే బ్రాచ్యప్రభావపురస్కృతితో జూచినయెడల నా కథనే నేఁటి మననవలలకు మూల మనవలెను.

మన మెంతవాస్తవికవాదులమో, యంతయాదర్శవాదులముగూడనగుట, మన ప్రకృతి. కించిదూనముగ నున్నజీవితము నున్నరీతిగాగాని, యుండవలసినరీతిగాగాని యెట్లుఁజిత్రించినను మనకుఁగలుగుసంతోషము సరిసమమేయగుట, పైనిఁజెప్పిన మన ద్వంద్వప్రవృత్తికిఁ గారణము.

ఆదర్శతావాస్తవికతలను నీరెండు మానవప్రవృత్తులును బోనుపోను పాశ్చాత్య కథాసాహిత్యప్రపంచమున రెండు విభిన్నదర్శనపథములుగల కావ్యశాఖలకు మూలాధారములై కాల్పనికరచనలు, వాస్తవికరచనలునను ఫలములను బండించినవి.

ఫ్రెంచిమున్నగు భాషలలోనుండి యనువదింపఁబడినట్టిగాని గ్రీకు రోమను సాహిత్యములనుండి గ్రహింపఁబడినట్టిగాని స్వయముగ నాంగ్లాది వాఙ్మయములలో సృజింపఁబడినట్టిగాని పద్యాఖ్యానములను (అద్భుతావహ) "కాల్పనికము"లని క్రీ.శ. పదునాల్గవ శతాబ్దిపర్యంతము పాశ్చాత్యు లనుచువచ్చిరి. అట్లే యీర్ష్యాద్వేషాదిగత వాస్తవికజీవితచిత్రణమున్న పద్యాఖ్యానములకు 'నోవస్' అనియు గద్యాత్మకాఖ్యానములకు 'నోవెల్ల'యనియు వ్యవహార ముండెడిది[1]. ప్రత్యేక మాంగ్లభాషలో పదునాల్గవశతాబ్దియం దిట్టి వాస్తవికజీవితమును జిత్రించుచు[2] వెల్వడిన పెక్కుగద్యరచనలను గథలనియే వ్యవహరించిరి. వారియం దీ'కథ'యను పదముబహుళార్థగర్భితము.

---

1. 'The development of the English Novel' by William L. Cross, introduction, P. P. XIII–Lines 22–28·

2. Tales.

క్రీ.శ.పదునైదు పదునాఱు శతాబ్దులలో నిటాలియనులు నవలలఁ బెక్కు-గ[1] నిర్మించిరి. కాని యెలిజెబెత్ రాణికాలమునాఁటినుండియు నాంగ్లేయులు చరిత్ర[2]యను పదమునకే ప్రాధాన్య మధికముగ నిచ్చుచుండిరి. అయినను క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దిలో గాల్పనికరచనలు పెచ్చుపెరిఁగినవి. అంతియేగాక గ్రంథనామముగను గథాపీఠమునను నెన్నఁడునులేనిదేకూడ "కాల్పనికములు" అని వ్రాయుటకై నాఁటి రచయితలు పాల్పడిరి. అందువలనఁగూడ నింగ్లాండుదేశములో నవలాశబ్ద మీ 'చరిత్ర-కాల్పనికము' మొదలగు బహుశత్రుకృతసంకుల సమరమందుఁ దనయునికిని నిలఁద్రొక్కు-కొని తాను గ్రమముగ వేరూరుటకు నాల్గువందల యేండ్లకంటెఁ దక్కు-వకాలము పోరాడలేదన్నచో నదియొక యతిశయోక్తికాదు.

*నిర్వాచనము :*

నవలాపదముస్థితి యస్తినాస్తివివాదమునొందిన దినములలో 'క్లేరారీవ్'[3] మనోహరమగు తన కొన్నిసంవాదములయందు ''నవలా-కల్పనము''ల పోరాటము నిట్లుఁ దేల్చివేసినది :-

రచనాకాలమునందలి వాస్తవికములగు జీవితాచారవ్యవహారములను జిత్రించునది నవల. ఉదాత్తశైలిలో నూహాజన్యముల నసంభవముల నసంభావ్యములను వర్ణించునది కాల్పనికరచనము. నవలయన్ననో నిత్యము మనకనులయెదుట జరుగు విషయములకు సంబంధించినది. ఆవిషయములు మనయెడలనో లేక మనహితులయెడలనో నిజములుగావచ్చు నన్నట్లుండును. మిక్కి-లి సులభసాధ్యములుగను, సహజములుగను సన్నివేశముల నెల్లఁ జిత్రించి వానిని పరమసత్యములని నమ్మునంతటి ప్రాయోభావజనిత భ్రమాన్వితులనుగా మనల నొనర్పవలెను. పూర్వజన్మసంస్కా-రవశమునఁగలుగు సాధారణీకరణశక్తిచే సహృదయులను భావప్రతిభావంతులనుగాజేసి తన్మూలమున వారిని రసదోహాలులనుగ నొనర్చుటయే నవలకుఁ బరాకాష్ఠ.

గద్యరూప కథా సాహిత్యమునకు స్థూలముగ 'నవల'యనుపే రింగ్లండులో స్కా-టునాఁటికి దిటవైనది. 'క్లేరారీవ్' మున్నేర్పఱచిన 'నవలా కాల్పనికముల' సూక్ష్మభేదములు క్రమక్రమముగా సమసిపోజొచ్చినవి. యథార్థజీవిత విషయముల వాస్తవికచిత్రణముగల [ఆదర్శచిత్రణముగానట్టి] గద్యరూపకథా సాహిత్యమే 'నవల' యని సర్వేసర్వత్ర పాశ్చాత్యులలో నంగీకరింపఁబడినది.

---

1. నవలా శబ్దక్రమోత్పత్తి:–Novellus, Novus, Latin; Novceau, French; Novella, Italian; Novel, English; Navala, Telugu; నవల: సంస్కృ-తమున దీనికి 'నవం లాతీతి నవలా' యనియు నుత్పత్తిఁ జెప్పి చమత్క-రింప వచ్చును.
2. History–Chronicle.
3. *'The progress of Ramance'* 1785.

ఇఁక మన యాంధ్రవాఙ్మయములో 'నవల'యనుపదమును బ్రయోగమునుబట్టి విచారించి దానినిర్వచనమును నిర్ణయించుట మఱియు దుస్సాధము. మొత్తముమీఁద నొకవిధమగు పైరీతికథాసాహిత్యమును సూచించునర్థమునందే నవలాపదము వాడుక చేయఁబడెను.

కాని పెద్దలగు కొందఱిచే నిది"చిత్రకథాఖ్యానమ"ని చెప్పఁబడుచున్నది. నవలయందలి వస్తువంతయు యథార్థముగాకపోయినను గేవలకల్పితమునుగాదు. ఒక వేళ నయథార్థమైనను మిథ్యాకృతమతిచేత నది యథార్థమేయనెడి భ్రాంతినిఁ గల్గించు నయథార్థము. అదియే యాకథావస్తువునందలి వైచిత్రి. కావుననే దీనిని జిత్రకథాఖ్యానమనుట యుచితము. ఇంచుమించుగ బహుముహురంచితాద్భుతావహకార్య విశేషములకు సంబంధించిన కాల్పనికములకంటె నవల భిన్నమనిచెప్పుటయే ప్రాయశః 'చిత్రకథాఖ్యాన మ'నుటలోగల భావమైయుండును. కావున మనోరంజకము నతి విచిత్రమునైన జీవితచిత్రణము 'నవల'యనుట పిండితార్థము. ఆవైచిత్రిలేనిదే మనోరంజకత సిద్ధింపదనుట.

స్థూలదృష్టితో దీనినిగల్పితకథ యనినవారుకూడ నున్నారు. కాని పర్యాలోచింపఁగానదియు నొకభ్రమ. మన మాధునికమనుకొను విమానములు వాల్మీకమునందుఁ బుష్ప కాదినామములచే జెప్పఁబడినవి. అట్లే నేఁడు జలాంతర్గాములను బాశ్చాత్యులు కనుఁగొనకపూర్వమే హెచ్.జి.వెల్సుపండితుఁడు వాని నూహించి తనకథావాఙ్మయమున ముందుగఁ బ్రయాణింపఁ జేసినాఁడు. అందుచే ముమ్మందు యథార్థముకాగలవి కూడ నవలలో గల్పితములే యనినచో నెట్లుండును? ఇంతకు బీజాంకురన్యాయము చెల్లుననఁదగు నీ కల్పితయథార్థకథ లనువాని విషయము నింకొకరీతినిగూడ నుచితముగఁ బరిష్కరింపఁదగును.

ప్రాచీనయుగమునాఁటినుండి యథార్థకథ కనుబంధముగను, టీకాప్రాయముగనుగూడఁ గల్పితకథయనునది స్థిరపడియున్నది. మఱియుఁ గడుప్రాచీనతమ మగుటచేత మన యూహావైభవమున కందరాని యథార్థవిషయమునకుఁ గల్పిత విషయమని పేరుపెట్టి సంతోషించుకొనుచు వచ్చుచుంటిమన్నను తప్పులేదు. అనఁగా బహుప్రాచీన చారిత్రకవిషయమగు యథార్థము నేఁడు మనకుఁ గల్పితముగా దోఁచుచున్నది.

లేదా పామరులకు యథార్థవిషయబోధనసాధనముగా ముందుఁ గల్పిత మాచరణలోనికి వచ్చినదనియు నట్లుఁగాక యా పామరజనమునకు యథార్థమును యథార్థముగా బోధింపఁజూచినచో నది బోధపడదు - సరికదా, యపాయకరముగాఁగూడఁ బరిణమింపవచ్చుననియుఁ జెప్పుకొని, కల్పితయథార్థకథ లొకే విషయముయొక్క పూర్వోత్తర దశావిశేషములని సంగ్రహపఱపవచ్చును.

పోనుపోను దమ నిత్యజీవనమునకుఁజెందిన సంశ్లిష్టసమస్యలచే విసిగివేసారియుండి విశ్రాంతినొందఁగోరు సాధారణజనమునకై కల్పింపఁబడినదగుటచేగూడ యథార్థము వంటి విచిత్రమైనకల్పన నవలలో నావశ్యకమగుచున్న దనుకొందుము. ఆయా కారణములచే నవలను జిత్రకథాఖ్యానవిశేషముగ నుల్లేఖించుట సమంజస మనకతీరదు.

దీనిగుణముల పుట్టుపూర్వోత్తరములనుబట్టి యాలోచించినను (౧) ఇతిహాసము (౨)భావగీతము (౩) రూపకము ననునవి తమయాస్తి తాముపంచుకొని యేనాఁడో తమదారితామైపోయిన సవతియన్నదమ్ములవలెఁ దోఁచును. పైమూఁడింటి యందును నేఁటి మన నవల తొల్లిఁటి యైతిహాసిక నవలాసంతతికిఁ జెందినది. ఇది కథనప్రధానమగుటయు నిట్టి వర్గీకరణమునకుఁ గారణము. అయ్యును నితిహాసముకంటె నొకవిధముగా మఱల నవల భిన్నము. ఎట్లన నితిహాసము తాను శబ్దప్రాముఖ్యమును వహించి యాఖ్యానముదైన సాహాయ్యమును గౌణముగా గ్రహించినది.

*నవల: ప్రబంధము:*

సత్యాదేవి లేనడుమువలె 'పారిజాతాపహరణము'నందలి కథావస్తు వస్తినాస్తి విచికిత్స గొలుపుచున్నదని మాటవరుస కందుమేగాని నిజమూహింప మన మేప్రబంధమునైన కథకొఱకై చదువము; కవితాంశముకొఱకై చదువుదుము. మఱి నవలలో [ప్రాథమికదశయందుమాత్రమేయని కొంద అనవచ్చునుగాక!] కథయే ప్రధానము. ఆకథఁ జెప్పుటకు శబ్ద మిచ్చట నుపస్కారకమైనది. అందుచే స్థూలదృష్టిని బోల్చి చూచినచో నొకవిధముగ నవల ప్రబంధమునకుఁ బూర్తిగ విరుద్ధమగు రచన.

ముందుగ దీనియుత్పత్తికిఁ గారణమేమియని పరిశీలింతము. యోజింప నిదియును ప్రాక్తనమానవునిదైన దైనికసాంఘిక జీవితమునుండి యుత్పన్నమైనదే! మానవుఁడు తాను బడునట్టి శ్రమాపనయార్థము వినోదములయందు కాలయాపనముఁ జేయఁగోరుచుండును. ప్రారంభదశలో నృత్తనర్తనాదులన్నియుఁ బ్రాథమికమానవుని శ్రమాపనోదనార్థ ముద్దిష్టములైన వినోదక్రీడాలాపములే గదా! అదేతీరుగ నే చలికాలమందునో యే నెగడులయొద్దనో కూర్చుండిన జనములో నుబుసుపోకకై కథలు బయలుదేరియుండవచ్చును.

నర్తకికి గానము సహజమైన శక్తిసంపద. అట్లే కథకునకుఁ గథఁజెప్పుటయు స్వతోరమణీయచాతుర్యము. అది యతని నేర్పు!

లోకములో జరిగినవిషయములను విననింపుగా జెలువులుపలవలుగాగూర్చి చెప్పుటతో గథాజీవితమునఁ బ్రథమదశ ప్రారంభించిన దనవచ్చును. అప్పటిలో శ్రోతలకానందము నిచ్చినది, తత్కథాగతసౌందర్యము మాత్రమే! కథయిత ప్రయోగించు శాబ్దికప్రకర్షగాని ప్రదర్శించు వాక్చమత్కృతిగాని కాదు. అట్లే నృత్యమునందును బ్రథమదశలో నానందము నిచ్చునది కేవలమునృత్యమేగాని సంగీతముగాదు.

లిపి యేర్పడినతరువాతఁ జదువనేర్చినవ్యక్తి యీ కథలను లిఖింప నారంభించి నాఁడు. మనలో నట్లుఁబుట్టినవే 'కాశీమజిలీలు'. లోకమున యాత్రాపశుపక్ష్యాది కథలు మొదలగునవియన్నియు నీ తెగలో జేరినవే! వేతాళపంచవింశతి, సింహాసన ద్వాత్రింశిక, శుకసప్తతిమున్నగుఁ బెక్కు "కట్టుకథలయుఁ" "బిట్టకథలయుఁ" గావ్యములు మనభాషలో వెలసినఁయిది రెండవదశ యనఁదగును. [పిన్నలకుఁ బెద్దలకుఁగూడ నుద్దేశింపఁబడిన "రాజాజీకట్టు కథలు" ఇటీవలనే తెలుఁగులోని కనువదింపఁబడినవి గదా !]

అటుతరువాతిది మూఁడవదశ. ఈదశావిశేషములో రచనాసౌందర్యసంపాదన ప్రయత్నములు జరిగినవి. ఏతద్రచనాసౌందర్య గుణసంపాదన ప్రయోజన సాధనకు, భాషాభివృద్ధి తోడ్పడినది. ఆపిమ్మటిది నాల్గవదశ. ఇందులో నవలను ప్రబంధముతోఁ బోటిపడునట్లుఁగా నిర్మించుటకుఁ బ్రయత్నములు సాగినవి. ఒక్క ఛందస్సువినా యావత్కావ్యగుణముల నాపాదించి మనవారు గద్యమునకుఁ గవితాగౌరవము సంపాదించిరి. సంస్కృతమునఁ గాదంబర్యాదిగద్యకావ్యము లీ కోవవే !

ఐదవదశలో గావ్యత్వమున స్వయంసంపూర్ణతను సంపాదించుటచే నిఁక మిగిలిన సాహిత్యప్రక్రియయగు నాటకమును గయాళించుటకై స్పర్థించినది నవల. అందుచేతనే సంవాదపోషణముల కెక్కువప్రాముఖ్యము నవల యొసఁగినది. దీనికిఁగాను జరిగినదే పాత్రచిత్రణము, సన్నివేశనిర్వహణము మున్నగు శిల్పభండారసంభూతి. ఏది యెట్లు లైనను గథనసౌందర్యము మాత్రము నవల కోల్పోవరాదనుట యూథము. ఈ సుందరతా పరిస్పందనమువలననే నవలనుగూర్చి ప్రదర్శనములేని నాటకమనియు శబ్దచిత్రణము లేని మహాకావ్యమనియు నొక్కమాటలో జెప్పనొప్పను.

కావ్యతాగుణశోభితము లగుటచేత మనలో నేఁ డానందదాయకమగు సాహిత్యాంగముగఁ గొన్ని నవలలు వెలయుచున్నవి. ఆధునికవిమర్శకులు వీనిని ప్రబంధ దృష్టితోఁగూడఁ బరిశీలింపవలెనన్న యంశమును విమర్శించుచున్నారు. ఇదియొక లోపము.

ప్రబంధమునందే యీ నవలా లక్షణములను జూపించినవారిలో పింగళిసూరనార్యునివంటి మహాకవులు మనలో పూర్వమునుండి యేకొలఁదిమందియో లేకపోలేదు. ఈలక్షణమునకుఁ బూర్వులలో 'మహనీయకథాసంవిధానము'గల సూరనార్యుని 'కళాపూర్ణోదయము'ను నాధునికులలో గవిసార్వభౌమ [ఆంధ్రప్రదేశాస్థానకవి] కీ. శే. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి 'మధుకరవిజయము'ను నుత్తమలక్ష్యములు. ఇందు కళాపూర్ణోదయము నొకవిధముగఁ బద్యగతచిత్రకథాఖ్యాన[1] మనఁదగును. క్వాచిత్క

1. Pseudo Mythological fiction.

ముగ గద్యసమ్మిశ్రణములున్నను ప్రాయికముగఁ బద్యసమాశ్రితములే యగుటవలనఁ 'గవితారూపనవలల'ని యల్పరచనలలో నేఁడు పేర్కొనఁదగినవి శ్రీవేంకటపార్వతీశ్వర కవుల 'కావ్యకుసుమావళి'[1] సంపుటములు.

ఐనచో ప్రబంధమునకు సూక్ష్మవస్తువివరణము దుర్ఘటము; నవల కిది సుకరము. కాఁగా ప్రబంధేతివృత్తముకంటె నవలేతివృత్త మెల్లపుడు నురువైనదియే! కాని యీ నవలాప్రబంధసాంకర్యములు క్వాచిత్కములని మఱవరాదు.

మొత్తముమీఁద 'ఇవాన్స్' చెప్పిన[2] ట్లతిమాత్రానుభవములకు నవల యొక్కటియే వ్యక్తీకరణసాధనము!

అగుచో నాటకేతివృత్తములను నవలలుగా బరివర్తనము జేయవచ్చునా? అన్నిటినిగాదు[3]; పురాణేతివృత్తములుగల 'శకుంతలా'దు లున్నవి యున్నట్లుఁ గుదురవు;

---

1. కావ్యకుసుమావళి : ఆఱుసంపుటములు, రెండువందల యేబది యంశములు; పండ్రెండు వందల పుటలు, గద్య పద్య సమ్మిశ్రితము. చాలవఱకు గవితారూపనవలల బీజ మాధునిక యుగములో నిందు గోచరించుచున్న దనవచ్చును.

2. It is the only outlet to a large experience.

3. ఒకే యితివృత్తమును భిన్నసాహిత్యప్రకియలుగాగూడఁ బరివర్తనఁ జేయవచ్చునని నిరూపించుటకుఁ గన్నడమున నేఁడు ప్రయోగము జరుగుచున్నది. మనయందును నవలలను నాటికలుగ మార్చుచున్నారు. కీ.శే. కందుకూరివారి '*రాజశేఖరచరిత్ర*' రేడియో అనుసరణ—అమరేంద్ర-6-7-1960, 13-7-60 ఆంధ్రప్రభ, సచిత్రవారపత్రిక — పు 35. ఇట్లే, చిలకమర్తి వారి '*గణపతి*'కి రేడియోఅనుసరణము.

   This Novel was split up into six serial Radio playlets and the lost (sixth) was relayed in Hāsyavallari Programme 9-15 p. m. on saturday, the 23rd of may, 1959 from Hyderabad and Vijayawada Stations. Also "Chukkāni" (No-15. dated 1-6-1959) a fort-nightly Journal, reviewed this dramatised form of the Novel.

   అట్లే 1961 నవంబరు 20 రాత్రి "*రామచంద్రవిజయ*" మాధారముగ శ్రీ కొండముదివారి యాకాశవాణి నాటకీకరణముగూడఁ బ్రదర్శితము. "*చుక్కాని*" (పుట 23 సంచిక 24, సంపుటి 3, ది 15—12—1961) దీనిని గూడ సమీక్షించినది.

   క్రీ. శ. 1961 నవంబరు 4, రాత్రి ( గం. 9—15 నిముసములకు ) కొడవటిగంటి కుటుంబరావుగారి కథకు శ్రీ నండూరి సుబ్బారావు నాటకీకరణము "*నవగ్రహాలు*" విజయవాడ యాకాశవాణి కేంద్రము వారు ప్రదర్శించిరి. Id. (Dt. 15-12-1961)

సులభముగ వీలులేదు1. మృచ్ఛకటికమువంటి కేవలకల్పితసాంఘికేతివృత్తములు గల ప్రకరణాదులను గొన్నిటిని నవలలుగా మార్చుటకు వీలున్నది.

కాని యెల్ల యితివృత్తములను మనకుఁ గావలసినరీతిగా భిన్నభిన్న కావ్యరూపములలో వ్రాయుట కుదురదు. అది బుద్ధిమంతుఁడైనకవి యూహించుకొని యితివృత్తౌచిత్యము నెఱిఁగి చేయవలసిన కావ్యస్వరూపస్వీకరణము. కావున నితివృత్తమే తనకుఁ దగిన కావ్యస్వరూపమును నిర్ణయించుకొనఁగలదు కూడ2.

*నవల: నాటకము :—*

నవలానాటకములనుగూర్చి యాలోచించినచో మనకు దశవిధములగు విభేదములు గానవచ్చును. వీనినే నవలా నాటకముల ప్రత్యేక లక్షణములుగా గూడఁ జెప్పుదుము.

(౧) నవల నాటకమునకుఁ దరువాతఁబుట్టినది. అనఁగా దానికి జ్యేష్ఠతలేదు.

(౨) నవల రంగస్థలనియమ విరహితము; నాటకము రంగనిబంధయుక్తము. అనఁగా నవలవలె నాటకము కేవలగ్రంథగతసాహిత్యముగాదు; రంగమును దృష్టియందుంచుకొని కూర్పఁబడినది. నవలకన్నను రంగస్థలాపేక్షలేదు. నవలాకారునకు రంగనియమ పరిచయావశ్యకమును బ్రధానముకాదు.

(౩) నవలదైన రంగము నవలయందే గలదు. నాటకమున రంగస్థలము కృతిగతముకాదు; కావ్యమునుండి విభక్తము. [నేఁటి నాటికలలో రంగస్థల విన్యాస మనుపేరిటఁ గొంతగా రంగప్రసంగము నిముడ్చుచుండుట వేఱుమాట.] నవలయందు వర్ణనల మూలమునఁ జిత్రములు మన మనస్సున నిల్చునేగాని రూపకమునందువలెఁ బాత్రలు ప్రత్యక్షము కానక్కఱలేదు. తన దృశ్యప్రసాధనాది రంగస్థలోపకరణములు నవలకుఁ దనయందే గలవు. కావునఁ జదువరులకు "జేబులో" నవల యున్నచో రంగస్థలి యున్నట్లే! ఈ కారణముచే నాటకములపై వ్యామోహము నవలలచదువరులకుఁ దగ్గుచున్న దన్నను దప్పురాదు. నాటకముల క్షీణతకు నవలల యభ్యుదయము ప్రత్యక్షకారణముకాదు; కాని నాటకములకు నవలలు ప్రత్యామ్నాయము లగుటమాత్రము నిజము.

1. పౌరాణికేతివృత్తములనుగూడ నవలారూపమున సంతరించుటకు నేఁడు భారతీయ భాషలలో బ్రయోగములు జరుగుచున్నవి. శ్రీ విశ్వనాథవారి "పురాణవైర" నవల లుదాహరింపఁదగినవి. ఇట్టి కొన్ని ప్రయోగములు విజయవంతములగుటయుఁగలదు. ఇఁకఁ బూర్వప్రయత్నములో చిలకమర్తివారి "సౌందర్యతిలక" యొకటి.

2. It chooses its own form.

(౪) నవలకుఁగాలవ్యవధియని లేదు. ఎంతకాలమైనఁజెప్పవచ్చును; విన వచ్చును. అందువలననే నవలారచనమునకుఁబఠనమునకునుగూడ క్షమ యావశ్యకమనుట. రూపకమునందు కాలనియతి యున్నది. మూఁడు, నాల్గు, లేదా కొన్నిగంటలకు మించిమాత్రము ప్రదర్శన ముండదు. వస్తుసారసంగ్రహమే నాటకమునందు ప్రదర్శింపఁబడును. కాని నటకు లకుఁగాని ప్రేక్షకులకుఁగాని నవలాకర్తృపఠితృల కుండవలసినంత క్షమ యావశ్యక మనఁజాలము.

(౫) వర్తమానవిషయమును నవల వృత్త (భూత) విషయముగా మార్చి చెప్పును. ప్రత్యక్షీకరణశీలముఁ గలదగుటచేత రూపకము భూతకాల విషయమును వర్తమానవిషయముగా జూపఁగలదు. ఈ శక్తి యస లాసంవాదశైలియందే గలదు[1].

(౬) శ్రవ్యకావ్య మగుటచే నవలలో జీవకళాచ్ఛాయ యుండదు. దృశ్య కావ్యమగుటచే రూపకమునందు సజీవత్వమును బ్రత్యక్షానుభూతిచ్ఛా యయుఁ గలవు.

(౭) నవల కావ్యముయొక్క సరళరూపము. అందుచేత నల్పప్రయాసగ్రా హ్యము. నాటకమో కావ్యజటిలరూపము. అది యతిగుంఫితమైన సాహిత్యమును సుదృఢబంధమును గలది. అనఁగా మాటలకూర్పునకు రూపకమునఁ బ్రాధాన్యము. అట్లే కథావస్తువునందు దేనిని వదలివేయ వలయునో దేనిని వదలరాదోకూడ నాటకకర్తయే నిర్ణయించుకొన వలయు ననుట. నవలనువలె నాటకము నల్ప ప్రయాసగ్రాహ్య మనలేము.

(౮) పాత్రనుగూర్చియుఁ బాత్రలపక్షముననుగూడ నవలయందు రచయిత పలుకఁగలఁడు. అనఁగా నతనికి వ్యక్తిగతాభిప్రాయమును వెలువరింప వీలున్నది. నాటకకవి పాత్రలముఖముననే పలుకఁగలఁడు. స్వయముగ నేమిచెప్పుటకు నవకాశము తక్కువ; బాహాటముగా కుదురదు. కవికిట్టి శృంఖలలఁ గల్పించుటచేతనుగూడ నాటకము, పైనఁజెప్పినట్లుఁ (నవల వలె) గావ్యసరళరూపము కాఁజాల కున్నది.

(౯) నవల క్షేత్రవిస్తృతిఁ గలది; విశదీకరణప్రధానమైన దనుట. తత్కర్త యందు సర్వవిషయములను వివేకింపఁ గలఁడు. కావున విస్తారము, నిస్సీమమునైన కావ్యరూప మిది.

---

1. In dialogue, the stilted speech.........was replaced by the blunt parlance of the present period (page 38. lines 34 to 37 of '*Writing Modern Fiction*'.)

నాటక మిట్టిదికాదు. అభినయముపైననే దానిదృష్టి. కాన సంక్షేప ప్రధానమైనది.

(౧౦) నవలలో భాషాకాఠిన్య మున్నను నంతగా ప్రతిబంధకము కాదు. సంవాదములయందుఁ బాత్రోచితభాష నాటకములలో సమర్థనీయము. ఇఁక కవి తానై మాటాడు ఘట్టములలో నవలయందు వస్తుగౌరవమును బట్టియు భావవైభవమునుబట్టియు శైలి యించుక యుదాత్తమైనను విషయగ్రహణమున కడ్డుతగులదు. నాటకమునందు శైలి భారముకా రాదు. ఏలయన నిందు విషయవైపుల్య ముండదు. విషయ సంగ్రహాత వలనఁగలుగు శ్రమకు భాషాప్రచండతాండవ భ్రమణముగూడఁ దోడు పడ రాదు.

ఈ చెప్పిన దశవిధ నవలానాటకవిభేదములలో ముఖ్యమైనవానిని గొన్నింటిని జతపఱచి మఱల భిన్నశీర్షికల క్రింద నీదిగువరీతిని సూక్ష్మముగఁ బరిశీలింపవచ్చును.

*స్వయం సంపూర్ణత:-*

భూతపూర్వ విషయమును గూడ నాటకము వర్తమానమట్లుఁ బ్రదర్శించు నంటిమి. అట్లుఁ బ్రదర్శింపఁబడక కేవలము పఠనమాత్రయోగ్యమైననాటకము స్వయం సంపూర్ణము కాదు. రంగప్రసాధనాభినయములులేని వట్టినాటక పఠనమెప్పుడు నసంపూర్ణమే యగును. ఇట్టి ప్రదర్శనరహితనాటకములయందు పాఠకునిబుద్ధి యెక్కువగ శ్రమపడవలసియున్నది.

అట్లే వర్తమానమునుగూడ వృత్తవిషయము (భూతము)గా నవల చెప్పునం టిమి. ఇందు రంగప్రసాధనమును సూక్ష్మాతిసూక్ష్మాంశములను వర్ణింప వీలున్నది. ఈ ప్రసాధనాదిని నాటకములోనైనచో రంగమునందుఁ బ్రదర్శింతురు. మఱి యీ ప్రదర్శనములేని నాటకము వట్టి యస్థిపంజరమేగదా! పాత్రోచితవేషధారణాది ప్రదర్శ నముల యాధార మక్కఱలేని హేతువుచే నవల కేవల కావ్యముగా స్వయంసంపూర్ణము. "నవల జేబులోనున్న నాటకరంగము"[1] అనియు "నవలదైన రంగ ప్రసాధనాదులునవల యందేయున్న"[2] వనియు ననుట యీ యర్థమునే సూచించును. కావునఁగావ్యతా గుణమున నాటకము స్వయంసంపూర్ణముగాదని విదితము[3].

---

1. 'Novel is a pocket theatre' (Marin Crawford)
2. Novel has its stage in itself (Hudson)
3. Novel is self - contained and drama, as a piece of literature, is not self-Contained.

ఇంతేగాక కథాసన్నివేశకల్పనములో నాటకకర్తకున్న విధినిషేధములేవియు నవలాకర్తకు లేవు. నవలలో ప్రతిసూక్ష్మాంశమును గనఁబడవలెను. అందుచే రంగమును నాటకమును రెంటిని గలిపినపుడే యది నవల యగుచున్నది. కావ్యత్వమున స్వయం సంపూర్ణత నవలకుఁ గలదనుట కిదియే ముఖ్యకారణము.

*కథాసన్నివేశ కల్పనము :—*

వస్తుసన్నివేశము నాటకములో గర్భవతము. ఈ సన్నివేశము రంగనియ మానుసారముగ నుండవలెను. ఇట్టి నిర్బంధము నవలకు లేదు.

కాని నేఁడు నవల కేవల మాఖ్యానమువలె నున్నదనియు ననలేము. 'అనఁగా ననఁగా'నని శుద్ధాఖ్యానములో గథప్రారంభింపఁబడును. నవల వర్తమానకాలములో జాలవఱకు నాటకముతో సాటిరాఁదగిన దశను బ్రాపించినది. ఇందులోగూడఁ గథా సన్నివేశ మొకశిల్పధర్మముగనే పాటింపఁబడుచున్నది. కాని యిట్లు పాటింపఁబడుట నవలలో బ్రరోచనార్థము. నాటకమునం దన్నను ప్రదర్శనార్థము. అనఁగా నాటకము నందుఁగథాసన్నివేశము శిల్పధర్మముగా బాటింపఁబడుట, ప్రదర్శనశక్తి చెడకుండుట కొఱకునై యున్నది. నవలయందన్ననో ప్రరోచన (ప్రస్తావన) శక్తి చెడకుండుట కొఱకై యున్నది. ప్రదర్శనశక్త్యుపేతతయా నాటకమునందును బ్రరోచనశక్త్యు పేతతయా నవలయందును గథాసన్నివేశమును శిల్పధర్మముగా భావించు చున్నామనుటయే యిందలి భేదము.

*సంక్షేపము :—*

నాటకరచనమున కేకథను స్వీకరించినను దానికి సంక్షిప్తత యావశ్యకము. నవలలో గథకు వైపుల్యము ధర్మము; సంగ్రహాత పనికియేరాదు.

అయ్యును నాటకమునందు కథను సంక్షేపించుటలో దాని ప్రాధాన్యము చెడ కూడదు. నవలయందు కథను విపులీకరించుటలో దాని నిబిడత్వమును జెడరాదు.

నవలలో నప్రధానవిషయము లెన్నియేని యుండవచ్చును; అనఁగా ననేక ప్రాసంగికములు చేరనగును; తప్పక చేరియేతీరవలెనని నియమములేదు. చేరినచో మాత్ర మాప్రాస్తావికవిషయములు ప్రధానకథలో నవలయందు సూత్రింపఁబడుట యావశ్యకము. ఏకతఃసూత్రింపఁబడని సప్రాసంగికమగునవల నిరర్థకము.

*ఇతివృత్తము :—*

నవలానాటకములలో నితివృత్త పరిగ్రహణమునందుఁ జాలభేదమున్నది. నవల చారిత్రకమో సాంఘికమో లేక యొక్కొక్కప్పుడు రాజకీయమోకూడ నగును.

కాని సాధారణముగఁ బౌరాణికము గాదు. అనఁగా నతిలోకవిషయప్రతిపాదకమగుట యసాధారణము. కాఁగా లాక్షణికుల దృష్ట్యా పరిశీలించినచో నవల యుత్పాద్య వస్తుక మగును. చాలవఱకు లోకాశ్రయమునుగూడఁ గావచ్చును. అంతియే గాదు. అసలు తన లక్ష్యసాధన కనుగుణముగాగాని, తనకు సుపరిచితము విశిష్టమునగుఁ బ్రాతి పదికయొక్క ప్రేరణవలనఁగాని నవలాకర్త యొకానొక పదకమును నిర్ణయించుకొన వలెను. అప్పు డాపదకమునుబట్టి యితివృత్తసంవరణము, సార్వకాలికమును యథార్థ ప్రయోజనకరమును గావలయునన్నచో నవలేతివృత్తము, గతానుగతికమగు బాహి రపుఁబ్రేరణఁ గలదిగా నుండరాదు అందుచే నవల, యాంతరకారణచోదితము; బహి ష్కారణచోదితము గాదు. రచయితశిల్పియు, వస్తు వాంతరకారణప్రచోదితము నగుచో నవల తన్నుదానే రచించుకొనఁగలదు.1

నాటకమువలెఁ బ్రసిద్ధేతివృత్త మనెడి సిద్ధాన్నమును నవల యపేక్షింపదు. నవలది కష్టాన్నము. ఇందువలననే యితివృత్తకల్పనకు నాఁటి ప్రపంచ పరిశీలనమును లోకుల మనోగతపరిజ్ఞానమును బహుదేశసంచార సంపాదితభౌగోళికజ్ఞానమును నానా నవ్యనాగరకతలపరిచితియు నవలారచయితకుఁ గావలసియున్నవి. మఱి నాటకకవి కన్ననో యివి యంతగ నక్కఱపడవు. కానీ నవలాకారున కివి లేకున్నచో నతనిరచన రాణింపనే రాణింపదు. అతిమాత్రానుభవములకు నవలయొక్కటియే సులభ వ్యక్తీ కరణసాధనమని పెక్కుమంది విమర్శకు లిందువలననే నవలను బొగడిరి.

*పాత్రోన్మీలనము:—*

శుద్ధాఖ్యానమునందుఁబాత్రచిత్రణములేదు. కాని చిత్రాఖ్యానము2లో నిది యావశ్యకము. అందుచేతనే నవల నాటకముతోఁ బోటిగా నిల్చినది. కాని నాటక కర్తకువలెఁ బరోక్షపద్ధతినే పాత్రచిత్రణము చేయవలెననెడిబాధ నవలాకర్తకు లేదు. అనఁగా బాత్రలను నవలాకారుఁడు తానై వర్ణింపనుగూడఁ జెల్లును. కాని పాత్రలు చక్కఁగఁగ్రమోన్మీలనము జెందవలె నన్నధర్మమునందుమాత్రము నవలానాటకములు రెండును దుల్యములే! అయ్యును నవలలోనికథ పెంపుకలది. కావున నా యున్మీల నమును బహుమందగతిలో నిర్వహింపవలసినశ్రమ నవలాకారున కున్నది3.

అసలు రచయిత కథలోని తనప్రధానమైన పదకమునుగూర్చి భావింపఁగనే సహ జముగను, గ్రమక్రమముగను దదావశ్యకపాత్రలు కావ్యరంగముపై రూపొందును.

1. "If a writer has the gift of his art, and the story is one he is impelled to tackle, it will write itself. ('*Writing Modern fiction*' by Leslie Beresford Page 41, 42)
2. Novel.
3. The slow shaking of the Character is the problem of the Novel.

దూరమునుండి చూపఁబడిన వస్తువులవలెఁ దొలుత నించుకించుక మసకమసకఁదోఁచినను గథాగమనములో సన్నివేశము లేర్పడుచున్న కొలఁదియు నా పాత్రలు రక్తమాంసము లతో తొణికిసలాడు వ్యక్తులవలె సుస్పష్ట వదనాంచలరేఖలతో మనకు సన్నిహితములై తమ విధ్యుక్తములను నిర్వహించు చుఁడును. అంతట రచయిత చదువరుల కాయా పాత్రల భౌతికమానసికశక్తుల నిర్దుష్టదర్శన మిప్పించుటయేగాక తానేపాత్రల జీవిత చరిత్రను బొందుపఱచుచున్నాఁడో యాయా పాత్రలతో దాదాత్మ్యము నొందును.

ఇట్టి యాదర్శకమైన తాదాత్మ్యము సిద్ధించినపుడు నవలాకర్త నవలాకర్తగా మిగిలిపోఁడు. అతఁడొక ఛాయాగ్రహణయంత్రమై పోవును. అతనికల మొక శబ్దగ్రాహక యంత్రము. కవియుఁ గలమును ఛాయాగ్రాహక శబ్దగ్రాహక యంత్ర ములైనపుడు వెలువడు చలనచిత్రమే నవల. అనఁగా దృశ్యములు, సంవాదములు, వర్ణ నలు, మున్నగువానికొఱకై వినియోగింపవలసిన స్థలనిర్ణయాదిక విషయములలో నవలారచయితకు స్వాతంత్ర్యములే దనుటకాదు. చెప్పఁబోవు ప్రధానాంశ మేమనఁగా, వస్తూన్మీలనము కథకకృతప్రయత్నమువలనఁగాక పాత్రోన్మీలనము వలననే నిర్ణయింపఁ బడు ననుట. నవలాకారు లంగీకరింపఁగలిగినను లేకపోయినను నుత్తమనవలానిర్మాణ విషయమున రచయితకును పాత్రలకును నేర్పడు సంబంధముమాత్ర మింత యవినా భావమైన దనకతీరదు.

*నవల నాటకాఖ్యానధర్మముల సమాహారము:—*

ఆఖ్యాననాటకధర్మముల రెంటినినిమిడ్చికొన్నది నవలయని చెప్పఁబడినది. అగు చో నవలయందుఁ బైరెంటికినిగల స్థానములను నిర్ణయించుటెట్లు? అనెడిది సమస్య. ఈ ధర్మముల సీమాభూమి నిర్ణీతికేమియుఁ బ్రమాణము లనిలేవు. ఆ శిల్పిదైన నైపుణ్యమే గీటుఱాయి. కాని యాచారపరంపరనుబట్టి పరిశీలించి యిట్లు విభాగింప వచ్చును. పాత్రప్రవేశాత్పూర్వమును నిష్క్రమణాంతరమును మాత్రమే నవలలో నాఖ్యానపద్ధతి యుండఁదగును. పాత్రలు ప్రవేశించి రంగమున (పుటలలో) నున్నంత కాలమును సంవాదమేసాగును. అనఁగా పాత్రల నట్లేకూర్చుండబెట్టి నవలాకర్త తాను గథఁజెప్పుకొనిపోవుట యుత్తమపద్ధతిగాదు. ప్రథమశ్రేణినవలలో నిట్టిది యుం డదు. ఇది పెక్కురువిమర్శకు లామోదించిన విషయము.

గ్రీకు నాటకములలోని 'కోరస్', మన నాటకములలోని విష్కంభాదులును, వీధి నాటకములలోని సూత్రధారుఁడును నిర్వహించుధర్మము లేవిగలవో వానిని నవలలో గథకుఁడే నిర్వర్తించును. ఇందుకుఁ దగినట్లు సంవాదములు శిష్టవ్యావహారికమునను గథనముయాత్ర మిశ్రప్రౌఢముగను నుండుట సమంజసము.

నవల పురాణేతిహాసకావ్యముఁవలె బుద్ధిశ్రమకోర్చి చదువవలసినది కాదుగావు నను నుత్తమాధికారులకు మాత్రమేగాక సర్వులకుఁ జదవదగినదిగావునను నిందలి భాషావినియోగము నాటకశైలికిని పామరవ్యవహారమునకును మధ్యనుమార్గము నవలంబించుట యుక్తమని తోఁచును.

కాని దీనికి నపవాదములు లేకపోలేదు. మహాకవి రచితములైన వచనకావ్యముల వంటి నవలలును గలవు. కాన వానివాని శైలీనిర్ణయము తత్కర్తలశిల్పదృష్టి నైశిత్యమునకె వదలివేయవలెను. మనమిచట స్థూలముగఁగూడ నిర్ణయింపఁ జాలము. అటులఁ జేయనురాదు.

## నవల మూలతత్త్వములు :– (షట్తత్త్వములు)

ఆఱు[1] ముఖ్యతత్త్వములు నవలానిర్మాణమున కాధారములు: (౧) వస్తువు (౨) పాత్రలు లేక పాత్రచిత్రణము లేక పోషణము (౩) సంవాదములు [ పాత్రపోషణము నకును పాత్రలసంవాదము లేక—కథోపకథనమునకును ఘనిష్ఠసంబంధ మున్నది. పాత్రల స్వభావధర్మసిద్ధాంతములు వారివారి సంవాదములవలనఁ దెలియఁగలవు ]. (౪) దేశకాలపరిస్థితులు లేక వాతావరణము (౫) శైలి (౬) ఉద్దేశము[2]. నవలాప్రాశస్త్య మును నిర్ణయించునవి రెండు ముఖ్యాంశములు. మొదటిది వస్తువు ; రెండవది వస్తుపోషణవిధానము.

ఇందు నవలలోని వస్తువునుగూర్చి ముందుగ విచారింతము. అసలు నవల యందలి యితివృత్త మౌచితీశోభితమా ? యనుటకై యష్టవిధపరీక్షలు గలవు.

(౧) ఇందలి వస్తువు సంపూర్ణమా, లేక యిందెచ్చటనేని విరోధమున్నదా ?

(౨) ఇందన్నివిషయములలోను సమీచీనత్వమును సుషమయుఁ (అంగాంగి సంబంధము సమానత్వమును) గలవా ?

(౩) వర్ణితాంశము లన్నియు నిందు సుసంఘటితములా? [మూలవస్తువునుండి మాలాపరంపరితములా ? ఇందలి యంశములనుట.]

---

1 పాత్రలువేఱు పాత్రచిత్రణమువేఱనని యీతత్త్వముల నేడుగా విభజించు వారు నుండ వచ్చును తిర్యక్కులుగాని రూపాయినాణెము, తపాలాబిళ్ళలవంటివిగాని పాత్రలై కథ నడుపుచున్నపుడు పాత్రచిత్రణ పోషణములు లేవనుకొనువారి వాదమిది. కాని యాయా పాత్రలకుఁగూడఁ బ్రాణిధర్మ మారోపింపఁబడుటచేత ముఖ్యతత్త్వము లాఱనుట నిర్బాధకము.

2. రచయిత ప్రకటింపఁదలఁచిన జీవితవ్యాఖ్యయే యీయుద్దేశము.

(४) అతి సాధారణ విషయమునుగూడ నసాధారణముగఁ జిత్రించుటలో రచయిత సఫలుఁడయ్యెనా?

(५) ఘటనాక్రమ [సన్నివేశరచన] మలౌకికము నసంగతము నస్వాభావికము నై యుండలేదుగదా? [సంఘటనములెంత యసాధారణములైనను బై మూఁడుదోషములు నుండరాదు.][1] అనఁగా బ్రాయోభావము జీవగఱ్ఱ యని మరవరాదు.

(६) కథానిర్వహణము లేక సమాప్తి, వర్ణితసన్నివేశముల కనుకూలమా? వస్తువునవాని పూర్వాపరసంబంధమెచటను జెడలేదు గదా?

(७) అందు సుగమత్వమునకు, నాహ్లాదజనకత్వమునకు, స్వాభావికత్వమునకును లోపము రాలేదుగదా?

(८) శైలిలో శైథిల్య మెచటనేనిఁ గలదా? శైలీకౌశల మున్నదిగదా?

*నవలా విభాగము :—*

తొలుతఁ జెప్పినట్లు నవలాప్రాశస్త్యమును నిర్ణయించు రెండవ ప్రధానాంశము వస్తుపోషణము. దీనినిబట్టి బహుస్థూలముగ నవలను మూఁడువిధములని విభజింపవచ్చును.

(१) ఐతిహాసికపద్ధతి

(२) స్వీయచరిత్రవిధానము.

(३) పాత్రల సాంఘికశారీరకాధ్యాత్మికశక్తు లతిమానుషములుగా నుండరాదు.

అతిలోకశక్తులచే సాధారణీకరణము లోపించును. అందువలన మనోరంజకత్వ మేర్పడదు. మఱియు నవలయందలిపాత్రలు లోకాతీతములైనచో నవి రచయితచెప్పుచేతులలో నుండవు. ఒకచైతన్యమొసఁగి సృష్టికర్త మనలను లోకమునం దెట్లు వదలెనో యట్లే నవలాకర్తయుఁ దన పాత్రలకుఁ జైతన్యము [జీవసంపుటి] నొసఁగి సన్నివేశములయందు వదలివేయవలెనేగాని తా నడుగడుగునకును జోలి పట్టించుకొనరాదు. ఆయా పాత్ర లాయా సన్నివేశములలో నుచితరీతిగ మెలఁగును. ఏరచయితగాని తాను దానుగానున్నపుడు పలుకనిమాటలు పాత్రలముఖమునఁ బలు

1. The Abnormal may be dipicted; but not the unnatural or the absurd.

కును. అందుచేతనే కవి తన్నుఁదానుమించిన యొకానొకదశలో సన్నివేశౌచిత్యము నెఱిఁగి స్వేచ్ఛగాబలికించు పాత్రలపలుకులును జేయించు పాత్రలచేతలును గవిశబ్దశక్తికి భావనాశక్తికిని బరాకాష్ఠ లనఁబడుచున్నవి.

*నవల పాత్రపోషణము :—*

నవలయందుఁ బాత్రపోషణము నాటకమునందుకంటెఁగఠినము. నవలాకారుని పాత్రపోషణసాఫల్యమునకు సజీవమైన వర్ణనాశక్తి యావశ్యకము. ఇది నాటకకర్త కావశ్యకముగాదు. అట్లే కథానికతో బోల్చిచూచినను దాని క్షేత్రము సంకుచితము. కానఁ గథానికలో బాత్రోన్మీలనము నిష్కృష్టమై ద్రుతగతిఁగలిగి యుండవలయును. విస్తృతక్షేత్రముగల నవలయందు మందోన్మీలనము ముఖ్యము. అనఁగా నవలలో బాత్రలను గ్రమవికాస మొందించుట యావశ్యకమైన పని.

ఈ పాత్రపోషణము ప్రధానముగా ద్వివిధమైనది. మొదటిది విమర్శనాత్మకము. రెండవది యభినయాత్మకము. మొదటిదానిలో రచయిత పాత్రలయందే ప్రవేశించి భావములను స్వభావములను రాగద్వేషములను వెల్లడించి వానిని వ్యాఖ్యానించి కారణమునుదెల్పి పిమ్మటఁ దన విమర్శనమునభిప్రాయమునుగూడ వెల్లడించును.

ఇఁక రెండవదానిలో రచయిత పాత్రకు దూరముగనుండి వానివాని సంభాషణ వ్యాపారమువలననే యాయా పాత్రల గుణశీలములనుఁ బ్రస్ఫుటితము చేయును. ఇది యుత్తమకోటి శిల్పజ్ఞత.

*పాత్ర కథావస్తువుల స్థూలసంబంధము :—*

(౧) కొన్నినవలలలో బాత్రలు ప్రధానములై సంఘటన లప్రధానములుగా నుండును. ఇట్టి పాత్రప్రధాననవలలను నాటకీయము లందుము. పాత్రల దత్తశీలములే కథాపర్యవసానము నిందు నిర్ణయించును. శ్రవ్యకావ్యములలో మహోత్కృష్టములగు నిట్టి నవలలకుదృశ్యకావ్యములలో విషాదాంతములనఁబడువానితో బోలిక కుదుర గలదు.

(౨) మఱికొన్నినవలలలో గథాసంవిధానము ప్రధానమైయుండును. శ్రవ్యకావ్యములలో మహోదారములగు నిట్టి నవలలను దృశ్యకావ్యములలో శుభాంతము లనఁబడువానితో బోల్తుము.

మొత్తముమీఁద పాత్ర [లేక-శీల] ప్రాముఖ్యముగల నవల[1] లుత్తమశ్రేణికిఁ జెందినవి.

---

1. Character Novels.

పాత్రప్రధానరచనమం దట్లుఁగాక పాత్రలశీలప్రభావ మధికమగుటవలనఁ బాఠకునియందు వాని శాశ్వతప్రభావము ముద్రితమగును. కావుననే పాత్ర [లేక - శీల] ప్రధాననవల లుత్తమములుగా నెన్నఁబడుట.

వస్తుశీలచిత్రణములఁ బరీక్షించినచో సాధారణముగా వీనికి పరస్పరవిరోధ మున్నట్లుగా నగపడును. వస్తువుపై నధికధ్యానముంచినచో బాత్రల శీలములయం దశ్రద్ధ యేర్పడవచ్చును. అట్లే శీలచిత్రణమునందే లక్ష్యమధికముగా నిల్పినచో[1] గథాసన్నివేశసంవిధానము, సుదృఢబంధముగలది కాకపోవచ్చును. కుశలులైన కళాశిల్పు లీరెండు తత్త్వములను మేళవించి సామంజస్యమునుగూర్చుటకుఁ బ్రయత్నింతురు.

సన్నివేశసంఘటములన్నిటికిని సరియగు కారణములను జెప్పుచుఁ బాత్రలకు సంబంధించిన భూమికలలో వానివాని క్రమవికాసమును దెల్పుకొనుచుపోవుట నవలాకారుని కర్తవ్యము. ఎచటనుగాని యసంగతము, నస్వాభావికము, లోకవిపరీతమునగు సంఘటనము లుండ రాదు.

*నవల సంవాదములు — వాని ప్రయోజనములు :—*

సంవాదమునందు భూతకాలవిషయమును వర్తమానకాలముదిగాఁ దోఁపింపఁగల సామర్థ్య మున్నదని మున్నే తెలిసికొంటిమి. కథావస్తువునందలి యాకర్షణము నినుమడింపఁజేసి పాత్రలయందు జైతన్యమునుఁ గూర్చుటయే సంవాదముల ప్రయోజనము. సంవాదములు పాత్రల మనోముకురములు. వీనివలననే పాఠకులకుఁ బాత్రల గుణశీలస్వభావములతోడి పరిచితియేర్పడు చున్నది. వీని నిర్వహణమే నవలాకారుని నైపుణ్యమునకు నికషోపలము.

*సంవాదముల ప్రధానోద్దేశము :—*

వస్తూన్మీలనమే సంవాదముల ప్రధానోద్దేశము. సంభాషణములయందు రూపకోచితవిధానము వన్నెఁగూర్చును. రూపకములయందువలె నీపద్ధతిలో గవి కానరాఁడు.

---

1. నీచమైన త్వగింద్రియనైశిత్యమును గూడ మోక్షప్రాప్తికి సాధనముగాజేసి చూపఁగల్గిన శ్రీవిశ్వనాథవారి "ఏకవీర: తెఱచిరాజు" లవంటి నవలల యుత్తమత్వము నిచట సోవపత్తికముగ నిర్ణయింపమికి హేతువు లక్ష్యలక్షణసమన్వయ మీ ప్రకరణోద్దేశము గామియే. ఏలన వానియందు సన్నివేశముచేగల్గిన ప్రభావము పాఠకునియందు స్థిరముగా నెలకొనదు. నవల సన్నివేశప్రధానమైనచో గౌతూహలవర్ధనక మయ్యుఁగూడ జీవన తత్త్వసంబంధియగు ప్రభావముద్రను బఠితృహృదయమున గంభీరముగఁ గుదురుకొన నీయదు.

ప్రశస్తమైన సంభాషణముల కాఱు శ్రేష్ఠగుణములుండు ననవచ్చును. (౧) స్వాభావికముగను (౨) ఉపయుక్తముగను (౩) విషయానుకూలముగను (౪) ఇతివృత్తముతో సరిగఁ దులఁదూఁచినట్లుగను (౫) సరసముగను (౬) సుబోధకముగను సంభాషణము లుండుట యావశ్యకము.

కావ్య మతిలౌకికానందదాయి. నేఁటి సాహిత్యవివిధాంగములయందు నవల కవిరళప్రచార మున్నది. అందుచే నది రసాత్మకముగూడనైనచో నత్యంతప్రభావశాలిగా నుండఁగలదు.

దేశకాలపరిస్థితులచిత్రణమును నవలలో వాతావరణ మందుము. ఇది ద్వివిధము. ఒకటి సాంఘికము; రెం డైతిహాసికము.

జీవనవ్యాఖ్యయే దీని ముఖ్యోద్దేశము. రూపకపద్ధతియు స్వతంత్రపద్ధతియునని రెండుపద్ధతులుగా నవలలో జీవితమును వ్యాఖ్యానింపవచ్చును.

*నవల సత్యమునకు స్థానము :—*

ఇందలి సత్య మలౌకికమైనది. లౌకికయథార్థమే, కావ్యమం దలౌకిక యథార్థముగా మాఱును. అదియే సత్యము. అనఁగా నలౌకిక యథార్థము కావ్యసత్యము. లోకమందలిసత్యము విజ్ఞానపరకము. కాని, కావ్యసత్యము భావనాప్రసూతము, ననిర్వచనీయము. నిత్యము జరుగునదిమాత్రమే కేవలము సత్యముకాదు. ఏది కాఁగలదో యదియుఁగూడ [వృత్తము, వర్తమానమునుగాక వర్తిష్యమాణముగూడ] సత్యమే! జుగుప్సాకరమైన మానవజీవితముగూడఁ గావ్యనాటకనవలాది సాహిత్యప్రక్రియలలో నాదర్శముపై నాధారపడి యాదరణీయమును సార్వకాలీనమును సార్వదేశికమును నిత్యనూతనమునునై యింద్రజాలమువలె నత్యంతాకర్షక మగుచున్నది.

*నవల : వాస్తవికత :—*

వాస్తవికతకు నవలయం దుచితస్థానమున్నది. నవలయందలి సత్యపరత, వాస్తవికతకును సంభావ్యతకును[1] భ్రాంత్యాభావమునకును సంబంధించినది[2]. జరుగఁగలవియు సర్వథా లోకసమ్మతమై ప్రవర్తిల్లినవియుమాత్రమే నవలయందు స్థానమున కర్హములు. నవలయందలి సంఘటనములు నిత్యలౌకికజీవితసంబద్ధములగుటచే వాస్తవికములు; కాని వానికి నిజమైన యస్తిత్వము లేకపోవుటచే గల్పితములు. సూచ్యప్రాయముగనైన రచయిత యొకసందేశము నందింపని వాస్తవికత యోగ్యమైనది కాదు.

---

1. Possibility.
2. Probability.

*నవల ; నీతిబోధ :—*

భావములయు నుద్దేశములయు స్ఫూర్తికి [మెఱుఁగునకు] నీతిబోధ యావశ్యకము. కాని నీతిని గథావస్తువులో క్షీరమునందు శర్కరనువలె మేళనమొనర్చుట యందే నవలాకారుని ప్రావీణ్యము గోచరించును.

*నవల యందలి తెగలు :—*

-:ప్రధానముగా నవల లాఱు తెఱఁగులు:-

(౧) ఘటనాప్రధానములు (౨) కౌతూహలప్రధానములు (లేక ఆసక్తిజనకములు లేదా కాల్పనికములు) (౩) శీల (పాత్ర) ప్రధానములు (౪) సంఘచిత్రణప్రధానములు (౫) ఇతి హాసప్రధానములు (౬) మనః ప్రవృత్తి నిరూపణప్రధానములు. వీనినే సహజావబోధ ప్రధానములు నందురు1.

రాజకీయ వస్తుప్రాధాన్యమునుబట్టి కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి', శ్రీవుప్పల లక్ష్మణరావుగారి 'అతడు—ఆమె' మున్నగువానివంటియు ; నిర్దిష్టప్రయోజనమునుబట్టి కేవలము పాఠశాలా విద్యార్థుల కుద్దేశింపఁబడిన శ్రీవిశ్వనాథవారి 'పరీక్ష', 'స్నేహఫలము', శ్రీహనుమదింద్రగంటివారి 'మహామంత్రి' మున్నగు వానివంటివియునేగాక నింక క్రొత్త విధములగు నవలలు పెక్కు వెల్వడుచున్నవి2.

పూర్వపుఁ బురాణేతిహాసముల లోని యాఖ్యానోపాఖ్యానములను నేఁడు నవలలుగఁ గొందఱు వ్రాయుచున్నారు3. వీనిని పౌరాణికనవలలన్నను విరోధము రానట్లుగఁబదమైత్రిఁ గుదుర్చుకొనవచ్చును. మఱికొందఱు 'మనుచరిత్ర','వసుచరిత్రా'ది ప్రబంధములను నవలీకరించుచున్నారు. ఇవి ప్రబంధనవలలు. ఆకాశవాణిచే నవలల సంఘాతములును ప్రసారితములు. చలనచిత్రనిర్మాణమునఁ దోడ్పడు సూచ్యసంకేతాదుల పరిభాషగల నవలలు వేఱొక మాదిరివి. వీనిని జలనచిత్ర పారిభాషికనవల లందుము.

1. Instinct - Novels.

2 చైతన్యస్రవంతి విశేషమునే ప్రధానముగఁగల "విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు" వంటి నవలలు.

3. శ్రీఆదిరాజు వీరభద్రరావుగారు 1903 నాఁటికే నన్నపార్యుని శకుంతలోపాఖ్యానమును "చిత్రశాకుంతలము" ని. 300 పుటలలో నవలీకరింపనెంచి 100 పుటలువ్రాసి యానాఁటికి దేశకాలపరిస్థితు లనుకూలింపమిచేతను నేఁటి శిల్పసామగ్రి నాఁడు కూడిరామిచేతను నుపసంహరించుకొనిరి. కాన నదియొక యసంపూర్ణము నముద్రితమునగు నవలగా మిగిలినది.

ఏదో యిట్టిదాని నొకటి శ్రీ. శ్రీ. గారు వ్రాయుచున్నారనియో వ్రాయనున్నారనియో వదంతి. అట్టివి యిట్లుండఁగలవేమోయని యూహాపోహము చున్నది. ఇది కేవల మూహము ; పొరపాటును గావచ్చును. అనేకోహాలవలనఁ దల దిరదిరఁదిరుగు నొకపాత్ర కుర్చీలో గూర్చుండి, లేచి, మఱలకూర్చుండి, లేచిపోవు ననుకొందము. అది యే చలనచిత్రమునందగుచో నా కుర్చీని గొంతసేపు పాత్ర నిష్క్రమించిన పిమ్మటఁ గూడ గిరగిరఁ దిరుగుచున్నట్లే చూపుదుము. ఈహాలవలనను నూహాలవలనను దల తిరిగిపోవుట కట్లు కుర్చీతిరుగుట సంకేతము. ఈ విషయమును నిరూపించుటకు నవలాకర్తయగుచో నా పరిభ్రమణమును వర్ణించి దాని సాంకేతికార్థమును గూడ సూచింపవలెనేమో! ఏది యేమైనను నిదియొక యూహా మం[illegible]మి గదా! కనుక నిట్టి నవలలకై సంభావ్యభవిష్యములోని కన్నులుసాచి వేచిచూతము.

ముందుముందునకుఁ దొంగిచూచినకొలఁదియు నొకవిచిత్రము తోఁచుచున్నది. రచయితకును బాత్రలకును నవినాభావసంబంధము లేకపోవుటయేగాక సుదృఢబంధము నేని లేనినవలలు వెలువడఁగల వనుటకుఁ బైఁజెప్పిన పౌరాణికనవలలు, ప్రబంధనవలలే సాక్ష్యము. ఇవి దక్షతతో నిర్వహింపఁబడినచోనన్న నామాట వేఱు.

నేఁడు మన యాంధ్రభాషయందేకాదు; పాశ్చాత్యభాషలయందును గొందఱు నవలాకారులున్నారు. వారిమతమునఁ గడుపెద్దదియు వదులువదులై నదియు నగు నొకరకఁపు బీలికలసంచివంటిది నవల. అందుఁ జిత్రవిచిత్రపరిశీలనలు నపరిష్కృతాభిప్రాయములు ననఁదగు వ్రేలాడుపీలికలనుగూడ దూర్పవచ్చును. వచనరూపమున నున్న ప్రతికథయు నవలయగు దినములు వచ్చినను వింతకాదు. కాని శిల్పసామగ్రీవినియోగమునుబట్టియే దాని స్థాయి స్థిరీకరింపఁబడుననుట సార్వకాలికసత్యము.

ఇచట నవలాచరిత్రసంగ్రహముతో బాటుగ దాని వివిధ లక్షణములను వాని వాని మిథఃప్రచురసాజాత్యమును దల్లఘువిమర్శనయుఁ బొందుపఱుపఁబడినవి. ఇం డిప్పుడే యనివార్యముగ రాగల తొలిమలినవలల గుణగ్రహణమునకును వానివాని స్థాయిని నిర్ణయించుటకునుగూడ దిఙ్మాత్రసూచితములగు నీ లక్షణములు క్వాచిత్కముగఁ దోడ్పడకపోవనియాశ.

౨

## -: వైదేశిక పూర్వరంగము : ఆంధ్రనవలా సాహిత్య చరిత్రము:-

నవలయనఁగా 'నూత్నమైనద'ని యాంగ్లభాషలో నర్థము. నేఁడు ప్రసిద్ధిఁ గన్న ప్రతివాఙ్మయమునను విశిష్టశాఖగా లోకప్రియత గడించుకొన్నది యీనవల. ఆంధ్రమున నన్ని నూతనసాహిత్యప్రక్రియలవలెనే పందొమ్మిదవ శతాబ్ది పరార్థమున

నిది నామరూపభావములలోనో లేక యే యొకటిరెండింటిలోనో యనుకరణశీలముఁ గల్గియే యుద్భవించిన దనవచ్చును. నేఁటిమన స్వతంత్రతతో బోల్చుకొనుదుమేని యన్నివిధముల దాస్యమున మ్రగ్గు నాఁటిరచయిత లాంగ్లాదిభాషలనుండి తొలినాళ్లలో నవలానువాదములకు దొరకొనిరన్న తప్పేమి యున్నది? ఉచితమైన యనుకరణశీల మొకజాతికిఁగాని వ్యక్తికిఁగాని మార్గదర్శకమును శుభోదర్కమునుగదా! జన్మతః మానవుఁ డనుకరణాభిలాషి. ఒకతిలక్ మహాశయుని మార్గదర్శకత్వములేక యొక గాంధిమహాత్ముఁడుగాని యొకన్యూటనుపండితుఁడులేక యీన్‌స్టీన్ మహోదయుఁడు గాని యశస్వులయ్యెడివారు గారు. వ్యాసమహాభారతానువాద మైనంతమాత్రమున నాంధ్రభారతమునకుఁ బ్రతిభాలోప మున్నదా?

*మొదటి నవల :—*

కీ. శే. కొక్కొండ వేంకటరత్నముపంతులు 'మహాశ్వేత'యను నవల వ్రాసి నట్లును1 కీ. శే. శివశంకరపాండ్య మన యాంధ్రభాషలో మొదటినవలయని దానిని గూర్చి ప్రశంసించుచు కీ. శే. "వెంకటరత్నముజీవితచరిత్ర"యం దాంగ్లమున వ్రాసినట్లును శ్రీనిడదవోలు వేంకటరావుగారు తెలిపియున్నారు2. సంస్కృతమున బాణభట్టుని గద్యకావ్యరాజమగు 'కాదంబరి'లోని మనోహరమగుకథ యీనవలకుఁ బ్రాతిపదిక యనియు కీ. శే. శివశంకరపాండ్యయే నుడివిరి. ఇందు కొంతభాగము 'వైజయంతి' పత్రికలో ప్రకటితమైననుళి బూర్తిగ్రంథ ముపలభ్యముగాదు. అది పూర్తిగ లభింప నంతమాత్రమున నాంధ్రమునఁబ్రథమనవల కాకపోవునా? మఱి స్వకపోలకల్పితము గాఁక సంస్కృతకాదంబరి నాధారముగాగల దీనిని బ్రథమాంధ్రమౌలికనవల యన వచ్చునా? నవలవైన నామరూపము లాంగ్లమునుండిగదా మన యాంధ్రములోనికి దిగుమతియైనవి? సంస్కృతమునుండికావే యనువారు కొందఱు. ముం దాగ్రంథమే పూర్తిగ లభింపనిది దానియందలి నవలాలక్షణము లెట్లు నిర్ణయింతుము? ఐన నాధునిక నవలాలక్షణములతో బూర్వనవలల వేనినిగాని పోల్చి పరీక్షించుటయుఁ గూడదు. పాండ్యగారి ప్రబలసాక్ష్యముచాలదా? యని మఱి కొందఱు. ఇంతలో నీసమస్యలు పరిష్కరింపఁబడగలవికావు. వాని నట్లుంతము.

1. క్రీ. శ. 1867

2. 'ఆంధ్రవచన వాఙ్మయము' 123వ పుట.

3. క్రీ శ. 1895.

*స్వతంత్ర నవల :—*

"క్రీ. శ. 1872లో కర్నూలు నరహరి గోపాలకృష్ణమ్మసెట్టిగారు 'రంగరాజ చరిత్ర'యను నవల వ్రాసి ప్రకటించియున్నారని చెప్పఁబడుచున్నది[1]." వ్రాయుటయును బ్రకటించుటయుఁగూడ 1872లోనే యగుచో "ఆంధ్రవాఙ్మయసూచిక" 1871 ముద్రణముగా దీనిని జేర్కొనుట ప్రమాదజనితమై యుండవలెను[2]. ఏది యెట్లున్నను నీ నవల సంస్కృతాంగ్ల మూలాధారములు లేనిది. "ఇది కేవలము కల్పితంబు[3]." మఱి దీనిని బ్రథమాంధ్రమౌలికనవల యని లోకముగాని, శ్రీనిడదవోలు వేంకటరావుగారుగాని యేల యనలేదో విచార్యము. బహుశః ప్రాతిపదికగా నితరభాషలలోనికథ మహాశ్వేతవంటి నవలయందుండుట యొకదోషముగాదని లోకము వారును శ్రీనిడదవోలువారును నేకాభిప్రాయులైరేమో!

*రాజశేఖర చరిత్ర :—*

క్రీ. శ. 1878 లో కందుకూరి వీరేశలింగము పంతులుగారు 'రాజశేఖరచరిత్ర' యను వచనగ్రంథమును బ్రకటించిరనియు నిది యనుసరణమనియు దీనిని నవలగా భావించుటచేతను పంతులుగారే తాము మొదటినవలారచయితనని చెప్పుకొనుటచేతను దీనికి

1. ప్రబుద్ధాంధ్ర, జనవరి — 1924; *ప్రతిభ*. సం. 1 సం 3; *ఆంధ్ర వచన వాఙ్మయము* పుట 123; ఇట్లే చేకుమళ్ళవారు వ్రాసినట్లు *'నవ్యాంధ్ర సాహిత్యవీథులు'* పుట 23 నందును గలదు (ద్వితీయముద్రణము. 1949).

2. దీని సరియైనపేరు "*శ్రీరంగరాజుచరిత్ర*"; కర్త పేరు నరహరి గోపాల కృష్ణమ సెట్టి; 14—6—1872లో దీని ప్రథమప్రకటనము. ఇందలి పుటలు 101. ఆంధ్రుల యాచారవ్యవహారములచిత్రణ దీనిప్రధానోద్దేశమని తోఁచును. కథనము బిగిఁగలదే; కాని లంబాడీల గుంపుచే నిందు నాయికయగు [సోనాబాయి]రంగనాయిక బలాత్కారముగ బంధింపఁబడిన సంఘటనముమాత్ర మంత శుభోత్కరముగ లేదు. దీనిని కులస్త్రీ లెంతవఱకు మెత్తురో విచార్యము. "*శ్రీరంగరాజుచరిత్ర*"యని దీనిపేరు ప్రభుత్వమువారి గెజెటులలోఁబడుట పొరపాటు. అట్లే A. Gopāla Krishnama Chetty' అని పడుటయు నచ్చుతప్పు. 'యన్' అని యుండవలెను. వీరియింటిపేరు నరహరివారు; కులముచే వీరు సెట్టిబలిజీలు గావచ్చును. "కర్నూలు జిల్లా భూగోళము"ను (ఇం దితరవిషయములునున్నవి; పుటలు 104)బ్రభుత్వమువారి యాదేశమున 1871లో నాంగ్లభాషయందు వ్రాసినదియు, చిన్నయసూరితో గలిసి 'హిందూధర్మశాస్త్రము' ననువదించినదియు నీ గోపాలకృష్ణమగారే కావచ్చును. ఈయన కర్నూలుమండలములో డెప్యూటీకలక్టర్ ఉద్యోగముచేసినట్లుఁ దెలియుచున్నది.

3. *శ్రీరంగరాజుచరిత్ర*—ఉపోద్ఘాతము. (1872)

నవలాత్వ మబ్బినదనియుఁ జెప్పఁబడినది[1]. దీని ప్రాశస్త్యమునుబట్టి యాంగ్లము లోనికిఁ బరివర్తన మొనర్పఁబడుటయేగాక[2] లోకప్రియత్వమునుబట్టి యిది క్రీ. శ. 1929 నాఁటికే 'యాంధ్రవాఙ్మయ సూచిక' యందు నవలగా బేర్కొనఁబడినది. 'శ్రీరంగరాజుచరిత్ర'ను నవలగా నంగీకరించిన శ్రీనిడదవోలు వేంకటరావుగారు క్రీ. శ. 1954 నాఁటికిఁగూడ 'రాజశేఖరచరిత్ర'ను నవలగా నంగీకరింపరైరి. "వివేక చంద్రిక" రాజశేఖరచరిత్రకు నామాంతరము. 'శ్రీరంగరాజుచరిత్ర'లోని శైలి ప్రబంధోచితము; కథ పేలవము. కల్పనాచమత్కారము, రచనాపటిమ మున్నగు వానిలో 'రాజశేఖరచరిత్ర' మిన్న[3].

'మహాశ్వేత' యుపలభ్యముగామిచేతను 'శ్రీరంగరాజుచరిత్ర'కుఁ బ్రసిద్ధిలేమి చేతను గాబోలు నింతకుఁ బంతులుగారి 'రాజశేఖరచరిత్ర'యే ప్రథమాంధ్రనవలయని దేశమునఁ బెక్కువిమర్శకు లభిప్రాయపడుచున్నారు. ఆనాఁడు సాంఘిక సంస్కరణ ములయందుఁ బురోగాములును సాహిత్యకచైతన్యమునకు హేతుభూతులును నేక వింశత్యుత్తరశతాధిక [నూటయిరువది రెండు?] గ్రంథకల్పనులును మఱియు ననేక కారణపురస్కృతిచేత నద్యతనయుగప్రవర్తకులును గూడనగుటవలనఁ బంతులుగారే తొలినవలానిర్మాతలనినను సత్యమువలె నుండును; కాని యిది యథార్థముగాదనిను కొందఱవాదము.

*ఏది ప్రథమ నవల :—*

ఈ పక్షమువారు కథావశేషులు ఖండవి(వ)ల్లి రామచంద్రుఁ డాంగ్లేయ సార స్వతపట్టభద్రులనుగూడ నాశ్చర్యచకితులఁ గావించు నవలను[4] తొలుత రచించుట ప్రశంసనీయముగదా! యందురు.

---

1. '*రాజశేఖరచరిత్ర*'యనుపేరు తొలుత వివేకవర్ధనీపత్రికలో (1878) బ్రకటించి నప్పటిది; పిదప గ్రంథరూపప్రథమ ముద్రణమున (1—8—1880లో) '*రాజశేఖర*' యనియే కలదు. "We may well say that *Rājasekhara* marks an era in the annals of Telugu Literature", Vide,"*The Hindu*" – (1878). నేఁటి ముద్రణములో మఱల "*రాజశేఖరచరిత్ర*"యని యగపడుచున్నది. ఇది యానాఁటి విద్యావిచారణాధి కారియైన 'కర్నల్ మెక్డానల్డు' దొరగారి కంకితము చేయఁబడినది.
2. '*ఆంధ్రవచనవాఙ్మయము*,' పుటలు 123, 124.
3. జె. రాబర్ట్ హచిన్‌సన్ అను నాంగ్లేయుఁడు 1887లోనే దీనిని'*The Fortune's Wheel*' అనుపేరిట నాంగ్లము లోనికిఁ బరివర్తన మొనర్చినాఁడు.
4 '*ధర్మవతీవిలాసము*' ఖండవిల్లి రామచంద్రుఁడు — వచనము — 1894 అని '*ఆంధ్ర వాఙ్మయ సూచిక*', రాజమహేంద్ర *వరగౌతమీ గ్రంథాలయమున* దీని వ్రాఁతప్రతి యున్నది. గ్రంథముఖపత్త్రిములపై "*Dharmavatee* Vilāsamu" 1893 – *Chintamani* first prize' - Novelette, ఖండవిల్లి రామచంద్రుఁడు" అని కలదు. ఇది 1894లో ముద్రితమైనదని "*ఆంధ్ర వచన వాఙ్మయము*"ను సాక్ష్య మిచ్చుచున్నది. 'ఖండవల్లి'వారు వేఱు; 'ఖండవిల్లి'వారు వేఱు; అని కొందఱు.

రసూల్‌కొండ ప్రభుత్వపాఠశాలలో బండితులైన ఖండవిల్లి రామచంద్రుఁడు గారి నవలికలు 'ధర్మవతీవిలాసము[1]', 'మాలతీరాఘవీయము[2]', 'లక్ష్మీసుందర విజయము'[3] ననునవి మూఁడును నాఁడు చింతామణిపత్రిక నిర్వహించిన నవలల స్పర్థలయందు నుతులును బహుమతులును గొన్నవి. వీనిని నవలలుగా నిర్ణయించుటలో గందుకూరివారికి భాగస్వామ్యముఁ గలదు. అట్టి నిర్ణాయకాధికారముగల కందుకూరివారి 'రాజశేఖరచరిత్ర'నుగూడ నవలయనుట ధర్మము. ప్రాతిపదికగ నేవో కథలు గాథలును చిలకమర్తివారి నవలలకు నున్నవి; నేఁటికి మనకు నున్నవి. కాని యది యొకదోషము పంతులుగారివిషయముననే గారాదు. పైఁగా నానాఁడు నవల యాంగ్లసంస్కారముతో వ్రాయఁబడకయుండదు. అట్లు వ్రాయఁబడియు స్వతంత్రమువలె నుండట 'రాజశేఖరచరిత్ర' దైన విశిష్టత.

'మహాశ్వేత' కల్పితము కాదందుమేని 'శ్రీరంగరాజుచరిత్ర' కల్పితమైనను త్రోసిపుచ్చఁబడి, 'ధర్మవతీవిలాస'మే స్వకపోలకల్పితమైన ప్రథమాంధ్రనవలగా నిర్ధరింపఁబడినను నాఁటి పెక్కు నవలలకు మార్గదర్శకమైన 'రాజశేఖరచరిత్ర'కుఁగల ప్రశస్తి మాసిపోదు. అది నేఁటికిని బ్రథమశ్రేణినవలలుగఁ బరిగణింపఁబడువానిలో సమగ్రసుందరమగు 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్' అనుదానికి ఛాయానుసరణమో లేక సంస్కారమూఁదిన యనుసరణమో యైనను నవలలఁ బ్రోత్సహించిరనెడి పంతులుగారి ప్రఖ్యాతికిఁ బ్రతిభయు నందుఁదోడుగానిచో నెన్నఁడు నది యాంగ్లములోనికిఁ బరివర్తితముఁ గాజాలదు. ఆంగ్లభాషలోని కనువాదము నొందుటయను భాగ్యముపట్టిన యాంధ్రకృతుల నసలు వ్రేళ్లపై లెక్కింపవచ్చును. అనుసరణమయ్యును నది స్వతంత్రమగుట కీ యొక్కదృష్టాంతమే చాలును. అందలి విశిష్టహాస్యరసస్ఫోరకత్వము సహృదయహృదయాహ్లాదకము. సరసపుష్కలమైనది యందలిసంవాదశైలి. ఇందు పంతులుగారు మన సాంఘికదురాచారములను దూర్వారఁబట్టినట్లు మున్నే చెప్పఁబడినది[4]. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి నవలను విమర్శించుటయుఁ గలదు[5].

---

1. రచన క్రీ.శ. 1893.
2. ప్రథమ ముద్రణము 1895.
3. ప్రథమ ముద్రణము 1896.
4. నవ్యాంధ్రసాహిత్యవీథులు, పుట. 24. 2వ కూర్పు.
5. Id. Page 23. Foot Note.

పంతులుగారి యింకొకనవల 'రాఘవేంద్రవిజయము' అందురు[1]. వీరి 'సత్య రాజాపూర్వదేశయాత్రలు[2]' గూడ నిట్టి యాంగ్లసంస్కారబలముఁ గలదే! సంఘ సంస్కరణప్రధానము లగుటచే వీరిరచనలు పెక్కింటివలెనే యిదియు గడింపవలసినంత రసవత్తను గడింపలేకపోయిన దనుట సాహసముకాదు. కాని యిందలి మూఢాచార విమర్శనము, వ్యంగ్యవైభవ విలసితమగుట మఱపురానిది. ఆ హేళనలో మొత్తము మీఁద మెత్తఁదనముకంటెఁ గఱకుఁదనమే హెచ్చు.

కీ. శే. చిలకమర్తివారివి 'దాసీకన్య'[3] 'సుధాశరచ్చంద్రము' వంటి యనువాద ములు కొన్నియున్నను స్థూలముగ స్వతంత్రములే యధికము లనఁజెల్లును. 'రామ చంద్రవిజయము', 'కృష్ణవేణి', 'రాజారత్నము', 'అహల్యాబాయి', 'హేమలత', 'సౌందర్యతిలక','కర్పూరమంజరి','శాపము', 'గణపతి', మున్నగునవి వీరి ప్రసిద్ధనవలలు. వీరేశలింగముగారి సౌకుమార్యమును గొంతసౌమ్యతతో గుస్తరించినవారు వీరు.

ఇంత రమణీయముగా గథఁజెప్పఁగలవీరు 'శాపము' వంటి యొకటిరెండుదప్ప నధికముగ నాంధ్రచారిత్రకనవలల వ్రాయకపోవుటకుఁ గారణము లున్నవి. వారినాఁటికి మనచారిత్రకపరిశోధన మున్నదశ యొకముఖ్యకారణము. అది మనరాష్ట్రములోని జాతీయసాంస్కృతికోద్యమముల కుపశ్రుతియైనదనుట తప్పుగాదు.

*రామచంద్ర విజయము :—*

వీరి ప్రథమనవల 'రామచంద్రవిజయము' సాంఘికము. ఇది 'చింతామణి' పత్రికా ప్రథమ[4] బహూకృతి నొందినది. చిలకమర్తివారి సాంఘికనవలలలో నిది విశి ష్టతగలది. ముఖ్యముగ వీరిది చారిత్రకదృష్టి. 'ఆంధ్రస్కాట్' బిరుదు గడించిపెట్టి నది వీరి కీ దృష్టియే[5]! చారిత్రక నవలారచనలో వీరినే జ్యేష్ఠులు, శ్రేష్ఠులుననుట చెల్లును. వీరి తరువాతనే కీ. శే. కేతవరపువారివియు దుగ్గిరాల రాఘవచంద్రయ్యల్లు, వేంకటపార్వతీశ్వరకవులు, వేలాలసుబ్బారావు[6] ప్రభృతులవియు నాంధ్రచారిత్రక నవలలు వెలువడినవి.

---

1. ఇది నాకు లభింపలేదు. ఇది యన్యకర్తృకమని యింకొక వదంతి. అస లాపేరిఁటి నవలయే యున్నట్లునాకుఁ దోఁచదు.
2. ఇది '*గలివర్స్ ట్రావెల్స్*' అను స్విఫ్ట్కృతికి స్వేచ్ఛానుకృతి.
3. రమేశచంద్ర దత్తుగారి 'Lake of Palms' అనునవలకిది యనువాదము.
4. కీ.శే. గోపెటికనకరాజుగారి 'వివేకవిజయము'న కా యేఁడే ద్వితీయబహుమానము.
5. వీరియన్ని నవలలతో బాటుగఁజారిత్రక నవలలును మున్ముందురాగలవు.
6. *రాణీసంయుక (1908)*

ఇట్టి నవలలలో గథ సిద్ధాన్నముగా లభించును; అనఁగా వస్తుసంవరణవిషయము నందు కష్టములేదు; కావున నట్టివాని రచన సులభము; పెక్కుమంది వానిని రచించుటకు హేతు విదియేయని కొంద అనుకొనవచ్చును. కాని చరిత్రకును నవలకునుగల సంబంధమును సుదీర్ఘముగ నాలోచించినచో నెవ్వరు నిట్లనుకొనరు. తిథులును నామములునుదప్ప చర్వితచర్వణమగు చరిత్రయందుఁ గ్రొత్తవిషయ ముండదు. నవలయందాతిథులును నామములునుదప్ప నసత్యములు నుండవు. నవ్యతలేక పాఠకులనుమెప్పింపరాని చారిత్రకనవలారచనము సులభమనుట విశ్వాసార్హముగానిమాట. ఈజాతికిఁ జెందిన నవలలలో వీరి[1] హేమలత[2] 'అహల్యాబాయి'యు[3], సాంఘికములలో వీరి రామచంద్రవిజయము'ను[4] నాఁడు బహుమతు లందుకొన్నవి. వీరిఁ 'కర్పూరమంజరి' యు బహుళాకృతము[5].

ఆంధ్రదేశమునందు కేవల నవలారచనముచే సుఖజీవనోపాధి నార్జింపఁగలవారు నేఁడొక్క విశ్వనాథవా రందుమేని యార్జింపఁగల్గినవారు నాఁడొక్క చిలకమర్తివారు మాత్రమే యనకతీరదు[6]. చిలకమర్తివారి 'గణపతి'యందలి హాస్యము కొంత శిష్టమైనది. ఆ నవల నొక్కమాఱు చదివినచో నా హాస్యము మనలను వెన్నాడుచునేయుండును. వీరి నవలల సంపుటిలో 'కర్పూరమంజరి'వలనఁ గలుగునామోద మాంధ్రదేశము నాల్గు చెఱఁగులయందును గుబాళించినది. సరసోదారవాఙ్మాధురియు పరిహాసకుశలతయు వీరి నవలాకర్షకములు; కొంతగా వీరేశలింగముపంతులుగారి సౌకుమార్యమునకు చిలకమర్తివారు సౌమ్యతయు హత్తించిరి. సమకాలీనచారిత్రకనవలలలో అక్కిరాజు ఉమాకాన్తము 'టిప్పుసుల్తాను'[7] కేతవరపువారి 'రాయచూరుయుద్ధమును'[8], 'బొబ్బిలి ముట్టడి'యు దుగ్గిరాలరాఘవచంద్రయ్యగారి 'విజయనగరసామ్రాజ్యము'[9], వేంకట పార్వతీశ్వరకవుల 'ప్రమదావనము'ను[10] వేలాలసుబ్బారావుగారి 'రాణీసంయుక్త[11]' యుఁ బేర్కొనఁదగినవి[12].

---

1. *Meadows Taylor's "Chand Bibi"* 'హేమలత'కుఁ బ్రాతిపదిక.
2. క్రీ.శ. 1896. 3. క్రీ.శ. 1897. 4. క్రీ.శ. 1804. 5. క్రీ.శ. 1898.
6. ఇటీవలఁ బ్రకటింపఁబడిన 'చిత్రకథాగుచ్ఛము'నుబట్టి చిలకమర్తివారు కథకులనియు విదితము.
7. క్రీ.శ. 1913 విజ్ఞానచంద్రికా గ్రంథమండలీ ప్రచురణము.
8. క్రీ.శ. 1914 ముద్రణము.
9. క్రీ.శ. 1914 ప్రథమ ముద్రముణము. విజ్ఞానచంద్రికాగ్రంథమండలీ బహుమానితము.
10. స్వకపోల కల్పితము-శ్రీకృష్ణరాయనాయకము-(1913 రచన)
11. క్రీ.శ. 1908.
12. ఉన్నవవారి 'తిక్కన' యొక యసూర్యంపశ్య. దీనిని గొందఱు నవలయే గాదందురు. మఱికొంద ఱుత్తమచారిత్రకనవల యందురు.

*విజ్ఞాన చంద్రిక :—*

నేఁడు నవలాకారులు కథానికాకర్తలుగూడ నగుచున్నట్లే నాఁడు కవులు నవలాకారులుగూడఁ గానొచ్చిరి. అసలు పద్యకావ్యరచనమువలెనే నవలాకథానికా రచనములును భిన్నభిన్నప్రజ్ఞాపేక్ష్యములు. అయ్యు నీరెంటికిఁ గొంత సాన్నిహిత్య మును గలదు. నేఁడు కథానికల ప్రచురణకై ప్రత్యేకపత్త్రికలవలె నాఁడు నవలలఁ బ్రకటించుటకుఁగాను గొన్ని గ్రంథమాలలును మండలులును వ్యవస్థాపితములు. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి[1], సరస్వతీగ్రంథమాల, వేగుఁజుక్క, ఆంధ్రప్రచారిణి మున్నగునవి యిట్టివి. వీని నవలాసేవ యపారము. పత్త్రికలుగూడ వీనిని బ్రకటించినవి. పాఠశాలాపాఠ్యగ్రంథనిర్ణాయక సంఘములును నవలలను పాఠ్యములుగా నిర్ణయించి ప్రోత్సహించినవి. ప్రాయికముగా వీరగాథావస్తుసముపేతములు నాటిఁ చారిత్రకనవలలు. వానిలో వైవిధ్యము తక్కువ. ఆ నాఁడు ప్రజాభిరుచి వానికే కైవారముసేసినది. ప్రాఁతవస్తువును నేఁడు మనము గ్రొత్తరకపుత్రాసులో దూఁచుట యన్యాయము. సంఘటనల కల్పనమును పాత్రపోషణమును మున్నగు శిల్పకౌశలము నప్పటిలో వెల్లడించు విలువఁగల నవలలునుగూడ గొన్ని వెలువడకపోలేదు.

*అపరాధ పరిశోధకములు :—*

అస లపరాధపరిశోధకనవలలు పాఠనసామర్థ్యమునకుఁ బేర్వడిన నవలలు. వీనిని విదేశభాషలనుండియు వంగ కన్నడభాషాదికమునుండియుఁబై గ్రంథమాలామండలుల మూలమున మనము దిగుమతి చేసికొంటిమి. చింతాదీక్షితులుగారి 'చిత్రలేఖ' యీ తెగలో దొల్లిటి స్వతంత్రనవల. మాలేరాఘవరావుగారి 'అపరిచిత'యు సోమరాజు రామానుజరావు, మరువాడ నారాయణమూర్తి, ఆరుద్ర, శారద, మున్నగువారి నవలలును తరువాత చెప్పఁదగిన స్వతంత్ర రచనలు. స్థూలముగ నపరాధపరిశోధకనవల లన్నియు నాంధ్రమున ననూదితములే!

*వేంకట పార్వతీశ్వర కవులు :—*

చారిత్రక సాంఘికము లనఁబడువానిలో బ్రధానముగఁ బేర్కొనఁదగినవి శ్రీవేంకటపార్వతీశ్వరుల నవలలు. నిజముచెప్పినచో వీరిది నవలాశైలికి మించినది. తమ శైలిని సులభముగ మోయఁగల్గినదానికంటె నధికభారవహము గావించు నేఁటి రచయితలు వీరి వంశమువారు. కాని నవల లఘురచన మనెడి నిందఁ బాపినవారును వీరే యనఁజెల్లును. వీరి భాషాసేవ నిస్తులము. ఈ నాఁటికి డొక్కశుద్ధిగలవా

---

1. ఇది కీ. శే. కొమఱ్ఱాజువారిది (1910); మదరాసులో గొన్నాళ్లు, మునగాలలో గొన్నాళ్లు సాగినది.

రాంధ్రదేశమునఁ గొందఱున్నారన్నచో నది నాఁటి వీరి నవలల భాషాసేవామూల మైనదే! 'వసుమతీవసంతము',1 'ప్రమదావనము',2 'మాతృమందిరము',3 'తిరుగుడు పెండ్లి,4 యనఁబడు వీరి స్వతంత్ర నవలలలో దొలి రెండును నుత్తమోత్తమ చారిత్రక రచనములు. మాతృమందిరము రెండు భాగములు. ఇది సాంఘికము. హరిజన దేవాలయప్రవేశము, మద్యపాననిషేధము మున్నగు సంస్కరణములను, గాంధి మహాత్ముని యుద్యమమునకుఁ బూర్వమే సత్యసంకల్పముతో బ్రతిపాదించిన దీ నవల. 'వసుమతీవసంత' 'ప్రమదావనములు' రచయితల కెంతప్రీతి పాత్రములో బఠితలకు నంత యభిమానపాత్రములు5. అపరాధపరిశోధకనవల యటు వేగుఁజుక్కవారి సొమ్ము; ఇటు శ్రీవేంకటపార్వతీశ్వరకవుల యాంధ్రప్రచారిణీగ్రంథమాలిక6వారిసొమ్ము. కాని యీ విషయములో వేగుఁజుక్కవారి కీర్తిపతాకయే మిన్నుపట్టినది. వీరి నవలా కారులలో దేవరాజు వేంకట కృష్ణారావుగారు లబ్ధప్రతిష్ఠులు. పిదపకాలమున నిఁక సోమరాజు రామానుజరావుగారిని సద్యశ్శ్రుతనవలాకల్పను లనుట యుచితము. ఆంధ్ర ప్రచారిణివారియు సరస్వతీ గ్రంథమండలివారియు వేగుఁజుక్కవారియు నాఁటి యప రాధపరిశోధకనవల, నేఁడు హత్యాకాండగల నవలగ నెట్లుమాఱినదో చదువరులకే విదితము.

సంఘటనాక్రమత7కును సందిగ్ధత8కును బ్రసిద్ధిఁగన్న కొమ్మూరిసాంబశివరావు ప్రభృతుల ప్రచురణల వంటివానిని వినాకరించి చూచినచో 'కుబేరావారి' ప్రచురణలు మున్నగునవి నవలాభవిష్యత్తు నాశాజనకముగఁ జిత్రించుట లేదు. 'డిటెక్టివ్' మున్నగు

1. చారిత్రకము — 1911 రచన యని స్వయముగా కవులు; క్రీ. శ. 1913 ముద్రణమని *ఆంధ్రవాఙ్మయ సూచిక.*
2. చారిత్రకము — 1913 రచనయని స్వయముగా కవులు; క్రీ. శ. 1911 ముద్రణమని *ఆంధ్రవాఙ్మయ సూచిక.*
3. 1919 రచనయనికవులే; క్రీ. శ. 1920 ముద్రణమని *యాంధ్రవాఙ్మయ సూచిక.*
4. సాంసారిక నవల.
5. శ్రీబాలాంత్రపు వేంకటరావుగారు శ్రీపార్వతీశముగారికి సహకవిగాకపూర్వమే తఱుకులో నుండఁగా 1902 ప్రాంతమున నొంటిగా 'సురస' అను స్వకపోల కల్పితసాంఘికనవల రచించిరి. దానిని సాంఘికమనుటకంటె కాల్పనిక (Romantic) నవల యనుట యుచితము. నీటిలోని యన్నివస్తువులకు నిందు రూపకల్పనము చేయఁబడినది. S.S.L.C. పరీక్ష కిది 1926 నాఁటి చెన్నపురి సంయుక్తరాజధానిలో నుపవాచకముగఁ బాఠ్యము.
6. ఆంధ్రప్రచారిణిని వీరు కొవ్వూరు చంద్రారెడ్డిగారి సాహాయ్యమున స్థాపించినట్లుఁ దెలియుచున్నది.
7. Sequence. 8. Suspense.

పేళ్ళతో శ్రీ కెంపోరావుప్రభృతులు నడుపుచున్న పత్త్రికలును వానికి నేఁటిపామర లోకమునఁగల ప్రచారమును మనజాతి భావియెట్లుండునో యన్నంత భీతావహములు. ఆంధ్రప్రచారిణి మున్నగువాని యపరాధ పరిశోధకములనుండి హత్యాకాండలోనికిఁ దిగినవి వీరినవలలు. అది యట్లుండెను.

అనువాదముల నాదరించిన యాంధ్రప్రచారణీ గ్రంథమాల, యపరాధపరిశోధకములతోఁబాటు చారిత్రక, సాంసారిక, సాంఘికనవలలనుగూడఁ బ్రకటించినది. అట్లే కీ. శే. భోగరాజు నారాయణమూర్తిగారి ప్రసిద్ధనవల 'విమలాదేవి'ని[1] బ్రకటించిన విజ్ఞానచంద్రికాగ్రంథమండలియు వానిని బ్రకటించెను. అసలు చాలనవలలు పేరునకుఁ జారిత్రకములు. ఎప్పుడును జరిత్రాంశములు మూలాధారములు మాత్రమే. సమస్తము కవికల్పనపై, నూహాపై, భావనలపై నాధారపడియుండును. అందుచే నవి యెంత చారిత్రకములో గనీసమంత సాంఘికము లనఁదగియుండుటచేతను సంఘమున నిరువది యవ శతాబ్ద్యారంభములో నవచైతన్యము కొంతకొంతగా బొడముటచేతను బ్రజా దృష్టి, చరిత్రయెడకంటె సాంఘికసమస్యలయెడ మఱల్పఁబడుటచేతను గేవలచారిత్రక నవల యధికాదరమును గోల్పోయె ననవచ్చును.

దీనికి శ్రీ కేతవరపు వేంకటశాస్త్రియే దృష్టాంతము. వీరి ప్రతిభ చారిత్రక సాంఘికరచనలయందు సమానమైనది. అయ్యు నది యించుక సాంఘికముదెసకే మ్రొగ్గుచూపినది. వీరు సుమారిరువది నవలలు రచించిన మహామహులు. ఆంధ్ర సరస్వతీగ్రంథమాలవారి ప్రచురణము లివి. ఇందు వీరి 'ఇచ్ఛినీకుమారి', 'లక్ష్మీ ప్రసాదము' మున్నగునవి విఖ్యాతములు. ఆంధ్రచారిత్రకనవలలలో వీరి 'బొబ్బిలి ముట్టడి'యు 'రాయచూరుయుద్ధమును' బ్రసిద్ధములు. నాఁటి నవలాసాహిత్యమున వేంకటశాస్త్రిగారికిఁ బ్రత్యేకస్థాన మున్నది.

కీ. శే. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నేఁడిట్లుఁ జగమెఱిఁగినకథకులు గాకపూర్వము నవలాకారులు. వీరి చిత్రణము పల్లీజీవనమునకుఁ బ్రతిబింబము. రక్షాబంధనము, ఆత్మబలి, విషభుజంగము[2] నను నవి మూఁడుని[3] నవలలు. కందుకూరి చిలకమర్తివారల మార్గముగాదు వీరిది. బంకించంద్రుఁడును వేంకటపార్వతీశ్వరకవులును

1. క్రీ. శ. 1915

2. దీని పూర్వనామము "శ్మశానవాటిక"

3. "వడ్లగింజలు, ధర్మచక్రము" వంటివానిని శ్రీపాదవారి నవల లని "తెలుగుసంస్కృతి" తెలుపుట విచార్యము. చూడుఁడు; పుట 879, వ. పం. 12, విజ్ఞానసర్వస్వము, మూడవ సంపుటము, తెలుగుభాషాసమితి, మదరాసు (1959)

వీరి కాదర్శకులు. నవలాస్వరూపము పైవారి యాదర్శములమూలమున గోచరించుటచే నవలారచనలో వీరిదా విశిష్టమార్గ మనుట నిజముచెప్పుట. పైమూఁడునవలలలోను 'ఆత్మబలి' యుత్కృష్టము.

బంకించంద్రుని ప్రభావమునుగూర్చి ప్రాస్తావికముగా వచ్చుటచే వంగాద్యోత్తరాహనవలాకర్తలచేఁ బ్రభావితులైన మాన్యశ్రీ వేలూరి శివరామశాస్త్రి గారిని శ్రీతల్లావజ్ఝలశివశంకరస్వాములవారిని ఆ పడికే చెందిన శ్రీజొన్నలగడ్డ సత్యనారాయణగారిని స్మరింపక ముందునకుఁ బోఁగలేము. వీరి రచన లమృతపుగుళికలు. ఆంధ్రుల యనువాదనవలాసాహిత్యమున నాంగ్లకర్ణాట నవలలకంటె వంగనవలల సంఖ్యయే యధికము.[1] అందును రమేశచంద్ర, బంకించంద్ర, రవీంద్రుల, నవలలకంటెను శరచ్చంద్రుని నవల లెక్కుడుగ మన మన్ననఁగన్నవి. అతఁడు మానవుని మనోమాలిన్యమునుగూర్చి యత్యుదారముగ భావనసేయఁగల్గుట యను దీనికి హేతువు.

*ఏకవీర :—*

శ్రీవిశ్వనాథవారి 'ఏకవీర' యవతరణముతో, మున్ను సన్నగిల్లుచున్న ప్రజాభిమానమును దిరిగి చారిత్రకనవల సంపాదించుకొనుటయేగాక తన పరువు ప్రతిష్ఠల జయస్తంభమును నాటినది. ప్రతి సన్నివేశమునకు ముందుగా వైఁగై ప్రవాహపు టాటుఁబోటులను నమ్మృతములూరు 'నారుం జేవురంబు' వంటిపాటయు ఝటితి స్ఫురితమగు సాంకేతిక ప్రతిపత్తియుఁ జిత్రపటదర్శన భామకలాపాదికమగు ప్రతిసన్నివేశము నెట్టుగొల్పఁగా నేర్పడిన కథాపరిణామమును నిందలి శిల్పసృష్టిరహస్యములు. 'ఏకవీర'లో విధ్యపరిహార్యతను దదపరిహార్యతకు హేతుభూతమైన యేకవీరదగు త్వగింద్రియానుభవసూక్ష్మతను బురస్కరించుకొని ప్రవర్తిల్లిన చమత్కృతి ప్రత్యేక వ్యాసవస్తువగుననినఁ బ్రకృతమునకుఁజాలును. దానీ కదియేసాటి! అట్టి నవల 'నభూతోనభవిష్యతి'. శ్రీవిశ్వనాథవారే మఱల నేఁడట్టి నవల నిర్మింపలేరు.

ఈనడుమ మనలో దేశాభిమానము, దేశచరిత్రాభిమానమునుగూడ విజృంభించిన కారణముచే దిరిగి చారిత్రకనవలపై వ్యామోహము పెరుఁగుటయేగాక సాంఘికముల తోఁబాటుగా సర్వకాలమును నిల్వఁగల లక్షణములు వానియందును బొడముచున్న వనుటకుఁ గొన్నిసాక్ష్యములు లేకపోలేదు. వీనిలో 'బద్దన్నసేనాని' కడిమిచెట్టు, 'ధర్మచక్రము' నను శ్రీవిశ్వనాథవారివి మూఁడునవలలును శ్రీనోరివారి 'నారాయణభట్టు', 'రుద్రమదేవి', 'మల్లారెడ్డి', 'కవిసార్వభౌముఁడు'ను లోకమున కాశాజ్యోతులైనవి.

---

1. నేఁటి వి. వి. గారి సరస్వతీ సంహారమునకు శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులుగారి యనువాదముతో గలిపిచూచినను నిది నిజము.

డాక్టరు. కాకర్ల వేంకటరామ నరసింహముగారి 'కనకాభిషేకము, 'రఘునాథరాయలు'ను, కీ. శే. కురుగంటి సీతారామయ్య భట్టాచార్యులవారి 'శాతకర్ణి'యు కుమారి వసుంధర 'తంజావూరిపతనము, 'సప్తపర్ణియు', శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారి 'భువన విజయము'ను, శ్రీపాటిబండ మాధవశర్మగారి 'ఇంద్రాణి', 'రాజశిల్పి'యు, శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'చిత్రశాల, మున్నగునవియుఁ దదాశాజ్యోతికిఁ జమురు పోయుచున్నవి.

ఇట్లొకవంకఁ జారిత్రకము లాశాలతల కొనల మలపించుచుండఁగా, నింకొకవంక సాంఘికములు నవనవోన్మేష చిహ్నములతో మొగ్గఁదొడుగుచున్నవి.

*వేయిపడగలు :—*

అసలు శ్రీవిశ్వనాథవారి నవలలచెలువము నంతసులభముగా దప్పించుకొనిపోలేము. 'ఏకవీర'నుండి 'తెఱచిరాజు' వఱకు నని ప్రత్యేకవిమర్శనగ్రంథముగా వ్రాయఁదగినవి, వీరి నవలలు; ఇచట విస్తరింపరాదు. అయ్యును సాంఘిక నవలలఁగూర్చి ప్రసక్త మగుటచే గ్వాచిత్కముగఁ జెప్పకతప్పదు. సాంఘికములలో 'వేయి పడగ' లగ్ర గణ్యము. అందు 'పడగలేగాని పా మెచ్చటను గన్పింపద'ని యొక విమర్శన. వేయి పడగ లనఁగా సహస్రముఖమైన ధర్మము. దాని స్వరూపము నిదమిత్థమని నిరూపించుట కష్టము. అందుచే బడగ లగపడి పా మగపడకపోవుటయే యందలి యుద్దేశ్యము. లేనిచో, నే 'యాదిశేషువ'నియో పేరు పెట్టఁబడెడిది. ఆ విషయము నట్లుంతము. తర్వాత వీరి 'చెలియలికట్ట',[1] కు సాంఘికములలో నొకవిశిష్టస్థాన మబ్బినది. ఇది యేలనో యొక పాశ్చాత్య నవలను దలపించు ననెడి వా రున్నారు. దేశకాలవ్యవస్థాతీతమై మానవస్వభావ మొక్కటియే యగుటయుఁ దత్స్వభావమునే కవులు చిత్రించువా రగుటయు మఱవరాదు. ఇట్లుండ సత్యనారాయణగారి కనుకరణ శీలముండుట యీ దేశమెఱుఁగదు. తెలుఁగుదేశము, తెలుఁగులసాంఘికమర్యాదలు, తెలుఁగునుడికారము, తెలుఁగుసామెతలు, లోకోక్తులు, సంప్రదాయములు, చరిత్ర మున్నగువానికి వీరినవలలు, చారిత్రకములుగాని, సాంఘికములుగాని, యన్నియు ఖనులు.

పిదప జీవితసత్యము నంతగా వ్యక్తీకరింపమిచే సాహిత్యస్వభావమును ద్వణీకరించిన గుడిపాటి వెంకటచలము గారివియు వారి యనుయాయులగు ధనికొండ మొదలగు[2] వారలవియు నవలలు పేర్కొనఁ దగియున్నవి. ఈ జాతినవల లింద్రియప్రేరకములై చదువరుల కుద్రేకముగల్గించి వ్యామోహము గొల్పఁగలవు; కావునఁ జదువరులపై నధికప్రభావము నెఱపఁగలవి. ఈ ప్రభావము భాషాశ్రితము, భావాశ్రితముకూడ.

---

1. 'చెలియలికట్ట'కొక పాశ్చాత్యనవల (డీమ్‌స్టర్) మూలమని కొందఱ యపోహము.

2. లతాప్రభృతులు.

వీరి నవలలలోని వస్తువు కావ్యబద్ధము చేయఁదగినంత యుచితమైనది కాదేమోయని సంప్రదాయవాదులు క్రుద్ధులగుట వాస్తవము. లైంగికాంశ ప్రధానములగు రచనలేజాతి కేనియు నత్యంతావశ్యకములగుచో నా కొఱఁత వీరివలన మన వాఙ్మయమునకుఁ దీరిన దనవచ్చును.

ఈ కోవవారికి గురుతుల్యులు శ్రీచలముగారు. పరశ్శత పాశ్చాత్య లైంగిక మనస్తత్త్వ శాస్త్రజ్ఞుల1 భావసారము వీరి సారస్వత జీవితమునను వాస్తవజీవితమునను జితించివోయినదని నరిపుచ్చుకొనువారు నున్నారు కాని మన భారతజాతికి వీరిచ్చిన సందేశమునుగూర్చి వారు చెప్పఁబోరు. సంప్రదాయ పాఠకులగు శ్రీ విశ్వనాథవంటి వారిని మనకుఁ బ్రసాదించి చలముగారు దేశమునకుఁ బరోక్షముగ మహోపకారము జేసిరనిమాత్రమూహింపవచ్చును. ఇందలి సత్యము నెఱిఁగిన వా రెఱుఁగుదురు; లేని వారు లేదు. దానికేమి! కాని, సాహిత్యరూపమును దీర్చిదిద్దుటలో నగ్రసరులైన వీరు జీవితసత్యమును బ్రధానముగ వ్యక్తముచేయకపోయినను నసత్యమును దీవ్రపరశువుతో నెదుర్కొనిరనఁదగును.

శ్రీ చలముగారి యన్ని నవలలు నొకయెత్తు. 'శశిరేఖ', 'అమీన', 'అరుణ', 'మైదానము' అను నాలుగు నొకయెత్తు. అస 'అమీన'తోనే యథవాస్తవిక నవల, తెలుఁగున నవతరించిన దందురు. శ్రీగోపీచంద్‌గారి 'అసమర్థునిజీవితయాత్ర'2, శ్రీరాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 'అల్పజీవి'3 మున్నగు నద్యతన నవలలు పెక్కితరగతికిఁ జెందినవి. 'అసమర్థునిజీవితయాత్ర' యొక్క క్రీనీడలోనే 'అల్పజీవి'యు నడచుట మఱల నిందులో నొక విశేష మనెడి కొందఱవాదములో నంత పస లేదు.

ఇఁక స్వర్గీయ ఉన్నవవా రున్నారు. లోకము గుజగుజలు పోవునట్లుగా వీరి 'మాలపల్లి' పై మిసెస్. హెన్రీవుడ్ అను నామె గారి 'ఈస్తలిన్' (ఈస్టిన్) అను నవలాచ్ఛాయలు పడినవి. కాని యదియొక లోపముగాదు. అట్టివానివలనఁ బ్రయోజన మున్నయెడల, నది యెవ్వరి యందుఁగాని దోష మనరాదు. నేఁటిదైన 'అసమర్థుని జీవితయాత్ర'కు ఛాయ యున్నచో గౌరవముతగ్గెనా, నాఁటిదైన 'మాలపల్లి'కిఁ

1. ఫ్రాయిడ్, ఎడ్లర్, యం (జం)గ్, హావ్‌లాక్ ఎల్లిస్, మేరీస్టోప్స్—మున్నగు శాస్త్రవిదులయు అనటోల్‌ఫ్రాన్స్, మపాసా, ఓడ్‌హౌస్, డి. హెచ్, లారెన్స్‌ప్రభృతి నవలాకారులయుఁ బ్రభావము వీరిలో గుంభించినదనుట నిజము.

2. Dostoevskits 'Idiot', చేఁబ్రభావిత మనువారుఁ గలరు.

3. Alphonse Daudet's 'The Little weakling' చేఁబ్రభావిత మనువారును గొందఱు.

దగ్గుటకు? మాతృకలచే సేవచేయించుకొని వానిని మించుటయే దుహితృకల ఘనతకు నిదర్శనము. కాని యది ప్రయత్నకృతమగు ననుసరణము; కావునఁగళయేకాదు, అనువారును 'మాలపల్లి' విషయమున నున్నారు. 'లోకోభిన్నరుచిః'.

ఈ 'మాలపల్లి'ని గొందఱు సాంఘిక మందురు. మఱికొందఱు రాజకీయ మందురు. ఇతరులు రెండును నిజమందురు. ఎవరేమన్నను దాని సమగ్రమూర్తిని వర్ణించినట్లుఁగాదు. అసలా గ్రంథరచనమునాఁటి కాంధ్రదేశముననేగాదు; యావద్భారతమునను సాంఘికములనియు, రాజకీయములనియు జీవితవిధానములో బృథక్ప్రృథగ్భావములు లేవు. అప్పుడు గాంధిమహాత్ముని పుణ్యమున విశ్లేషదృష్టినుండి సంశ్లేషదృష్టిదెసగా మఱలినది, భారతదేశము. 'మాలపల్లి' వలె నథోగతియందున్న మన సంఘమును 'మంగళాపురము'గా నొనర్చు యత్నమునందే సంస్కర్తృభావ ముండుటచే నది సంస్కరణోద్దిష్టమగు నవలయని యందురు. కాని కందుకూరివారి నవలవలె సంస్కరణమునుగాక సంఘమున కావశ్యకమగు నొక ధర్మమును ఉన్నవవారి నవల 'నాజూకు'గఁ బ్రతిపాదించినది. భాషయా స్వాభావికము; కథయుఁజక్కనిది; ఉపదేశముగూడఁ గాంతాసమ్మితము.

'మాలపల్లి'కి మాఱుపేరు 'సంగవిజయము'[1]. ఆదర్శమునకు బలిదానమైపోయినను సంగఁడు విజయమునే సాధించినాఁడు. కావున నీ పేరానవలకు సార్థకము గాకపోదు. ఆదర్శప్రణయము, సధర్మశృంగారము, శ్రీరంగనీతులు మున్నగువాని నిబిత్రించు రస వద్ఘట్టములేగాక యందుఁ బ్రాస్తావికనుగరాని సాంఘిక రాజకీయ తత్త్వసంబంధి విషయములు లేనే లేవనవచ్చును. కాని యివి యెంతవఱకు నాధికారిక వస్తువుతో నేకతః సూత్రింపఁబడిన ప్రాసంగికము లన్న విషయము వివేచింపఁదగినది.

*ధర్మచక్రము — హాహాహూహూ :—*

మొత్తముమీఁద సంఘసేవాధురంధరులైన కందుకూరివారి యింటికట్టడియుఁ జిలకమర్తివారి చారిత్రక జ్ఞానము, నున్నవవారి రాజకీయ చతురతయు నలవఱచుకొనిన యాంధ్రనవల, యొక దశనధిగమించి మించి, శ్రీ సత్యనారాయణ కవి సమ్రాట్టు నొద్ద శిక్షణచే పైలక్షణములకంటె మిన్నయగు శిల్పప్రజ్ఞాన్వితయై యన్నిటను దీటనిపించు కొన్నది. కర్మదైన యపరిహార్యతయే 'ఏకవీర'. సర్వవిషయములు 'బద్దన్నసేనాని'లో ఖడ్గవిద్యకుఁ బోషకము లైనవి. మొదటినుండియుదుదివఱకు నేకాకి యేకాకియే యనెడి మహోత్కృష్టనవల[2] 'మాఁబాబు'. రాజరక్తములేని రాజుల సమ

1. ఒకే గ్రంథమునకు రెండుపేళ్ళుండుట యొక విశేషము. మనకుఁ బ్రకృతమగు నవలల విషయమున నిది కీ. శే. కందుకూరివారితో నారంభించినది. గ్రంథమునకు శీర్షిక నుంచుట యనునది ప్రత్యేక మొక చర్చనీయాంశము. అది యొక ప్రజ్ఞ.

2. '*Hunger*' of 'Nathamson'.

స్యలయు సన్నివేశములయు సుఖదుఃఖములయు వ్యగ్రగతి 'ధర్మచక్రము'. ఒక చక్కని సాంకేతిక ప్రతిపత్తికి నిదర్శనము 'హాహాహూహూ'. శరీర వయోధర్మములకును దాంపత్య సౌఖ్యమునకునుగల స్వల్పకాముక సంబంధమునకుఁ బ్రాధాన్యము నిచ్చుచున్నది నేఁడు మనజాతి. ఈ నేఁటి మనజాతికి ద్వివిధదంపతుల జీవితచిత్రణముచే బ్రతియోగ పద్ధతిని బ్రీతియోగమనఁగా నేమో తెలుపునట్టి సందేశమిచ్చుటయే! 'చెలియలికట్ట'లోని మర్మము. చక్షుస్సును శ్రవణమును బంచేంద్రియములలో నాముష్మిక సంబంధులనఁదగినవి; కావునజ్ఞానదాయకములు, నుత్తమములును. ఘ్రాణ రసనా త్వక్కులైహిక సంబంధులనఁదగినవి; కావున నింద్రియ సుఖదాయకములు, నల్పములును. త్వగింద్రియసుఖమందులో నీచాతినీచము. అట్టి యత్యధమ త్వగింద్రియ జ్ఞానమును బురస్కరించుకొని వైరాగ్యకల్పనముఁ జేయుటకు 'ఏకవీర-తెఱచిరాజులు' పర్యాయపదములని, సత్యనారాయణగారి నవల లన్నిటియందు ననుస్యూతముగా నుత్తమ పాత్రల వైరాగ్యము స్థాపింపఁబడుటచే దెలిసినవారికిఁ దెలియును.

పైఁ జెప్పిన గాంభీర్యము గోల్పోయినను 'శ్రీకొవ్వలి-జంపనల' వలన సాంఘిక నవల కొంత సరసతయే గడించె ననక తీరదు.

*నారాయణరావు : హిమబిందు :—*

చలము, సత్యనారాయణ గారల తత్త్వములు దక్షిణోత్తరధ్రువములనుట యుక్తము. అడవి బాపిరాజుగారివంటి యాత్మసంస్కారధురీణులును నవలారచనమునకుఁ బూనుకొనుట యాంధ్రుల యదృష్టఫలము[2]. వీరి 'నారాయణరావు'. వేయిపడగలవలెనొక మహాజ్ఞానమయకోశము. దాని కీర్తి యజరామరము. అందలి శిల్ప ప్రౌఢిమ ప్రత్యేకవ్యాసవస్తువు. 'కోనంగి' మున్నగువానివిషయ మెట్లున్నను వీరి 'తుఫాను', హిమబిందు[3]లకుఁగల ప్రతిపత్తి మఱియొకదానికి లేదన్నను బొరపాటు గాదు. విశ్వనాథవారి యుత్తరధ్రువమునుండి క్రమక్రమముగ దక్షిణధ్రువాభిముఖులమై ప్రయాణించితిమేని సర్వశ్రీ బాపిరాజు, అబ్బూరి రామకృష్ణారావు, కనకవల్లి భాస్కరరావు, మహావాది వెంకటరత్నముకి, నోరి నరసింహశాస్త్రి, ప్రతాపరెడ్డి,[4]

---

1 "*Family Happiness*" by Tolstoy.

2. బాపిరాజు చిత్రములలో గవిహృదయము తొంగిచూచినట్లే, నవలలలో జిత్రకౌశల మగపడును. వారి కథాకథనములో రేఖావర్ణ శబ్దచిత్రము లెన్నియో మనకు నేత్ర పర్వముగా బ్రత్యక్షమగును.

3 వీరి '*నాగరాజు*' నవల Thomas Hardy's 'Wood Landers'ను దలఁపించును.

4, కథలయందువలెనే జీవితస్వరూపముతోబాటు జీవితసత్యమును గూడఁ జిత్రించిన యొక యముద్రితనవల శరవరమువారిది కలదు. దాని పేరు 'శుద్ధాంతకాంత'. రైనాల్డ్సు '*Mysteries* of *London*' వలె నిది నవాబుల యంతఃపుర రహస్యసంబంధి నవల. ఇది నాలుగు వ్రాతసంపుటముల పరిమితిగలది; 270 పుటలు.

మునిమాణిక్యము, మొక్కపాటి, రావూరి భరద్వాజ, రావూరు వెంకట సత్యనారాయణప్రభృతులతో విడిసి, మఱల విడిదినుండి తఱలవచ్చును. శ్రీయుతులు బులుసు సీతారామశాస్త్రి, కవికొండల. తెన్నేటి1, కొడవటిగంటి, మురయ, గోపీచంద్, బుచ్చిబాబు, రాచకొండ వి. డి. ప్రసాద్ రావు, ఇచ్ఛాపురపు జగన్నాధరావు, మాలతీ చందూర్, బలివాడ కాంతారావు, మధురాంతకం, మంజుశ్రీ, పోతుకూచి సాంబశివ రావు, ఇసుకపల్లి దక్షిణమూర్తి, ధనికొండ, లత, చలము ప్రభృతు లప్పుడు దర్శన మిత్తురు. ఇంకను ప్రసిద్ధులు పెక్కురున్నారు.2 సంఘసంస్కారాదికము నుద్దేశించిన వీరివీరి రచనలన్నియు సంఘజీవితప్రతిబింబములై యథాశక్తిగఁ బ్రయోజనముల సాధింపఁగల్గినవనుట సాధువు.

*బారిష్టరు పార్వతీశం :—*

పోఁగా బ్రత్యేకించి రాజకీయనవలలను హాస్యప్రధానములగు వానిని గూర్చి యించించుక ముచ్చటించి యీవిషయమున మహిళలయొక్క స్తవనీయమగు దీక్షా పూర్వకకృషికిఁ గృతజ్ఞతఁజూపుట మనవిధి.

'ఏకోదరులు'వంటి గంభీరనవలను రచించియు హాస్యప్రధానమైన నవలాకర్తలలో బ్రథములేగాక. కృతహస్తులైనవారు మొక్కపాటి నరసింహశాస్త్రిగారు. విదేశీయు లగు జరొమ్‌కీజరూమ్. డబ్ల్యు. డబ్ల్యు. జేకబ్స్, మార్క్‌ట్వైన్3 బారీపెయిన్, బర్నాడ్‌షా, చెస్టర్టన్; ఓడ్‌హౌస్ ప్రభృతుల రచనలచే నాకృష్టులయ్యు మన సంస్కృతిసందర్భముల కనుకూలముగా బైవారి ప్రభావమును మలఁచుకొని యాంధ్రములో గురుజాడ, పానుగంటి, ప్రభృతులు గురుతుల్యులుకాఁగా, వీరు సృష్టించినది, యచ్చమైన హాస్యరసజగత్తు4. నవలాసాహిత్యమునందలి కథానాయకులలో మొక్కపాటివారి పార్వతీశమే పార్వతీశము; కథాసాహిత్యమునందలి నాయికలలో శ్రీముని మాణిక్యము నరసింహరావుగారి కాంతమే కాంతము. నవలాపరముగఁగూడ శ్రీముని

1. స్వర్గీయ తెన్నేటి ,చంఘిజ్ ఖాన్, నకును "The earth is the Lord's" అను నమెరికా దేశస్థుని యాంగ్లనవలకును గలపోలికలు గుర్తించునది. తనకు హౌవర్తు యొక్క ,మంగోల్ హిష్టరీ, ఆధారమని తెన్నేటిసూరియే వ్రాసికొనెను.

2. ,మీనాంబిక, "అశోకవర్ధనుఁడు" వ్రాసిన శ్రీపిలకా గణపతిశాస్త్రిగారు; ,సదాశివరెడ్డి, రచించిన డా॥ బి. రామరాజుగారు; ,స్వర్ణలత, ,రమణమూర్తి,, మల్లికయు వ్రాసిన ఐ. రంగనాయకులుగారు, "తపస్విని"ని వ్రాసిన శ్రీఘండికోట బ్రహ్మాజిరావుగారు ప్రభృతు లింకను ననేకు లీపట్టికలో నెక్కనివా రున్నారు. ఈపట్టికను సర్వసమగ్రము గాని, క్రమబద్ధముగానిచేయుట ప్రకృత ప్రకరణోద్దేశమే గాదు.

3. ఇతఁ డమెరికా దేశస్థుఁడు.

4. పాత్రపోషణాదిదృష్టిచే వీరి దసలు నవలయే గాదనువారు కొందఱు.

మాణిక్యముగారి హాస్యము మృదువైనది; సౌమ్యతయుఁగలది. కీ.శే. భమిడిపాటివారు నవలయెడ దృష్టినిఁబల్పకపోవుట మనకు దీరనిలోపమే యయ్యెను. హాస్యనవలాకర్తగా 'హాస్యబ్రహ్మ'గారికి లేదుగాని శ్రీమునిమాణిక్యమునకు హాస్యకరుణములలో గుడి యెడముగ శ్రీమొక్కపాటివారి కున్నంతటి స్థానమున్నది. మునిమాణిక్యముగారి 'దీక్షితులు'చదివి కన్నీరు జలజలరాల్పని వారుండరు. అగుటకు నవలయేగాని వీరి 'అన్నయమంత్రి, హాస్యప్రధానమైనది కాదు. అందన్నయమంత్రి నట్లేలచిత్రించిరో వారినే యడుగవలెను. అతఁడు సుప్రసిద్ధుఁడగు 'అన్నయ'కాఁడని వారనిరి. అయినను మంత్రియైన యంతటిచులుకనమనుష్యుఁ డుండఁడు.

*మాబాబు ; దీక్షితులు :—*

శ్రీమొక్కపాటివారిది స్వచ్ఛమైన హాస్యము. కవులకు గనకాభిషేకములు జేయు రాజులుకరవైన దినములలో బుట్టినవి విశ్వనాథవారి 'మాబాబు'నుముని మాణిక్యముగారి 'దీక్షితులు'ను. ఒల్లమాలిన నోబిల్ బహుమానములు తెలుఁగును వలచుట యసలే కలలోనివార్తగదా!

'తిరుమాళిగ' 'దీక్షితులు'వంటి రచనలుచేయుట యొకయెత్తు; హాస్యమునకు సంబంధించిన యూహలను భావనచేసి వానికి రూపకల్పనముగావించి వాని నొకపెద్ద శాస్త్రముగ నిర్మించుట యింకొకయెత్తు. అలంకారశాస్త్రము, తర్కశాస్త్రము వంటి వానిని మథించి వానినుండి హాస్యామృతోత్పాదన మొనరించిన దివ్యప్రయత్నమే మునిమాణిక్యముగారి 'వితండవాదాలు'. ఇంతకు హాస్యము వస్తునిష్ఠితముగాదు; కవిదృష్టినిష్ఠితము. ఎంత గంభీరమైన వస్తువునుండియైనను హాస్యమును సృష్టింపవచ్చు నన్నదే వారు మన కిచ్చుసందేశము. మనలో నింకను బెక్కు 'మొక్కపాటు'ల దీటులును 'మునిమాణిక్య' పాణీరిత వీరారాణామృతములును భమిడిపాటి గాటులును గూడ దీటుకొనవలెను. ఏ జాతివాఙ్మయమునందు హాస్యరసమునకు సముచితస్థాన ముండదో యా జాతియు నే రచయితయందు హాస్యము సముచితస్థితి నొందదో యా రచయితయు[1] సర్వతోముఖవికాస మొందినట్లు గాదు.

ఇరువదియవ శతాబ్దిలో తొలి పదియందే జయంతి సూరమ్మగారు 'సుదక్షిణా చరిత్ర[2]ము' అను నవలను నిర్మించి మహిళలును నవలానిర్మాణ వ్యవసాయమున గృతబుద్ధులని నిరూపించిరి. అపరాధపరిశోధక నవలానువాదములో సీరము సుభ

---

1. హాస్యరసమే లేదనుకొను విశ్వనాథవారియందు సైతము '*విష్ణుశర్మ ఇంగ్లీషుచదువు*,లో హాస్యము వెల్లడియైనది.
2. మిత్తులు డా॥ యస్వీ. జోగారావుగారు 1954 జూలై 'సంస్కృతి' సంచికలో. *సుదక్షిణా చరిత్రము*, (1906) అనుటకు *సుదక్షిణాపరిణయము*, (1903) అనుట ప్రమాదవశ మున ననుకొందును.

ద్రాంబగారిది! సంకుతేలినచేయి. తదాది మహిళలనవలా రచనమునందుకూడఁ గథావస్తువులో వివిధత్వము పొడచూపఁజొచ్చినది. ఈ విషయమున 'వసుమతీ'కర్త్రి కనుపర్తి వరలక్ష్మమ్మగారు సిద్ధహస్తలు; స్వర్ణకంకణభూషితలును.

*సుభద్ర :—*

పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు సాంసారిక నవలానువాద సాహిత్యప్రతిభాధౌరేయలు. వీరి యనువాదముగాని ప్రథమానువాదము 'సుభద్ర,' జ్యేష్ఠతతోబాటు శ్రేష్ఠతయు దీనిదే! వీరి 'యోగేశ్వరి' రెండవది. స్త్రీలకుఁగూడ యోగసంబంధి శక్తులసాధనను సూచించు నవల యిది. 'అన్నపూర్ణ'2 వీరి మూఁడవయనువాదము. 'యోగేశ్వరి'లో భర్త నన్వేషించుటయు 'నన్నపూర్ణ'లో భర్తకర్ధాంగియై సేవించుటయు స్పష్టపడఁగలవు. 'అమరవిజయము'ఁగూడ వీరిదే! కాని, దానిని వీరు తమపేర వ్రాయలేదు. తమపేరుపెట్టుట, నాఁటి పాఠ్యగ్రంథనిర్ణాయక సంఘనియమములకు బాధకమై యుండెను. అప్పటి యనువాదనవలాసాహిత్యమునఁ బురుషులలో పార్వతీశ్వరకవులకుఁగల గౌరవమర్యాదలు మహిళాలోకములో పులుగుర్త నరసమాంబగారికిఁ గలవనుట చెల్లును. వీరేశలింగముగారి సంస్కరణాత్మకరచనల కీమె ప్రతినిర్యాతన మగుటచే కీ. శే. కాశీభట్లవారి శిష్యురాలని శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు తమ 'కవయిత్రులచరిత్ర'లో నరసమాంబగారిని గూర్చి యూహించి ప్రమాదవశమున వ్రాయుట జరిగినది. వారివారినడుమ నెట్టి శైష్యోపాధ్యాయికలు లేకపోయినను నామె కాకినాడనివాసిను లగుటయుఁ గాశీభట్లవారు గూడ సంప్రదాయపాఠకులగుటయు మున్నగు హేతువులు పై ప్రమాదమునకు మూలములైనవి.

ఓలేటి సూర్యప్రభాదేవిగారి 'ఇందుమతి'యు దేశిరాజు లక్ష్మీనరసమాంబగారి 'కమలావతి'యు పులవర్తి కమలాదేవిగారి 'కుముద్వతి'యు మల్లాది బుచ్చమ్మగారి 'లంకాపతి'యు ఏ. పి. పిరాట్టమ్మ గారి 'శోభావతి'యు నాతరములో మిక్కిలి ప్రసిద్ధములు.

*దూరపుకొండలు :—*

ఈ తరమువారిలో3 మల్లాది వసుంధర యుల్ల ముచ్చిపోనాడఁగల నావలిక4. ఈమెరచనలు 'తంజావూరి తతనము', 'సప్తపర్ణి'యుఁ జారిత్రకములు; 'దూరపుకొండలు సాంఘికము, నావలికా జీవితమును జరిత్రలో నాకర్షణీయము నారంభించుట,

---

1. శిరోమణి, 1918. 2 క్రీ. శ. 1932.
3. క్రీ. శ. 1950-1960
4. నావలికుఁడనఁగా నవలాకర్తయనియు నావలిక యనఁగా నవలాకర్త్రియనియు స్వతంత్రించి వాఁడుచున్నందులకు క్షమింపవలెను. నవలికయనఁగా జిన్నవవల(Novelette).

యీామె తమగురువులగు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి కీర్తికి నీరాజనముపట్టుట. ఇట్టి యారంభము శుభోదర్కము. ఈమె నవలా నిర్మాణములో గురువుగారి శిల్ప మార్మికత యున్నదని లోకమన్నట్లు మన మనలేము. ఏలన నట్టిభ్రాంతిని గల్గించు వాక్యరచనాముద్ర యున్నదేగాని వేఱుగాదు. ఈమెయే చెప్పినట్లు తన మనస్సున గురువుగారివాణి నిశ్చలమై ప్రతిష్ఠితమై యుండుటయే యీ యపోహమునకు హేతువు. గురువుగారి నించుకగా దలంపించినను మఱపించఁగల ప్రౌఢిమ యింకను గుదురని నవలారచనమే యీామెది యనిపించుకొనుచున్నది.

నేఁ డింకను బెక్కుమంది నవలారచయిత్రులు వెలయుచున్నారు. శ్రీమతి మాలతీ చందూరుగారి 'చంపకము:చదపురుగులూ' రేణుకాదేవిగారి 'యాత్మకథ' మున్నగురచనలు ప్రసిద్ధములు. ఈకృతులలో మొదటిది ప్రశస్తమైనది. స్వర్గీయ శ్రీదేవిగారి 'కాలాతీత వ్యక్తులు' విచిత్రప్రవృత్తి చిత్రణములో బేరొందఁదగినది. శ్రీమతి లత రచించిన పరస్పరవిరుద్ధభావ సమ్మేళనముగల 'మోహనవంశియు'. ముప్పాళ రంగనాయకమ్మగారి 'బలిపీఠము'ను నొకరకముగ విశిష్టమైన నవలలు. రంగ నాయకమ్మగారు నవీన సాంఘిక దురాచారముల జిత్రించుటలో నిపుణురాలు. సాంఘిక నవల లింక స్త్రీలే రచింపవలయునేమో యనిపించు దినములతో దూరములేవు.

ఒక విధముగ రాజకీయ నవల లనఁదగువానిలో 'మాలపల్లి' తరువాతఁ జెప్పఁ దగినవి వుప్పల లక్ష్మణరావుగారి 'అతడు-ఆమె'యు; మహీధర రామమోహనరావు గారి 'రథ చక్రాలు, ఓనమాలు, దవానలము'ను, శ్రీవిశ్వనాథవారి 'పులుల సత్యాగ్రహము'ను, కీ.శే. వట్టికోట ఆళ్వారుస్వామివారి 'ప్రజల మనిషి'యు, శ్రీశివరామ కృష్ణగారి 'మృత్యుంజయులు'ను శ్రీలక్ష్మీకాంత మోహనుగారి 'సింహగర్జన'యు స్తుత్యములు.

నేఁడు నవలల సంఖ్య సహస్రాధికమైనది. అందొకపాలు, హత్యాకాండకుఁ జెందిన[1] యపరాధపరిశోధకాభాసములు. 'ఆంధ్రప్రచారిణి' వారి తొంటి యపరాధ పరిశోధకములతో వీనిని బోల్చుట యపరాధము. ఇవి యమెరికాదేశపుఁ టద్యతన వాఙ్మయ ప్రభావజనితములు. వీని క్షీణతయుఁ గ్రమక్రమముగఁ జూడఁగలమనుట రూఢి. ఇవి 'పుబ్బలోపుట్టి మఘలోమాడు'నవి. వేఱొకపాలు, మూలము లపేళ్లు చెప్పని యనువాదములు; లేదా-యనుసరణములు. ఆ యనుసరణముల నుండి యొక వ్యక్తిత్వము, నొక ప్రతిభయు నుద్భవించి స్వకపోల కల్పితములను దీపింపఁజేయవలెను.

ఈ మధ్య కథానికలు, గల్పికలు, నానారకముల కథావిశేషములు నుద్భూత ములై నవలలను ద్రోసి రాజను నన్నభీతియు నేర్పడినది. కాని, యది నిష్కార

1. ఈ యపరాధపరిశోధకములను మునుపు 'నిరూపకనవల' లనిరి.

ణము; నిరాధారము సంపూర్ణసృష్టిరహస్యములయందు మానవులకు జిజ్ఞాసయున్నంత కాలమును నవలలకుఁ గథానికలు మొదలగు నల్పరచనలు ప్రత్యామ్నాయములుగూడ గాలేవు; ఆగమములు గావచ్చునుగాని నవలలకుఁగథానికాదు లాదేశములు గా రావనుట.

*చలువ చప్పరములు :—*

నవలాశాఖా విజృంభణముతో నాంధ్రవాఙ్మయ వటవృక్షము చలువచప్పరముల నీడలు వెదజల్లినమాట నిజమే ! కాని యది చాలదు. ఆ శాఖలే యూడలుదిగి తాము తిరిగి వటవృక్షములయంతవైయెనవు డవి కల్పించు నాశ్రయము ప్రకృతిసుందరమై ప్రత్యేకమై ప్రత్యగ్రమై శోభిల్లును. ఇతోధికకృషికి మనము కృతబుద్ధులమైనపుడు గాని యాంధ్రనవల విశిష్టతగడించి విశ్వసాహిత్యమున పాటి నవలలలో మేటి యని పించుకొనఁజాలదు. పాత్రల స్వరూపస్వభావములకు సువర్ణసమన్వయముగల నవల లింక ననేకము వెలయవలెను. కథావస్తువిషయమున సాధించిన వైవిధ్యముతో సంతుష్టి నొందక కథానిర్వహణవిధాన విషయమునఁగూడ వైవిధ్యమును సాధించి బహుళ ప్రయోజనాపేతఁగల శిల్పసృజనగరిమకు సీమాభూమియైనచో మన నవల, యాంధ్రతా ముద్రాంకితమై భారత జాతీయతా యశోభూషణమై యంతర్జాతీయతాదర్శము గా గలదు. డా॥ జివాగోలు1 గాని జివాగోలు, పాష్టర్నాకు2 లుగాని పాష్టర్నా కలు, మనలోను వెలయుట ధ్రువము.

౩

## —: వైదేశిక పూర్వరంగము : ప్రథమాంధ్ర నవలావతరణము :—

నవల యనఁగా నూతనమైనదని యాంగ్లమున నర్థము. నేఁడు ప్రసిద్ధిఁగన్న ప్రతి వాఙ్మయమునకు విశిష్టశాఖగా లోకప్రియత గడించుకొన్నది, యీ నవల3.

---

1 Dr. 'Zhivago' is the name of Mr. Boris pasternak's famous Novel.

2. Mr Boris pasternak, a Russion writer was awarded Noble prize for literature and his Controvertial novel Dr. Zhivago was mentioned in the Noble prize Citation. He denounced the Russian society in 'Dr. Zhivago' and he was promptly stripped off his honours by the Russian Government. Ultimately Mr. Pasternak declined to aceept the offer of Noble Prize. He recently Passed away, hardly an year after his declining the Noble Prize.

3. "ణుస్తుతౌ" — కొనియాడఁబడినది; కనుక నవము. 'నవం లాతీతి నవలా' — లా— ఆదానే — దానేపి ద్వ్యర్థే ప్రయుజ్యతే. పరంతు ఆదానే ఇతి అర్థ ఏవ బహుళ ప్రచారే విద్యతే. ['లా'యనఁగా ఆదానము (ప్ర)దానమునుగూడ నగుట 'చంద్రికాకారుని' మతము] సాహిత్యమునఁ గ్రొత్తఁదనము వహించునది; లేదా, యిచ్చునది యగుటచే నవలాశబ్దము సార్థకమని చమత్కరింపవచ్చును.

ఆంధ్రవచనమునఁ గథారచనము పదునేడవ శతాబ్దియందే యారంభించినది. కాని యది పౌరాణిక కథ. అందలిది యాఖ్యానశైలి. లేదా, యందలి దైంద్ర జాలిక కథ. చర్విత చర్వణముగ నవలంబింపఁబడినదే యందలి కథాక్రమము. నవల, నవలిక, కథానిక మున్నగునవి గతశతాబ్దిలో నిటీవలనే ప్రత్యేక కళాఖండములుగ రూపొందినవి. మనవారి[1] కాంగ్ల సారస్వతముతోడి సంసర్గమేర్పడుటవలనఁ గలిగిన గుణగతములలో నిది యొకటి. ఆంగ్లపదమున కించుక వైకృతముచేసి యాంధ్రములో 'నవల' యనుదానిని యీ కథాసాహిత్యవిశేషమునకు సాధారణ నామముగా స్వీక రించితిమి. అన్ని సాహిత్య ప్రక్రియలవలెనే పందొమ్మిదవ శతాబ్ది పరార్థమున నిది నామరూపభావములలోనో లేక యే యొకటి రెంటిలోనో యనుకరుణశీలము గల్గియే యుద్భవించినదని స్థూలముగ నిరూపింపవచ్చును.

*ఇతిహాసము : నవల :—*

నన్నయాదుల భారతమువంటివి ప్రధానముగ నితిహాసములు. మోక్షరాజ్య సంపాదనమునకు సంబంధించినది యాధ్యాత్మికదృష్టి. స్వర్గరాజ్య సంపాదనమునకు సంబంధించినది మతపరమైనదృష్టి. ఈ రెండు దర్శనపథములతో నిర్మింపఁబడినవి యితి హాసములు. ధారుణీరాజ్య సంపత్సంబంధియైనది యైహికదృష్టి. ఈయైహికదృష్టితో సృష్టింపఁబడినది కథాసాహిత్యము. దీని కాముష్మికచింతతో గరిష్ఠసంబంధములేదు. ఇది ప్రపంచానురక్తిఁగొల్పును; లౌకికోపయోగితఁ గలది. కావున నితిహాసాదికమును బారలౌకికసాహిత్యమనియుఁ గథాసాహిత్యమును లౌకికమనియు వివక్షించుట యుక్తి

1. తమిళమున 'కాదై' అనఁగా నవల. 'కాదు', అనఁగా చెవి. కాదు + ఐ ('ei' is added to form an abstract idea in Tamil) = "కాదై" అనఁగా చెవులలో మాఱ్ఱోగునది యని యర్థము అనఁగా [నవలను జెప్పుదురు గాన] వినఁబడునది. నవలను వ్రాయుట యనుటకంటెఁ జెప్పుటయనుటయే సాధువు. కన్నడ, మహారాష్ట్రములలో నవలకుఁ 'గాదంబరి' యనుపేరు, సాధారణనామముగ స్వీకరింపఁబడెను. తెలుఁగున నాంగ్లపద మునకు వికృతిగా 'నవల'యందుము. ఆంగ్లములోనికి 'నవల'యను నా పద మెక్కడి నుండి వచ్చెనని యడుగుట యుక్తముకాదు. బాణుని 'కాదంబరి'లోని యొకపాత్రయగు 'మహాశ్వేత'(యొక్క)వృత్తాంతము ప్రథమాంధ్రనవలగా రచియింపఁబడెననియు, మునుపు చెప్పఁబడినది. యోజింపఁగా దమిళులు బాణ'కాదంబరి'యొక్కబాహిరపు[కథా] రూపమునకును కన్నడమహారాష్ట్రీదులు దాని పేరునకును, నాంధ్రులు ప్రథమనవలా మిషచే నందలి [మహాశ్వేతయొక్క] యితివృత్తమునకును బ్రాధాన్యమిచ్చినట్లుఁ దోఁచును. కావున నామరూపవస్తుగుణాదికములో, నేయొక్కదానియందో, స్వదేశీయము, భారత జాతీయమునగు ప్రభావమును మనతొల్లిఁటినవల యంగీకరింపక తీరుటలేదు.

యుక్తము. దాని కైహికదృక్పథముఁ, దీని కాముష్మిక దృక్పథమును నౌపచారికములు. కావుననే కేతనార్యుని 'దశకుమారచరితము', పింగళి సూరనార్యుని 'కళాపూర్ణోదయము', అనంతామాత్యుని 'భోజరాజీయము', జక్కన 'విక్రమార్క చరిత్రము', కొఱవి గోపరాజు 'సింహాసన ద్వాత్రింశిక' వంటివానిని, శుకసప్తతి[1], హంసవింశతి[2], బేతాళపంచవింశతి, పంచతంత్రము[3], హితోపదేశము మున్నగువానిని పద్యరూప నవల[4] లనుట పొసఁగుచున్నది. కాని వీనికాధ్యాత్మిక దృష్టి కొఱవడుట యా దినములలో విమర్శనకు గుఱికాకపోలేదు. 'కేవల కల్పనాకథలు కృత్రిమరత్నములు'ని[5] రామరాజ భూషణుఁ డిందువలననేగదా, 'హరిశ్చంద్రనలోపాఖ్యానాది' కలిధ్వంసకము[6] లను శ్లేషలోఁ గూడ నుపశోభింపఁ జేసినాఁడు!

---

1. దీ కి మూల మున్నది.

2. దీనికి మూలము మృగ్యము. ఉజ్జయినిలో నొక ప్రోషితభర్తృక పేరు హేమావతి ఆమెకు హేలయను నొకదూతిక. ఆ దూతి గఱపు దుర్బుద్ధులకు లోనై యామె యా దేశపరిపాలకుఁడగు చిత్రభోజుని బొందఁగోరి పోవనుద్దేశించెను ఆమె గృహహంస మీ సంగతి గ్రహించినది. ఒక్కొక్క రాత్రి కొక్కొక్క కథచొప్పునఁ జెప్పి యాహంస మామె దుర్బుద్ధిని మఱల్చెను. పిదప భర్త్రాగమనము, దంపతీసుఖజీవనము నిందు వర్ణితము. దీని కర్త అయ్యలరాజు నారాయణామాత్యుఁడు.

3 దూబగుంట నారాయణకవియు, బైచరాజును రచించినవి, రెండు పంచతంత్రములు.

4. "కాదంబరి, 'కళాపూర్ణోదయము' కూడ నవలలేనని మురిసిపోయే దేశాభిమానులుకూడ లేకపోలేదు. నవల అనేరచనయొక్క స్వరూపమూ నిర్వచనమూ తెలియకపోవడమే యిందుకు కారణం"—అని శ్రీఅడపా రామకృష్ణారావుగారి పలుకు. ['ఆంధ్రప్రదేశ్'—మే, 1960—వైశాఖము—1882—శక. సంపుటము 4, సంచిక 7, పుట 41]. నవలల పరిణామమును జెప్పునప్పుడు పద్యరూపనవలల ప్రసంగముతప్పదు. శ్రీఅడపావారెఱిఁగిన యాంగ్లములోను నిట్టివి గలవు. అప్పటివారు వానికే మురిసిపోయిరి. వారి మురిపెములో పాలుగొనుటయే సహృదయవిమర్శన. నవలాస్వరూపనిర్వచనము లెంతతెలిసిననవి మాఱునట్టి గుణముగలవి. నేఁటినిర్వచనములతో నాఁటివస్తువునుజూచి మొగము ముడుచుకొనుట విమర్శనకాదు వెలలేనిసులోచనములు విమర్శకుల కారోగ్యము నీయవు. 'కాదంబరి'యనఁగా 'మహాశ్వేత'యని పేరిభావము.

5. 'వసుచరిత్రము'—అవతారిక—పద్యసంఖ్య 19.

6. 'హరిశ్చంద్రనలోపాఖ్యానము' — అవతారిక.

దక్షిణాంధ్రయుగ వచనవాఙ్మయముగూడ నిట్లే పౌరాణికకథల స్వీకరించినది లౌకికదృష్టిగల వచనము[1] నేటికిని మనలో బెంపొందలేదు. పింగళిసూరనార్యుని మహనీయకథాసంవిధానము[2]గల 'కేవలకల్పనాకథల' వాద మాయుగములో నంతగ నామోదముద్రఁ బడయలేకపోవుటయం దాశ్చర్యములేదు. తంజాపురి, మధుర, పుదుకోట్టలలో వర్ధిల్లిన వచనము, రామాయణభారతాదుల శైలిని సులభీకరించు నుద్దేశముగలది; కేవల మహనీయకథా సంవిధానముగల లౌకికదృష్టి నంగీకరించినది కాదు.

మన దేశములో దక్షిణాంధ్రయుగముపిదప నించుమించుగ నాంగ్లయుగము ప్రారంభించె ననవచ్చును. దాని ప్రధానాశయము దేశపరిపాలనశాఖల నిర్వహణము నకై యుద్యోగముల నిమిత్తము యువకుల కాంగ్లము బోధించుట. మన కాంగ్లము బోధించుట యెంతయావశ్యక మయ్యెనో[3] పాలకులకు మన దేశభాషలనెల్ల పఠించు టయు నంతయావశ్యక మయ్యెను.[4]

ఎంత నేర్చినను మన కాంగ్లములో సంపూర్ణ సాహచర్యము క్రీ.శ. 1858 వఱకుఁ గుదురలేదు. అంతదనుక దుబాసీ[5] యగుటకును 'గుమాస్తా'[6] యగుటకునుమాత్రమే యాంగ్లము నేర్చుటజరిగెను; పాండిత్యసంపాదనమునకుఁగాదు. క్రీ. శ. 1858 పిమ్మట నాంగ్లభాషతో సంపూర్ణ సాహచర్యమును వద్భాషలో పాండితీ సంపాదనదృష్టియుఁ బాశ్చాత్యసంస్కార సంపర్కమును మనకుఁ గల్గినవి. అప్పటినుండియే లౌకికదృష్టి గల రచన లుపక్రమింపఁజొచ్చిన వనవచ్చును. క్రీ. శ. 1835 వఱకు సాగరేయ పర్వతేయాంధ్రులకు 'పెర్షియన్' రాజభాషయని బ్రౌనుపండితుఁడు,[7] పణికర్ మహో దయుఁడును[8] జెప్పిరి. పిమ్మట వెలసినది, యాంగ్లప్రభావము.[9] సంయుక్తమదరాసు

1. Secular Prose. 2. 'కళాపూర్ణోదయము'.
3. Fort saint George College was opened in Madras in 1812 (A.D); Presidency High School in 1840. (A. D); University Act in India in 1857 (A.D ); Opening of the Presidency College in Madras in 1857 (A.D)only
4. 'The East India Company' had to request Chinnaya Sūri to compile 'Hindu Dharma Sāstra' for its administrative facilities, in 1858
5. ద్విభాషి Bi-Linguist.
6. Earlier, this Urudu or persian term was used, for the nominee of "Patwāri" who Collected revenues in the Circar districts of Andhra.
7. Many similar words, as cited immediately above, used in routine administration even to this day, in Andhra, are proof Positives of the fact that persian influence was there.
8. Vide. '*History of English rule in India*' by Panikar.
9. Vide. '*The Influence of English on Telugu*'- M. litt., Manuscript Thesis, by Sri G. Nārāyanaswāmi Reddi, Madras university. Also vide. "*Influence of English on Telugu literature*" Dr. K. Virabhadra Rao, M. A., Ph. D., (Andhra University).

రాష్ట్రప్రభుత్వమున విద్యాసంస్థలయందాంధ్రభాషా పరీక్షాపత్త్రములలో రెండు మూఁడు దశాబ్దులపూర్వమువఱకు నాంధ్రమునుండి యాంగ్లములోనికిఁ బరివర్తనము చేయుఁ బ్రధానమైన ప్రశ్నయొకటి యుండెడిది.[1] ఆ దినములయం దాంధ్రకావ్య ప్రబంధములనుండి యుద్ధృతములైన పాఠ్యభాగములు ఐ. సి. యస్. పరీక్షావిద్యార్థుల కొఱకై యాంగ్లములోని కనూదితములై ప్రకటింపఁబడెడివి.[2] మెట్రిక్యులేషన్ పరీక్షయందుఁ దెలుఁగుపరీక్షాపత్త్రములలోని ప్రశ్న లాంగ్లముననుండుటయుఁ గలదు.[3] కలాశాలావిద్యార్థి యాంగ్లానువాదమునందు సంపాదించిన యంకము లాంగ్లభాషో

---

1. ఆంగ్లమునుండి యాంధ్రములోనికిఁ బరివర్తన మచ్చట నిప్పటికి నున్నది.

2. నా కీ విషయమును శ్రీనిడదవోలు వెంకటరావుగారు స్వయముగఁ జెప్పియున్నారు. నేఁడు సంస్కృతమెట్లో, నాఁ డాంధ్రమట్లు విద్యాధికుల కొకవిధముగ నాంగ్లభాషా వాహికబోధన గలది.

3. **Matriculation, December 1868.**

Question No.

III (b) 1. Analyse the word నెమ్మొగము

2. Give the roots of మొగము, అచ్ఛము and వెట్టి; also the other forms of మొగము.

3. What is the meaning of the word త్రిదశులు; why were they so called?

(d) Parse fully the fallowing words *from the above*

1. నెమ్మొగంబు; కోయుచున్న; వెట్టి; ఏలుచున్.

2 Explain the 'Sandhis' in మహితాత్మ దేవిఁ దెచ్చెదనని చూచెదేఁ జెడుగు చేఁతలకుం జొర.

IV In what fictitious form did Māreecha appear to seeta (Sita)? Describe the scene fully in plain and easy Telugu; also quote the passage or Passages if you can. What followed immediately after this?

[Matriculation Examination paper, Telugu, December 1868. University of Madras. Vide Examination Paper files, University Library, University of Madras. or, "*Influence of English on Telugu literature*" by Dr. K. Veera (Vira) bhadra Rao. M. A., Ph. D. P. 254 (1960).]

దన్వదుల్లంఘనకుఁ దోడ్పడెడివి. క్రీ. శ. 1949 వఱకు[1] 'తెలంగాణము'న[2] నుండు టకు రాజభాషగా 'ఉర్దూ' ఉన్నది. కాని యంతయన్యాయము లేదనవచ్చును. ఉర్దూ పరివర్తనయందలి నైపుణ్యమువలని యంకములు తెలుఁగువిద్యార్థుల కా భాషలో నుత్తీర్ణతవిషయమున గణనకువచ్చినట్లుఁ దెలంగాణమున వినము. ఇప్పుడిప్పు డన్ని తావులయందువలెనే యాంగ్లానువాద మున్నతపాఠశాలావిద్యార్థి కాంధ్రభాషాపరీక్షలో దెలంగాణమునఁ దోడ్పడుచున్నది.

సర్కారుమండలములలో నిటీవలిదనుక నాంగ్లమునకుఁగల ప్రోత్సాహమును గుఱించి చెప్పుట కిది చెప్పవలసివచ్చినది. ఆనాఁటి విద్యాధికులు, విద్యార్థులుగూడ నవలల నాంగ్లములోనే చదువుకొనెడివారు. కాన మనభాషలోగూడ నిట్టినవల లున్నచో బాగుండునని వారిలో నొకతీవ్రకాంక్ష గల్గినది. ఆంగ్లములో నేమున్నదో విషయమనెడి జిజ్ఞాస పిన్నలకుఁ బెద్దలకుఁగూడఁ బొడమెను. అదియే యొకనూతన ప్రబోధము.

రాజకీయోద్యమములు రాజకీయస్వాతంత్ర్యమును వచ్చినతరువాత నిప్పుడిప్పు డనువాదములనఁగా భాషాదాస్యమనియు గౌరవహానియనియు నూటికిఁ గోటికి నొకరిద్దఱనుకొనుచున్నారేమో! కాని యనువాదములు చేయవలెననెడియు నది వికాసమనుకొనెడియు దినములవి. "ఇంగ్లీషున రెండుముక్కలు రావాయె; నెప్పుడు తెలుఁగేచదువును-"అని తల్లిదండ్రులు పిల్లలనుగూర్చికించపడిన దినము లవి. క్రమముగ వారియావేగ ముత్సృత మయ్యెను. దేశమునఁ దెలుఁగుప్రభావము తెగచినది; క్రమముగ దానికిఁ దెగువయుఁ గలిగెను. సంఘపురుష చింతాఫలమైన ప్రార్థన యుత్సర్పిణి కాకమానునా? క్రమక్రమముగ నాంగ్లప్రభావముగూడ నధికమయ్యెను. తత్ప్రభా విక్రమముతో బారలౌకికదృష్టి మందమై లౌకికదృష్టిగల వచనరచనమునెడ నాదరము మేదుర మయ్యెను. సాహిత్యప్రక్రియగా నాంగ్లముతోడి సాదృశమున్న ప్రథమాంధ్రనవలావతారమునకు రంగరచన మీ ప్రోత్సాహప్రభావప్రకర్షములవలననే సంసిద్ధమైనది.

---

1. Upto Police Action in 1949, in Telangāna.

2. తెలుంగు + ఆణెము = 'తెలుంగాణెము' అని శాసనప్రమాణములు; తెలుఁగు + ఆణెము = తెలగాణము-"తెలగాణ భూములఁగల మన్నెవారిచే. . . ." [వెన్నెలకంటి సూరన-విష్ణుపురాణము-1-11.] నని కావ్యప్రమాణము; తెలంగు + ఆణెము = తెలంగాణము అని నేఁటి ప్రజావ్యవహార ప్రమాణము. "ఆణెమంచనఁగ దేశాహ్వాయంబు." మదురు పాటి వేంకనార్యుని-ఆంధ్రభాషార్ణవము 2-7.

## -: శ్రీరంగరాజు చరిత్ర[1] : ప్రథమ స్వతంత్రనవల :-

సాహిత్యకముగ వైదేశికపూర్వరంగప్రభావముగల యిది ప్రథమాంధ్రమౌలిక నవల; ఐ దుల్లాసములు గలది. దీనికర్త నరహరి గోపాలకృష్ణమసెట్టి. వీరు కర్నూలు మండలమునకు 'డెప్యూటీ కలెక్టరు'గా బనిచేసిరి. కర్నూలు జిల్లా భూగోళము[2] స.గూడ వీరే రచించినట్లు విదితము.[3] వీరు తమ నవలకు నాంగ్లములో గూడ నొకపీఠికఁ గూర్చిరి; ఆంగ్లవిద్యాధికులు ప్రభుత్వోద్యోగులునగుట కొంతవఱకీ నవలా రచనోద్యోగమునకుఁ దోడ్పడినది. ఆ దినములలో రాజప్రతినిధియైన "మేయో" ప్రభువు[4]వంగరాష్ట్రీజాతీయ జీవితమునుగూర్చి యాంగ్లేయపద్ధతిలో నుత్తమమైన నవల రచించినవారి కొకబహుమతినిచ్చుట తన యాశయమని ప్రకటించినాఁడు.[5] అది తుదకు నెరవేరలేదు. కాని దానిచేగూడ గోపాలకృష్ణమసెట్టి యాకర్షింపఁబడినట్లుఁ దోఁచుచున్నది. కలిగినకోరికకుఁదోడుగ నభ్యుదయగామిగావలెననెడి యాశంస యొకటి చక్కిలిగింతలుపెట్టి యీ నవలాశంసనమునకుఁ బ్రోత్సహించెను.

---

1. దీనిని గూర్చి వివరములు:—
   - అ రంగరాజు చరిత్ర — గోపాలకృష్ణమ్మశెట్టి — 1871 [ఆంధ్రవాఙ్మయసూచిక-ముద్రితగ్రంథములపట్టిక, పుట 161 ]
   - ఆ దీని ముద్రణకాలము క్రీ శ. 1872 అని శ్రీనిడదవోలు వేంకటరావుగారు సరిగా చెప్పిరి — [ఆంధ్రవచనవాఙ్మయము. పుట 123. ప్రథమావృత్తి.]
   - ఇ 'Siri Runga Raju Charita' – A. Gopala Kristnama Chetty. Reg. No. 11, Date of issue from press 14-6-1872. Page 101-1st-Edition. [Catalogue of Books Published in the Madras Presidency, Volume 1-Page 23; June 15, 1873 Suppliment.]
   - ఈ 'ప్రబుద్ధాంధ్ర' - జనవరి - 1924.
   - ఉ "ప్రతిభ" (సాహిత్యపత్రిక) సంపుటము, 1 — సంచిక 3.
   - ఊ ఇట్లే కీ శే. చేకుమళ్ల వారును జెప్పినట్లు 'నవ్యాంధ్రసాహిత్యవీథులు పుట 23 — ద్వితీయావృత్తి — 1949.
2. ఇది క్రీ. శ. 1871 నాఁటి రచన.
   [ఆంధ్రవాఙ్మయసూచిక — ముద్రితగ్రంథముల పట్టిక — పుట — 33,]
3. నరహరి గోపాలకృష్ణమ, గోపాలకృష్ణమ్మసెట్టి, A. Gōpāla Kistnama Chetty, నరహరిసెట్టి గోపాల కృష్ణమ్మసెట్టి, Author of District Manuals అని వీరికే పెక్కురీతుల వ్యవహారము. వీరిది కుంభకారకులమైనను గావచ్చును. కుమ్మరులను గూడ వృత్తినిబట్టి సెట్టియందురు.
4. Lord Mayo, the Governor general of India.
5. శ్రీరంగరాజుచరిత్ర ఉపోద్ఘాతము (తెలుఁగు) (1872.)

ఈ నవలలోనివి నూటయొకటి పుటలు; కథయుఁ జాలచిన్నది. దీనిని నవలిక యన్నను జెల్లును. ఇందలి యితివృత్తము విజయనగరప్రభువైన శ్రీరంగదేవరాయల కాలమునాఁటిది; సాంఘికచిత్రము; నాయకుఁడు రంగరాజు; నాయిక రంగనాయిక; కథలో గొంతవఱకు 'సోనాబాయి'యని వ్యవహరింపఁబడును. ఈ నవలికను 'సోనా బాయిచరిత్ర'యన్నను ననవచ్చును. పేరునుబట్టి దీనినిఁ జారిత్రక మనరాదు. విదేశ ములయందునైత మిట్లే 'చరిత్ర' యనుపదము నవలలపేరులో జాలకాల ముండెడిది. 'శ్రీరంగరాజుచరిత్ర' ప్రధానముగ సాంఘికము;[1] యావత్ దక్షిణభారతదేశమునకు దీనిని సాంఘికనవలాప్రథమప్రసిద్ధ ప్రయత్నమనికూడఁ జెప్పనొప్పును. ఆంధ్రుల యాచారవ్యవహారములఁజిత్రించుట దీనిధ్యేయము. ఇందలి సంవిధానముగాని శైలీ సుఖప్రసూతిగాని నిర్దుష్ట మనలేము. పాత్రపోషణ మించుక కొఱవడ్డదన్ని వేళ మొకటి యున్నది. ఈ కారణములవలననేమో దీనికి రావలసినంతఖ్యాతి రాలేదు. రాజపుత్రవనితయైన నాయికను 'బొందిలీస్త్రీ' యనుకొని బలాత్కారముగ నొక లంబాడీలగుంపు బంధించును. ఇందలి యిట్టికొన్నిసన్ని వేశముల నుదాత్తమైన నవల యం దుండవలసిన వనలేము. కనీస మిట్టిది నాఁటివారి యభిరుచికి విరుద్ధ మనదగును. వా రిట్టివానిని నిరసించుట యనూహ్యము, నపూర్వమునుగాదు. నాఁటిస్త్రీలు మొగమోడి మొగమొగములుచూచుకొను ఘట్టము లిందున్నవి.[2] నాఁ డొక ప్రసిద్ధ నగరముననుండి సంఘసంస్కర్తగా, సాహితీపరుఁడుగా, నుపాధ్యాయుఁడుగా, బహూ ద్యమనాయకుఁడుగా వీరేశలింగముపంతులు గడించినకీర్తి వీరి కెట్లువచ్చును? సాహిత్య కృషి వీరి కానుషంగికము; రచనయందా యన్లిల షుండెను! బహుహేతువులచే నీ నవలకుఁ బ్రఖ్యాతియు భాస్కరాలోకభాగ్యమును బట్టలేదు. చారిత్రకాంశముల

1. కిన్నడమున స్ఫూర్తియపుట్టన్నది, "మాడిదుణ్ణో మహారాయ" యాళతాద్దిలో బ్రకటింపఁ బడువఱకు ప్రసిద్ధమైన సాంఘికనవల వెలువడలేదు. ఇతఃపూర్వము ప్రకటితములైనవి చాలవఱకు నపరాధపరిశోధకనవలల వంటివి.

2. తనకు సవతితమ్ముఁడును వేశ్యాపుత్త్రుఁడును నగు కృష్ణునకుఁ దనతో సమానమైన గౌరవములు లభించుచున్నందుల కోర్వలేక శ్రీరంగరాజను రాజకుమారుఁడు సమిత్త్రుఁడై దేశమువిడిచిపోవును. శ్రీశైలసమీపముననున్న 'చంద్రగుప్తి'లో నితఁడు సోనాబాయి యనునొక లంబాడీకన్నెను బ్రేమించినాఁడు. ఆమెను భీమనాయకుఁడను దొంగలనాయ కుఁడు ముందేప్రేమించి నిరాకృతుఁడై యపహరించుకొనిపోయి కొండవీటిరాజున కప్ప గింపఁగా శ్రీరంగరాజామెను రక్షించుటకై కొండవీడు చేరును. కొండవీటిరాజు తల్లి సోనాబాయిని తమకోటనుండి తరిమినది. రంగరాజాదులామెను నామెతల్లిని గలిసికొని విద్యానగరమునకుఁ బోయిరి. సోనాబాయి (లంబాడి) తల్లివలన సోనాబాయి రంగ నాయిక యను రాచకన్నెయనియు నామె శ్రీరంగరాజునకు మేనత్తకూఁతురనియు వెల్ల డియై కథ శ్రీరంగరాజ రంగనాయికల వివాహముతో బరిసమాప్త మగుచున్నది.

పంజరమున నమర్చిన సాంఘికేతివృత్త మీనవల; రచనలో నేమియుఁబసలేదని పూర్వమే చెప్పఁబడెను: కాని సంస్కృతాంగ్లాదిమాతృకలు మూలాధారములును లేనిది. ప్రథమాంధ్రస్వతంత్రనవలగా లోక మిట్టిదాని నుట్టంకింపమికిఁ బ్రధానకారణము తత్కర్త యంతప్రసిద్ధుఁడుగామియే యనిపించు చున్నది.

తరువాత వెలువడుటకుఁ బెక్కుమంది వేఁబది గ్రంథములు రమారమి వెలువడినవి. అందు కొన్ని విక్రమార్కచరిత్రాదికవచనగ్రంథములు;[1] కొన్ని హంసవింశతి కథలు,[2] శుకసప్తతికథలు;[3] రేచుక్క: పగటిచుక్కకథల మాదిరివి.[4] తోడేలుకథ,[5] ఒక బ్రాహ్మణునికథ[6] వంటి మతపరములుకొన్ని; మఱికొన్ని 'ఒకరాజుకథ'[7] వంటి వాచకపుస్తకములు. చాలవఱ కిట్టివి క్రైస్తవమతప్రచారకుల ప్రచురణములు. పిట్టకథలు, వాచకపుస్తకములు, మతగ్రంథములును బెక్కుగ వచనమున వెలువడు దినములవి. దొరలకుఁ దెలుఁగుభాషాబోధకులైన చిన్నయసూరివంటివా రప్పటి కప్పుడే తిరిగి వారివలనఁ బ్రబోధితులై గ్రాంథిక వచన రచనమునకు దారితీసిరి. క్రైస్తవమతప్రచారకులు తెలుఁగుముద్రాయంత్ర నిర్మాణమునకుఁ[8] దోడ్పడినట్లే

1. ఇం దున్నవికూడ విక్రమునికథలు; కూర్పరి లేక రచయితపేరు లేదు; క్రీ. శ. 1–10–1872.

2. ఒక దుశ్శీలరతిగల వ్యక్తి కొక హంసచెప్పినదనఁబడెడి యిరువది వలపుకథల వచన రూపము; లక్ష్మీపతికృతము. 20–2–1874.

3. దూరస్థభర్తృక యగునొక విలాసవతికి, రాజాంతఃపుర ప్రవేశవ్యసన నివృత్తినిమిత్త మొక చిలుకపలికిన డెబ్బదికథలు. కొన్ని ప్రసిద్ధవిదేశకథల కివి యనుకరణములవలె నున్నవి. కథకునిపేరు తెలియదు. [15–7–1879లో బ్రకటితము.]

4. దోఁపిడివృత్తి నవలంబించిన తండ్రికొడుకుల విచిత్రసాహసగాథలుగల వచనరచన మిది. కర్తపేరు గురుమూర్తిపంతులు – జనవరి, 1873.

5, 6, 7. Madras Religious Tract and Book society Publications, all August, 1873.

8 జర్మనీయందలి ప్రష్యాదేశములోని మాగ్డిబర్గ్‌నకుఁ జెందిన 'హాలీ' నగరమునందు క్రీ.శ 1746లో మొట్టమొదటి తెలుఁగుపుస్తక మచ్చయినది. ఇది క్రైస్తవమతప్రార్థన గ్రంథము. దీనిని ముద్రింపించిన మహోదయుఁడు రివరెండ్ బెన్‌జమిన్‌స్కుల్జ్. ఈ మహాచార్యుఁడే యూరోపియనులకు మొదటిసారి తెలుఁగులిపినిగూర్చియు భాషనుగూర్చియుఁ దెల్పినవాఁడు. క్రిశ్చియన్ నాలెడ్జ్ సొసైటీ కిరాటిక్‌మిషన్‌నకుఁజెందిన క్రైస్తవమతప్రచారకులు కలకత్తాకు దగ్గఱఁగల 'శ్రీరాంపురము'లో నొక 'మిషన్' స్థాపించి, బైబిల్‌ముద్రణకొఱకై యేదెనిమిది భాషలయొక్క లిపుల నచ్చునఁగూర్చు నక్షరములఁ బోఁతఁ బోయించి ముద్రాయంత్రము గూడ నొకటి నెలకొల్పిరి. ఆ యక్షరములతో నచ్చయిన తెలుఁగుపుస్తకములు క్రీ. శ. 1747 నాఁటివి శ్రీరామంపురము కళాశాలాపుస్తకభాండారమున నుండెడివి. విజ్ఞాన సర్వస్వము 3, పుట 979 (1959).

సరళవచనమునఁ జిన్నచిన్నవగు సంస్థలును[1] పుస్తకములరచనమునకుఁ దోడ్పడుచుండె డివి. లౌకికవచనమునకుఁగాని విశేషించి నవలాప్రక్రియ కనువగు సరళధారాళ వచనమునకుఁగాని యొకప్రమాణమన్నది యప్పు డింకను గుదురుకొనలేదు.

ఇట్టి వాతావరణములో నానారంగములయందును బ్రోత్సాహము బూరిం చుటకో యన్నట్లుగ, వీరేశలింగముపంతు లవతరించుట తటస్థించెను. కారణజన్మ మెత్తిన పంతులుగారు సాంఘికసారస్వతరంగముల సంస్కారమునకుఁ గావలసిన సామగ్రీ సంగ్రహీతియగుటలో జాగు చేయలేదు. సంఘసంస్కరణోపయోగితకు నవలా ప్రక్రియ రాజమార్గ మగునని యా దీర్ఘదర్శి యూహింపఁగలిగెను. దేశమున వచన రచనము మెఱుఁగెక్కినది. వీరేశలింగముపంతులు 'రాజశేఖర'[2] నవలయు సారస్వత సింహాసన మెక్కినది.

సాంఘికరంగమున నవ్యత్వమును బ్రథమముగ దర్శించిన యుగకర్త వీరేశ లింగముపంతులు. ఆయనదర్శనము నిర్దుష్టము, సంఘాశ్రయము. వారి సంఘ సంస్కారగానములో భారతదేశరాజకీయ స్వాతంత్ర్యశ్రుతియు లీనమైనది. పర పరి పాలనాపీడితమైన భారతదేశమునఁ గ్రమశః సర్వవిషయములయందును స్థాయి పతన

---

1 C. K. Society; Madras Religious Tract & Book Society; C. V. E. Society; M. S. B & V. L. Society; M. R. T. Book Depository etc.

2. దీనికి 'రాజశేఖర చరిత్రయని' ప్రసిద్ధి. ఇది తొలుత "వివేకవర్ధని" పత్రిక-మూఁడవ సంపుటము [ఈశ్వర-పుష్య క్రీ. శ. 1877-'78]లోఁ బ్రకటితము. అందు 'వివేక చంద్రిక' అను 'రాజశేఖర చరిత్ర'యనియే కలదు. కాని, పిమ్మట దీనిపేరు మార్చివేసి పత్రికలకు సమీక్షార్థము పంపియుందురు. ఏలన, క్రీ. శ. 1878 . . . . నాఁటి దగు హిందూ 'పత్రిక' యీ నవలను సమీక్షించుచు "రాజశేఖర"యనియే వ్యవహరించినది. ఈ సమీక్ష ముందుముందు రాగల 151 వ పుటలో నఖో జ్ఞాపికయందు సంగృహీయ మాణము. పిదపఁ బ్రథమావృత్తియందును దీనిశీర్షిక 'రాజశేఖర' యనియే కలదు. నాఁటి సంయుక్త 'మదరాసు' ప్రభుత్వము ప్రకటించిన 'గెజెటు'లయందుకూడ దీనిపేరు 'రాజశేఖర' అను - "వివేకచంద్రిక"గా నగపడును:- 'Rājasekhara' or 'Viveka Chandrika' [or-Moon light of Instruction] - K. Viresalingam pantulu - (fiction no-94) 1st, August, 1880, - P. 144 - 1st Edition Reg. No - 146. Copies 800-Price Re 1 - Size. S. V. O. [Vide, Catalogue of Books Published in the Madras Presidency, Vol 2, P. 51 of Suppliment. Feb 1882] ద్వితీయావృత్తినుండి మఱల నిది 'రాజశేఖరచరిత్ర' యైనది. ఈ నవలయందు కొన్ని మార్పులు చేయవలెననియున్నను నట్లుఁజేయమికి దీని ద్వితీయావృత్తిలోని పీఠికయందొక సాకుగూడఁ జెప్పఁబడినది. ఆయీ కారణములచే నీ నవలాకర్త దీనిపేరులో మార్పులు చేసిరనియుఁ గథలోమార్పు నుద్దేశించిరేగాని చేయలేకపోయిరనియు విదితము.

మొందఁ జొచ్చెను. జీవితపరమార్థములు బహువేగముగ వికృతిఁబొందుచున్నవి. సంప్రదాయార్థమున నీతినియమము లనఁబడునవి తీవ్ర విమర్శనాకులిశధారలకు వశమయ్యెను.

వీని పరిణామముగ సారస్వతక్షేత్రముగూడ నవ్యతాసంపన్నమైనది. సరళ సుందరవచన ప్రయోగముచే ప్రజానీకమును జాగృతముచేసినవారు పంతులుగారు.1 శైలీవిస్పష్టత విజ్ఞానప్రదమని విశ్వసించి సాహితీసుగతులై 'గద్యతిక్కన' బిరుదు నొందినవీరు తద్వాఙ్మయమార్గములలో రచించిన యొకనవలయు, నొకనవలవంటి హాస్యరసస్ఫోరకమగు నాక్షేపగ్రంథమును మనకుఁ బ్రస్తుతము నుపాదేయములు.

## -: రాజశేఖర చరిత్రము :-

ఇందలి యితివృత్తము సంఘజీవితము; వ్యక్తిజీవితము కాదు. ఈ నవలకు నామాంతరము 'వివేకచంద్రిక' ఇందలి నాయకుఁడే రాజశేఖరము. వ్యక్తులజీవితమే సంఘజీవితము. ఐనను వ్యక్తికిఁగల ప్రభావమునుబట్టి సంఘము రూపొందుట వేఱు. అప్పుడు సంఘమునకుఁ బ్రాధాన్యములేదు; వ్యక్తి ముఖ్యము. ఈనవలలో సంఘమునకే ప్రాధాన్యము. సంఘప్రభావమువలన వ్యక్తులు క్రమక్రమముగ రూపరేఖలు తీర్చిదిద్దఁబడుట యిందు వ్యక్తమగుచుండును. సిద్ధాంతి, హరిశాస్త్రి, దామోదరం, (రాజశేఖరమునకు బావమఱది) శోభనాద్రి, నీలాద్రిరాజు మున్నగువారి ప్రవర్తనల వలన నిందు నాయకుఁడగు రాజశేఖర మమాయికుఁడని విదితమగును. ఇతఁడు కలికాలమున నాశ్రితకల్పకము; ఆశ్రితులవలన నీతనియాస్తి హారతికర్పూరమువలె హరించుకొనిపోయినది.2 ఐన నింగువగట్టినగుడ్డవలె నతఁడు కాలక్షేపముచేసినాఁడు. తుదకు 'పూలు ముడిచిన పురవీథిభూమియందు కట్టె మోవంగవలసిన కారణమ్ము' గలిగి కాశియాత్రకుఁబోయినను గష్టము లొకదానితరువాత నొకటి తఱుముకొనివచ్చినవి. ఆటుఁబోటులవలన దూపటిల్లని యాతని యాశయబడబాగ్ని, జీవితములో సాక్షా

---

1 వీరి "సరస్వతీ నారద సంభాషణ"మను ఖండకృతిలో తమ కవ్యవహితపూర్వమైన కావ్యవాఙ్మయమునందలి నిర్జీవత్వము తార్కాణింపఁబడినది.

2. "దానిలో (రాజశేఖర చరిత్రలో) ఒక మధ్యతరగతి బ్రాహ్మణకుటుంబపు జీవితం చక్కగా చిత్రింపబడినది" - "ఆంధ్రప్రదేశ్" సంపుటము 4, సంచిక 7, పుట 41 - (మే, 1960).

'మధ్యతరగతి' యననేమో దాని విలువయేమో దుర్గ్రాహ్యము. రాజశేఖరము కుటుంబ మానాఁటి కట్టిదికాదు. నేఁటివిలువనుబట్టి యట్టిదేమో తెలియదు. ఆ దినములలో నది యాఢ్యము; సుసంపన్నము నైనది.

త్కరించి ప్రసాధకమై ప్రకాస్తి కలిగించును. తన కుటుంబమునకు ధనప్రాణాభిమాన హానులు సమకూరినకొలఁదియు నీతని యాస్తిక్యబుద్ధి మెఱుఁగెక్కును. ఈతనిబుద్ధి యూహాపోహక్షమమైన చార్వికాదు; గ్రహణక్షమమైన గృహీతి. ఇందుచే నీ నవల సాంఘికము గాకతీరదు. రచయితృభావముగూడ సాంఘికేతివృత్తనిర్వహణమే.

రాజశేఖరముభార్య మాణిక్యాంబ; పుత్త్రుఁడు సుబ్రహ్మణ్యము; జ్యేష్ఠ పుత్త్రిక రుక్మిణి; కనిష్ఠపుత్త్రిక సీత. ఈసంసారముబొందిన యభ్యుదయవ్యసనములే కథేతివృత్తము.

స్త్రీజనదుస్థితి, యందును నిర్బంధవైధవ్యము, బాల్యవివాహములు, విద్యావిహీనతయు; వరశుల్క-విధానము, మూఢవిశ్వాసములవంటి సాంఘికదురాచారములును, కందుకూరివారిచే గ్రొత్తకలముపట్టించినవి.

మనతొలినవల, యే చైతన్యస్థాయిలో నుద్భవించినది? అది వ్యక్తిజీవితమునకు, సంఘశ్రేయమునకును సంబంధించిన యెటువంటి యనుభూతులను రేకెత్తించెను? దానిలో జీవిత మెట్లు ప్రతిఫలితము? సాంఘికదురాచారములున్నచో నవి ప్రతికృతములా? జీవుఁ డేయే యనుభూతులను సమకూర్చుకొనచున్నాఁడు? అందు వేని నెట్లుఁ బ్రకటింపఁగలిగెను? ఇత్యాది ప్రశ్నపరంపరచే నే సాహిత్యవిభాగమునుగాని పరీక్షించి దాని గుణావగుణములను నిర్ణయించుట నేఁటి సహృదయ విమర్శకునకు విధ్యుక్తము.

రాజశేఖరమువంటి స్వార్థరహితులు, ఆస్తికబుద్ధిసంపన్నులును బుద్ధ్యాపునకుఁ బోయి పాపముగొనితెచ్చుకొన్నవారును నేఁటికిఁగూడ బ్రతికిచెడినవారిలో గలరు; సిద్ధాంతివంటి చీడపురుగులు; హరిశాస్త్రికిఁదోడగు తోకచుక్కలు, దామోదరమున కథ్యాహారమగు నవకాశవాదులు, శోభనాద్రి కీడగు శుక్రశిష్యులు, నీలాద్రిరాజునకెనయగు నిర్ఘృణనిష్కారణవంచకులును నాఁటికిగాదు, నేఁటికిని సాంఘికచిత్రపటములో దమతమ యుచితస్థానముల నలంకరించుచు, మూర్తికట్టి సజీవవ్యక్తులై యుండనేయున్నారు. సాంఘికనవల, యొకనాఁటి సాంఘికచరిత్ర చెప్పుననుట నిజమే. కాని సాంఘిక, చారిత్రకాదినవలలలో వెనుకటి ఘటనల, సంశములను మాత్రమే తెలిసికొనవలెననెడి యాకుంచితాకాంక్షతో జూచినయెడల నవి యాసక్తి జనకములుగ నుండవు. ఆనాఁటిప్రజల నర్థముచేసికొనవలెననెడి చిత్తశుద్ధితో బ్రయత్నించినచో నవి చాల నుత్సాహకరములుగ నుండును. రచయితయు నందువలననే చరిత్రను సంఘాచారములను వ్యాఖ్యానించును. వాని ప్రతిబింబమును దింపఁడు పునస్సృష్టిచేయును.

వ్యక్తివిశేషసమావిష్ట సంఘచిత్రమునుమించి మన కానాఁటి నవల లేమియుఁ గలవు?[1] ఆ దినములలో శిల్పము పెరుఁగలేదు. రచయిత యుద్దేశమునుబట్టిగదా! మనము విమర్శింపవలెను. మన నేఁటి కోరికలన్నియు నానాఁటివా రెట్లుఁదీర్తురు? ముందు మనకోరికలే మంచికోరికలా? అప్పటివారికిఁ బ్రేరణఁగొలుపు నవలయగుట దానికి విజయవైజయంతి కాదా? తులనాత్మకవిమర్శనకై యొకవేళ 'రాజశేఖర చరిత్ర'ను, శిల్ప మింతగఁబెరిఁగిన నేఁటి ద్వితీయశ్రేణినవలలతో దారతమ్యముచేసినను నది తీసిపోదు.

రచనకంటె రచయిత సర్వథా సర్వదా ఉత్కృష్టుఁడు. వ్యక్తికిఁ గృతి యభివ్యక్తియేకదా! కాని విమర్శనవిషయములో నిష్ఠ రచయితపైగాదు, రచనపై నిల్పవలెను; గుణాగుణము లప్పుడు భూతతః పరికింతుము. అట్లని ప్రభావములుమున్నగు నంశముల ప్రమేయము వచ్చినపుఁడు వ్యక్తినిగూర్చి ముచ్చటింపమని కాదు.

అది ప్రధానముగ సాంఘికనవల. తల్లక్షణ మేమి? తాత్కాలికసాంఘిక జీవితప్రతిబింబము నొసఁగుట. రాజశేఖరచరిత్ర యట్టి యభివ్యక్తి యనరానిదా? జీవితానుభవములో రచయితను వేధించిన సమస్య లిందు లేవనఁగలమా? ప్రాఁతక్రొత్త నాగరకతల సంఘర్షణయు, దాని వింతపరిణామమును, వానినిగూర్చిన వితర్కములును తత్ఫలమైన జీవితదర్పణమును నీనవలలో లేవా? నాఁటి సంఘసంబంధివిషయములకుఁ బ్రజాజీవితమునకుఁ జక్కని సంపుటీకరణ మిందు సమకూరినది. అందలి ప్రయత్నము లన్నియు జీవితమునుండి యుత్పన్నమైనవి. అవి యావశ్యకములు, నాలోచనాశక్తి యుక్తములునైయుండి కథా విషయసంబంధ పర్యవసితములై, పరిణతములైనవి; కథకుఁ బరిపూర్ణమైన విలువనిచ్చినవి. పతాదృశహేతువులచేత దీని నవలాత్వమును శంకింపరాదు. దీనినిగూర్చి యితరవిమర్శన లున్నవన్నచో వానికిఁగారణములు గూడఁ బెక్కులున్నవి. అవి చాలవఱకు దానికిసంబంధించినవి గావు. దాని కర్తకుఁ జెందినవి.

దీనినిగూర్చి లోకమువాకొను విషయములలో మొదటిది యనువాదవిషయము.

---

1 ఇందు సాంఘికదురాచారములు తూర్పారఁబట్టఁబడినవి. కీ. శే. కాశీభట్ల బ్రహ్మయ శాస్త్రిగారు రీనవలను దీవ్రముగ విమర్శించిరి. [నవ్యాంధ్రసాహిత్య వీథులు - పుట 23 - రెండవకూర్పు - (1949).]

నిజ మూహింప నిది యనువాదముగాదు.1 దీనిని బరివర్తనము ననరాదు.2 పెక్కుమంది పెద్ద లనినట్లుగ దీని ననుసరణము3, ననుకరణము ఛాయామాత్రాను కరణము ననుటకూడ ధర్మము కాదు. అనువాదమైనచో నాంగ్లమునందు దీనికిఁ బునః పరివర్తన మేల? ఆంగ్లానువాదముబట్టియే యిది మౌలికమని తేలుచున్నది. ఇది స్వతంత్రమనుట కీయొక్క దృష్టాంతమే చాలును. సమగ్రము, మనోజ్ఞమునగు నాంగ్లేయనవలలలో 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్' ప్రథమకృతి. పరిశీలింపఁగా 'రాజశేఖర చరిత్రము' నట్టిదే! కాని రచనాకాలముబట్టి యిది ప్రథమకృతి కాదు.4 సమగ్రత్వ మనోజ్ఞత్వము లుండుటచే బ్రథమత్వముగూడ దీనికి నంటఁగట్టఁబడినది. చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులు లిది నవలారచనమునకు మార్గదర్శకముగ నున్నదనుట, దీని

1. దీనికిని శ్రీరంగరాజు చరిత్ర'కును సన్నివేశములలో నొకటి రెండు పోలికలున్నవి: అట్లే 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్'తోగూడ పోలికలున్నవి: ఆ పోలికలనుజూపుట తమ గ్రంథరచనోద్దేశముగాఫున, డా॥ కొత్తపల్లి వీరభద్రరావు(గారు) తమ 'తెలుగుసాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము'లో వానిని జూపిరి. కాని కందుకూరివారి రచనోద్దేశమే వేఱని వా రంగీకరింపక తీరలేదు. పంతులుగారే నవలాపీఠికలో నీ పోలికలసంగతి నుదాహరించి తమ యుద్దేశము, కథావిధానమును వేఱని చెప్పుకొనిరి.

'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' ప్రాతిపదిక యనఁదగిన నవల యింకొకటి కలదు. దాని పేరు 'సోమశేఖర విజయము' — కర్త - వై. హనుమంతరావు [ఆంధ్ర వా. సూ. - ము. ప - అను - పుట 3] Publisher also, Y. Hanumanta Rao, Bellari. 1st Edition - PP. 3-245 Reg. No. 482 - Priee R. 1-8-0, issued from the Press on 1-51922. [Vide, Catalogue of Books P. 142 Pub. - in the Madras Presideney, Vol-9-Supplement, Oct 31, 1922.

2. 'అది (రాజశేఖర చరిత్ర)...గోల్డుస్మిత్‌ది 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్‌నకు పరివర్తనము" మన్మిత్రులు, డా॥ యస్వీజోగారావుగారి 'తెలుగు నవల తెన్నులు' — 'సంస్కృతి' — 1954, జూలై సంచిక. ఈ సందర్భమునఁ దన "దించుమించు స్వకపోలకల్పితమే"యని వీరేశలింగముగారు చెప్పుకొనిన ఘట్టము చూడఁదగినది —

[స్వీయచరిత్రము — రెండవభాగము - పుట 143. (1915).]

3 "ఆంధ్రవచనవాఙ్మయము" పుట 123.

4. "The Hindu" (1878) ..................) —

"Ve (Vi) resalingam's Rājasekhara Charitam, based Partly on "The Vicar of wake field" by Goldsmith, is the first Novel in the language" Also See, Souvener. PP. 41, 42,. The All Indian Telugu writers' Conference, 1960. Hyderabad.

5. చిలకమర్తి లక్ష్మీనరసింహము, స్వీయచరిత్ర. — పుటలు 103, 107.

శ్రేష్ఠత్వమును బట్టియేగాని జ్యేష్ఠత్వమునుబట్టి నిర్ణయించికాదు. 'శ్రీరంగరాజు చరిత్ర'నుబోలి 'రాజశేఖరచరిత్రము'న్నదనియు, 'రాజశేఖరచరిత్ర'నుబోలి 'రామచంద్రవిజయము'న్నదనియు ననుట లోకమునకుఁ బరిపాటి. సాంఘికనవలకు విధాయకములైన ధర్మములయందు సామ్యముతప్పదు. రాజశేఖరచరిత్రను విరచించుటకు 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' కావలసినప్రోత్సాహ మిచ్చినది.[1] ఆ నవలను గొంత యనువదించి మఱలమాని స్వతంత్రరచనకుఁ దాను బూనుకొంటినని పంతులుగారే రాజశేఖరచరిత్రపీఠికలో జెప్పుకొనిరి. గోల్డ్‌స్మిత్‌వలెఁ దానుగూడఁ దన సంఘచిత్రమును లిఖింపవలెనని పంతులుగారికిఁ గాంతుగలిగి యా యాంగ్లనవలను ప్రాతిపదికగఁగొని వారు తమరచన సాగించిరి. అందలి డాక్టరుప్రిమ్‌రోజ్ ప్రభృతుల గుణములు తమ్మాకర్షించియుండును.[2] వారివియు దమవియు మఱికొందఱివియు గుణములు, గలిపి వారు 'రాజశేఖరచరిత్రము'ను సృష్టించిరి. ఒకపాత్ర, సాధారణముగ లోకమునందలి యొకవ్యక్తికి ఛాయాచిత్రము కాదు. ఎంద ఱెందఱి యెన్నెన్నిగుణము లేయే పాత్రలో రూపొందినవ్వు డొకపాత్రయగునో యిచ్చట వివరించుట యెంతకష్టమో యంత యప్రస్తుతము. కాని రాజశేఖరుఁడు ప్రిమ్‌రోజ్‌పాత్రను, శ్రీకృష్ణజగపతి రాజు సర్ విలియమ్‌థారన్‌హిల్ పాత్రను దలఁపింతురన్న ననవచ్చును. అనువాదము, పరివర్తనము ననుటమాత్ర మన్యాయము. అది పంతులుగా రంగీకరించినను గూడ విమర్శకు లంగీకరింపరాదు. ఒకరచనకుఁ దన్ను బ్రోత్సహించిన గ్రంథమేదేని యున్నచో దానిని బేర్కొనుటకూడ నెవ్వరికిని దప్పుగాదు. నేఁటి రచయితలకును

---

1. వీరేశలింగముగారి 'సత్యరాజాపూర్వదేశ యాత్రలు' స్విఫ్ట్ – గలివర్స్ ట్రావెల్స్, చదివిన సంస్కారమువలనఁ గూర్పఁబడినది. ఇందు నందునుగూడ నాయకులను క్రోతులెత్తుకొనిపోవును– గలివర్ ఎలుకతో, దోమలతో బోరాడును. మేఁకతో దోమలతో సత్యరాజు పోరాడును. ఇది రెండుభాగములు ఇందు సంఘసంస్కారోద్యమము మఱియు నెక్కువ; ప్రజలమూఢవిశ్వాసములపై గాఢమైన వ్యంగ్యవిన్యాసముతో గూడిన యపహేళన ముత్కటము విమర్శనస్థాయి నించుక మించిన హేళన మున్నది. 'యుటోపియా' స్వరూపముగూడఁ గొంత గోచరించును ఇది నవలమాత్రము గాదు. సంఘదురాచారాదులు మొదలుకొని శాస్త్రగ్రంథాదులలోని ప్రక్షిప్తములవఱకుఁ గొనసాగిన యిందలియపహేళనము బురాణాదులలోని యుపాఖ్యానాదుల ధోరణిగలది పెక్కుకథలుగల కథానకమిది. తత్త్వముచేఁ బ్రహసనము. సన్నివేశములు పాత్రలు తత్పోషణము, ఘటనల పటిమ మున్నగునవి లేనే లేవు. ఆత్మాశ్రయకథనము గావచ్చును; పౌరాణికేతివృత్తము గావచ్చును. కాని రచనావిధానమున నవలాలక్షణములనే వారుద్దేశింపలేదు.

2. 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' లోని పాత్రలతో 'రాజశేఖరచరిత్ర' లోని పాత్రలకు డా॥ వీరభద్రరావు (గారు) పోలికలుచూపిరి. అసలు వారిరచనోద్దేశమే యది. అట్లుఁజూచినచో మన ప్రతినవలకు నేదోయొక యాంగ్లనవలతోగాని యాంధ్రనవలతోగాని పోలికలు చూపవచ్చును. దేశకాలపరిస్థితులలో సామ్యముండుట యనుదోష మిందులకుఁ గారణము.

ప్రోత్సాహమిచ్చిన గ్రంథములని యున్నవి[1]. ఇట్టివానిని కొన్నితావులయందు పంతులుగా రంగీకరించిరి[2]. ఆ యంగీకరించినవానిలో గొన్ని పొరపాటులుగూడ నున్నవి. భారతీయస్త్రీలకు విద్యావశ్యకతనుగురించి యుపన్యసించు 'సత్యసంజీవని'ని క్రీ. శ. 1887లో రచించినట్లుచెప్పిరి[3]. అదియొక పొరపాటు[4]. ఇట్టి ప్రమాదము లెవ్వరికైన దొరలును. అందుచే స్మృతిపురస్కారావశ్యకములైన 'స్వీయచరిత్రము'లు వార్ధకమునఁ గూర్చునప్పు డిట్టి వనివార్యములు.

బుద్ధిపూర్వకములైన యబద్ధములున్నచో వానిమాట వేఱు. అవి, దురభిమానచోదితములు. నిర్ణయించునపు డేది ప్రమాదజన్యమో యేది యబద్ధమో రాగద్వేషదూరులమై నిర్ణయింపవలెను; త్వరపడఁగూడదు.

ఇఁకఁ దానే ప్రథమనవలాకర్తనని వారు చెప్పుకొనిరేమి? అనినచో, నందు కొంతతన నవల సాధించిన విజయోత్సాహమును. కొంత యాత్మవిశ్వాసమును గొంత మతిమఱపును గలవని సమాధానింపవలెను. 'శ్రీరంగరాజుచరిత్ర'కుఁ బ్రసిద్ధి రాలేదు. తత్కర్త సారస్వతప్రపంచమునఁ గీర్తిఁగన్నవాఁడు కాఁడు. పంతులుగారి వలె నాయన ముందుగఁ బ్రసిద్ధకవియుఁ బండితుఁడునునై పిదప నవలాకర్త కాలేదు. పంతులుగా రాగ్రంథమును జూచియుండరు. ఒకటి రెండు సన్నివేశముల నొకటి రెండు వాక్యములను బురస్కరించుకొని వీరేశలింగముగారు 'శ్రీరంగరాజుచరిత్ర'

---

1. 'మాలపల్లి' 'ఈస్తలీన్' అను మిసెస్ హెన్రీవుడ్ నవలచే బ్రోత్సాహితమైనది. 'అసమర్థుని జీవితయాత్ర' చదివినవారికి 'దోష్టవిస్కీ' నవల '*The Idiot*' తలఁపు నఁ బారును, 'అల్పజీవి' 'యసమర్థుని జీవిత యాత్ర' యొక్క క్రీనీడలో నడచిన దనఁబడెను. *Alphonse Daudet* రచించిన '*The little weakling*' అనునది కూడ దీనికిఁ బ్రేరకము. 'కీలుబొమ్మలు' నవలకు 'బోజ్' రచించిన "దివవరు ఆఫ్ ఎలై" యను కథ ప్రోత్సాహకము 'తెలఁచిరాజు' చదివినపుడు చి॥ సౌ॥ వసుంధరది 'అచల' యనుకథ నాతలఁపునకుఁ దట్టెను. ఇటులనే యెన్నిటినో చెప్పవచ్చును.
2. 3. "క్రీ శ. 1887 సంవత్సరమున స్త్రీల కొఱకు 'సత్య సంజీవని' యను నీతిబోధకమైన పుస్తకమును జేసితిని. దీనిలోని కథ నేనొక యింగ్లీషు పుస్తకమునుండి గ్రహించితిని. కాని యే పుస్తకమునుండి గ్రహించితినో నాకిప్పుడు స్మరణకు రాలేదు. వీరేశలింగము"— 'స్వీయ చరిత్ర' పుట 183 (1915)
4. 'సత్య సంజీవని' క్రీ. శ. 20_9_1885 నాఁడు ప్రకటితము. ప్రథమావృత్తి_500ప్రతులు_ వెల 0_3_0 *Vide Catalogue of Books Published in the Madras Presidency Vol-2. P. 41-Sep. Oct.-1886.*

చూచియున్నారని డా॥ క్రొత్తపల్లి వీరభద్రరావు (గారు) నిర్ణయించిరి. ఒకవేళ వారు దానిని జూచినను మఱచియుండవచ్చును; లేదా తమ రాజశేఖరచరిత్రముందు వారికది నచ్చలేదేమో! ఏదెట్లున్నను సంఘ సంస్కార సాహిత్యచైతన్యస్వరూపులై శతాధికైకవిశతిగ్రంథకర్తలైన మహాపురుషు లిట్టి యొండురెం డబద్ధములకు నొడికట్టి యేమిసంపాదింప నెంతురు? కావున వీనికిఁ బొరపాటులు కారణములై యుండవలెను. విషయముల విస్మృతియో సంవత్సరసంఖ్యలు జ్ఞప్తియందుండమియో యశ్రద్ధయో తెలియకపోవుటయో కూడ వీనికి హేతువులు గావచ్చును. ఏలనఁ దమ 'సత్యసంజీవని' రచనాకాలమే వా రన్నిగ్రంథములమీఁద మఱచిపోయిరి. దానియొక్కమూలము స్మరణకురాలేదని యంగీకరింపనే యంగీకరించిరి. ఇట్టివానినెల్ల పట్టిపలార్చి యబద్ధము లనలేము.

పోఁగా మిగిలినది 'రాజశేఖరచరిత్ర' ప్రాశస్త్యము. ఇతఃపూర్వము దీని గుణములు చెప్పనేచెప్పితిని. చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారివంటి పెక్కు పెద్దలు, పత్త్రికలును బ్రశంసించుటయేగాదు; ఆంగ్లనవలాసంస్కారబలము ప్రాతిపదికగాఁగలిగియు స్వతంత్రమువలె నుండుటయే దీనివిశిష్టత. సరసపుష్కలమైన దిందలి సంవాదశైలి. ఇది యాంగ్లములోనికిఁగూడఁ బరివర్తింపఁబడినది1. లండనుపత్త్రికలు దీనిని సమీక్షించినవి2. ప్రోత్సాహము నాంగ్లనవలనుండి పడసినను నవలయంతయు విశుద్ధాంధ్రసంఘచిత్రము; చాలవఱకు స్వతంత్రమైన కథారచనము. అగ్రామ్యమైన దిందలి హాస్యము. సాంఘికదురాచారముల మృదుపరిహాసము, దోషముల నొప్పించు నదిగాని మనసులనొప్పించునది కాదు. ఆకర్షణీయమైన సంవాదసరళియు నిండుఁదనముగల యాఖ్యానశైలియు దీనియందు నేఁటికిని నిలిచియున్న విశిష్టతలు. శ్రీరంగరాజుచరిత్రయందలి సన్నివేశములకంటెఁ బ్రయోజనకరములైనవి యిందలి పటిష్ఠ సన్నివేశములు. కడమ శిల్పవిషయమన్నచో నా నాఁ డాదృష్టియే లే దనవచ్చును. కథనశైలియే వారికిఁ బ్రధానము; ప్రసన్నముగఁ గథ నడపించుటయుఁ గాంతాసమ్మితముగ బోధించుటయు నాఁటివారి లక్ష్యములు.

---

1. This Novel was translated into English by. G. Robert Hutchinson, under the caption of the "*Fortune's wheel*" (1887)

2. 'The story itself is simple and, from a European Point of view, of no great interest. But the Picture of Hindu domestic life, religious ideas, modes of worship and Superstition and the Condition of women, with the denial of all rights of Choice in marriages are so well drawn and illustrated that the book will have a charm for all readers. (Irony runs as an under-Current in this Novel.) ("*The London Times*" 30th Sep, 1887.)

నేటికిని గుబాళింపక మఱి దాని పరిమళము, పరువమును దగ్గిపోయినదేమి? యని యడిగినచో నది మనయభిరుచి మాఱినదేమి యని యడుగుటయే. దానికి మార్పు నైజము. మనయభిరుచియే దాని సువాసన. అందుచేత సంఘసంస్కారాదిప్రచారకనవల లన్నిటి సౌరభము నంతియేయని సమాధానము. వానిపని నవి నెరవేర్చుకొనిపోవును. అప్పుడే యవి సాంఘికము లయ్యును జారిత్రకములుగఁ బరిణతి నొందుట. గతకాలసంఘచిత్రణము నేటికి మనకొక చరిత్రాంశము. ఇట్టి చరిత్ర యింకను బురాతనత్వ మేచుకొన్నచో నది యొకపురాణము. అనఁగా బహు ప్రాచీనమైన చరిత్రకు సంబంధించిన యొకయథార్థము నేఁడు మనకొక కల్పిత పురాణముగ నుద్యోతించును. ఆ కారణమువలననే సహృదయుని సానుభూతికిఁ జారిత్రక జ్ఞాన మక్కఱపడుచున్నది. దానితో మనకు గతసంప్రదాయములు సుబోధకములై వాసించు చున్నవి. సంప్రదాయము1లను బ్రతిఘటించుటకై ప్రత్యుత్థానము2 జరుగుచున్నదిగదా నేఁడు? ఔను; కాదనలేము. ఎంతటి తిరుగఁబాటైనను గతముతో దెగ త్రెంపులు చేసికొనుట యనునర్థము నీయదు. ప్రత్యుత్థానము, ప్రయోగములైనను వానికి సంప్రదాయముతో ననుషంగ మున్నది. దానితో ననుస్యూతముగాక విచ్ఛిత్తి నొందు ప్రత్యుత్థానమే లేదు. పూర్వాచారములను నిరసించుట యొకఘనతయు నొకనాగరకతయు నైనదేగాని యాకాలమున కది మంచిదికానిచో చైతన్యముగల నాఁటిసంఘము దానినేల చిద్రుపలొనర్చియుండదను ననుమిత్సయే మనకుఁ గలుగకున్నది. ఛందస్సు వలదంటిమిగాని. శైలిని వదలఁగలమా? వృద్ధాచారములను ధిక్కరించితిమిగాని, మానవబాంధవ్యమును దిరస్కరింపఁగలమా? ఇందువలన మనకు రాజశేఖరచరిత్ర నేటికిఁగూడ నవలయే4.

## ఏది ప్రథమ నవల?

భారతీయప్రభావము పృష్ఠభూమిగఁగలిగి యుద్భవించిన 'మహాశ్వేత' పూర్తిగ ముద్రితముగాదు; అందుచే నది పూర్తిగ నుపలబ్ధమునుగాదు5. అందలి ఇతివృత్తము

1. Traditions. 2 Revolt. 3. Experiment
4. దాని సంగ్రహ రూపము నాకాశవాణి నాటికల రూపమున నేటికిని జూచుచున్నాము; వినుచున్నాము.

5. కీ. శే. కొక్కొండ వేంకటరత్నము పంతులు (గారి) పుత్త్రుఁడు 'సర్వే డిపార్టుమెంటు'లో బనిచేసి పిమ్మట యోగియై పోయెను. ఈయన భార్యయు నేఁడు లేదు. ఈమె నిస్సంతు. కాఁగా కీ. శే. కొక్కొండవారి పుత్త్రుని పక్షమునఁ గల బంధు వర్గము నుండియు 'మహాశ్వేత' మాతృక లభింప లేదు. కొక్కొండ వారి దౌహిత్రుఁడు ఢిల్లీలో నుద్యోగి. ఈయన యొద్దఁ గూడ 'మహాశ్వేత'కు మాతృక లభింపలేదు.

వైజయంతిపత్త్రికలో నుపలభ్యమైనంతవఱకుఁ ప్రకరణోపచితినిబట్టి యుద్బ్రంహ ణోపలక్ష్యముగలది[1]. ఉపచితమైన రచనము జూచియుండిన కీ.శే. శివశంకరపాండ్య[2]. దీనిని ప్రథమాంధ్రనవలయని ప్రశంసించుచు సంస్కృతమున భట్టబాణుని గద్యకావ్య రాజమగు 'కాదంబరి'లోని మనోహరమగుకథ దీనికిఁ ప్రాతిపదిక యనికూడ నుడివి నాఁడు. గ్రాంథికభాషాపీఠమధిష్ఠించియు సంఘసంస్కరణ విషయమున సనాతను లయ్యును కీ శే. వేంకటరత్నముపంతులు (గారు) సాహిత్యప్రక్రియల విషయమున సమీ చీనమగు నవ్యతాదర్శనము గలవారు.

ప్రకటితమైనంత వఱకుఁగల ప్రకరణములు సూచించు విధానమునుబట్టియు దత్ప్రయత్నము విజయవంతమును బరిసమాప్తమును ననకతీరదు. సదాచారమును బట్టి చూచిననుగూడఁ బూర్తికాని నవలను బ్రకటింపము. ఆయీ హేతువులచే సాహిత్యకముగ స్వదేశీయపూర్వరంగప్రభావముగల 'మహాశ్వేత'యే మన మొదటి నవల. "శ్రీరంగరాజుచరిత్ర" యిట్టిది కాదు. అది సాహిత్యకముగ విదేశీయపూర్వ రంగప్రభావము గలది. పోఁగా కాదంబరి 'మహాశ్వేత' కాధారమగుటయు నది స్వతం త్రముగాకపోవుటయు ననునవి దాని నవలాత్వమునకు బాధకములు గారాదు. ఆధా రము లెన్నినవలలకో నేఁడును గలవని మున్నే చూపఁబడినవి[3]. ఆయాధారములు గుణభంజకములుగావు. చాలవఱకు నవలయనుపే రాంగ్లమునుండియు నవలలోని కథ మన భారతీయేతి వృత్తమునుండియుఁ దొలినాళ్ళలో స్వీకరింపఁబడుట మన సాహిత్యములోని విశిష్టత. కన్నడ మహారాష్ట్రాదిభాషలలో వేరు భారతీయమును విషయ మాంగ్లభాషాప్రభావముగలదియు నగుట తొలినాళ్లలో బరిపాటి. ఆంగ్లభాషా ప్రభావ మన్నిసాహిత్యములపై బరిపూర్ణమగుటతో నేఁడు మన నవలాసాహిత్యము గూడ సర్వథా వానినే యనుసరించుట క్రమపరిణామము.

---

1. "ఇది నవల యనుట కంటె కాదంబరికి 'స్వేచ్ఛానువాద మనుట యొప్పు" (తెలుగు విజ్ఞాన సర్వస్వము మూఁడవ సంపుటము, తెలుగు సంస్కృతి, పుట 877 (1959) ఇది యాదాలాపముగ నన్నమాట. మూలమునఁ 'గథ' యైన కాదంబరి మనలో నవల వంటి దేయని తెలిసికొని యన్నది కా దీ మాట 'శ్రీరంగరాజు చరిత్ర' మున్నగు వానిని గూర్చి యాదృచ్ఛికముగ మాటాడినవి పెక్కు లిట్టివి సమున్నద్ధ వచనము లిందున్నవి.

2. Late Siva Sankara Pāndya, B.A., (University first, Madras) Founder of the Theological school, Madras, was a Guzarātee gentleman, domiciled in Madras and was the student of Miller of Madras Presidency College fame. *The Raise and Progress of Telugu Prose literature.* His Pamphlat, (1867) was referred to, in previous pages.

3. కానిచో నేఁటి మన పౌరాణిక నవల లేవియు నవలలు గాకపోవలసి వచ్చును.

అందుచే నవలయన నాంగ్లము నాధారముగాగలిగిగాని స్వతంత్రముగగాని యుండవలెను; సంస్కృతకథ నాధారమ గఁగలది యెట్లు నవలయగును? "నవలయనిన పేరే యాంగ్లముది గదా?" యనువాదమునందుఁ బసలేదు. అది, 'నవలా' పద మాంగ్లములోని కెచ్చటినుండివచ్చెనో తెలియఁగోరనివారి వాదము. 'నవల'యనుపే రాంగ్లమునుండివచ్చి సంస్కృతమునుండి ప్రత్యక్షముగ రానంతమాత్రమున యుగ లక్షణప్రభావితులైన రచయితలవలన నాంగ్లనవలావిధానము లవలంబింపఁబడరాదని నియమ మెచ్చటఁగలదు? 'మహాశ్వేత'ను స్వదేశీయ తిరోభూమిగలది యనుటయు 'శ్రీరంగరాజుచరిత్ర'ను 'రాజశేఖర చరిత్ర'ను విదేశీయ తిరోభూమిగల వనుటయు నానాఁటికి సాహిత్యరంగమునందుఁ బచేలిమమైన ప్రసాధనములనుబట్టిగాని, దానికి నవలాత్వము లేదనియు, వీనికే యున్నదనియుఁ జెప్పునర్థమునుఁ గాదు. మూఁడును నవ్యరచనావిధానముగల నవలలే! కాఁగా నది యా పూర్వభూమినుండి యుద్భిజ్జము; ఇవి యీ పూర్వభూమినుండి యుద్భిన్నములు. ఈ పూర్వరంగవిభేదము, విభజన మును క్రమపరిణామాదులను సూచించునే గాని 'మహాశ్వేత' ప్రథమత్వమునకును 'శ్రీరంగరాజు చరిత్ర' మౌలికత్వమునకును, 'రాజశేఖర చరిత్ర' శ్రేష్ఠత్వమునకును భంజకములుగావు.

'మహాశ్వేత' యుపలబ్ధముగామిచేతను 'శ్రీరంగరాజుచరిత్ర'కుఁ బ్రసిద్ధిలేమి చేతను 'రాజశేఖరచరిత్ర'యే ప్రథమాంధ్రనవలయని దేశమునఁ బెక్కురు విమర్శకు లభిప్రాయపడిరి. ఆనాఁడు సాంఘిక సారస్వతరంగములయందు సంస్కరణాది విషయ ములలో పంతులుగారు పురోగాములు; సాహిత్యకచైతన్యమునకు హేతుభూతులు; ఏకవింశత్యుత్తరశతాధిక (122?) గ్రంథకర్తలు; మఱియు ననేకకారణపురస్కృతి చేత నద్యతన యుగప్రవక్తలునుగూడ నగుటవలన వీరేప్రథమాంధ్రనవలా నిర్మాతలని నను యథార్థమువలెనేయుండును; కాని యది యథార్థముగాదు. అట్లే 'రాజశేఖర చరిత్ర' యనువాదమనెడి గతానుగతికమైన ప్రబలవదంతియు యథార్థము గాదు.

## మంజువాణీ విజయము[1]

దీని కర్త కీ. శే. వనప్పాకము అనంతాచార్యులు[2]. ఇందలి శైలి పండితుల యాదరము గొన్నది. మంజువాణి యీ కథలో నాయిక. ఈమె ధనవంతుఁడగు నొక వణిజుని పుత్త్రిక. విద్యాధన సంపదలచే నొక రాజకుమారుని వివాహ మాడుట

1. 1st Edition– Dec 1892 Vide Ft. St. G. G Catalogue of Books Published in the presidency of Madras Vol 3–P 11– of Suppliment, June 27, 1893. Third Edition. 10-9-1907.

2. 'రావు బహద్దరు' 'విద్యా వినోద (ది) యని వీరికి బిరుదములు. 'అనంత' శబ్దము తమిళ మున 'ఆనంద' కాఁగా, పండితులు దానిని 'ఆనంద'గా నన్వర్థ మొనర్చిరి. 'శంతను పౌత్త్రి ప్రభుత్వము. 'చమత్కార తరంగిణి'–మున్నగునవి యీ అనంతా (ఆనందా) చార్యులుగారివే! [ఆంధ్రవాఙ్మయ సూచిక — ముద్రిత గ్రంథముల పట్టిక, పుటలు—143, 249, 250]

యిందలి వస్తువు. అసభ్యములగు వర్ణనలు లేని పెద్ద కథయని దీనిని పిలువ వచ్చును.

## -:ధర్మవతీ విలాసాదులు:-

'ధర్మవతీ విలాసము',1 కథావశేషులు 'ఖండవిల్లి రామచంద్రుఁడు'2 గారి ప్రథమ నవల. వీరి రెండవ నవల పేరు 'మాలతీరాఘవము'. 'లక్ష్మీ సుందర విజయము' వీరి మూఁడవ నవల. వీనిని నవలికలనుట యుచితము.

ఆంగ్లేయ సారస్వత పట్టభద్రులను గూడ నాశ్చర్య చకితులఁ గావించు నిట్టి నవలల నొకానొక పాఠశాలా పండితుఁ డా నాఁడు రచించుట బహు ప్రశంస నీయము.

ఇందు ధర్మవతీ విలాసము3 పదునైదు ప్రకరణములు గలది. దీనిని జారిత్రక నవల యని కొందఱందురు. విజయనగరగజపతుల కాలమునాఁటిది, కథావస్తు వనుట దీని కుపస్కారకము. కాని యీ వాద మంగీకార్యము కాదు. ఇందలి నాయిక విద్యావతి; స్వయంవర; కవితా పాండిత్య పరీక్షచేసి తన భర్తను దానే యెన్నుకొనును. నిర్దయుఁడును. వంచకుఁడును నగు నొక యుత్తమర్ణికుని చేతిలో నీమెవరుఁడైన యువకుఁడు పడిన పాటులవర్ణన మిందలి కథ. ఆమె యీ కష్టముల నెల్ల తెలిసికొనిన తెఱఁ గిందు వర్ణితము. తన భర్త నుత్తమర్ణుఁడు పీడించుట యెఱిఁగి న్యాయవాదినీ వేషధారిణియై న్యాయ స్థానమునకుఁ బోయి యీమె భర్తృ పక్షమున వాదించినది.

---

1. రాజమహేంద్రవర 'గౌతమీగ్రంథాలయము'న దీని ప్రాఁతప్రతి యున్నది. ఈ ప్రతి ముఖపత్రముపై 'Dharmavati vilāsamu', "1893 Chintāmani first prize"—Novelette-Khanda villi Rāma Chandrudu—అనియున్నది.
'ధర్మవతీవిలాసము'—ఖండవల్లి రామచంద్రుడు—'వచనము—1894' అని 'ఆంధ్రవాఙ్మయ సూచిక.
కర్త ఖండవిల్లి రామచంద్రుడు- (1891)-అనియే దీనినిగూర్చి శ్రీ నిడదవోలు వేంకట రావుగారి యాంధ్రవచనవాఙ్మయములోగూడఁ జెప్పఁబడినది.
ఖండవిల్లివారిది కాసలనాటి బ్రాహ్మణశాఖ. ఖండవల్లివారిది వేఁగినాటి బ్రాహ్మణశాఖ. ఆంధ్రవాఙ్మయసూచియం దిది 'వల్లి'యని ముద్రింపఁబడుట ప్రమాదవశము. ఈ నవల చింతామణిపత్రిక కవసంపుటమునుండి పునర్ముద్రితము. చింతామణి ప్రచురణల నిది పదునైదవది.
Dharmavati vilāsamu- K. Rāma Chandrudu. Reg. No. 4.29th Aug, 1894;96 Pages-500 Copies-(Catalogue of Books Published in the Madras presidency Vol 3, P 6!,. 27th Nov-1894]
2. దీని రచయిత ఖండవిల్లి రామచంద్రుఁడు; రసూల్‌కొండయందుఁ బ్రభుత్వబాలికా పాఠశాలోపాధ్యాయుఁడు.
3. 'చింతామణి' పత్రిక మూఁడవసంపుటమున నిది పూర్తిగఁ బ్రకటితము. సంచికలలో 99 ప్రమసంఖ్య (1893-94). గౌతమీగ్రంథాలయము—రాజమహేంద్రవరము.

ఆ వాదములోని ప్రవీణతా విస్పష్టత శ్రీమెకును షేక్స్పియరు మహాకవిచేత లేఖ్యా కృతయగు పోర్షియో సతికిని గల శైష్యోపాధ్యాయికలను స్ఫురింపఁజేయు చున్నవి. పిమ్మట నా దంపతుల కాశీయాత్రాదులును వర్ణితము. కావున నిది యల్పిష్ఠమైన చారిత్రక పంజరమున నిబంధింపఁ బడిన సాంఘిక చిత్రపటము.

స్త్రీజన విద్యా వ్యాప్తియు మున్నగు సాంఘిక సంస్కారముల నాశించి రాజమహేంద్ర వరమున నాఁడు స్థాపింపఁ బడిన సంఘములలో గందుకూరి వారును సభ్యులు. ఈ నవలా బహుమాన నిర్ణాయక సంఘ నిర్ణయములో వారికిని భాగస్వామ్య మున్నది. విద్యావతియైన సతి గృహాలంకార మనియు విద్యార్హత స్త్రీల స్వామ్య ములలో నొకటి యనియుఁ బ్రచారములు జరిగెడి యా దినములలో బుట్టిన సాంఘిక నవల యిది; లేదా సాంసారికము. ఆ నాఁడెవ్వరికిఁగాని యాంగ్ల సంస్కార బలమున లిఖింపక తీరని సాహిత్య ప్రక్రియ, నవల. అట్లు లిఖింపఁ బడియు స్వతంత్రములవలె నుండుట యానాఁటి వాని కెల్ల నొక మహత్తరమైన విశిష్టత. భావముల యందేగాని భాష యందంత మార్పు రాలే దన్నమాట.

'చింతామణి' పత్త్రిక యానాఁ డేర్పఱచిన నవలా స్పర్థ యను సదాశయము నకుఁ గూడ యోజింపఁగా మూలబలము, మేయోప్రభు వొనర్చిన ప్రకటన వలని దనియే స్ఫురించును. ఆంగ్లేయ సాహిత్య ప్రక్రియలను బ్రోత్సహించుటకై ప్రయత్న పూర్వకముగ నెరపఁ బడిన కృషియే, యానాఁటి వాఙ్మయ రంగము వెలారుచును. అందు మూలమునసే పందొమ్మిదవ శతాబ్ద్యంతము వఱకుఁగూడ నిట్లు వైదేశిక పూర్వ రంగ ప్రభావము గలది మన కథాసాహిత్య మగుట. అప్పటి ప్రయత్న మెంత బుద్ధి కృతమో యంత యపరిపక్వముగూడనగుట మన సాహిత్య యుగ విభజనకును హేతువు. లేదా యీ యుగ విభజన విషయములో నింకొక యభిప్రాయ భేదము గూడఁ గలదు. దానిని బట్టి యీ యుగము త్రిధా విభక్తము. మొదటిది క్రీ. శ. 1857 వఱకు నొక యుగము. ఇందలిది కంపెనీవారి కాలములోని సాహిత్య మన వచ్చును. 'సిపాయిల తిరుగఁ బాటు'ని యాంగ్లేయులు జెప్పు భారత దేశ ప్రథమ స్వాతంత్ర్య సమరముతో నిది సంవదించుచున్నది. రెండవ యుగము క్రీ. శ. 1857 నుండి క్రీ.శ. 1919 వఱకుఁ గలది. ఇందలిది జాతియోద్యమ సాహిత్య మన వచ్చును. ఆంగ్లేయులు పరిపాలించు చున్నను నీయుగము జాతీయ భావములచే నీషత్ స్పష్టము. కందుకూరి వీరేశలింగముగారి నిర్యాణము తోడను1 తెలంగాణమున 'జనసంఘ' స్థాపనము2 తోడను గూడ నిది సంగత పడుచున్నది. ఇప్పుడే యాంధ్ర ప్రచారిణీ విజ్ఞానచంద్రికాది గ్రంథమాలాద్యుద్యమములతోడను నవలా స్పర్థల తోడను

1. క్రీ. శ 1919.

2. క్రీ. శ 1920.

సాహిత్యమునకు సంస్కృతియుఁ గలుగును. పిదప మూఁడవది నేఁటి వఱకుఁ గల యాధునిక యుగము.

అగుట కిది చారిత్ర కాంశములచేత నిష్కృష్టమేగాని వైశద్య దృష్టిచే బహు స్థూలము. కావల్లెఖ్య గతమైన పటములో సూక్ష్మాంశ వివరణముపై శ్రద్ధ నిలువదు. ఇది యిట్లుండఁ బై రెండవ యుగము నందుఁ బడిన పందొమ్మిది, యిరువది శతాబ్దుల యాంగ్ల ప్రభావములో మఱల రెండు విధము లేర్పడవలెను. ఏలన నా ప్రభావము కొందఱ యెడ ప్రయత్న కృత ప్రసృతము; మఱి కొందఱ యెడ నప్రయత్న కృత ప్రసృతము. ఆయీ కారణముల వలన నపరి పక్వదశ గల మన నవలాసాహిత్యము పందొమ్మిదవ శతాబ్ద్యంతముననే యొక యుగమును బ్రాపించు చున్నది.

## -: సంజీవరాయ చరిత్రము :-

క్రీ. శ. 1893 నందు ఖండవిల్లి రామచంద్రుఁడుగారు 'ధర్మవతీ విలాసము'నకు నుతియుఁ[1] బ్రథమబహుమతియుఁ[2] బొందినపుడే దశాధికగ్రంథకర్తనులు[3] తల్లాప్రగడ సూర్యనారాయణ[4]గారును దన 'సంజీవరాయచరిత్రము'నకు ద్వితీయబహుమతి[5]బొందిరి ఇది యొకనవలిక[6]; సంఘసంస్కర్తృభావప్రేరిత మైనది. సంజీవరాయఁ డిందలి నాయకుఁడు. కృష్ణామండలమందలి యొకగ్రామమున నొక పురోహితునిపుత్త్రుఁ డితఁడు ఇతఁడు విగ్రహారాధనము, బాల్యవివాహములు, మూఢాచారపరంపర లనఁబడు నిత రానేక విషయములనుగూర్చి యెప్పుడును దల్లిదండ్రులతో జర్చించు చుండును. వృద్ధా

---

1. ఆనాఁడు 'ధర్మవతీవిలాసము'ను, దత్కర్తను బొగడుచుఁ బద్యములుగూడ వ్రాయఁ బడినవి (ఆంధ్రవచనవాఙ్మయము).

(2) (4) (5) చూడుఁడు :-

'చింతామణి' పత్త్రిక-సంపుటి3- సంచిక1- పుటలు56- రాజమహేంద్రవర గౌతమీ గ్రంథాలయములోగల పత్త్రికల సంచికలలో దీని క్రమ సంఖ్య 99-విజయ-ఆషాఢము (1893-1894). Vide, Also. Ft, st. G. G. Suppliment-Catalogue of Books, Published by the Madras Presidency Vol 3-Page 73-Reg. No. 88-Price 0-4-0; Date of issue 3-8-1893.

3. వీరి యితర ప్రసిద్ధ నవలలు :-

| | | |
|---|---|---|
| కైవలినీ చంద్ర శేఖరము | 28-4-1910. | అనువాదము. |
| రాధారాణి | | అనువాదము. |
| మాధవీ కంకణము | 1910 | అనువాదము. |
| శ్రీ సీతారాములు | 15-9-1912 | అనువాదము. |
| హేలావతి | 9-5-1913 | స్వతంత్రము. |

6. ఇందలి పుటలు 56 మాత్రమే.

చాలపరాయణులగు వీరిమతమునకు వ్యతిరేకముగ మేనమామసాహాయ్యమున నితఁడు రాజమహేంద్రవర ప్రభుత్వకలాశాలలో విద్యగఱచును. క్రమముగ, నితనికి వివాహ మగును. ఇతని కొకసోదరి. ఆమె కష్టవర్ష ప్రాయము. ఒక ముప్పదియైదేండ్ల విధురున కిచ్చి యీయామెకుఁగూడఁ దలిదండ్రులు పెండ్లిసేతురు. ఆతఁడింతకుమున్నే దుర్వ్యయ దుశ్శీలములకు లోనైనవాఁడు. నాయకుఁడు తన బంధువులకన్యనే వివాహమాడును. ఇతఁడు ముందామెకు విద్యాబుద్ధులునేర్పిన గురువు. విశ్వవిద్యాలయపరీక్షలో నుత్తీర్ణుఁడై యుద్యోగము సంపాదించుకొనినపిదప నీతనివివాహము. ఈతనిసోదరి భర్తృప్రేరణమునఁ గ్రమముగ దుర్ణయపరురాలైనది. విద్యావతియైన నాయకునిభార్యకును మూర్ఖురాలైన యీతనిసోదరికిని దారతమ్యనిరూపణముతో నెంతోదూరము సాగినది యీకథ. పితరుని బశ్చాత్తాపముతో గథముగియును. పుత్త్రికావివాహవిషయములయందు హిందువులైన తలిదండ్రులకు వరాన్వేషవివాహవ్యయాదికములనుగూర్చి నాయకునిదండ్రి సలుపు హితబోధతో నవల పరిసమాప్తము. నవల యంతయు గ్రాంధికభాషలో నిర్వహింపఁబడ లేదు. ఇందు పాత్రశీలపోషణసంభాషణాదులు నిష్ప్రచ్చరము లనలేము; ఆద్యంతము నిదిపఠనౌత్సుక్యమును గొల్పును.

## సోమశర్మాభ్యుదయము

పిమ్మటినవల సోమశర్మాభ్యుదయము1. దీనికర్త పెక్కుగ్రంథములువ్రాసిన పి.శ్రీనివాసాచార్యులు,బి.ఏ. ఇదియొక నవలిక; స్థానికమైన సాంఘికేతివృత్తము గలది: ఇందలిది ఆబాలగోపాలమును మెప్పించు సులభసుందరశైలి; వ్యాకరణ సాధువు.

## ప్రణయ మహిమ

తదుపరిఁ బేరొకనఁదగిననవల 'ప్రణయమహిమ2. ఈ కృతికర్త పెక్కునాటకముల లిఖించిన, నంబూరు తిరునారాయణస్వామి,బి.,ఎ. దీని కృతిభర్త, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రి. ఈ కృతినిర్మాత, వేదమువారిని' సురాంధ్రోమాధుర్యకవిత్వ ధాము'లని కృత్యాదినిఁ గీర్తించినాఁడు. వారిమాట యెటులున్నను 'నంబూరు తిరు నారాయణస్వామికిమాత్ర మాపద్యములనుబట్టి తద్విశేషణము సార్థకము.

1. Issued on Oct. 1894. Reg. No. 212-P 46 only. (Vide. Ft. St. G. G. S. Catalogue of Books, Vol 3. P. 95-d/6-2-1895.]

2. 'సుబ్బారావు'—లేక—'ప్రణయ మహిమ' యని దీని పేరు. Issued in Dec. 1894. Reg. No. 174. Pages 136, 1st Ed.- [Vide. Ft. st. G. G. Suppliment. Catalogue of Books Published in the Madras Presidency Vol 3. P 95- of Feb. 6, 1895-]

**దీని పూర్వభాగము—102 పుటలు — ద్వితీయ ముద్రణము, (1908) గ్రంథకర్తది ఏలూరు—కథారంగము విజయవాడ.**

ఇందలి నాయకుఁడు సుబ్బారావు; కృష్ణామండలవాసి; చురుకైనయువకుఁడు. ఇతనిసోదరుఁడు విజయరామదాసు; ఈయనభార్య శ్యామలాంబ. సుబ్బారావు విజయ రామదాసులతల్లి, అక్కలక్ష్మమ్మ.

అత్తకోడండ్రైన యక్కలక్ష్మమ్మ శ్యామలాంబల కలహములును, విజయ రామదాసు తన సోదరుఁడైన సుబ్బారావునకు వివాహము నుద్యోగముల కొఱకై నప్పుసొప్పులు దెచ్చి యిడుమలపాలగుటయు, నాయకుఁడు లక్ష్మీనారాయణాది మిత్రుల దుస్సాంగత్యముచే వేశ్యాలోలుఁడగుటయు నిందు వర్ణితము. స్త్రీలు కష్టనిష్ఠురము లెఱుఁగని మూర్ఖురాండ్రగుట, పెండ్లి పేరంటములకు విందుభోజనములకును ఋణదాతల యొద్ద ధనముదెచ్చి వెచ్చింపనిచో గృహకల్లోలములు వృద్ధియగుట, మీనాక్షీ బుధరంజ నులవంటి వేశ్యలు వాక్చతురలగుట, మున్నగు నెన్నో తాత్కాలికసాంఘికపరిస్థితు లిందుఁ బ్రతిబింబించినవి.

మాణిక్యారా వొక ప్రభుత్వోద్యోగి. మీనాక్షి యీాయన కంటుకత్తె. పెద్దిభొట్లు స్వామి ద్రోహి; శ్రీరంగనీతులు పలుకుట యీాతనికి వెన్నతోఁబెట్టిన విద్య. ఇతఁడు మీనాక్షిద్వారమున లంచమిచ్చి మాణిక్యారావుచేత సుబ్బారావున కిరువదిరూపాయల పని యిప్పించును. అటుఁ బుండరీకాక్షయ్య తన పుత్త్రికావివాహమునకై త్వరపడినాఁడు. ఇటు విజయరామదాసు తన సోదరుఁడు బాగుపడునేమోయని యాతని యుద్వాహ విషయమునకు దరపడినాఁడు. పెండ్లి జరిగినది. అన్న యప్పులపాలగుటయేగాని తమ్మునకు గృహస్థులక్షణము లొంటఁబట్టలేదు. భార్య యొకవంక కుమారిలుచున్నది. భ్రూణహత్యచేసిన పెద్దిభట్లుకొమార్త సుబ్బక్కయందు సుబ్బారావును లోక మనుమా నించును. స్వగ్రామమున నుండుటకు మొగముచెల్లని తనమిత్త్రమగు కృష్ణారావుసహి తుఁడై యితఁడు మదరాసుచేరి మిల్లరు కళాశాలయందుఁ బ్రవేశించి తుదకుఁ బశ్చాత్త ప్తుఁడై పరీక్షయందుఁ బ్రథమశ్రేణిలో నుత్తీర్ణుఁడగుటతో నవల పరిసమాప్తము.

యౌవనోన్మాదులదుర్ణయవిధానములను యౌవనప్రలోభనములను నాక్షేపపూర్వ కముగఁ బరిహరించు నుద్దేశ మీ నవలికది. కాని యిందు మనోజ్ఞమైన ప్రకృతివర్ణనలతో బాటు కొన్నియశ్లీలవర్ణనలు నున్నవి. ఆ వర్ణనలు నా సంభాషణలు నాయక సహాయ నాయకులు చేయుదురు నాఁటి యవినీతియు లంచగొండితనమును వేశ్యాలంపటత్వ మును విధవల దుశ్శీలమును గలహములు, దోషారోపములు, నభియోగములు, న్యాయ స్థానవిచారణములును మున్నగునవి యువక పతితలను సన్మార్గుల నొనర్చుటకంటె నవ మార్గగాములఁ జేయునేమో యనెడిభీతి గలుగకపోదు.

## కేసరీ విలాసము[1]

ఇదియొక సాంఘికనవల; స్వతంత్రము. కర్త కీ.శే. రెంటాల వెంకటసుబ్బారావు. ఎన్ని యభ్యంతరములు వచ్చినను నిర్మలమైనప్రేమ వివాహరూపమునఁ బరిణమించుట యిందలి విషయము.

## రామచంద్రవిజయము

ఇది సింహత్రయము[2]లో బ్రసిద్ధిఁగనిన చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులు గారి ప్రథమనవలారాజము. ఇది క్రీ.శ.1904లో చింతామణీపత్త్రికాప్రథమబహూకృతి[3] నందుకొన్నది; సాంఘికేతివృత్తముగల వాస్తవిక చిత్రణము. ఇది 'గౌరవార్హ'[4] బిరుదాంచితులు, ప్రసిద్ధన్యాయవాదులునైన న్యాపతి సుబ్బారావుపంతులుగారు, బి.ఏ.,బి.యల్., చింతామణిపత్త్రికకు సంపాదకులుగానున్న యాదినములనాఁటిమాట. యుగప్రభావముచే నుద్భవించిన యొక యుద్యమమువంటివారు వీరేశలింగముపంతులు గారు. ఇట్టి మహోదయు లెల్లరివలన నొకప్పుడు రాజరాజనన్నపార్యాదులచే బునీత మైన రాజమహేంద్రవరములో మఱల నొకమాఱు సారస్వతసుధాపరిషేచనక్రియాసామ్య మొందిన శీతలసుగంధమందసుందరస్వాదువాయువీచీపరిప్లుతకలశాబ్ధి పొంగులెత్తినది. అదియే ప్రేరణ; యదే ప్రోత్సాహము; నా మహనీయుల పాదచిహ్నముద్రిత రాజమార్గములు నవియే. అందు వారియడుగుజాడలలో నడుగులిడుచు సారస్వత జీవితమును సారించినవారిలో చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ప్రసిద్ధులు.

వీరి 'రామచంద్రవిజయము'లో నాయకుఁడు మాచిరాజు రామచంద్రుఁడనెడి నియోగుల కుఱ్ఱవాఁడు. ఇతనిది తాటిపాక. మాతాపితృవియోగముగలిగిన యితని యాస్తిని బినతండ్రి యపహరించును. అన్నివిధముల నిస్సహాయుఁడయ్యు నేదోయొక విధముగఁగష్టపడి విద్యనార్జింపవలెనని యాతని కభినివేశము. దుస్త్యజమైన యభిజనము

1. Vide. P-12 Ft. st. G G. Catalogue of Books for the quarter ending March 1895.

2. పానుగంటి, చిలకమర్తి, సెట్టి లక్ష్మీనరసింహముల కిది సంగ్రహ నామము.

3. ఇది 'సరస్వతి' యను పత్త్రికలోఁ బ్రకటితము.

4. Honorable Nyāpati Subba Rao Pantulu, B.A.B.L.

వీడి దౌర్భాగ్యము వెన్నాడ నీతఁడు దిక్కుమాలి యమలాపురము బోవుచున్న దృశ్యముతో నీ నవలలోనికథ ప్రారంభించినది.1

అమలాపురమున నుపాధ్యాయుల యనుగ్రహము నొక శ్రీమంతుని యాశ్రయమును లభించి యాతనికిఁ జదువు సాగును.

కాని తాను నిరపాయమని భావించి యొనరించుకార్యములే యాతని మహాపదలకు మూలమగునట్లుఁ గథాసంవిధానము పొదువుగట్టఁగలదు. తనకుఁ దెలిసినంతలో సత్యమునే పలుకు నాచారాభ్యాసములు రామచంద్రునివి. దీనివలన నెంతలేసి విపత్తులు

1. చిలకమర్తి వారి నవలల కిట్టి దృశ్యములతో నారంభమగుట యలవాటు. అసలు వానికే గాదు. అనాఁటి వారికిఁ జాల మందికి నవలారంభమట్లు చేయుట యొక యాచారము. ఇట్టి ప్రారంభము లాంగ్ల నవలలలో నుండు నవి చెప్పుచు చిలకమర్తి వారికి మెడోస్ టెయిలర్ (1808–1876), స్కాట్, డికెన్స్ ప్రభృతుల నవలల పరనము చాలఁ దోడ్పడుట డా॥ కొత్తపల్లి వీరభద్రరావు[గారు] నిరూపించి యున్నారు మన పల్లెలలో నిన్న మొన్నటి వఱకు వీథులపై నుండెడి యిండ్ల యరుగుల మీఁది 'వీధి బడుల' దృశ్యమును లక్ష్మీనరసింహము గారు రామచంద్ర విజయములో వర్ణింపగా వానిని యార్క్‌షైరు స్కూల్ సీన్స్ (Yarkshire School scenes from Nicholas Nickleby of Charles Dickens) అనికూడ వీరు చూపిచెప్పగల్గినారు. [తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషుప్రభావము–పుట 492 – (1960) ] ఈ సందర్భమున నరసింహముగారే చెప్పుకొనిన యొకవిషయ ముదాహరింపఁ దగినది.

"పూర్వము తెలుఁగు నవలలకు వీరేశలింగము గారి 'రాజశేఖర చరిత్ర' యే మార్గదర్శకముగ నుండెను. అది చరిత్రాత్మకమైన నవల కాదు. అది సాంఘికమైన నవల దానిని చదివియే నేను "రామచంద్రవిజయము" వ్రాసితిని. చరిత్రాత్మకమైన నవల వ్రాయవలెనని సంకల్పము నాకు గలుగగా నప్పుడు పూర్వము 'మెడోసు టెయిలర'ను దొరగారు వ్రాసిన నవలలలో 'టిప్పుసుల్తాను.' 'తారఁచాందుబీబి' యను నవలలను నామిత్త్రుఁడైన యొక యువకునిచే జదివించుకొని వింటిని. అవి విన్న తరువాత చరిత్రాత్మకమైన నవల వ్రాయువిధము నాకుఁ దెలిసినది. అనంతరము నేను 'హేమలత' వ్రాసితిని." శ్రీ చిలకమర్తి "స్వీయచరిత్రము"– పుట 127.

మొత్తము మీఁద నాంగ్లము నుండి శిల్పసంబంధమైన యనుసరణ మెప్పుడును దప్పదు. కాని యేవో యొకటి రెండు సన్నివేశములు మేనమామపోలికవి యున్నంతమాత్రమున నరసింహముగారి యనుసరణము కొంతప్రత్యక్షము కొంత పరోక్షముననుట యుక్తమా? యనునదియే ప్రశ్న.

సంభవించినను బరోపకారార్థమై తా నొనరింపఁ బ్రతికార్యమునందు నాతఁడు వాని నానందముతో ననుభవింపఁగలఁడు. అడుగడుగునకు విరామమీయని విఘాతముల కాతనిచే నెదురొడ్డింపఁగలిగిన శక్తి లాస్తిక్య దృఢత్వ నిశ్చితసంకల్పములు.

వేంకటరత్నమునకుఁ బిల్ల నిచ్చెదమని వచ్చినవారితో నాతనిదుర్మార్గము నీతఁడు తానెఱిఁగినది చెప్పివేయును. అదియొక ప్రబలకారణముగ వేంకటరత్న మీతనిపైఁ బగసాధించుటకు సాగించిన సమూఢసన్నాహసాతత్యమే సమీకృతానంతరకథా సమాప్తి.

ఆదరించి విషముపెట్టినట్లుఁ బ్రవర్తించిన శోభనాచలము తుదకు దైవోపహతిచే సర్పదష్టుఁడగును.

మననాయకుని శరభరాజుగారు తమయింటనుండి తరిమివేసినారు. ఆ నిశీథియందాచార్యులవారివేషముతో శోభనాచలమును రక్షించుట యాతనిచాకచక్యమునకు సమూలమైన సాక్ష్యము. ఆరాత్రి యేనుఁగుతుండము ప్రేలాడగట్టినట్లు వర్షము. దారి తెన్ను గానలేని ప్రమాదస్థితిలో నాతఁడు నిల్వవలసి వచ్చినది శ్మశానము. అదియంతయు బీభత్సదృశ్యము; వాస్తవికవర్ణనము.

కథ పటిష్ఠముగ నడచినది. ఏ సన్నివేశమున కా సన్నివేశ మిఁక రామచంద్రుని పని యింతటితోసమాప్త మనిపించునట్లు సంధానింపఁబడెను. అమలాపురమున శోభనాచలముగారియింటిలో ధనభూషణభ్రష్టుఁడగుటయుఁదదుపరి శరభరాజుగారియింటిలో వ్యాధిగ్రస్తుఁడై ప్రకోష్ఠమునుండి పశులకోష్ఠములోనికిఁ గొనిపోబడుటయుఁ దరువాత గోదావరిలోబడి యాత్మహత్య గావించుకొనఁ నెంచుటయువంటి కష్టములు పుంఖానుపుంఖములై యాతనిని వెన్నాడును.

శరభరాజుగారియింటనుండి నిష్కాసితుఁడగుచున్న రామచంద్రునిగుఱించి వేంకటరత్నము "ఎన్నటికైనను బాపముబ్రద్దలుగాకపోదు" అని నిందించినాఁడు. చివరకు శోభనాచల వేంకటరత్నములు తమలోదాము కలహించుకొని రహస్యములను బయలుపఱుపఁగా శరభరాజుగారు సత్యముగ్రహించినారని విని 'దైవానుగ్రహమున్నది గనుక నిట్లయినది'—యని రామచంద్రుఁడూఱడిల్లును.

అట్లు దుర్మార్గుఁడైన వేంకటరత్నముచేతను నిట్లు సద్గుణసంపన్నుఁడైన రామచంద్రునిచేతను బలికించిన రెండువాక్యములవలన నవలాధ్యేయము ధర్మవిజయమని సూచ్యము. పరిస్థితుల యొత్తిడికిఁ దాత్కాలికముగ లొంగిన ట్లగపడినను రామచంద్రునకు దైవభక్తులును ధర్మచింతయు న్యాయనిరతియుఁగలవు. అవియే యతనిని శాశ్వతసత్యగవేషణై కరతు నొనర్చినవి.

శరభరాజుగారు పూర్తిగఁ బరిస్థితుల కధీనమైనవ్యక్తి; రామచంద్రునకుఁ దన కూఁతునిచ్చుటయే నిష్కృతిగా భావించిన సమ్యక్శీలి.

ఈనవలయందు వాస్తవికత సుప్రసక్తము. కాని యీ వాస్తవికత యాంగ్లసంస్కారదిగ్ధులమై నేఁడు భావించునట్టిది గాదు. ధర్మమే జయించితీరుట నిజమగుచో నా నిజమును నమ్ముటవలనఁ గలుగు సంతృప్తి నీయఁజాలినది వారి వాస్తవికత. ఇందలి వాతావరణసృష్టిచే గథారంగము కన్నులముందు నర్తించును. ఆంధ్రదేశము, నందును బ్రత్యేకించి కోనసీమప్రజాజీవితము, నాఁటి సాంఘికాచారవ్యవహారములు మున్నగునవి మన కనుపాపలలో మెలఁగఁగలవు. వాతావరణనిర్మాణవిషయమున నిది, 'రాజశేఖరచరిత్ర' నే త్రోసిరాజని విజయవంత మయ్యెను.

చిలకమర్తివారి సుకుమారహాస్యమున కిది నిదర్శనము. ఇందు నియోగుల యాత్మాభిమానము, కొబ్బరితోఁటలలో కోనసాగు చీట్లాఁటలు, దొంగసొమ్ము తక్కువవెలకుఁగొను దురాశాపరులు, పూటకూటియిండ్లలో బొనఁగెడి యనాచారాత్యాచారములు, పడవలపై గోదావరిదాఁటు ప్రయాణికులుపడు పలుపాట్లు, మొదలైనవెన్నియో బహుస్వాభావికముగ వర్ణితము. రామచంద్రునకుఁ జక్కని పెండ్లిసంబంధము రాఁగాదానిని జెడఁగొట్టుటకై పినతండ్రి తనశక్తివంచనలేకుండ పాటుబడును. కూఁతురు గతించిన పదునొకండేండ్ల కొకబంధు వింటికిరాఁగా, నన్నపూర్ణమ్మ తన కానాఁడే పుత్త్రికావియోగము ఘటిల్లినట్లు విలపించి సముదాచారము నిలబెట్టును. ఆయూరి తెలుఁగుబడిపంతులుగారు పిల్లలను బెట్టు యమయాతనలును బార్వతికి సంబంధమువచ్చినసందర్భములో జుట్టుప్రక్కల నమ్మలక్కలు గుమిగూడి మాటలాడిన మాటలును మనకు నవ్వుగొలుపకమానవు. ఈరీతిగ నిందుఁ జిత్రితమైన యాంధ్రదేశ వాతావరణవాస్తవికతకుఁ జిత్రీయమాణచిత్తుల మగుదుము.

అయ్యును గథాగమనములో ముఖ్యముగ నుపసంహారమునఁ గథానాయకునకు సర్వసుఖములు శుభములును సమకూరిదుర్మార్గులు తగినదండన నొందుదురు. సర్వశాస్త్రమైన పరాత్పరుని సమస్తనిర్ణయములును దమశ్రేయోభివృద్ధికిఁదోడ్పడునవియే యనెడి యాస్తిక్య బుద్ధి, నేఁడు సహన దూరులగు మన లోకమువారిలో బెక్కురకు లోపించినది. అందుచే సర్వశ్రేయోవాదితలో విశ్వాసములేని విమర్శకులకును బఠితలకును నిట్టి కథాపరిసమాప్తియందు వాస్తవికత కించిదూనిత మట్లగపడును.

ఇందుఁజాటింపఁ బడిన పాత్రల సంఖ్యా సంగ్రహతయు స్తుత్యర్హము. రామచంద్రునిచే నిత్తడికంటె నమ్మించినవాఁడును, శరభరాజుగారి పసికుమారుని నగల యాశచే దీసికొనిపోయినవాఁడునుగూడ, భిన్న భూమికలయందుఁ బ్రవర్తించిన యొకే యొక వ్యక్తి. సన్నివేశచాతుర్యముతో గథాసంవిధానపాటవముతో మహాశయముతో నానాఁడు చిలకమర్తివారు చికిలిచేసిన 'రామచంద్రవిజయము' సార్థకమై. వారి సాంఘిక

నవలలలో విశిష్టతఁగన్నది. సాధారణ లౌకికవ్యవహారములలోని లోఁతుల నవగాహించి మృదుపరిహాసకుశలగభీరరచన నెఱపు నైపుణ్యమునందే వీరి విజయరహస్యము గుప్తమైయున్నది 1.

## వివేకవిజయము

చింతామణిపత్త్రిక నిర్వహించిన నవలా స్పర్థల 2 యందు రెండవయేఁడు 'వివేకవిజయము' 3 నకు క్రీ.శ. 1894లో ద్వితీయబహుమతి నందుకొనిన నవలాకారుఁడు గోటేటి కనకరాజు. ఇది చింతామణిపత్త్రిక 4 యందుఁ బూర్తిగఁ బ్రకటితము. శ్రేయోదాయకమైన సత్యమునుగూర్చి తెలిసికొని వివేకాభిరతులై యువకులు ప్రవర్తిల్లునట్లుగఁ జేయనెంచుటయే యీ నవలికకుఁ 5 బరమ లక్ష్యము.

## భాస్కర విలాసము

ఇది చింతామణిపత్త్రికలో దొలుతఁ బ్రకటితమై తరువాత గ్రంథరూపమందిన యింకొకనవలికరి. దీని కర్త బులుసుపాపయ్యశాస్త్రి; వీరు పండితులు; బహుగ్రంథ నిర్మాతలు; కాలమును దుర్వినియోగపఱచు దురభ్యాసము వలని యనర్థముల వెల్లడించుటయే యీ యల్పకృతి 7 యొక్క ప్రయోజనము.

---

1. అన్నిటను వీరేశలింగముగారే మాకాదర్శపది యని చిలకమర్తివారు స్వీయచరిత్రయందంగీకరించుట కర్హము. వారి నవలలకుఁ బ్రతికృతులు నిర్మించుటయే తమపని యనునర్థమునఁ గాదు. ఆశయముల సజాతీయత వారి యుద్దేశము. అందుచే రాజశేఖరచరిత్రకీనవల యధ్యాహారము గాదు. అట్లనుకొనిన విమర్శకులు పొరబడిరి.

2,4. చూడుఁడు :- ఈ నవల ముఖపత్త్రము. అటులనే చింతామణిపత్త్రిక-నాల్గవ సంపుటము. 670పుటలది-ప్రచురణము 11-9-1895-గౌతమీ గ్రంథాలయము, రాజమహేంద్రవరము- Also, Vide- Ft- st.G. G. supplıment, Catalogue of Books published in the Madras presidency D/ 25-2-1896, vol 3-P 115 under Reg. No. 23.

3. Vide Ft. st. G G. suppli–Page 103-D/25-2-1896.

5. ఇందలి పుటలు 91- ప్రకటనము 10-9-1895. నవలల పోటి1894.లో బహుమతి నొందినది. చూ:- ఆంధ్ర వా. సూ. ముద్రితగ్రంథముల పట్టిక-పుట 191- vide Ft st g. g. suppli - Page 103 - D/25-2-1896.

6. ఆం. వా. సూ. ము గ్రం. ప. పుట 140 Issed on 26/9/1895. Vide Ft. st G. G. sup. D/25-2-1896–Vol 3 P 113–Reg. No-27.

7. ఇందలి పుటలు 52.

## మాలతీ రాఘవీయము

ఇది ఖండవిల్లి రామచంద్రుఁడుగారు రచించిన రెండవనవల; చింతామణిపత్త్రిక నిర్వహించిన 1895నాఁటినవలాస్పర్థలలో బహూకృతము 1. ఇదియు సార్థకనామమైన సాంఘిక కథ.

## హేమలత

ఇది క్రీ. శ. 1896లో 'చింతామణి'ప్రథమబహుమానము నందుకొన్నది; 'సరస్వతి'యను పత్త్రికయందుఁ బ్రకటితము. ఈ నామకరణము దీనికంత సముచితముగ నున్నట్లుఁగనుపట్టదు. హేమలత యనుకన్య యీ నవలయం దందందు నగపడుచున్నను నిం దనుసంధింపఁబడిన ఘటనలన్నియు నామె నాలంబనముగఁగలవి యనలేము. ఆమెతో బరోక్ష సంబంధమునైనఁ గల్పించుకొని సంఘటనలు సంస్ఫురితములైనచో దీనికీ నామనిర్దేశమన్వర్థమైయుండెడిది. 'చిత్తూరురసపుత్త్రవిజయ' మనియో మఱేదియో దీనికి నింతకంటెఁగూడఁ గథాసాన్నిహిత్యమును సమకూర్చు నామకర్మము జరిగియున్నచో నెంతయో బాగుండెడిదని యూహింపనగును.

హేమలత నిందు నాయికగా నంగీకరింపకతీరనప్పుడిఁక మదనసింగును నాయకునిగ గ్రహింపవలెను. ఈతనియందు సహజముగ నాయకున కుండఁదగు లక్షణము లన్నియు నున్నవి. ప్రతినాయకునిగ రహిమానుని గ్రహింపవలెను.

నవలారంభమునందు మనకుఁగనిపించు నొకానొక పరిదీనుఁడైన బాటసారి, కేవలము బాటసారిగనే నిలిచిపోయి యర్ధరాత్రమున రాజభటులచే గ్రూరముగ యమునానదిలో బడఁద్రోయఁబడినాఁడు.తత్పాంథుని ప్రస్తావన తుదిప్రకరణమునఁగాని బయలుపడనిబిగి, కథయందుఁగలదు. అట్లే హేమలతయుఁ దన తాతయగు నారాయణసింగును దురుష్కులు బంధించుకొని పోఁగా నెటుపోయినదో పోయినది. అంతర్థానమైన యామె చరిత్రము చాలవఱకు గోప్యముగ నుంపఁబడెను. ఈ రెండు సందర్భములయందును వారివారి యనంతరవృత్తాంతముల విననలయునని పాఠకులు కౌతుకితులగుదురు. ఇం దెక్కడ కక్కడఁగల నవ్య సన్నివేశ కల్పనము వలననో యేర్పడు నూతన పాత్రపరిచితివలననో పఠితృహృదయ మొకనవీనానుభూతి సంపాదింపఁగలుగుచున్నది.

రాధ చివరకు చిత్తూరుచేరి హేమలతాభూమికయందు మదనసింహుని బరిష్వజించును. మదనసింహుని బంధువర్గ మా హేమలత నసహ్యించుకొనును. ఆమె రాధయని బయలుపడువఱకును మనకు నిజముగ హేమలతయే తిరిగివచ్చినట్లుఁ దోఁచును.

1. చూడుఁడు :— 10-8-1895నుండి 18-6-1896వఱకు నాఱుసంచికలుగల చింతామణిపత్రిక 5వ సంపుటము-(1895-96) గౌతమీగ్రంథాలయము, రాజమహేంద్రవరము.

కుమారసింగు నిక్కముగ హేమలతకు సోదరుఁడని పఠితలు భ్రాంతిపడఁగా దానట్లుఁగాక పురుషవేషమునుదాల్చిన హేమలతయగుట మఱియు నాశ్చర్యకరము.

మొదటిప్రకరణమునందు గోచరించిన బాటసారి తిరిగి యిరువదియవప్రకరణమున హేమలతతండ్రియగును. సాలిగ్రామమునందు సంచరించినగోసంగి, మదనసింగుతో స్నేహమొనర్చిన చిదానందయోగియే యైనాఁడు. ఇందుచే ప్రయోజనము, పాత్రల సంఖ్యాక్లిప్తి సంపాదించుట యొక్కటియేగాదు. పాత్రల ననావశ్యకముగఁ బెంచి తికమక పడక యున్నపాత్ర కనేక రూపముల నిచ్చుటవలనఁ గథ బందుకట్టునకు జిగియు బిగియు సమకూరుచున్నవి.

ఈ కథయంతయుఁ దురుష్కరసపుత్ర మతకలహ రాజ్యకాంక్షాప్రధానముగఁ బ్రసారితము. ఆనాఁటి మహమ్మదీయుల దుర్మార్గప్రవర్తనమును వారల యేలుబడిలో హిందువు లనుభవించిన యిక్కట్టులును దిక్కుచెడిన హేమలతాకుటుంబము నాధార ముగ గ్రహించి, రసపుత్రవిజయపర్యంతము ప్రజలకుఁ దెలియఁబఱచుటయే నవలాకర్త యాశయము. కాన నిది యెంతసాంఘిక మో యంతరాజకీయమైననవల. దీనివలనఁ జారిత్రకనవల మన కిరువదియవశతాబ్దికిఁబూర్వము లేదనినలోపము దీరుచున్నది. ఇట్టిదానికి శ్రీకారముచుట్టినవా రగుటచేతనేగాక, యానాఁటివారిలో నీ విషయమున మేటియగుట చేతనుగూడ 'ఆంధ్రస్కాట్' బిరుదము చిలకమర్తివారిపట్ల నన్వర్థము.

## లక్ష్మీసుందర విజయము

దీని కర్త ఖండవిల్లిరామచంద్రుఁడు. క్రీ॥శ॥1896నందు 'చింతామణి' ద్వితీయ బహుమతిఁగొన్న నవలికయిది[1]. సరళశైలిలో రచింపఁబడినదీని కొంకనటునిచరిత్ర మాధారము. అతనిది మైసూరురాష్ట్రము. అప్పుడారాజ్యము టిప్పుసుల్తాను బరిపాల నములో నుండెను. ఆనటుఁడు తన నటనాకౌశలమువలన సుల్తానుని మన్ననలకుఁ బాత్రుఁడైనాఁడు. కేవలము స్వార్థపరుఁడుగాక తనకు లభించిన రాజాశ్రయముచేత నీతఁడు తనజాతికిఁ దనప్రజల కెల్లరకునుగూడ శ్రేయమును గూర్చుట యిందలి ప్రధానాంశము.

## అహల్యాబాయి

ఇది క్రీ.శ.1897'చింతామణి'ప్రథమబహుమానమును బరిగ్రహించిన చిలకమర్తి వారి నవల[2]. "మెడోస్ టెయిలర్"అను నాంగ్లరచయిత, 'సుల్తాన్, తార, చాంద్ బీబీ'

---

1. ఇందలి పుటలు90—దీని ప్రథమముద్రణము 1897. [Vide Ft St G. G. Catalogue of Books Published in the Madras Presidency–Vo 3. Suppliment D/ 23-4-1897, Page 79, Reg-No–200.]
2. ప్రథమావృత్తి, పుటలు 104, ప్రచురణము 5—9—1898, [Vide Ft St G. G. Catalogue of Books published in the Madras presidency, Vols. Suppliment D/ 28-2-1899, P P 124, 125–Reg No. 2]

యను నవలల రచించెను. వాని పఠనోత్సాహనమును స్వీయప్రతిభాప్రేరణయుఁ గల వఁగా లక్ష్మీనరసింహముగారి 'హేమలతయు నహల్యాబాయి'యు నీపద్ధతిలో ప్రశస్త ముగ నడపఁబడినవి.

'అహల్యాబాయి'లోనికథ యౌరంగజేబుపరిపాలనానంతరము జరిగినది. మామను భర్తను కుమారునిగూడఁ గోల్పోయిన మహారాష్ట్రవనిత యహల్య, రాజ్య మును దానుగఁ బరిపాలింపఁదలఁచును. శ్యామసుందరదత్తు రాధాకాంతరావు లిరువురు బాసటగానిల్చి యహల్యను రాజ్యపరిపాలనమునకుఁ బ్రోత్సహింతురు. వారియం దామెకుఁ బరిపూర్ణవిశ్వాస మున్నది. జస్వంతసింగు, దౌలతరావుప్రభృతు లీమెను గూల్ప వలెనని ప్రకటముగఁ జాటఁజొచ్చిరి.

ఇట్లుఁ బన్నపడినపదక మొకసందర్భములో నాకస్మికముగ వ్యత్యస్తమగును. అహల్యాబాయికిఁ బరిస్థితులప్రభావమువలన శ్యామసుందరదత్తునందు రాణిద్రోహియని యనుమానము దోఁచినది. మొదట వానికామె మరణశిక్షకూడ విధించును. దౌలత రావు దొంగచాటుగ వ్రాయించినలేఖలనుబట్టి రాధాకాంతరావునందుకూడ నామె కట్లే రాణిద్రోహానుమానము గల్గుట సైజము.

జస్వంతరావు రాణిపక్షమునకుఁ దిరిగిపోయి ప్రతిపక్షులను గండభిల్లునితోగూడ జయించి తుద కారాజ్యమును సుస్థిరము గావించుటకుఁ బ్రయత్నించును. కాని యనుకొన్నదొక్కటి; జరిగిన దొక్కటి.

ఈ నవలయందలి పురుషపాత్రలలో నాద్యంతము సత్యధర్మములకుఁ బాటుపడిన శ్యామసుందరదత్తునిపాత్ర యుదాత్తముగ నున్నది. తన జీవములను గాపాడుకొనుటకు నిరపాయమైన యుపాయమొకటి యేర్పడినను గారాగారమందున్నయతఁడు రాణి యాజ్ఞయే నెఱవేఱవలెనని యందుండి తప్పించుకొనుట కంగీకరింప లేదు. ఈతఁడే ఖానువేషమున శాయాజీని బట్టితెచ్చును. రాణికి రాబోవునపాయమునుగూర్చి చేవ్రాలు లేనిలేఖయు నాతఁడే వ్రాసినాఁడు.

స్త్రీపాత్రలలో కమలపాత్ర విచిత్రమైనది. కమల తాను సీతయై తుదకు పురుష వేషమునుగూడఁ దాల్చి నటించి పరిస్థితు లనుకూలింపఁగా నెగ్గఁగలిగెను. సీతయందు సౌహృదము చక్కగఁ జిత్రింపఁబడినది. అహల్యాబాయిధీరత్వ మీ నవలలో యుద్ధవేళల యందు సువ్యక్తము. ఆతని పుత్త్రికాప్రార్థనానుసారముగ శ్యామసుందరదత్తుని మృత్యువునుండి కాపాడుటయం దీమె వాత్సల్యమభిస్ఫురితము. తన రాజ్యమున కాపద సంభవింపరాదని యామె ప్రస్తావనలయం దెన్నిటనో తెలిపినది.

ఇం దన్ని సన్నివేశములును బన్నుగ బన్నఁబడినవి. పాత్రల నధికముగ సృష్టిం పక యున్నవానినే భూమికాంతరములలో బనిగొనుట, యీ నవలాకర్త యన్నిటను

ప్రకటింపఁగలిగిన మితవ్యయశిల్పము[1]. నాఁటి సాంఘికరాజకీయ క్లిష్టపరిస్థితులలో నహల్య ప్రదర్శించిన పరిపాలనాచాకచక్యమును స్పష్టపఱచుటయే యీ నవలయొక్క ప్రధానోద్దేశము.

## మనోరమ

రాజా మంత్రిప్రెగడ భుజంగరావుపంతులు రచించిన దీ బృహత్తర[2]. నవల తాను ప్రకటింపనున్న నవలా పరంపరలో నిది మొదటిదని తత్కర్త తొలిపలుకు.

ఒక వ్యాపారస్థుని పుత్త్రికా మనఃపరికల్పిత జీవికాకథన మిందలి వస్తువు. ఆమె యొక యాధునికపాఠశాలలో విద్యావతియగుటయు నామె యనారోగ్యమును వివాహమును వంటి వివరము లిందుఁ గలవు. పెక్కుఁదావులయందు రచయితకు, స్త్రీవిద్యా వివాహాదివిషయములనుగూర్చి యున్న భావములప్రకటనయు నిందుఁగలదు. ఇందలిది సాధారణమైన కథనశైలి. ఇందుఁ గొన్ని సాంఘికాచారవ్యవహారములును నాఁటివి స్ఫురించును.

## కపాలకుండల

బంకించంద్రుని వంగనవల; డి.వి.యస్. దొరస్వామయ్య యనువదించినాఁడు.

కీ.శే. కూనపులి లక్ష్మీనరసయ్య[3]. రచించిన బక్షీ[4]. యను నవలయు, కీ.శే. గురుజాడ శ్రీరామమూర్తి కావించిన కళాపూర్ణోదయకథాసంగ్రహమును[5]. గూడ నీయుగము లోనివే. నేఁటి మనదృష్టితో జూచినపుడు కథ నొడుపుగఁజెప్పు మెలకువ యప్పటి కపరిపక్వస్థియం దున్నది. కాని యది పిమ్మటఁగలుగనున్న వికాసమునకు మూలకంద మగుటచే బైనఁ బేర్కొన్న కొన్నింటిని నవలావిశేషములు, నవలికలు ననక మానలేము.

పందొమ్మిదవశతాబ్దియందుఁ బ్రధానభూతములైన కొన్ని నవలావిశేషముల నిందు దిఙ్మాత్రముగఁ జర్చించితిని. విహంగదృష్టితోఁజూడఁగ నిది కేవలము కందుకూరి ప్రభృతుల ప్రభావస్ఫురిత మట్లగపడు యుగము. అందును బ్రత్యేకించి వీరేశలింగముగారే

1. Economist's craft.

2. Pages 312–1st Ed. issed on the 15th June, 1899. [Vide, Ft St G. G. (Vol 3) D/ 14-11-1899 P P 98-Reg No. 8.]

3. వీరు 'శ్రీనాథచరిత్ర'యని యింకొక కృతిఁజెప్పిరి. (చూడుఁడు—ఆంధ్ర-వా. సూ-ముద్రిత గ్రంథములపట్టిక-పుట 210.

4. ఇది క్రీ. శ. 1899 నాఁటిది. Vide. Id. P. 124. 5. Id. P. 35.

నాఁటి నవలాచలనచిత్రమునకు దర్శకులు. చెదురుగ నే యొకరిద్దఱో వారి యాశయ ములఁ బాటింపకున్నను, సామూహికముగ ననుశీలించి నప్పుడిది విషయవిధానములను రెంటినిబట్టికూడ, వారి యడుగుజాడలలో రచయితలు సాగినట్టి శతాబ్ది. శ్రీరంగరాజు చరిత్రకర్త యజ్ఞాతసూత్రధారుఁడై తనపనిఁ దాను నిర్వర్తించుకొనిపోఁగా, నానాఁడు బ్రయోజ్జితమైన యీప్రయోగాతిశయమునకుఁ బంతులుగారే సూత్రధారులు.పరపరిపాల నాదుల యందు వైముఖ్య మేర్పడినను నది మితవాదదశను దాఁటలేదు. విదేశీయులను మెప్పించి స్వరాజ్యము సంపాదింపవలెననెడి దృష్టిగలవారిలో పంతులుగారొకరు. వారి శిష్యకోటియు నాంగ్లమునుండి గ్రహింపఁదగిన గుణములున్నవని నమ్మినదే. ఈయుగ మున బాగుగఁ గొనసాగిన యాంగ్లాద్యనువాదసాహిత్యమున కంకురార్పణ మా యుగమునందే జరిగెను. సర్వవిధానువాదములకు నాయుగమే ప్రాతినిధ్యము వహించినది.

"భరతదేశమ్ము చక్కని పాడియావు" అని తొలుదొలుత జాతీయగీత మాంధ్రు లకు వినిపించిన చిలకమర్తివారియందును నవనవోన్మేషయుగప్రభావచిహ్నితమైన ప్రబో ధము పొంగులెత్తెను. సమస్తజీవితమార్గములయందును విజృంభించెడి నవ్యత నవలా రూపమున సమీకృతము గావలెననెడి సదాశయము నాఁడు సర్వులకుఁగలదనుట సము చితము. తదాశయప్రేరితోత్సాహమున మౌలికరచనములు వెలువడినవి; అనువాదనవలా సాహిత్యమును వెలువడినది.

కాని తత్ప్రయత్నమంతయుఁ గేవలము పిండలిప్తయై పిడుచగొని పిలపిలజేరు భ్రూణదశావిశేషము నందున్నది. నేఁ డభ్యుదయ మొందుచున్న శిల్పదృష్టితోఁజూచి వానిని నవలలేగావన్నవా రున్నారు. మా ముత్తాతకు మేము మునిమనుమలము గాము; మముగన్నతల్లి గొడ్రాలు; మా చిగిరించినచెట్టునకు వేళ్ళులేవు; మొదలైనమాటల వంటి వీ వాదములు. అగపడక యడుగుననుండునుగాని యది తల్లివేరు కాకపోదు. పిండపుష్టి వపుర్విజృంభణమునకు హేతువు. అది వపువుగాదు. అందు శక్తులు కుంభించి యుండును. పిదపఁ గొన్నికొన్నిశక్తులు సమకూరనుగలవు. నేలవిడిచి సాములేదు. అందు వలననే యిది కేవలము సాధనభూమి; ఒక యండప్రాయమైన దశ. అది స్వర్గీయవీరేశ లింగముచే బొదువఁబడినది. ఉత్తరోత్తర యిందుండి రాగలిగినదే వికాసము. ఆవికాస మున స్వతంత్రనవలలు, ననువాదములుగూడ వెలుఁగులోనికి వచ్చినవి. బీజభూతముగ నట్టి పరిణామశక్తి గుంఫితమైన యీ భూమి, మన నవలావతారమునకు విదేశీయమైన పూర్వ రంగము[1].

---

1. మనకు నవలాపరిణామముచెప్పుటయే యిందు కర్తవ్యము. కాన వానివాని కాంగ్ల వంగాదినవలలతోఁగల పోలికల నడుగడుగునకుఁ జూపుట జరుగలేదు. ఆ విషయమున జూడదగినది, "తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము" అను డా. కొత్తపల్లి వీరభద్రరావు[గారి] సిద్ధాంతగ్రంథము.

# పంచమ ప్రకరణము

## ఆధునిక నవలా సాహిత్య సముద్గమము-ఇరువదియవ శతాబ్ద్యారంభము



౧ మన నవల వాతావరణజన్య మనుటకొఱకై నాఁటి విద్యా సాంఘికార్థిక రాజకీయాది విషయముల చర్చతోఁగూడిన యుపోద్ఘాతము.

౨ నానావిధ సాహిత్య ప్రక్రియల సమ్మర్దము.

౩ ఆంధ్రమున నవలా సాహిత్యోద్గమము.

# పంచమ ప్రకరణము

## ఆధునికాంధ్ర నవలా సముద్గమము

## (Telugu Novel of the Modern Times, in the Making)

*[క్రీ శ. 1901–1919]*

బ్రిటిషువారి యాగమనమువలన నాంధ్రులసంస్కృతికిఁ బాశ్చాత్యుల కళాసాహిత్యముల చైతన్యప్రసృమరప్రభావముతోడి సన్నిహితసంబంధము సమకూరినది[1]. సంఘములో విద్యాధికులందఱు నాంగ్లసారస్వత జ్ఞానము సంపాదించిరి. తత్ప్రభావప్రసారము మూలమున సారస్వతాభిరుచులు పరివర్తనఁ జెందినవి; సారస్వతాదర్శములు సమూలముగ రూపాంతరమునొందెను. నూతనాదర్శములు ప్రజల శ్రద్ధాసక్తులను జూఱఁగొనఁజొచ్చినవి. వారుత్సాహసమన్వితులైరి. సాహిత్యరంగము వినూతనసాంకేతిక ప్రతిపత్తికి నుత్పత్తిస్థానమయ్యెను. ఒకపక్షమున మాతృభాషానురక్తి ప్రబలముగాఁ జొచ్చినది. వేఱొకపక్షమునఁ బూర్వప్రక్రియలయెడలను బూర్వాదర్శములయెడలను దురాగ్రహగ్రస్తమైన యొక దుస్సహానపరత్వము పెచ్చుపెఱిగి పోయినది.

ఇరువదియవశతాబ్ది వచ్చినపిమ్మటఁగాని ప్రాచ్యపాశ్చాత్యసంస్కృతులయందలి పరమార్థము లొకదాని నింకొకటి యర్థముచేసికొనుటకై యత్నముచేయలేదు. మన జాతిదైనప్రతిభ యేరీతిగ దానియెడఁ బ్రతినిర్యాతనము నెఱపఁగలుగునదియు నిప్పుడిప్పుడు ప్రతిపన్నమగుచున్నది. కాని యప్పుడు లేదు. ఒక నూతన చైతన్యము మన సారస్వతేయ జీవితమునఁ బ్రవేశించెననియు నది జవసత్త్వములు గలదనియు మాత్రమే మనకప్పుడు వేగుజాములో దెలియును. ఆసంయోగముయొక్క యుపయోగమునకు జాతకముచెప్పువారప్పుడు లేరు. జాతమాత్రమునకు జాతకచక్రముగూర్చుటయుఁ గూడని పని. ఆ కాలములో బ్రతిఘటనాశక్తులయు సిద్ధాంతములయు నినాదములచే వాతావరణము సాంద్రమగుటయే యప్పుడు కలిగినఫలము. సాహిత్యమున సంప్రదాయములపై నొక తిరుగఁబాటు నెలకొన్నది. అజ్ఞేయము నప్రసిద్ధమునగు నొక వైముఖ్యమేర్పడినది.

దీని నజ్ఞాతవ్యము నప్రసిద్ధము ననుటకూడదు. అట్లనుట లోఁతుపాఁతు లెఱుఁగక పోవుట. లోకమునఁ బ్రవర్తిల్లు సమస్తమైన పరివర్తనలకు నార్థికసంబంధమును నిర్ణయించి

---

1. "పాతపద్ధతి కొత్తపోకడలు" ప్రధానన్యాయమూర్తి శ్రీ.పి.వి.రాజమన్నారు గారి ప్రసంగము–వాణి–సంపుటము 10–సంచిక 13–పుట 1. [22-11-1958].

నపుడే యాయాపరివర్తనముల ప్రధానకారణములను గ్రహించినట్లగు ననిచెప్పు నొకప్రసిద్ధ వాద మున్నది. ఆవాదమునుబట్టి బ్రిటిషుపరిపాలనము ముస్లిముల పరిపాలనము వంటిది కాదు. ఇది సమాజ జీవితములో గాఢమైన మార్పులుదెచ్చినది. క్రీ.శ. 1772నకే చెన్న పురికి ముద్రణయంత్రము వచ్చినను క్రీ.శ.1807వఱకు నాంధ్రములో బ్రథమగ్రంథము[1] ముద్రితము గాకపోవుటయు మున్నగునట్టి పెద్దలుచెప్పు కారణకలాపము, మనయభి రుచుల సరివర్తనములోని యాంతరమెఱిఁగి చెప్పుకారణకలాపము గాదు.

భారతదేశమునఁ దత్పూర్వమందున్న స్వయంసంపూర్ణ గ్రామజీవనవ్యవస్థ గృహ పరిశ్రమాదినిష్ఠితము. పాశ్చాత్యుల పరిపాలనమున నాంధ్రదేశములో పరస్సహస్రములై యున్న గ్రామముల యార్థికజీవితము భగ్నమైనది. సామ్రాజ్యనిర్మాతలు సాధారణ ముగ నెలకొలుపు నూతనార్థికవిధానమును స్పర్ధనాత్మకమైన యొకానొక నాగరకతయు మనదేశమున నెలు వేర్పరచుకొన్నవి. విదేశవాణిజ్యవ్యాపారోత్పత్తుల కనుకూలమగు నట్టి యార్థికవిధాన మొకానొక స్వయంసంపూర్ణ గ్రామపరిశ్రమార్థికవిధానమునందు చొఱవచేసికొనినప్పు డేర్పడు మార్పే మన సమాజజీవితమునందు నేర్పడెను. సంఘ మున నడిమితరగతిప్రజల యార్థికస్థితి కొంత పెరుఁగఁజొచ్చినది. కొంతకొంతగ వారికి విశ్రాంతియు లభించెను. మహాకావ్యములను జదువలేరుగాని వారికి సులభము సరళము నగు సాహిత్యపఠనమునం దాసక్తి పెరిఁగెను. విజ్ఞానములో మార్పువచ్చినది. దానితో మన నవ్యసాహిత్యమునకును బునాదులుపడినవి. ఇంగ్లాండునందుకూడ నిరువదియవశతా బ్ద్యారంభమున ప్రజాసాధారణ్యముయొక్క యార్థికస్థాయి పెరిఁగి యీపరిణతి యేర్ప డినది. ఆంధ్రదేశమున కీ.శే.వీరేశలింగముగారి సంఘసంస్కరణాత్మక సాహిత్యసంభూతి యంతయు ధనికస్వామ్యముగ మూఢాచార ప్రతిఘటనమేగదా! యనునట్టి యా వాదము సంస్కరణోద్యమములకును సాహిత్యమునకునుగల మిథఃప్రచురసాజాత్యము నుగ్గడించును.

అప్పుడు వీరేశలింగము, చిలకమర్తి లక్ష్మీనరసింహామును మొదలుకొని ధరణీ ప్రగడ శివరావు, రెంటాలవెంకటసుబ్బారావు, ఓ.వై.దొరస్వామయ్య, క్రొత్తపల్లి సూర్యారావు, వేలాల సుబ్బారావు, భోగరాజు నారాయణమూర్తి, కేతవరపు వేంకట శాస్త్రి, శ్రీదుగ్గిరాల రాఘవచంద్రయ్య, సి.దొరస్వామయ్య[2] ప్రభృతులగు మహా నీయులు పెక్కురువ్యక్తులు పరిగణనకు వత్తురు. అట్లే విజ్ఞానచంద్రికాగ్రంథమాల, ఆంధ్ర ప్రచారిణీగ్రంథమాల, వేగుఁజుక్కగ్రంథమాల మున్నగుఁ బెక్కు సాహిత్యవ్యాపక

---

1. మదరాసులో ముద్రితమైన మొదటితెలుఁగుగ్రంథము క్రైస్తవపరిపాలకుల కావశ్యకమైన ధోరణిలో వ్రాయబడిన వ్యాకరణము. ఇది "తెలుఁగువ్యాకరణము"(1807). చూడుఁడు 'తెలుఁగుసంస్కృతి' పుట979, రెండవవరుస; పంక్తులు38-39(1959).
2. "ఉన్మాదిని"కర్త.

సంఘములును, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక మున్నగు పత్రికలును, గ్రాంథిక వర్తమానాంధ్ర భాషాసారస్వత విషయబోధకములైన యుద్యమములునుగూడ మన పరిశీలనదృష్టిలో బడకమానవు. అందుచే రమారమి యీ యిరువది యేండ్లకాలము(క్రీ.శ.1900–1919)ను ప్రత్యేకించి పరిశీలించుట యుచితము.

ప్రథమప్రపంచసంగ్రామికకాలములో పారిశ్రామికనాగరకత మన దేశమున నెల కొన్నది. దానితో బూర్వాచారవ్యవహారముల యెడ మూఢవిశ్వాసము లనెడి పేరిట సమస్తరంగములయందు నొక ప్రతిఘటన మేర్పడెను. సమాజజీవితమున నితఃపూర్వ మందున్న నిమ్నోన్నతపరిస్థితులు, నుచ్చనీచస్థాయులు నాఢ్యానాఢ్యవ్యత్యాసములు మున్నగునవియే నాఁటియసంతృప్తికి, ద్వేషమునకుఁ, బ్రతిఘటనకునుగల మూలకారణ ములు. ఇట్టి యాంతర్యముతో నిండియున్న మార్పున కాదినములలో మన సాహిత్యము ప్రతిబింబమైనది. శ్రీ వీరేశలింగము పంతులుగారు స్వర్గస్థులగుటకూడ నీప్రపంచయుద్ధ విరమణముతో సంవదించిన దనఁదగును.

ఏ దేశమునందైనను సామాజికవిషయములలో బరివర్తనమునకై తహతహ పాటన్నది పొడముట కలదు. సాహిత్యరంగమునఁ గూడ నది తన ఛాయల నిగు డించును. రచయితలు ప్రాచీనమైనదానిని గాదనుటతో నాఁగిపోక యర్వాచీనమైన దానిని సృజించియుఁ జూపుదురు. అప్పుడే యది నిజమైన ప్రతిఘటనము. మనము సమీక్షించు రమారమి యీ యిరువది యేండ్లకాలము[క్రీ.శ. 1900-1919]లో నాంధ్ర సాహిత్యమునఁగూడ నట్టి నవ్యసాహిత్యపథము లేర్పడినవి. అవి యప్పటికింకను ప్రాయణీయములు [ప్రాథమికములు] గావచ్చును. ఐనను మన యీ శతాబ్దిలో రమా రమి ప్రథమపాదము సాహిత్యసమ్మర్దస్పందితమని నిరూపించుటకు వాని సామర్థ్యము చాలును. కావున దిఙ్మాత్రముగ నాయా నవ్యసాహిత్యవీథుల నవలోకింపఁగలము. వానిని స్థూలముగ త్రిధా విభజించుటచే సంగ్రహతయు సమకూరుచున్నది. అందు తొల్లిటిది విమర్శనాత్మకమార్గము; సంప్రదాయాత్మకము రెండవది; సృజనాత్మకమైనది మూఁడవపథము.

(1) విమర్శనాత్మక నవ్యసాహిత్యము :

దీనిని మఱల త్రిధాకరింప నగును. గ్రాంథిక వ్యావహారిక ప్రామాణికాది భాషా పరములైన వాదప్రతివాదము లీమార్గమునకుఁ జెందును. అట్లే సాహిత్యపరిశోధనలు విమర్శనలుగూడ నీ తెగకే చెందుచున్నవి.

(2) సంప్రదాయాత్మక నవ్యసాహిత్యము :

సంప్రదాయసిద్ధముగవచ్చు సాహిత్యమును దానిని ప్రకటీకరించు వృద్ధాచార పూర్వక ప్రక్రియలను సమీకరణముచేయు నిది నేఁటి సాహిత్యములో ఫలించిన రెండవ విధమైన కృషి.

(3) సృజనాత్మక నవ్యసాహిత్యము ;

ఇది యనేకనవ్యప్రక్రియల సమాహారము; సాధనభూమియు, నాటకము- నవల, నవలిక, నవ్యగద్యము, నవ్యపద్యము, నవ్యగద్యరూపపద్యము, కథానిక, సాహిత్య పత్రికలు, జ్ఞానదాయకమైన సమస్తసారస్వతవ్యవసాయముగూడ నందలి భాగమే.

ఈ పై మార్గము లన్నిటియందు నానశక్తిమై పనిచేసిన మహనీయులైన సమ కాలీనుల నెల్లర నిచటఁ బేర్కొనుట యొకవేళ నుచితమైనను సాధ్యముకాదు. ప్రధాన మార్గములను నాయా యుద్యమములను గేవలము సంకేతించుటవలనఁ బ్రయోజనమా లేదు. కావున వానివానిని సంగ్రహపఱచుచుఁ దన్నాయకులనుమాత్ర ముదా హరించుట కర్తవ్యము.

## I విమర్శనాత్మక మార్గము

(1) భాషావాఙ్మయ విషయిక వాదప్రతివాదములు :

(౧) గ్రాంథిక వ్యావహారిక వివాదములు :

ఇందు గ్రాంథికవ్యావహారికవాదముల పేరిటఁ బ్రబలిన క్రూరవాగ్యుద్ధము ప్రతి ఖ్యాతిఁగలది. ఆంధ్రమునం దాంగ్లాదిభాషలవలెఁగాక సాహిత్యనిర్మాణమునకుఁ దోడుపడు భాషకును నిత్యనైమిత్తిక వ్యవహారమునందుఁ దోడుపడు భాషకును మధ్య నొక యగాధము గలదు. అభినివేశముగల భాషాసంస్కర్తలు స్వర్గీయ గిడుగు వెంకట రామమూర్తిపంతులువంటి బహుభాషాకోవిదు లీదుఃస్థితిఁ దొలఁగింప నుద్యమించిరి. ప్రాచీనవర్తమానాంధ్రభాషాసారస్వతముల విచారణకై 'తెలుగు' పత్రికను నడపించిరి.[1] నోటిమాటకును జేతివ్రాఁతకును సన్నిహితసంబంధము సాధించుటయే వారి ప్రధా నోద్దేశము. ఈ యాశయముతో నెన్నో వ్యాసము లా[2] "తెలుగు" మాసపత్రిక యందుఁ బ్రకటితములైనవి.

---

1. దీనికిఁబోషకులు పర్లాకిమిడి రాజావారు. సంపాదకులు గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు; వేగుఁజుక్కముద్రణాలయము [బరంపురము]నందు ముద్రితము, పర్లాకి మిడియందుఁ బ్రకటితము; క్రీ. శ. 1919 సెప్టెంబరు.

2 "How to approximate written and spoken Telugu" (Vide, 'Telugu' Journal, Vol. 1, No 2, PP 1-3] Popular Literature'" [*Ibid*, Vol. 1, Nos. 9 and 10 P P. 1–7] [May and June, 1920].

ఎందఱో పాశ్చాత్యభాషావేత్తల 1 యభిప్రాయము లీవిషయమునుగూర్చి సేకరింపఁబడినవి. రావుబహాదరు కందుకూరి వీరేశలింగముపంతులుగా రధ్యక్షులుగా "వర్తమానాంధ్రభాషాప్రవర్తకసమాజమ"ని యొకటి స్థాపింపఁబడెను. గిడుగు వెంకటరామమూర్తిగారు "తెలుగు" పత్రిక ద్వారమున [1919–'20] హిందీవలన మహారాష్ట్రాదిభాషలలో సజీవసాహిత్యము వెలువడుటకు హేతువుల నుదాహరించుచుఁ బుంఖానుపుంఖములైన వ్యాసములఁ బ్రకటించిరి2. మన సాహిత్యము ప్రజావ్యవహారభాషాశోభిత మగుటయే వారిధ్యేయము. వ్యాకరణక్లిష్టమై సంకుచితమై లిగలిగి యలంకారభారముతో గూడినది పురాతనభాషయనియు, నింతకంటె సరళము, సరసమునైనది వర్తమానప్రామాణికభాషయనియు వారివాదము.

అట పిఠాపురము మహారాజావారిపోషణమున "నాంధ్రసాహిత్యపరిషత్తు" నొకటి నెలకొల్పి "పరిషత్పత్రిక" యను దానినొకటి నిర్వహించుచు గ్రాంథికభాషావాదమునకుఁ బోషకులైన జయంతి రామయ్యపంతులుగారును3 వారి యనుయాయులు కాశీభట్ల బ్రహ్మయశాస్త్రి, సుబ్బయశాస్త్రిప్రభృతులును వ్యావహారికము గ్రంథస్థము కాఁజాలదనియు వ్యావహారికమునకువ్యాకరణాదులు కూర్చుటయనఁగా నది తిరిగి గ్రాంథికమైపోయి వ్యవహారచ్యుతి నొందుటయే యనియు వాదింపఁజొచ్చిరి. ఇందు నందుఁగూడ నిట్టియెడ నతివాదులు ప్రబలుట సహజము. ఒక ప్రయోజనాపేక్షచే సమస్తసౌందర్యమును బలిదానముచేయవలెనని వీరనఁగా, వ్యావహారికము గ్రామ్యము నస్పృశ్యమునని వారనిరి. ఈ యిరుపక్షములకును మధ్య క్రమక్రమముగ నొక సమన్వయమార్గము పచేలిమము కాఁజొచ్చెను. వ్యాకరణసాధువయ్యు నాడంబరరహితమును సరళమయ్యు నగ్రామ్యమునునగు నొకానొక సారస్వతవాహికను సాధించుట యసాధ్యముగాదని యిందుమూలమున వ్యక్తమైనది.

(౨) వాఙ్మయస్వభావ ధర్మసంబంధి వివాదములు :

వాఙ్మయ స్వభావము ధర్మము ననువానికి సంబంధించిన యింకొకవివాదము రేకెత్తును. నాలుగుశతాబ్దులకావ్యదాస్యమువలనఁ గలిగిన దీ ప్రతిఘటన. ఇందు సంప్రదాయవాదము, భాషకును శిల్పమునకును బ్రహ్మరథముపట్టినది; భావములకు నుద్దీపనములకు నిందుస్థానములేదు. త్రాసునందు ముల్లింకొకవైపునకు మొగ్గుచూపెను.

---

1. Professor Stken know's letter [Vide, Vol. 1, No 1. Inner sides of the title pages]. Also not. the opinions of Sir. George A. Grierson, and Prof. R. W. Frozer [Vide. Vol. 1. No 2–Inner sides of the Title Pages].
2. 28–2–1919 [చూడుఁడు: 'తెలుగు' పత్రిక, సంపుటము 1, సంచిక 1, పుట 33 సెప్టెంబరు 1919].
3. Vide "A Defence of Literary Telugu.

వివిధపక్షములేర్పడినవి. జీవితము, వాస్తవికత యనువానిపై శ్రద్ధాభక్తులునిల్పియొక పక్షము, సాహిత్యమునుండి కళను బహిష్కరించి తా నేకాకియనిపించుకొన్నది. ఇంకొక పక్షము, పాశ్చాత్యమైనదెల్ల భూష్యము, భారతీయమైనదెల్ల దూష్యమునని స్థిర పఱచుకొనెను; ఇది పశ్యాదంధము. ఇట్టి నిశ్చయమువలన నెవ్వరునుదమభాషకు విశిష్టమై యున్న ప్రతిభ నెఱుఁగలేరు. సంప్రదాయోల్లంఘనమాత్రముగఁ బర్యవసించు నరాజ కత్వమే దీనికి లక్ష్యము. దీనికి సుస్థిరమైన నూతనమార్గనిర్మాణము దృష్టియేకాదు. దేశీయమైన జాతిరత్నములను వినిమయముగనిచ్చి విదేశీయములైన గాజుపూసలను విలుచుకొని వాని తళుకుబెళుకులకు నమ్ముడుపోవుట దీనికి నైజము.

విపరీతాభిరుచులుగల్గి సాంకర్యదూషితమైన సాహిత్యమునుమాత్రమే యీయీ వాద ప్రతివాదసాధనములు సృజింపఁగలిగినవి. ఈ నూతన సాహిత్య సృష్టియం దటు తెలుఁగునకుఁగల యందచందములుగాని, యిటు నాంగ్లమునకుఁగల జీవశక్తిగాని నెలకొని నట్లుఁ జెప్పరాదు. అయ్యు నాశాజనకమగు నొకపరిస్థితి యేర్పడినది. సమూలమగు సంస్కారమే యోగ్యమైన దనువారిసంఖ్య పెరుఁగుటయే యీ యాశావాదితకు మూలము. సంస్కృతుల యాంతర్యమెఱుఁగని బాహిరపు సమ్మేళనము సాంకర్యమనఁ బడునుగాని సమ్మేళనమనఁబడదనియు, సంస్కృతులసజీవమైన సమ్మేళనము తాత్త్విక పథమునఁ గలుగునేగాని భౌతికపథమునఁ గలుగదనియుఁ బెక్కురు గ్రహించిరి.

## 1 విమర్శనాత్మక మార్గము

### (2) సాహిత్య పరిశోధనము

బహుసంఖ్యాకులైన విమర్శక శ్రేష్ఠులు నిర్గమించిన భిన్నభిన్నకృషిమార్గము లిందు సూచింపఁబడును.

### (౧) విస్మృత వాఙ్మయోద్ధరణము

ప్రాతస్స్మరణీయులు స్వర్గీయ మానవల్లి రామకృష్ణకవిచరణులు ప్రాఙ్నన్నయ యుగాంధ్రవాఙ్మయోపలబ్ధికై దేశము నాలుగుచెఱఁగులయందును గాలించిరి; ఇనా లోకభాగ్యమునొందని యెందఱోకవుల కావ్యసంచయమును సంపాదించి మన భాష కమూల్యము నిస్సీమమునైన సేవ చేసియున్నారు. నన్నెచోడుని కుమారసంభవము నన్నయకాలముకంటెఁ బ్రాగ్భావమో ప్రాగభావమో కలదనుట యిచ్చట ప్రాకరణము గాదు. కాని యది మన జ్ఞానాభివృద్ధికిఁ దోడ్పడి, యాంధ్రభాషకు నుత్కర్షఁగూర్చిన విషయముమాత్రము సారస్వతదృష్టిచే ముఖ్యము.

దాక్షిణాత్యవాఙ్మయసంబంధియై విస్మృతమైన శతగ్రంథరాశి, యాంధ్రసాహిత్యపరిషద్వ్యవసాయమునఁ బ్రకటితమగుట బహుధా ప్రాకాశ్యము. నాఁటి సంయుక్త మదరాసురాష్ట్ర ప్రాచ్యలిఖితపుస్తకభాండార మీ పరిశోధనసందర్భమునందు నిర్వర్తింపఁ బడిన నిర్విరామమైన కృషికి నిస్తులనిదర్శన మనకతీరదు. డాక్టరు బ్రౌన్, కలొనల్ మెకంజై ప్రభృతి మహోదయులు సంరక్షించియిచ్చిన యనర్ఘ గ్రంథసంచయమునకు వారి యెడ నెంతకృతజ్ఞతఁజూపినను మన ఋణము నిరాదిష్ట మనలేము.

(౨) పరిశోధనాఫలితముల సమీకృతి

భిన్న భిన్న పరిశోధనశాఖలు సంసిద్ధముచేసిన విషయసంగ్రహమును బరిష్కరించి సంధానించుటవలనఁ గవి జీవితములు1, 'నాంధ్రకవులచరిత్రలు'2, 'విజ్ఞానసర్వస్వములు'3, 'వాఙ్మయచరిత్రలు'4, మున్నగువాని పేరిట నీ సమీకరణము సాధ్యమగుచువచ్చినది. ఇది యుత్తరోత్తర 'కవితరంగిణి' 5, 'ఆంధ్రవాఙ్మయచరిత్రసర్వస్వము' 6, 'నాంధ్ర సాహిత్యచరిత్రసంగ్రహములు' 7, నను వాని సృజనమునకు మార్గదర్శకముగూడనగుట గమనార్హాము.

(౩) జానపదసాహిత్య సంరక్షణము

కథలయు గేయములయు రూపమునఁ బ్రాఙ్నన్నయయుగమునకుఁజెందిన ప్రాచీనస్వదేశీయసారస్వతము సంగృహీతమై నేఁడు "జానపదగేయసాహిత్య" 8 రూపమునవెలువడుటకు బీజభూతముగ,నాఁడు సలుపఁబడిన నిరాయత(నిర్విరామ) పరిశోధనములే హేతువులు. మౌఖికమైన సాహిత్యముదైన విలువ క్రమక్రమముగ గ్రహింపఁ బడుచువచ్చినది. లాలిపాటలు 9 మున్నగు దేశీయచ్ఛందములఁగూర్చిన పరిశోధనలెన్నో నాఁడు జరిగియుండెను. "చాటుపద్యమణిమంజరులు," "ఆటలపాటల." 10 "శతక కవులు," 11 "పండుగపాటలు" 12 వంటివేగాక జానపదజ్ఞానసంచయము కొంతఁ గ్రమ క్రమముగాఁ బ్రకటీకరింపఁబడి13 నేఁటికి శాఖోపశాఖలై 14 విలసిల్లుట మన యదృష్టము.

---

1. కీ. శే గురుజాడ శ్రీరామమూర్తి పంతులు
2. కీ. శే. కందుకూరి వీరేశలింగము
3. కీ. శే. కొమ్మర్రాజు లక్ష్మణరావు
4. కీ. శే. వంగూరి సుబ్బారావు
5. శ్రీ చాగంటి శేషయ్య
6. శ్రీ శిష్టారామకృష్ణశాస్త్రి
7. ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము
8. శ్రీ నేదునూరి గంగాధరము మహాశయులు, డా॥ బి. రామరాజు
9. కీ. శే చేకునళ్ల రాజగోపాలరావు
10. కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి
11. కీ. శే. వంగూరి సుబ్బారావు
12. కీ.శే. నందిరాజు చలపతిరావు
13. డా॥ బి. రామరాజు "తెలుఁగు జానపదగేయ సాహిత్యము
14. డా॥ యస్వీ. జోగరావు "యక్షగానములు" మున్నగునవి.

(४) ప్రాకృతభాషా పరిశోధనము

ఆంధ్రభాషాక్రమపరిణామమునుగుఱుతించి బౌద్ధజైనాదిమతముల ప్రభావము మన వాఙ్మయముపై నెంతవఱకు నెగడిన దనెడి విషయమును నిర్ణయించుటకుఁగాను ప్రాకృతభాషలయందు జరిగిన పరిశోధనము నాలుగవమార్గమునకు సంబంధించును.

(౫) ద్రావిడభాషా పరిశోధనములు

ద్రావిడభాషల పరస్పరసంబంధము నాదానప్రదానముల పరిమితిని స్థిరీకరించు నిమిత్తమా యా భాషావ్యాకరణపదకోశముల యన్వీక్షణముగూడ జరిగినది[1]. తన్మార్గము, క్రమతః పరిణామముచే నేఁ డెందఱో మహనీయులకు[2] నుపాదేయ మయ్యెను. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే నీ దృష్టిపథముగలఁ 'బదకోశము' నిర్మింపఁ బడుచుండుటయు ముదావహము.

3 సాహిత్య విమర్శ

సహృదయతతో గావ్యగతకళాశిల్పసౌందర్యములను వెలువరించుట విమర్శనకు ప్రధానధర్మము. ఈ యుగమున నిట్టి నిర్మాణాత్మకవిమర్శనమందు రెండుమార్గము లనుగతములు. (౧) ప్రాచీనశాసనపరిశోధకులయు, లిపిశాస్త్రజ్ఞులయుఁ జరిత్రనిర్మాతలయు వ్యవసాయసహకారముతో మన సాహిత్యమునకుఁగల చారిత్రకపూర్వరంగ మెట్టిదో, నాఁటి వాతావరణపరిస్థితి యెట్టిదోగూడ నిర్మించుటకు యత్నములీ యుగమున సాగినవి[3].

పురాణేతిహాస మహాకావ్యాదులకు సవ్యాఖ్యానములు సవిమర్శకములునైన యావృత్తుల నాయత్తముచేసి కవి కాల కావ్యగుణ సాధుపాఠ సాంఘికస్థితిగతుల వివరణముతో వానికి విపులములైన యుపోద్ఘాతములనుగూడ గూర్చుట పరిపాటి యైనది.

(౨) సాహిత్యప్రక్రియల గుణగణనిర్ణయముదెసఁగాగూడ విమర్శన మనేకపత్రికలముఖమున బురోగమింపఁజొచ్చెను. విమర్శనకు నిర్మాణాత్మకవిధి యెంత ముఖ్యమో సాహిత్యమును గ్రమబద్ధమొనర్చువిధియు నంతముఖ్యము. దానికిఁగల సారస్వతసంబంధమగు సమ్యగ్దృష్టివలనఁ బ్రబంధప్రక్రియక గ్రతాంబూలము నిచ్చుటయనునది క్రమికము

1. బుఱ్ఱా శేషగిరిరావు, కళాప్రపూర్ణ స్వర్గీయ గిడుగు వెంకటరామమూర్తి పంతులు ప్రభృతులిందుఁ బ్రసిద్ధులు.

2. బ్రహ్మశ్రీ వజ్ఝల చిన సీతరామశాస్త్రి, ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజి, డా॥ బి. కృష్ణమూర్తి, డా॥ దివాకర్ల వెంకటావధాని ప్రభృతులు.

3. కీ. శే. జయంతి రామయ్యపంతులు; కీ. శే కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులు.

సాంక్రామికమునగు నొక సముదాచారము. వివిధసారస్వతజ్ఞానపౌష్టికమైన నాఁటి విమర్శన మీ సదాచారమును బ్రతిఘటింపఁజొచ్చెను. సమూలసంస్కారవాదులైన విమర్శకు లీ యుగమునఁ బ్రబంధములపై దండయాత్రకు నడుముగట్టిరి. శృంగార రసముయొక్కనీతి పరతయు నప్పటి యాలంకారికరచనోపయోగితయువీరికి నిష్ఠురము, ద్రష్టవ్యమునైనవి. శ్లేషదిగ్ధము దగ్ధయోగ్య మయ్యెను. సాహిత్యమూల్యముల వ్యత్యస్త వ్యవస్థీకరణము జరుగఁజొచ్చినది[1]. అందును బ్రజాసాహిత్యమున కర్హమగు స్థానమును సంపాదించిపెట్టుటకై "శతకకవుల"యందుఁ బ్రయత్నముజరిగెను.

తమ పాండిత్రీప్రతిభలకు సూక్ష్మబుద్ధియుక్తికి సహకారసానుభూతియుతనవ్యసాహిత్యపరామర్శసామర్థ్యమునకును, సమకాలికవిమర్శకులలో కీ.శే.కాశీభట్ల సోదరులును బేరెన్నికఁగనిరి. కుశాగ్రమగు బుద్ధితో సాంప్రదాయకమైన సాహిత్యమునందలి గుణ గ్రహణ మొనర్చుట యొక్కటియే కర్తవ్యమనియు, నది యే ప్రతినిర్యాతనములకును[2] బ్రతిఘటనలకును బ్రతియోగవిధానమనియు వారి కనుభవవేద్యమయ్యెను.

కావ్యకళాశిల్పప్రాశస్త్యమునకు విలువఁగట్టి వెల్లడించుటయను విశిష్టార్థమునందు సాహిత్యవిమర్శన యనునది మనలో నాఁటిదియు నేఁటిది యుఁగాదు. కవిత్రయము కాలమునుండికూడఁ బూర్వకవిస్తవము, కృతిభర్తృకృతకవిస్తుతి స్వీయకవితాంశ వివరణము, కవి శపథములు ననిదీనికి నభిదాంతరములు

## II సంప్రదాయ మార్గములు

ఆనాఁడు నవ్యకవిత్వముతోఁబాటుగ నితిహాసకావ్యరచనముల చారిత్రకసంప్రదాయముగూడఁ బాటింపఁబడుచుండెడిది. కాకున్నచో నారచనలు నూతనమై బహుభిన్నరూపము దాల్చిన వాతావరణమున సృజింపఁబడెడివి. పురాతనవిద్యలయందు శిక్షితులైన కవులు పురాతనవిభాగములయెడ భక్తిశ్రద్ధలునిలిపి కావ్యరచన సాగించుచునే యున్నారు. సాహిత్యవిషయములలో వీరు సంప్రదాయపాఠకుల పక్షమునకుఁ బ్రతినిధులు. వీ రాంగ్లసాహిత్యముచే బ్రత్యక్షముగఁ బ్రభావాన్వితులుగాలేదు. కాని యానాఁటి పాశ్చాత్యసంస్కృతి పరోక్షముగ సహప్రాధికమార్గములయందు, సూచ్యముగనో సంపర్కమూలకముగనో, వారిపైఁ బ్రభావము నెఱపనే నెఱపినది. వారి కృతులు నవ్యతాస్పందితములు. కావ్యలక్షణములయందలి యపరిష్కృతిఁ బరిహరింపఁబడెను. ప్రాచీనమైన మృదుత్వము, నర్వాచీనమైన పరువముతో మనోజ్ఞముగ నన్వయించిన రచనావిశేషమున కాలంకారికరచనము తావొసఁగినది. కథకు వర్ణనమిమించిన ప్రాధా

1. కీ. శే. డా. కట్టమంచి రామలింగారెడ్డి "కవిత్వతత్త్వవిచారము." కీ. శే. వంగూరి సుబ్బారావు "శతకకవులు" నీ సందర్భమునఁ దార్కాణింపఁదగినవి.
2. Reactions.

న్యము గలిగెను. అవయవసౌష్ఠవ సమతాగుణముల పరిశీలనము పెరిఁగినది. కీ.శే.తిరుపతి వేంకటేశ్వరకవులు, రామకృష్ణకవులు, కొక్కొండ వేంకటరత్నము, వడ్డాది సుబ్బారాయఁడు, దేవులపల్లిసహోదరులు, మున్నగువా రీ మార్గములో ప్రధానభూతులు.

## III సృజనాత్మక మార్గము

మనకు ముఖ్యమైన సృజనాత్మక నవ్యసాహితీవిషయము నిచ్చట నించుకఁ బరిశీలించినఁ జాలును. ఆంధ్రసాహిత్యనిర్మాణదృష్టియం దేర్పడిన పరిణామము, విమర్శనాత్మకకృషిఫలిత మనుటకంటె మన సాహిత్యకజీవితాధారముల పరివర్తనమువలనఁగలిగిన యొకధర్మముయొక్క పరిణామమనుట యుక్తము. మన పూర్వకవిత్వమున క్షీణత పొడచూపినది. ఇది సుమారు నాలుగు శతాబ్దులనుండియు వ్యక్తమగుచునే యుండెను. సాహిత్యమునందలి జీవశక్తులు ప్రేటుబడుచుండుట దీనికి ప్రధానహేతువు. కాని యీ సత్యము శాబ్దికత మాటున ముసుఁగువడి యుండెడిది. చైతన్యప్రదములైన జీవితసాగర జలవాహములతో గవి విచ్ఛేదముచేసికొనుటవలన సాహిత్యమునం దిట్టి రక్తహీనత ప్రబలుచుండును. ఇది యతనికిని వాస్తవికవిషయములకును సంబంధము దూరమగుటవలనఁ గలిగిన ఫలితము. జీవితవాస్తవికవిషయములతో నాతనికి సంబంధ మెన్నఁడో త్రెస్సిపోయినది. స్వయంనిర్మిత కృత్రిమోహజగద్విహారమే కవికి జీవితసర్వస్వమయ్యెను. ఆ నిర్మాణమందుకూడ స్వతంత్రించుశక్తి చాలనికవులకుఁ బండితులు వైయాకరణులు నాలంకారికులు నొసఁగిన ప్రణాళిక ననుసరించి పోవకతప్పలేదు. వారు కవులకు సహాయులేగాని మార్గదర్శకులుగా రన్నవారు లేరు. అందుచే గావ్యములలో నిర్జీవప్రతిమ లనఁదగు నాయికానాయకుల సృజనము జరిగినది. వారి వర్ణనమందు మంచి ధాతువుగల రంగులలేపనము జరిగినదేగాని సమ్మేళనము జరుగలేదు. దానితో గొయ్యబొమ్మలవంటి పాత్రలు సిద్ధమైనవి. వాని రసభావముల పరిమాణ మితఃపూర్వమే యాలంకారికులచే నిర్ధారితము. అట్టి చిత్రములు కృతకములేగాక చర్వితచర్వణముగ వచ్చునట్లుఁగూడ విసుగుగొల్పును. వాని భాషగాని భావములుగాని తరతరముల నుండియు వినఁబడుచున్నవే ! ఈ పరిస్థితులలో నన్యులకుఁ జొరరాని యిట్టి యినుపకోటను భేదించుకొని నూతనజీవితము మనలోనికి జొచ్చుకొనివచ్చినది. కవితోత్సాహమునకు స్వేచ్ఛాస్వాతంత్ర్యములు లభించెను; స్థిర పురాణభావముల బంధములు తొలఁగినవి. ప్రపంచభావముల సంపర్కమువలనఁ గలిగిన యలౌకికప్రయోజనము లనేకములు. నిరుత్సాహము నొందుచున్న శక్తుల పునరుజ్జీవనమందులో ప్రధానమైనది. ఆశకుఁ గట్టిన కొండి చిదుమఁబడుట యింకొక ప్రయోజనము. యౌవనప్రౌఢత్వములు పునర్జీవము నొందిన వనినచోఁ దదలౌకికప్రయోజనమువలన వెల్లివిరిసిన చైతన్యమును సంగ్రహముగ వర్ణించుటయే యగును. అట్టి చైతన్యప్రవర్ధితసాహిత్యోద్యానమున మూఁడు వీథు లేర్పడుచున్నవి.

## (1) జ్ఞానప్రవర్తక సాహిత్యోద్యాన వీథి.

ఆంధ్రవాఙ్మయమున కనువాదతృష్ణ యొక యాజన్మప్రేరణము; సహజావబోధము. అందును ననువాదములతో నిరువదియవశతాబ్ది ప్రారంభమైన దనవచ్చును. అనఁగా నీ ప్రకరణమున సమీక్షింపఁబడుకాలము మానుపట్టుచున్నగాయము తిరిగి రేఁగినకాలము. కీ.శే వీరేశలింగముపంతు లారంభించిన యనువాదము1లతో నీ జఠరాగ్ని ప్రజ్వరిల్లెను. సంస్కృతరూపకము, వంగభాషాకవిత్వము, ఫ్రెంచినవలలు, రష్యనుకథలు, కళ, చరిత్ర, విజ్ఞానశాస్త్రముమున్నగు సమస్తము నీ యనువాదసాహిత్య శ్రేణిలోనివే! ఈ వీథియందు నాటఁబడిన వృక్షపంక్తులే విజ్ఞానసర్వస్వ2 పరామర్శ గ్రంథజాలపు సృష్టియు ననుట యుక్తము. ప్రపంచసంస్కృతిసంపద నాంధ్రపాఠకుని దృక్పథమున నిల్పునుద్దేశములతో విజ్ఞానచంద్రికామండలి యిప్పుడే తన ప్రకటనల నారంభించినది.4 కీ.శే. చిలుకూరి వీరభద్రరావు రచించిన "ఆంధ్రులచరిత్ర" మున్నగు వానినిగూడ నీ కోవలో జేర్పఁదగును.

## (2) సామరస్య సాధకసాహిత్యవీథి :-

### (౧) రూపకము :-

నాటకము, నవ్యవచనము, సాక్షేపకావ్యము, నవ్యకవిత, నవల, కథానిక మున్నగునవి యీ విభాగమునకుఁజెందు నవీనసాహిత్యప్రక్రియలు. ప్రాచ్యపాశ్చాత్య భావనాస్రవంతుల సంగమము వీనికిస్థానము. ప్రాచీనయుగములయందుఁ బాదము లూనియు భావియుగములలోనికి చేతులుసాచు నాంగ్లవిద్యాధికులగు నాంధ్రయువకుల సర్వస్వామ్య మీ నవ్యసాహిత్యమనుట సత్యము. ఆంధ్రమునందు స్వతంత్రనాటకరచన మొక యాధునికసాహిత్యశాఖగా వ్యాపింపఁబూని సరిగ నిప్పటికొక శతాబ్ది5. ఐనను రంగప్రదర్శనములు చిరకాలమునుండియు నున్నవి. పగటి వేషములు6. వీథినాటకములు7 మున్నగునవి రూపకముల యపరిష్కృత రూపములు. శ్రీనాథుఁడును పింగళి

---

1. Lamb's "Tales from Shakespeare"
2. కీ శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారిచే ఆంధ్రవిజ్ఞానసర్వస్వప్రకటనము క్రీ.శ. 1912.
3. Reference books. 4. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపన _క్రీ.శ. 1906.
5. కీ శే. కోరాడ రామచంద్ర శాస్త్రి "మంజరీ మధుకరీయము"_ రచన 27_11_1860. చూడుఁడు :_"తెలుఁగు నాటకానికి నేఁటితో నూరేండ్లు"___ వ్యాసకర్త శ్రీ వాత్సవ; [ఆంధ్రప్రభ_దిన పత్రిక. 27_11_1960] అట్లే చూడుఁడు:_ "నాటకరంగము"[తెలుగువిజ్ఞాన సర్వస్వము_ మూఁడవ సంపుటము, తెలుఁగు సంస్కృతి, పుట 897_(1959) అట్లే, చూడుఁడు "ఆంధ్రవాఙ్మయ చరిత్రము" పుట 155_డా॥దివాకర్ల వెంకటావధాని. 1958. ప్రథమావృత్తి
6. Day Light Plays. 7. Street plays.

సూరనార్యుఁడును1 తమ తమ కాలములలో నాటకరంగాభ్యుదయము నొకింతగ నెఱిఁగియున్నవా రన్నట్లూహింప వీలగుచున్నది. ఓరుగల్లు రాజధానీనగరదృశ్యములుగల "క్రీడాభిరామము" ప్రథమాంధ్ర మౌలికరూపకవిశేషమే యనిగూడఁ గొందఱవాదము. దీనికర్త వల్లభామాత్యుఁడు తాను "పలనాటివీరచరిత్ర"లోని కొన్ని భాగముల నొకస్త్రీ ప్రదర్శింపఁగా జూచినట్లుఁ జెప్పినాఁడు. పిమ్మటివి పదునెనిమిదవ శతాబ్దినాటకములు. అవి బాలసరస్వతి విరచిత "రంగకౌముది", కంకంటి పాపరాజ విరచిత "విష్ణుమాయావిలాసము" మొదలైనవి. దాక్షిణాత్యవాఙ్మయమునఁ బ్రవర్ధిల్లిన 'యక్షగానము' లసంఖ్యాకములు. ఆ వాఙ్మయము వీనికిఁ బట్టుకొమ్మ. యక్షగానములు రూపకశాఖయందుఁ జెప్పఁదగిన దేశిరచనావిశేషములు.

భారతదేశమునఁ బ్రదర్శింపఁబడిన షేక్స్పియరు మహాశయుని నాటకముల ప్రభావమే మన యాధునికనాటకోత్పత్తికి హేతువనుట నిజము నూహించుట. క్రీ.శ. 1881లో వామనభట్టుజోషి యాధ్వర్యవమున నిర్వ్యాఘమైన ధార్వాడవారి హిందీ నాటకములయుఁ బారసీకుల రంగప్రసాధనములయుఁ బ్రభావమే యాంధ్రనాటకాభివృద్ధికిఁ దోడ్పడినది. మహారాష్ట్రమునుండి సంచారముగవచ్చిన "జంఖండీ"సమాజము గూడ మనవారిని నాఁడు బళ్ళారిలో నుత్సాహపఱచినది. ధార్వాడవారి సమాజము విచ్ఛిన్నమైన పిదపఁగూడ క్రీ.శ. 1885లో దాని శాఖయే "పూనాసాంగ్లి" సమాజ మనెడి పేరిఁట కాశీనాథపంత్ మహనీయుని యాజమాన్యమున మఱల మనకుఁ బ్రోద్బలక మయ్యెను.

స్థూలముగ నాఁటి నాటకములు మూఁడుతెఱఁగులైనవి :—

1. సంస్కృతాంగ్లనాటకములను మూలాధారములుగఁగలవి.
2. సాంఘిక ప్రహసనములు.
3. చారిత్రక నాటకములు.

ఒకటిరెండువినా నాఁటి యీ నాటకములన్నియు సాధారణప్రజ్ఞాసమన్వితములేగాని యసాధారణప్రజ్ఞాధుర్యములుగావు. రచయితలకు, నటులకునడుమ నా నాఁడొక యాజన్మవైరమున్నట్లుఁ దోఁచును. ప్రజాదరమును జూఱఁగొన్న రూపకములు సాహిత్యకముగ నమూల్యములైనవి కావు. సాహిత్యకమూల్యముగలవి ప్రజాదర పాత్రములు గావు.

1. "భాగోతుల బుచ్చి గానికిన్" శ్రీనాథుఁడు- చాటుపద్యమణిమంజరి: ప్రభావతీ ప్రద్యు మ్న ము-పట 79.

1. సంస్కృతాది మూలకములు :-

అనంతమైన కథావస్తుసంపదతో బురాణములు నాటకరచనల కాధారములు గాగలవు. ఇట్టివానియందుకూడ ననువాదములతోడనే ప్రారంభము. కీ.శే. పరవస్తు రంగాచార్యుల 'శకుంతల'యు కీ.శే. కొక్కొండ వెంకటరత్నముపంతులు 'నరకాసుర విజయము'ను కీ.శే. వడ్డాది సుబ్బారాయని, 'మల్లికామారుతము', 'వేణీసంహారము', 'శకుంతల', 'విక్రమోర్వశీయము'ను సంస్కృతమునుండి నాడు జరిగిన యనువాదము లలో గణనీయములు.

ఈ తెగకుఁ జెందిన తదితరనాటకములలో 'మృచ్ఛకటికము', 'రత్నావళి', 'ద్రౌపదీవస్త్రాపహరణము', వంటివి గలవు. పురాణగాథలనుండి యుద్ధృతములైన కథ లతో నిర్వహింపఁబడిన స్వతంత్రనాటకముల రచనమూలమున ననువాదములు వెనుకఁ బడిపోయినవి. కీ.శే. ధర్మవరపు కృష్ణమాచార్యులు లోకప్రియత సంపాదించిన పురాణ నాటకకర్త. వీరి 'చిత్రనళీయనాటక'ప్రదర్శనము బహుప్రసిద్ధిఁ గన్నది. కీ.శే. వేదము వేంకటరాయశాస్త్రి నాటకములు సాహిత్యకగుణము విషయములో ప్రశస్తములు.

2. సాంఘిక ప్రహసనములు :-

కీ.శే. వీరేశలింగముపంతులుగారే కొన్నికొన్ని చిన్న ప్రహసనములను బ్రహ సనప్రాయములైనవానిని నిర్మించిరి[1]. ఇవి ప్రజామోదమును జాల సంపాదించుకొన్నవి. ఇందు సాంఘికదోషములు, దురాచారములును దూయఁబట్టఁబడెను. ఇట్టి మృదుహేళ నాత్మకములైన రచనలు నాఁడింకను బెక్కు వెలసినవి. కీ.శే. గురుజాడవారి 'కన్యా శుల్కము'ను, కీ.శే. పానుగంటివారి 'కంఠాభరణము'ను నిట్టి సాపేక్షదృశ్యకావ్య ములే యనకతీరదు.

3. చారిత్రక నాటకములు :-

చరిత్రాత్మకనాటకములకు మార్గదర్శియైన కీ. శే. కోలాచలము శ్రీనివాస రావు కావుటకు సాధారణప్రతిభావంతుఁడే కాని 'పృథ్వీరాజు', 'విజయనగరపతనము ననునవి యీతని సుప్రసిద్ధరూపకములు. ఇవి రెండును విషాదాంతములగుట యొక విశే షము. ఇంతకు మునుపిట్టివానికి భారతీయ నాటకసాహిత్యమునందుఁ బ్రాతినిధ్యము లేదు. "విజయనగరపతనము" జాతిపరమైన యంతర్ద్వంద్వమునకు ముకురము వంటిది. విజయనగరరాజులలో దుదివాఁడు రామరాజు. ఇతని కొక మహమ్మదీయ యువకుఁ డధర్మపుత్త్రుఁడు. ఆతఁ డితనిని నమ్మి సేనాధిపతిగా నొనర్చుటచేత "తల్లికోట" యుద్ధము మన దురదృష్టమునకు నిదర్శన మయ్యెను. యుద్ధబంధితురాలైన యొక

1. "బలాత్కార గానవినోద ప్రహసనము", "మహావంచక ప్రహసనము", మహాబధిర ప్రహసనము", "వేశ్యాప్రియ ప్రహసనము" వంటివి పెక్కులు.

మహామ్మదీయయువతి నాటకనాయకుఁడైనసేనాధిపతికిఁ బ్రియురాలు. తన్ను బంధించి యవమానించిన రామరాజునెడఁ బ్రతీకారము చేయఁగోరి యాతని యధర్మపుత్త్రుఁడైన యీ సేనానాయకుని రాజద్రోహమునకుఁ బ్రోత్సహించి యామె కృతకృత్యురాలగును. ఒక క్లిష్టసమస్య, నాయకుని ప్రాణముల నిందుఁ దన పిడికిటఁబట్టుకొన్నది. తన జాతిధర్మము, ప్రేమధర్మము నాతని నొకవైపున కాకర్షించును. కఠోరవిధినిర్వహణము, పితృణముక్తి యను ధర్మము లింకొకవైపున కాకర్షించును. రసభావముల యంతర్ద్వంద్వ సంఘర్షములో ద్రొక్కుడుపడిన నాయకుఁడు రణరంగమునం దున్మాదియై పితృహత్య కొడఁబడి పిదప నాత్మహత్యకుఁ బాలుపడినాఁడు.

ఇతర చారిత్రకరూపకములలో సర్వ కీ. శే. కొప్పరపు సుబ్బారావు "రోషనార," వేదము వేంకటరాయశాస్త్రి 'ప్రతాపరుద్రీయము,' శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి "బొబ్బిలియుద్ధము," ధర్మవరపు కృష్ణమాచారి విరచిత "సారంగధర"యుఁ బేర్కొనఁదగినవి. ఇట్టివి మునుముందు రానున్న నాటకోచిత నవలలకు దారితీసెను.

## 2 ఆధునిక వచనము

(౨)ఆంధ్రవాఙ్మయమునందుఁ బదునెనిమిదవశతాబ్దివఱకు విశ్వజనీనమైన భావవ్యక్తీకరణసాధనముగా బద్యము పర్యుపాసితము. ఉన్న వచనమే కొంచెము. అదియుఁ బద్యస్థాయిఁగల గద్యము; పద్యములనడుమ యెప్పుడో యించుక మెఱసెడిది. ఈ పదునెనిమిదవ శతాబ్ది వచనమునకు సాహిత్యకదృష్టికంటెఁ బ్రయోజనాపేక్ష యధికము. అద్యతనముగ వాఙ్మయమునందు వాదోపవాదములు చెలరేఁగిన కారణముచే గద్యపద్యముల సీమాభూములు సుస్పష్టముగ నిర్ణయమయ్యెను. మనసాధారణ ప్రజానీకమునకార్థికస్థాయి పెరిఁగి విశ్రాంతి లభింపఁగానే వచనరచనము దృష్టి చదువుసంధ్యలపై మఱలుటయొక యదృష్టము.గద్యావశ్యకతయొక్క నిర్దుష్టదర్శనము దీనిమూలమున మనలో లభించినది.కావ్యయుగమునందలి గద్యముకంటెను, నన్నపార్యుని గద్యముకంటెనుగూడ నేఁటి వచనముసరళము, శ్రావ్యము, పరిపక్వమునై లావణ్యమునుగూర్చుకొన్నది. దీనికి కీ. శే. కందుకూరివారి వచనమే లక్ష్యభూతము. కీ. శే. పరవస్తుచిన్నయసూరి తన పంచతంత్రమున వచనమునకువైశద్యము తోబాటు సౌందర్య స్ఫూర్తి యుఁ గల్గించినాఁడు.

### సాక్షేప కావ్యములు

(౩) క్రీ. శ. పదునెనిమిది పందొమ్మిది శతాబ్దులలో హేళనకావ్యనిర్మాతలుగా నిర్వురుకవులు ప్రసిద్ధులు. వారి పరిహాస మెందును నపరిష్కృతము. పర్యనుయోగము [దూషణార్థమగుజిజ్ఞాస] గలది వారిబుద్ధి. ఆ పరిహాస మెడనెడ నశ్లీలములకుఁగూడఁ బాల్పడును. మనసు నొవ్వఁజేయుటయే దాని పరమావధి. జగ్గకవి 'చంద్రరేఖావిలా

పము' నికృష్టహాస్యోపహతమయ్యు నీషద్గుణసనాథము. ఇది ధనికస్వాములైన నాఁటి 'జమీందారుల' కామలాలసత నధిక్షేపించును.వారి జీవితమునఁగల పాశవిక కాముకతయు నవినీతి నీచతయు నిందు దృష్టాంతీకరింపఁ బడినవి. ఈ యాక్షేపకావ్యములో నసభ్యతకు, దాంభికతకునువారు నింద్యులు. జగ్గకవి దూషణప్రగల్భతలోనుతోఁచుఁడు. ఆంగ్లమున పోప్ మహాకవి యాక్షేపకరచన1 వంటిది"రావణదమ్మీయము"ను "లంకా విజయము2. ఈ మనయుగములో గిరశము 3. వికటత్వమున కుదాహరింపఁదగినది.

ఆంగ్లేయుల హాస్యానుసారముగ నీ యుగములో నొక ప్రహసనవిశేషము మనయందొక నూతనసాహిత్యప్రక్రియగా నుద్భవించెను. కీ.శే. వీరేశలింగముపంతులుగారి ప్రహసనములు సాంఘికాచారముల నవహేళనముచేయుటకుఁ జాలియున్నవి. వానిది యుల్లాసముగొలుపుఁ బరిహాసరసికత; నిర్దయముగాని సాంఘికవిమర్శన; నిశితమయ్యును వేధశ్రమము గలిగింపనిది వాని పరామర్శ. అవి లఘుపరిహాసకుశలములైన రచనలు. కీ.శే. పానుగంటి లక్ష్మీనరసింహారావు, కందుకూరివారికి నర్హుఁడైన యుత్తరాధికారి. వీరి హాస్యము పరిశుద్ధమై మిఱుమిట్లుఁగొలుపుచుండును. కాఠిన్యదూషితముగాని దీని యాశయము సాంఘికదురాచారముల నిర్మూలనము.

## 2 ఆధునిక కవిత్వము

(అ) అభ్యుదయోదర్కమైన నాఁటిసాహిత్యప్రక్రియలలో నిది బహుప్రధానమైనది. ఆధునిక నవలానాటకములవలె నిది యనుసరణాపకీర్తిదూషితమైనది కాదు. ఒకవంక వంగసాహిత్యము నింకొకవంక నాంగ్లమును గంభీరప్రభావము దీనియెడ నెఱపినమాట నిజము. కాని వస్తువిధానముల రెంటిలో దేనినిగూడ నిది వానినుండి స్వీకరింపను, ననుసరింపనులేదు. ఇది మన జాతిలో జిరకాలము నంతర్నిగూఢములైయున్న సాహిత్యరీతులయొక్క లబ్ధము. సంపిహితములైన యాశక్తులు కార్యాచరణమునం దిప్పుడు జాగ్రుతములైనవి. బహిర్జగమునుండి నూతనశక్తు లురవడించుటయే యీ జాగృతికి మూలకారణము. దేశికవితాలతకు కుసుమ పునస్సముద్గమకాలమును సూచించుటయే యీ యాధునికకవిత్వ పరమోద్దేశము.ఆంధ్రుని బుద్ధి తల్లతయందుఁ బుష్పించి ఫలింపఁ గలుగుటకే యీ యుగమొక రంగభూమియైనది. అనాదినుండియు మనకవులు సంస్కృతభాషాసంస్కృతుల సామ్రాజ్యములో విహరించు పాంథులు. వారి గృహోన్ముఖత కీ యాధునికకవిత యొక స్వాగతగీతిక.

---

1. Dunciad.
2. పిండిప్రోలు లక్ష్మణకవి.
3. కీ.శే. తిరుపతి వేంకట కవులది.

ఈ స్వాగతగీతిక నాలపించియుండవలసినవారు శ్రీ. వీరేశలింగముపంతులుగారు. 'సరస్వతీనారదవిలాసమ'ను వారి ఖండకావ్య మీ యర్థమును సుస్పష్టముగ సూచించును. కాని యట్లు జరుగలేదు. వారిదృష్టి పద్యమునందు నూతనమార్గాన్వేషణావశ్యకతను గుఱుతించియు, ననివార్యకారణములచే గద్యముదెసఁగా బ్రసరించినది. వారుఁ 'గద్య తిక్కన'లైరి. నవ్యకవితానిర్మాణ మొరులుకావించుట ఘటిల్లినది.

ఆంధ్రదేశ మా కాలములో రాజకీయసాంఘిక సారస్వత క్షేత్రములయందు నానావిధోద్యమముల కాలవాల మైనది. ఒక్కొక్క యాలవాలమునుండి యొక్కొక్క విధమైన కవితాలత విలసిల్లఁజొచ్చెను. హూణభాషాభ్యాసప్రభావముచే నావిష్కృతమైన యొకానొక యుద్యమము కాల్పనికోద్యమము. దీనికే భావకవిత్వోద్యమమనియు వ్యవహృతి. ఏతత్ప్రభావమున సృజింపఁబడిన కవిత్వము చాలవఱకు సమకాలీనసాహిత్యక పత్త్రికలలో వికీర్ణమై యున్నది. ఈ వెదజల్లఁబడినదాని మూల్యమును నిర్ణయించుట కాకాలమందున్న సాధనసంపత్తి బహుస్వల్పము. కాని యెంతబీజభూతమై యున్నను నున్నంతలో నాఁటి కవితాసామగ్రిని లఘుకృతులు, ఖండకావ్యములు, ఆత్మాశ్రయకవిత, ప్రకృతికవిత్వము, మర్మకవిత్వము నని విశ్లేషింపవచ్చును.

లఘుకృతులకు, గథావలంబన ముండును. అయ్యునది యనావశ్యకములగు వర్ణనలకుఁ దావలము గాదు. అది నూతనప్రణయసూక్తముల పునశ్చరణమహత్త్వము గలది. ఆ నవ్యప్రణయమునకుఁ గ్రమక్రమముగ 'నమలినశృంగారమ'ని పేరుగలిగెను. తాదృక్‌శృంగారపోషకములగుచు రచింపఁబడిన చిన్నచిన్నకావ్యము లీ లఘుకృతుల శాఖలోనివి. ఇవి పరిమాణమునుబట్టి ప్రబంధముల యంతటివి గావు. కాని సమగ్రత్వమునుబట్టి యట్టివే!

వస్తువుయొక్క యేకదేశవర్ణనముగలిగి పరిమితమైన రూపముతోగూడిన కావ్యవిభాగములు ఖండకావ్యములు. ఇందలికథకు సమగ్రత యుండదు. ఒకానొక సన్నివేశమునుగాని ఘట్టమునుగాని చేఁబట్టి కవి దానినిగుఱించి తనకుఁగల యుష్ణకములైన భావముల సూక్ష్మలతతో వెల్లడిచేయును. దేశమున వివిధపత్రికలు వెలసినవి. వానిలో దమరచనలను బ్రకటింపవలెనని యువకవు లుత్సాహపడిరి. వీరి యుత్సాహమువలననే పత్రికలు బయలుదేరిన వన్నవా రున్నారు. కానీ పత్రికలు కవులకిచ్చిన ప్రోద్బలమే యధికము. ఆంగ్లభాషయందుకూడ నిట్టి ఖండకృతు లధికము.

ఆత్మాశ్రయకవిత్వ మనఁగా నుత్తమపురుష మన్నమాట; కవి తన్నుగూర్చి తా జెప్పుకొను కవిత్వము. ఆత్మభావములను స్వీయమనస్తత్వమును విస్తరించి వర్ణించుట దీనికిఁ బరిపాటి. ఇది పరభావముల జాడకుఁ బోదు.

భౌతికప్రకృతినిజూచి తన్మయీభావమునొందుచుఁ గవులుచెప్పినది కవిత. ప్రకృతి సౌందర్యచిత్రమును జానపదజీవితచిత్రమునుగూడఁ బ్రకృతికవిత్వమునందలి యంతర్భాగములే!

ఐదవది మర్మకవిత్వము. దీనిని దార్శనికకవిత యనుట ధర్మము. ఇందు తత్త్వ జిజ్ఞాస యధికము. ప్రాశ్చాత్యుల నిర్వచనములను బట్టి యిది తత్త్వసంబంధి. ఇందు మార్మికతయు నుండవచ్చును. తాత్త్వికవిషయములు సాధారణపాఠకులకు గూఢములుగఁ దోఁచుట యసంబద్ధముకాదు.

భావకవితాలవాలమునఁ బొడమిన యీయైదు లతలు దేశములో నాలుగుచెఱఁగులందుఁ బొదివి చిగురుఁబొదరుటీరము అల్లుకొన్నవి.

క్రీ. శ. ప్రథమదశకమునఁ 'క్రొత్తప్రాఁతల మేలుకలయిక క్రొమ్మెఱుంగులు జిమ్మగా' కీ. శే. గురుజాడ అప్పారావు నూతనఛందములో నూతనభాషలో నూతన పద్ధతిలో భావకవితాగీతి తొలిసారిగ నాలపించెను. అతనిది పంచమము, మధురమునై జీవరేఖగల కంఠము.

దీనితో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి గాత్రసౌష్ఠవముగూడ సంవదించినది. కాని కవితాంశమునందు రాయప్రోలువారికిని కీ. శే. గురుజాడవారికిని హస్తిమశకాంతరము. గురుజాడవారి ఘనతవేఱు.అది భిన్నమార్గములు కలది. శ్రీ రాయప్రోలువారు నవ్యకవిత కాద్యులు. "లలిత" యను ఖండకావ్యము ప్రకటించినపిమ్మట వారు "తృణ కంకణము" పీఠికలో తమది వస్తువిస్తరణములేని భావప్రధానమగు కావ్యమని సూచనగ నుడివిరి.

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు శ్రీ గిడుగు సీతాపతిగారిని సంప్రతించి క్రీ. శ. 1914 ప్రాంతమున నాంధ్రపత్రికయం దొక సమీక్షలో దీనికి 'భావకవిత్వ'మని నామకరణముచేసియున్నారు.

సుమారదేకాలమున శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు శాంతినికేతనమున స్వర్గీయ రవికవీంద్రుని సాన్నిధ్యమున సాహిత్యాధ్యయనము ముగించుకొనివచ్చి నవ్యకవితారీతులలో రచన కుపక్రమించిరి. వీరిది మధురమార్గము. అది ప్రసన్నతకును సంప్రదాయపాటీకతకును బేరువడినది. దేశభక్తికి, నాత్మసౌందర్యమునకు, నాధ్యాత్మికప్రేమకును వీరి కవిత్వము ప్రసిద్ధి.

కీ. శే. దువ్వూరి రామిరెడ్డి "కృషీవలుఁడు" ప్రాఁతపుంతలనుండి వేఱుపడిన నవ్యమార్గములో నడచెను. అదియొక కర్షక జీవితచిత్రణము; ఋతుక్రమవర్ణనము; సస్యశ్రీచిత్రము. షెల్లీమహాకవి రచించిన పెక్కు గీతములను బోలు కొన్నిరచన లిందు

న్నవి. అందును 'భరద్వాజపక్షి'1నిగుఱించి యాతఁడుగూర్చిన గేయము లితని కుపాస్యములు. కీ. శే. కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరి "సూతపురాణము," కీ. శే. ఏటుకూరి నరసయ్య "మగువమాంచాల," "క్షేత్రలక్ష్మి"యుఁ బ్రసిద్ధములు. "కృషీవలుఁడ"ను కావ్యమునందలి సూచ్యార్థము మనోజ్ఞమైనది. తత్త్వార్థముగూడ నిందు ధ్వనించును. అందలి సూర్యాస్తమయము జీవాత్మయొక్క లోకాంతర ప్రయాణమునకు గుఱుతు. అందలి కంకణక్వణము తత్త్వసంబంధమైన గీతముల మధురాలాప భ్రమను గలిగింపఁగలదు.

## ౨ నవల

'నవల'యను పదము తెలుఁగువాఙ్మయమునందుఁ బూర్వము లేదు; అందుచే దాని కా నాఁడు వాఙ్మయమునఁ బ్రాతినిధ్యమును లేదు. ఆంగ్లభాషాప్రభావజన్యమిది యని కొందఱు. "కాదంబరి" సంస్కృతమున నొక గద్యకథావిశేషము; నేఁటి మన నవలకది పూర్వభావము; క్రమక్రమముగ సంస్కృతమునఁ గథాఖ్యాయికలభేదము పాటింపఁబడలేదు; ఒకదానికొకటి నిన్నమొన్నటివఱకు నాంధ్రములోఁగూడఁ బర్యాయపదములైనవియని మిగిలినకొందఱు. మొత్తము మీఁద దీనినామరూపములు రెండును బాశ్చాత్యప్రభావజన్యములే యనకతీరదు. ఈ యుగమున నవల కొంత ప్రజాదరపాత్ర మగుట నిజము; కాని యింకను నభ్యాస దశయందే యున్నది. పెక్కునవల లాంగ్ల ప్రాతిపదికలు గలవి. స్వతంత్రములున్నను నవి యపరిపక్వములు, నపరిష్కృతములు, సాంకర్యదుష్టములు; శిల్పదృష్టిచే నసమగ్రములు. చారిత్రకములు సాంసారికములునగు నవలలు పెక్కు వంగభాషనుండి యనూదితములు. బంకించంద్ర ఛట్టోపాధ్యాయ, రమేశచంద్రదత్తుల రచనలీ కాలమునఁ బాఠకలోకమునకుఁ బఠనోత్సాహమును గొలిపినవి. పాఠకుల సంఖ్యను విద్యాప్రమాణములను బెంపొందించుట కివి తోడ్పడుట తథ్యము. ఆంగ్లమును బ్రాతిపదికగఁగల నవలలకు దారిచూపినది కీ.శే. వీరేశలింగము పంతులని మున్నే వివరింపఁబడెనునిరూపకనవల2.కూడ నీ కాలమునందే రూపరేఖలు దిద్దుకొని రంగమున కెక్కినది. కథాసువిధానమునందు. నౌత్సుక్య సంవర్ధనమునందు, శైలీవైశద్యమునందును కీ.శే. చిలకమర్తివారిది సాటివారిలో నాఁడు పైచేయి.

## ౩ కథానిక

మన కాంధ్రములో ధర్మోపదేష్టృభావముగల కట్టుకథలు, పిట్టకథలును బూర్వము నుండి యున్నవి. క్రమక్రమముగ సంస్కృత ప్రభావముచే బంచతంత్రాదులు నీతికథలకుఁ బ్రతినిధులుగ వెలసెను."దశకుమార చరిత్ర"లవంటి సాహసకార్య ప్రబోధకకథలును మనభాషయందు నెలకొన్నవి. "అరేబియను రాత్రుల"3 వంటివానికి మనలో "మదన"

1. Skylark.
2. నేఁడిది యపరాధ పరిశోధక నవల యనఁబడుచున్నది.
3. Arabian Nights.

కామరాజుకథలు," "శుకసప్తతికథలు" మున్నగునవి సాటి. "సింహాసనద్వాత్రింశిక" వంటివి యద్భుతావహ కల్పితకథలకుఁ బ్రతిబింబములు. 'నవనాథచరిత్ర' "ధనాభిరామము" మున్నగునవి యాంధ్రమునందుఁ బద్యరూపకథలకుఁ బ్రాతినిధ్యము వహించును.

ఇంత సాధనసంపత్తిగల స్వదేశీయపూర్వరంగము దోహదమైనది. దానినుండి కీ.శే.పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులు "సువర్ణరేఖాకథావళి," పద్మభూషణ శ్రీమాడపాటిహనుమంతరావుపంతులుగారి "మల్లికాగుచ్ఛము," కీ.శే.అక్కిరాజు ఉమాకాంతశేఖరుని "త్రిలింగకథలు," కీ.శే. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "పూలదండ" వంటి కథాసంపుటములు వెలువడినవి. వీని నచ్చమైన కథలందుము; కథానిక లనరాదు.

విదేశీయపూర్వరంగము దోహదముకాఁగా బ్రథమప్రపంచ యుద్ధానంతరము పొటకరించినది కథానిక. దీని కీ పేరే తత్పూర్వము రాలేదు. కీ.శే.గురుజాడ అప్పారావు "దిద్దుబాటు" రచించిననాఁడుగూడ దానికి "కథానిక" యని వ్యవహారమున్నట్లుఁ జెప్పలేము. పిమ్మటనే యీ పేరు హసుమదింద్రగంటి వారివలన[1] రూఢియయ్యెను. ఆధునికయుగమునఁ 'గథానిక' యనఁబడునట్టిది కేవలము స్వదేశీయపూర్వరంగమున విదేశీయదోహదసహితముగా బొటమరించిన లతకాదు. అందువలననే క్షేత్రముకంటె బీజమునకుఁ బ్రాధాన్య మధికమై "కథానిక" యనఁగా కేవలము పాశ్చాత్యప్రభావజన్యమనునంత యపోహము కుదిరెను. నేలవిడిచి సాముచేయలేము. కావున నేఁటి మన కథానిక నాఁటి స్వదేశీయక్షేత్రమునుండి యుద్భిజ్జమైన విదేశీయబీజముగలది యనుట విహితము. ఈ యర్థమే స్ఫురింప నున్నది నవలవలె ద్వైమాతృకమనియు ద్విదళబీజము వంటిదనియుఁ జెప్పఁబడెను.

## 3. పునరుజ్జీవక సాహిత్యవీథి

విప్లవాత్మకసర్వశక్తిసమన్వితమైన ముద్రాయంత్రము సాహిత్యకపోషణసామర్థ్యమును రాజులనుండి యపహరించి పాఠకలోకమునకు దత్తమొనర్చెను. గతకాలములో రాజులు, సారస్వతసంఘములుగూడఁ గవుల సామర్థ్యమును నిర్ణయించుట పరిపాటి. ఈ యాచారము శీఘ్రముగ మాఱుచున్న కాల మిది. సాహిత్యమును విమర్శించి గుణాగుణనిర్ణయముచేయుట యనునది యీ కాలమున దినవారమాసపత్త్రికల

1. 'కథానిక' ను గుఱించి "ప్రతిభ" తొలిసంపుటములలో వీరి వ్యాసము చదువఁదగినది.

విధాయకమైపోయెను. ఇప్పటికిఁ బూర్వమే గతశతాబ్దిలో ప్రధానముగ సారస్వతమాస పత్త్రికలు కొన్ని భాషాసేవచేసినవి. 1 అయినను నీ యిరువదియవ శతాబ్ది యందుఁ, బ్రసిద్ధిఁగాంచిన కొన్ని ప్రముఖసారస్వతమాసపత్రికల సేవ నిచ్చటఁ బేర్కొనుట యనుచితముగాదు.

---

1.

| | పత్త్రిక పేరు | సంపాదకులు | ప్రారంభము క్రీ.శ. | వెలువడిన స్థలము |
|---|---|---|---|---|
| ౧ | సకలవిద్యావర్ధని | గూడూరివెంకటరావు | 1875 | విశాఖపట్టణము |
| ౨ | అముద్రిత గ్రంథ చింతామణి | పూండ్ల రామకృష్ణకవి | 1880 | నెల్లూరు |
| ౩ | గ్రంథప్రదర్శిని | శ్రీనివాస జగన్నాథశాస్త్రి | 1886 | విశాఖపట్టణము |
| ౪ | సుమనోభిరంజని | దబీరు కృష్ణమూర్తి | 1888 | జలుమూరు, విశాఖ పట్టణము జిల్లా |
| ౫ | కల్పవల్లి | కోపల్లె వెంకటరమణారావు (వీరే మొదట బొంబాయిలో ఆంధ్రవారపత్రికకు సహాయ సంపాదకులు) | 1890 | ఒంగోలు |
| ౬ | సరస్వతి | శ్రీరాజా కొచ్చెర్లకోట వెంకటరామచంద్ర కృష్ణారావు (చిలకమర్తివారి నవల లిందుఁ గ్రమక్రమముగఁ బ్రకటితములు) | 1896 | రాజమహేంద్రవరమునుండి కాకినాడకుఁ దరలివచ్చినది. |
| ౭ | మందారమంజరి | ఓగిరాల జగన్నాథరావు | 1897 | కాకినాడ |
| ౮ | కళావతి | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి. (కొన్నాళ్లకు చెన్నపురిలో వెలసి యంతటితో గతించినది) | 1898 | రాజమహేంద్రవరము |
| ౯ | ఆనందదాయిని | జనమంచి శేషాద్రిశర్మ | 1899 | కలువాయి [నెల్లూరు తాలుకా] |
| ౧౦ | బాలసరస్వతి | యస్. కృష్ణారావు | 1899 | చెన్నపురి |

### ౧. కృష్ణాపత్త్రిక—1902[1]

ఇది నాఁడు ప్రధానముగ జాతీయవారపత్త్రిక. అయ్యును నాఁటినుండి నేఁటి వఱకు భాషాసేవ యపారముగఁ జేయుచున్నది. ఇప్పటికిని వారపత్త్రికయే! గుంటూరుమండలము కృష్ణాజిల్లాలోనుండఁగా జిల్లాసంఘమువారిచే శ్రీకొండా వెంకటప్పయ్యగారి సంపాదకత్వమున వారపత్త్రికగ వెలువడి యటుపిమ్మట శ్రీముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వమున బందరు(మచిలీపట్టణము)లో మొన్న మొన్నటి వఱకు మిన్నయై వన్నెగాంచెను. ఇటీవలఁ జాలమార్పులకు లోనై సంపాదకులు మాఱుచుండఁగా మూఁడేండ్లవెనక హైదరాబాదుచేరినది. ఇప్పటి సంపాదకులు శ్రీ.యమ్.సుబ్రహ్మణ్యశర్మగారు.

### ౨ హిందూ సుందరి - 1902

ఇది వైజ్ఞానికమాసపత్త్రిక; కాకినాడ విద్యార్థినీసమాజమువారి పక్షమున వచ్చుటినుండి నడపఁబడెడిది. దీనిని శ్రీసత్తిరాజు సీతారామయ్యగారు ప్రారంభింపఁగా శ్రీమతులు శాంతాబాయమ్మ, మాడభూషి చూడమ్మ, బాలాంత్రపు శేషమ్మగారలు క్రమముగ సంపాదకురాండ్రై ముప్పదియేండ్లకుఁ బైఁగా నిర్వహించిరి. నాఁడు స్త్రీలచే జయప్రదముగఁ బ్రచురింపఁబడిన మాసపత్త్రిక యిది యొక్కటియే!

### ౩. కల్పలత - 1903

దీనికి మొదట శ్రీ.ఏ.కామేశ్వరరావుగారు సంపాదకులు. పిమ్మట ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు సంపాదకులైరి. ఇది విశాఖపట్టణమునుండి ప్రచురితము. ఇదియే శ్రీవేంకటపార్వతీశ్వరకవుల నిర్వురను గూర్చినపత్త్రిక యని మున్ను వక్కాణింపఁ బడినది.

---

1. "తెలుగుపత్త్రికలు" అను వ్యాసము, (భారతి—అనుబంధము, ప్రమోదూత—వైశాఖము) కృష్ణా పత్త్రిక ప్రారంభమును క్రీ.శ. 1903గా జెప్పుట పొరపాటు. నేఁటికిని కృష్ణాపత్త్రిక ముఖపత్త్రముపై క్రీ శ. 1902 న స్థాపితమని యుండును.

౪. సావిత్రి[1]

ఆంధ్రదేశ స్త్రీల యుపయోగార్థము కాకినాడలో ప్రచురింపఁబడిన మాసపత్రిక. శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు దీనికి సంపాదకురాలు. ఇందు స్త్రీవిద్య, గృహనిర్వాహకత్వము, శిశుపోషణమువంటి విషయములేగాక చిత్రకథలు, పద్యములు, పాటలుమున్నగు ననేకవిషయములు విద్వాంసులచేతను విదుషీమణులచేతను వ్రాయఁబడుచుండెడివి. ఈ పత్త్రిక యొక్క యెనిమిది యేండ్లు నడచెను. అన్ని విషయములందును నిది పూర్వాచారపరాయణము. నాఁడు కందుకూరివారి సంస్కర్తృభావమున కిది యడ్డు తగిలినది. అందువలన దీనిపై వారు ధ్వజమెత్తిరి; స్వయముగ కాకినాడపోయి చందాలిచ్చువారిని మానిపించిరఁట! నాఁడు పిఠాపురము రాజావారుగూడ రెండుమూఁడు జాబులు సగౌరవముగ నీ విషయమున వ్రాయుటచే శ్రీకందుకూరివారి సంస్కరణోద్యమమునకుఁ దలయొగ్గి స్త్రీవిద్య తానును గోరునదికావున సంపాదకురాలీ పత్త్రిక నాఁపి వేయవలసివచ్చెను.

౫. భారతి :— (1904).

శ్రీ సుంకర రంగయ్యగారు దీనికి సంపాదకులు. ఇది రాజమహేంద్రవరమునుండి వెలువడిన సారస్వత మాసపత్త్రిక[2].

౬. దేశమాత :— (1904)

ఇది రాజమహేంద్రవరపు వారపత్త్రిక. శ్రీ చిలకమర్తివారిచే సంపాదితము; కావ్యములను భాషావిషయికవాదోపవాదములను బ్రకటించుచుఁ బ్రభుత్వవిధానములఁ గూడ విమర్శించుచుండెను. నాఁటి ప్రభుత్వమును బ్రతిఘటించి తీవ్రముగ వ్రాసి

1. నేఁటికిని బూర్ణారోగ్యముననున్న యీ సంపాదకురాలు తన పత్త్రిక క్రీ.శ.1904లో నెలకొలుపఁబడెనని వ్రాయుచున్నది శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి "ఆంధ్రకవయిత్రులు" (పుట 135—పంక్తులు—1,2) (1953) కూడ నట్లే చెప్పును. "మూర్జహాను" అనునవల (శ్రీబాలాంత్రపు వెంకటసుబ్బారావుగారి భాషాంతరీకరణము) (1911) తుది యందుఁగల ప్రకటనలో 8,12 పుటలయందీ పత్త్రికను గురించిన ప్రకటనము నాఁడే గలదు. ఇంకను ననేక ప్రమాణములచే నీపత్త్రిక 1904లో స్థాపితము. భారతి—అనుబంధము. ప్రమోదూత—వైశాఖమునందుఁగల తెలుగుపత్త్రికలు" అనువ్యాసము 'సావిత్రి' పత్త్రికజననము. 1925గా నిచ్చుట పొరపాటు.

2. వివరములకు, "తెలుఁగుపత్త్రికలు" అనువ్యాసము (భారతి—అనుబంధము ప్రమోదూత వైశాఖము) చూడఁదగినది. ఈ సందర్భమున నీయఁబడిన సంవత్సరముల సంఖ్యలన్నియు నావ్యాసమును బట్టియే;సాధ్యమైనంతవఱకు నందలి పొరపాటులు సరిదిద్దఁబడినవి

"ధరావతు" కోలుపోయిన యీ పత్త్రిక సుమా రిరువదియేండ్ల తదుపరి 1927లో మఱల రాజమహేంద్రవరము నందు వారపత్త్రికగనే తలయెత్తినది.

౮ మనోరమ :— (1906)

దీనికి నాఁడు చిలకమర్తి లక్ష్మీనరసింహారావుగారు సంపాదకులు. ఇది రాజమహేంద్రవరమునుండి వెలువడిన సారస్వతమాసపత్త్రిక. రసవంతములగు నాటకములు, మనోహారములగునవలలు, జ్ఞానదాయకములగు ప్రకృతిశాస్త్రాదిగ్రంథములు, మహాపురుషులజీవితములు, సంఘమతసంస్కరణాదివిషయవ్యాసములు, హృదయాహ్లాదకరములగు వినోదములు నిందుఁ బ్రచురింపఁబడుచుండెడివి. రమారమి 64 పుటలు; సరళసుందరమైన వచనశైలి. ఆయావిషయములకు సంబంధించిన పటములు గూడ నిందు ముద్రింపఁబడెను.

౯ అభినవ సరస్వతి :— (1908).

ఇది విశేషించి తెలుఁగుకావ్యములను నాంధ్రభాషాభివృద్ధికరములగు వ్యాసములను యత్కించిత్సంస్కృతవిషయములను బ్రచురించుట కేర్పడిన సారస్వతమాసపత్త్రిక. ఇందు నేతత్పూర్వోక్తవిషయములేగాక తిరుపతి వేంకటేశ్వరకవికృతములును తత్సంబంధములును నగు వ్యాసములుకూడఁ దఱచుగఁ జేర్పఁబడుచుండెడివి. ఈ పత్త్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి; జానపాడు.1

౧౦ ఆంధ్రవారపత్త్రిక :-

కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారిచే నిది మున్నెమ్మదట బొంబాయిలో స్థాపితము; పిమ్మట చెన్నపురికి మార్పఁబడెను. అప్పటినుండి దినపత్త్రికయైనది. పిదప వేఱుగ వారపత్త్రిక యొకటి వెలసెను. కేవలము వ్యాపారదృష్టితో నేఁ డిది చౌకపడు దురదృష్టరచనలు సాగింపకుండినయెడల, నానాఁడా వారపత్త్రిక చేసిన యపారసంఘసేవయు వైజ్ఞానికసారస్వతకృషియు జాతీయప్రబోధమును దేశీయోద్ధరణమును సర్వము కాలగతిచే దీనిముందు విస్మృతమైపోయి మన జాతికిఁ గృతఘ్నతాదోషము వెంటఁబడెడిది.

౧౧ ఆంధ్రభాషాసంజీవిని :-

ఇది రాజమహేంద్రవరములో శ్రీ కొక్కొండ వేంకటరత్నశర్మకవిగారి సంపాదకత్వమునఁ బ్రచురింపఁబడిన సారస్వతమాసపత్త్రిక. నిర్దుష్టము, మహాప్రౌఢమునగు నాంధ్రభాషయందుఁ బ్రచురితము. ఇదిచేసిన గ్రాంథికభాషాసేవ నిస్తులమైనది.

1. జానపాడు, నాఁడు పిడుగురాళ్ల పోస్టు, గురజాల తాలూకా, గుంటూరు జిల్లా.

౧౧ భారతి :— (1910).

నాఁడు పిఠాపురమున వే. మృత్యుంజయశర్మగారిచే నెలకొలుపఁబడిన యిది యొక సారస్వత మాసపత్త్రిక. ఉన్న కొలఁదికాలములో జక్కని సాహిత్యప్రచారము చేసెను.

౧౨ మనోరంజని :- (1910)

దీనికి కాళ్లకూరి నారాయణరావుగారు సంపాదకులు. ఇది కాకినాడనుండి వెలువడుచు నాంధ్రభాష కమూల్యమైన సేవఁగావించినది.

౧౬ మనోరంజని :- (1910)

శ్రీ. జి. జగన్నాథరావుగారు దీనికి సంపాదకులు. ఇది మదరాసునుండి ప్రచురింపఁబడిన సారస్వత మాసపత్త్రిక.

౧౪ ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక :- (1912).

ఇది యాంధ్రసాహిత్యపరిషత్తువారు వెలువరించు సారస్వతపత్త్రిక. పరిషత్తు చెన్నపురిలో నున్నప్పు డచ్చటను కాకినాడకు మార్పఁబడినప్పటినుండి నేఁటివఱకు కాకినాడయందును బ్రచురితము. సారస్వతసంస్కారవిషయములో భద్రమైన ప్రగతి కిది చిహ్నము. తఱచుగ ద్వైమాసపత్త్రిక; కొన్నాళ్లు త్రైమాసికము కూడ.

౧౫ ఆంధ్రదినపత్త్రిక :- (1914)

క్రీ. శ. 1908లో శ్రీకాశీనాథునివారిచే బొంబాయిలో స్థాపింపఁబడిన వారపత్త్రికయే చెన్నపురిచేరి దినపత్త్రికారూపమును దాల్చెను, జాత్యభివృద్ధితోబాటు సాహిత్యాభివృద్ధికి నిది చూపని మేలిపుంత లేదు; త్రొక్కని త్రోవయులేదు. ఆంధ్రవాఙ్మయపునర్జీవమున కెంతో తోడ్పడినదనిన ఁజాలును; ఇతరములతోబాటు సమస్త సాహిత్యోద్యమములకుఁగూడ నిది యాలవాలము. దినపత్త్రిక యైనప్పటినుండి నేఁటివఱకు దీని కొక యుగాదిసంచిక వెలువడుచున్నది. ఇది నేఁడు తన సాహిత్యక ధర్మమును నిలఁబెట్టుకొనఁ బెనఁగులాడుట మేఘలీనమైపోయెడి తటిల్లేఖను దలఁపించును.

౧౬ మంజువాణి :-

ఇది శ్రీరాజా. మంత్రిప్రెగ్గడ భుజంగరావుపంతులుగారి సంపాదకత్వమున నిర్వహింపఁబడిన సారస్వత మాసపత్త్రిక; ఏలూరునుండి ప్రచురితము. దీని సారస్వతసేవానిరతి యనన్యము.

౧౩ సువర్ణలేఖ :- (1917).

దీని సంపాదకులు శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణగారు. ఇది యొక వార పత్త్రిక. ఇందు మతవిద్యాకృషివిషయములతోఁబాటు నాటకములు, ప్రబంధములు, నవలులును బ్రకటింపఁబడుచుండెడివి. తణుకు, [నాఁటి] కృష్ణాజిల్లా దీనికార్యస్థానము.

ఈ శతాబ్ది ప్రథమవింశతియం దాంధ్రసారస్వత విలసితోద్యానమున నానాప్రక్రియారూపవికీర్ణ వీథీపరంపరలు నవ్యకావ్యవిశేషకుసుమసంచయవాసనావిలసితములని నిరూపింపఁబడినది. ఇట్లు భిన్నభిన్నసురభిళములచే రంగము గుబాళించుచుండెను. ఇంతటి సముమ్మేషసమ్మర్దమందుఁగూడ మన నవల నిలఁద్రొక్కుకొని తన విధ్యుక్తమును నిర్వర్తించుట కెవరెవరి యాలంబము నే యే రీతుల సంపాదించినదియు నెట్టి యెట్టి జీవస్పందనములుగల భంగిమలు ప్రదర్శించినదియుఁ బరిశీలించుట యీ ప్రకరణము ప్రధానోద్దేశము.

## సౌందర్య తిలక

ఇది చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ప్రకటించిన[1] యుత్తమనవల.[2] కథా సంవిధానమునకుఁ బేరువడినది; ఎంతకల్పితమో యంత పౌరాణికము. నాలుగు కథల కిది కూడలి. ఏకాంశవ్యగ్రత కథానికకుఁ గఠోరధర్మము. అంతగా నవలకుఁ గాదు. సౌందర్యతిలక నాలుగుకథలకు సంగమస్థానమైనను నందలి పెక్కు పౌరాణికాంశములు ప్రాస్తావికములై యాధికారిక కల్పితేతివృత్తమునకు రంగప్రసాధనసామగ్రిగ నుపచరించినవి. ఈ నవలను బౌరాణిక మనినవా రున్నారు. కాని యది యుచితము గాదు. ఆధికారికవృత్త మిందలిది కల్పితము.

ఇందలి ప్రధానకథ సౌందర్యతిలకను గళానందుఁడు ప్రేమించి యుద్వాహమాడుట. ఈ కార్యమునకు నాటంకమైన రణార్ణవుఁ డిందుఁ బ్రతినాయకుఁడు. ఇతఁడు గూడ నాయికయగు సౌందర్యతిలకను వివాహమాడఁ గోరుచుండును. సౌందర్యతిలక కన్ననో వానియం దనురాగము లేదు. తుదకు శ్రీకృష్ణు ననుగ్రహప్రాప్తిచే నాయకుఁడగు కళానందుఁడు సౌందర్యతిలకను వివాహమాడఁగలిగినాఁడు. ఈ ప్రధానకథ కాధారము పురాణములయందుఁ గానరాదు. రచయితచేతఁ బురాణయుగవిశేషములు భావింపఁబడగా బొందింపఁబడిన దిందలికథ.

---

1. ఫిబ్రవరి 1902లో ప్రథమావృత్తి. క్రీ.శ. 1901 అని ఆంధ్రవాఙ్మయ సూచిక, పుట235.

2. దీనికి 'చింతామణి' ప్రథమ బహుమతి లభించినట్లు "తెలుగు విజ్ఞానసర్వస్వము," మూఁడవ సంపుటమగు "తెలుగు సంస్కృతి" పుట 1049. (1959)

ఇcక రెండవకథ జరాసంధవధ. ఇది ప్రథమము ప్రధానమునైన కథతో దుల్య ప్రాధాన్యము గలది. శ్రీకృష్ణుcడు భీమునిచే జరాసంధుని వధింపించుట, ధర్మజుని రాజసూయాధ్వరనిర్విఘ్నసమాప్తినిమిత్తము. ఈ కథకు మూలములు భారతభాగవత ములలో నున్నవి. వీనిని పౌరాణికములైన యుపకథ లనవచ్చును. పై మొదటికథతో నిది యనుసంధానితము.

ఇందుమతీవృత్తాంతము మూcడవది. ఇది కల్పితము. ఇందుమతి బాల్యముననే మాతృవియోగమునొందిన బాలిక; జ్వాలాజిహ్వునిచే బెంపcబడెను; వానినుండి తప్పించుకొని కళానందుని సాహాయ్యమువలన కరభాశ్రమమును జేరుకొన్నది; కాని మఱల శిశుపాలుని బాఱిcబడెను; నాగవల్లి సాయమువలన నాతనినుండి యెట్లో తప్పించుకొని యింద్రప్రస్థము జేరుకొన్నది. చివర కీమె యశోధరుcడను యాదవ కుమారుని భార్యయగునట్లు కథ యల్లcబడెను.

జయసేనుని వృత్తాంత మీ నవలలో నాల్గవది. ఇతcడు జీవత్తాతపాదుcడు. సుఖ ముగ నాలుబిడ్డలతో గాcపురించు సంసారి. అనుకొనకుండ నీతని యింటికిc బ్రారబ్ధవశ మున నొక పూలచెండు వచ్చిపడినది. వచ్చినది వచ్చినట్లుండక, విడిపోcగా, దాని నుండి కేతకీపత్త్రిమొకటి వెలువడెను. ముందు దానిని జయసేనునిభార్య తారా మఱియుc దరువాత దాసియుc జూచిరి. ఇంతలోనే యది జయసేనుని దృష్టినిగూడ నాకర్షించెను. దానితో జయసేనునింట సుఖశాంతులు దూరీకృతములైనవి. భార్యా భర్తలలో నొకరిపై నొకరి కనుమానము. చివర కీ యనుమానములు జయసేను నున్మత్తు నొనర్చెను. ఆ మొగలిఱేకుజాబు జరాసంధునివఱకు పోయినది. ఆతcడు జయసేను ననుమానించినాcడు; కారాcగారదండనము విధించినాcడు. తుదకు కళా నందుcడు స్వయముగc గేతకీపత్త్రవృత్తాంతమును వివరించినప్పుడు జయసేనుని సాంసా రికకష్టములకు విడుమర కలిగినది. ఇదియు నొక కల్పితేతివృత్తమే! పై మూcడు కథలలో బెనcగొనిపోయెను.

ఈ నాల్గుకథలలో నొకటి పౌరాణికము; కడమవి కల్పితములు. అందులో బ్రధానవృత్తాంతము కల్పితము. ఇట్లీనవలను భిన్నభిన్నకథలుగా విడమరుచుట విమ ర్శనదృష్టితో విస్తృతాలోకనము బఱపుటకేగాని యది యట్లుc బొందిపొసcగక విడి పోవునది యనుటకుcగాదు. ఒక మహనీయమనోహరసంవిధానముతో నీ నవల పెనc గొని సాగిపోవుచున్నది. చిలకమర్తివారి సుదృఢపరిపీవణము[1] న కిది యుజ్జ్వలోదా హరణ మనcదగును. దీనియందలి యిందుమతీవృత్తాంత మొక యుపకథ; ప్రధానరస మగు శృంగారమును బోషించుటలో సహకారి; జరాసంధవధ, మాతనిపతనమువారి రాతు సత్త్వమును శ్రీకృష్ణపతుమ·వారి పరోపకారపారీణతను ధర్మనిరతిని బ్రకాశిత మొనర్చు

1· Close–Knitting

చున్నది. అది కథైక్యమున కెట్టి భంగమును రానీయక క్షీరనీరన్యాయమున నందు వర్తించుచుండును.

దీనియందు సందిగ్ధత[1] యను లక్షణము మిక్కుమిక్కుటిల్లినది. తుది గడియవఱకు నీ పాత్రల కేదిమూడునో గ్రహింపఁజాలము.

పాత్రలశీలములు సుందరతరముగఁ జిత్రింపఁబడినవి ఇందుఁ గల్పితమైన పాత్రలలో నాగవల్లిపాత్ర మఱపురానిది. నాగవల్లిని సృజించుటయనఁగా కేతకీపత్రప్రాధాన్యమును నిరూపించుట. నాగవల్లియందు రణార్ణవునకు విశ్వాసముగొల్పినది కేతకీపత్రము. ఆ విశ్వాసమే జరాసంధుని రహస్యమును నాగవల్లికి వినిపించినది. నవలలో ప్రకస్థానము గల కేతకీపత్రవృత్తాంతమున కాలంబనమైనది నాగవల్లి. తుట్టతుదకుఁ గళానందుఁడు కేతకీపత్రలేఖకుఁడను తానని చెప్పి జయసేనుని యనుమానముఁదీర్చి యాతని కుటుంబ సుఖస్థితికి హేతుభూతుఁడు కాగలిగినాఁడు.

రచయిత నాగవల్లిపాత్రను ప్రతియోగపద్ధతిలో గడురమ్యముగఁ గూర్చెను. ఆమె యుక్తి, ధైర్యసాహసములు, చమత్కృతియుఁ గొనియాడఁదగినవి. లేశమైన పురాణవిషయికకథయు నిందుఁ గల్పితాంశములచే నవరవోన్మేషశాలినియై తనరారుచున్నది.

భారతకథేతివృత్తము నెయ్యెడను నతిక్రమింపక దానికి దీటుతెచ్చు కల్పనాచమత్కృతి కీనవల గీటురాయి. ప్రబంధమా యనునట్లు సూర్యోదయసూర్యాస్తమయాదుల వర్ణనలతోడను నాయికానాయకవియోగసంయోగవర్ణనలతోడను నిండియొప్పారును. ప్రకృతివర్ణనాదులకుఁ గథతో నభిన్నాధ్యవసాయము జరుగుట యొక శిల్పధర్మము. మృచ్ఛకటికనాటకమునందలి శకారునివంటి రణార్ణవుఁడనుపాత్ర యిందు సృజింపఁబడుట గమనార్హము.

కల్పనాశక్తికిని రసోత్పత్తికిని సౌందర్యతిలక పట్టభద్రమైనదని యొకమాటలో జెప్పవచ్చును.

## శాపము [2]

ఇది కీ.శే. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే విరచితమైన స్వతంత్రనవల. ఆంధ్రదేశచరిత్ర అధికముగ నవలారూపమున నిబంధింపఁబడలేదనెడి యపప్రథ నానాఁడు

---

1. Suspense.

2. ఇది యాంధ్రవిశ్వవిద్యాలయమున బి. ఏ పట్టపరీక్షకు క్రీ.శ. 1047_49 నుపవాచకముగ నిర్ణీతము.

తొలఁగించిన యుత్తమనవల యిదియే! కావున చిలకమర్తివా రాంధ్రదేశచారిత్రకాంశములను నవలగా గ్రథించినవా రగుటయేగాక 'ఆంధ్రాస్కాట్' బిరుదగౌరవమున కర్హులునైరి.

తెలుఁగుదేశఁపు టొడయఁడగు రాజకళింగగంగు, నిగ్రహానుగ్రహసమర్థుఁడైన వేములవాడభీమకవి నవమానించి శప్తుఁడై రాజ్యభ్రష్టుఁ డగును. సకుటుంబముగ నష్టకష్టములపాలైన కళింగగంగు పశ్చాత్తప్తుఁడై భీమకవి యనుగ్రహము సంపాదించి రాజ్యపునఃప్రాప్తుఁ డగుటతో నవలాసమాప్తి.

రాజసేవకుల దుర్మార్గములవలనఁ బ్రజలుపడిన పలుపాటులు, నిచ్చుకొనిన పన్నులు, నోర్చుకొనిన హింసాకాండయు, గుఱియైన దోఁపిడులును 'శాపము'నందు సజీవముగ వర్ణితములు. దేశ మానాఁడు చిన్నచిన్న రాజ్యములుగ విభజింపఁబడి యా యా రాజులనడుమ కలహములతో నుడికిపోయిన చారిత్రకసత్యమున కీ వర్ణనలెల్ల సాక్షీభూతములు.

రాజన్యాంతముగాని యాదేశమునందుఁ బ్రజ లనుభవించిన క్షామక్షోభ మది యంతయు నాఁటి సాంఘికపరిస్థితి. రాజద్రోహులు, ప్రభువిశ్వాసపాత్రులునగు మంత్రి పురోహితాదుల ప్రవర్తనమెల్ల సజీవముగ నీ నవలలో జిత్రింపఁబడెను. పాత్రోన్మీలనము గథాసన్నాహము రెండును గౌతూహలోద్దీపకములై విలంబనాసహిష్ణుత గలిగించు చున్నవి. చిలకమర్తివారి 'శాపము'నఁగా జండప్రచండాభిశపనాభినుతిమత భీమన్నకవి జయభేరిమ్రోత.

## సురస 1

"దురాశాభంగము" దీనికి సార్థకమైన నామాంతరము; కర్త శ్రీబాలాంత్రపు వేంకటరావు. శ్రీవేంకట పార్వతీశ్వరకవులని ప్రసిద్ధిఁగన్నవారిలో నొకరు; నేఁటికిని సజీవులు.

---

1. 15–1–1907 ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయ ప్రచురణము. ప్రచురణకర్త శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావు, తణుకు; 1906 అని ముఖపత్రమునం దున్నది. పుటలు 102. ముద్రాపకులు శ్రీ పులుగుర్త వెంకటరత్నము; శ్రీ సావిత్రిప్రెస్, కాకినాడ.

ఈ నవల క్రీ.శ.1902నాఁటి కింకను బూర్వఁపు రచన యని శ్రీబాలాంత్రపు వేంకటరావుగారు చెప్పుచున్నారు; దీనిని కేవల మొంటిగా తమరే తణుకులో వ్రాసి నారఁట! కీ.శే.పార్వతీశముగారు తమ కప్పటికి సహాకవి కాలేదు. 1

ఈ నవల యొక స్వకపోలకల్పితసాంఘికరచనము. దీనిని సాంఘిక మనుటకంటెఁ గాల్పనిక మనుట మఱింత యుచితము. నీటిలోని యన్నివస్తువులకు నిందు రూపకల్పనము చేయఁబడినది. స్వతంత్రమైన యిందలి సాంకేతికప్రతిపత్తి పోనుపోను బంకించంద్ర ప్రభృతులైన యాత్తరాహాకవుల సాంకేతికత్వముచే బరిపుష్టమై మన నవలాసాహిత్యమున వెల్లివిరిసిన దనవచ్చును. 2

## కళాపూర్ణోదయ కథాసంగ్రహము

దీనికి మూలము పింగళి సూరనార్యుని గళాపూర్ణోదయము. దాని కిది స్వర్గీయ గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారి వచనరచన[3]. ద్వితీయావృత్తియందు వారు దీనిని 'కలభాషిణి'యను పేరిటఁ బ్రకటించిరి. మహానీయకథాసంవిధానమునకుఁ బేరు వడిన పదునాలువళశాబ్ది పద్యరూపనవల కిది గద్యానుకృతి.

---

1 ఆచంట వెంకట సాంఖ్యాయనశర్మగారు తమ 'కల్పలత' యను పత్త్రికలో 1902 నందు భాషాసంబంధమగు ప్రశ్నావళిని బ్రకటించి దాని సమాధానములకు బహుమతులనొసఁగిరి. ఒకే నెలలో వోలేటి పార్వతీశము గారికిఁ బ్రథమబహుమతియు వడకుదుటి వీరరాజు పంతులుగారికి ద్వితీయ బహుమానమును బాలాంత్రపు వెంకటరావుగారికిఁ దృతీయ బహుమతియు లభించి యవి వారిని మిత్త్రుల నొనర్చినవి. తమ యిర్వురి సహకవిత్వ మైత్త్రికి గల్పలత పత్త్రికయే కారణమని బాలాంత్రపు వెంకటరావుగారు చెప్పుచున్నారు. ఈ బహుమతుల ప్రదానము మరుసటినెల కల్పలత లో బ్రకటితము. (చూడుఁడు, ఆంధ్ర రచయితలు, పుటలు 307-308).

2. ఎస్.ఎస్.యల్.సి పరీక్ష కిది 1926 నందు సంయుక్త మదరాసు రాష్ట్రములో ఉపవాచకముగఁ బాఠ్యగ్రంథము.

3. Vide F.st. G.G. catalogue of Book (Page 16)for the March, 1902.

4. 4-12-1911 vide F. st G.G. page 39, suppliment, date, 30–4-1912.

## ఆనంద మఠము 1

దీనికర్త సుప్రసిద్ధ వంగరచయితయైన బంకించంద్ర ఛట్టోపాధ్యాయుడు; అనువాదకులు స్వర్గీయ ఓ.వై.దొరస్వామయ్య. ఇది వంగదేశమునందు క్రీ.శ.1773-74 సంవత్సరములలో జరిగిన "సన్యాసివిద్రోహ"చరిత్రాధారముగ రచితమైనది. ఈ సన్యాసి విద్రోహయథార్థచరిత్ర 3 మాంగ్లగ్రంథములయం దుద్ధృలతమై యుండెను.4

ఈ నవలలో వర్ణింపబడిన యుద్ధములు వీరభూమియందు జరిగినవికావు. ఉత్తర వంగప్రదేశము నందు జరిగినవై యున్నవి. ఇట్టి వ్యత్యాసము నవలలయం దుండుట దోషము కాజాలదు. నవల పూర్తిగా జరిత్రకాదుగదామఱి !

వంగరాష్ట్రవిభజనమునకు బ్రతికూలముగ క్రీ.శ.1906ప్రాంతములో వంగదేశముమాత్రమేగాక భారతదేశమునం దంతటను దీవ్రప్రచారము సాగినది. వంగీయులు 'బారిసాలు'నందు రాష్ట్రీయసమావేశము సాగించి నప్పు డధికారులు దానిని జెదర

---

1. 12-6-1907 ప్రథమావృత్తి: చతుర్థావృత్తి 1948. ఈ నవలకు కీ శే ఓ.వై దొరస్వామయ్యగారు సాధువైన ప్రతి వ్రాసియిచ్చుటయేగాక కర్ణాటకమున కీ.శే. బి. వెంకటాచార్యులగారిచే బ్రచురింపబడిన ప్రతియొక్క సాహాయ్యముచే దీనిని సరిచూచికూడ నిచ్చియున్నట్లు, ననువాదము మాత్రము తనదే యన్నట్లును కీ శే. వావిళ్ల వెంకటేశ్వర్లు గారు చతుర్థావృత్తిలో జెప్పిరి. కాని దీనికి ఓ. వై. దొరస్వామయ్యయే యనువాదకర్త యని యనేకసాహిత్యవిమర్శలు జెప్పుచున్నవి. అట్లే ఆంధ్రవాఙ్మయసూచిక ముద్రితగ్రంథములపట్టిక-పుటలు 18-268 Also vide, Ft. st G G catalogue of Books,Published in the Madras Presidency, Suppliment, September 10, 1907, page 48;

2. క్రీ.శ. 1907లో కీ.శే బిపినచంద్రపాలుడు మన రాష్ట్రములో స్వదేశ ప్రచారము సాగించినపుడు వారిని కీ శే. వావిళ్ల వెంకటేశ్వరులుగారు రాజమహేంద్రవరమున గలిసికొని, వారివెంటబోయి, యీ నవలను బూర్తి చేసినట్లు వ్రాయుదురు (చూ. ఆనందమఠము పీఠిక,చతుర్థావృత్తి-

3. 'History of the sannyãsi Rebellion' from warren Hastings, letters in Gleig's Memoirs.

4. "A set of lawess Barditti, wrote the council in 1773 A D. known under the name of sannyãsis or Fakirs have long in fested these countries .. . . ..... to represent the still life of Bengal.,

   see, History of sannyãsi Rebellion from the 'Annals of Rural Bengal' by Hunter PP.70-72.

గొట్టి, శ్రీసురేంద్రనాథ బెనర్జీవంటివారి తలఁబ్రద్దలుగొట్టిరి. నాఁ యల్లరులకు నవల జడికి "వందేమాతరమ్"గీతము పాడుటయే ప్రధానకారణము. అట్టి గీత మున్ననవల వ్రాయుటగాని యనువదించుటగాని బ్రిటిషుపరిపాలనము చెల్లుచుండిన యా దినములలో నెంతకష్టమో మనమే యూహించుకొనవలెను.

ఈ నవలయందలి సారముగ మూఁడంశములు గుర్తింపఁగలము.—

౧. ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ నాంగ్లేయులు వంగదేశము నుద్ధారము చేయుటవలన వారి పరిపాలనాదౌష్ట్యము విదిత మగుచున్నది.

౨. స్త్రీలు కొన్ని కొన్ని సమయములయందు బురుషులకు సహాయకారిణులుగ నుందురు.

౩. సమాజక్షోభ మాత్మపీడనమాత్రము. రాజద్రోహు లాత్మఘాతకులు.

ఈ నవల యనువాదమయ్యు నధికసంచలనము నధికచైతన్యమును మనదేశ మునఁ గలిగింపఁజాలెను.

## కర్పూర మంజరి[1]

ఇది చిలకమర్తివారి బృహన్నవల; రెండు భాగములు; 'చింతామణి' పత్రికవారి బహూకృతి నొందినది[2]. ఇది 'మనోరమ' మాసపత్రికయందుఁ దొలుతఁ బ్రకటితము[3]. ఇందలికథాకథనము చక్కనిది; ఆరంభమునఁ బ్రకాశము లేక మందముగ విచారగ్రస్తముగ నడచెను. ఒకరాజకుమారికిఁ గలిగిన యనారోగ్య మీనవలలో వర్ణింపఁబడిన పెక్కుకష్టములకు హేతువు. ఆమె యనారోగ్యనివారణ కొక రాజకుమారుఁడు పూనుకొనుట యిందలి యితివృత్తము. "కర్పూరమంజరి"యామోదముచే దేశము నాలుగుచెఱఁగులయందును చిలకమర్తివారికీర్తి గుబాళించినది. వారి నవలలలో నిది యుత్తమమని పెద్దలపలుకు. శైలీసౌలభ్యమునకును హాస్యనిశితత్వమునకును దీనిని జెప్పి కడమవానిని జెప్పవలెను. కందుకూరివారిహాస్యము కఱకుఁదనమున కెట్లో చిలకమర్తివారిహాస్యము మొత్తముమీఁద మెత్తఁదనమున కట్లుఁబ్రసిద్ధి.

---

1. ప్రథమ భాగము 15-3-1907లో ప్రకటితము. 2. క్రీ.శ. 1898.

3. "తెలుగు విజ్ఞాన సర్వస్వము"—మూఁడవసంపుటము—తెలుగు సంస్కృతి—పుట 1049 [1959]

## కమలా కోమల [1]

ఓ.వై.సి.దొరసా(స్వా)మయ్య విరచితమైన నవలిక యిది; కమలయు కోమలయునను యువతు లిర్వురిచరిత్ర మిందుఁగథితము.

## గుణమంజరి [2]

ఇది కీ.శే.కొత్తపల్లి సూర్యారావు విరచితము; 'సరస్వతి'యను పత్త్రికనుండి యుద్ధృతమై ప్రకటింపఁబడెను. స్వతంత్రమైన రచన.

## కాంచనమాల [3]

కీ.శే.ధరణిప్రెగడ వెంకట శివరావు దీనిని రచించెను [4]. ఇది యొక నూతనమైన చారిత్రకనవల; శివాజి జీవితవృత్తము నాధారముగఁగలది [5]. ఆంగ్లప్రభావ మిందు వ్యక్తమగును.

## సుగుణవతీ పరిణయము [6]

దీనికర్త నేదునూరి [7] గణేశ్వరరావు. ఇది హిందూవివాహధర్మపరిణామమును నిరూపించునట్టి యొక నవల. ఆ నాఁడు జాతీయ విజాతీయ సంస్కారప్రభావముల నడుమ దేశ మెట్లున్నదియు నిందుమూలమున విదిత మగుచున్నది.

## రాణీ సంయుక్త [8]

కీ.శే.వేలాల సుబ్బారావు రచించిన దీ ప్రసిద్ధనవల. ఇది చరిత్రాత్మకము. ఆఫ్ఘనుల తొల్లిఁటి భారతదేశదండయాత్ర యిందలి కథావస్తువు పృథ్వీరాజుకాలములో

1. ఫిబ్రువరి 1908.
2. 2-3-1908 (ఇంతకుఁబూర్వమే (1907) వీరు ఆనందసాగరము, అను నవలవలన యశస్విలైరి.
3. 13- -1908. క్రీ.శ. 1901 నాఁటికే 'భువనమోహిని' వీరికిఁగీర్తిఁదెచ్చెను.
4. ము. సుబ్బారావు (1915) రచించిన 'కాంచనమాల' యనునవల యింకొకటి.
5. పబ్లిషర్ కొత్తపల్లి సూర్యారావు-కాకినాడ.
6. 15-6-1908.
7. 'నెందునూరి' అని ఆంధ్రవాఙ్మయ సూచిక, ముద్రిత గ్రంథకర్తలపట్టిక, పుట 259.
8. 14-3-1908. దీనికి సంపాదకులు శ్రీ కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావుపంతులు, ఎం.ఏ. ఇది జ్ఞానచంద్రికాగ్రంథమాల ప్రచురించిన నాలుగవ గ్రంథము.

నట్టి దండయాత్రమూలమున భారతదేశస్వాతంత్ర్య మెట్లు నశించినదియు నిందు వర్ణింపఁబడెను. క్రొత్తగా దురుష్కులు మనదేశమునకు వచ్చినప్పటి దేశస్థితియు, నప్పటి రాజుల యంతఃకలహములే యీ దేశపు పారతంత్ర్యమునకుఁ గారణమైన విధమును, బృథ్వీరాజు నతని భార్యయగు సంయుక్తమున్నగువారి స్వదేశాభిమానము, వీరరసము ననువానికిఁ బ్రసిద్ధికెక్కిన నవల. దీని ననుసరించి నాలుగునాటకములు గూడ వ్రాయఁబడినవి.

## ప్రఫుల్ల ముఖి [1]

వంగదేశ కవివరేణ్యుఁడు కీ.శే.బంకించంద్రుఁడు రచించిన "దేవీచౌధరాణి"యను నవల "ప్రఫుల్లముఖి" యను పేరిట శ్రీకనకవల్లి భాస్కరరావు(బి.ఏ.)చే ననూదితము. ఇది సర్వసద్గుణఖనియగు నొక సతీమతల్లి పుణ్యచరిత్ర; స్త్రీల కవశ్యము పఠనీయము. నిర్మలదేశానురాగము,స్వార్థత్యాగము, పరార్థప్రయోజనపరాయణత్వమున్నగుసద్గుణములకు నిలయమైన చిత్రకల్పితకథగలది యీనవల; మనలో నిట్టిమౌలికనవలలకుబాట వేసినది.

ఇందలి వృత్తమునకుఁ గొంత చరిత్రాధారమును లేకపోలేదు. ఈ నవలలో జెప్పఁబడిన 'దేవీచౌధరాణి' భవానిపాఠక(ఠాకూరు), గుడ్‌లాడ్‌సాహెబు (రంగపురపు కలెక్టరు) మొదలైనవారు దేశచరిత్రమునం దుదాహృతులు. ఈ కథకు సంబంధించిన చరిత్రాంశములును గొన్ని కలవు[2].

అనూదితవములైన నవల లీ యుగమునఁ బెక్కులు. వానిలో బంకించంద్రునివి యధికము అందును 'ప్రఫుల్లముఖి స్వతంత్రాంధ్రనవలల యంతటిప్రభావమును మనదేశములో నెఱపినది.

ప్రఫుల్లముఖియే యీ నవలకు నాయిక. ఈమెకు నాయకుఁడున్నాఁడు. కాని యీ నవలకు నాయకుఁడు లేఁడు. ప్రఫుల్ల యొక యాదర్శమూర్తి; కోడండ్రయందాణిముత్తెము; ఓర్పునకు భూదేవి; విద్యావతి; దీక్షానిర్వహణతత్పర; అభిమానవతి; సోత్సాహప్రసంగప్రగల్భ, ప్రజాసేవకురాలు.

---

1. ఇది 16-1-1909 నాఁడు "ప్రఫుల్ల" యను పేరిట ననూదితము.
   vide F.st G.G. catalogue of books published in the Madras Presidency– Suppliment June 1, 1909. page 28.
   "ప్రఫుల్ల ముఖి" యనుపేరు ద్వితీయావృత్తినాఁటి (11-12-1911) నుండి కలిగెను. చూడుఁడు. ఆంధ్రవాఙ్మయసూచిక–ముద్రిత గ్రంథములపట్టిక, పుట 118; చతుర్థ ముద్రణము 27-1-1946. విక్టోరియారాణి పావనస్మృతి కీ నవల యంకితము.

2. vide, "Statistical Account of Bengal" by sir. W. Hunter.

ఈ నవలను బట్టి మనదేశమున నాఁడల్లకల్లోలముగనున్న రాజకీయ పరిస్థితులు తెలియఁగలవు. ఔరంగజేబువంటి మహాబలసంపన్నుఁడూపిరివిడువకపూర్వమే యేకరాట్ ప్రభుత్వము రూపుమాయఁ బ్రారంభించినది. నాఁటి మన సాంఘిక పరిస్థితులకు గూడ నీ నవల రత్నదర్పణము. దీనిలోగల "దివానిశుల"ను పాత్రలయందలి సాంకేతిక ప్రతిపత్తి మనభాషలో నుత్తరోత్తర వెలువడఁగల మౌలికములగు నవలల సాంకేతికత్వమునకు మార్గదర్శకమైనది. ఆంధ్రనవలా సాహిత్యముపై నెఱపిన యీ ప్రభావమువలన దీని కింత ప్రాధాన్యము గలిగెను.

## మధురవాణీ విజయము[1]

ఇది యొక నవలిక; సాంఘికేతివృత్తముగలది. దీనికర్త ఎద్దనపూడి చెంచురామయ్య.

## చారుమతి[2]

ఇది స్వర్గస్థులైన రాజా మంత్రిప్రెగడ భుజంగరావు రచించిన నవల; సుగుణవతియైన యొక గృహిణిచరిత్ర.

## కమలాంబ[3]

కృపాబాయి సత్యనాథమ్మ దీని రచయిత్రి. ఇది యొక యాంగ్లనవల కనువాదము: మాతృకపేరుఁ'కమల.'

## కళావతి[4]

మలయాళములో చందుమీనను రచించిన 'ఇందులేఖ' ననుసరించి యిది కూర్పఁబడెను. దీనికర్త కీ.శే. దొడ్ల వెంకటరామ(మి) రెడ్డి. తెలుఁగులోనికి మలయాళము నుండి యనూదితములైన కొలఁదిమాత్రపు నవలలలో నిది చాలఁ బ్రభావవంతము.

---

1. 27-2-1909 (vide, F. st G.G. Suppliment, June 1'1909, page 28)ఆంధ్రవాఙ్మయసూచిక ముద్రితగ్రంథముల పట్టిక దీని ముద్రణకాలమును 1908 అని యిచ్చును. కర్తను బేర్కొనదు. చూడుఁడు, పుట 145.

2. 5-6-1909 పబ్లిషరు కీ.శే. నందిరాజు చలపతిరావు, మంజువాణీప్రెస్, ఏలూరు.

3. 27-3-1909 నాఁడు క్రిస్టియన్ లిటరరీ సొసైటీవారిచేఁ బ్రకటింపఁబడిన 'కమల'యను నవలయు, నిదియు నొక్కటియే; ఆంధ్రవాఙ్మయసూచిక ముద్రితగ్రంథముల పట్టిక దీని ప్రకటనకాలమునుగుఱించి యేమియుఁ జెప్పదు. చూడుఁడు, పుట 31.

4. రచయితయే ప్రచురణకర్త.(1909)

## కృష్ణకాంతుని మరణ శాసనము [1]

ఇదే పేరిఁట బాబు బంకించంద్రుఁడు రచించిన వంగనవలకైన యనువాద మిది. చిల్లరిగి శ్రీనివాసరావుగారు దీని యనువాదకర్త. దీనినే వేంకటపార్వతీశ్వర కవులు గూడఁబిమ్మట [2] ననువదించిరి. ఆ యితివృత్తమునకున్న ప్రజాదరమున కిది సాక్ష్యము

## శైవలినీ చంద్రశేఖరము [3]

ఇదియు బంకించంద్రుని మౌలికమైన కృతి. స్వర్గీయ తల్లాప్రగడ సూర్యనారాయణరావు దీని నాంధ్రీకరించిరి.

## జయసేన విజయము [4]

కొండిపర్తి వీరభద్రాచార్యులు దీనికర్త. ఒక యాంగ్లనవల దీనికిఁ బ్రాతిపదిక.

## విమలాదేవి [5]

కథావశేషులు భోగరాజు నారాయణమూర్తి విరచిత మీ నవల. దీనిని జరిత్రాత్మక మందురు. కాని యిది యెంత చరిత్రాత్మకమో యంత సాంఘికము; రాజపుత్ర శౌర్యప్రతాప నిరూపకమైన కల్పితకథ. మొగలాయి చక్రవర్తి ఔరంగజేబు పరిపాలించునట్టి దా కాలము. ఇది నాఁటి మతసాంఘిక రాజకీయపరిస్థితులకు దివ్వెపట్టునట్టి నవల.

విజ్ఞానచంద్రికవారి [6] ప్రథమప్రచురణము [7] దీనిమూలమునఁ గర్త యాంధ్రావనిలో నాశాంతముల యశోంబరములు నేసినాఁడు. నిర్భరపఠనోత్కంఠఁగలిగించుట దీని ప్రధానగుణము. కన్నడము, ఒరియామున్నగు నితరభాషలలోనికిఁ బరివర్తింపఁబడుటయే దీనికీర్తికిఁబతాక.

---

1. 25-2-1910. 2. క్రీ.శ.1914. 3. 28-4-1910. 4. 20-6-1910. 5. June 1919.

ఈ నవల ఒరియా కన్నడ భాషలలోని కనూదితము.

6. కీ.శే. రావిచెట్టు రంగారావు, శ్రీ ఆచంట లక్ష్మీపతి ప్రభృతుల సాహాయ్యమున స్వర్గీయ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు విజ్ఞానచంద్రికాగ్రంథమండలిని స్థాపించిరి.

7. అప్పటి కింకను విజ్ఞాన చంద్రికాగ్రంథమండలివారు బహుమతుల నిచ్చు నేర్పాటుఁ జేయ లేదు.

## అయివన్హో 1

ఐవన్హో స్కాట్ మహాశయుని నవలకు సంగ్రహరూపానువాదము. దీనికర్త కీ. శే. కేతవరపు వేంకటశాస్త్రి2. మనలో నిది చరిత్రవిషయికనవలలయం దనురక్తిం బెంచినది.

## రాధారాణి 3

శ్రీ చాగంటి శేషయ్యగారి యనువాదము. దీనిమాతృక బంకించంద్రుని నవలిక. ఈ నవలికయే యనేక సాహితీ పరులచే ననూదితము. తన్మూలమున దీని లోకప్రియత సువ్యక్తము 4. నిరుపేదబాలిక రాధారాణి. ఈమెకు గొప్పధనవంతుఁడగు దేవేంద్ర నారాయణరాయల దైవిక సమావేశమును, దదనంతరపరస్పర ప్రణయమును నిందు వర్ణింపఁబడినవి. మనభాషయందుఁగాల్పనికతను బెంపొందించిన నవలలలో నిది ముఖ్యమైనది.

## మాధవీ కంకణము 5

ఇది 'ది స్లేవ్ గర్ల్ ఆఫ్ ఆగ్రా' యను నాంగ్లనవల కాంధ్రీకరణము 6. స్వర్గీయ రమేశ చంద్రదత్తు దీనికర్త. కీ.శే.తల్లాప్రెగడ సూర్యనారాయణ(తణుకు) దీని ననువదించి ప్రకటించినాఁడు 7. అంతఃపురరహస్యచిత్రణములకు నపరాధపరిశోధనాదినవలలకు నిది మనలో మార్గదర్శకము.

---

1 గ్రంథమును బట్టి దీని రచయిత యెవ్వరో స్పష్టముగఁ దెలియదు. వావిళ్ల ప్రచురణము; 3–6–1910.

2. ఆంధ్రవాఙ్మయసూచిక, ముద్రితగ్రంథముల పట్టిక–పుట28.

3. ప్రకటితము 28–11–1910.

4. కీ శే. బాలాంత్రపు సూర్యనారాయణరావు–తణుకు–రాధారాణి–28–11–1910 ప్రకటన. కీ.శే. తల్లాప్రెగ్గడ సూర్యనారాయణరావు–తణుకు–రాధారాణి–(2–12–1910); కీ.శే. నడకుదుటి వీరరాజుపంతులు పీఠికతోడిది.

5. 10–2–1910.

6. 'The slave Girl of Agra.'

7. ఆంధ్రవాఙ్మయ సూచిక–ముద్రితగ్రంథముల పట్టిక– పుట–151.

## మదాలస 1

మదాలస యను యువతి విశ్వావసు వను గంధర్వుని తనయ. పురాణప్రసిద్ధిఁగల మదాలసచరిత్ర యీ నవల కాధారభూతము. ఇది యొక పౌరాణికనవల. కీ.శే. కేతవరపు వేంకటశాస్త్రి దీనికర్త 2. నేఁడు పౌరాణికనవల లనఁబడు వానికిది బీజభూతము.

## కళావతీ కళ్యాణము 3

'బ్రేవో ఆఫ్ వెనిస్' అనుపేరుఁగల యాంగ్లనవల నాధారముగ కనకవల్లి భాస్కరరావుగారు రచించిన దీ నవల. ఉత్తరోత్తర రాగల యాంగ్లానువాదముల కిది దారిచూపినది.

## దుర్గేశనందని 4

'తిలోత్తమ' దీని కింకొకపేరు. ఇవియేపేళ్ళుగల బంకించంద్రుని వంగనవల దీని మాతృక. ఆంధ్రీకరణమునకుఁ బూర్వమే యీఱుభాషలలోనికిఁ బరివర్తిత మగుట దీనిప్రాశస్త్యమునకు నిదర్శనము. శ్రీ చాగంటి శేషయ్యగా రాంధ్రమునందలి యీ దుహితృకకుఁ గర్తలు5. మొగలాయీల ప్రభుత్వారంభదశలో వంగదేశపరిస్థితు లెట్లున్న దియుఁ జిత్రించు నవల యిది. ఇందలి మిగిలిన కథావిశేషముల నన్నిటినిఁబూర్తి చేయునది వీరి 'నవాబునందిని 6 యను పరిశిష్టనవల.

ఇందు'పఠాను'లకు రసపుత్త్రులకును జరిగిన కలహ మత్యాశ్చర్యకరముగ వర్ణితము. కటుల్ ఖాన్ దౌర్జన్య సురాపాయిత్వములకును దుర్గాధీశ్వరుఁడగు వీరేంద్రసింహు డాత్మగౌరవ సహజప్రతాపములకును రాజామానసింహుని పుత్త్రుఁడగు జగత్సింహుఁడు

---

1. 14-10-1910 వావిళ్ళవారి ప్రకటన.
2. కీ.శే. ఉమ్రే ఆలీషాకవి విరచితమైన యింకొక నవల 'మదాలస' పేరిటిది కలదు.
3. Date of the issue from the press 3-1-1911. (పబ్లిషర్సు గున్నేశ్వరరావు బ్రదర్సు: రాజమండ్రి. 1910.అని ముఖపత్త్రముపై నున్నది).
4. ప్రథమావృత్తి 6-5-1911 ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలలో ప్రథమకుసుమ మిది. ద్వితీయావృత్తి 5-6-1913. ప్రచారిణీ గ్రంథమాల నిడుదవోలులో నున్న దినము లవి.
5, కీ.శే. వంగూరి సుబ్బారావు కూడ దీనిని 'దుర్గేశనందిని' అనుపేరిట ననువదించెను. కీ.శే. ఉలుల్లిగుండము రంగారావుచేగూడ(1-3-1912) నిది 'తిలోత్తమ' లేక-'దుర్గేశ నందిని' యనుపేరిట ననూదితము.
6. 'నవాబు నందిని' 1915.

వీరాధివీరత్వమునకును మూర్తిభవములు. అభిరామస్వామి యోజనా నైరంతర్య మునకును విద్యాదిగ్గజుఁడు మూఢత్వ ప్రపంచజ్ఞానహీనత్వములకును విమల చాకచక్య మనోధైర్య ప్రతీకారదీక్షా సమయానుకూల వ్యాపార పరాయణతలకును దృష్టాంతీ కరింపఁ దగినవారు. కథానాయిక యగు తిలోత్తమ నిష్కల్మష నిశ్చల భర్తృప్రేమకు నిధానము. ఆయేషా యాకాంక్షిత ప్రేమకును బరోపకార పారీణతకును నిదర్శనము. ఇట్టి చిక్కనిపదకముఁగల చక్కనినవలల యనువాదముల వలన1 నాంధ్రములో మౌలిక రచనలకొఱకై ప్రజాపక్షమునుండి నిరంతర నిరీక్షణమొక్కటి నిగిడి యా కల క్రమ క్రమముగ నిక్కల మయ్యెను.

## వసుమతీ వసంతము 2

ఇది యొక ప్రసిద్ధమైన చరిత్రాత్మకనవల3. శ్రీ వేంకట పార్వతీశ్వర కవులకుఁ జాల నభిమాన పాత్రము. ఇది వారి ప్రథమస్వతంత్ర రచనము. ఇందలిది సరళమైనభాష. వసుమతితో వసంతునకు జరుగువివాహము నాధారముగఁగలకథ దీనిలో బ్రధానవస్తువు. ఆ వసంతుఁడు చంద్రగుప్తమౌర్యుని సేనాధిపతులలో నొకఁడు. మౌర్యచంద్రగుప్తుని కాలమునకు సంబంధించిన పెక్కు విషయములతో గథ పెనఁగొనియున్నది 4. చంద్ర గుప్తుని రాజ్యప్రాప్తి, నందులమరణము, పాంచాల రాజ్యకలహములు, గ్రీకుల యపజ యము మున్నగు బ్రధానాంశములతో వసుమతీవసంతుల కల్యాణకథ కూర్పఁ బడెను. రాజనీతి నిపుణుఁడగు చాణక్యుని బుద్ధిచాకచక్య మందుఁ జక్కఁగ విశదీకృతము.

## విచిత్ర చరిత్ర 5

ఈ సాంఘికనవలిక వి. కృష్ణశర్మ విరచితము. శశిరేఖా చిత్రరేఖలను నిరువురు ప్రియసోదరీమణులు తమరు జీవితములో విడిపోవకుండుటకై క్రమముగ నొకరాజ కుమారుని, మంత్రికుమారుని వివాహ మాడుదురు. తత్ప్రయత్నములు, వానివిజ యము నీ నవలికలోని కథాంశములు.

---

1. 'నిపుణవతి', 'కృతఘ్నులు' వంటి ప్రయోగముల నిటీవలి ముద్రణము (1959) వఱకుఁ గూడ సవరించుటకు వారికి తీరిక లేకపోవుట శోచనీయము.

2. ప్రథమావృత్తి 21-6-1911

3. ఇది యాంధ్రప్రచారిణీ గ్రంథమాలాద్వితీయ పుష్పము.

4. కీ.శే. యం. గున్నయ్యశాస్త్రి దీనినిగూర్చి 'వసుమతీ వసంత మథనము'ని యొక విమర్శ గ్రంథమువ్రాసి క్రీ.శ. 1917లో బ్రచురించిరి.

5. 8-8-1911

## తారాబాయి [1]

ఇది యొక చరిత్రవిషయకనవల; నలుబదిరెండు ప్రకరణములు గలది. తారాబాయి యను నిర్భయ రజపూత వంశపు రాజపుత్రిక ధైర్యసాహసకృత్యములను గూర్చి వివరించుచున్నది. వీరికి పృథ్వీరాజు రత్నసింగు ననువారితో క్రమముగ వివాహ మగుటయుండలి వస్తువు. ఈ నవలాకర్త కీ. శే. కేతవరపు వేంకటశాస్త్రి[2].

## మనోహరి [3]

దీనికర్త టి.యస్. రామశాస్త్రి[4]. ఇదియొక సాంఘిక నవల. సంపద్దనాఢ్యమైన యొకానొక యాధునిక బ్రాహ్మణకుటుంబజీవిత పరిస్థితుల చిత్రణ మిందుఁగలదు.

## సువర్ణశృంఖల [5]

ఇది కీ. శే. కొత్తపల్లి సూర్యారావు విరచితమైన నవల సాంఘికేతివృత్తము గలది. యూసఫ్‌జులేఖా యను ఉర్దునవల ననుసరించి వ్రాయఁబడెను. జులేఖా యూసఫ్‌లను నాయికా నాయకులుగఁ గలిగిన నవల ఉర్దునందు బహుప్రసిద్ధమైనది.

## భ్రమరాంబ [6]

ఇది కేవలము కథగాదు; అట్లని పెద్దనవలయుఁగాదు; సాంఘికమైన నవలిక. 'భ్రమరాంబ'యను నాయికచరిత్ర మిందుఁ బ్రధానముగ వర్ణింపఁబడెను. దీనిని జెప్పిన వారు శ్రీ.బి.రామకృష్ణయ్యగారు.

## రాజసింహ [7]

ఇదే పేరుగల బంకించంద్రుని వంగనవలకున్న కన్నడానువాదమును బురస్కరించుకొని వెంకట పార్వతీశ్వరకవులుచేసిన యాంధ్రీకరణ మిది. ప్రసిద్ధమైన చారిత్రక విషయములు దీని కాధారములు.

---

1. ప్రథమావృత్తి ప్రకటన వావిళ్లరామస్వామి అండ్ సన్స్, మదరాసు (10-12-1911).
2. తారాబాయి అనునవల కీ.శే. బాలాంత్రపు నీలాచలము విరచితమింకొకటికలదు. (1925)
3. ప్రథమావృత్తి పుటలు 160. [21-3-1912].
4. రామశాస్త్రి టి.పి. అని ఆంధ్రవాఙ్మయ సూచిక-ముద్రితగ్రంథముల పట్టిక-పుట 394.
5. పుటలు 84. శ్రీ బాకి చినసూర్యారావు, ప్రకటన సరస్వతీప్రెస్,కాకినాడ. (21-3-1912).
6. ప్రథమావృత్తి [2-4-1912], పుటలు35; రచయితృప్రకటితము, వెంకటగిరిపట్టణము-ప్రజామిత్త్రి ప్రచురణము 2. [The People's Friend Series No 2].
7. ప్రథమావృత్తి; పుటలు 311, ఆంధ్రప్రచారిణీగ్రంథమాల 7.(10-9-1912).

## వసంతసేన [1]

శ్రీ.ఎ.వి.నరసింహముపంతులు కూర్చిన నవల యిది; చరిత్రాత్మకము. వసంత సేన యనునామె యిందు నాయిక; రాజకుమారియైయుండి బౌద్ధధర్మ మవలంబించెను. ఆమెకు తన మేనబావతో జరిగిన వివాహ మిందు వర్ణితము. హిందూబౌద్ధమతకలహ సంబంధములగు విషయము లిందుఁ బ్రాసంగికములై యున్నవి.

## సుందరి [2]

ఇది వితంతూద్వాహమును బ్రోత్సహించుచున్న సాంఘికనవలిక. కీ.శే.హార్ద(ర్ద) నూరు గోపాలరావు చెప్పినది[3].

## వాఁడేవీఁడు [4]

ఇదియొక నిరూపకనవల; కడుఁబ్రసిద్ధము; కీ.శే.దేవరాజు వేంకటకృష్ణారావు విరచితము. దీని కొక హిందీనవలలోని కథ యించుక ప్రాతిపదిక. కాని యిది స్వతంత్ర మైనదనియే యనిపించుకొనును. ఇందుఁ గూర్పఁబడిన విషయమొక హత్యాకాండకుఁ జెందినది.

ఆంధ్రలోకమున నప్పటికిఁ బ్రచురింపఁబడిన నిరూపకనవలలలో దనది ప్రథమ ప్రచురమని యీ నవలాకర్త చెప్పుకొనియున్నాఁడు. ఇందలి నిరూపకవిధి యసదృశము

దీని భాషాసుగమత్వమును బ్రశంసార్హమై యున్నది. ఆకర్షణీయమైన దిందలి సంవాదపరిపోషణము; వాక్యముల నిర్మాణమే వినూతనము; ఔత్సుక్యమును గొలుపు రచన. శాస్త్రీయమైన వర్ణన లిందుఁ బెక్కులు. ఆద్యంతము లాశ్చర్యము నాతురము భయమును జదువరుల మనముల ముప్పిరిగొను చుండును.

---

1. ప్రథమావృత్తి పుటలు 128; ప్రకటన, సి. కుమారస్వామినాయఁడు అండ్ సన్స్, మదరాసు (2–10–1912).
2. ప్రథమావృత్తి పుటలు 46 (12–10–1912)
3. కీ.శే. బారు రామారావు విరచితమైన 'సుందరి' (1902) నవల వేఱు.
4. ప్రథమావృత్తి 15–19–1912: పుటలు 276; శ్రీ తాపి ధర్మారావుగారు(బరంపురము) ప్రకటించిరి. ఇది వేగుఁజుక్క గ్రంథమాలా ప్రకటనము 2 (రెండవమరీచి)బరంపురము; గంజాము జిల్లా.

ఈ నవల మూఁడు భాగములు. రెండవభాగముపేరు 'నేనే'. 'కాలూరాయి' మూఁడవభాగము[1]. ఈ మూఁడు భాగములును జదువనిదే నవలపూ ర్తికాదు. నేనే, కాలూ రాయి అను రెండుభాగములును బహుస్వతంత్రములు. 'నేనే'యనఁగా విస్మయసాగర మని యర్థము వచ్చెననికూడఁ బెక్కం డ్రభినందించిరి.

మూఁడుభాగములుగల యీ నవలయందు 'జూమీలియా' యొక్క యద్భుతచరిత్ర ముత్కంఠాపాదకమై యొక్క గ్రుక్కలో మనచే జదివించివేయఁగలదు. ఆమె యుపా యములు మన గుండియల నవియవేయఁగలవు. దీనికిఁ బ్రతినిర్యాతనములగు అరిందముని పన్నుగడలనుబట్టి యివి యొకదానినొకటి మించిన వనిపించితీరును. ఇందుఁ జమత్కృతి లేని ప్రకరణమేలేదు; భావసమృద్ధిలేని పదములేదు; ధ్వనిరహిత శబ్దములేదు; పరనత్వరఁ గొలుపని సంఘటనమును లేదు.

## కమల పాలిక [2]

ఒక విద్యావతి ప్రేమించి పెండ్లియాడుట యీ నవలికలోని విశేషము. కమల పాలికయను పేరుగల కమ్మకులమునకుఁజెందినకన్య సాటికులమునకుఁజెందిన యువకుని వివాహమాడును. నాయకుఁడుకూడ విశ్వవిద్యాలయపట్టభద్రుఁడు. ఇరువథములయం దును దలిదండ్రులసమ్మతితో నుద్వాహము నిర్వర్తింపఁబడుట నాఁటి పరిస్థితులలోనే గాదు; నేఁటికిని జెప్పుకొనఁదగిన యంశము. ఎంత విద్యావంతురాలైనను స్వయంవర స్వాతంత్ర్యము నేఁటికిఁగూడ స్త్రీకి మనలో లభించుట యరిది. ఆనాఁటి సాంఘికాచార ములకు దర్పణ మీ రచన. కీ.శే. క్రొత్తపల్లి సూర్యారావువిరచిత మీ నవలిక.

## టిప్పు సుల్తాను [3]

'మెడోస్‌టెయిలర్'అను నాంగ్లరచయిత 'టిప్పుసుల్తాన్' [4] అనెడి నవల నాంగ్ల ములో రచించినాఁడు. దీని ననుసరించి కీ.శే.అక్కిరాజు ఉమాకాంతకవిశేఖరులు చరి త్రాత్మకమైన యీ నవల నదేపేరిట వెలయించినారు. ప్రసిద్ధవీరుఁడు 'టిప్పుసుల్తాను' జీవితమునకు సంబంధించిన దిందలికథ; కొంత చారిత్రకము; కొంత కల్పితము. దీనివలన నప్పటి హిందూమహమ్మదీయమతవిషయికసంబంధములేగాక భారతీయుల సాంఘికరాజ కీయాచారవ్యవహారములుగూడ విదిత మగుచున్నవి. సంఘటనల రామణీయకమున కిది ప్రసిద్ధి. దేశభక్తి యిందు సూచ్యము.

1. ఈ మూఁడవ భాగము (కాలూరాయి) పిమ్మటి దైనను పీ ప్రచురములోనుటంకించుట సౌకర్యార్థము.
2. మొదటికూర్పు (24–12–1912) పుటలు 86: రచయితృ ప్రకటితము, కాకినాడ.
3. ప్రథమావృత్తి (28-1-1913) ఆంగ్లమున నాంధ్రమునను దీనికి 32 పుటలపీఠిక,రచయితృ కృతమైనది కలదు. ఇదిగాక పుటలు 242. వావిళ్ల వారి ప్రచురణ.
4. 'Tippu Sultan' of Meadow's Taylor.

## సువర్ణ ముఖి [1]

శ్రీవఝ్ఝ(ల్ల)వెంకట సుబ్బారావు విరచిత మీ నవల; సాంఘికము. ఇది యొక పతివ్రత జీవితకథ. ఒక దుర్మార్గుని దుస్తంత్రములవలన సౌశీల్యవతియైన నాయిక యపకీర్తిపాలగుట యిందలి విషయము.

## సత్యాబాయి [2]

ఇది శ్రీయుతులు రత్నాకరము వెంకటప్పయ్యయు, తుమ్మగుంట కేశవరావును గలిసి రచించిన నవల [3]. ఇందలి నాయిక సత్యాబాయి. రాజపుత్రసేనానాయకుఁడగు సమరసింహునితో నామెకగు వివాహమునకుఁజెందిన విషయ మిందలికథ. బాబరుచక్రవర్తికిని జిత్తూరురాణాకును నడుమజరిగిన పోరాట మీ నవలకుఁ జారిత్రకపంజరమును గల్పించుచుండును. మొత్తముమీఁద దీనిని జారిత్రకమనుటయే యుచితజ్ఞత.

## పున్నాబాయి [4]

ఇది రాజకీయములకు సంబంధించిన నవల. దీనికర్త శ్రీసత్యవోలు అప్పారావు. పున్నాబాయి రాజపుత్త్రీల రాణి. తన భర్తను క్రూరులై చంపిన శత్రువులబారినుండి తనయుని రక్షించుకొనుటకై పున్నాబాయి పడుకష్టనష్టము లిందు వర్ణింపఁబడినవి. శిశుహత్యకుఁబూనిన దుష్టులపతన మిందలి ప్రధానాంశము.

## హేలావతి [5]

నిమ్నజాత్యుద్ధరణమును బ్రధానాంశముగఁగల యీ నవలిక కీ. శే. తల్లాప్రగడ సూర్యనారాయణది. సంఘమునం దడుగునఁబడియున్న జాతులజీవితమును జిత్రించుటయు హరిజనాదికము నుద్ధరించుబాధ్యత హిందువులదని ప్రబోధించుటయు దీని

---

1. తొలికూర్పు: పుటలు 164, ప్రచురణము పి. వి. రమణయ్య అండ్ కో. గుంటూరు, (8-1-1913)
2. ప్రథమావృత్తి: పుటలు 110, ప్రచురణ, రత్నాకరము వెంకటప్పయ్య, ఇనగల్లు, గుంటూరు జిల్లా, వివేకవర్ధనీ గ్రంథమాల, 2. (8-2-1913)
3. ఏక కర్తృక మనినట్లు ఒక్క తుమ్మగుంట కేశవరావు పేరిటనే యీ నవల 'ఆంధ్రవాఙ్మయ సూచిక' లో జూపఁబడుట గమనార్హము; పుట 218-అనాఁడు వేంకట పార్వతీశ్వర కవులును, నేఁడు ఇసుకపల్లి దక్షిణామూర్తి, మంజుశ్రీలు వంటి వారును గలిసి జంట రచయితలుగ నవలలు వ్రాయుట కలదు.
4. తొలిముద్రణము; పుటలు 112 (2-4-1913)
5. మొదటి కూర్పు; పుటలు 46 (9-5-1913)

ధ్యేయము లనిరి జాలరు. గాంధిమహాత్ముఁ డున్నైత మప్పుడే హరిజనోద్యమము నుద్దేశించెనో, లేదో! మాలపల్లి, సత్యసంకల్పము, త్రికాలవేదులు నను నిట్టి రచనములే నిదర్శనములు. ఈ నవలకర్త ఓలేటి నాపడే ప్లెక శ్రీ. వేంకట పార్వతీశ్వరకవులుగూడ 'మాతృమందిరము'నందు హరిజనదేవాలయప్రవేశ సురాపాననిషేధాదికములగు నుద్యమముల చేకొట ముఖ్యస్థానము గనిరి.

## కళాపూర్ణ [2]

దీనికర్త పి. ఆదినారాయణస్వామి[3]. ఇది ప్రధానముగఁ దత్త్వశాస్త్రసంబంధముఁ గల నవల. అద్వైతమతము, తత్త్వము నిందుఁ బ్రతిపాదితములు.

## శృంగారవల్లి [4]

సి. హెచ్. వి. కృష్ణమాచారి విరచితమైన యిది యొక నిరూపకనవల; ఒక దొంగలగుంపు జీవితచరిత్ర. దీనికి మదరాసునగరము కార్యరంగము. ఇందలి ఘటన లాశ్చర్యకరములు.

## సుహృల్లత [5]

శ్రీ వద్దంగి రామారావు రచించిన నవల యిది; మౌలికము; సాంఘికేతివృత్తము గలది. స్నిగ్ధత యమూల్యమైనదని సూచించుట దీని యాశయము.

## ఉదయలక్ష్మి [6]

కే. శే. కొత్తపల్లి సూర్యారావు విరచిత స్వతంత్రనవల. ఇందలి విషయము ప్రధానముగఁ గల్పితము. ఇందు నాయకుఁడు సుకుమారవర్మ; శృంగార ప్రవృత్తిఁగల యువకుఁడు. తనదేశపు రాజకుమారిని, నామెచెల్లెలినిగూడ వివాహమాడుట యను నది యిందలి వర్ణ్యము.

---

1. ప్రథమావృత్తి (1919)
2. మొదటి ముద్రణము; పుటలు 277 (15-6-1913)
3. పి. శ్రీనివాసరావు చెప్పిన 'కళాపూర్ణ' 1921 నాఁటి దది వేఱు.
4. ప్రథమముద్రణము; పుటలు 222 (18-7-1913)
5. ప్రథమావృత్తి పుటలు 240, వేగుఁజుక్క గ్రంథమాల 4, (1-9-1913)
6. మొదటి కూర్పు, పుటలు 104, (15-9-1913)

## రామలక్ష్మణ దేశయాత్ర[1]

(ప్రథమ భాగము)

హాస్యరసప్రధానమైనదీ నవలిక. శ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారి రచన. హిందువుల సాంఘిక జీవితములోని కొన్ని యంశములను నవ్వుగొలుపునట్లుఁ జిత్రించుట దీని యుద్దేశము.

## ప్రమదావనము[2]

ఇది శ్రీ వేంకటపార్వతీశ్వరకవుల స్వతంత్రనవలలలో ద్వితీయమయ్యు నద్వితీయమని ప్రసిద్ధిఁగన్నది. శ్రీకృష్ణదేవరాయలను నాయకునిగా స్వీకరించి శ్యామలను నాయికగా జేసి చిత్రించిచూపిన చారిత్రకనవల ప్రమదావనము. ఇది యెంత చారిత్రకమో యంత సాంఘికము ననఁదగును. ఇట్టివానిని మిశ్రచారిత్రకములనుట యుచితము. ఉన్మాదినిపాత్ర యిందలిది మనోహరము. ఆమెగీతముల మూలమునఁ బోషింపబడిన సాంకేతికత్వమును బ్రకృత్యారాధనప్రీతిపేరిట నెఱపఁబడిన వాతావరణఁ సృష్టియు నిరుపమానములు. 'ప్రమదావనము' తెలుఁగునవలఁకు నిజముగఁ బ్రమదావనము.

## రాయచూరు యుద్ధము[3]

కీ.శే. కేతవరపు వేంకటశాస్త్రిగారు రచించిన ప్రసిద్ధనవలలలో నిది ప్రథమమైనది. అట్లే యాంధ్రదేశచరిత్రకు సంబంధించిన నవలలలో ప్రథమమైనది. 'తారాబాయి' 'బొబ్బిలి ముట్టడి' మున్నగువానివలన వచ్చినకీర్తికంటె వారికి దీనివలన వచ్చిన కీర్తి యధికము. 'విజ్ఞానచంద్రికాగ్రంథమాల'నవలలకు బహుమతులను బ్రకటించిన పిదప వారు రంగములోనికి దుమికిరి.

ఇచ్చట వీరి నవలారచనావిధానమునుగూర్చిన ప్రస్తావము యుక్తము. కథాసంవిధానమునువృత్తాంతములుగ విభజించి వేఱువేఱు చీట్లపై వ్రాసి, యిష్టమువచ్చిన చీటినిదీసి దానితో నవలారంభముఁ జేసెడివారు. మఱల దీసినప్పుడే చీటివచ్చిన దానిలోని

---

1. మొదటి ముద్రణము 11—10—1913—పుటలు 51.
2. క్రీ.శ.1914
3. రచన క్రీ.శ. 1913. ముద్రణము క్రీ.శ. 1914

వృత్తాంతముతో రెండవ ప్రకరణ మారంభమయ్యెడిది. ఉత్తరోత్తరములగు వృత్తాంతము లన్నియుఁ బూర్వాపూర్వములగు వృత్తాంతముల కనుగుణమగునట్లు నవలలో ప్రకరణ ములుగూర్పఁ బడెడివి.

ఈ పద్ధతి నవలంబించుటవలనఁ గథాసంవిధానమునకుఁ బ్రౌఢిమ కల్గుచున్నది. కథయు మారదు. ప్రకరణములను గొన్ని కొలుకులవంటి యంశములచే గలుపవచ్చును. సందిగ్ధతాపూర్వకమైన పఠనౌత్సుక్యమును[1]గూడ సాధింపఁగలము. కూర్పులో బిగియు బిగియుఁ గలుగుచున్నది.

ఈ 'రాయచూరు యుద్ధము'లో తిమ్మరుసు రామయామాత్యుల శీలముల యందలి వ్యత్యాసము శిల్పదృష్టితో బరిశీలింపఁదగును. ఈ రెండును పరస్పరవిరుద్ధము లగు పాత్రలు. ఒక్కొక్క ప్రకరణమునకొక్కొక్క పాత్ర వర్తనమువలన పఠితలకు హృదయభారము గలుగును. తరువాతి ప్రకరణమునందు తద్భిన్నపాత్రలవలన నాభారము విమోచనము కాగలదు; భావావేశ ముపశమనమునొందఁగలదు. పాత్రచిత్రణమునం దిది ప్రతియోగపద్ధతి.

భావతీవ్రత నుపశమింపఁజేయఁగల యీ ప్రతియోగవిధానాద్యవలంబనము లాంగ్లనవలాసాహిత్యమునందు స్కాట్ మహాశయుని తరమునుండియు వచ్చుచున్నవి. కేవలము ప్రాచ్యవిద్యలఁజదివి తన్మార్గమునఁ బండితులైన కీ. శే. కేతవరపు వేంకట శాస్త్రివంటివారి విధానములను బ్రకటించుట యద్భుతావహము. అది వారి విశిష్టత. ఆయన చాలఁ బ్రతిభాశాలియనుట కిది తార్కాణ[2] తాము రచించియు ననారోగ్య కారణముల వలనఁ బ్రకటింపని కొన్ని నవలలు వారివి కలవని వదంతి[3]. పెక్కులు వీరి నవలలు 'సరస్వతీగ్రంథమండలి'చే బ్రకటితములు.

---

1. 'Suspense' అనునర్థమున "ఉత్సుకత"యని కొందఱు వాడుచున్నారు. (చూడుఁడు— సౌందర్య సమీక్ష పుట 32 (1956) రచయిత—ప్రాచార్య వేమూరి వేంకట రామనాథము ఎం. ఏ ; పి. హెచ్. డి. ఉస్మానియా విశ్వవిద్యాయలము) కాని 'సందిగ్ధతా పూర్వక' మనియు దానికిఁ జేర్పనిచో గేవలము 'త్వర' యనియే యర్థము రాగలదేమో !
2. వీరి 'యశస్తిలక,' 'దిలారామ' వంటివియుఁ బ్రశస్తములు.
3. "తెనుఁగు తోబుట్టువులు" మున్నగు నేడెనిమిది గ్రంథములు రచించిన స్వర్గీయ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారిని బ్రధానపాత్రగఁ జిత్రించిన యముద్రిత నవల యొకటి కేతవరపు వారిది యుండి యుండునని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి విశ్వాసము.

## విజయనగర సామ్రాజ్యము[1]

శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్యచౌదరిగారు దీనిని రచించిరి. ఇది విజ్ఞాన చంద్రికాగ్రంథమాలా పుష్పము[2]; ఆగ్రంథమాల నిర్వహించిన నవలాస్పర్థయందు బహుమానితము[3]. ఈ నవలయందు రచయిత తా నిర్మించిన చిత్తరువులకుఁ గల్పనా చాతుర్యముచే బ్రాణముపోయఁగలిగినాఁడు. ఈ సజీవత్వమనెడి గుణమే నాఁడీ నవలా పరీక్షకుల నాకర్షించిన ప్రధానలక్షణము.

ఇందలి కథాసారము విజయనగరసామ్రాజ్యపతనమే యైనను నవలాకారుని చేతులలో నా సామ్రాజ్యవైభవ ముత్కృష్టముగఁ బ్రకాశించినది. దీనిలోని కల్పన యందు కేవలము చాతుర్యమే కాదు; పటుత్వము, గాంభీర్యమునుగూడ నున్నవి. ఇది యాసాంతము చదువరుల కానందపారవశ్యము నిచ్చును. మహమ్మదీయచక్రవర్తు లీ నవలలో బహిరంగయుద్ధమునకుఁబూనుకొనరు; వారు మాయోపాయములఁ బ్రయత్నించుటయే, హిందూ సమ్రాట్టుల ప్రతిభావిశేషములను బ్రతియోగ పద్ధతిని భాసింపఁ జేయుచున్నది.

ఈ నవలలోని శైలి సరళమై, సహజసుందరమై మహాప్రవాహోదకమువలె సాగుచుండుటవలన నిందలి కొండలయంతటి దోషములు గూడ కొంచెమై తోఁచును

---

1. క్రీ. శ. 1913 రచన: ప్రకటనము 5-10-1914. సరిగ 2-5-1913 నాఁడు ప్రారంభించి 26-5-1913 నాఁడు (అనఁగా 26 దినములలో) ముగించినట్లు పీఠికలో రచయిత వ్రాసికొనిరి. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారి 'మహమ్మదీయ యుగము'నుండి దీని కథావస్తువు గ్రహింపఁబడినది. ఆచంట లక్ష్మీపతిగారీ నవలలో నందందు మార్పులుచేసి రచనకు వన్నె గూర్చిరని రచయితయే పీఠిక (పుట2)లో జెప్పిరి.

2 ఇది క్రీ.శ. 1913లో విజ్ఞాన చంద్రిక వారు నెలకొల్పిన బహుమతి పరీక్షకు వచ్చిన పది నవలలలో రు. 500 ల బహుమతిగన్న నవల.

3. కేతవరపు వేంకటశాస్త్రిగారి 'రాయచూరు యుద్ధము' కూడ నీ నవలల స్పర్ధయందొకటి. డాక్టరు. సి.ఆర్. రెడ్డి యాంధ్రవిశ్వ విద్యాలయోపాధ్యక్షు లీ నవలలఁ బరీక్షించిన వారిలో నొకరనియు వారి యభిప్రాయమును బట్టి 'రాయచూరు యుద్ధము' ఉత్తమ మగుటచే దాని ప్రచురణమునకై పిమ్మటఁ బ్రోత్సహించి రనియుఁ దజ్ఞులు చెప్పుదురు. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వారిలో నొకరు.

వర్ణనలు స్వాభావికములై పాత్రానుగుణములుగ నున్నవి. బహుధీరుఁడును న్యాయపథ ప్రవర్తకుఁడును నగు చక్రవర్తి యుండలి రామరాజు. ఇతని కాత్మ విశ్వాసము మెండు; కౌటిల్యము క్రొత్త విషయము. స్వామిద్రోహులగు ఆదిల్ శాహా–చక్రధరులు కుట్రలు చేయుదురు. వానిని గూర్చి బుద్ధిసాగరుఁడు రామ రాజునకుఁ గన్నువిప్పు గలిగించును. కాని చక్రవర్తి యార్జవము దుస్తంత్రములను నమ్మదు; కుటిల బుద్ధులు పన్నినట్టి యుచ్చులలో జిక్కుకొనును. ఎట్టకేలకు లోపము నెఱిఁగికొని రామరాజు పశ్చాత్తాపముచే దన్నుదా నిందించుకొను వాక్య ములు చదువరులను గదలింపఁగలవు.

ఈ నవలలో బుద్ధిసాగరుని నీతియు రాజభక్తియు నిస్తులితములు; శ్లాఘా పాత్రములు. స్వర్ణకుమారీ జగన్మోహినులు రూపశీలాలావణ్యాతిశయములును విద్యా బుద్ధి వైభవములును గల నాఁటి భారతీయ నారీమణులకుఁ బ్రతినిధులు. తమ భర్తలు వలదని బతిమాలినను వినక వారితో రణరంగమునకేగుట వీరి పాతివ్రత్యమునకును, శౌర్యమునకును బ్రబల సాక్ష్యము. నాఁటి వీరశిఖామణుల గుణ గణమునకు విజయ సింహుని మూర్తీభవ మనవచ్చును. చరిత్రాంశములయందు బొసఁగిన దొసఁగు లిందలివి ప్రమాదవశములైనను రచయిత కథాసన్నాహమునకై బుద్ధిపూర్వకముగఁ జేసిన విపర్యాసములని సమర్థింప యోగ్యములై యున్నవి.

## సుధాశరచ్చంద్రము[1]

రమేశ చంద్రదత్తు రచించిన 'తాళ్ళ సరస్సు'[2] అను నవల దీనికి మూలము. కీ. శే. చిలకమర్తివారు దీనిని స్వతంత్ర రచనయా యనుకొనునట్లుగ స్వేచ్ఛాను వాదము చేసినారు. రెండు మూఁడిట్టి వచ్చువాదములు ననుసరణములు నున్నను కీ. శే. చిలకమర్తివారివి స్వతంత్ర రచనలే యధికము.

## శ్మశాన వాటిక[3] లేక విషభుజంగము[4]

అప్పటికే 'మిథునాను' రాగము రచించి లబ్ధకీర్తులైన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు దీనికర్త.[5] పిదప వెలువడిన వీరి 'ఆత్మబలి' ప్రతిష్ఠ యాత్మబలిదే! ఈ శ్మశాన వాటికకుఁ బిమ్మట 'విషభుజంగ'మని పేరిడిరి. రెండు వందల యేబది యేండ్లకుఁ బూర్వము తుల్యభాగానదీ తీరమునందు 'పులిగోరు' అనునొక తాటాగ్రామము. దాని

1. క్రీ.శ. 1915
2. 'Lake of Palms'of Ramesh Chandra Dutt.
3. క్రీ.శ. 1917. 4.'విషభుజంగమ'ను పేరిట 23–7–1952లో 'శ్మశాన వాటిక' నే తిరిగి ప్రకటించిరి. 5. క్రీ.శ. 1914.

'ఠాణేదారుఁడ'గు గోవిందభట్టాచార్యుని హత్యచేసినవాఁడు, రామవరపు నివాసియు, గరణమునకు దాయాదుఁడును నగు భుజంగరాయఁడు. ఆ 'ఠాణేదారు'ని జ్యేష్ఠ పుత్త్రుఁడు ప్రసాదరాయలు. భుజంగుని దుర్మార్గముల నడచుటలో గాయపడి స్వర్గస్థుఁడగుట యిందలికథ. రాజాజ్ఞచే వాని గృహోద్యానమునఁ బ్రసాదుని చితి నిర్మింపఁబడును. ప్రసాదుని గళేబరము నూరేగించి తెత్తురు. దాని కగ్ని సంస్కారము జరుగును. అగ్నిహోత్రము చితి నలువంకల నలముకొన్నది. ఇంతలో బ్రసాదుని గృహిణి రాధాదేవి వచ్చుచున్నదన్న కోలాహలము. ఊరిలోని నారీమణు లెల్లరు ధీరయై వచ్చుచున్న రాధపై పూలవానఁగుటియుదురు. రాధ కిదేమియుఁ దెలియదు. వా రామెకు వందనము లర్పించిరి. ఆమె చితిని సమీపించినది. భరింపలేక యెల్లరును గన్నులు మూసికొని క్షణములో మఱల విప్పి చూచిరి. భర్తృదేహముతో బాటుగ నామె కోమల తనువల్లి కయు గమిలిపోయినది.

'నీ పరితాపము హృదయ పూర్వకమేయైనను నియమస్థితి కొఱకు నిన్ను శిక్షింపక తీరద'ని రాజు భుజంగునితో బలికినాఁడు. "మీరు విధించిన దండన ననుభవించుటకు నేను వెనుదీయుట లేద"నుచు భుజంగుఁ డచ్చట సంసిద్ధపఱుపఁ బడియున్న యుప్పుపాతరలోని కుటికెను. రాజభటులు క్షణములో నాతని నందు సమాధి చేయుదురు.

ఇది కలియుగ రామాయణము. ప్రసాదుఁడే రాముఁడు; మహేంద్రుఁడు లక్ష్మణుఁడు; రాధ సీత; రాధాపహారి భుజంగుఁడు, రావణుఁడు. రాధాబంధ విమోచనుడు కుమారస్వామి హనుమంతుడు. సాంఘిక రాజకీయాది కల్పనచే రామాయణకథయే యీ కథగా నల్లఁబడెనా! యనిపించును.

ఈ నవలయందు 'భుజంగరాయఁడు' ప్రతి నాయకుఁడు. ఇతఁడు లేనిచో నీ నవలయే లేదు. భావావేగము లేనిచో నితఁడు లేఁడు. తీవ్రచిత్తతయే యతనిని నడపించు జీవశక్తి. అదియే యాతని చేతన. కామక్రోధాది దుష్టభావములు గాని, భక్తి, కృతజ్ఞతా పశ్చాత్తాపాది సద్భావములుగాని తన్ను గదలించునప్పుడు వానిని బ్రకటించుటలో నతఁడు జూపు తీవ్రతనుబట్టి భుజంగరాయని భావావేగి యనక మానలేము.

ప్రధానముగఁ గామమను భావ మావేశించుటచే నీతఁడు దైవసముఁడైన గోవింద భట్టాచార్యుని [నాయకుని దండ్రి] చిత్రవధకుఁ గారణభూతుఁ డైనాఁడు. దుర్విటులకుండు స్వ సౌందర్యమదముకూడ వీని కామావేశమున వెల్లడింపఁబడినది. ఈతని కావేశించిన కామ పిశాచము 'రంగసాని' యను వేశ్యతోడి సాంగత్యమునకుఁ దొందరించి యొక యాఁడిగవాని సాయమున నిశీథమం దామె కవమానముఁ చేయించును. తత్కాలమున కువిటుఁడైన భుజంగుఁడు సార్థకనామః డైనాఁడు.

నిరాశ యను భావము కలిగెనేనియు నీతని యావేశమును బట్టలేము. కోపా గ్రహోవిష్టుఁడైనప్పుఁడిక నీతని పాపతీవ్రతకుఁ బట్టపగ్గములే యుండవు. సర్వము దెలిసియుఁదెలియని భుజంగుడు మూర్ఖశిరోమణి. ఈతని యౌదార్య మశక్తదుర్జనుల యౌదార్యము. దుర్బుద్ధితో రాధాదేవిని హరించిన కలియుగరావణుఁడగు భుజంగుఁడామెను 'మాతా!' యనుట భక్తిలోని తీవ్రతకు సుదాహరణము దగినది.

తొలుత నితఁడు నివురుగప్పిననిప్పు; పిదప కుబుసము విడిచిన కోడెత్రాఁచు. సాధుజనులను బాధించినఁగాని దుర్మార్గుల వినాశము దాపరిల్ల దనెడి నుడి కీతని చరిత్రము సజీవోదాహరణము. ఇట్టి యీతని యావద్గుణములయందును బూసలలో దారమువలె మెలఁగుచున్నది భావావేగ మనుట సత్యాభిధేయము.

ప్రసాదరాయ లీ నవలయందు ప్రధాననాయకుఁడు. భుజంగునివలన బాధల నొందుచుండియుఁ దుదివఱకు నోర్మివహించిన మహావీరుఁడితఁడు. ఆత్మగౌరవము-గాంభీర్యము—కారుణ్యము—పౌరుషము-సాధుత్వము—ప్రజానురక్తి—సేవాధర్మము, పితృభక్తి, బంధుప్రీతి, దుష్టశిక్షణాభినివేశము, కృతజ్ఞత, యుత్సాహము మున్నగు సుగుణము లీ ప్రణయైక శీలికి జీవనాధారములు. ప్రసాదునియందు తండ్రి దివ్యాంశము నిక్షిప్తమై యున్నది. అరిమర్దనుఁడై నెగడిన యీతనిని తండ్రికివైన యశోగాంభీర్యము లలంకరించినవి. ఇతఁడు మృతజీవుఁడు.

ఈనవలలో నాయకుఁడగు ప్రసాదునిసతి రాధాదేవి. సీత రావణునివలన భంగపడిన ట్లీమె భుజంగునివలన భంగపడుట పాఠకులకు కలవరపడచును. కాని యీమెకుఁ గల సౌజన్యము, సౌభాగ్యము, సౌమనస్యము, సౌశీల్యము, వివేకము, నభిమానము, కృతజ్ఞత, ధీరత మున్నగునవి నేఁటి మన నారీమణులకు నొరవడి యగుచున్నవి.

ఒరులకొఱకై యనేకకష్టము లనుభవించిన పురుషసింహుఁడు కుమారస్వామి; రామాయణములోని హనుమంతునివంటివాఁడు. ఒక్కమాటలోఁజెప్పినయెడల నితఁడు సానలుదీరిన జాతిరత్నము.

కొంత సద్వస్తువినాశనమువలననేగాని సంఘమందలి కాలుష్యము క్షాళనము గాదనెడి 'షేక్స్పియరు'మహాకవి విషాదాంతనాటకములసిద్ధాంత మిందు నిరూపింపఁబడును.

## ఆంధ్రరాష్ట్రము[1]

ఇదియొక చారిత్రకమైన నవల. దీనిని లబ్ధప్రతిష్ఠులైన[2] కీ.శే. భోగరాజు నారాయణమూర్తి రచించిరి. కాకతీయుల సామ్రాజ్యకాలములో గణపతిదేవునిపుత్త్రిక రుద్రాంబ[3] యనునామెకు సంబంధించిన కథాభాగ మీ నవలయందు వర్ణితము. చరిత్ర యందు స్వల్పముగనున్న కథాంశములను స్వీకరించి వీరు చక్కనికల్పనతో సహృదయ హృదయాకర్షకమగు సంఘటనలతో వినీతిసూచకముగ దీనిని రచియించి యున్నారు. స్త్రీస్వాతంత్ర్యము, దేశోద్ధరణము నభిలషించునట్టి యీ కాలములో నిట్టివి యుపకార కములైనవి యనుట నిస్సందేహము. తమ ఇతరనవలలయందుకంటె వీరి యాశయ మిం దుత్కృష్టముగ సిద్ధించుటచే దీనికిఁ బ్రాధాన్య మీయకతీరదు.

చరిత్రనుబట్టి చూడఁగా రుద్రాంబకు సంబంధించిన కథాంశ మిందు బహ్వాల్పము. కాకతీయసామ్రాజ్యమును గొంతకాలము బరిపాలించుట యనునదియే యీమెకు సంబంధించిన చారిత్రకకథ. అట్టి కథాలేశమును స్వీకరించి కొన్నిపాత్రలను గొన్ని యవాంతరకథలను గల్పించిన రచయితచే నిట్టి మిశ్రచారిత్రకనవలయందు రసపుష్టి కావింపఁబడినది.

గణపతిదేవుఁడు జైనులను వధించెను. అందువలన వారు కాకతీయసామ్రాజ్య మునందు ద్వేషము వహించిరని చరిత్రప్రసిద్ధి. ఏ రీతిగ నాఁటి యాంధ్రరాష్ట్రము ప్రబలశత్రుబాధితమైనదియు నీ నవలలో బ్రదర్శితము. జైనాచార్యుని యుద్యమము, వాని రహస్యలేఖలు మున్నైనవి తద్వేషము కావ్యరూపముఁ దాల్చుటకు నిదర్శనములు. ఇందు సుందరపాండ్యమహారాజు జటావర్మయు దేవగిరిప్రభువు మహాదేవరాజును మఱి కొందఱు సామంతులునుగలిసి కుట్రచేయుట తాము స్త్రీపరిపాలనమున కంగీకరింపమికి సాక్ష్యము. త్రిపురాంతకుఁడొకఁడు మహాపరాక్రమశాలియై కాకతీయసామ్రాజ్య సంర క్షణశీలియై దానికి సాహాయ్యపడుచున్నట్లుమాత్రము కలదు. తత్ప్రకారము వాని పరాక్రమాదిసుగుణము లీ నవలయందుఁ గార్యరూపమును దాల్చినవి.

చరిత్రాంశసమ్మిశ్రితమైన యిట్టి నవలలో గొంత కథాభాగము కల్పింపఁబడక తప్పదు.అట్లు కల్పితమయ్యు నదియథార్థమన్న భ్రాంతినిగొలుపుటయందే దాని నవలా లక్షణ మిమిడియున్నది. ఆ నవలాలక్షణమిందుఁ బ్రత్యేకముగ సంపూర్ణముగ సమ న్వితమగుట కొరకు స్త్రీపాత్రసృష్టి యావశ్యకమయ్యెను. ఆ యావశ్యకతమూలమున నీ నవలలో 'ఏకవీర'పాత్ర మిక్కిలి ప్రధానముగ నిబద్ధమైనది. ఇట్టి హేతువులచే మొత్తముమీఁద నిందుఁ గథాకల్పనము సరసముగనే కుదురుకొన్న దనవలెను.

---

1. క్రీ.శ 1918. 2. "విమలాదేవి" (1910) "అస్తమయము (1916)" ఆంగ్లరాజ్యస్థాపన (1917), ధరణికోటఁ 1917) మున్నగు నవలలవలనఁ గీర్తి మున్నె గుత్తకొనిరి.3.తండ్రి యనంతరము రుద్రాంబ క్రీ. శ. 1261–1295 వఱకు రాజ్యమేలినది.

రుద్రాంబ తీర్థయాత్రకుఁబోవుట యనునది యింకొక ప్రధానవిషయము. కాక తీయప్రభువులకు ఏకవీరారాధనాదులు ప్రధానములని చరిత్రయొసఁగు సాక్ష్యముతో నీ కల్పన పొందిపొసఁగియున్నది. దీనివలన రుద్రాంబకుఁగల దైవభక్తియు సంప్రదాయా నుసరణమును గుణశీలములును సువ్యక్తములగును. అంతియేగాదు. కుమారదేవుని బంధనమున కీ తీర్థయాత్రాచరణశీలము మూలము. ఏకవీరపాత్రప్రాధాన్యమున కిదియే యాధారశిల. తాత్కాలికసాంఘికాచారవ్యవహారాదులఁగూడ నిందువలనఁ దెలియ నగును. ఆ యాహేతువులచే నీకల్పన మనోహరముగ నున్నది.

## రూపవతి [1]

ఈ చరిత్రాత్మకనవల రచించినది శ్రీమతి అట్లూరి వేంకట సీతమ్మగారు. ఈమె యుభయభాషాప్రవీణ; 'కవితావిశారద' ప్రథమముద్రణమున స్ఖాలిత్యములు మెండుగ నున్నవి. ద్వితీయావృత్తిలో గొన్ని సవరింపఁబడెను. అయినను వాక్యముల కన్వయము కుదుర్చుకొనుట కష్టము. ఈ నవలాకర్త్రి దీని కాధారమైన కథను కీ.శే.చిలకమర్తి లక్ష్మీ నరసింహము "రాజస్థానకథావళి"లోని 'మోకలరాణా' చరిత్రమునుండి స్వీకరించినది.

ఈ కథాకాలమున మేవాడ దేశమును 'ముకుళుఁడ'ను (మోకల్ రాణా) రాజు పాలించుచుండెను. ఆయనకాలములో నుత్తరభారతమందలి ఢిల్లీసార్వభౌము లసమర్థులు. దానిచే నెక్కడఁజూచిన నక్కడ నల్లరులు; దేశము దంతటను దెక్కలి మూఁకలు. ఆ నాఁ డున్నతరసపుత్త్రివంశసంజాతులలో 'సుజా'యను వాఁ డొకఁడు. అతనికి యౌవన వతియగు నొక కూఁతురు. ఆమె పేరు రూపవతి. వసంతర్తువునం దొకనాఁ డామె తన యుద్యానవనమునఁ జెలికత్తెలతో వసంతపూజఁ జేయబోవు యెడవిపోయిలచే నప హరింపఁబడెను.

ముకుళరాణా తాతకు నీచవంశజాతయం దుదయించిన 'కాచమేరుల'నువా రా రాణాయందు బద్ధవిరోధులై యాతనిని జంపి మీవారురాజ్యము నపహరింప నడవిదొంగ లతో గుట్రలుపన్నుచుండిరి. వీరు తమ కపటమును వెల్లడిచేయక దొంగలను జంపునెప మున రాణా నడవికి గొనిపోవుదురు. మంత్రి దాని నెఱిఁగి ప్రతివిందుఁడను సేనానాయ కుని రహస్యముగఁ బంపి యప్పటి కా యాపదనుండి రాణాను పరిరక్షించును. ఎట్టకేల కొకనాఁడు కాచమేరు లిద్దరును సంధ్యావందనము చేసికొనుచున్న మహారాజునుబట్టి ఖండించివేసిరి.

---

1. రచన క్రీ.శ. 1918: ప్రథమ ముద్రణము 1926; సవరణకూర్పు 1933. Approved by the text book committee in Madras (composite) state; Fort st George gazette, D/ 15-11-1932.

ఆటవికచోరులు రూపవతి నపహరించిన దినములలోనే వారికిని గాచమేరులకును స్నేహము కుదిరినది. దొంగలయొద్దకు రాకపోకలుచేయు కాచుఁడు రూపవతిని గాంచి కామించినాఁడు. పిదప వారి కమిత ద్రవ్యాపేక్ష గలిగించి రూపవతిని వనదుర్గమైన రాటకోటకుఁ గొనిపోయి కాచుఁడు చెఱఁబెట్టి తన్ను వివాహమాడుమని నిర్బంధింప మొదలిడెను.

ఇచ్చట మీవారుమంత్రియు యువరాజగు శ్రీకుంభుఁడును రాణామృతి విని మిగుల దుఃఖించి మార్వారు రమణీపాలుని సాహాయ్యమునొంది ప్రతివిందాదిసైన్యాధిపతులతో దొంగలగుంపును బట్టనేఁగిరి.

'సుజా' పుత్త్రికకొఱకై దుఃఖించి, దుఃఖించి యామె నన్వేషింప ననేకప్రదేశములు త్రిమ్మరి త్రిమ్మరి తుద కెట్లో రాటకోటయందామె యున్నట్లుగఁ దెలిసికొని వచ్చుచుఁ ద్రోవయందు రాణాను గలిసి యాతనికిఁ గాచమేరుల రహస్యము లెఱిఁగించి వారలను బంధింప నాతనిని వెంటఁగొనిపోయెను.

బృందారిక, రూపవతియొక్క దాసీపుత్త్రిక. ఆమె పురుషవేషమున బుధవర్మ యనుపేరిట రూపవతిని వెదుకఁబోయినది. కాచునికూఁతురు సునంద, తనతండ్రి బారినుండి రూపవతిని రక్షించి యామె యభిమానమును గాపాడి తనకూఁతువలెఁ జూచుకొనెను.

తుదకు 'సుజా'వలన ద్రోవనెఱిఁగి యర్థరాత్రమందు రాణామున్నగువారితో బోయి రాటకోటను బట్టుకొని కాచమేరుల సంహరించి మేవాడుదేశము ప్రవేశించి శ్రీకుంభుఁడు పట్టాభిషిక్తుఁడైనాఁడు. ఆ మహోత్సవదినములయందే రూపవతీప్రతివిందులకు వివాహము.

రసపుత్రశూరశిఖామణియైన 'సుజా' పడినకష్టములు ఫలించుటయే యీ కథలోని సారము. సుగుణసంపన్నుఁడగుఁ బ్రతివిందునియుఁ, బ్రేమకును గృతజ్ఞతకును బేరువడిన రూపవతియొక్కయు స్నిగ్ధతకు నెలవైన బృందారికయొక్కయు శీలము లీ నవలలో బోషింపఁబడినవి.

భారతదేశమున రాజకీయస్వాతంత్ర్యాభిరతి ప్రజాహృదయక్షేత్రములలో నింకను నంకురములెత్తని దినములవి. తెలుఁగుజాతికిఁ జెందిన చరిత్రయే నవలారచనకు యోగ్యమన్న భావములు మనలో దరువాతఁ దరువాత నుదయించెను. ఆ నాఁటికిఁ జారిత్రకపరిశోధనలు బాగుగజరిగి మనజాతిచరిత్రయని యొకటి ఘనత కెక్కలేదు. ఉత్తరదేశఁపు గథను జేపట్టుటచే నావాతావరణచిత్రణ మనివార్యము. కాని మన నవలాకర్త పాత్రలపేళ్ళు మున్నగు నప్రధానవిషయములయందుఁదప్ప ప్రధానవిషయములయందౌత్తరాహాచారవ్యవహారములను స్ఫురింపఁజేయఁజాలలేదు. నాఁడు తెలుఁగునవలఁలయున్న ప్రాథమికదశ కీ 'రూపవతి' రూపవంతము.

## మాతృ మందిరము 1

ఇది రెండు భాగములు; శ్రీ వేంకట పార్వతీశ్వకవుల స్వతంత్ర రచనము. తమకుఁ బ్రీతిదాయకములును లోకమున కానందదాయకములును నగు వీరి 'వసుమతీ వసంత ప్రమదావనము'ల తరువాతఁ జెప్పఁదగినదయ్యు దీనికొక విశిష్టమగుఁ బ్రాధాన్య మున్నది.

ఈ సాంఘికనవలయందు నాయకుఁడు రంగఁడు; జనత్మః బ్రాహ్మణుఁడు; దొంగలచేతఁ బెంపఁబడి యబ్రాహ్మణుఁ డయ్యెను. అయ్యును జన్మసంబంధిసాత్త్విక గుణములవలన సాటివారిచేత గోహత్యాదికమును మాన్పించుట వీనియందు గమనింపఁ దగిన సంగతి. తుదకు బ్రాహ్మణేతరయగు మాలెతను బెండ్లియాడఁగోరి రంగఁడు దేవాలయమునకు వచ్చును. తన జన్మవృత్తాంతమును నాతఁ డచ్చటఁ దెలిసికొనఁగలిగి నాఁడు. సంఘ శ్రేయస్సుఁ గోరి2 వివాహము మానివేసినను దా నామెనుమాత్రమే ప్రేమించుచున్నానని రంగని ప్రమాణము. ఆ ప్లవకన్యయుఁ దా నట్లాతనినే ప్రేమించు చున్నానని శపథముచేయును. నాయికానాయకు లెవరికులముకట్టుబాటును వారు నిల్పు కొందురు. రచయితలు ప్రేమధర్మమును నిలఁబెట్టిరి.

సహవాసము, సహజీవనము, వభ్యుదయమువనఁగా సాంకర్యముగాదని పాత కులకును దెలిసివచ్చును. లింగజ్ఞానాతీతమైన యతిలోకప్రేమసామ్రాజ్యము నీ లోక మున వారు నెలకొల్పుటవలన రసజగత్తులు పులకింపఁగలవు.

కవిభావనా ప్రపంచనిర్మితమైన పవిత్రచిత్రమందిరప్రతిబింబమే యీ భౌతికప్రపంచ నిర్మితమాతృమందిరము. స్వాభావికమైన స్వరూపముచేత సాక్షాత్కరించుచున్న సనా తనధర్మజ్ఞానవిద్యోతితజ్యోతిర్మూర్తియే యిందలి ప్రబోధానందస్వామి. భౌతికభావనా ప్రపంచముల సంఘటనవేళాసంజనిత బింబప్రతిబింబరూప సంప్రకాశితమైనది యిందలి యితివృత్తము. పతజ్జాగ్రతానంద స్వప్న నేపథ్యమునుండియే యీ నవలయందలి పాత్రలు బహిర్గతములైనవి. అదే సమయమున 'అహింసాపరమోధర్మః,' 'ఆత్మవ త్సర్వ

---

1. క్రీ.శ. 1919. "హేలావతి"యందు గాంధిమహాత్మునికంటెను వీరికంటెను గూడ ముందు (1913లో) హరిజనోద్ధరణోద్యమావశ్యకతను నిరూపించిన తల్లాప్రగడ సూర్యనారా యణగారు బహుదూరదర్శులు: ఋషితుల్యులు.

2. వంగదేశమునుండి "జమీందారుల" మూలమున నాంధ్రదేశమునకు వ్యాపించిన బ్రాహ్మమత ప్రభావము వీరిపై నగపడుట లేదు. వీరు నీ విషయము నంగీకరించిరి.

భూతాని', 'పరోపకారార్థ మిదం శరీర'మ్మను కొన్ని దివ్యశ్రుతులు వినఁబడెను. అవి వెంటనే యీ'మాతృమందిరము'న బ్రతిధ్వనించినవి. ఆ దివ్యధ్వనుల కతురరూపకల్పన సంకల్పమే యీ నవలాసృష్టికిఁ బ్రధానహేతువు.

సాంఘికరాజకీయదృష్టివిశేషముచే దీనిని బరిశీలించినచో హరిజనదేవాలయ ప్రవేశోద్యమమునకుఁగాని మద్యపాననిషేధోద్యమమునకుఁగాని గాంధిమహాత్ముఁడానాఁటికింకను ముందంజవేసినట్లు గానము. ఇట్టి యుద్యమముల యారంభమునకు ముందే శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు సత్యసంకల్పముతో నట్టివానిని తమ నవలలలో బ్రతిపాదించుట కవులు త్రికాలవేదులు, క్రాంతదర్శులు నగుదానికి నిదర్శనము.

పోఁగా నింకొక్క రహస్యము. ఈ నవలలోని కొంత కథాభాగము నాఁడు స్థానికులైన[1] యొకానొక చిన్న 'జమీందారు'గారి[2] జీవితచరిత్రలోనుండి యీ రచయితలు స్వీకరించిరఁట[3]!

## రాజారత్నము[4]

రాజారత్నమను నొక యనూయకురాలికథ కీ. శే. చిలకమర్తివారి యీనవల కాధార మగుచున్నది. ఇది యాద్యంతము నీజారిరయొక్క వైవాహికజీవితముతో ముడిపడియుండెను. రామలింగస్వామి తన కొమార్తవివాహమునిమిత్త మప్పుపడుట, యా యప్పుగూడ శంకరరాజగు దన వియ్యంకునిపైఁబడుట, యట్లు పోయిన ధనము నకై యా వియ్యంకుఁడు తన కుమారునకు మాఱుమనువుఁ దెచ్చుట, తండ్రి సొమ్ము నంపకుండుటచే గొడుకు మదరాసులో నిక్కట్టులపాలగుట, తుదకు మామ కోడలికి మందుఁబెట్ట నిశ్చయించుట తత్కారణమునఁ బొరపాటువలన దైవయోగముచే నతఁడు దానే నాశనమొందుటయు ననునవి యిందులోని ముఖ్యసన్నివేశములు.

---

1. శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారి జన్మస్థానము "మల్లాము" (పిఠాపురపరిసరము). కీ. శే. వోలేటి పార్వతీశముగారి జన్మస్థానము "కొమరగిరి" (పిఠాపురప్రాంతమే). అందుచే నా చిన్న 'జమీందారుఁడు' పిఠాపురప్రాంతీయుఁడు.

2. వారు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి బంధువులని బాలాంత్రపు వేంకటరావుగారి పలుకు.

3. నాకీ విషయము స్వయముగ శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారు పిఠాపురములో 22–9–1957 (ఆదివారము) నాఁడు చెప్పిరి.

4. క్రీ.శ. 1919;

ఈ ఘట్టములన్నిటితోడను రాజారత్నమునకు కింతయో యంతయో సంబంధ ముండును. ఆమెమాత్రము నవలలోనున్న యన్నిసన్నివేశములయందును దాను ప్రత్యక్షముగఁ గన్పింపదు. కాని సన్నివేశము లన్నిటికి నామెయే భారకేంద్రము[1]. ఇందీమె వృత్తము మూఁగపాత్రాభినయముగ సాగినది.

శంకరరాజు, గోవిందరాముఁడు నిద్దరును భావమఱఁదులు. వీరు చెడునడత లన్నియు నడతురు. తుదకు నమ్మించి కోడలి నింటికిఁదెచ్చుకొని పెరుఁగులో పాషాణము గలిపిపెట్టి చంపవలెనని సంకల్పించుకొనిరి. కాని దైవవశమున నా పెరుఁగు తమరే త్రాగునట్లుగఁ బరిస్థితులు సంఘటించుటవలన వారే మరణింతురు. ఆశాపిశాచావిష్టుఁడై యొరుల కపకారముఁజేయఁ దలఁచుకొనువాఁడు తప్పక తానే చెడుననెడిది దీనివలని గుణపాఠము. రచయిత కీ నవలానిర్మాణమునం దొక ముఖ్యోద్దేశ మున్నదని తెల్లము కాగలదు. కథాసన్నాహ మేమంత పెద్దదిగు వైన సన్నివేశములతో బఠనాకౌతుకితులఁ జేయునట్లు సంగ్రథింపఁబడినదిగా దోఁపదు. తుదకు రాజారత్నము కాఁపురము చక్కఁబడుటతో గ్రంథసమాప్తి.

## శ్యామల [2]

శ్రీ వేంకట పార్వతీశ్వరకవుల యీ నవలపై "క్వింటిన్ అండ్ డెర్వర్డ్"[3] అను నాంగ్లనవల కెంజాయలు ప్రసరించినవి. ప్రాతిపదికమైన యీ యాంగ్లనవల యందలి నాయకుఁడు పినతండ్రిని జంపి యాత్మహత్యకుఁ బాలుపడినవాఁడు. ఆవిషయమువకుఁ గొంచెము చరిత్రాధారము ననుసంధించి యీయాంధ్రరచయితలు తమ నవలకు మెఱుఁగులు తుఱఁగలించిరి.

## గణపతి[4]

ఇది కీ. శే. చిలకమర్తివారి హాస్యరసప్రధానమైన నవ . కీ. శే. కందుకూరివారి 'సత్యరాజాపూర్వదేశయాత్రలు' కంటె నిందు నవలాత్వమధికము. కావుననే నేఁటికిఁ గూడ నాకాశవాణి ప్రభుత్వశాఖవారు దీనిని శ్రవ్యనాటకముగఁ బరివర్తింపించి ప్రదర్శింపించుట జరుగుచున్నది[5].

---

1. Centre of Gravity
2. ముద్రణము క్రీ.శ, 1920. దీనినీ ప్రకరణమున విమర్శించుటకు ప్రధానహేతువిది 1919 నాఁటిరచన మగుట.
3. 'Quintin and Derward' of Scott.
4. ముద్రణము క్రీ. శ. 1920. ఇది 1919 నాఁటి రచనము. కావున నీప్రకరణముననే విమర్శింపఁబడుచున్నది.
5. ఆకాశవాణి, హైదరాబాద్, హాస్యవల్లరి కార్యక్రమము 'గణపతి' ఆఱవభాగము—23-5-1959 శనివారము; గణపతి— హాస్యవల్లరి "కార్యక్రమ విమర్శన" చూడుఁడు, "చుక్కాని" సంచిక 15, [1-6-1959]

ఈనవలా ప్రారంభమునందలి స్వప్నవృత్తాంతము పూర్వప్రబంధములలోని స్వప్న వృత్తాంతమును బుణికిపుచ్చుకొనెను. ఆద్యంతము నిది హాస్యముతో దొణికిసలాడు కృతి. దీనిని జదువునపుడు 'డాన్ క్విక్ సాట్' తప్పక తలఁపునఁ బారఁగలదు1. ఈ రచన రెండుభాగములు. రెంటను మూఁడుతరములవారిచరిత్రము వర్ణితము. మొదటితరమున బాపయ్య దిక్కుమాలి శవములుమోయును; తరువాత గంగాధరుఁడు నీళ్లకావడులు; మూఁడవతరములో గణపతికి మిగిలినది యాయవారము. తమతమ వృత్తులను సమర్థించుకొను సందర్భమున వారివారి చర్చలు హాస్యస్ఫోరకములు. తలపాఁగయనిన గంగాధరునకు గంపెడంత ప్రీతి. 'కోటు' 'జునపాలజుట్టు', టక్కుటక్కుమనుచెప్పులు నన్నచో గణపతికి నితరము నొల్లమాలిన యిష్టము. ఈ వంశమున కంతటికిని సాధారణముగ వచ్చిన మహాభాగ్యము 'కుక్షిప్రోద్భవనిష్ఠురక్షుధ'.

గంగాధరునకును శివునకును సామ్యముచెప్పు సందర్భములో రచయిత చమత్కరించును. శివుఁడు గంగాదేవినిమోసి గంగాధరుఁడుకాఁగా, నీతఁడు నీళ్లకావడులుమోసి గంగాధరుఁ డయ్యెనఁట! ఇట్టి చర్చలలోనిహాస్యము ప్రస్తూయమానమనుట నిజము.

గణపతి తన జీవితయాత్రసాగించునిమిత్త మనేకశ్రమలకుఁ దలయొగ్గినాఁడు. అందుకొన్నికొన్నిటివలన నతఁడు తెలివిగలవాఁడనుటకు వీలుదోఁచుచున్నది. కాని మొత్తముమీఁద నతఁడు వట్టి వెట్టివాఁడని చెప్పనొప్పును. అతఁడు చేయుపనులుకొన్ని హాస్యముగొల్పుచున్నను గొన్ని వానిపై నసహ్యమును బుట్టించుచున్నవి.

వీనిచేష్టల నందు దుదాహరణములతో సమర్థించుటవలన రచయిత కీతనియం దాదర మన్నట్లు వ్యక్తమగును. అట్టివాని పాత్రయందుఁ బ్రధానముగ మాతృభక్తిగనుక నేమాత్రమైన నేర్పుతో హత్తుగొలిపియున్నచో నవలకు మఱింత వైశిష్ట్యము నాపాదించి నట్లయ్యెడిదేమో! తన వివాహవిషయమును బ్రసంగించుచున్న తల్లిశలపై మొట్టుట, యూమెపు గట్టుట, తినుచున్నయన్నముఁదెచ్చి తల్లినెత్తిపై రుద్దుట వంటి చేష్టలు వానిపై నసహ్యము గలిగించుచున్నవి.హాస్యమునకు జుగుప్సయేకదా స్థాయి యని

---

1. "సత్యరాజాపూర్వదేశయాత్రల"లోని లంకాద్వీపకథ 'గలివర్సుట్రావెల్సు' న కనుసరణము ఈ అనుసరణములో సన్నివేశముల యనుసరణ మున్నంతగా భావానుసరణము లేదు, దానికిఁ గారణము............" [తెలుఁగుసాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము"— పుట 356,పంక్తులు 11–13;(1960)] అవి భావానుసరణము లేనందుకుఁ గారణములు చూపఁబడినవి. వీరేశలింగముగారి యనుకరణశీలతచూపుట వీరభద్రరావుగారికి గర్తవ్యమైనట్లు నరసింహముగారి యనుకరణశీలతచూపుట నాకుఁగర్తవ్యముకాదు. కాన నావిషయమున లోఁతునకుఁ బోవుటలేదు.

ప్రశ్న రాఁగా నది యింతకంటె నుదారమైన పద్ధతులవలన నుసాధ్యమని సమాధానము. అందువలన నీ నవల యుదాత్తతగలిగి రససిద్ధినొందిన హాస్యమునకుఁ జిత్ర మనునపుడు జంకు గలుగును.

బడిపంతులుగ నున్నప్పుడు పిల్లల నాతఁడు బెట్టిన యమయాతనలను గూర్చి చదువుచో గోపము రాకమానదు. ఏదేనిఁ బ్రమాదకరముగాని హాస్యమును బ్రదర్శించుచుఁ బ్రవర్తించినయెడల నాతనియందు మన కుదారభావములు గలుగ వచ్చునేమో! కాని యిట్టి దుర్మార్గునియందు మనకుండెడి కొంచెము మంచిభావము గూడ నశించును. ఈ పరిహాసమునే వేఱొకతీరుగఁ జిత్రించియున్నచో నీతరమువారికిఁ గూడ నది తలయూఁపఁదగియుండి యీ నవల యధికమగు బ్రశస్తినొంది యుండెడిది.

అష్టకష్టములుబడి తుదకు గణపతి పెండ్లిచేసికొనును. కాని యతఁడా పెండ్లిపీఁటల మీఁదినుండి లేచి పారిపోయినాఁడు. అతనివంశ మంతటితో నశించును. ఈతని తల్లియందే కొంత సౌమ్యత కనిపించుచున్నది. ఆమె తిట్టునట్టు బండతిట్లెడపదడప నుపయోగ పడు నల్లమందు వంటివి. సహజముగఁ దల్లియనునపుడు మానవునకుఁగలుగు సద్భావము కొంత యీమెవలన నశించుటయు విచారకరము.

ఇట్లు గ్రంథమంతయు కించిదూనోదాత్తహాస్యముతో నిండి చదువరులను వెన్నాడు సన్నివేశములచేత మాత్ర మలరారు చున్నది. చిలకమర్తివారి చరిత్రాత్మక ములలో 'కర్పూరమంజరి' యెంతకీర్తికెక్కెనో హాస్యరసస్ఫూర్తిఁగల కల్పితనవలలలో 'గణపతి'యు నంతకీర్తికెక్కెను. కథనచాతురి, కథాసృజనము, రసపుష్టియుఁగల గద్య రచనమున చిలకమర్తివారు సిద్ధహస్తులగుటయీ కీర్తిపతాకకుధ్వజము. వీరేశలింగముగారి హాస్యమును, పానుగంటివారిహాస్యమును కలుకుఁదనము గలవి. పైవారిహాస్యము చిక్కన; వీరిహాస్యముచక్కన. ఒకటి గిల్లిచూచును, వేఱొకటి గిలిగింతలు గొల్పును.

ఆనాఁడు ప్రసన్నముగఁ గథను నడుపుటయే రచయితలకుఁగల దృష్టి. అందుచే రానున్నకాలమునందలి శిల్పదృష్టితో దానిని బరీక్షింపరాదు. కావుననే యీ ప్రకరణ మునఁ జాలవఱకు నవలలలోని కథాంశములను నవలాకర్తల యుద్దేశములను సంగ్రహ పఱచుటజరిగిన దనవలసియున్నది. శిల్పపరామర్శ ముందుముందు ప్రకరణములకుఁజెందు విషయము.

## సాహిత్య సంస్థల సేవ

ప్రసిద్ధులలో నొక కొందఱినిగూర్చి మాత్రమే యిం దుటంకింపఁబడెను. ఉట్టంకింపఁదగినవా రింకను నీ యుగమునఁ బెక్కురు రచయిత లున్నారు. కొన్నికొన్ని ప్రసిద్ధనవలావిశేషములకుఁ గొందఱుకొందఱనే ప్రతినిధులుగ నెంచి పరిశీలించినను గూడ

నిందఱు రచయితలైరి. మిక్కిలి ప్రసిద్ధమైన నవలలలో స్వర్గీయులు చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులు, భోగరాజు నారాయణమూర్తి[1], వంగూరి సుబ్బారావు, కేతవరపు వేంకటశాస్త్రి, కొత్తపల్లి సూర్యారావు, సోమరాజు రామానుజరావు, దేవరాజు వేంకటకృష్ణారావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీయుతులు వేంకట పార్వతీశ్వరకవులు, చాగంటి శేషయ్య వంటివారి నవలలకుమాత్రమే పునరావృత్తి భాగ్యము పట్టినది. కడమవానికి లేదు. వారి యీ భాగ్యమునకు హేతు వున్నది. అది యన్యోన్యాశ్రయ హేతువు; సహకార హేతువు. వా రొకొక్కరొకొక్క సంస్థ నాశ్రయించిరి. ఆ సంస్థయు వీరి నాశ్రయించినది. అది పరస్పరాశ్రయబలము. వారు స్వతఃప్రకాశకు లగుటకూడ నా భాగ్యమునకుఁ దోడు.

ఆ సంస్థలో బ్రఖ్యాతములైనవాని నెఱుఁగుట ముఖ్యము. అవి చేసిన సాహిత్యసేవ నాఁ డపారమైనది.

## ౧ విజ్ఞాన చంద్రికా మండలి[2]

స్వర్గీయ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుపంతులు మహారాష్ట్రమున నపార పాండిత్యమును సంపాదించి జన్మభూమియగు తెలుఁగుదేశమునకువచ్చి మునగాలలో పితృపైతామహము నాచారముచొప్పున రాజావారికి 'దివాను'లుగ నున్నప్పు డిది వ్యవస్థాపితము. కాన నీ మండలికి వారు జీవగఱ్ఱ. తెలంగాణఁపు వైతాళికులయం దొకరగు కీ. శే. రావిచెట్టు రంగారావు[3], శ్రీ ఆచంట లక్ష్మీపతిగారితోఁబాటును మునగాల రాజాగారగు రాజా వేంకట రంగారావు బహద్దరుగారితోఁబాటును కొమఱ్ఱాజువారికి విజ్ఞానచంద్రికామండలిస్థాపనయందుఁ దోడ్పడిరి. దీని ప్రచురణ లకు విజ్ఞానచంద్రికాగ్రంథమాలాప్రచురణములని పేరు .

---

1. కాకతీయాంధ్రులకును మహమ్మదీయులకును గల మతరాజకీయసంబంధములఁగూర్చి వెల్లడించు వీరి "అల్లాహో అక్బర్" ప్రసిద్ధిఁగన్న నవల.
2. క్రీ.శ. 1906లో "మునగాల" యందు నెలకొల్పఁబడెను.
3. "నల్లగొండ" మండలమునఁగల "దండపల్లి" గ్రామము వీరి జన్మస్థలము. తండ్రిగారి వలెనే వీరును మున్నబుదారు. ఆయూరఁ దమయింట క్రీ. శ. 1901లో శ్రీ కృష్ణదేవ రాయాంధ్రగ్రంథాలయమును స్థాపించినది వీరే!—విజ్ఞానసర్వస్వము—మూఁడవసంపుటము— పుట 992—వరుస 1—పంక్తులు30—33(1959). ఈ విజ్ఞాన చంద్రికామండలి మదరాసునకుఁ బోవువఱకు రంగారావుగారు దానికి నెఱపినసేవ నిస్సీమమైనది.

దేశీయులలో నాధునికవిజ్ఞానమును, స్వాతంత్ర్యాభిరతిని, దేశచరిత్రజ్ఞానమును ప్రధానముగ నభివృద్ధిఁజేయుటకీ మండలి నెలకొలుపఁబడెను. దేశచరిత్రలు, పదార్థ విజ్ఞాన, రసాయన జీవవృత్త శాస్త్రాదులు, మహాపురుషుల జీవితములునేగాక యాంధ్రదేశ చరిత్రాత్మకనవలలుగూడ నీ మండలిచే ప్రోత్సహింపఁబడినవి.

చింతామణీపత్త్రికాముఖమున కందుకూరివారు నవలలకు బహుమతుల నిప్పించునాచారము[1] నెలకొల్పి నిర్వహించినట్లే[2] విజ్ఞానచంద్రికామండలీముఖమున కొమఱ్ఱాజువారును జారిత్రకనవలలప్రచురణము నిర్వహించిరి.[3] ఈ మండలివారి ప్రథమబహుమతి నందుకొన్న నవల దుగ్గిరాల రాఘవచంద్రయ్యచౌదరిగారి "విజయ నగరసామ్రాజ్యము[4]." వేలాల సుబ్బారావుగారి 'రాణీసంయుక్త'యు, భోగరాజు నారాయణమూర్తిగారి 'విమలాదేవి'యుఁ దత్ప్రకాశితములు.[5] నాఁటినవలల స్పర్థ యును బహుమతుల యేర్పాటును జరుగలేదు. విజ్ఞానచంద్రిక యాంధ్రికి నపార మైన సేవఁజేసి సార్థకనామధేయమైన మండలి; నిర్మాతయు చిరస్మరణీయుఁడు.

ఆంధ్రదేశచారిత్రకనవలల ప్రచురణమూలమున నీ మండలి మన కాధునిక సాంస్కృతికసౌధోపరితలస్థితద్వారకవాటమును దెఱచియుంచెను. దానితో మన దేశమున సాంస్కృతికముగ నొక నూతనయుగమే ప్రవర్తిల్లినది.[6]

---

1. గవర్నర్‌జనరలగు మేయో ప్రభువు ప్రకటనయే వీరి నెల్లరనిట్టి బహుమానప్రదానము లకుఁ బ్రోత్సహించెనని యూహింపఁదగును.

2. క్రీ.శ. 1891—1899 నడిమికాలము.

3. "ఈ గ్రంథమాలలో గావ్యనాటకములకుఁ జోటులేదు. (ఆంధ్రరచయితలు, పుట 239—ప్రథమ ముద్రణము 1950) అనినవాక్యము నవలల ప్రకటనవిషయమునందు బాధకమున రాదు. "చరిత్రానుసారులగు ( Historical)కల్పితకథ (Novel) లెవరైన వ్రాసినేని వానిని బ్రచురింప నియ్యకొంటిమి"—విజ్ఞానచంద్రికా గ్రంథమాలాప్రకటనము. చూడుఁడు "రాణీ సంయుక్త" పుట 192—తరువాతిది. (ప్రథమ ముద్రణము).

4. ఈ నవలను ఖండించుచు కీ.శే.గురుజాడ అప్పారావు 'వ్యాసచంద్రిక'లో 2 పుటల వ్యాస మున్నది చారిత్రకములైన యసంగతిదోషములు పెక్కుఁగలవని యీ విమర్శన సారాంశము.

5. క్రీ.శ. 1907,1910నాఁటివి.

6. కీ.శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు స్వయముగా నొక కథానికఁగూడ రచించిరనియు, నది తెలుఁగున తొల్లిఁటిదనియు- నొక వినుకలి కలదు. ప్రబలప్రమాణము లుపలభ్యము గామి, వివరింపలేము.

## ౨. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయము [1]

శ్రీ కొవ్వూరి చంద్రారెడ్డి 'జమీందారు' దీనికి గౌరవాధ్యక్షులు; శ్రీ అయ్యగారి నారాయణమూర్తి గౌరవసంపాదకులు. శ్రీ వేంకట పార్వతీశ్వరుల కీర్తి వైజయంతి నెత్తినది, యాంధ్రప్రచారిణీగ్రంథమాల. 'ఆంధ్రప్రచారిణి' కట్టిపేరు ప్రతిష్ఠలు కూడుటకుఁ గారణము వేంకట పార్వతీశ్వరకవులు. దీని ప్రసక్తితో వారి సంగతి యను ప్రసక్త మనుట యనివార్యము.

ఈ కవుల మేలి కలయికవలన నాంధ్రప్రచారిణి నెలకొనెను. దీని కార్యస్థానమునకు సూత్రపాతము తణుకు; నాఁటి కృష్ణామండలము. ఒక్కయేఁడాది పిమ్మట నది నిడదవోలు, తదుపరి రాజమహేంద్రవరము, కాకినాడ, పిఠాపురములు[2] సంచారము ముగించుకొని రామచంద్రపురములో నేఁడు స్థిరనివాస మేర్పఱచుకొన్నది.

తొలుదొలుత దీనికి శ్రీ కొవ్వూరి చంద్రారెడ్డి గారి సహకృతి. వారి చేతి చలువ వలననే దాని కా ఖ్యాతియు. సురవరము ప్రతాపరెడ్డి తెలంగాణమున కెట్లో చంద్రారెడ్డి యొక విధముగ నాంధ్రమున కట్లు. నవలల పోషణ విషయమునం దాంధ్ర ప్రచారిణితో వంతునకు వచ్చు సంస్థలు మన నేలలో మూఁడో నాలుగో. అందును జక్కని వచన వాఙ్మయమును బోషించినవి తక్కువ. క్రీ.శ.1930 వఱకు నీగ్రంథమాల మహోన్నతదశయం దున్నది. అప్పటికి దీని ప్రచురణలు నూట డెబ్బది వెలువడినవి; నేఁటికి రమారమి మూఁడు వందలు, నాఁ డాంధ్రప్రచారిణికిఁ బ్రాణముపోసినది. నవలాసాహిత్యము. దీనివలన నది దేశమున నాలుగు మూలల వెల్లడి యయ్యెను. అది తిరిగి నవలాసరస్వతిచే బట్టుసెల్లాలు కట్టించినది.

అందుఁ బెక్కు నవల లనువాదములు గానవచ్చును. వానిలో బెక్కు వేంకట పార్వతీశ్వరకవులవి. వారి యనువాద వైఖరి విశిష్టము. దానిని గూర్చి సంగ్రహించుట యప్రస్తుతము కాదు. వీరి యనువాదములఁ గూర్చి లోకమున భిన్నాభిప్రాయము లున్నవి. [3] అనువాదనవలా సాహిత్యమునకు వీరివలన జరిగిన యుపకారాపకారముల చర్చ వచ్చుచో గమనింపఁ దగినవి యొకటి రెండంశములు.

---

1. క్రీ శ. 1911
2. ఈ ప్రకరణమున నాయానవలల ప్రచురణమునుగూర్చి యథసూచికలో జెప్పునపుడు పెక్కు చిన్న చిన్న గ్రంథమాలల ప్రసక్తి రానేవచ్చినది.
3. శ్రీపాలనంది జగన్నాథస్వామిగారు రచించిన "విమర్శకవ్యాసావళి" ఆఱవవ్యాసము— "రవీంద్రనాథఠాకూరుగారి గోరా" అను శీర్షిక— పుటలు89—97 (ప్రథమావృత్తి 1954, యం. శేషాచలం అండ్ కంపెని, మచిలీపట్టణము).

ఈ కవు లిరువురును గురుముఖమున సంస్కృతమును గాని యాంగ్లమును గాని యధ్యయనము చేయలేదు; నవలారచనమునకుఁ గావలసినదానిని మించి యాంధ్రసాహిత్యజ్ఞాన మలవఱచుకొనిరి. వంగభాషలో నతఁరాస్యతకలదు.[1] కన్నడము నాంగ్లములలో వెలసిన వంగనవలల కనువాదములు మిత్రులచే జదివించి చెప్పించుకొని వీరు మూల గ్రంథములు రచింపఁబడిన వంగవాఙ్మయమునం దభిరుచిని బెంపొందించుకొనిరి. ఆ భాష లోని సొంపులు, సొదుగులు, కల్పనలపొంకములును వారి భావాంబరవీథియందు హత్తుకొనఁగలవు. దీనికిఁగారణము వారి భాషాకృషి కాదు. బంకించంద్రుల కభిమతమగు భావవైభవాస్వదచిత్తప్రవృత్తి యొకటి వీరి నావహించెను. అన్యభాషల నెన్నింటినో తెలిసినవారికంటెఁగూడ వీరు మన భాషాయోషకు మనస్సున కెక్కునటుల సేవచేసిరి. వీరి నవలలలోని రచనాసౌందర్యమునకు వీరికీర్తియే తారాణ్కణ.

అనఁగా ననువాదమున దోషములు లేవనికాదు; ప్రమాదములు, నందును ప్రబలమైనవే కలవు. అనువాదములకు వారికిఁగల యుక్తమాధికారిత్వమును బ్రశ్నించుట వలనఁ బ్రయోజనము శూన్యము. అవి యథామాతృకములు గావు.కొన్ని తావులయం దనేకకారణములచేత దోషభూయిష్ఠములు. వీరివలన మాతృకాకర్తల కింకను గీర్తి రావలసినదే! మాతృకల కన్యాయము జరిగెనేమో! కాని స్థూలముగఁ గథాభాగ మవగత మగుటవలన నాంధ్రపాఠకులకుమాత్ర మానందానుభూతివిషయములో తలుగు లేదు. వారి భాషాజ్ఞానము పెరిఁగినది. దేశమున ననువాదములచదువు మిఱుటచే మునుపటి కంటెఁ గథగట్టునేర్పు మనలో మెఱుఁగెక్కెను. లోకప్రియతయు సంపాదించుకొన్నది, యీ యనువాదకర్తల శైలి. వారి దోషములవలన నాంధ్రనవలాలోకమున కపకారము జరుగలేదు. ఎవరెంత నిరసించినను దేశమునకు భాషకుఁ దోడ్పడుచున్నచో, ననువాదములఁగూడ సమాదరణీయములగుట రూఢము. నాఁడె బ్రాహ్మసమాజోద్యమము వీరికి వంగసాహిత్యాభిమానమును నేర్పలేదు. అందలి నవలల ఖ్యాతియే వీరి యభిమానమునకు హేతువు. కావుననే వీరి వంగానువాదము లన్నియు శ్రీవేంకటాచార్యులవారి కన్నడపరివర్తనములనుబట్టి కావింపఁబడెను. కొంతవఱకు గాంధిమహాత్మునికంటె ముందే యనేకోద్యమముల నూహించినది, పాదరసమువంటి వీరిబుద్ధి. వీరిగ్రంథమాలా విరచిత నవలాకుసుమోపాయనము తెలుఁగుతల్లికి మెడలో బూలమాల. వీరి నవలాసాహిత్య సేవ యాంధ్రమాతకుఁ 'బ్రమదావన'విహారము.

## 3. వేగుఁజుక్క గ్రంథమాల [2]

ఇది పంచమ జార్జిచక్రవర్తికి ఢిల్లీలో జరిగిన పట్టాభిషేక మహోత్సవమునెడఁగల గౌరవమునకుఁ జిహ్నముగ నా నాఁడు గంజాము మండలమునందు బరంపురంలో నెల

1. తమ వంగభాషాజ్ఞానము స్వల్పమని శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారే యంగీకరించిరి.
2. క్రీ.శ. 12–12–1911 నాఁడు వ్యవస్థాపితము.

కొలుపఁబడెను. సంవత్సరమునకు నాలుగునవలలఁ బ్రకటించుట దీని నిబంధావళిలో ప్రధాననిబంధనము. పాఠకులు దీనికి చందాలిచ్చి నవలలుకొనుట యేర్పాటు. దీనియందు. బ్రచురముచేయఁదలఁచిన నవలలకుఁగొన్ని నియమములున్నవి.

పాత్రపోషణ, శీలోన్మీలనము, నవ్యభావములు 'ప్రకృతివర్ణనలు' చరిత్రప్రసిద్ధ సుందర దృశ్యములు నను ప్రత్యేకలక్షణలక్షితములైన నవలలనే వారు మన్నించిరి.

ఈ గ్రంథమాలాధ్యక్షులు శ్రీ.యన్.రామానుజస్వామిగారు (బి ఏ;బి.యల్;). శ్రీ.టి ధర్మారావు(బి.ఏ.) దీనియందుఁ బ్రచురణయగు గ్రంథములకు సంపాదకులు. ఈ సంస్థకు కార్యదర్శులు శ్రీదేవరాజు వేంకటకృష్ణారావుగారు. దీని కార్యాలయము నెలకొనిన పట్టణము బరంపురము. వేగుఁజుక్క-గ్రంథమాల క్రీ.శ.1919ముగియునాఁటికి బ్రకటించిన నవలలు పదునొకండు 'వానిలో' వాఁడేవీఁడు. 'నేనే' 'క్రొవ్వుఱాళ్ళు'నను నవి ప్రసిద్ధిఁగన్నవి 1. 'ప్రేమము' 'కాలూఱాయి' యను నవల అప్పటి కింకను ముద్రణములో నుండెను. దీని కార్యదర్శి దేవరాజు వేంకటకృష్ణరావుగారు స్వయముగ నద్భుత నవలాకర్తలు. 'వాఁడేవీఁడు' 2, 'నేనే','కాలూరాయి,' యను బ్రఖ్యాతనవలాత్రికమును గూర్చిన కీర్తి వీరిదే! వీరి కార్యదర్శిత్వమున వేగుఁజుక్క-గ్రంథమాల నవలలవిషయమున సాధింపని ప్రయోజనము లేదు; భాషకుఁ జేయని సేవయు లేదు. ఈ సంస్థవలన వీరిరచనలును వీరిరచనలవలన సంస్థయు రాణించెను. తన ప్రచురణములలో ననువాదములకును వైదేశికప్రభావములకును 'నాంధ్రప్రచారిణి' తావిచ్చిన ట్టిది యీయలేదు. సమీక్షింపఁబడిన యీ ప్రకరణమునకుఁ బేరేదియైనను గ్రంథరాశినిబట్టి యిది ప్రధానముగ ననువాదయుగము. వెనుక వివరించి, పిదప సంక్షేపించి, విశేషముగ నీ యనువాదములనుగూర్చి యిందుఁ బౌనఃపున్యమునఁ బ్రసంగించుట కా ప్రాధాన్యమే హేతువు. ఈ "యనువాదములు-ప్రభావములు"ననువానినిగుఱించి యించుకఁ జెప్పినవేగాని ముఖ్యముగ నిట్టి గ్రంథమాలల సేవానిరతిశత్వమును దరచినవారము గాము.

ఒక జాతికిని భాషకును దోడ్పడునట్టివైనచో ననువాదములు, ననుసరణములు, ఛాయలు మున్నగునవి యెవ్వరికిఁగాని యంగీకార్యములే! నాఁటినుండి నేఁటివఱకు వాని నాఁపువారు లేరు సరిగదా, యెల్లరు శిరసావహించుచున్నారు. వానికిఁ బ్రజలయుఁ బ్రభుత్వములయు నాదరమున్నది. స్థూలముగ 'ఆంధ్రప్రచారిణి'వి పెక్కుగ ననువాదము లనియు, విజ్ఞానచంద్రికవి స్వతంత్రము లనియు వర్గీకరించుటకు వీలు గలదు. వానిలోగూడ మఱల నాంగ్లానువాదముల కీ యుగమున వంగానువాదములకుఁగల యాదరము లేదు.

---

1. పోఁగా మిగిలిన నవలలు:- ఉషఃకాలము, సుహృల్లత, పద్మినీపరిణయము, విలాసార్జునము, సుగుణ (మూఁడు భాగములు), వేంకటరావు అనునవి.

2, దీనిపైఁగల యౌత్తరాహ ప్రభావలేశమును గూర్చి యథాస్థానమునం దుక్తము.

ఆలోచింపఁగా దీనికిఁ బ్రధానమైన కారణ మొకటి తోఁచును. పాశ్చాత్యభాషా నూదిత నవలలలోని వాతావరణము భారతీయుల కపరిచితము. వీరికి వారి భౌగోళిక పరిస్థితులు, ప్రకృతి దృశ్యములు, దేశాచారవ్యవహారములు, సర్వము నపరిచితములు. ఎంతయో దేశసంచారము, బుద్ధివికాసము, సర్వసమ్మతత్వచిహ్నితమైన రౌచికాభిరుచి యు మొదలుగాగలవి యభివృద్ధిఁజెంది యుండిన వారలకేగాని తక్కిన పాఠకుల కవి రుచింపవు. అవి వారి సానుభూతిఁ బడయుట దుస్సాధము. అదే భారతీయవాతావరణ మైన యెడల మన చదువరు లభినందింపఁగలరు. కావుననే కన్నడము, హిందీ, వంగ భాష మొదలగు భారతీయ భాషలనుండి జరిగిన యనువాదసాహిత్యము మనకు సులభ ముగ మనసునకుఁబట్టును. దాని పలుకుఁబడి మనపైఁ జెల్లుఁబడి కాఁగలదు.

అట్లే మన భాషలనుండి నెఱపఁబడిన యనువాదములు గూడఁ బాశ్చాత్యుల నాకర్షింపఁజాలవు. వారికి మూఁడు శతాబ్దులకుఁ బూర్వమే యాంగ్లమున నవల వెల యుట దీనికిఁ బ్రధానకారణము కాదు.1 ఇతివృత్తపరణము, కథాసన్నాహము, శిల్పమువంటి యావశ్యక లక్షణములలో మన నవల వారి నవలలకుఁ దీసిపోవుట యొక ముఖ్యకారణము గాదు. ఇ వన్నియు నవాంతర హేతువులు. ప్రముఖకారణము వారును, మనవలెనే సాధారణముగ వైదేశిక వాతావరణము నభినందింపఁ జాలకపోవుట. మన 'రాజశేఖరచరిత్రా'ను వాదమును 'హిందూ పత్రిక' లో సమీక్షించిన పాశ్చాత్యుని సమీక్షను బునస్సమీక్షించుచో మనకుఁ దోఁచు నభ్యంతరము, వారికి మనకును నడుమ నున్న వాతావరణాది పూర్వరంగ విభేదమే; శిల్పసామగ్రి యం దభివృద్ధిగాంచిన తమ నవలలఁ జూచినకన్నులతో మనవానిని జూడఁగఁ గన్నుదూరకపోవుట యనుమాట వేఱు. అది యెప్పుడు నుండనేయున్నది.

## ౪. ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము (లిమిటెడ్)

అది దేశాభ్యుదయమున కావశ్యకమగు విషయములందెల్లఁ బరిశ్రమ జరుగు చున్న కాలము. భాషాభివృద్ధి కందుచే నగ్రస్థానము లభించెను. మన సంఘము యొక్క సర్వావస్థల యందును దేశముయొక్క యన్ని భాగముల యందును విజ్ఞానమును బ్రచు రింపఁ జేయుటకు భాషాసేవయే ముఖ్యసాధనమని యీ భాషాభివర్ధనీ సంఘము గుఱు తించినది. సనాతనాధునాతనేతి హాసములు, ప్రకృతి శాస్త్రములు, నన్యదేశ దార్శనిక గ్రంథములు, మహాపురుషుల జీవితములు, గణిత శాస్త్రాదిక శాస్త్రములు, నవలలు మన కానాఁడు లేనిలోపము నీ సంఘము నివారింపఁ బ్రయత్నించెను. క్రీ. శ. 1911–12 నాఁటికే యిది పండ్రెండు గ్రంథములు బ్రచురించినది. అందు 'ప్రభావతి' యను నవల యొకటి. ఇంకను నప్పటికిఁ ద్వరలో రానున్న గ్రంథము లాఱు. ఇది మచిలీపట్టణమున వ్యవస్థాపితము.

---

1. ప్రథమాంగ్ల నవల "టామ్‌జోన్స్"—పదునేడవశతాబ్ది.

## ౫. సాధనసమితి-హైదరాబాదు.

ఇది క్రీ. శ. 1939 లో స్థాపితము. చక్రవర్తి వేణుగోపాలరావు గారు దీని కార్యదర్శి. తెలుఁగు నవలల రచనాస్పర్థ నిది ప్రోత్సహించెను.

## ౬. సరస్వతీ గ్రంథ మండలి

స్వయముగఁ బండితులును బండిత పోషకులునునగు శ్రీ అద్దేపల్లి లక్ష్మణ స్వామి నాయఁడు గారిచే రాజమహేంద్రవరమున నెలకొలుపఁ బడినది. క్రీ. శ. 1929 నాఁటికే యిందు రమారమి నలుబది రెండు గ్రంథము లనుబంధప్రకటనములు గాక వెలువడినవి.

మౌలికములు, ననూదితములునగు నవలల ప్రచురణ కీ సరస్వతీ గ్రంథ మండలి పెట్టినది పేరు. ప్రధానముగ కీ. శే. కేతవరపు వారివి పెక్కు నవల లిందుఁ బ్రకటింపఁ బడెను. నవరస భరితములగు నవలలను నాటకములను గూఁడ బెక్కింటి నీ గ్రంథమండలివారు తమ గ్రంథమాలలో వెలువరించెడి వారు.

శ్రీయుతులు చిల్లరిగె శ్రీనివాసరావు, వెదురుమూడి శేషగిరిరావు, మొసలికంటి సంజీవరావు, శ్రీ శివశంకర శాస్త్రి, జొన్నలగడ్డ సత్యనారాయణ గారల నవల లిందుఁ బ్రసిద్ధములు. అపరాధ పరిశోధక నవలానువాదముల కిది యెంత ప్రాముఖ్య మిచ్చెనో స్వతంత్ర రచనలకు నంతప్రాముఖ్యము నిచ్చి నేఁటి వఱకుఁ గూడ నాంధ్ర సరస్వతికి నిస్సీమమైన సేవ చేయుచున్నది.

## ఉప సంహారము

చిలకమర్తి వారి "సౌందర్య తిలక", ధరణి ప్రెగడ శివరావు విరచితమైన "భువన మోహిని", "కాంచనమాల", రెంటాల వెంకట సుబ్బారావు "కేసరీ విలాసము" వంటివి యాంగ్ల ప్రభావ జనితములు. మఱి నివైదేశిక ప్రభావము గల వాని యందే వంగ సాహిత్య ప్రభావ ప్రేరితములు కొన్ని. అవి డి. వి. యస్. దొరస్వామి "కపాల కుండల", ఓ. వై. దొరసామయ్య "ఆనంద మఠము" వంటివి.

విజ్ఞాన చంద్రికయు, సరస్వతీ గ్రంథమండలియు మున్నగు వాని వెంత మౌలికములైనను మఱల వాని యందు ప్రయత్న కృతమైన విదేశీయ ప్రభావము గల నవలలు కొన్ని:—

| | |
|---|---|
| బారు రామారావు | "సుందరి" |
| ..యస్. రామశాస్త్రి | "పుష్పావతి" |
| రాఘవాచార్యులు | "దుర్బుద్ధి" |
| చింతాదీక్షితులు | "దురాశ" |
| వేలాల సుబ్బారావు | "రాణీ సంయుక్త" |

భోగరాజు నారాయణమూర్తి "విమలాదేవి"1, "అల్లాహో అక్బరు" లును, గోటేటి జగన్నాథరావు "దుర్గావతి", చేకుమళ్ళ రాజగోపాలరావు "లలిత", కేత వరపు వేంకటశాస్త్రి "రాయచూరు యుద్ధము" "బొబ్బిలి ముట్టడి"యు, దుగ్గిరాల రాఘవచంద్రయ్య చౌదరి "విజయనగర సామ్రాజ్యము 3. బాలాంత్రపు నీలాచలము "మాలతి", ఏ. వి. నరసింహము "పాతాళభైరవి", తల్లాప్రగడ సూర్యనారాయణ రావు" శైవలినీ చంద్రశేఖరము", నండూరి మూర్తిరాజు "శక్తిమతి", వి. సీతారామ చంద్రరాయశర్మ "రుద్రమదేవి" వంటివి కలవు.

విజ్ఞానచంద్రిక, వేగుఁజుక్క నవలలపై వంగప్రభావమెంత మృగ్యమో, యాంధ్ర ప్రచారిణి నవలలపై నంత యధికము. విదేశీయఃరోతః ప్రభావమున్ననో యన్నిటిపై నను గలదు. కాని యీ యుగమున నది యాంధ్రప్రచారిణివారు బుద్ధిపూర్వకముగఁ బ్రయత్నకృతముగఁదెచ్చుకొనుటవలనఁ గలిగినది. వేగుఁజుక్క, విజ్ఞానచంద్రిక వార లాఁపలేకపోవుటవలన నప్రయత్నకృతముగ వచ్చి పైఁబడినది. ఈ సూక్ష్మమగువ్యత్యా సము గమనార్హము.

పైఁజెప్పినట్టి యనేకరీతుల నీ ప్రకరణమున విస్తరిల్లిన నవలాసారస్వతస్వరూప సముదాయములనుబట్టి రేఖామాత్రముగ నీ యుగలక్షణము లనఁదగిన కొన్నిటి నిచ్చట వివరించుటయు కర్తవ్యము. ఇవి రానున్న యుగములలోపల వృతములై విస్తరిల్లఁ గలవు. అందువలనఁగూడ నీ యుగలక్షణ నిరూపణ మిందు ధర్మము:-

౧ గద్యవాఙ్మయము సంవృద్ధివేగము, దానితోబాటు నవలాకథానికలవంటి సాహిత్య ప్రక్రియలసమృద్ధి—

౨ సారస్వత సృష్టికి వస్తువులుగా సాంఘికచారిత్రక రాజకీయవిషయములతోబాటు తత్త్వశాస్త్ర సంబంధులు, హాస్యరస పోషకములు, మనః ప్రవృత్తినిదాన పూర్వకములు నగువానినిగూడ స్వీకరించుట—ఇది వాస్తవికా ధివాస్తవికాది రచనామార్గములను బట్టించినది.

---

1. "రాణీ సంయుక్త, విమలాదేవులు" రెండును యావద్భారతదేశ చరిత్రసంబంధులు.

2. ఇది యాంధ్రదేశ చరిత్ర సంబంధి ప్రథమనవల.

3. ఇది విజ్ఞాన చంద్రికా గ్రంథమండలీ బహుమానితము. దీనిని విమర్శించుచు నానాఁడు పెక్కువ్యాసములు వెలువడినవి. చరిత్రాత్మకములైన యసంగతవిషయములిందుఁ బెక్కుగనున్న వనుటయే యావిమర్శనల సారము.

౩ రచనలలో వ్యక్తిగత భావప్రకటనము నాత్మీయభావ చిత్రణము—స్వీయ విరచిత సంకేతములకు సూచనలు.

౪ 'వాస్తవికత' యను నూతన సంవిధానముతో నన్నిసాహిత్య ప్రక్రియల యందును ప్రయోగములు1.

(౧) ఇది ముఖ్యముగ గద్యయుగారంభము.'గద్యబ్రహ్మ' నెగడి దీనిని బ్రోదిచేసినాఁడు. అందును నను వాదముల కిది ప్రసిద్ధము.గద్యము, నవల, యనువాదము,నను వీని కన్నింటికిఁగారణములు మున్నెన్నఁబడినవి. ఐనను నవి ప్రకరణమునుబట్టి వికీర్ణములై నట్లుఁదోఁచును. కాన వానిని సంగృహీత మొనర్చుట యావశ్యకము.

సాంఘిక రాజకీయ సులోచనములతో బరిశీలించినచో మనదేశమున నితః పూర్వము పాదుకొనియున్నది, ధనికస్వామ్య విధానము. కొలఁదిమంది పాలకులు; జన బాహుళ్యము పాలితము. ఈ యుగారంభముతో వైదేశిక ప్రభావకారణములవలనఁదద్విధానము క్రమక్రమముగ యథా స్థితులు కాజొచ్చెను. పాలక పాలితులనడుమ నొకతరగతి ప్రజ పెఱిగినది. ప్రభుత్వయంత్రాంగమును నడుపు మాధ్యమికస్థితిగతులు గలవారు వీరు; బహుసంఖ్యాకులు. అనఁగా నింగ్లాండునందువలె నించించుక ధనజ్ఞానాదికాభి వృద్ధులఁబడయుతరగతి యిది. వీరంతజ్ఞానులుకారు; అట్లని యజ్ఞానులునుగారు; ధనికులు గారు; నిర్ధనులుగారు; ఇది పాశ్చాత్యవిద్యాదుల యధ్యయనమువలనఁ బెరుఁగుచున్న శాఖ. శాస్త్రకావ్యాది జ్ఞానము నలవఱచుకొనుటకుఁ గావలసిన యుత్తమాధికారము వీరికి లేదు. అయ్యును వీరు నిరక్షరకుక్షులు, నిరక్షరాస్యులును గారు. వీరికించుక ధనార్జనాపరతతో నించుక విశ్రాంతియు లభ్యమయ్యెను. చదువులు పెఱుగవలసి వచ్చినవి. మేధావులకు పద్యము; వీరికి గద్యము. కాని చక్కనిగద్యము గూర్చువారేరి ? ఉన్నదానితో సంతుష్టిపడరాదా ? ఇరుగుపొరుగు వారలలోనది యభ్యుదయమొంది యుండఁగా దానిని జూచుచున్న కన్నులతో మనకున్నదానిని మెచ్చుకొనుటయెట్లు ? కావునఁ గర్తవ్యమేమి ? గత్యంతరములేని యనువాదశీలత. అందునుగూడ నత్యల్ప సంఖ్యాకులగు బండితులకుఁగాక బహ్వాధిక సంఖ్యాకులగు నడిమితరగతివారి స్థాయికిఁ దగుననువాదములే వెలువడవలెను. అట్లే వెలువడినవి. వారిస్థాయి పెఱుగుచున్నకొలఁదియు వచనము, నవలాకథానికాదుల శిల్పచారుత్వము,ననువాదములు నభివృద్ధి గాంచవలెను. కాంచినవి. గద్యము, కథాసాహిత్యము, ననువాదములు, ననఁగా వాఙ్మయ రంగమునకుఁగూడ ననువర్తించు నుత్పత్తి వినియోగముల పరస్పరసంబంధమన్నమాట.

---

1. సాధనలు రానున్న ప్రకరణమున జరుగును.

(౨,౩,౪,) ప్రక్రియల సమృద్ధియనఁగా సాహిత్యబాహిరఁపు రూపములలో వివిధత్వము. ఇఁకఁ బరిశీలింపఁ దగినది తద్రూపకల్పనకుఁగావలసిన వస్తువు. దీనినాంతర వైవిధ్యమనఁదగును. లేదా, సాహిత్యకవస్తు స్వీకృతిలో వైవిధ్యము; అనఁగా నానావిధముల గూర్చి వ్రాయుట. ఆ స్వీకరించిన సాంఘికాది వస్తువులను వెల్లడించుటలో మఱల ప్రత్యేకత గలదు అది వైయక్తిక వ్యక్తీకరణ విధానము. పోఁగా దద్విధానములకు వేర్వేఱుపేళ్ళు బెట్టుట యింకొకటి. అందుచే రెండుమూఁడు నాలుగులని పైఁజెప్పఁబడిన యంశములలో నొకక్రమబద్ధ సంబంధమును దర్శింపవచ్చును. వస్తువైవిధ్యము, దానికొకవ్యక్తీకరణ విధానము; మఱల నారూపసంపదకొక విధమైన నామకరణము; రూపమున కనుగుణమైన నామము; నామానుగుణమగు రూపము. ఈపైమూఁడంశముల మీమాంస యందును గోచరించును. అనఁగా నామరూపములచర్చ. ఇది వీనిని బంధించుసూత్రము. కానఁగ్రమముగ వీనినన్నింటి నొకటిగ గుదికూర్చి పరిశోధించుటయే యుచితము; సంగ్రహపద్ధతియు.

వివిధములైన యితివృత్తములను వెల్లడించు వివిధపద్ధతులలో వాస్తవికత యొకటి. ఈవాస్తవికతనుగూర్చి పర్యాలోచింపఁగా నిట్లుఁదోఁచుచున్నది. విషయముల నలవోకగఁజూచుట,సంఘటనల నాపాంతముగఁగాని-పరిపూర్తిగఁగాని మథించి,సమ్యగాలోకనముపఅపఁ పోవుట, వస్తువుల బాహిరఁపురూపమునే తిలకించి యాంతరతత్త్వము, నన్వేషింపకపోవుట వంటి పెక్కు లఘుమార్గానుసరణములు, కొన్నికొన్ని సంగతులవాస్తవికములుఁగఁదోఁచుటకు హేతువులు. మన యల్పజ్ఞానముచే గొందఱయధిక జ్ఞానమును బరిశీలించుటవలన నేర్పడునట్టి యనుమానము, నవిశ్వాసమువంటి వానిని సాధారణహేతువులుగఁగలవి యవాస్తవికములు. సంక్షేపించి స్థూలముగఁజెప్పినచో మనజ్ఞానమెంత పరిమితమైన నంతగా వాస్తవికతకు దూరులము; ఎంత యపరిమితమైన నంతగా సన్నిహితులము. లేదా, మనజ్ఞానమును విస్తరించుకొన నొల్లకపోవుట పేరు 'అవాస్తవికత'; కూపస్థమండూకత కది పర్యాయపదమన్న మాట. సాధారణముగ స్థూలపాఠకబాహిరఁపు దృష్టుల పర్యవసానమువలన మనకుఁగొన్ని వాస్తవికతా రహితములట్లు దోఁచును. వానితో వాస్తవికతా వ్యామోహము పెఱుఁగఁగలదు. మన సారస్వతము నందీ యుగములో కించిత్తుగ నీవాస్తవికతా వ్యామోహ ముత్తరోత్తర నంకురించి వటవృక్షము గానున్న లక్షణమున్నది.దీనికేదేనియొక లక్ష్యముఁజూపి చెప్పినప్పుడిది సులభీకృతమగును.

చిలకమర్తి వారి 'రామచంద్ర విజయ'మే యున్నది. అందు నవలాకర్త కావ్యప్రయోజనానుసారముగఁ దన ధర్మమును నిర్వర్తించినాఁడు. శిష్టరక్షయు దుష్టశిక్షయు

నా నవలాంత మందు జరుగును. దానిని వాస్తవికముగ లేదని విమర్శించు వారున్నారు, అందొక దుర్మార్గుఁడు పాము కాటందుకొనఁగా మరణించినాఁడు. వాని యైహిక జీవిత మున కది యుచితమైన యంతమనియుఁ గవిధర్మ మందు నిర్వర్తింపఁ బడినదనియు, నా నవల కానాఁడు చెప్పగిప్పరానంత ప్రతిష్ఠ; చింతామణి పత్త్రికవారి బహుమతి ప్రదానమును జరిగెను. నేఁటి విమర్శకు లామృతిని వాస్తవికతకు దూరముగ నున్నదం దురు. ఆ పాత్ర వృత్తాంతమున కట్టి పరిసమాప్తిఁ గల్పించుటలో నేదో కృత్రిమత్వ మున్నదని నేఁటి భావుకుల భావన. పరమదుర్మార్గుఁ డిట్లు మరణించుట యసంభవ మని యో, యసంగత మనియో, యసహజ మనియో, యేదో వారికొక నిరాశ, కాదేని నమ్మిక. ఈ నమ్మికకుఁ బ్రమాణమేది ? ఎవరికి వారే ప్రమాణము. ప్రసిద్ధ ప్రమాణ రహితమైన యీ వాస్తవికత సాహిత్యమునం దధివాస్తవికతాది ధోరణులకు దారితీసి నది. ఎవరికి వారు తమ మదిలో బొడమినదిగాన నొకదానిని నిజ మందురు. ఒక భావము తమకెన్నఁడుఁ దోఁపదు గాన వారి యభిప్రాయములో నది యబద్ధము; వాస్త వికతకు దూరము. ఈదృశవాస్తవికతయందు సార్వజనీనతకుఁ దావులేదు. ఎంతవఱకు నాత్మభావపరామర్శయేగాని పరభావపరిశీలన మిందు లోపించును. ఇది కొందఱి కొక ప్రత్యేక మనస్తత్త్వమైనది. ఎంతసేపు తనలోదాను ద్రవ్వుకొనుటయే దీనికిఁబని. సంకు చితమైన యర్థమును గల్పించి దీని 'నాత్మజ్ఞాన పరత్వమ'ని చమత్కరింపవచ్చును. దీనికి బరేంగితావగాహనశీల మల్పము. ఈ యాత్మీయభావచిత్రణమే యాత్మప్రియంభావు కతకు బాటవేసినది కూడ.

సత్యమనఁగా, దైవమనఁగా లేకున్నచో జగము లెట్లు నడచు ననుకొన్న యల నాఁటివారు, దుష్టశిక్షారూపమైన యా మృత్యు వా పాత్రకు సహజముగ, ధర్మముగ నున్నదనుటలో గల యాంతర్య మేమి ? అది యాస్తిక్యబుద్ధి. దుర్మార్గు లిట్లు నశించి తీరుదు రనెడి యభిప్రాయము; పరమవిశ్వాసమును తన జ్ఞానగభీరిమచేత నుక్తవిషయ ములయందుఁ జదువరులకు విశ్వాసమును గొలుపుట యనునది రచయితృ కర్తవ్యము గూడ నగుట నిజము. అతఁ డెంతవిశ్వాసముగొలుపునట్లు రచించినను మన యజ్ఞాన

---

1. ఈ విధంగా నాఁటి ఆంధ్రదేశవాతావరణం యీ నవలలో ఎంతో వాస్తవికంగా చిత్రింప బడింది. ఐతే కథనడకలో ముఖ్యంగా ముగింపులో కథానాయకుడికి ఉద్యోగం, వివాహం, ఐశ్వర్యం, అన్నీ సమకూడి దుర్మార్గులందరికీ తగిన శిక్ష లభించడం—ఒకడిని చివరకు పాము కరుస్తుంది. ధర్మమే జయించితీరుతుందని మనసార నమ్మేవారికి సంతృప్తి కలిగిం చినా—వాస్తవికతకు మాత్రము కొంత దూరంగా ఉన్నదనిపిస్తుంది." తెలుగునవల-వాస్తవికత-పుట 42, 'ఆంధ్రప్రదేశ్' సంపుటము 4, సంచిక 7. (మే 1960, వైశాఖం-1882-శక.)

మన్నది [1] దానిని నమ్మనీయకపోవుట నిజము. ప్రామాణికత్వ బుద్ధిఁ బుట్టించుట కిరువురి వ్యవసాయము నుండవలెను. ఇప్పుడది మనలో పూజ్యము.

దుర్మార్గు లిట్లు నేఁడు నశించుట లేదనెడి నిరాశ, యవిశ్వాసము, 'తన చావె జగత్ప్రళయమ'నెడి యొక దుస్సహన భావమువంటి భావమును ప్రబలఁగా, వాస్తవికత పేరిట నేఁటివారు పైఁ జెప్పినట్టి మృతి యసహజము, నస్వాభావికము నను చున్నారు. వీరి యీ వాదమునకు హేతువు లాస్తిక్యబుద్ధిక్షీణతయు, నీమత్కష్టాసహిష్ణుతయు నాత్మప్రియంభావుకతయు వంటివి. నేఁడు మన కివి నైజగుణములై పోయెను. అది యీ కాలమునకు లక్షణము; ఇది యీ కాలమునకు సహజము.

కాన నధర్మము, నన్యాయము, దౌర్జన్యము, దౌష్ట్యము, దౌర్మనస్యమువంటివి దండింపఁబడినట్లుఁ జెప్పఁబడినచో నది నేఁడు మనదృష్టిలో వాస్తవికతకు సుదూరము.

---

1. కాటుకపిట్టలనుగూర్చి యనేక కావ్యములు చెప్పినవి. ఆధునికులము వానిని నమ్మము. "కాటుకపిట్ట సంగమించినచోట నిధి, త్రొక్కిన చోట నభిషేకము, మలవిసర్జన చేసినచోట బొగ్గునుండును. ఇది సత్యమా యని శంకించువా రచ్చటఁ ద్రవ్వి చూచుకొన వచ్చు"నని వరాహ మిహిరుని వాదము. (బృహత్సంహిత—45—12). ఇట్లు ధైర్యముగఁ జెప్పఁగలవాఁడు కావుననే మొదటి యధ్యాయములో "వాస్తవమైన విషయములను గూర్చిమాత్రమే చెప్పుచుంటి"నని ప్రతినఁ జేసినాఁడు (1-11). పర్వతములు, నగ్నీంద్ర వాయువరుణులను భూకంపములకుఁ గారణములనియు. భూకంపమునాఁటి నక్షత్రమునుబట్టి తత్ భూకంపనకారకుని నిర్ణయింపవచ్చుననియుఁ జెప్పి(32-11)సౌరాష్ట్రమగధలలోని భూకంపములు వాయు ప్రకోపితములని నిరూపించిన వాఁడును వరాహమిహిరుఁడే! అతఁడు సప్తర్షి మండలమునకుఁ జక్రభ్రమణ మున్నదనును (13,2.4). సూర్యబింబములోని మచ్చలను (Sun spots) కేతువులనియుఁ దామసకీలలనియు వ్యవహరించి వానిసంఖ్య 33 మాత్రమే యనెను. కాండరోప్యప్రక్రియ (Grafting) కు సక్రమమైన ఋతుసంబంధము నితఁడే నిర్ణయించినాఁడు (అధ్యాయము 55). ఒక గ్రామమునఁ గనిపించు మద్ది, అశోకము. అత్తిచెట్టును బట్టి యా గ్రామములోధాన్యముధరఁ దెలిసికొనవచ్చునఁట ; (29.5,6).అట్లే చంపకపుష్పములను బట్టి బంగారముధరయఁట ; గురుశనులిద్దఱు నొకే నక్షత్రమునందుండుట గావున క్రీ.శ. 1970 అక్టోబరు, నవంబరు నెలలలో నేదేశమునకోగాని పురప్రభేదము (civil war) తప్పదఁట; ఆ దేశభేదము నా నక్షత్రమును బట్టి నిర్ణయింపవచ్చును. నీలిమందుచెట్టు సమీపమునందుఁ బుట్టయున్నచో దానికి 2 1/4 గజములు దక్షిణముగ 8½ గజములలోతున త్రియ్యని నీరున్నది (54—14,15)యని యతఁడనును. అనంతమైన యిట్టి విజ్ఞానకభండారము స్వాధీనమందున్న వరాహమిహిరాదులవంటి మహర్షులెందఱో ధీరశాలురు చెప్పు విషయములలో నిది వాస్తవికము; వాస్తవికముకాదు అని యే కొలగఱ్ఱతో గొలుతుము ?

ఏలన నట్టిది జరుగ దనెడి భావమునకు మన విశ్వాసము పరమాయువు పోయుచున్నది. అది మన నిరాశ; కష్టముల కోర్వలేని యొక యాత్మప్రీతి. ప్రపంచ యుద్ధాదులవంటి వాని ప్రభావమువలన మనకుఁగలిగిన ఫలము; ఏదో యొక విషాదచ్ఛాయ మనల నావరించుట; ఒకే మాటలో జెప్పినచో మన మెఱుఁగకయే మనలఁ బీడించుచున్న నాస్తికతవంటిదేదో యొక లఘుభావము; ఒక యజ్ఞానము. మన యనుభవమే యనుభవమనెడి యొక యహంకృతి. ఇట్టి వెన్నో యజ్ఞాన జనిత విచిత్రభావముల సమ్మేళనముచే నుద్భవించి యాధునిక ప్రపంచ సారస్వతముల నుఱ్ఱూ తలూగించు దాని పేరు-వాస్తవికత. ఈ దృష్టికి మూలకందమును గూర్చి చర్చింపను గూడ చర్చింపరాదు. దీని యేలుబడికి లొంగియుండి మన రచనలలో దీనికి బ్రహ్మరథము పట్టినపుడే మన మాధునిక రచయితలము. దీనిని గాదని యెవ్వరును నిలఁద్రొక్కుకొనలేరు. తత్ప్రయత్నము చేయనురాదు. ఏలన,నా విధములగు రచనలేచేసి యా పరిభాషనే మాటాడినఁగాని మన మద్యతనుల కోవలో జేరము; వారికి సుగ్రాహ్యులము గాము. ఇదియే వారెఱిఁగినది. ఇంతకుమించిన శిల్పము వారెఱుఁగరు; కథావిష్కృతిలో గళాప్రౌఢిఁ జాటింపఁజాలరు. పూర్వోక్తబహుకారణరూపమైనయీ వాస్తవికత యొక్కటియు మునుముందు నానారూపములఁ దాండవింపఁగలదు. సాహిత్యము కేవలము జీవితమునుండియేగాక జీవితము సాహిత్యమునుండియు విషయములను స్వీకరించునెడి సంగతి రచయితలకుఁదెలియు దినములు రాకపోవు.



# షష్ఠ ప్రకరణము

## నవ్యయుగము — నవలావికాసము

క్రీ. శ. ౧౯౨౦—౧౯౪౭

(౧) పూర్వోత్తర సమన్వయము

(౨) నవలా వికాసమునకుఁగల కారణాదికము:—

1. వివర్తనములకుఁ బూర్వరంగము.
2. ప్రాచ్యపాశ్చాత్యపూర్వరంగములు
3. నవ్యసాహిత్యము.
4. జాతీయ పునరుజ్జీవనము.
5. వ్యావహారిక భాషావాదము.
6. జాతీయవాదము.
7. సహాయ నిరాకరణోద్యమము.
8. వివర్తనములు: అరాజకమార్గములు
9. ఆంధ్ర జాతీయ వివర్తనము
10. నవ్య సాహిత్య పరిషత్తు
11. ప్రజా యుగము
12. అధివాస్తవికత
13. ఇట్టి యుగ ప్రాతినిధ్యము వహించుకొన్ని నవలలు.

# షష్ఠ ప్రకరణము

## నవ్యయుగము—నవలా వికాసము

## (క్రీ. శ. 1920–1947)

## (The Development of the Novel in Modern Era)

### ఆధునిక నవలా పరిణామము

### పూర్వోత్తర సమన్వయము

పూర్వోక్త ప్రకరణములలో భారతదేశమునందుఁ బాశ్చాత్యప్రభుత్వము కుదురుకొనుటనుగూర్చి సూచింపఁబడినది. క్రైస్తవమతప్రచారప్రభావమువలన సనాతనమగు హిందూమతము లోపభూయిష్ఠ మనెడి దృక్పథ మొకటి పాదుకొనెను. ఆర్యసమాజ బ్రాహ్మసమాజాదుల స్థాపనలమూలమున మన వారిలో మహనీయులు కొందఱు, హిందువులు మతాంతరులగుటఁ గొంతవఱకు కరికట్టఁజాలిరి. కాని తమ మతప్రచారమునకుఁ దగిలినయడ్డు నాంగ్లభాషాబోధనవ్యాప్తిచే దొలగించుకొన్న పాశ్చాత్యప్రముఖులు చెఱఁగనిప్రభావముద్ర నొకదానిని హత్తుకొలిపి మనపైఁ గ్వాచిత్కముగ వైజ్ఞానికసాంస్కృతికవిజయములను సాధించిరనుట తథ్యము. ఇదియే కాదు. మన [illegible]లాది గ్రామముల యార్థికజీవితసౌభాగ్య మెట్లు సామ్రాజ్యవాదుల యార్థికవిధానస్పర్థచే భగ్నమైనదియు గతప్రకరణమున స్పృశింపఁబడినది. ఇవన్నియు నాఁటి యాంధ్రదేశమున సమాజజీవితములో గొన్ని మార్పులను దెచ్చిపెట్టినవి 1.

అట్లే తెలంగాణమునను నాఁటి సమాజజీవితము పరిణామములతో నిండియున్నది 2. ఒక ప్రభువు మతవ్యాప్తికిఁ బ్రయత్నింప, నింకొక ప్రభువు దానివలన రాఁగల తీవ్రపరిణామములను శంకించినాఁడు. భాషాబోధనవ్యాప్తిమూలమున మెల్లమెల్లగ వైజ్ఞానిక సాంస్కృతిక విజయమే యీ నేలయందును గర్తవ్యమయ్యెను. కాని యిచ్చటి ప్రభువుల కృషి విద్యావ్యాపనాదులయందుఁ దీవ్రముగ లేదు. అందుచే సమాజజీవితములోనికి లోఁతుగఁ బరమతప్రభువులసంస్కృతి చొచ్చిన దనలేము. తెలంగాణ మెప్పటికప్పుడు జాగరిత మగుచున్న భూమి.

---

1. చూడుఁడు:–'ఆంధ్రోద్యమము' శ్రీమామిడిపూడి వేంకటరంగయ్య 'తెలుఁగు సంస్కృతి' పుటలు 467–473 (1959)

2. తెలంగాణా ఆంధ్రోద్యమము– Id. pp. 473–483(1959).

మానవతావాదియు యుగకర్తయునైన వీరేశలింగముపంతులుగారి సంస్కరణో ద్యమమునకు, నవ్యసాహిత్యారంభమునకును గలరాజకీయ సాంఘిక కారణములుగూడ గతప్రకరణమున నుటంకింపఁబడినవి. వారి సేవతోఁబాటుగ నటుసాగిన యాంధ్రోద్య మము, నిటుసాగిన తెలంగాణఁపుటుద్యమమును జిరస్మరణీయములు. స్వతంత్రరచన మూలమునను ననువాదములమూలమునను నవలాకర్తలు వ్యక్తిగతముగ సేవచేయు చునేయున్నారు. విజ్ఞానచంద్రిక, యాంధ్రప్రచారిణీ, సరస్వతిగ్రంథమాల, వేగుఁజుక్క గ్రంథమాల మున్నగు సంస్థ లనువాదములమూలమునను సాముదాయకముగఁ గృషి చేయుచునే యున్నవి. అట్లే యాంధ్రపత్త్రిక, కృష్ణాపత్త్రికవంటి ప్రముఖపత్త్రిక లును, స్వర్గీయులు గిడుగు వేంకటరామమూర్తిపంతులు, గురుజాడఅప్పారావుపంతులు ప్రభృతి సంస్కర్తలును దోఁడుపడఁగా మన సారస్వతములో నవ్యత వెలసినదని మునుపే చెప్పఁబడెను.

వీరి యీ తోడ్పాటునకు మూలము పారిశ్రామికనాగరకత. అది యప్పుడప్పుడే మనలో గాలూఁదుచున్నది. పారిశ్రామికవిప్లవాదులకును సాహిత్యసృష్టికిని సంబంధ మేమి యనుకొనువా రున్నారు. అది పొరపాటు. పదునెనిమిదవ శతాబ్దిలో మన దేశ మునఁ గర్షకుఁడుగ నెగడుట సులభమైన సంగతికాదు. దానిని మన ముత్తాత లెఱుఁగు దురు. అది యసిధారావ్రతము. భూస్వాములు పరిపాలించు దినము లవి. నేఁటివలె నాఁటివి విన్నపముల నాహ్వానించు ప్రజాప్రభుత్వములు గావు. అప్పటి మేలుఁగీళ్ళు రెండును నేఁటివానికంటె భిన్నమైన వనుటయే ప్రస్తుతాంశము. పాశ్చాత్యదేశములలో నీ యుగమును 'జేన్ ఆస్టీన్' ప్రభృతులు జ్ఞానోదయకాలముగఁ జిత్రించుకొందురు.

పారిశ్రామికవిప్లవ మే విధముగఁజూచిన నా విధముగఁ గనిపించును. అనఁగా బాహిరఁపుదృష్టి కొకవిధము; ఆంతరదృష్టి కింకొకటి; ఈ నాఁటికిఁ బాశ్చాత్యదేశముల దృష్టిపథమునుండి చూచినచో నొకతెఱఁగుగ నుండును. ప్రాచ్యదేశముల దర్శనపథ మునుండి చూచినచో నదియే యింకొక విధము. మన ప్రపితామహులనంటి వారికి విప్లవ మనఁగా నొకవిముక్తి.

నాగరకమైన దృష్టియందిది యింకను నొక సమస్యగనే యున్నది. ఈ విప్లవ ములు ప్రథమముగఁగలిగిన దేశము లొకకొన్ని. వానిలో నేర్పడిన పరిణామముల నిప్పుడిప్పుడు స్థూలముగ నర్థముచేసికొనుచున్నాము. శాస్త్రాభివృద్ధివలన జనసంఖ్యయు జనసంఖ్యనుబట్టి యాహారాదిపదార్థముల యుత్పత్తివ్యయములును బెరుఁగును. వానితోఁబాటుగ నారోగ్య విద్యా వ్యాపకాది సౌకర్యములును బెరుఁగఁగలవు. మఱియు నివి పేదవారికి విప్లవములు; యుద్ధములు మున్నగు వానివలననే లభించును. ఇందుచే వీనివలన లాభములేగాని నష్టములు లేవనుటకాదు. ప్రజోపకారకములగు పరి శ్రమాభివృద్ధులకుఁ దోడ్పడుశక్తులే ప్రజోపద్రవకరములగు మహాసంగ్రామము

లకును దారిదీయుట నిజము. కాని లాభములే చిరకాలము మిగులఁగలవు. అవియే మన యాగామిజ్యోతులు. ప్రాచీనపారిశ్రామికవిప్లవములఁగాని యర్వాచీనవిజ్ఞానశాస్త్ర సంబంధివిప్లవములఁగాని మన మర్థముచేసికొనక తీరదు. వీని పరిణామముల ననుభవింపకయు మానలేము.

అల్లే యొక రాజకీయపక్ష 1 మొక రచయితకీర్తికి హేతువగును. ఆ పక్షము ప్రజాదరమును జూఱకొనుట కాతని సారస్వతకృషియుఁ దోడ్పడు నన్నమాట. దానితో నది యాతనిని మిన్నులకెత్తినదని యసూయపడుదుము. నిజ మూహింప నాయభిమానముఁజూపుటలో రాజకీయపుటెత్తు లేమియు నుండవు. మన జాతియొక్క రాజకీయ పునరుజ్జీవనమునకై యీ శతాబ్ద్యారంభమున దేశికళారూప పునరుద్ధరణ మొక సోపానము, నొక సాధనము నైనది. ఈ దేశిపునర్వికాసనములో గురుజాడ అప్పారావువంటి వారలకు స్థాన మేర్పడెను. కొన్ని రాజకీయపక్షములలో లోపించునట్టియు గొన్నింటిచే ద్రుఢీకరింపఁబడినట్టియు నీ సంస్కృతిపిపాస మఱికొన్నింటియందు మెండగుట యొక భాషకు సంబంధించినంతవఱకు నభినందింపఁదగినదియే గాని గర్హ్యము గాదుకదా.

## వివర్తనములకుఁ బూర్వరంగము

ప్రథమప్రపంచసంగ్రామదినము లప్పుడప్పుడే ముగిసెను. సమాజజీవితములోని మిట్టుపల్లములు కొందఱుప్రజలలో గొన్నివర్గములలో నసంతృప్తియుఁ దిరుగఁబాటును గల్గించినవి. కీ.శే. త్రిపురనేని రామస్వామిచౌదరిగారి 'సూతపురాణము'; వెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రివర్యుల 'భారతవిమర్శనలు'; 'శ్రీముద్దుకృష్ణ' "అశోకము" వంటివి తత్ప్రతిఘటనలకు సారస్వతరూపములైన ప్రతిఫలనములు. సమాజమునందుఁ బరివర్తనమును గాంక్షించు రచయితలు, తరతరములనుండియుఁ బవిత్రములుగ గౌరవించుచున్నట్టి రచనలను విపరీతార్థకల్పనలతో బునఃసృష్టిచేయుట యెందును గలదు.ఇది పాశ్చాత్యాచారము. కాని పూర్వసంప్రదాయముల నిట్లు హేళనచేసినవారు తమ క్రొత్తమతమును నెలకొలిపి నూతనరచనలమూలమున సంప్రదాయముల సృజించుట విదేశములలో బరిపాటి. ముఖ్యమైన కార్యకలాప మదియే మనలో జరుగలేదు. ఈ ప్రతిఘటనశక్తుల కా నిర్మాణాత్మకసామర్థ్యసంపత్తి లోపించుటచే నెంతవఱకు వెక్కిరింపఁబోయి వెలికిలఁబడినవై చిత్రి యేర్పడినది. ఆ ప్రయత్నవైయర్థ్య మీ యుగమునను సాగుచునేయున్నది. ఎప్పుడు నట్లే సాగును. దానికి మఱలఁ గొన్ని ప్రతిఘటనశక్తు

---

1. బుఱ్ఱకథలకు, జముకులకథలకు, వీథిభాగవతములకు గొల్లసుద్దులకును బ్రాణముపోసి నాటక కళలో విప్లవముదెచ్చిన దొక రాజకీయపక్షమే।

లేర్పడుటయుఁ జరిత్రవిరుద్ధము గాదు[1]. మన సాహిత్యమున నట్టి వివర్తనము లేర్పడి నవి. ఒకదానికి సంస్కారవాదము, వేఱొకదానికిసంప్రదాయవాదము నని వ్యవహారము కలిగెను. వీని నడుమ నిరంతరసంగ్రామము. అందుచే రెండుశాఖలైన సారస్వతసృష్టియు జరుగుచున్నది. ఆ శాఖలెట్లెట్లుఁ జెనఁగొని పెరుఁగుచున్నదియు నీ ప్రకరణమునఁ బరి శీలింపఁబడును.

పూర్వప్రకరణము 'సహాయనిరాకరణోద్యమ' ప్రారంభముతో ముగిసెను. ఆ యారంభము ప్రజాజీవితములో జారిత్రకప్రసిద్ధిఁగల యొక ఘట్టము. తత్ప్రకరణాంత మున కా ప్రసిద్ధి ప్రధాన హేతువు; యుద్ధవిరమణము, వీరేశలింగముపంతులు నిర్యాణము వంటి యానుషంగికములైన యితరకారణములు మున్నే వివరింపఁబడెను. ప్రజాసాధా రణ్యమునందు యుద్ధానర్థములవలనిబాధల ఫలితముగఁ జెలరేఁగిన యసంతృప్తియు వినూతనోత్తేజమును 'సహాయనిరాకరణోద్యమము' లోఁతులను ద్రవ్విచూచినవి. జాతీయవాఙ్మయ మనఁదగునది యొకటి వెలువడెను. ఇది ప్రజాసామాన్యములో గలి గించిన యుద్వేగము నంచింపలేము. సాహిత్యములో దీనివలన నూతనమార్గములు ద్రొక్కఁబడినవి. అమలినశృంగారము, వాస్తవికత మొదలగు బహువిధభావవాదము లెన్నెన్నో [2] పొడచూపెను—ఈ జాతీయవాదము మఱల నటు సంప్రదాయవాదము నకు నిటు సంస్కారవాదమునకుఁగూడ సమ్మతమైనది. భారతజాతియంతయు నొక్క టేయన్న విషయమునం దీ వాదములో వ్యత్యాసము లేదు. సనాతనముగ మనలో వేఱూరియుండిన ఁసంప్రదాయమురాజభక్తియు వంటి భావములే నవ్యసాహిత్యసంస్కార సులోచనములతో జూచినపుడు జాతిగౌరవము, దేశభక్తివంటి రూపాంతరములఁ దాల్చుచున్నవి.

## ప్రాచ్య పాశ్చాత్యపూర్వరంగములు

కావుననే తొలుతనుండియు మన నవలలసాహిత్యముపైఁగల స్వదేశీయ విదేశీయ ప్రభావముల విభేదము పాటింపఁబడుచున్నది. సంప్రదాయసంరక్షణము, రాజభక్తిప్రకట నమువంటి భావములకుఁ బ్రోత్సాహమిచ్చిన జాతీయసాహిత్యమెల్లఁ బ్రధానముగ స్వదేశీయప్రభావాన్వితము. అట్లే దేశభక్తి, జాత్యభిమానములవంటి భావముల కాలంబ మైన దానిని విదేశీయప్రభావసంజనితము ననవచ్చును. ఈవిభేద మీ యిరువదియవశతాబ్ది యందుకూడ మన నవలాసాహిత్యమునఁ గలదు. కీ. శే. అడవిబాపిరాజు, విశ్వనాధ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రిగారల వంటివారల రచనలు స్వదేశీయ ప్రభావమూలకములు. విదేశీయప్రభావజన్యములైనవానిలోగూడ మఱల నాంధ్రప్రచా రిణి వంటివాని ప్రచురణములు బహుళముగఁ బ్రయత్నకృతప్రభావముఁగలవనియు,

---

1. కాకున్నచో చిన్నయసూరికి వర్ధంతిజరుగునని నేఁటి యువకు లెన్నఁడైనఁ గలఁ గనిరా? (ఆంధ్రప్రదేశ సాహిత్య 'అకాడమీ'—ఏప్రియలు తుదివారములో) 1962,
2. ఐడియలిజమ్, సర్ రియలిజమ్ వంటివి.

వేగుఁజుక్క విజ్ఞానచంద్రికా సరస్వతీగ్రంథమండలివంటివాని ప్రచురములు ప్రాయికముగ నప్రయత్నసిద్ధప్రభావముఁ గలవనియు మున్నే వచింపఁబడినది. ఈ యుద్యమములును గ్రంథమాలలును నెఱపిన పరివర్తనల బాహుళ్యమునుబట్టియు సమాసభూయిష్ఠమై గద్యయనఁదగు నందలి యా నాఁటి వచనరచననుబట్టియు గతప్రకరణ మేర్పడెను.

ఆధునికవచనయుగములో గ్రాంథిక ప్రామాణిక(వ్యావహారిక)భాషావివాదములు కథాసాహిత్యము నెడఁబరపిన ప్రభావమును బురస్కరించుకొని యీ ప్రకరణము వ్యవస్థిత మగుచున్నది. క్రీ.శ.1920తరువాత వాంధ్రసారస్వతములో నన్నిశాఖలయందలిరచనలును బ్రత్యేకముగ విడమరచినట్లుండి యాధునికయుగప్రభావితములని సుస్పష్టమై యగపడునట్లుండును.

వ్యావహారికభాషావాదమును స్మరించినతోడనే కీ.శే.గిడుగు వేంకటరామమూర్తి పంతులుపేరు స్మరణకురాక మానదు. పి.టి.శ్రీనివాసయ్యంగారు, గురుజాడ అప్పారావుగారు ప్రభృతులతోఁగలిసి మొట్టమొదట నీ వాదమును బ్రతిపాదించినవారు గిడుగువారు. అప్పారావుగారికలము గిడుగువారి నూతనవాదమునకు సహస్రముఖముల సహాకారియైనది. కవిప్రయోగము తప్పని వాదింపరాదు; కవి వాడుకచేసిన శబ్దములఁ బరిశీలించి వానిని లక్ష్యముగ గ్రహించి, లక్షణము చెప్పవలసినవాఁడు వైయాకరణి; 1నోటిమాటయుఁ జేతివ్రాఁతయునొకరీతిగనుండవలెను2; గ్రంథములలోనున్న పలుకుబడి వాడుకభాష పరమప్రాచీనమై యందఱకు నందుబాటులో లేదు; కాన దానిని వీడి వ్యావహారికభాషలో గ్రంథరచనఁ గావింపవలె ననెడిది వీరి వాదసారము. ఈ వాదము బాగుగనున్నదని పత్త్రికారచయితలు, నవకవులు, నాంగ్లవిద్యాధికులును బెక్కురీ దారినే పోఁజొచ్చిరి. ప్రాచ్యభాషాపండితులలో గూడ నీ మార్గమును బట్టినవారు కలరు. "ఉత్తి విసేసో కబ్వే భాసాజాహో ఇసాహోదు"3 అనెడి లక్ష్యముతో వీరు'తెలుగు'పత్త్రిక4 నొకదానిని నడపిరి. ప్రాచీనవర్తమానాంధ్రభాషాసారస్వతముల విచారణ దీని పరమో

1. "Grammarians do not lead speech; they follow it" (Wyld).
2. "The language of prose often approaches very closely to that of ordinary conversation" 'Sweet's English Grammer, vol I.
3. ఇది రాజశేఖరుని సూక్తి. 'కవులయుక్తి విశేషమే కావ్య మగును. భాష యేదైన నదియె కావచ్చుఁగాక' యని దీని భావము.
4. "How to approximate written and Spoken Telugu" (vol I–No 2)
"Who can fix a Living Language (vol – 4)
ఆంధ్రభాషా సంస్కరణము.
ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము. (vol I Nos7, 8,9,10,11,12)

ద్దేశము. పర్లాకిమిడి రాజాసాహెబ్ దీని కానాఁడు పోషకులు. మొత్తముమీఁద గిడుగు వారి యాధ్వర్యవమున సాగిన యీ వ్యావహారికభాషాయజ్ఞ[1] ఫలము దేశము నలుదెసలవెలసిన వచనవాఙ్మయ ప్రక్రియలయం దనుభూతిలోనికి వచ్చెను[2].

## నవ్యసాహిత్యము

క్రీ.శ.1920ప్రాంతము 'సహాయనిరాకరణాది' రాజకీయోద్యమములకుఁ బ్రతిఘటనలకును నెలకువ. ప్రామాణిక భాషోద్యమముగూడ వానితో సంవదించిన దనియో వానిప్రతిధ్వని యనియో చెప్పఁదగియున్నది. ఇందు భాషారూపము, కావ్యేతివృత్తము రెంటినిగూర్చియుఁ బ్రతిఘటన కలదు. నాఁటి భాషేతివృత్తముల ప్రతిఘటనలకు రెంటికిని (స్వర్గీయ)ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' యుత్తమోదాహరణము. కీ.శే.అడవిబాపిరాజు 'నారాయణరావు', శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి 'వేయిపడగలు'ను నాఁటి యాంధ్రదేశసాంఘికరాజకీయపరిస్థితుల చిత్రములు. అగుటచే భావముల మాట యటుండ నితివృత్తమునందుఁ గొంత నవ్యతయున్నది. కాని భాషావిషయమున స్థూలముగ వీనిని వ్యావహారికోద్యమప్రభావజన్యము లనఁజాలము. ఆ గ్రంథకర్తలు కథన మప్పుడు గ్రాంథికమును, పాత్రౌచితినిబట్టి వ్యావహారికమును వాడిరి.

ఇది యిటులుండఁగ నటు గ్రాంథికభాషోద్యమమునకుఁ బట్టుగొమ్మయై 'ఆంధ్ర సాహిత్యపరిషత్తు' నెలకొనెను. కీ.శే. కేతవరపు వేంకటశాస్త్రిప్రభృతుల నవలలు గ్రాంథికభాషావినియోగమున కుజ్జ్వలోదాహరణములు; పిమ్మట రంగములోనికివచ్చిన శ్రీనోరి నరసింహశాస్త్రిప్రభృతు లీసంప్రదాయమునే నిలఁబెట్టుటయు నిందె మును ముందు సంగ్రహింపఁబడును.

క్రీ.శ.1920లో భారతదేశమున 'సహాయనిరాకరణోద్యమము' ప్రారంభము. ప్రథమప్రపంచసంగ్రామఫలితములు భారతీయుల జీవితమునందుఁ గలిగించిన పరిణామములను బరిశీలించినచో నీ యుద్యమహేతువులు వెల్లడికాఁగలవు. యుద్ధకాలములో

---

1. నేఁటికిగూడ నిది సాగుచున్నది. చూడుఁడు 'వ్యావహారికభాషావ్యాప్తికి మాండలిక భేదాలు అడ్డురావు' శ్రీవడ్లమూడి గోపాలకృష్ణయ్య. ఆంధ్రప్రభ. దినపత్రిక. నవంబరు 20,27 ఆదివారములు" 1960.

2. "తెలుగు సంస్కృతి"యందలి "తెలుగువాఙ్మయము" అనువ్యాసములోని శీర్షికలు. ఆధునిక యుగము; వచనరచనా పరిణామము—పుటలు 620—629; 629—635. (1959) 'ఆంధ్ర రచయితలు (శ్రీమధునా పంతుల సత్యనారాయణశాస్త్రి) పుటలు 174—178 (1950). "వాణి"(శ్రీకొడవటిగంటికుటుంబరావు ప్రసంగము) సంపుటము 12,సంచిక 11,పుట 1.

గఱవు కాటకములవలనను నాధివ్యాధులవలనను బడిన బాధలఫలితముగఁ దెలరేఁగిన యసంతృప్తి ప్రజాబాహుళ్యములో నొక చైతన్యమును గలిగించినది. దాని కార్యరూప మీ యుద్యమము. ఈ యుద్యమముచే నుత్తేజితులైనవారు సల్పినది జాతీయవాఙ్మయ సృష్టి.

ఈ నవ్యసాహిత్యమును సమగ్రముగఁ బరీక్షించినచో నవ్యమార్గము లగపడును. సమస్తసాహిత్యప్రక్రియలలోను మార్పు, నియమోల్లంఘనము, నియమములఁ బాటించినవారియెడ నవహేళనము జరిగినవి. భావకవిత్వము; నమలినశృంగారము ననునవి వెలసి పూర్వప్రబంధ శృంగారమును ధిక్కరించినవి. దానిని బ్రతిఘటించి ప్రతియోగ పద్ధతిచే నిది రాణకెక్కెను. ఈ సంగతులను గ్రహింపనిచో నవ్యమార్గములలోని యభివృద్ధిని గమనింపలేము.

సంగ్రహార్థ మీ దశాబ్దిలోని వాఙ్మయమునందుఁ బ్రధానభూతములైన రెండు మార్గములనుగుఱించి చెప్పినఁజాలును. ప్రాచ్యపాశ్చాత్యవిమర్శనపద్ధతు లీదినములలో సంశ్లిష్టమైనవి. స్థూలముగ నాపద్ధతులనెల్ల సమన్వయించి నూతననామకరణము చేసినచో నవి తిరిగి త్రిధావిభక్తమై పరిశీలనకు సుకరము లగును.

౧ ఆత్మానుభూతి:-

ఇదియే పాశ్చాత్యుల వాస్తవానుభవము లేక వాస్తవికత 1.

౨ భావసంస్కారము—లేదా-వైయక్తికసంస్కారము:—

ఇది పాశ్చాత్యుల యాదర్శకత2.

౩ రసానందము:-

అపరోక్షానుభవము. ఇది మన పూర్వభారతీయకవుల రసానుభూతి3.

పాశ్చాత్యుల వాస్తవికతావాదమునందు రసానుభూతికి స్థాన మున్నదని కొందఱ వాదము. దానికి వారుచూపుకారణము విచిత్రముగ నుండును. వాస్తవికత ప్రజల నికృష్టజీవితమున నున్నదాని నున్నట్లుఁ జిత్రించుటయేగాక తన్నివారణోపాయము లనుగూడ సూచించును. కాని తన్మాత్రముచే రసానుభూతి యెట్లు కలుగునో యూహింపలేము.

---

1. Realism 2. Idealism 3. Transcendental aesth etic Bliss.
4. "ఆంధ్రసాహిత్య పునర్వికాసం," పుట 13, మద్దుకూరి చంద్రశేఖరరావు: విశాలాంధ్ర ప్రచురణము 321, అక్టోబరు 1958.

వారి దృష్టిలో పాశ్చాత్యుల యాదర్శవాదమువ్యక్తిగతమైన చిత్తసంస్కారము నకు విషయ మగుటయేగాక మన యాలంకారిక 'పరోక్షానుభూతి'యుఁ గలది. భారతీయుఁడైనకవి రసభావవివశత్వముచే వాస్తవజగత్తున కతీతమైన యానందరససింధువున నిమజ్జుఁడైనట్లే యాదర్శవాదియగు పాశ్చాత్యకవియు రసానుభూతి నొందఁగలఁడు. అందుచే వాస్తవికత యాదర్శకత మున్నగు భావవాదము లన్నింటియందును మన పూర్వలాక్షణికులు చెప్పిన రసానంద మిమిడియున్నదని వారి పిడివాదము.

కాని యిది నిరూపింపఁబడలేదు. పైఁగా రసచర్చనుగూర్చి పాశ్చాత్యులజ్ఞానము సుమారొక వందయేండ్లకు మించి విస్తరింపలే దనుటకు నిదర్శనము లున్నవి.

పిదప వాస్తవికతనుండి యధివాస్తవికత యను వాదమొకటి ప్రబలెను. ఒక దశాబ్దివఱకు వాస్తవికరచనలు సాగించిన శ్రీ. శ్రీరంగము శ్రీనివాసరావు నతని యను యాయులు మఱియొక దశాబ్దివచ్చినపిదపఁ దత్ప్రభావమువలన నధివాస్తవిక రచనలు సాగించిరి. అవి యథాక్రమమున ముందుముందుఁ బేర్కొనఁబడును.

## నవ్య సాహిత్యము

## (1930–1942)

క్రీ. శ. 1930నుండి 1942వఱకుఁగల దశను సత్యాగ్రహోద్యమదశ యందుము. ఈ యుద్యమము విజయవంతము కాలేదు. ఆర్థికసంక్షోభము ప్రపంచమునెల్లడను వ్యాపించెను. ప్రజల దృక్పథములో మార్పులు కొన్ని కలిగినవి. దాని ఛాయలు తరువాత వచ్చిన సాహిత్యములో ప్రతిబింబించుట గమనార్హము. క్రీ. శ. 1920లో వలెనే క్రీ. శ. 1930లో సత్యాగ్రహోద్యమమునందుఁ జెఱసాలలకుఁ బోయివచ్చినవారుగూడఁ దరువాత జీవనోపాధికొఱకై రేదోవృత్తి నవలంబించిరి. కాని యీ యుద్యమ మంత చితో నాఁగలేదు. సామాజికసామ్యవాదసిద్ధాంతములు ప్రజలలో ప్రచారముగా జొచ్చినవి. నూతనసామ్యవాదనాగరకతయందుఁ బ్రజానీకమున కాకాంక్ష ప్రబలెను.

పత్రికల యభివృద్ధి, చలనచిత్ర పరిశ్రమాభ్యుదయము, కష్టజీవుల జీవితమును జిత్రించు సాహిత్యము మున్నగు వాని నశ్రద్ధ చేయలేము. వానినెల్ల సాకల్యముగ నవలోదనము చేయవలెను. నవ్యసాహిత్య పరిషత్తు స్థాపనము, దదంగముగ నడపఁబడుచున్న 'ప్రతిభ' చేయు భాషాసేవయుఁ బ్రశంసార్హములు. వీని నన్నింటిని గమనించి సాహిత్యగవేషణఁ జేయుదుమేని యీ ప్రకరణమునఁ బరిశీలింపఁబడునదెల్ల మఱల మూఁడు విభాగములుగ విభజింపఁబడును:—

(౧) సాధారణ నవ్యమార్గము.

(౨) పూర్వ సంప్రదాయ పునర్గమన మార్గము [అభాసైతిహాసికత][1].

(౩) అతినవ్య మార్గము.

ఈ మార్గముల నవలావీథి కన్వయింతుమేని మన పంచమ ప్రకరణాంతము వఱకు వ్యాపించినది సాధారణ నవ్యమార్గము. షష్ఠ ప్రకరణాదిగ రాఁగల శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ప్రభృతులది[2] యాభాసైతిహాసిక పద్ధతి. అట్లే స్వర్గీయ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ గుడిపాటి వేంకటచలము మొదలైన వారిది యతి నవ్యపథము. ఇది బహు స్థూలముగ వింగడించుట. ఇందుఁ దిరిగి వ్యత్యాసములు లేవనిగాని వీరి వీరికి సర్వ విషయముల సమ్మతి గలదనిగాని భావింపరాదు. అట్లే యేమార్గము నేయొక్కరి యందైనఁ బరిణతి నొందిన దనలేము. ఎవరికి వారు నూతన మార్గములను తమ భావవ్యక్తీకరణమునకు సాధనములుగా జేసికొనుచున్నారు; వానిని సాధ్యమైనంత వినియోగించుకొనుచున్నారు. వీరిలో నతినవ్యులు సమాజాభ్యుదయమునకును బ్రజాసాహిత్య నిర్మాణమునకును దమరచనల విడుదల చేయుచున్నా మందురు. అభాసైతిహాసిక వాదులు మాత్రము సమాజాభ్యున్నతి గోరరా? వారిది మాత్రము ప్రజాసాహిత్యము కాదా? యనిన ప్రశ్నలున్నవి. నవ్యుల దృష్టిలోని సమాజము నవ్యసమాజము; ప్రజలు నవ్య ప్రజలు. సంప్రదాయ వాదుల దృష్టిలోని సమాజము సనాతన సమాజము; ప్రజలు సనాతనులు. అందఱకును సమాజశ్రేయోదృష్టియే కలదు. ప్రజాభ్యుదయకాంక్షయేయున్నది. కాకున్నచో వారి వారి ప్రజావర్గములు వేఱు; వారు వారవలంబించిన పద్ధతులును భిన్నములు.

సామ్రాజ్యవాదుల యార్థిక విధానమువలని పరిణామమే మన సాహిత్యములో గ్రొత్త పోకడలుపోయినది. పారిశ్రామికుల యార్థిక విధానమువలనఁగాని పరపరిపాలన పీడలవలనఁగాని యది పెరిఁగి వ్యాపింపలేదు. రాజకీయముగఁ గూడ మనదేశములో నానాఁడు జాతియోద్యమము వ్యాప్తినొంద లేకపోయెను. వీని యన్నిటి ఫలితముగఁ బొందిన యపజయతత్త్వ ప్రతిబింబమే యాభాసైతిహాసిక వాదుల రచనలలో నగపడునని యొక నింద మాత్రమున్నది. అది నిరాధారము. నవ్యసాహిత్య రూపములను శ్రీ విశ్వనాథ ప్రభృతులు పాశ్చాత్య నాగరకతాభివృద్ధి నిరసనకై వినియోగించుటవలన నిట్టి యపప్రథను కలిగినది. వీరి రచన లాధునిక సాహిత్యమునకుఁ బరిణతులు కాక పోవచ్చును. కళ యొక్క పరమప్రయోజనము కళయే యను వాదముకంటె భిన్నమైన వాదము ప్రకారము వీరిది, కళకు వేఱు ప్రయోజనములు గూడ నున్నవనునట్టి

1. Neo-classicism 2. అడవి బాపిరాజు, కుమారి వసుంధర, కొర్లపాటి శ్రీరామమూర్తి, ధూళిపాళ శ్రీ రామమూర్తి, పాటిబండ మాధవశర్మ మున్నగు వారు.

శాఖ. వీరిదృష్టిలో గూడఁ గేవలము ధనికస్వామ్యముల యుగమునాఁటి హిందూ ధర్మ పరిరక్షణ యే సాహిత్యప్రయోజన మనలేము.పీడితమై దుర్భర దారిద్ర్యము ననుభవించు నశేష ప్రజాసామాన్యమును సైతము కర్తవ్య నిరతముగఁ జేయు దృష్టితో రచించిన వీరి రచనలు గొన్ని గలవు. వీరు తమ స్వామ్యముల కొఱకని పేరు బెట్టుకొనక ధర్మ స్థాపన కొఱకని పేరు బెట్టుకొని పోరినపాత్రల నిర్మించి చూపిరి. విశాలమైన ప్రయోజనములు సాహిత్యమునకును గళకును కలవని కూడ నిరూపించిరి. శ్రీ విశ్వనాథ వారి నవలలలో స్థూలముగ 'బద్దన్న సేనాని' యట్టి వానియం దొక్కటి యనినఁ జాలును.

ఏ గ్రంథమును గాని వాతావరణ ప్రభావదృష్టితో బరిశీలించినపుడు తత్కాలి కార్థిక సాంఘిక రాజకీయాది పరిస్థితులు గోచరములు గాక మానవు. దేశకాలపరిస్థితుల నెఱిఁగిన బుద్ధితో 'వేయిపడగలు,' 'నారాయణరావు,' 'మాలపల్లి,' యను నవలలు మూఁడును దులనాత్మకముగ విమర్శింపఁబడినచో దేలునట్టి సారాంశము, మూఁడు వాక్యములు. పూర్వ పూర్వ యుగములయందలి పరిరక్షణ ముత్తరోత్తర యుగములలో నుండుట కలలోని వార్త యని వేయిపడగలు. ప్రాఁతకాలఁపు దాంభికత్వములను, మూఢవిశ్వాసములను వదలి సంస్కారము నొందుచుఁ దాత్కాలిక ధనిక స్వామ్యభూస్వామ్య నాగరకతల దెసఁగా బురోగమించుటయే మంచిదని 'నారాయణ రావు' సూచన. సమాజ జీవనములో నధోగతియందున్న ప్రజోద్ధరణము మన కర్తవ్య మని 'మాలపల్లి.'

ఈ మూఁడు నవలల నడుమ నింత వ్యత్యాస మున్నది. అనఁగా సామ్యగుణములు లేవని కాదు. కాని మనకుఁ బ్రస్తుతము ముఖ్య విషయ మింకొకటి.సమాజమునఁ గల జఘన్యజ వర్గ సముద్ధరణము నుద్దేశించిన 'మాలపల్లి'కి బ్రహ్మరథము పట్టువారు, సమాజ జీవితములో నధోగతియం దుండిరని మన మనుకొను వారి ప్రాభవమును, ధీరోదాత్తతయుఁ జిత్రించు 'బద్దన్న సేనాని'కి బ్రహ్మరథము బట్టక పోవుట హ్రస్వదృష్టి.

ఇఁక నించుకగఁ దాత్కాలిక వాతావరణ ప్రభావ చరిత్రమును బరిశీలించినచో నా యా ప్రసిద్ధ నవలల యవతరణమునకుఁ బూర్వ రంగము వ్యక్తమగును.

## జాతీయ పునరుజ్జీవనము

వీరేశలింగముగారు తామే యొక సంస్థ కాఁగా, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' యంతయు నొక జంగమ సంస్థయైనది. విజయనగర సామ్రాజ్యము, రాయచూరు యుద్ధము, పాతాళభైరవి, అల్లాహో అక్బర్ వంటి గొప్పనవలల వెలువరించిన విజ్ఞాన చంద్రిక ననుసరించి యాంధ్రదేశమున ననేక గ్రంథ మాలలు విరివిగా వెలసినవి. ఆంధ్ర ప్రచారిణి, సరస్వతి, వేగుఁ జుక్కవంటి గ్రంథ మాలలవలనఁ బెక్కునవలలు బ్రకటితములు. గ్రంథమాలలను బట్టి గ్రంథాలయములు

గూడ గ్రామ గ్రామమునను వెలసినవి. గ్రంథము లధికముగా వచ్చుగుట. తక్కువ ధరలకు లభించుట, సులభశైలిలో వ్రాయఁబడిన యీ నవలలు, వచనములును ప్రజా సామాన్యమునకు నందు బాటులోనుండుట వంటి యనేక ప్రయోజనములకు గ్రంథాల యోద్యమము సాధ్యమైనంతగ దోహదముచేసినది1.

ఈ శతాబ్దిలో దొలి దశకమున2 మచిలీ పట్టణమునం దాంధ్ర జాతీయ కళాశాల స్థాపింపఁబడెను. దాని కనుబంధముగ నొక పెద్ద కర్మాగారము, స్థాపత్య శిల్పము, చిత్రకళ మొదలుకొని శివాసీ వేఁత వఱకు నా కళాశాలయందు బోధింపఁబడినవి. అనేక శాఖలతో నొక విశ్వవిద్యాలయమువలె దీనిని నడపుట వ్యవస్థాపకుల యాశయము. అది మొదలుకొని రెండవ దశాబ్దియం దన్నిరంగములలోనుని నూతన జాతీయ వికాస మునకు కృషి జేయువారల కాశాజ్యోతి యగపడెడిది.

## వ్యావహారిక భాషా వాదము

తరువాత విజృంభించినది గిడుగు వేంకటరామమూర్తి పంతులు గారి వ్యావహారిక భాషావాదము. ఇది స్వదేశీయ వాదమా ? విదేశీయవాదమా ! యన్న ప్రశ్న నేఁటికిని నిల్చియేయున్నది. గ్రాంథిక వాదులు దీనిని పాశ్చాత్యులసంపర్కమువఁన రేఁగిన వాద మందురు. ఆంగ్లభాషలలో వ్యావహారిక గ్రాంథికములే గాక మాండలిక భేదములు,భిన్న భిన్నోచ్చారణలునుగలవు.ఆ ప్రభావముచే మనకు నివి కలిగెను.అయా దేశములలో నోటి మాటకుఁ జేతి వ్రాఁతకు సాన్నిహిత్యమును గూర్చి వాదములుండుటచే నదియే మన భాషలోనికి 'దిగుమతి' యైనది; అందుచే నిది వైదేశిక వాదమని యొక పక్షము వారు.

వ్యావహారికమే సజీవ భాష; మన పూర్వకవుల రచనలలో గూడ భాష కాలాను గుణముగఁ బరివర్తనఁ జెందుచు వచ్చినది; కావున నీ వాదము స్వదేశీయమే; విదేశములయందు నైతమిట్టి వాదోపవాదము లున్నవనుట సామ్యము జూపుట కొఱకు గాని, 'దిగుమతి' చేసికొనుటకుఁ గాదని మఱియొక పక్షము వారు. సారస్వత

---

1. చూడుఁడు:— ఆంధ్రగ్రంథాలయోద్యమము; పుట 6.., అట్లే "తెలంగాణా సాంస్కృతిక పునరుజ్జీవము"— గ్రంథమాలలు—పుట 11: ఆంధ్రదర్శిని (1957). 2. క్రీ.శ. 1909.

3. ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలములో (క్రీ.శ. 1914–1918) మచిలీపట్టణమునందు చక్కెరకును, రాజమహేంద్రవరమునందు కాగితములకును, తాడేపల్లియందు వస్త్రము లకును పెద్ద పెద్ద పరిశ్రమలు నెలకొలుపఁబడుట భిన్న భిన్న రంగములలో బ్రసరించిన జాతీయతాజ్యోతికి నిదర్శనము.

విషయములలో ప్రతిపక్షములేని సిద్ధాంతము గాని, యపవాదము నెఱుఁగని సూత్రము గాని యుండుట దుస్సాధము. దేనినైన నంతసులభముగ నిర్ణయింపరాదు. అది యట్లుండ దీని లోఁతు పాఁతులకుఁ బోవుట కర్తవ్యమును గాదు. నాఁటి వాతావరణ ములో నగపడు నానావిధ ధోరణుల [మార్గముల] పై విహంగావలోకనముఁ బఱపుటయే చేయఁదగిన పని.

సంఘమున నిరక్షరకుక్షు లెక్కువగ నున్నంత కాలము నది వృద్ధిలోనికి రాదు; సభ్యత యనునది సంఘములోని ధనవంతులును బెద్దలును సాధారణ ప్రజలతో సమాన ముగఁ బంచుకొనఁ దగినదేకాని తా మొక్కరుమాత్రమే యనుభవించునది యనలేము; ప్రజలలో విద్యావ్యాప్తిలేనినాఁడు సంఘ పురోభివృద్ధిలేదు. ఇట్టిది గిడుగు వారివాదము. దీనికిఁ దమ ప్రసిద్ధ "దేశ భక్తి" గీతము[1] వలన బలముచేకూర్చి యభ్యుదయకర మార్గ మును జూపినవారు గురుజాడ వారు. ఈ యర్థమునఁ బ్రగతివాద సమీక్షకులు వారికి నై వారముఁ బట్టుటలో గొంత ధర్మము లేకపోలేదు.

## జాతీయ వాదము

మఱల నిచ్చట నీ జాతీయవాదమునుగూర్చి భిన్న దృక్పథములు. ఈ వాదము పేరిట మన పూర్వసంస్కారము సన్నగిల్లినదని యొకరు. సామ్రాజ్యవాదుల నాగరకతను జూచి యుత్తేజమునొందిన మనదేశభక్తుల యార్థిక జీవితము పెంపొందక యశారేఖలు ప్రపంచ సంగ్రామ భయంకర కిమ్మీరములో లీనమై పోయినవని వేఱొకరు.

ఇం దేదినిజమన్నది ప్రకృతముగాదు. ఈ పద్ధతిలో మన నాయకుల చూపు ప్రాచీనౌన్నత్యము దెసఁగా మఱలి చరిత్రయొక్క లోఁతులనుండి యుత్సాహము చేఁదు కొనఁగగెను. చరిత్ర విషయకనవలల పుట్టుపూర్వోత్తర మిది యన్నమాట ! మనము శానిసలముగాకముందు సజీవవ్యక్తులమైయున్న దినములలోని జీవితముఁ దలఁచుకొని తలలెత్తవలసిన వారమైనాము.

ప్రాచీనౌన్నత్య దేశగర్వములతోఁబాటు తిరిగి జాతికుల దురహంకార చిహ్నములు పొడచూపినవని యభ్యుదయవాదులు వానిని నిరసింతురు. నిర్వీర్యము, నిస్తే జమునై పతనోన్ముఖమగు జాతికిఁ బ్రాచీనౌన్నత్య సంస్మరణమే జీవితము పోసినది; దాని వెంటఁ బొడమినది యాత్మప్రత్యయబుద్ధిగాని దురహంకారముగాదని సంప్రదాయ వాదు లందురు.

---

1. "దేశమును ప్రేమించుమన్నా ! మంచియన్నది పెంచుమన్నా !" (గురుజాడ)

## సహాయ నిరాకరణోద్యమము

ఇంతలో గాంధిమహాత్ముని నాయకత్వమున సహాయనిరాకరణోద్యమము తెలుఁగుదేశము నుఱ్ఱూఁతలూఁపినది. ఆ పాటలలోని యుత్తేజము నా పదములలోని యుద్వేగము నెంతో యభ్యుదయ సాధకములైనవని యొక యంచన.అది నిజమే; కాని వానిలో గూడ జాతీయవాదులలోనున్న లోప మున్నది. పూర్వప్రతాపపూతకృతులు మెండు; ఆత్మదోషములయం దాంధ్య మధికమునని యింకొక యంచన.

ఈ దేశములో లిఖింపఁబడిన రచనలలో శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి 'అహో బలీయం'[1] అను చిన్ననవల యప్రతిమాన ప్రతిభగలది. వా రానాఁటి జాతీయోద్యమ గుణదోషముల రెంటిని బహుసహజముగనందుఁ జిత్రించి చూపిరి. పామర పరిమిత జ్ఞాన ముతో బరిశీలింపఁగ నున్నది యున్నట్లు వర్ణింపఁబడె ననిపించుటవలన దీనిని వాస్తవి కత యనియు బేర్కొననగును. వారప్పటి జాతియోద్యమములోని గుణావగుణముల నిరూపించిరి.

ఓబయ్యా యొక విద్యావంతుఁడైన యువకుఁడు; జాతీయ వాది యగును. క్రమముగ దమగ్రామములో జాతీయపాఠశాల నొకదానిని నెలకొలిపి యతఁడు నిరుపేదలకు విద్యాబుద్ధులు బోధింపఁగలఁడు. అట్లే యందొక తపాలకచేరిని, సహకార పరభృతి సంఘమును నేర్పఱచును; ఊరిలో దారులు తెన్నులు తీర్చిదిద్దింపఁగలఁడు. అతఁడు బ్రహ్మచర్య మవలంబింపనెంచి చిన్ననాఁ డెన్నఁడో పెండ్లి యాడిన భార్యను గాఁపురమునకుఁ దీసికొనిరాఁడు. ఎంతచేసినను ఓబయ్యా నిర్మాణ కార్యక్రమ మంతయుఁ సరియైన పునాదులు లేకపోవుటవలనఁ గ్రమక్రమముగఁ గూలి పోవసాగును. లేఖలుపంపువారు తగినంతమంది లేక తపాలకచేరికిఁ దాళము. అప్పులు తీర్చువారు లేకపోవుటచే బరభృతి సంఘముపని రద్దు. బడి పిల్లలు తిన్నగరానికారణ మున జాతీయపాఠశాల మూసివేఁత. ఇన్ని మూలఁబడినను ఓబయ్యాకృషి కేవలము వ్యర్థ మనలేము. గ్రామమున గృహదాహ ప్రమాదమేర్పడును. అచ్చటికి నోబయ్యా శిష్యులందఱు సిద్ధమగుదురు. ఆ మంటలను జల్లార్పుటయం దాశైష్యసైనికబృందము చాలఁగ్రమశిక్షణమును బ్రకటింపఁగలదు. ఇట్టి గృహములు పరశురామప్రీతియైనవార్త గ్రామమందుఁ బొక్కును. ఓబయ్యా దీక్షవలన గార్హస్థ్యజీవితమే లభింపని యాతని భార్య, వైద్య పరీక్షలో నుత్తీర్ణురాలై యా గ్రామముననే వైద్యము చేయుచున్నది. ఆమె యీ వార్తవిని యిల్లు వాకిలిలేక యల్లాడు నిరాధారులకు సాయముఁబంపును.

---

1. "ఓబయ్యా" యనుపేరిటఁదొలుతనిది భారతిలో మాసక్రమమునఁబ్రకటితము

ఈ చిన్న నవలయందు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు[1] నాఁటి తెలుఁగు దేశములోని జాతీయోద్యమమునకు సజీవమైన రూపకల్పనఁ జేసిరి. స్వరాజ్యము తనంతట వచ్చు వఱకు నిట్టి యుద్యమములు ఫలోన్ముఖములై తీరునని నిజమున కెంద అనుకొనిరి? మహాత్మునివంటి దీర్ఘదర్శు లేకొందఱో!

సుమారీ దినములలోనే వ్రాయఁబడినది ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి'. రష్యను విప్లవచ్ఛాయలు, భారతీయతత్త్వశాస్త్ర కిరణలేశములు, నరాజకఁపు టంధతమసము లన్నియు మిళితమై కలగలుపై యేర్పడిన యొక మసక వెలుగే 'మాలపల్లి'. ధనికస్వాముల సంప్రదాయములనుండి క్రమముగఁ బెకలించుకొని సామ్రాజ్యవాదుల నాగరకత యెట్లు బయటపడుచున్నదియుఁ జిత్రించునవల, అడవి బాపిరాజుగారి "నారాయణరావు". శ్రీ విశ్వనాథవారి "వేయిపడగలు" నాఁటి తెలుఁగుదేశపుఁ బ్రజాజీవితమును బ్రతిబింబించుచున్న మేరవఱకు వాస్తవికరచనమనకతీరదు. భావములకు సంబంధించినంతవఱకు శ్రీ విశ్వనాథవారిది వెనుకచూపే యనవలెను. యథాస్థానమున బుద్ధితత్త్వ భావతత్త్వపరములుగ నీ నవలలు విమర్శింపఁబడునప్పు డాయాయంశము లుటంకింపఁబడఁగలవు.

## వివర్తనములు అరాజక మార్గములు

పాశ్చాత్యదేశములలో బ్రథమ ప్రపంచ సంగ్రామమునకు దారితీసిన నాగరకత యెడ నేవగింపు బయలుదేరినది. అందువలనఁ బ్రాఁతసంప్రదాయములను నియమములను నుల్లంఘించు నూతనమార్గము లావిష్కృతములైనవి. సాహిత్యరంగమునందుఁ గూడ నచ్చట నివి[2] బ్రతిబింబింపకతీరలేదు. ఛందోనియమములఁ బాటింపకపోవుటయు,[3] నూహకుఁదోఁచిన తలఁపుల నొక క్రమతలేక చిత్రించుటయు[4] ననునవి యీ మార్గముల ప్రత్యేకతలు.

అంతగా మనదేశమున నట్లు జరుగలేదు. ఇది జాతీయోద్యమఫలితము; సామ్రాజ్యవాదుల నాగరకతపైఁగల్గిన యేహ్యాభావము, భూస్వామ్యవిధానసంప్రదాయములవైపు చూపు మఱలుటకుఁ గారణమయ్యెను. కావున నా నూతన మార్గము లంతగా మనయందు దాచరణములోనికి రాలేదు. కాని జాతీయోద్యమము, మన సంస్కారమును బెంపొందించి సంపూర్ణాభ్యుదయమార్గమున నడిపింపలేక వెనుకచూపుఁబట్టినందున మనదేశములో గూడఁ గొన్ని వివర్తనములు, నరాజకధోరణులు నేర్పడినవి.

---

1. ఫ్రెంచిభాషలో విక్టరుహ్యూగో వ్రాసిన "లేమిజరబ్లే"ను "దివ్యజీవనము" పేరఁట వీరను వదించిరి (1946).
2. డాడాయిజం, క్యూబిజం, ఇమేజిజం, నాన్‌ఫిగరాంటిజం, ఇంప్రెషనిజం సర్‌రియలిజం, వంటివి 3. రైమ్స్‌ను లక్ష్య పెట్టలేదు: బ్లాంక్‌వర్స్‌ను. మన్నించిరి, 4. సర్‌రియలిజం.

వీనికి గుడిపాటి వెంకటచలముగారి రచన లుత్తమోదాహరణములు. పాటి వారిలో జాలమందివలె వీరును బ్రాహ్మసామాజికులు. వీరేశలింగముగారిది వీరిది శైష్యోపాధ్యాయిక. చిన్నతనములో వీ రాశించిన స్త్రీజనస్వాతంత్ర్యము, నూతనసంస్కారము వ్యాప్తిఁజెందలేదు; నిరాశకలిగెను. తన్నిస్పృహ శ్రీకృష్ణశాస్త్రిప్రభృతుల రచనలలో విషాదగీతికలరూపముఁదాల్పఁగా శ్రీచలముగారి రచనలలో గేవలము వివర్తనరూపముఁదాల్చినది.

శ్రీచలముగారు ప్రథామముగ స్త్రీలు మనసమాజమునం దనుభవించుచున్న కష్టనిష్ఠురములను వాస్తవికముగఁ జిత్రింతురు. దానికిఁదోడు వారిది సజీవమైన వ్యావహారిక భాష. వీరిరచన లన్నింటికి సర్వసాధారణముగ స్త్రీపురుషసంబంధములే యితివృత్తములు. తొల్లిఁటి యరదండలను విదిర్చికొని స్త్రీ తిరుగఁబాటుచేయుటయే భిన్నభిన్న రూపములలో చలముగారు చెప్పుదురు.

కాని తమ గురువైన వీరేశలింగముగారికి, వీరికిఁ బ్రధానవ్యత్యాస మొకటి కలదు. వారికృషి నిర్మాణాత్మకము; వీరిది వ్యవస్థానిర్మూలము. "పురుషునకు బానిసగ నుండవలదు; తిరుగఁబాటుచేయుము; ఇంటినుండి లేచిపొమ్ము;" అని ధైర్యముగ బోధించిరేగాని పంతులుగారివలె మహిళలకు చలముగా రొక నిర్మాణాత్మకమైన ప్రణాళిక నందింపలేకపోయిరి. గృహమును బరిత్యజించి వీధినిఁబడిన సోదరికి నేఁటి మన సమాజములో గతి యేమున్నది? ఆత్మవంచనము, జగద్వంచనమేగదా, మన యీ నాగరకత! ఇట్టి పరిస్థితులలో స్త్రీ 'పండువంటి సంసారమును బాడుచేసికొని' యంగడివస్తువువలె నమ్ముడుపోవుటయేనా, వారు తమ రచనలలో జూపవలసిన కార్యక్రమము? ఆమె పూర్వ మొక్కరికే బానిస; తాను దైవమనుకొన్న భర్తకే సేవిక; ఇప్పు డిది యధమాధమ క్షణక్షణ విక్రయణీయ దాస్యము గాదా? ఇది యుచ్ఛ్రయమా? పతనమా? ఇట్లు భ్రష్టతనొంది చివికిపోయెడి పాత్రలే చలముగారిసృష్టి. ఈ విషమావస్థ నుండి తప్పించుకొని సురక్షితమైన మార్గములనుబట్టు సూచనలు స్త్రీజాతికిఁ జేసియుండినచో చలముగా రరాజకత్వమునకు దృష్టాంత మయ్యెడివారుగారు. ఒక్క సందేశము లోపించుటచే వీరి నవల లిట్లైనవిగాని, భాష, రచనానైపుణ్యము, శిల్పము మున్నగువానిదృష్టితో బరిశీలించినప్పుడు తెలుఁగు సాహిత్యమున కివి యొక క్రొత్తఁదనమును గూర్చినవి.

జాతీయోద్యమము వెనకచూపు పట్టెను. నవ్యాంధ్రజాతి నది సృజింపలేక పోయినది. ఆశించిన నూతనసంస్కారమునై తము వ్యాప్తికాలేదు; అనఁగా బ్రథానోద్యమమునకుఁ దిరోగమనదృష్టిపడెనని మున్నే చెప్పఁబడెను. దీనితో గొన్ని పాఠకము తెన వివరణములుగూడ మొలక తెత్తినవి. కీ. శే. త్రిపురనేని రామస్వామిచౌదరి రచ

నలు1, శ్రీముద్దుకృష్ణ రచనలువంటివి వీని కుదాహరణములు. కాని వీని విషయములో మఱియొక విచిత్రమున్నది. వర్ణాశ్రమధర్మములుగల హిందూమతసంప్రదాయములను నిరసించు వీరి రచనలు రాజకీయముగ ధనికస్వామ్యముల నాయకత్వమున నిర్వహింపఁబడు నొకానొక పక్షమున2 కనుబంధములు,నంకితములునై పోవుటవలన సాధారణప్రజానీకము ను త్తేజపఱపలేకపోయినవి3.

త్రిపురనేని రామస్వామిచౌదరి, ముద్దుకృష్ణ4 మొదలైనవారు పాక్షికముగను, చలముగా5 పరిపూర్ణముగను నెఱపిన తిరుగఁబాటులలో నింకొక ప్రత్యేకత్వ మగపడును అది పురాణగాథలనే స్వీకరించి నూతనదృక్పథముతో జిత్రించుట. తమ నవ్యపథములు పఠితల నాకర్షించుట కిది యొక సాధనము. అవి ప్రాఁతవేయనుకొని చదువు చదువరులు వంచితు లగుటలేదా? యనినచో నది వేఱుమాట. నూతనభావమార్గములఁ బ్రచారము చేయవలెననెడి యాసక్తిపరుల కిట్టి ధర్మాధర్మములతో బనియుండదు. వారికిఁ గావల సినది వంచనచేనైనను బ్రజలనాకర్షించుట. ఇది యొక విదేశీయాచారమని మున్నే చెప్పఁబడెను.

యూరపుఖండములో రూసో, విక్టర్ హ్యూగోలవంటి వారుగూడఁ బురాతన గాథలను నూతనభావముల ప్రచారమునకుసాధనములుగఁ బ్రారంభదశలో వినియోగించు కొనిరి. కాని వారు తరువాతఁదరువాత నద్యతనప్రజాజీవితమును జిత్రించుచు నూతన పాత్రలను, సన్నివేశములను సృజింపఁజొచ్చిరి6. మన వివర్తనపరులు పురాణవిషయము లను దాఱుమాఱుచేయఁబూనిరేగాని నవ్యపాత్రల సృజించి జూపఁజాలకపోవుట దుర దృష్టము. కావున వీరి కొన్నిరచనలు7 కొందఱిప్రజలకుఁ బురాణభావములయందు వ్యతి రేకతను గొలిపినను వినూతనపథములను జూపఁజాలకపోయినవి.

అంతేకాదు; కొన్ని పవిత్రపాత్రలసౌశీల్యమున కన్యథాత్వముఁగల్పించుట8 ప్రజలను నవ్యసంస్కారాభిముఖులుగా నాకర్షించుట కొక ఋజుమార్గ మనలేము. గురుజాడ వేంకటఅప్పారావువలెఁ గ్రొత్తపాత్రలను9 వాస్తవికదృష్టితో సృష్టింపఁగలి గినయెడల వీరు దమ యాశయమును నెరవేర్చుకొనెడివారు.

---

1. 'కురుక్షేత్ర సంగ్రామము' "సూతపురాణము," "ఖూనీ" మొదలైనవి.
2. Politically called the capitalistic Justice Party.
3. శంబుక వధ.
4. అశోకం.
5. సావిత్రి.
6. లే మిజరబ్లే మాదిరి విందులకుఁ దార్కాణలు.
7. శ్రీముద్దుకృష్ణగారి "అశోకం"; శ్రీ చలముగారి "సావిత్రి" వంటివి.
8. పాఠకలోకము మహాపతివ్రతలుగ గౌరవించు సీతాసావిత్రుల వంటి పాత్రలకు రావణ యమధర్మాదులతో ప్రేమ (సృష్టించుట).
9. "కన్యాశుల్కము" లో గిరీశము.

## ఆంధ్రజాతీయ వివర్తనము

ఇంతవఱకు భూస్వామ్య, ధనికస్వామ్యవిధాన నాగరకతలయెడ వివర్తనము బరిశీలింపఁబడెను. వర్ణాశ్రమములలో నధికత్వాల్పత్వము లున్నవి; అవియే సంఘమున నిమ్నోన్నతత్వముల కాస్కారములు; కావున వానిని నిర్మూలింపవలెనంచు హిందూ సంస్కారమునెడ జరిగినతిరుగఁబాటునుగూర్చియు వివరింపఁబడినది. జాతీయోద్యమము పట్టిన తిరోముఖముకూడ గమనింపఁబడెను.

భారతజాతీయోద్యమములో ముఖ్యాంగమైన గాంధేయతత్త్వము, పరిశ్రమలకు వ్యతిరేకము: హిందుస్థానీభాషను జాతీయభాషగ నాంధ్రదేశమునం దధికముగఁ బ్రచారముచేసినది. తెలుఁగుదేశమునఁ బరిశ్రమలే పెంపొందలేదు. అట్టి దేశములో వానిని విసర్జింపుమని యెంతో ప్రచారము సాగెను. చేతిపరిశ్రమల గాలంబన మిమ్మనియు నొక యుద్బోధము. ఆ నిషేధము, నీ విధియు నాంధ్రదేశములో నొక విధమైన వివర్తనమునకు హేతువు లయ్యెను. కీ. శే. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి రచనలయం దదిప్రధాఖ్యానతము.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగా రనేకసాహిత్య ప్రక్రియలలో నందెవేసినచేయి[1]. వారి రచనలలో దెలుఁగుఁదన ముట్టిపడుచుండుటగాని యా సంవాదములపదనుగాని మనకుఁ బ్రకృతముకాదు. స్థలాంతరమున నా విషయములు ప్రశస్యములు. వారివని కొన్ని ప్రత్యేకవాదము లున్నవి. హిందీ, తెలుఁగుభాష కపకారము చేయుచున్నదనుట యందు మొదటిది. పరిశ్రమములనుండి లాభము లార్జించువారు గుజరాతీ మార్వాడిజాతులలోని ధనాఢ్యులు; ఆ యా రాష్ట్రీకులలోని సాధారణప్రజలు వానివాని బహిష్కృతికిఁ బ్రచారముసాగించుట ధర్మము కావచ్చును. ఆంధ్రదేశమున నట్టి సమస్యయే లేదు. పరిశ్రమలవిషయమున నీ రాష్ట్రము చాల వెనుకఁబడియేయున్నది.[2] అయిన నా యౌత్తరాహుల నినాదముల యంధానుసరణ మాంధ్రదేశమునఁ దప్పలేదు. వారి యా మాటలనే వల్లించుటవలనఁగల్గిన ఘోరాపచారము లింతింత యనరానివి. ఉత్తరదేశవాసుల వేషభాషల యనుకరణ యాంధ్రజాతీయతాపురోభివృద్ధికిఁ గళాఘాతము; ఆంధ్రుల కొకసంస్కృతియున్నదని యెల్లరు మఱచుట కిది హేతువగును. వీరు వీరని యెవ్వరికిఁ దెలియదు. 'జనగణమన' జాతీయగీతములో రెండక్షరములకైన స్థానములేనిజాతికి భారతదేశపటమున స్థాన మెన్నిదినము లుండును? తెనుఁగుఁదనమునుగూర్చి యిది వారి రెండవతీవ్రవాదము, వితంతువుల సమస్యాదికమునుగుఱించిన వారి సంఘసంస్కారవాదము మూఁడవది.

---

1. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 25–2–1961 నాఁడు స్వర్గస్థులైరి. (భారతి. పుట 1, మార్చి 1961)
2. చూడుఁడు:–"పరిశ్రమలు" పుట 4, "ఆంధ్రదర్శిని" (1957).

ఆంధ్రజాతీయవాదపరిణామముగ నొక విషయము చిగిరించెను. అది మన ప్రాచీన కళోద్ధరణము. దానికి నుపస్కారకముగ దేవదాసీధర్మమును సమర్థించుట యొకటి. ఇది విశ్వనాథ సత్యనారాయణగారి వేయిపడగలయందును జరుగును. ఆంధ్రజాతీయవాద మును భుజానవేసికొనిన కారణముచే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మన ప్రాచీన కళల సంరక్షించు నావేశములో వేశ్యావృత్తిని సమర్థించుస్థితిలోనికి దిగజారిపోయిరని యొక యవిమృశ్యకారితైన నింద కూడ మోపఁబడినది. దేవదాసి ధర్మనిర్వహణమును వేశ్యావృత్తికిఁ బర్యాయపదముగ వాడుటలోగల సామంజస్యము నిచ్చటఁ జర్చింపరాదు. కేవలము వాదముకొఱకై చలనచిత్రపరిశ్రమవలన నేఁడు మన కళలు బ్రతుకుచున్నవే యనుకొందము. పలువురు చేరెడి కూటమికావున నా పరిశ్రమలలో నవినీతియుఁ బ్రవే శించెనని వాదమునిమిత్తమే యంగీకరింతము. అయినను వాని యుద్దేశ మిదియేయని యనరాదుకదా! శీలసంపద వ్యక్తినిష్ఠితము.

వితంతుసమస్యలవిషయములో నూతనసంస్కారము నపేక్షించిన శాస్త్రిగారు దేవదాసీధర్మమునందు నూతనసంస్కారము నపేక్షింపలేదనెడి విమర్శనకు వా రిచ్చిన సమాధాన మొక్కటియే యున్నది. దీనిలో నేది సంస్కారమో, యేది కాదో యా సంస్కారమువలన సంఘమునకుఁగలిగిన శ్రేయమేదో యా సంస్కార మనుకొనిన దానివలన సంఘమునకుఁ బ్రత్యక్షముగను గళకుఁ బరోక్షముగను గలిగిన యనర్థకమేదో భావిచరిత్రకారులు పునాదులవఱకుఁ బోయినపుడు నిర్ణయింతురు. అందుచే శాస్త్రిగారి రచనలలో గాంధేయ మగు జాతీయతత్త్వములోని లోపములు సూచింపఁబడినను, నాంధ్రజాతీయతాహంకా రము ప్రస్ఫుట మగుచున్నదనెడి యభియోగమున కింత త్వరలో దీర్పుఁజెప్పఁ జాలము.

ఇట్లే శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారుగూడ నూతనసాహిత్యరూపము లన్ని టను సిద్ధహస్తులు; అందును నవలలలో దమ వాదమును నిరూపించుకొనటయందుఁ జేయి దిరిగిన దిట్ట. ఇది కళాకౌశలవిషయము. వారి యా రచనలలోనిది వాదిబలమేగాని వాదబలముగా దనుట కావ్యవిమర్శనావధులను దాఁటినమాటయేమో! అయినను నది మనకుఁ బ్రస్తుతముగాదు; ఉత్తరోత్తర తప్పదు.

సాహిత్యప్రక్రియల నన్నింటిని వీరు వెనుకచూపునకే వినియోగించి రనెడిది యింకొక విమర్శన. 'వేయిపడగలు'నవలలో వర్ణాశ్రమధర్మములను, భూస్వామ్యవిధాన మును బునఃప్రతిష్ఠిత మొనర్చుట వీరిభావమని రాజకీయవేత్తల సాహిత్యవిమర్శన. వీరేశ లింగముగారి కాలము మొదలుకొని నేఁటివఱకు నాంధ్రజాతి సాధించినది సాంఘిక ముగ నభివృద్ధి కాదనియు నది యొక సంస్కారము కాదనియుఁ బురాభ్యున్నతియే మనజాతి యౌన్నత్యమనియు విశ్వనాథవారి ప్రగాఢవిశ్వాసము. పాశ్చాత్యనాగరకత

కలవాటుపడిన కారణముచే నాధునికమైనదానినే నాగరకతగ మన్నించుచుంటిమనుట వారి వాదసారము. నవీననాగరకత తిన్ననిదికాదని ధ్రువపఱచుటకు వీరి 'చెలియలికట్ట' పాత్ర్య మిచ్చును. ఇది మన నేఁటి నాగరకతను దూషించుటకు వ్రాయఁబడినది; ఇందలి సన్నివేశకల్పన మసహజము. వీరి రచనల నన్నింటిని బరిశీలింపఁగ ముందొక ముఖ్యవిషయము దోఁచును. మన నాగరకతను భూస్వామ్యయుగమున కభిముఖముగ మఱలఁ గొనిపోవుట వారి యాశయము; తదాశయమునందు, హిందూజాతి వర్ణాశ్రమధర్మసంరక్షణదురవాంక్షకూడ బ్రస్ఫురిల్లుచున్నదని ప్రతివాదుల నమ్మిక. నిజమునకు విశ్వనాథ వారి నేఁటి నాగరకతకంటెఁ బూర్వము మనకు గొప్పనాగరకతగలదని పెక్కు నవలలలో నొక్కిచెప్పిరి. 'చెలియలికట్ట'లోని యతివృత్త మసాధారణమైనను నస్వాభావికము మాత్రముకాదు. అందుఁ బ్రాయోపవ మున్నది.

ఇఁక భూస్వామ్యయుగనాగరకత మంచిదని వారికి విశ్వాసముండుట యనునది యొక విమర్శనార్హమగు సంశయము కాదు. అది వారి విశ్వాసము కావచ్చును. రచయితను నీ కిట్టి పరమవిశ్వాసము లేలయున్నదని మనము ప్రశ్నింపఁగూడదు. దానిని విమర్శన యనరు. కవివిశ్వాసము లెట్టివైనను వానిని నేర్పుతో జెప్పెనో బుద్ధితో ప్రకటించెనా, లేదా, యనునదియే విమర్శనకు పరమావధి. ఆ నాగరకత నంతకంటె నేర్పుతో నిర్మించినవారు లేరనుట నిజము.

ఇచ్చట రెండువిషయములు ముఖ్యములు. విశ్వనాథవారు తిరోగాములైనచో చలముగారు తీవ్రపురోగాములు. తిరోగమనమువలని కష్టసుఖముల నందఱు నెఱుఁగుదురు. ఒకవేళ కష్టములే యున్నను వాని యాపదలను మించిన యాపద లిఁక రావు. పురోగతివలని కష్టసుఖము లెవ్వరును బూర్వమెఱుఁగరు. కావునఁ గడు జాగరూకతతో బురోగమనము నవలంబింపవలెను.

విశ్వనాథవారి పాఠకులసంఖ్య తక్కువ; స్థాయి యెక్కువ. చలముగారిపాఠకుల విషయమున నీ రెండు విపరీతము. అందుచే వారిరచనలవలని మేలుఁగీళ్ళకంటె వీరిరచనలవలని మేలుఁగీళ్ళు సంఘమున నధికముగను, వేగముగను వ్యాపించును. అనఁగా చలముగారికి సంఘమునఁగల పలుకుబడి కాలధర్మమునుబట్టి యధికము. అందువలన స్త్రీలకు మార్గము చూపునపుడు వారాలోచించి యాలోచించి చూపవలసినది. శ్రీచలము విశ్వనాథవారలఁగూర్చిన సమీక్షలలో నగపడు వ్యత్యాసము స్థూలముగవారివారికి సంఘముపైఁగల ప్రభావమునుబట్టి యేర్పడుచున్నది; సంఘక్షేమదృష్టిచే నేర్పడుచున్నది. విమర్శకుల యిష్టానిష్టములనుబట్టి యది యేర్పడఁజాలదు.

ఆ మాటకువచ్చినచో, సామాజిక, సామ్య వాస్తవికాభ్యుదయాదివాదముల నినాదములతో దిరదిరఁదిరిగిపోవు నీ కాలమునందు వస్తువులకు వాదములకును విలువ నిలుకడగ నుండఁజాలదు. అధికారమునందున్నవారే వాదమును జేపట్టిన నా వాద

మున కధికారివర్గబలమునుబట్టి వచ్చుబలము, విలువయునే గాని స్వతస్సిద్ధమైన బలమును విలువయు నని యుండఁజాలవుకదా! రాజకీయశాస్త్రముల నెఱిఁగినవా రెల్లరును దీని నెఱుఁగుదురు. వస్తువులయు వాదములయు విలువలనుగూర్చి యొక ప్రజాస్వామ్యము నందుమాత్రమించుక మౌళికమైన సానుభూతియుండునేమో! కాని కడమ రాజకీయ పరిపాలనాదివిధానములయం దధికారముననున్నవా రెంతచెప్పిన నంతయని రాజకీయ చరిత్రలిచ్చిన సాక్ష్యము లున్నవిగదా!

ఇట్టి పరిస్థితులలో నేఁడు భూస్వామ్యవిధాన మనేకకారణములచే బ్రజాసమ్మతము గాకపోవచ్చును. ఱేపు ప్రజాస్వామ్యము మొగముమొత్తి సమర్ధవంతమైన యింకొక పరి పాలనావిధానమురావచ్చును. నేఁడు నాకునచ్చిన యీ యొకానొకపద్ధతియే సర్వత్ర యుత్తమోత్తమ మనుకొనుట కేవలము యౌవనధర్మము; సానుభూతి లేనిదోషము.

పోఁగా నిఁక వర్ణాశ్రమధర్మదురహంకార మనునది యొక విచిత్రమైన యభి యోగము. ఈ వాదమునం దెక్కువ పసలేదు. వర్ణాశ్రమధర్మరక్షణవాదము నహంకార మనుట యన్యాయము. వర్ణాశ్రమములుండియు ద్వేషములులేని పూర్వకాలసమాజజీవన మాదర్శమని విశ్వనాథవారి నమ్మిక. వారి వీరవల్లఁడు, బద్దన్నసేనాని, మున్నగు నవలల సానుభూతితో జదివినవా రెవ్వరుగాని వర్ణాశ్రమముల యహంకృతిచిత్రణము తద్రచయిత యుద్దేశ మనఁజాలరు. ఈ విశేషమునుగూర్చి "కొందఱువిశిష్టనవలా కర్తల"ను బ్రకరణమున నింకను ముందు విశదీకరింపఁబడఁగలదు.

## నవ్య సాహిత్య పరిషత్తు

ఈ పరిషదధ్యక్షులు స్వామి తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు. ఇందలి సభ్యు లెల్లరు వ్యావహారికభాషావాదమును బ్రచారముచేసిరి. తద్భాషయందు రచనలు చేయు వారికిఁ బ్రోత్సాహ మీ పరిషత్తువలన లభించెను. ప్రజలు భాషదగ్గఱకు రామనఁగా, నిది భాషను బ్రజలదగ్గఱకుఁ దీసికొనిపోవుటకై చాలఁ గృషిసల్పినది.

భావకవిత్వ మనుపేరిటఁ గావ్యములు వెలసినవి[1]. నడిమితరగతి ప్రజాజీవితము నాలంబముగఁ జేసికొని కథావాఙ్మయ మధికముగ వెలసెను. కవిత్వమునందుకంటె

1. కీ.శే. దువ్వూరి రామిరెడ్డి "కృషీవలుఁడు" మున్నగు కావ్యములలో కర్షక జీవితమును రమ్యముగఁ జిత్రించిరి. అట్లే కీ.శే. నండూరి సుబ్బారావు "యెంకి పాటలు", శ్రీ జాషువ గారి "గబ్బిలము", 'స్వప్న గాథ' "కాందిశీకుఁడు" కూడనిట్టివే; పట్టనజీవితములోని బాధలు పడలేని మనస్సుతో జిత్రించుటవలన నీమన కవులకుఁ బల్లెపట్టులు స్వర్గసీమలనెడి భ్రమకలిగెను. ఇది వాస్తవిక చిత్రముగాదు. ఏమైనను నివి సాధారణ ప్రజా జీవితమును జిత్రించుటకు జరిగిన మొదటి యభ్యుదయకర ప్రయత్నము లనకతీరదు.

నిందు వాస్తవికతయెడ రచయితలకుఁ జూపు నిలిచినది. కావ్యములయందువలెఁ గథావాఙ్మయములో బల్లెదికుక్కలు పాడివంటలతో వర్ధిల్లునట్టి కేవల స్వర్గసీమలు గావు. ఇచ్చట కర్షకకార్మికుల కష్టనిష్ఠురములు గొన్ని వర్ణింపఁబడినవి. ఇందు కేవల మఖ్యాదయరచనలేగాక వాస్తవికచిత్రములుగూడ నీ యుగములో గథాసాహిత్యమునందుఁ జిగురెత్తె నన్నమాట.

జాతీయవాదయుగమునాఁటి యాంధ్రసాహిత్యరంగములో నొక ప్రధానమైన బలహీనత యగపడును. ఈ యుగమునఁ బరిశ్రమలును నార్థికజీవితమును గుంటుపడినట్లుఁ జెప్పఁబడినవి. సారస్వతరంగమునఁగూడ గ్రంథప్రకటనలయు గ్రంథవిక్రయము లయు విషయములో ప్రకాశాత్మకమైనంత నిర్మాణాత్మకకృషి జరుగలేదు. ఇతఃపూర్వ యుగమునకుఁ జెందిన కందుకూరి, చిలకమర్తిప్రభృతుల కృతులును విజ్ఞానచంద్రిక, ఆంధ్రప్రచారిణీగ్రంథమాల, సరస్వతీగ్రంథమండలి మున్నగువాని ప్రచురములును వేల కొలఁదిగ ముద్రితములై వ్యయమయ్యెడివి. రచయితకు గ్రాసవాసోదైన్యము లుండెడివి కావు; ఆదరముగూడ నమేయము.

ఈ జాతీయవాదయుగమున నీ పరిస్థితి పూర్తిగ వ్యత్యస్త మయ్యెను. ఏ గ్రంథమునకైనఁ బ్రథమావృత్తివి వేయిప్రతులును నమ్ముడుపోయినచో నది యొక గొప్ప యదృష్టము. కృతికర్తలకు భుక్తియే గడవదు; ఆర్థికశాస్త్రపరిభాషలో జెప్పినచో నుత్పత్తి కిఁదగిన వినియోగములేదు. కావున సాహిత్యము ప్రజాసామాన్యములోనికిఁ జొచ్చుకొని పోవలేదని యొక సమాధానము. దీని విషయమునఁ గొంత బాధ్యత రచయితలదియుఁ గలదు. తమ రచనలను మిక్కిలి వెలగల ప్రచురములుగ ముద్రింపించి వాని కధికమైన మూల్యమును నిర్ణయించినఁగాని యవి సాహిత్యగౌరవమున కర్హములు గావని వారి కొకభ్రమ. తన్మూలమున వారు కీర్తిని ధనమును నార్జింపలేరు. రచనలు ప్రజానీకములోనికి విరివిగఁ బ్రాఁకనులేవు.

ఐనను సరస్వతీగ్రంథమాల[1]వంటివి స్వల్పమూల్యమునకుఁ గొన్నినవలలు ప్రచురించినవి. ఈ గ్రంథమాల నెలకొల్పిన యుత్సాహవంతుఁడు శ్రీ కాకరపర్తి సత్యనారాయణగారు. ఈయన బహుగ్రంథకర్త.

సరస్వతీ గ్రంథమాలయందు మూఁడు మాసముల కొకటి చొప్పున రసవంతము లగు నవలలు నాటకములు ప్రచురింపఁబడుచుండెడివి. ఇందుఁ బ్రథమమునఁ బ్రచురిత

1. ఇది కాకరపఱ్ఱు, తణుకు తాలూకా (నేఁటి) పశ్చిమ గోదావరి జిల్లాయందు క్రీ.శ. 1923లో స్థాపింపఁ బడినది.

మైనది 'కనకాంగి'యను నవల. అపరాధరహస్య పరిశోధకములు, చరిత్రాత్మకములు, సాంఘికములునైన గ్రంథముల నల్పమూల్యమునకు వెలువరించుటయే యీ గ్రంథమాలా శయము.

క్రీ. శ. 1935 నాఁటి కిందుఁ బ్రచురితములు పాతిక గ్రంథములు. ఆంగ్లవంగ భాషాదులతో బోల్పఁగా నాఁడు మనభాష వెనుకఁబడుట యెల్ల రెఱిఁగినది. తల్లోపమును దీర్ప నిది బుద్ధిపూర్వకముగ ననుసరణములను ననువాదములను లెక్కిటినిఁ బ్రోత్సహించెను.

మన కథాసాహిత్యమునందు జాతీయయుగములో నింకొక వెలితియున్నట్లుఁ దోఁచును. ఆంధ్రప్రజా సామాన్యజీవితమును సహజముగ వాస్తవిక దృక్పథముతో సమగ్రముగా జిత్రించిన నవల లధికముగ వెలువడలేదని యొక భావమున్నది. ఈ కారణమువలననే పునరుజ్జీవన యుగమునకును బ్రజాయుగమునకును నడుమనొక యఖాత మగపడునని కొందఱ వాదము.

తెలుఁగుతో వంగ, హిందీ, సాహిత్యముల సాపత్న్యమిచ్చటఁ బరిశీలింపఁదగినది. వానియం దిట్లుఁ గాదు. రవికవి తరువాత జాతీయవాదయుగమునందు శరచ్చంద్ర ఛటర్జీ, బుద్ధదేవబోసు మున్నగువారు పెక్కుగు వంగసాహిత్యము నెంతో పురోగమింపఁజేసిరి. తస్మాలమున వారు రానున్న ప్రజాయుగమునకు బలమైన పునాదులు వేసియుండుట ప్రశస్తము. అట్టివి మన సాహిత్యరంగమునం దగపడవు. ఆంధ్రుల యార్థిక జీవితములోని లోపమే సాహిత్యజీవితమునందు కూడఁ బ్రతిఫలించినది. మన రాజకీయవాదులు, సాహిత్య విమర్శకులు నూహించినంతటి సాంఘిక చైతన్యము, ప్రగతియు నార్థిక సౌష్ఠవమును మనకు లేవు. ఇతరదేశములను రాష్ట్రములను జూచిన కన్నులతో మన రాష్ట్రమును జూచినప్పుడు మొట్టబుద్ధి గలుగునంతటి యఖాత మున్నట్లుఁ దోఁచుటయం దాశ్చర్యమేమి ?

## ప్రజా యుగము

క్రీ. శ. 1930-35 మధ్యకాలములో ప్రపంచమందెల్ల నార్థిక సంక్షోభ మావరించినది. ప్రథమ ప్రపంచ యుద్ధముతో ధనికస్వామ్య నాగరకతయందు విశ్వాసము సడలినదని చెప్పఁబడెను. ఈ యార్థిక సంక్షోభదినములలో దన్నాగరకతయెడ నమ్మిక పూర్తిగఁ బోయినది. అట్టి క్షోభములుగాని నిరుద్యోగ సమస్యలుగాని లేని సామాజిక వాదవిధానము దెసగఁ బ్రజల యందఱ దృష్టులు నిగిడినవి.

ఆంధ్రావనిలో క్రీ. శ. 1930-33 నడుమ శాసనోల్లంఘనోద్యమము విఫలమయ్యెను. సత్యాగ్రహవీరులుగఁ జెఱసాలలకుఁబోయిన యువకులకు నౌత్తరాహ విప్లవకారులతో సంబంధము లేర్పడినవి. మార్క్సు, లెనిన్ రచనలను, నైరోపీయ ప్రజాసాహిత్యమును, గోర్కి, క్రిపాట్కిన్, ఎమిలీజోలా, హ్యూగో, డస్టవోస్కీ, వంటివారి సాహిత్యమును వీరు కారాగృహములలో నధ్యయనముచేసిరి. సామాజికవాద సిద్ధాంతములయందలివిశ్వాసముతో వారు బంధవిముక్తిఁ జెందిబయటఁ బడుట తటస్థించెను; పాటకజనముల సంఘనిర్మాణములకును వారి యుద్యమముల నిర్వహణమునకును బూనుకొనిరి. వీని యన్నిటి ప్రాబల్యము మన సాహిత్యమున ప్రతిబింబించినది[1]. కష్టజీవులందఱు నుత్తేజితులైరి.

ఈ ప్రజోద్యమమును గూర్చి యుత్సాహోత్సా[illegible] రచయితలనేకులు సాహిత్యరంగమున నవతరించుట జరిగెను. ప్రజల కష్టనిష్ఠురముల [illegible] దెలుపుట యా రచనల యుద్దేశము. జనులు వానిని విరివిగ [illegible]. [illegible] గూడ మఱలఁ గ్రమాభివృద్ధినొందు సూచనలు కనఁబడినవి.

ఇంతలో ప్రపంచ ద్వితీయసంగ్రామము పిట్టపిడుగువలె విరుచుకొనిపడెను. యావత్ప్రపంచమును నియంతృత్వప్రమాదము భీతావహ మొనర్చినది[2]. ప్రజాసేవకుల హృదయములు పొంగులెత్తినవి. గేయములేమి, పాటలు, నాటకములేమి, సమస్తప్రాచీనాంధ్ర సాహిత్యకళారూపములును[3] బునరుద్ధరింపఁబడి [illegible] మొనర్చుటలో బనిగొన్నవి. పెక్కు సాహిత్యసంఘములు గూడ నేర్పడెను. క్రీ. శ. 1939లో శ్రీయుతులు బూర్గుల రంగనాథరావు, వెల్లాల కేశవరావు [illegible] చేత తెలంగాణమున స్థాపింపఁబడిన 'సాధన సమితి' [illegible] మిగిలిన వానిని జేర్కొన నక్కఱలేదు. అల్లే [illegible] లో [illegible]

1. శ్రీరంగం శ్రీనివాసరావుగారి "మహాప్రస్థానం"; శ్రీవాసిరెడ్డి నాగేశ్వరరావు గారి నెచి (రైల్వే) కార్మికునిచే వ్రాయఁబడిన 'కూలోడ' యనుపాట, శ్రీ సెట్టిపల్లి వెంకట రత్నము గారి "ఆగునా జీవాలు—సాగునా లోకాలు" వంటి వెన్నో [illegible]లు, పద్యములు.

2. జపానుదేశవాసులు మన దేశములో విశాఖపట్టనము, కాకినాడలపై శతఘ్నులు వర్షించుట, వంగరాష్ట్రమునందలి కఱవు కాటకములు, రాయలసీమ, విశాఖపట్టనమండలముల లోని క్షామక్షోభమువంటివి దోహదములైనవి.

3. బుఱ్ఱకథలు, జముకుల కథలు, వీథిభాగవతములు మొదలగునవి. రచయితలు, శ్రీయుతులు కొనకళ్ళ వెంకటరత్నము, నాజర్, ముంకర సత్యనారాయణ, కోగంటి గోపాలకృష్ణయ్య మున్నగువారు.

సంపాదించి, పిదప రెండు మూఁడేండ్లకు రచన మారంభించిన కీ. శే. వట్టికోట ఆళ్వారు స్వామిగారి 'ప్రజల మనిషి' వంటి నవలల నుదాహరించినచో గడమ వానినుదాహరింపఁ బనియుండదు.

## అధివాస్తవికత

ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరము బహిర్గతమైన పెక్కు నియమరహిత విధానములలో నిది యొకటి. ఈ యధివాస్తవిక వాదులుగూడ ధనికస్వామ్య విధాన నాగరకత యెడఁ గలిగిన ద్వేషభావమువలననే పూర్వనియమములనెల్లఁ ద్రోసి రాజనిరి. యూరపు ఖండమునందు వీరెట్టి నియమములునులేని మన గద్యకవితలవంటి ఛందః ప్రకారము1 లకుఁ బూనుకొనిరి. మనస్సునకుఁ దోఁచిన భావములను క్రమబద్ధ మొనర్చుటకు ఁగూడఁ బ్రయత్నింపకపోవుటయే యధివాస్తవికత యని వీరి2 నిర్వచనము.

దీని పేరిటఁ దిరిగి భావరహిత శబ్దాడంబరము గేయకవితలో బెరిఁగినది. అందుచే నొకటిరెండు వాక్యములు దీని తత్త్వమును గుఱించి చెప్పవలెను.మనస్సునఁ బొడమిన యర్థరహితములగు నాలోచనలనెల్లఁ బైకి వాగ్రూపమున వెలువరించిన వారిని గాని, వ్రాసిన వారినిగాని వెఱ్ఱివాండ్రని యధిక్షేపింతుము గదా! ప్రాఁత నియమముల ధిక్కరించుటయే ముఖ్యమైనచో వీ రాత్మబుద్ధికిఁదోఁచిననూతన నియమముల వేనినైన నేర్పఱచుకొనరాదా! యూరప్పుఖండములో పైఁ జెప్పిన గద్యకవితలవంటి ఛందోరీతులను మొదట నవలంబించిన యధివాస్తవికవాదులు నియంతృత్వ వ్యతిరేక ప్రచారముఁ జేయవలసివచ్చినపుడు ప్రజల నుద్బోధించుటకై మఱల భావకవిత్వమునే యాశ్రయించిరి. మనవారు గూడఁ బ్రజామోదమునకై యట్లుఁ జేయకతీరలేదు.

అందుచే నీ యధివాస్తవికత యనెడి యాచార మణఁగి పోయెను. అజ్ఞానులై యమాయకులై జీవితసంస్కార మెఱుఁగకయున్న ప్రజలకు విద్యయు, విజ్ఞానమును, సమానత్వమును సంస్కారమును కలిగించుట కిది యుత్తమసాధనము గాలేదు. దీని నవలంబించినవారు ప్రజలకు రచయితలగుటమాని రచయితలకు రచయితలైరి.

మన నవలలపై దీని ప్రభావమేమి ? యనునది ప్రశ్న. ఆంధ్రప్రజాజీవితమును వాస్తవికదృష్టితో నిర్మించిన నవలలే మనకుఁ దగినయన్ని లేవు. కథాసాహిత్యమునందీ యధివాస్తవికత యెట్లు విస్తరిల్లఁ గలదు ? కాని యదియే నవలలలో చైతన్య స్రవంతి3 యను రూపాంతరముఁ దాల్చినదేమో ! అటులఁ జూచినను నీ జాతిరచన లాంధ్రదేశమున బహ్వాల్పముగ వెలువడినవి.

---

1. Blank Verse. 2. శ్రీ రంగం శ్రీనివాసరావు, నారాయణబాబు మొదలైనవారు.

3. Stream of consciousness.

ఇటఁ ప్రత్యేకముగఁ దెలంగాణమునందు కూడఁ బైఁజెప్పిన యుద్యమములు, వాదములు, సంస్థలు, మున్నగునవి యెట్లు సాగినవో సంగ్రహముగ నెఱుఁగవలెను.[1]

జాతీయోద్యమము మహారాష్ట్రకర్ణాటాంధ్రదేశములలో దన ప్రభావమును సాహిత్యమునెడ బలపినట్లు తెలంగాణమునఁ బలపుటకు వీలులేదు. ఇచ్చటి పరిస్థితులు వేఱు. అనఁగా కందుకూరివారి సంస్కర్తృపక్షమును దేశోద్ధారకుఁడు కలిగించిన రాజకీయ చైతన్యమును, కృష్ణాపత్రికా సంపాదకీయములు మేలుకొలిపిన జాతీయభావములును నిచ్చట ప్రబోధము గలిగింపక పోలేదు. కాని యవి యిచ్చటి వాతావరణమును బట్టి యాధునికాంధ్ర వాఙ్మయవికాసమునకు మాత్రమే యధికముగఁ దోడ్పడినవి.

హైదరాబాదు రాష్ట్రములో దొలదొలుత తెలుఁగు సీమ వంకఁ దమ దృష్టి సారించి యాధునికయుగమున సారస్వతోద్యమమునకు దిట్టమైన పునాదులు వేసిన వారు కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు. వారి గ్రంథాలయోద్యమరూపభాషా కృషియే నేఁటి హైదరాబాదులోని 'శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము'[2] హనుమకొండలోని 'రాజనరేంద్రాంధ్రభాషానిలయము'[3] ననిన జాలును. తన నాలుగు ప్రచురణములు వెలువడిన పిదప 'విజ్ఞానచంద్రికా గ్రంథమండలి' కార్యాలయము హైదరాబాదునుండి తరలిపోఁగా నా కొమర్రాజువారు చూపిన పథమునందే యిచ్చట వాఙ్మయ సారథ్యము నిర్వహించిన విజయసారథి, ఆంధ్రపితామహ, పద్మభూషణ, శ్రీమాడపాటి హనుమంతరావుపంతులుగారు.

వీరు నాఁడు తాల్చవలసిన రాజకీయాద్యనేక భూమికలలో సారస్వత సంబంధమైన దిది యొకటి. కొమర్రాజువారి సాహచర్యముచే ప్రభావితులైన వీరు హైదరాబాదు రాజకీయములలో జిక్కుకొనకుండినయెడల నాంధ్రసాహిత్యమున నితోధిక స్థానము[4] నలంకరించి యుండెడివా రనుట నిస్సందేహము.

ఆంధ్రభాషోద్ధరణమునకు గ్రంథాలయములే ప్రధానసాధనభూతములని గ్రహించి ప్రతిమండలమునను నధికముగ గ్రంథభండారములను నెలకొలిపించుట మూలమున భాషా సేవసలిపిన మహాగౌరవార్హమగు దూరదృష్టి వీరిది. వంగ హిందీ మహారాష్ట్రభాష

1. చూడుఁడు:— 'తెలంగాణా ఆంధ్రోద్యమము, పద్మశ్రీ. మాడపాటి హనుమంతరావుపంతులుగారు.
2. క్రీ.శ. 1901. 3. క్రీ.శ. 1904.
4. బంకించంద్రుని ఆనందమఠమున కాంధ్రానువాదము, గ్యారీబాల్డీజీవితచరిత్ర, రోమక సామ్రాజ్యచరిత్ర. శ్రీ చింతామణివైద్యాగారి "ఎపిక్ ఇండియా" యను నాంగ్లకృతికి 'క్షాత్రకాలపు హింద్వార్యులు' అను నాంధ్రపరివర్తనమువంటివి శ్రీ పంతులుగారి తొలి రచనలు

లతో బోల్చినపుడు మనభాష నూతనసారస్వత ప్రవృత్తులలో వెనుకఁబడియుండుటచే వీ రాంధ్రచంద్రికా గ్రంథమాలను స్థాపించిరి1. ఆధునికాంధ్ర వాఙ్మయములో గద్యారచన మున కీ ప్రాంతమునందు మార్గదర్శకులైన విశిష్టస్థానము వీరికిఁగలదు.

ఆంధ్రదేశమునం దితరసీమలలోని సారస్వతకృషిని దెలంగాణమునందలికృషితో బోల్చినపుడొక ప్రత్యేకత గోచరించును. ఇచ్చటికృషి ప్రధానముగ నొక నిర్మాణాత్మక మగు నుద్యమరూపమునఁ గొనసాగినది. అనఁగా నదియొక సామూహికప్రయత్నము. దీనికి రాజకీయకారణములు ప్రబలములు. ఇతరప్రాంతములలోనికృషి ప్రధానముగ వైయక్తికము; స్వప్రయత్నకృతము. తెలంగాణమున వాఙ్మయవ్యవసాయము ప్రజా జాహుళ్యమును ప్రబోధించు నొక మహోద్యమముగా సంస్థల నాశ్రయించి విజృంభిం చినది.

నవయుగారంభమున శ్రీమాడపాటి హనుమంతరావుగారు పూరించిన పాంచ జన్యారవము విని పత్త్రికలు, గ్రంథాలయములు, సారస్వతసభలు, గ్రంథమాలలు బులక రించెను. ఈ సందర్భములో భాషాతపస్వి, కీ.శే.సురవరము ప్రతాపరెడ్డిగారి నానాముఖ సారస్వతసేవయుఁ బ్రశంసార్హము. ఇతరసాహిత్యకప్రతిష్ఠతోబాటు కథారచయితగా గూడ వీరికి యావదాంధ్రప్రతిష్ఠ కలదు2. వీ రొక వ్యక్తికాదు; ఒక మహాసంస్థ; తెలం గాణమును మేలుకొలిపిన ప్రముఖవైతాళికుఁడు.

పిమ్మటఁ దెలంగాణ కవిత్రయ మనఁబడు శ్రీయుతులుదాశరధి, నారాయణరెడ్డి, కాళోజీలును, శ్రీభాస్కరభట్ల ప్రభృతులును సంస్థలపక్షమునను వ్యక్తిగతముగనుగూడ దేశము నుఱ్ఱూఁత లూఁపినవారు.

---

1. రమారమి నలుబదియైదేండ్లకుఁబూర్వము "కృష్ణాపత్త్రిక"లో వీరు వరుసగా బదుమూఁడు కథలు ప్రచురించిరి.

2. చూడుఁడు:— "ప్రతాపరెడ్డికథలు 'స్రవంతి' సంచిక 9.10. శ్రీ ప్రతాపరెడ్డిస్మారక సంచిక. (Dt/ Nil)

తెలుఁగుపత్త్రిక[1], సుజాత[2], నీలగిరి[3], పత్త్రికలవంటి[4] ప్రముఖపత్త్రికలు, గ్రంథమాలలు[5] సారస్వతసంస్థలు[6] మున్నగువానితో[7] బాటుగ నిచ్చట సారస్వతప్రబోధమును గలిగించినవి.

---

1. ఈ వారపత్త్రిక [(క్రీ శ.1920)?] ఒరంగలు మండలమున మానుకోట తాలూకాలోని ఇనుగుర్తిగ్రామమునుండి శ్రీయుతులు ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవరంగారావు. సోదరుల సంపాదకత్వమున వెలువరింపఁబడినది. 'తెలుఁగుపత్త్రికలు' అనువ్యాసము [భారతి అనుబంధము, ప్రమోదూత-వైశాఖము] శ్రీ కోకిల సీతారామశర్మగారి పీ పత్త్రికానంపాదకులేమో యని శంకించినది.

2. శ్రీ పి. యన్. శర్మగారిచే సంపాదితము; హైదరాబాదునుండి 1927లో వెలువడినది. శ్రీ గుడిపాటి వేంకటచలముగారి రచనలను బ్రథమముగఁ దెలంగాణము ప్రాంతములో బ్రకటించిన గౌరవ మీ పత్త్రికకుఁ దక్కెను. శ్రీ బాలకృష్ణారెడ్డిగారు పిమ్మట దీనికి సంపాదకులైరి.

3. నల్లగొండనుండి వెలువడినది నీలగిరియను పత్త్రిక. దీని సంపాదకులు శ్రీమాన్. షావ ఠీప్ నరసింహాచార్యులు. ఇది 1922లో స్థాపింపఁబడెను ఇది సంపాదకునితోబాటు 1929లో గతించెను.

4. ఈ రాష్ట్రమున మొదటిపత్త్రిక "హితబోధిని" (1913); శ్రీనివాసశర్మగారి సంపాదకత్వము; మహబూబ్‌నగరము. ఇట్లే, ఆంధ్రమాత, గోలకొండ, శైవప్రచారిణి, మీజాన్; దివ్యవాణి, ఆంధ్రాభ్యుదయము, దేశబంధు, దక్కన్‌కేసరి, పూలతోఁట, మద్యపానవిరోధకపత్త్రిక, తెలుఁగుతల్లి, ఆంధ్రకేసరి, విభూతియుఁ బేర్కొనఁదగినవి.

5. గోలకొండ, కిన్నెర, దివ్యవాణీసుకృతప్రసాదము, మాతృభారతి, ఆంధ్రశ్రీ, కాకతీయ, వీరేశలింగకవి కంఠాభరణము, వేంకటేశ్వర, అజా, దేశోద్ధారక (బహుధాన్య క్రీ.శ. 1938), ఆంధ్రకేసరి, సాహితీమేఖల, సాధనసమితి, కావ్యమాలయుఁ బ్రసిద్ధములు.

6. విజ్ఞానవర్ధినీపరిషత్తు, వైతాళికసమితి, ఆంధ్రవాఙ్మయ సేవాసమితి, కాకతీయకళాసమితియు నెన్నఁదగును.

7. గోలకొండకవులసంచిక, కృష్ణదేవరాయాంధ్రగ్రంథాలయ రజతోత్సవసంచిక, శబ్దానుశాసనాంధ్రభాషానిలయరజతోత్సవసంచిక, పోతనవర్ధంతి సంచిక, హనుమంతరాయ షష్టిపూర్తి సంచికయుఁగూడఁ బ్రసిద్ధిఁగన్నవి.

గ్రంథప్రచురసంస్థలలో నాఁటుఁబోటులకు గుఱియైన వట్టికోట ఆళ్వారుస్వామి 'దేశోద్ధారకగ్రంథమాల'నుగూర్చి వివరించినఁజాలును. ఇది కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారకచిహ్నముగ క్రీ.శ.1938లో వ్యవస్థాపితము, హైదరాబాదులో స్టేట్ కాంగ్రెస్ పుట్టిన దినము లవి. ఆదినములలో విజ్ఞానమునొసఁగి యభిమానముఁబురికొలిపి ప్రజాసత్వరకర్తవ్యమునుదెలుపు గ్రంథములను బ్రచురించి యీ సంస్థ దేశభక్తులయు మేధావులయు నభినందనము లందుకొన్నది. పిదప యావద్భారతదేశముతోబాటు హైదరాబాదులో నేర్పడిన రాజకీయాసాధారణపరిస్థితులవలన నది క్రీ.శ.1942లో నాఁగిపోయెను. అప్పటికే యది ప్రజానీకమునకు రమారమి పంద్రెండుప్రచురణము లందిచ్చినది. ఒక దశాబ్ది యణఁగియున్నతరువాత సక్రమపరిస్థితు లేర్పడఁగా దేశము స్థిమితత్వము నొందినపుడు తిరిగి గ్రంథప్రచురణలకుఁ బూనుకొను నవకాశములు దీనికి లభించినవి. స్థాపనకాలమునుండియుఁ దమ ముందున్న కార్యభారము సుమారుక్రీ.శ.1952 వఱకుఁగూడ దీరలేదని కార్యకర్తలు భావించిరి. తాము ప్రచురించు ప్రతిగ్రంథమును, దేశీయుల యాకాంక్షలను బాధ్యతలను దృష్టియందుంచుకొని కర్తవ్యమును సూచించునదిగా నుండవలెనని వారి యాశయము. రమారమి యేడెనిమిది యేండ్లనుండి మఱల నిరంతరకృషిసల్పి కొన్నినవలలను గథానికాసంపుటములనుగూడ నీసంస్థ ప్రకటించుచుండఁగా ఫిబ్రువరి1961లోనే దీని స్థాపకులు శ్రీవట్టికోట ఆళ్వారుస్వామిగారు దివంగతులైరి. దీని భావికృషి యెట్లుండునో చెప్పఁజాలము.

క్రీ.శ.1940వఱకు హైదరాబాదునందుఁ దెలుఁగుదినపత్త్రికను స్థాపించి, నిర్వహించుఁ బ్రయత్నము లెవ్వియు నప్పటి ప్రభుత్వము వారి యాంతులమూలమున నెఱవేరినవి కావు. ఎట్టకేలకు క్రీ.శ.1940లో 'తెలంగాణ' పత్త్రికను నిర్వహించుట కధికారుల యనుజ్ఞ లభించెను. దీని ద్వారమున నిచ్చటి సాహిత్యోద్యమమునకు బహుదోహదముకలిగినది. ఇచ్చటఁ బేర్కొనఁదగిన విచిత్ర మొకటి కలదు. హైదరాబాదునం దాంధ్రోద్యమము గ్రంథాలయోద్యమముగఁ బ్రారంభము కావలసివచ్చెను. అది యానాఁటి రాజకీయపరిస్థితి. క్రమముగ నీ గ్రంథాలయోద్యమ ముద్దేశించినరీతిగ రాజకీయోద్యమమై కూర్చున్నది. అది కారణముగఁ దెలంగాణము లోని యాంధ్రులకొఱకై మఱియొక సారస్వతసంస్థను స్థాపించుట కావశ్యక మేర్పడెను.

మఱల పద్మభూషణ శ్రీమాడపాటి హనుమంతరావు, సురవరము ప్రతాపరెడ్డి ప్రభృతులే యీ చరిత్రాత్మక ఘటనాకర్తలు. ఇది యాంధ్రదేశమునందలి యితరసంస్థల వంటిది కాదు. ప్రత్యేకాదర్శములతో, నిర్మాణాత్మక కార్యక్రమాశయములతో నవతరించిన దీ పరిషత్తు. ఇచ్చట 'పోలీసుచర్య'పిమ్మట నిది యొక మహోద్యమముగ సాగుచున్నది; భాషాప్రచారకకేంద్రమై పరీక్షానిర్వహణసంస్థయై వేలకొలఁది ప్రజల నక్షరాస్యులఁ జేయుచు రెండువందల శాఖోపశాఖలతో విస్తరిల్లుచున్న మహావృక్షము.

ముఖ్యావిషయ మేమనఁగా నాంధ్రదేశములో రేఁగినట్లుఁ దెలంగాణములో గ్రాంథిక వ్యావహారిక భాషాయుద్ధములు లేవు. అటు 'మాలపల్లి'యందుఁ బ్రసరించిన భాషాభావాదివిప్లవప్రభావముఁబవంటి ప్రభావములుగూడ నప్పుడు లేవు. ఇటు 'నారాయణరావు,' 'వేయిపడగలు'మున్నైనవానియందుఁ బ్రసరించిన భావవిప్లవములు భాషాసంప్రదాయకత్వమువంటివియు లేవు. తెలంగాణమునఁ దాత్కాలికపరిస్థితులనుబట్టికలిగిన యా తీవ్రభావ విప్లవభావ ప్రగతిభావములుమాత్రము గ్రంథముల రూపమున గాఢముగ నెలకొనెను. గ్రాంథికవ్యావహారికవివాదములతో నెట్టి సంబంధమునులేని యా తొల్లింటి భాష, భాషగ నెగడుచువచ్చినది.

ఈ ప్రకరణమునఁ బరిశీలింపఁబడునవి రెండు దశాబ్దులు. వానికిఁ జెందిన సాంఘిక రాజకీయసారస్వతాద్యుద్యమము లిందు దిఙ్మాత్రముగఁ బ్రదర్శింపఁబడినవి. తత్సందర్భమున భిన్నభిన్నవాదములు, సాంఘికపరిష్కారవివర్తనములు వానివాని ఫలములు మున్నైనవానినిగూడఁ బరిశీలింప నయ్యెను. అట్లే యా యా వాదములకుఁ బ్రతినిధులనుగూర్చియు వారివారి రచనలనుగూర్చియు నింతవఱకుఁ బ్రస్తావింపబడినది. ఇఁకఁ బ్రత్యేకములు, బ్రధానములునైన కొన్నినవలల సారస్వతగుణములు మునుముందుఁ బరిశీలింపఁబడును.

ఇదే సందర్భమున నింకొక విషయము. ఇది యనివార్యముగానఁ జెప్పకతప్పదు ప్రపంచమందలిదేశములతోడను భాషలతోడను బోల్చుకొందుమేగాని యన్ని సంగతులయందు నన్నిదేశముల స్థాయియు మనకు రమ్మనినను నొక నాఁటితో వచ్చునది కాదు. అందును మంచివిషయములో బోలిక త్వరలో రాదు. మనభాషలో గ్రంథము లెన్నియో యచ్చగుచున్నవి. మఱియు నిటీవలివారి విషయమునువదలి పరిశీలించినచో గడమవారి యా గ్రంథములు వ్రాయఁబడినకాల మెంతదిగివచ్చిన విమర్శకులకును దెలియరాదు. విమర్శనకు దేశకాలపరిస్థితులు దెలియనేల ? గ్రంథస్థవిషయము నౌగాదను శక్తిసామర్థ్యములు లేనివారై దేశకాలపరిస్థితులు గావలెనని ప్రాఁకులాడుదురు; వారు సమర్థతలేని విమర్శకులు; అని మహానుభావులైన కొందఱ అనుటయుఁగలదు. విమర్శన మాధునిక లోకమునం దెన్ని తెఱఁగులుగ విజృంభించెనో చెప్పలేము. కాలక్రమానుసారమగు విమర్శయు నొక పద్ధతియైన విమర్శన. అది మునుముందురాగల మహావిమర్శనకుఁ దోడ్పడును.

ఇంతకుఁ జెప్పువిషయ మొక్కటి. ఈ ప్రకరణమున వీలైనంత కాలక్రమపద్ధతియు నవలంబింపఁబడినది. కొన్ని నవలల రచనాకాలము స్పష్టముగఁ దెలియరాదు. ప్రచురణకాలము నంతియే! నవలాకర్తలు సజీవులైన సందర్భములలోనైత మీ శ్రమతప్పదు. చాలమందికిఁ దమ రచనలకాలము గుఱుతుండదు. ఒక క్రమపరిణామమును సాధింపనెంచువారి కిది యెంత యవరోధమో చెప్పలేము. కొందఱు రచయితలు తెలిసియుఁ

జెప్పరు. వారు జ్ఞప్తిచేసికొనవలెను. కాని చేసికొనరు. మఱికొందఱు బుద్ధిపూర్వకముగ గోపనమొనర్తురు. అందువారికిఁ గొన్ని ప్రయోజనము లుండవచ్చును. దానివలన నేదో సాధించితి మనుకొందురు. లేదా, యశ్రద్ధ. ఏమైననేమి? గ్రంథమున మూల మూలల వెదకినను వివరములు లభింపవు. కొందఱు బుద్ధిపూర్వకముగఁ దప్పనే చెప్పుదురు1. అప్పుడు విమర్శకునిపని కష్టము. ఆ నవల కీ నవల సమాధాన మనిగాని, యిది దాని పరిణామ మనిగాని యట్టిచో జెప్పఁజాలముగదా! ఏదైనఁగాని మన మింకను జాల నధోగతియం దుంటిమనుట పర్యవసానము. సరియైన విమర్శన కుదురకుండుట కెన్నియడ్డంకు లుండవలెనో యన్నియు మనసాహిత్యమునందే గలవు. సార్వకాలికము లైన నిర్ణయములకుఁదగిన సాధనసంపత్తి యెల్లరుఁగృషిచేసినఁగాని లభింపదు. కీర్తికి రానినవలలు సాధారణముగ మన సమీక్షలోనికి రావు. కీర్తికెక్కినవానిని ముద్రింపించునప్పుడు నవలాకర్త సాధారణముగ నర్థార్థి. కావున నటు యశఃప్రార్థులుగాని, యిటు ధనార్థులుగాని రచనాకాలాదివివరములఁ దెలుపువిషయమున శ్రద్ధఁజూపరు. అందుచే సాధ్యమైననంతవఱకుఁ గాలక్రమపద్ధతి ననుసరించుచు నొక వాదమునకో యొక విధానమునకో యొక భావమునకో యొక విశేషమునకో ప్రాతినిధ్యమువహించిన విషయమునుబట్టికూడ నా యీ నవలల క్రమ మిందు స్వీకరింపఁబడినది.

## కృష్ణవేణి2

ఇది శ్రీచిలమర్తి లక్ష్మీనరసింహముగారి కృతి. ఇందలి కథావిషయము క్రీ.శ. 1675సంవత్సరమునాఁటిది. ఆ కాలమున గోల్కొండను అబ్దుల్ హసన్ తానీషా పరిపాలించుచున్నాఁడు. అతనియొద్ద సైనికోద్యోగి, రంగరాజు. ఇఁతడు క్షత్రియుఁడు. స్వగ్రామ మితనిది బెజవాడ. అచటినుండి సకుటుంబముగ బయలుదేరి మధ్యేమార్గమున నతఁడు దొంగలవలన బాధింపఁబడును. అతని ముద్దులపట్టి కృష్ణవేణిని దొంగలు తమ నివాసమునకుఁ గొనిపోయి సంరక్షించు చుండిరి. రంగరాజు నతనిభార్యయు నాపదలో

---

1. నూటి కొక్కఁటిగా నిట్టి యశ్రద్ధవిషయములఁజూపినను మననవలలలో వేనవేలగు నుదాహరణము లున్నవి. శ్రీనోరి నరసింహశాస్త్రిగారి 'రుద్రమదేవి' నవల యున్నది. దాని ప్రథమముద్రణము1951అని,ద్వితీయావృత్తియందు రెండవపుటలో గలదు. వెనుక నట్టపై "1950— "రుద్రమదేవి"— తిక్కననాఁటినవల" యని తద్వ్యతిరేకముగ నున్నది. ప్రథమముద్రణము నెంత వెదకినను "వికృతి", పుష్యశుద్ధ ౧౦, బుధ వారమునాఁడు పీఠికవ్రాసినట్లేగాని తదితరవిషయము లుండవు. ఈ యొక్కయుదాహరణమేల ననఁగా నింత శ్రద్ధ నీ విషయములయందుఁగలవా రితరులు లేరు; అట్టి వీ రిచ్చిన యంశములే యిట్లుండఁగా నితరులసంగతి వేఱుగఁ జెప్పనేల?

2. క్రీ. శ. 1921 అక్టోబరునకుఁ బూర్వముది.

విడిపోయి యొకరికిఁదెలియక యొకరు గోల్కొండఁజేరి తమ జీవితవిశేషము నజ్ఞాత ముగఁ గడపఁజొచ్చిరి. ఆ తానీషాదగ్గఱనే మఱియొక ప్రఖ్యాతనైనికోద్యోగి, కల్దిండి నరసింహరాజు. శ్రీకల్దిండివారు ప్రఖ్యాతసంస్థానాధీశులు, శూరశిఖామణులును. వారి పుత్త్రుఁడే రామరాజు. ఒకనాఁ డితఁ డస్వస్థతగానున్న మేనమామను సందర్శింప నేఁగుచు మునుపు రంగరాజును బాధించిన దొంగలచే బంధింపఁబడినాఁడు. తుదకు వా రడిగిన ధనమిచ్చి తన్నుఁదా విడిపించుకొనుటయేగా తనకుఁ బరిచితురాలై హృదయము నాకర్షించిన కృష్ణవేణినిగూడ విడిపించి వివాహముఁ జేసికొనెను. ఈ విధ ముగఁ గథ సుఖాంతమైనది. ఇందలి నాయికానాయకులు కృష్ణవేణీరామరాజులు.

ఇది చారిత్రకనవల. దీనియందుఁగల ప్రధానపాత్రలు కృష్ణవేణీరామరాజులు; కొండ గంగులు(దొంగలనాయకుఁడు); సోదెమ్మ,(ఘాటకూళ్ళపెద్దమ్మ); కృష్ణవేణి సేవకురాలు మాచి; రామరాజులసేవకుఁడు వెంకటస్వామి; నాయికతండ్రి రంగరాజు; నాయకునితండ్రి నరసింహరాజు.

ఈ నవలను వ్రాయుటలో దమ యుద్దేశమును చిలకమర్తివారు నాయకుఁడగు రామరాజుముఖమునను మఱికొందఱముూలమునను వెల్లడిచేసినారు. కాశీమజిలీలు, శుకసప్తతి, హంసవింశతికథలవంటి గాథలు పెక్కురు వినియేయుందురు. కాని చారిత్రక గాథలు వినినప్పుడు శరీర ముప్పొంగును; హృదయము ద్రవించును. రచయిత దాని కొఱకై రామరాజుచే నోఱుగల్లు ప్రతాపరుద్ర, గణపతిదేవ, రుద్రాంబికలగాథలు చెప్పించిరి.

కృష్ణవేణియందలికథకు జిగిబిగువులు లేవు. వాక్యవిన్యాసమునందుఁ గవి శిల్ప దృష్టిని నిల్పలేదు. ఆఖ్యానశైలి నవలంబించి రచయిత పాత్రలగుణశీలములను దనకుఁ దానై చెప్పెనేగాని వాని ప్రదర్శనమునకుఁ బ్రయత్నింపఁడు. అంతియేకాదు. ఈ నవ లయం దేపాత్రయు సహజబుద్ధికుశలతనుగాని చమత్కృతినిగాని చూపలేదు. కావుననే యిందు జీవము లేదనుట. ఇతివృత్తమును బాత్రలను వాతావరణముతో సమన్వయింపఁ గల వర్ణన లిందు లేవు; సందిగ్ధతాపూర్వకపఠనోత్కంఠ తుదిముట్టఁ గొనసాగినదన వీలు గాదు. ఆశ్చర్యసంభ్రమముల కిందులో దావులేదు. దీనిని నవలయనుటకంటెఁ బెద్దకథ యనుట సత్యమునకుఁ జేరిక. ఇది సుప్రసిద్ధులైనవారి యప్రసిద్ధరచనలకుఁ దార్కా ణింపఁదగు నవల.

## మాలపల్లి[1] లేక సంగవిజయము[2]

ఇది సుగృహీతనాములగు కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణగారి నవల. సంగవిజయ మని దీనికి నామాంతరము. మన కథాసాహిత్యమున దీనికిఁ బ్రముఖస్థానము కలదు. దీనికిఁగల ప్రతిష్ఠ ఘనమైనది. కొన్ని గుణములు దీనికిఁ గారణములు. దోషము లిందు లేవని గాదు. గుణసన్నిపాతమున దోషలేశ నిమజ్జనము సహజము. అయ్యును దీనిని గూర్చి విమర్శకలోకమునఁ బరస్పరభిన్నాభిప్రాయము లున్నవి. దీనికిఁ గారణములు విభిన్నదృక్పథములు. ప్రధానముగ బుద్ధితత్త్వముచే బరిశీలించినప్పు డిందలి దోషలేశ మగపడును. ప్రధానముగ భావతత్త్వముచే బరిశీలించినప్పు డిందలి గుణబాహుళ్య మగ పడును. కేవల బుద్ధితత్త్వముతోగాని కేవల భావతత్త్వముతోగాని పరామర్శించుట దుస్సాధము. బుద్ధితత్త్వముచే బరిశీలించినపుడు శిల్పప్రౌఢిమ యించుక లోపించినట్లుఁ దోఁచును. భావతత్త్వముచే బరికించినపుడు రసానందప్లుతి గల్గును. రానున్న ప్రకరణ ములలో భావతత్త్వదృష్టితోడి పరీక్ష జరుగఁగలదు. ఇచ్చట నుపాధిగనున్న సందర్భమును బట్టి బుద్ధితత్త్వపరిశీలన జరుపుట యుక్తము.

దీనికర్త సాంఘికరాజకీయసంస్కరణాదివిషయములలో నారితేరినచేయి 'సహాయనిరాకరణోద్యమము'లో సుప్రసిద్ధులు; ప్రఖ్యాతన్యాయవాదులు. సంఘ సంస్కరణమునకును 'సహాయనిరాకరణ' రూపమైన రాజకీయసంస్కరణమునకును నొక్కటే మూలసూత్రము. అది వ్యక్తిస్వాతంత్ర్యము. అట్టి స్వాతంత్ర్యమున కొకొక వేళ నిరోధకకారణము లేర్పడినచో వాని నన్నివిధములఁ బ్రతిఘటింతురు. అట్లుఁ బూనుకొనుట వారికిఁ బ్రకృతి. తాము ధర్మమని విశ్వసించిన యాదర్శములకై మహ నీయ లిహలోకసౌఖ్యములఁ బరిత్యజించుట యెవ్వరెఱుఁగనిది? ఐహికదైహికప్రబల యాతనలను దైవప్రేషితప్రసాదములని శిరసావహించుట వారికిఁ బరిపాటి. ఈ నవలా కర్త నిత్యజీవితములో దార్ఢ్యమైన మార్గావలంబి. ఇంతకుఁ దన యంతఃకరణప్రవృత్తి కిని నవలేతివృత్తమునకును రచయిత సామరస్యముఁగుదుర్చుకొనినాఁ డనుట.

రచయితృజీవితాదర్శమైన స్వాతంత్ర్యమువలన నవలాప్రపంచమునకుఁగలిగిన ప్రయోజనమేమి? ఇతఃపూర్వమున్న నవలారచనానియమముల యుల్లంఘనము. ఈ నియమోల్లంఘనస్వాతంత్ర్యములో నా వ్యక్తిస్వాతంత్ర్యము వ్యక్తమైనది. అది కావ్యములో గవియాత్మీయతాప్రతిబింబము. అందుచే మాలపల్లివంటినవలది యపురూప

1. విదేశీయ ప్రభుత్వకాలములో నీ నవల పెక్కుమారులు నిషేధాజ్ఞలకు గుఱియైనది.

2. It looks, as if the writer had not been able to decide which element of the story should be emphasized.

మైన జన్మ. అట్టి దితఃపురాజనితముకాదు; ఈ నవలాకర్తకు నైజగుణమైవచ్చె ననఁదగు వ్యావహారికభాషాప్రయోగవిషయమునుగుఱించి దేశమున సాగెడిచర్చలు పూర్వోక్తములు1.

పోఁగా నీ నవల యందొక్క భాషాస్వాతంత్ర్యమేకాదు, కర్త వ్యక్తపఱచినది. భావస్వాతంత్ర్యము నమేయము. ఇతివృత్తస్వీకృతిలోని స్వాతంత్ర్యము నిరుపమానము. ఆర్థికరాజకీయసాంఘికాదిసంబంధముఁగల యంశము చేబట్టుట యొకటి. కథారూపమున దానిని మలచుట రెండవది. ఆ దినము లలోఁ బంచమవర్ణమువారినిగూర్చి వ్రాయఁబూనుట ముఖ్యముగ మూఁడవది. అన్నిటికంటె నిది యెక్కువైన సంగతి. ఈ యుగమున నవలాసాహిత్యమునందు భాషాభావ వస్తువులు మూఁడింటిలోను జరిగిన ప్రథమసంప్రదాయోల్లంఘనక్రియాప్రాప్త పట్టభద్రగ 'మాలపల్లి'ది. ఏ కావ్యకీర్తివైజయంతి, నిహోయసవీథి కెగురఁగలెనన్నచో మాత్ర మిక నింతకుమించి యేమి సల్లక్షణములు పట్టగలవు ?

నాగరకప్రపంచము గొడ్డుపోయినట్లుగ నిందు జిత్రింప బడినది, జానపదజగత్తు. ధనవిద్యాకుల సంపదలతో దుల దూఁగువారిందలో యుండఁగా, నిందు వర్ణింపఁబడిన ప్రాధానపాత్రలు సంఘజఘన్యజవర్గములవి. పూర్వసంప్రదాయధిక్కారమున కీ యుగ వాతావరణము నండ జూచుకొని యింత తెగించిన నవలాప్రథమప్రయత్నమిదియే! సంఘసంస్కరణము, 'సహాయనిరాకరణవాదము', స్వాతంత్ర్యస్థాపనమువంటి నూతన సూత్రముల నెన్నింటినో యీ నవలయందు జొప్పించుటకు నవలాకర్త యత్నించినాఁడు; వర్తమానకాలమున దేశదుఃస్థితికి హేతుభూతములైన గేయేయే సమస్యలుగలవో వానివాని పరిష్కారమున కావశ్యకములని తనకుఁదోఁచినమార్గముల నన్నింటి నీ నవలలో సూచించెను; ఏయే నూతనవిధానము లన్నిశాఖలలోను బ్రజలహృదయముల నాక

---

1. ఆంధ్ర నవలా సాహిత్య ప్రపంచమున నొక జ్యోతిర్మార్గమును జూపి, భాషా విషయముగ నాంధ్రవాఙ్మయములో నొక విప్లవముఁదెచ్చిన 'మాలపల్లి' కర్త శ్రీ ఉన్నవలక్ష్మీనారాయణ పంతులుగారు, పూర్ణపురుషాయుషమువఁ (81 సంఃవయస్సున క్రీ. శ. 25–9–1958, గురువారము రాత్రి స్వగృహమున గుంటూరులో) పరమపదించిరి (వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు స్వర్గస్థురాలై యప్పటికే యొక పుష్కరమైనది.) వీరి ప్రతిభా సంపత్తికి నుపపత్తిగ'మాలపల్లి'ని ఢిల్లీ సాహిత్య పరిషత్తువారు దేశీయభాషలన్నిఁటిలోనికి నమువదింప జేయుచున్నారు. ఈ నడుమ చలనచిత్రరూపమున నవతరించు భాగ్యరేఖలును దృగ్గోచరమగుచున్నట్లు వదంతులు. తిక్కనను గుఱించి వీరొక మహాగ్రంథమును రచించి తుది మెఱుఁగులు దిద్దుచు స్వర్వాసులైరట్లుఁ జెప్పుకొనఁబడుచున్నది. అది నవల యని కొందఱు; విమర్శన గ్రంథమని కొందఱు. మొత్తము మీఁద నది యముద్రితము.

ర్శించుచున్నవో, నానివానినెల్లఁ గథయందలి ప్రధానపాత్రలముఖమునఁ జర్చకుఁదీసి కొని వచ్చినాఁడు[1]. ఈ ప్రణాళికాబాహుళ్యము నవలకెంతబలము నాపాదించినదో, యంత దౌర్బల్యము నాపాదించినది.

మన ప్రజలలోనెల్ల నథమాథమస్థితియందున్న పంచములు దేశముయొక్క యథోగతికిఁదగిన నిదర్శనప్రాయులు కాగలరని యెంచి రచయిత తన నవలకు వారిని ముఖ్యులుగను వారి నివాసస్థలమును ప్రధానరంగభూమిగను సూత్రపఱచి సంతరించి నాఁడు. తన్మూలమున నీ కృతియొక్క ప్రధానప్రయోజనము రసనిష్పత్తి కాలేదు. దాని దిందు గౌణస్థితి. నవలయొక్క ముఖ్యఫల మాశయసాధనము. గ్రంథనామకరణ మీ విషయమును బట్టియిచ్చును. ఈ సూచన యందులేదన్నచో నా నవలకు నామసార్థ క్యము లేదు. 'మాలపల్లి' మాలలగ్రామములలో నొకప్రత్యేకగ్రామమగుటయే గా దిచ్చట ముఖ్యము. అది వారి గ్రామసామాన్యార్థద్యోతక మగుటకూడ గ్రహింపఁ దగినది. అయ్యును సమష్టి నుద్దేశించినపుడు వ్యష్టిని వర్ణించుటయే కావ్యసంప్ర దాయము.

గుంటూరు, తెనాలుల మధ్యఁగల "మాలపల్లి" యను గ్రామమునందధికసంఖ్యా కులు పంచములేయైనను నితరకులములవారు గూడ నా యూరనున్నారు. కానివారికిఁ బ్రాధాన్య ముండరాదు; గ్రంథనామ మన్వర్థము గావలెను. ఎంతదనుక నితరపాత్ర లు ప్రధాన పాత్రలగు బంచముల జీవితమును భాసింపఁజేయుట కుపయుక్తములగునో యంతదనుక మాత్రమే యవి కథకు సంగతపడఁగలవు. పంచమవర్ణము వారి యభ్యు దయమే తన జీవితాదర్శ మన్నట్లుఁ బరిగణించిన రామానాయఁడును మాలల నథమ స్థితియం దుంచుటయే సంఘప్రధాన ప్రయోజనమని యూహించిన చౌదరీనాయఁడును 'మునసబు', కరణములును, బ్రాహ్మణుఁడైన పంతులును గూడఁ బైఁజెప్పిన రీతిగ నవలలో సందర్భించినట్లు సాపేక్షితులు.

పైఁజెప్పినట్లు బుద్ధితత్త్వమునుబట్టి యిట్లు నిర్ణయించి యా సూత్రముల నన్వయింపఁజేతుమేని నవలలో గొన్ని దోషములు గోచరింపక మానవు. "మాలపల్లి" యం దాధికారికవృత్తమునకును కమలామోహనుల ప్రాసంగిక వృత్తమునకును సంబం ధము విచార్యము. తమ వర్ణములవారికి శిరోమణి యనఁదగు రామదాసు యొక్క కుటుంబవ్యవహారముతో బ్రారంభించినకథ క్రమక్రమముగ మాలపల్లియందున్న కూలి జనమునకును భూస్వాములకును నడుమఁ బెరిఁగిన పోరాటముగ గ్రంథపూర్వార్థమునఁ బరివ్యాప్తము కాఁగలదు. అప్పుడు సంగదాసు, వాని యనుచరుఁడగు రామానాయఁ

1. "శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' అను నవల ప్రజలలో జాల ప్రచారము కలుగ జేసినది". శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి 'నవనీతము' పుట 46 [Dt. Nil.]

డు నొక పక్షమునకు ముఖ్యులు. చౌదరీ మునసబు లింకొక పక్షమునకుఁ బ్రధానులు. ఈ యిరుపక్షములవారి కథలకుఁ జెందిన క్రమికవికాసమునం దంతరువు లున్నవి. కాని యా పక్షముల నేకీకరింపఁగలము. అవి 'మాలపల్లి' యను శీర్షిక క్రింద నేర్పడు విభాగ ము లగును. అయ్యు గ్రంథపరార్థమునందు నూతనముగ నారంభమైన కమలామోహ నులకథ పంచమవర్ణముల వారి చరిత్రతోఁగాని యభ్యుదయముతోఁగాని యెట్లుఁ బొంది పొసఁగునో యూహాకందరానిసంగతి. నవలలో ద్వితీయభాగమున నిదిగాక పంచముల యుద్యమసంబంధులగు విషయములును లెక్కలు. అవి నవలానామసార్థకత్వమునకు సంబంధించినవి. గ్రంథగత యావద్వస్తుసామగ్రి నీ క్రిందివిధమున సంగ్రహింప వచ్చును.

పూర్వార్థము :—

I 1. పంచముల కుటుంబ వ్యవహారములు.

2. హరిజనోద్యమము, పాటుమానిసులకు (పాటుకజనమునకు) ను భూస్వాములకును మధ్య నేర్పడిన ద్వేషము.

II 1. కమలామోహనుల కథ.

2. పంచములపైఁ బగదీర్చుకొనుట, హరిజనోద్యమము.

ఇవి ప్రధానాంశములు. ఇంకను గొన్ని పొందుపడని విషయములు గలవు. అవి చిన్నవి. వీని నన్నింటి[1] నేకతః సూత్రింపలేము. నవలాకారునకే యది కుదురలేదు. గ్రంథమునకు రెండు నామకరణము లుండుటయే దానికి దార్కాణ[2]. నామమాశయ మునకు లింగము. రెండు నామము లొకే యాశయమునకు యోగ్యమైన లింగములు కాఁజాలవు. గ్రంథపూర్వభాగమునకు 'మాలపల్లి' యనెడి పేరు కుదురుకొనును. ఉత్తర భాగమునకు 'సంగవిజయ'మనెడి పేరు యుక్తము. కాని విజయము పూర్తియైనదా ? ప్రథమార్థములోని విజయసూచనలు ద్వితీయార్థగతములైన హరిజన పాఠశాలా స్థాప నము, విద్యా వ్యాప్తి, సంగమందిర నిర్మాణము, మత చర్చలు వంటివివిస్పష్టఫలమును

---

1. "ఈ పుస్తకానికి మొదట మాలపల్లని పేరుబెట్ట దలచుకొని వ్రాయడం ప్రారంభించాను. కొంతదూరం పోయినతర్వాత సంగవిజయమని పేరివడం మేలని తోచింది. అందుకు రెండు పేర్లూ వుంచాను" —(మాలపల్లి—పీఠిక).

2. "The double title connected by a conjunction which throws upon the reader the burden of selection is a frank confession of the author's in ability.,–Evelyn May Albright, "The Short Story: Its Principles and Structure", P. 96, Lines 19–22. (1924)

జూపఁ జాలవు. కాని నైతిక విజయములని మనస్సు కుదుర్చుకొనవచ్చును. మొదటి భాగమున సమ్మెల ఫలించుట సంగని మరణమున కొక హేతువు.అట్లే'రామనాయఁడు' హరిజనోద్యమ ప్రచారకుఁడగుట యథార్థమైన సంగవిజయము. కాని, రెండవ భాగమున రామదాసు పడినపాట్లు సంగవిజయమగునా ? అవి రామదాసు మనస్స్థైర్యమునకు సాక్ష్యములు. రామదాసు నాస్తి పోవుట సంగవిజయమా ? ఈతని స్థైర్యమాతని విజయముకాదు. కాకున్నచో నొక రీతిగ సమర్థింపవలెను. మన జాతిపిత గాంధి మహాత్ముని, రాష్ట్రపిత నమరజీవి పొట్టి శ్రీరాములను బోల్చునపుడు 'ఒకరిచ్చి చచ్చిరి, ఒకరు చచ్చి యిచ్చిరి' అన్నట్లుగఁ జచ్చిసాధించుట యని యొకటి విందుము. కావున సంగడు మరణించి రామదాసు స్థైర్యము పేరిటఁ బెక్కు విజయములు తమ జాతికి సాధించెననుట సమంజసమైన సమర్థనము.

గ్రంథకల్పనావసరమున రచయితృబుద్ధి మండలములో గథావస్తు సువిశదముగఁ బ్రతిఫలింపలేదు. ఈ మన యూహ కాధారము పీఠికలో నవలాకారుఁడిచ్చిన వాఙ్మూలము. ఇట్టి యసంగి సాంగత్య లోపమునకుఁ బదునొకం డధ్యాయములుగఁ దొంబది యేడు పుటల పర్యంతము వ్యాపించిన కమలామోహానులకథ యొక్కటిమాత్రమే చూపఁబడినది. కాని పదుమూఁడుపుటల క్రీస్తుమత నిరసనము, 'మాంబళము'లోని స్ఫోటకనివారణ పద్ధతుల వివరణమువంటి యసంగతము లీ నవలలో జాలఁగలవు. ఒకటి రెండు పర్యాయములు రచయిత పేర్కొని తుదిముట్ట ముచ్చటింపని విషయములు మఱికొన్ని.

పాత్రోన్మీలన మొక శిల్పము. అందును మందోన్మీలనము నవలలో గఠోరవ్రత చర్య. పాత్రలు కథలో నాక్రమించు నగ్ర స్థానముల యందుఁగాని, పాత్రల క్రమక్రమ వికాసములో గాని వైరుధ్యము లుండరాదు. లక్ష్మమ్మను హేళనఁజేయుచుఁ దొలుత[1] వర్ణించి పోనుపోను దానదయాధర్మాదిగుణ నిలయగ రూపొందించుటవంటి సరిపడని యంశములు పెక్కు. రచయిత్ర మనశ్చక్షువున నొక నిర్దిష్టప్రణాళిక లేదు. కథ తెగిన గాలిపటమువలె నెటు విసరుకొన్న నటు విసరుకొనెను. తాత్కాలిక సాంఘిక రాజకీయాది పరిస్థితులలో నాచర్య ధర్మములని తా ననుకొన్నవానిని నవలాకర్త కథారూపమున లోకహితార్థము వెల్లడించినాఁడు.

నవలలో సంగదాసునిది ముఖ్యపాత్ర. ఉన్నవవారు నవలాప్రథమార్థములో నతనిని బాగుగ బోషించిరి. అతని మృతితో బ్రథమార్థపరిసమాప్తి. మరణించియు నాతఁడు విజయమును సాధించెను. కావున నవలయందు మొదటి సగమునకు సంగవిజయ

1. "మాలపల్లి"—పుటలు 72,76.

నామము సార్థకము. అతని మరణానంతరము కావ్యసంసార పరార్థమున ననేకపరపతాకార్యములు జరిగినవి. అవి యన్నియు 'సంగవిజయము'లే యనుకొనుట 'భారతీయ రాజ్యాంగవిధాన నిర్మాణము'ను గూడ 'సంగవిజయ'మే యనుకొనుట వంటిది.

ఏడవ యధ్యాయమున సంగదాసుడు సుస్పష్ట రేఖలతో మనకు వ్యక్తము కాఁగలఁడు. పిమ్మటి రెండధ్యాయములు నాతని భక్తిపరతకు నిదర్శనముగ జరిగిన సృష్టి. తాను 'గోపిక' నని యాతనిభావన. అతనిది భక్తితత్త్వము. ఈ తత్త్వ మెడ నెడ నవలలో గూలంకషముగ జర్చింపఁబడినది. కాని యా చర్చలలో సంగనియొక్క ప్రాముఖ్యము బయలుపడదు. నాయకుండెల్లెడ రామదాసునిదే ప్రాధాన్యము.

ఈ నవలకు గీలక స్థానము సంగదాస రామనాయుల స్నిగ్ధత. కాని వీరి యామైత్రిని గుఱించి బుచ్చయ్యశాస్త్రిలవంటివా రొక్కరో యిద్దరో యనిన యొకటి రెండు వాక్యములు దప్ప తదితరాంశములు సూచనప్రాయముగనైనను లేవు. వా రిద్దరి స్నేహధర్మమెట్టిదో యది దుస్సాంగత్యముగ నేల భావింపఁబడి వారిలో నొకఁడైన సంగని హత్యకు హేతువయ్యెనో విస్తరింపఁబడలేదు.

భక్తిపరుఁడైన సంగఁడు, 'గుమాస్తా' పని చేసిన సంగఁడు, బెజవాడ సభలో 'వృత్తి ప్రతిష్ఠాప' నాదికమును గూర్చి గంభీరోపన్యాసములిచ్చిన సంగఁడును, నొక్కఁడే వ్యక్తి యనిపించుటకుఁ గృతిరచనా కౌశలము చాలలేదు. అట్టి యైక్యసాధనకు సరిపడుప్రజ్ఞ వేఱు. తుదకుఁ బరిణతములగు స్వభావశీలముల బీజావాపమునకు ముందు ముందు సూచనలైన నుండవలెను గదా ! గోపిక ననుకొను భక్తుఁడగు సంగనిచేతనా నీలిమందు బేరము ? పోనిం డది కులవృత్తి యనుకొందము. కూలిజనముల సమ్మెల కతఁడా కారకుఁడు ? ఆర్థిక సాంఘిక రాజకీయాది విషయములఁ గూర్చి యధునాతన భావగంభీరతతో నతఁ డుపన్యసించుట యెట్లుఁబొసఁగునో సాధారణ ప్రజ్ఞ కనూహ్యా మనకతప్పదు. ప్రతిభా సముపేతు లెవ్వరేని యిట్టివానిలో నొకపాటిగ నేక వాక్యత సాధింపఁబూనినను దాని కాధారశిల లనఁదగు సూచన లెక్కడఁగలవు ? సంగనివలన రామనాయుఁడు చెడిపోయినాఁడని చౌదరినాయుఁడు నమ్మి సంగదాసుని చంపించి నాఁడుగదా ! సుప్రసిద్ధ న్యాయవాదిచెప్పిన యీ నవలలో వాస్తవమేమో చదువరు లెఱుఁగుట కాధారము లున్నవా ? పైపెచ్చు సంగని సర్వాభివృద్ధులకును రామ నాయని యండదండలే హేతువు లనెడి ప్రబలవ్యతిరేకసాక్ష్యము[1] లున్న వేమి ?

ప్రధానకథ నంటియుండలేదని యొండు రెండు పర్యాయములుజెప్పిన కమలా మోహనుల వృత్తాంతములోని నీతిబాహ్య కాముకతనుగూర్చి యొకటే మాట.

---

1. "మాలపల్లి"—పుట 47.

'మాలపల్లి' యను నవలకుఁ బ్రయోజన మాదర్శప్రతిపాదనము; రసప్రతీతికాదు. కమలనలవును, మోహనశృంగార పలాయనములను, రసోత్పాదన హేతువు లనుకొని యానందింతుమా ? లేక నవలప్రతిపాదించిన యాదర్శమనుకొని సంతోషింతుమా ? కమలకుఁ బూర్వదాంపత్యమువెడ విముఖతయున్నట్లు మనకు సూచనలేదు సరిగదా ! భర్త నారాధించెడి సంప్రదాయబద్ధురాలని నిరూపించు నేకాంతసేవలు నవలయం దున్నవి. చక్కని కొడుకుఁగల యామె స్త్రీజనవిరుద్ధముగ మోహనునితో బారిపోవుట కేమిగతివచ్చెనో చెప్పుబాధ్యత రచయితకు లేదా ? నిష్కారణముగ కమల నింటి నుండి గెంటి రచయిత సంపాదించినది పుణ్యమా ? పురుషార్థమా ? మోహనుని సౌందర్య మెంతో వర్ణింపఁబడినమాట నిజము. సౌశీల్యము లేనివారికిది ప్రలోభముఁ గొల్పవచ్చును. కమలయందు ముందెన్నఁడు దుర్గుణలేశము సూచింపఁబడదు. ఆమె పతిజీవ కులకాంతలకుఁ బరపురుషసౌందర్య మేమి ప్రయోజనము ? కమలపతనమునకు వయోదోషము కారణము గాదు. అది యా కులమున కే నైజగుణమనుట యే మాత్రము ధర్మ మనరాదు. ఆమె పడిన యిక్కట్లకుఁ బ్రారబ్ధమే యిఁక హేతువు. బలీయములైన యింద్రియములు యత్నశీలుఁడును మేధావియు నగు బురుషుని మనస్సునుగూడ వికృత మొనర్చునుగదా ! యని యిఁక ననుకొనవలెను 1. లేదా,యామె నొక విచిత్ర ప్రవృత్తిగఁ జిత్రించుటయే కవి యుద్దేశ మనవలెను. అప్పుడు కవి సాధించిన ప్రయోజనమును బాఠకులు ప్రశ్నింతురు. కావ్యప్రధానాశయమైన స్వాతంత్ర్యాదర్శముతో సంగత మగునట్లుగ నీ కమలామోహనుల వృత్తాంతము పొత్తింపఁబడినచో నవల యింకెంత బాగుండెడిదో !

ఈ కథాసృష్టిలో నొక రమ్యమైన కల్పన నున్నవవా రాధునికపద్ధతుల ననుసరించి చేసిరి. అది బహుమనోజ్ఞము. కమలమున కగపడిన 'సాహసమయ ప్రపంచ' మెంత రమణీయమో దాని ప్రభావము నంత రమణీయము. కాని పామరరంజనార్థము పాశవికకామము నింతటి యెత్తుఁగడగల నవలలో నారాధింపరాదు. అందుచే మొత్తము మీఁద నీ కమలామోహనుల వృత్తాంతమును యావత్తు నవలనుండి యుత్తరించుటయో యట్టి స్వైరవృత్తి, యద్యతన పాశ్చాత్యనవలలయందువలె వ్యక్తిస్వాతంత్ర్య చిహ్నమని సమర్థించుటయో మాత్రము జరుగవలెను. కడమవి చిన్నదొసఁగులు. అవి యడ్డురావు. వానిని సవరింపవచ్చును. నవలలో గేవల మింతమేర దోషోద్ఘాటనమే

---

1. "యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః"—
శ్రీమద్భగవద్గీత—సాంఖ్యయోగము, శ్లోకము 60, పుట 59—
శ్రీరామకృష్ణ మఠము వారి ప్రకటన (1—4—1958).

చేయబడినది. బుద్ధితత్త్వముచే బరిశీలించుట దీనికి హేతువు. ఇది యిట్లు దోషనిరూపణమునకై జరుగువని ముందే చెప్పబడినది. రానున్న ప్రకరణములలో సందర్భించినపుడు భావతత్త్వమునుబట్టి గుణగణముకూడ నిరూపింపబడునని చెప్పబడెను గదా!

## లక్ష్మీ ప్రసాదము:-1

ఈ నవల స్వతంత్రమైన రచన. కీ. శే. కేతవరపు వేంకటశాస్త్రి ప్రణీతము. మన నవల లీ దినములలో గన్నడభాషా నవలలవలె విస్తారభాగ మన్యభాషా పరివర్తనములు. స్థూలదృష్టికి స్వతంత్రములుగా గనబడి మన చూపు మేరనుండి తప్పించుకొనిపోవును. కాని వానిని బట్టిపరీక్షించినచో నవియనువాదములో యనుసరణములో యగుట నిజము. అనుసరణములవలన మహోదారసారస్వత సంపద ప్రవృద్ధము కావేరదు. మూలమునందలి విషయమును రచయిత్రు హృదయానుసారముగ గ్రహింపజాలము. ఇట్టి మిశ్రణమువలన గ్రంథస్వరూపము వికలమగుటయు నింతకాదు. కొన్ని యసంతృప్తికరములైన యనువాదములయందే, యిట్లగుచున్నది. ఇక ననుసరణముల సంగతిం జెప్పవలయునా ? అట్లుగాక లక్ష్మీప్రసాదము స్వశక్తికృతమగు నవల.

ఏ వాఙ్మయమునందు జాతిజీవనము ప్రతిబింబించునో యది మహోదార వాఙ్మయము. కావున దజ్జాతికష్టసుఖములు, మంచిచెడ్డలు, నాచారవ్యవహారములు, నాదర్శములు మొదలగునవి తద్గ్రంథనిబద్ధములు గావలెను. అపుడే యా జాతివ్యక్తి పరిస్ఫుటమగును. ఆంధ్రజాతీయ జీవనము విశదముకావలెనన్నచో మన సాంఘికాచారవ్యవహారములం బరిశీలించి, యితివృత్తముల గల్పించి రచింపవలెను. అట్టి సాంఘిక నవలలు[2] జాతీయాభ్యున్నతికి దోడ్పడంగలవు.

కేతవరపు వేంకటశాస్త్రిగారు మహాపండితులైయుండియు నాడు నవలారచనమునకుం బూనుకొనుట మిక్కిలి ప్రశస్యము. విద్వాంసులయందిది యసాధారణమనందగును. నవలలపై వారు దమదృష్టిం బ్రసరింపరు. అందును గథాదికములో స్వతోబంధము వారి కనుపాటేయము; ప్రసిద్ధేతివృత్తమునే వారు కోరుదురు.

ఇట్టి సాధారణకారణము లట్లుండ ప్రత్యేకకారణ మొకటి యీ నవలాఘనతకుం దోడ్పడుచున్నది. మూఢురాండ్రగు స్త్రీలవలన సంసారములయందు సంభ

1. ప్రథమావృత్తి క్రీ. శ. 1923; అద్దేపల్లి లక్ష్మణస్వామినాయడుగారిచే ప్రకటితము; సరస్వతీ గ్రంథమండలి (రాజమహేంద్రవరము) ప్రచురణము 348 పుటలు.
2. ఇట్లే స్థూలముగ జారిత్రక నవలల లక్షణములును బ్రయోజనములును రానున్న ప్రకరణమున సందర్భోచితివిబట్టి ప్రసంగింపబడును.

వించు కలహములును, వానివలనఁ గలుగు కష్టపరంపరలును నిందుఁ జక్కఁగ వర్ణింపఁ బడినవి. ఆంగ్లానువాదముల యందలి కృత్రిమవాతావరణమునకు రోసిన యాధుని కులు చిలకమర్తి వారి రామచంద్రవిజయము తరువాత దీనినే వాస్తవికతకుఁ బేర్కొందురు.

ధనాశాపీడితయగు పాపమ్మ కుటిలశీల రాజేశ్వరమ్మ సాయముచే నామె కౌటి ల్యమును మఱింత ప్రౌఢత్వమున వహించెను. ఇందలి నాయికానాయకులు లక్ష్మీప్రసాద రావులు. ఆదర్శప్రాయురాలైన గృహలక్ష్మి, లక్ష్మి. భర్త పదిమంది భార్యలను జేపట్టినను వారిని దనకంటె నెక్కుడుప్రేమతో జూచి యాదరించినను నాతనికి నిజ మగు ధర్మపత్ని తానే యని సతీధర్మము నీమె నిరూపించి చెప్పినది. ఈమె నిర్మల హృదయ; నిరపరాధిని; నాయకునితల్లి యే యధర్మప్రవిష్టురాలయి యకార్యము లాచ రించెను. అయినను నాయకుడు మాతృాజ్ఞ నుల్లంఘింపని ధర్మభీరుఁడు.

నవరస భరితములై భారతీయధర్మప్రబోధాదిగుణము లన్నిటినిమించి యానాఁటి నవలలు, పరిశీలించి కేతవరపువారివి[1], వింశతిపర్యంతములుగలవి, పాఠకులకుఁ గలిగిం చిన భాషాజ్ఞాన మపరిమితము. నవలల సముద్రములో వచ్చికలియు నొక పెద్దపాయ వీరి యీ రచనల సంపుటి.

---

1 చారిత్రక ప్రసిద్ధములు:—"రాయచూరు యుద్ధము", "బొబ్బిలి ముట్టడి", "ఆనందాబాయి" (ఇది యూహాజనితమేయైనను జరిత్ర సమ్మిశ్రితము). ఆంధ్రదేశ సంబం ధములగు చారిత్రకనవలలలో వీరివే తొల్లిటివవి మునుపటి ప్రకరణమునఁ జెప్పఁబడెను.
అపరాధపరిశోధక ప్రసిద్ధిఁగలది:—"రహస్యభేదనము". ఇది రహస్యాపరాధ పరిశోధకనవల. కథాకల్పన మత్యద్భుతమైనది. సంఘటనము లతిభయంకరములు. నిగూఢ హత్యలెన్నియో యిందు వర్ణింపఁబడినవి. ఇది స్వతంత్రమైన నవల. ఇందలి యితివృత్తము కూడ నాంధ్ర దేశమునకు సంబంధించినది.
సాంఘిక ప్రసిద్ధములు :—"రాజసుందరి"(1926—27)ఇదియు నాంధ్రదేశాత్మకమగు స్వతంత్ర కల్పనగల సాంఘికనవల. ఇది కథాసంవిధానమునకుఁ బ్రసిద్ధి.
అగ్రహారము :—
మనోహరమైన స్వతంత్ర సాంఘికరచన. అగ్రహారముల జీవితమిందు దర్పణమునందువలెఁ బ్రతిబింబితము. వరశుల్కాదిక దురాచారముల దుష్ఫలితములు చక్కఁగ నిరూపింపఁబడినవి. కథాసంవిధాన కల్పనాచాతుర్య మనల్పము. "లక్ష్మీప్రసాదము"వలె నిది తెలుఁగు నాఁటి వాతావరణమును వాస్తవికముగఁ జిత్రించి తాత్కాలికసాంఘిక జీవిత ప్రతిబింబమైన నవల. మదాలస, తారాబాయి, సావిత్రీమరణము. పూర్ణానందమువంటి కథమవి చాలవఱకు సరస్వతీగ్రంథమండలి వారి ప్రచురములు. "ఇచ్ఛిపీ కుమారి"వంటివి బహుమానితములై ప్రఖ్యాతిఁగన్నవి.

## హిమబిందు[1]

ఆంధ్రుల ప్రథమసామ్రాజ్యకాలము నందలి చారిత్రకాంశముల యాధారమును బట్టి మొదటి రాజని నిర్ణయింపఁబడిన శ్రీముఖశాతవాహనునకు సంబంధించినకథ నితి వృత్తముగ స్వీకరించి శ్రీ అడవిబాపిరాజుగారు కూర్చిన దీ నవల. శ్రీముఖశాతవాహన చక్రవర్తి యుజ్జయినిని జయించుట యిందుఁ జూపింపఁబడినది. అతని కుమారుఁడైన కృష్ణశాతవాహనుఁడు భరుకచ్ఛమును జయించినాఁడు.

ఇందలి యంశములన్నియుఁ జారిత్రకసంబంధముఁ గలవనిచెప్పుట కాధారములు మృగ్యములు. కథలో బ్రధానమైనపాత్ర శ్రీకృష్ణశాతవాహనుఁడు. ఇతఁడీ నవలయందు శ్రీముఖునకుఁ దనయుఁడు; కాని శ్రీముఖునకు[2] సోదరుడని నేటిచరిత్రకారుల యూహాశి. అట్లే యుజ్జయిని విజయము ప్రథమశాతకర్ణికాలమున జరిగెనని చారిత్రకుల నిర్ణయము. పాత్రపోషణాద్యావశ్యకతలనుబట్టి రచయిత యీ యంశముల నీ రీతిగ మార్చుకొని యుండునా ? ఎంత చారిత్రకనవలయందైనను జరిత్రాంశములయనుసరణ మంత కఠోరవ్రతముకాదని యొక వాదమున్నది. అట్టి కఠోరనియమపాలనము వీరు చేసి రనియు ననఁజాలము. అట్లన్నచో నితరులకంటె నొకదృష్టిచే మెఱుఁగని బాని కర్థము. శ్రీముఖశాతవాహనచక్రవర్తియు శ్రీకృష్ణశాతవాహనుఁడును వినా యీ నవల యందున్నవారిలో జరిత్రప్రసిద్ధులెవరో, కల్పితపాత్రలెవరో నిర్ణయించుట దుస్సాధము.

ఆ ధాన్యకటకముననున్న చారుగుప్తుఁడను వణిక్సార్వభౌముఁడు తన కొమరిత యగు హిమబిందును యువరాజగు శ్రీకృష్ణశాతవాహనున కొసఁగి యుద్వాహ మొనరింపవలెనని తలఁచినాఁడు. కాని హిమబిందు సువర్ణశ్రీయను కుమారశిల్పిని ప్రేమించినది. పితాసుతలలో నొకరి యభిమత మొకరికి దెలియదు. తండ్రి తనకోరి కను వ్యక్తముచేయఁగా నాయన సంతోషముకొఱకై పుత్త్రిక యెట్టకేలకుఁ దన ప్రియుని బరిత్యజింప నిశ్చయించుకొని యాతని కా విచారవార్తఁ దెలియఁజేయును. తన ప్రియురాలు రాణియగు నదృష్టమున కా ప్రియుఁడు సంతసించి తాను బౌద్ధభిక్షు కుఁడగుటకు నిశ్చయించుకొనినాఁడు.

---

1. ది. 15-4-1952 ప్రథమావృత్తి సంగ్రహము. (vide St. G.G. suppli-May 27-1953, Reg. No.-451) క్రీ. శ. 1923-24 శారద 1,2 సంపుటములో నిది యనుక్రమముగఁ బ్రక టితము. పెక్కు పరీక్షలకుఁ బాఠ్యగ్రంథము. "నారాయణరావు"ను భారత ప్రభుత్వము వారభిమానించినచో, దీనిని దక్షిణ భారత హిందీ ప్రచారకసంఘమువా రభిమానించిరి.
2. శ్రీముఖుఁడు శ్రీకృష్ణ శాతవాహనునితో జరిపిన సంగ్రామము చరిత్ర ప్రసిద్ధము. అయినను నది యీ నవలలో నెచ్చటఁగాని పేర్కొనఁబడకపోవుట యొక నేరము కాదు.
3. Vide 'A Comprehensive History of India'; vol-2-The Mouryas and Satavāanā's by Prof. K. A. Nila Kontta Sāstry, p. 301.

ఇంతలో 'ఉజ్జయిని'పై దాడికి శాతవాహనప్రభువులు పయనమైపోయిరి. చారుగుప్తుడును జైత్రయాత్రలో పాల్గొనెను. పితృగృహమున నున్న హిమబిందు నామె మాతామహియు దస్కరులచే జెఱవెట్టఁబడిరి. ఎన్నో శ్రమలకులోనై సువర్ణశ్రీ వారిని వెదకి తెచ్చినాఁడు. వీరితోపాటు స్థౌలతిష్యుల నియోగమున దొంగలింపఁబడిన శ్రీముఖచక్రవర్తి ద్వితీయపుత్త్రిక మంజుశ్రీయును విముక్తినొందును. అందఱు నుజ్జయినీజైత్రయాత్రలో పాలుగొందురు.

శ్రీకృష్ణశాతవాహనయువరాజు భరుకచ్ఛమును జయించుట కేఁగునపుడు మార్గమధ్యమున బడియున్న విషకన్యను దిలకించుట తటస్థపడెను. అతఁ డామెయందు రాగబద్ధుఁడైనాఁడు. పిమ్మటఁ దండ్రియగు శ్రీముఖునకీ సంగతి నెఱిఁగించెను. విషకన్యయనఁగా, దమ బౌద్ధమతవిరోధియగు స్థౌలతిష్యుల మనుమరాలు. వైదికధర్మమును నాశనమొనరించి, బౌద్ధమును బ్రతిపాదింప నెంచుచున్నారని దమ్ము హతమార్పఁబూని విషకన్యను సిద్ధముచేసి శ్రీకృష్ణశాతకర్ణిపై బ్రయోగించిన యాతఁడు స్థౌలతిష్యులు.

ఆమె యూర్పులు సోకినంతనే యెదుటివారి ప్రాణము లెగిరిపోవును. తనవలన నట్టి కీడు మలయనాగుఁడను ప్రభువునకు మూఁడుట యామెను విహ్వలింపఁజేసినది. శ్రీకృష్ణునియెడ దన తాత తలపెట్టిన యీ ఘాతుకచర్య కామె యిష్టపడఁజాలదు. తత్ఫలముగ నామె మానవసంచార రహితారణ్యమధ్యమునఁ బారవేయఁబడెను. యువరాజున కచ్చటనే యీమె ప్రథమదర్శనము. ఆమెను వీడి యన్యులను వివాహమాడనని యాతఁడు. చక్రవర్తియు నెట్టకేలకు కాదనఁడు. ఆపిమ్మట వీరిర్వురకుఁ బెండ్లి.

ఉజ్జయినీవిజయయాత్రలో నత్యంతసాహసపరాక్రమములు ప్రదర్శించిన సువర్ణశ్రీకి హిమబిందుతో వివాహము. అతఁడు పాటలీపుత్రమునకు రాజప్రతినిధియైనాఁడు గూడ.

ఈ నవలలో మూఁడవ మిథునము సమవర్తీనాగబంధునిక లది. వీరు లేకపోయిననుఁ గథకు నష్టము రాదని కొందఱు. అది నిజము కావచ్చును. నవలకు నష్టములేకపోయినను జదువరులకు నష్టము; శృంగారరసస్వరూపమునందు వైవిధ్యమును బ్రదర్శించి విభిన్నప్రణయరీతులను బ్రకటింపఁగల నవలాకర్తయొక్క శిల్పకళాపారంగత్వమునకు నష్టము. నాగబంధునిక పురుషవేషముఁ దాల్చి సమవర్తికి నంగరక్షకత్వము నెఱపునప్పుడు బాపిరాజుగారి 'గోనగన్నారెడ్డి'లోని సమూనాంతరేతివృత్తము పఠితల తలఁపునఁబారును.

శాతవాహనులనాఁటి యాచారవ్యవహారములను, వర్తకవ్యాపారములను మతరాజకీయాదివిషయములను సాహిత్యశాస్త్రాదిబోధనలను శిల్పకళాదికమును రచయిత చక్కఁగఁ జిత్రించినాఁడు.

శాతవాహనులు బ్రాహ్మణులని పలుచోట్ల నవలాకర్త నుడివిరి. గౌతమీ పుత్రి శాతకర్ణి తనకు 'ఏక బ్రాహ్మణః క్షత్రియమానమర్దనః' ఇత్యాది విశేషణము లున్నట్లు ప్రకటించుకొనుటయే వాని కాధారము గావచ్చును.

శాతవాహను లాంధ్రులుగారనికాదు. పురాణములలోని రాజులపేళ్ళతో శాసనముల యందలి రాజులపేళ్లు సంవదించుట మున్నగు నాధారములమూలమునఁ దరువాతి వారు వారి నాంధ్రులనుట వేఱుసంగతి. కాని తా మాంధ్రులమనియుఁ దమది యాంధ్రరాజ్యమనియు వా రెచ్చటఁ జెప్పుకొనిరో యూహింపలేము. ఆంధ్రరాజులనెడి పేరు నాఁడు వారికిఁ జెల్లెనా ? కానిచో 'ఆంధ్రసార్వభౌమ'[1]............భరుకచ్ఛ మాంధ్ర[2] చక్రవర్తుల స్వాధీన మందుండ వలెను'-మున్నగు విధమునఁ బాత్రలచే బ్రత్యక్షముగఁ బలికించుట యెంతవఱ కుచితమో విచార్యము.

ఇందలి హిమబిందుయొక్క యపహరణము మఱల 'వంశమతి' లో వంశమతి యపహరణమును దలఁపించుచున్నది.

ఈ కథారచనాకాలమునాఁటికి మనజాతిలో బెలుగుచు వచ్చుచున్న త్యాగనిరతి, శాంతిశూరత, స్వాతంత్ర్యాభిరతి, యాత్మాభిమానము, స్త్రీధర్మమువంటి గుణముల కీ నవల ప్రతినిధిగా వెలసెను. జాత్యభిమానము పెంపొందించి మన పూర్వుల యొడ గౌరవము వృద్ధిచేయుట, చారిత్రక నవలల ప్రధానాదర్శమగుచో, నీ నవల వలన వా యాశయము పుష్కలముగ నెరవేరినదనుట రూఢి.

నాయిక హిమబిందు:—

ఈమె ధనికసార్వభౌముఁడగు చారుగుప్తుని పుత్త్రిక. హిమబిందు మాతామహి యవనకాంత. కావుటచే నీమె యవనభారతీయసంప్రదాయములకు గూడలిహైనది; ధనవంతుని బిడ్డయగుటచే నల్లారుముద్దుగ బెరిగెను; ఇంటిలో మేనత్తకుమారుఁడగు సమవర్తితోడ బాల్యమునుండియు నాటపాటలఁ గడపినది. అతఁ డామెను బ్రేమించెనేమోగాని, యామె కాతనిపై ననురాగము పొడమలేదు.

ఎడ్లబండిపందెములలో దన బాహనుమించిన శిల్పికుమారుఁడగు సువర్ణశ్రీని జూచిననాఁటినుండియు నామె హృదయమున నవ్యక్తములగు కోరిక లీరికలెత్తుచున్నవి. ఆతని జూడవలయునని యొకకాంక్ష. అది దినదినాభివృద్ధి నొందెను. తనకు నెచ్చెలియు

1. 2. ఇట్టివి యసంగతి దోషము లగునేమోః నవలలో నివి వాతావరణసృష్టియం దద్దుపడు నెఱసులు. చారిత్రక జ్ఞాన చాతుర్యముఁగల చదువరి పఠనవ్యగ్రుఁడై వ తాను శాతవాహనుల కాలములో నివసించుచు మండి, హఠాత్తుగ మన కాలములోనికి గిరవాటువేయఁబడినవాని యట్లగుట యిట్టి దోషములవలని ప్రమాదము.

సువర్ణశ్రీకి చెల్లియగు నగు నాగబంధునికను జూచు వ్యాజమున నామె తన మాతా మహి ముక్తావళితోగూడి సువర్ణశ్రీసదనమున కేగినది. అత డు చెక్కినశిల్పముల దర్శిం చుటకూడ నామె కొకమిష. ఆమె యాతని భవనప్రదేశమంతయు బరిశీలించెను.

హిమబిందును వలచియున్న సువర్ణశ్రీకి నామెకోఅకే దిదృక్ష; నిరీక్ష; యన్వీక్షయు. ఒక్కచో నొక్క పాటలీవృక్షము నానుకొని యామె కదలక మెదలక నిలచి యున్నది. సువర్ణశ్రీ యాదృశ్యము నొక శిల్పప్రతిమ యనుకొని దాని సోయగమును పొగడినాడు. "బాలనాగీ!దారియిమ్మనవే!"యని యామె సిగ్గుపడి పలుకునప్పటి కాతడు చకితుఁడయ్యెను.

హిమ యాకుమతు గుపించె; అయ్యును సువర్ణ శ్రీసౌందర్యాకృష్టయు ననాష్టమునై యేకాస్యముగ ప్రణయధ్యానమున కొంతకాల ముద్యానములయం దాతనితో విహరించినది. తన క్షేమమునే కాంక్షించు తండ్రి తానుకోరిన యీప్సితమును ద్రోసిరాజనఁడని యామె ధైర్యము. కాని తన పితృదేవునియభీష్ట మన్యథాత్వము గలదని గ్రహించినవెంటనే "మీరుగుణముచే బెద్దలు; ఈమె తండ్రిచాటుబిడ్డ" యని తన ప్రియునకుఁ దెలిచే దెలిపించెను. హృదయమునఁగోరినవానిని జేపట్టుటయా? లేక తనుప్రేమూర్తిహృదయమునఁ దెంచి, తనతోడి యేలోకమని విశ్వసించియున్న తండ్రిమనస్సునకు వ్యథ గలిగించుటయా? యన్న సమస్య యామెను జాల కలవరపఱచి నది. ఇటుతండ్రిని మనస్సునొప్పింప గూడదు లేదు; అటు తానన్యుని వరింపఁజాలదు; ఆలో చనతో నీమె మూర్ఛయందు మునుగును. మఱల తేఱుకొన్న పిమ్మటఁ దన తండ్రిగారు యుద్ధయాత్ర కేఁగుచున్నారనెడి బెంగచే నట్లయితినని సువర్ణునితో బలికి యాతనిని బంపివేసినది.

తండ్రి చారుగుప్తుడు చైత్రయాత్ర కేఁగినపుడు హిమబిందును మాళవు లప హరించిరి. సువర్ణశ్రీ యామెను యువరాజుపత్నిగా జేయుటకై ప్రయత్నమని యప్పటి కాతనికి దెలియవచ్చి సోదరప్రేమతోడను యువరాణిగౌరవముతోడను నామెతో మాటాడవచ్చెను. అంత హిమబిందు "ప్రభూ!మీరు దేవతలు; మీ పాదసా క్షిగా ప్రతిజ్ఞచేయుచున్నాను: బరిణయమాడినచో నా యాత్మ కధీశ్వరునే పరిణయ మాడుదును. లేనిచో భిక్షుణి నగుదునని సమాధానించినది. అప్పటి కామె మనస్సాక నిశ్చయమునకు వచ్చెనన్నమాట! తండ్రి యానందముకంటెఁ దనహృదయాధినాథుని బరిణయ మాడుటయే లెస్సయని యిప్పుడు హిమకుదోఁచెను.

వారణాసికేఁగి బౌద్ధభిక్షువు కాఁదలచిన సువర్ణశ్రీ తాను జెక్కి చికిలిచేసి విన్యసించిన హిమబిందువిగ్రహము ముందునిలువఁబడి 'దేవీ! నిన్ను మఱచిపోవుశక్తి ప్రసాదింపుమని వేడినాఁడు. అతనిని వెదకుకొనుచుఁబోయిన హిమబిందు హఠాత్తుగ

నచ్చుట ప్రత్యుతమై "మాతృడికి గూఁతురనగుటయే నా దోషము; మిము ప్రేమించితిని; మీరు నా భర్త" యని దృఢముగఁ బలికినది. ఇంతలో జామదత్తుఁడును మనస్సు మార్చుకొని యచ్చటికివచ్చి వారి ప్రేమానుబంధము నంగీకరించి యాశీర్వదించినాఁడు. వారు వివాహితులై శుభముల నొందిరి.

భాగ్యమే ప్రధానమనుకొను చారుగుప్తునివంటివానికిఁ బ్రతినిర్యాతనముగా స్నిగ్ధశీలలగు హిమబిందువంటి పుత్రిక లుద్భవించుట యుఁ బ్రకృతిసిద్ధము. హిమబిందు కేవలము ప్రేమరసోపాసకురాలు. ప్రేమ తాను ధనధాన్యాదులనుగాని యున్నతపదవులనుగాని యాశింపదనుట కీమె వృత్తాంతము లక్ష్యభూతము. చేఁజిక్కిన మహారాజ్ఞీత్వమును ప్రేమకొఱకై జారవిడుచుట యీమెయొక్క హైకజీవియనుటకు నిదర్శనము. నిర్భాగ్యుఁడని యెంచిఁగించు సువర్ణశ్రీని మనసారఁగోరి పైతృకమును సర్వము త్యజించి సముట్టుట, హిమబిందునకే చెల్లినది. లౌకికభోగములేకున్నను దుష్టతుదకుఁ దన మనోభవుని నీతింపియేని బ్రతుకనిశ్చయించి, బౌద్ధసన్యాసినిగా సంసిద్ధమైనయీమెను సచేతనత్యాగధ్వజమనఁ జెల్లును. త్యాగస్నేహశీలములు రెండును మనలో గల యన్నినాళ్లు మన జాతి యీమె యుడిన భిక్షను మఱవఁజాలదు.

నాగ బంధునిక:-

ఈమె శిల్పాచార్యుఁడగు ధర్మనందితనయ; సువర్ణశ్రీకి సోదరి. అగ్రజునితో బాటుగ వస్త్ర శస్త్రవిద్యలను నశ్వారోహణాదికమును నభ్యసించిన సాహసికురాలు. స్త్రీప్రకృతికంటెఁ బురుషప్రకృతియే యీమెయం దధికమన్నను దప్పురాదు.

బాల్యమాదిగ నీమెకు వీరకర్మములయం దాసక్తిమెండు. వినోదకళలయందామె కభీష్టముతక్కువ. అన్నగారు శృంగారకీర్తనలు పాడుచుండ, 'ఛస్' యీ 'శర్కర కేళిపండ్లు" నా కిష్టముండవ'ని చుండెడిది. చిన్ననాఁ డీమె చాల నల్లరిపిల్ల; చెల్లెలగు సిద్ధార్థిక నవలీలగ బఁతివలె నెగురవేయు చుండెడిది. శృంగారలక్షణములకంటె వీరవనితాలక్షణములే యీమెయం దధికమనుట కిట్టివి నిదర్శనములు.

నాగబంధునిక పరిహాసప్రియతయందును గుశలురాలు. సువర్ణశ్రీ కృష్ణదరిని హిమబిందును ధ్యానించుచుఁ గూర్చుండఁగ వెనుకనుండిపోయి కన్నులు మూసెను. అన్నకామెయే లోకమైనదని యెకసక్కె మాడుటయేగాక తల్లిలేనిపిల్ల హృదయమును దొంగిలించుట తగునా? యని కూడ మేలమాడినది. అన్నగారియొద్ద నీమె కీ చనవు పెద్దదైన పిమ్మటను నలవాటయ్యెను. అబల యగుటచే బురుషుని వరించుట తప్పినది గాదు తనది బలపరాక్రమముల నారాధించు ప్రకృతిగావున నీమె యుద్ధములయందు శౌర్యదుర్నిరీక్ష్యుఁడగు సమవర్తినే హృదయపూర్వకముగఁ గోరెను.

నాగబంధునిక ప్రేమ నిగూఢమైనది. ఎప్పుడు సమవర్తిని వలచెనో యెవ్వరికిని తెలియదు. వీరి కీ విషయమున సంకల్పములేగాని సమావేశములులేవు. పరస్పరావలోకనములు, సిగ్గుదొంతరలు దొరలు సంభాషణ చాకచక్యములు, నావేశాలాపములు, మున్నగునవి యీ మిథునానురాగమునకు లక్షణములుగావు. సుదూరదేశమునఁగల ప్రియుని వీరోచితకృత్యములను నగణ్యఖ్యాతిని వినుచుఁ బెంపొందినది నాగబంధునిక సిలిరాగము.

పాటలీపుత్ర పతనానంతర మీమె యన్నగారితో దన వలపునుగూర్చి యెఱిఁగించెను. 'నాహృదయము దర్శింపుము; ఎద్దుబండి పందెములనాఁ డా మహాపురుషుని జూచితిని. ఆతనియందు మనసు లగ్నమైనది. అది ప్రేమయున్న భావమే నాకుఁగలుగలేదు. ఆయన యుజ్జయినికిఁ బోయిననాఁటి నుండియు నా వీరపురుషునిమూర్తి నా జీవితమంతటఁ బ్రసరించినది.' ఇప్పటి కీమె తన హృదయము విప్పిచెప్పెను.

నాగబంధునిక తన మనోనాథు నన్నిరంగముల యందు ననుసరించినది. ప్రియుండు యుద్ధరంగమున నుండఁగా గృహమునఁ గూర్చుండి సంతప్తచిత్తయై విలపించుట యీమె వంతుకాదు. పాటలీపుత్ర జైత్రయాత్రలో నీమె పురుషవేషధారిణియై సమవర్తిని వెన్నంటి కాపాడిన యనీకస్థురాలు[1]. నాగబంధునిక యనఁగా నిన్న మొన్నటి మన జాతీయసమరములో సైతము పతివ్రతలగు తెలుగు భార్యలను దలఁపింపఁజేయు తరుణి.

తాను ప్రేమించెనేగాని తన్నాతఁడు ప్రేమించెనో లేదో యెఱుఁగ దీ వీరనారి నాగబంధునిక. ఈమె తన సేవా పరాయణతచేతనే ప్రియునిహృదయమును జూరకొనఁగలిగిన వీరవనిత. తుదకు సమవర్తి తన యంగరక్షకుఁ డనఁగా దనచెలికాఁడగు సువర్ణశ్రీకిఁ దెలియలేయని గ్రహించి, యనురాగరంజితుఁడై యనుగ్రహించెను. పాటలీపుత్రము జయింపఁబడిన దినమునఁ దన్ను వెంటనంటి స్వారిచేయుచు వచ్చుచున్న పురుషవేషధారిణియగుఁ బ్రియురాలు గుఱ్ఱపుడొట్టుపాటువలనఁ గ్రిందఁబడఁగా నాతఁడు తన యూరువునఁజేర్చి గారవించి యామెకుఁ జికిత్సచేయించెను.

ఆ నాఁడొక రొకరి నార్ద్రచిత్తులై చూచుకొనిరి. ప్రణయైకదృక్కు లానాఁడు ప్రసరిల్లినవి. ఇరువురి హృదయములయందుఁ బ్రేమరసవాహినులు వెల్లువలెత్తెను. తలిదండ్రుల యనుమతినొంది వీరు పరిణయమాడి సుఖించిరి. నాగబంధునిక 'సాహసే లక్ష్మి' యను సూక్తి కొరవడియైన మన వీరాంగనలకుఁ బ్రాతినిధ్యము వహించుచున్నది రసశ్రేష్ఠము లనఁదగు శృంగారవీరములకు స్త్రీపరముగ హిమబిందు నాగబంధునికలు ప్రధానములైన నిధి నిక్షేపములు.

1. Body guard.

## చంద్రబాల

చంద్రబాలవృత్తాంత మెంత విచిత్రమైనదో యామెప్రణయ మంత మహోదార మైనది. ఈమె బ్రహ్మవిద్యాధిపుఁడగు స్థూలశిష్య్య పౌత్రి. బాల్యమునందే మాతా పితృ వియోగమునొంది పితామహునియొద్ద పెంపఁబడెను. స్థూలశిష్యులు వేదమతోద్ధరణ బద్ధకంకణుఁడు. ఆంధ్రమహాసామ్రాజ్యభారము వహింపనున్న యువరాజు, శ్రీ కృష్ణశాతవాహనుఁడు, తండ్రియగు శ్రీముఖునివలె బౌద్ధుఁడు. మతాంతరుఁ డను గాగణమున యువరాజును సమయించుటకై యమృతఁపుసోనయగు జంద్రబాలను విష బాలనుగా సిద్ధముచేసి 'స్థూలశిష్యులు' ప్రయోగింపఁబూనెను.

పాపము పసిపాపకేమి యెఱుక? ఎట్లు పెంచిన నట్లుఁ బెఱుఁగుదురు. బాల్యము నుండియుఁ జంద్రబాలకు విషోరగములతో నేస్తము; విషజల స్నానము; విషాన్నభుక్తి; ఆమెరక్తము విషమయమైపోయినది; సర్వాంగము విషపూరితము. ఆమె నిశ్వాసమే విషోద్గారి యయ్యెను. ఆమెను సమీపించుట మృత్యువును సమీపించుట. ఆమెను దాఁకుట మృత్యువును సోఁకుట.

ఇట్టి చంద్రబాలకు యౌవనప్రాదుర్భావ మయ్యెను. మలయనాగుఁడను ప్రభు వీమెను కౌఁగిలింపఁగనే యాతని మనుగడ సున్నయైనది. అది యీమెకుఁ జాల విషాదహేతు వయ్యెను. ప్రతిష్ఠానమున నొక కొలనిలోనిచేఁపలు తన పాదస్పర్శమున మృతినొందుట యీమె కనుఁగొన్నది. లోకధర్మానుసారముగ యువతీయువకులు బొందుసౌఖ్యమునకుఁ దాను నోఁచుకొనలేదని యీమె గ్రహించి విచారమున మునిఁగెను. తన చెంతకు వచ్చినవానికి మలయనాగునిగతి పట్టవలసినదేగద! ఇఁక సంసార సుఖము లెట్లు?

స్థూలశిష్యులు ఘాతిగుండెవాఁడు. వాని పట్టుదల నెరవేరవలసినదే! మంత్ర జలముల నామెపైనఁ జల్లుటకు సంసిద్ధుడైనాఁడు. ఆ తరుణి వాని చైదమును గాంచి నది. ఆమె హృదయము కర్కశముగాదు. తాత తనశరీరమును విషముగావింపగలిగెను; హృదయమును విషపూరితము గావింపఁజాలఁడయ్యెను. ఆమె ధైర్య మవలంబించినది. తా నేల యువరాజును జంపుటకై నియుక్తురాలు గావలెను? ఆతనిని జూడకయే యతనియందు శత్రుత్వము తా నేల వహించుట? ఈ విషయ మామె తాతగారికి నివే దించుకొన్నది. ఎదురుతిరిగినది; కాని యేమిలాభము? తుద కామె మూర్ఛిల్లెను. మంత్రజలముల నామెపైఁ జల్లినాఁడా స్థూలశిష్యులు.

చంద్రబాలహృదయములో హింసాకాండము నెడ వ్యతిరేకభావమేకాదు; ఆ వేదనమును గలిగినది. తాతగారు తనను యువరాజుపైఁ బ్రయోగించుచున్నందులకుఁ

బట్టుబట్టి యీశ్వరుని ప్రార్థించెను స్త్రీత్వము సార్థకమగుటకుఁ బతిభిక్ష పెట్టనియెడలఁ దన్ను పాషాణముగనైనఁ బుట్టింపుమని వేడుకొన్నది.

స్థాలతిష్యులు విషబాలకు గాఢనిద్రనుగల్పించి శ్రీకృష్ణ శాతవాహనుని మార్గమం దరణ్యమున విడిచిపుచ్చెను. ఆమె యువరాజును జూచినది; చూచినవెంటనే వలచినది. కాని యత డామె విషకన్యయని తెలిసికొనెను. విషవైద్యులచే మంత్రవైద్యులచే జికిత్సచేయించినాఁడు. శ్రీకృష్ణుడు చంద్రబాలను మనసార ప్రేమించెను. ఆమెయు నతనిని వరించినది. కాని లాభమేమి? యువరాజు ప్రణయినీ పరిష్వంగ సౌఖ్యమునకు వేగిరపడెను.

ప్రేమవిషయమునఁ బురుషుఁడు వేఱు; స్త్రీ వేఱు. ఎంత ప్రేమయున్నను స్త్రీ యుద్వేగపడదు; ఆమెయందు నిబ్బరము నిరుపమానము. విషబాల యట్టి గంభీర హృదయ; ధీర. అతని మనస్సు విచారించుటకు "మహారాజా! నేను మృత్యుదేవతను; న న్నేల కోరుదురు? నాకు మీ నామస్మరణమే చాలును. దూరమునుండి పూజింపుచు మిమ్ము దర్శించు యోగినినైతి"నని పలికినది. కాని యాతఁ డాఁగలేక "నా యీ కౌఁగిలికి రమ్మ"నినాఁడు. "వద్దు ప్రభూ! మీ రటులనే యుండు"డని శ్రీకృష్ణ శాతవాహను నామె పంపివేసె.

కాని యతని కామె యశోకయే. ఆమెకొఱకై తాను రాజ్యమునేని బరిత్యజింతునని నాఁడు. తండ్రి శ్రీమ ఖుఁడీ వివాహము నంగీకరించెను. ఆమె యమృతపాదులనారి తనయ యని యెల్లరుఁ దెలిసికొనిరి. మంత్రౌషధములవలనఁ దుద కావిషబాల యమృతబాలయైనది. పాటలీపుత్ర విజయానంతరము వారు వివాహితులైరి.

## సువర్ణశ్రీ

ఆంధ్రసామ్రాట్టుల రాజధానియగు ధాన్యకటకమున నొక శిల్పిప్రభువగు ధర్మనందిఁ బుత్త్రుఁడు సువర్ణశ్రీ. ఇతఁడు తండ్రి శిక్షణమున శిల్పవిద్యలోని మర్మముల నెఱిఁగినవాఁడు. తండ్రికిఁ దెలియకుండ వీరవిద్య లభ్యసించినాఁడు. ఎడ్లబండితోలు పందెములో ప్రావీణ్యము సంపాదించెను. కుమారుని వీరవ్యవసాయమును జూచి తండ్రి చకితుఁడై "శిల్పియొక్క నీ విద్య తక్కువ!" యనినాఁడు.

సువర్ణశ్రీ యనఁగా, వీరశృంగారముల సంగమస్థానము. హిమబిందు నాట్యము నుగాంచి యితఁడు సమ్మోహితుఁడైనాఁడు; తన లీలావిలాసములచేత నామె హృదయమును జూఱఁగొనినాఁడు. కొంతకాలము హిమబిందు సువర్ణశ్రీలు రాజవిపతులై యుద్యానములలోఁగూడ విహరించిరి.

కాని యిది యెంతకాలము సాగును? ఆమె తండ్రిచాటు బిడ్డ. ఆతని కోరికలు వ్యర్థము. అయ్యు నితడు ధీరుడు; రాజభక్తిపరుడు. తన హిమబిందు యువరాణి గానుండుట యాతని కానందము. అట్లని తా నన్యస్త్రీని ప్రేమింపరాదు. గత్యంతర మేమి? "అన్యథా శరణంనాస్తి; బుద్ధం శరణం గచ్ఛామి" యనుకొనినాడు. బౌద్ధ భిక్షువుగా జీవితశేషమును గడపి హృదయశాంతిఁబొందఁ దలఁచుట యే మార్గాంతరము.

ఈలోఁగా హిమబిందు దుష్టాత్ముల యధీనమయ్యెను. అది విన్నయతఁడు క్షణమైన నిలువలేక పోయినాఁడు. ఆమె నర్చించుట తనవిధి. అందులకై వీరకృత్యమును సాధింపనేఁగు యోధునివలెఁ గదలెను. తల్లిదండ్రుల యామోదాశీర్వాదములఁబడసిన యాతనిని నాయుధులగు ననుచరు లనుగమించిరి.

కేవలము వీరమునకేగాదు; సువర్ణశ్రీ బుద్ధిమాత్రుతకును ప్రసిద్ధి. అతఁడు గోండులతో నెయ్యము నెఱపెను. నర్మదాతీరమున నగపడిన పిశవ లంతలో నదృశ్య మగుటఁ జూచి మొదలి రహస్యమును భావించి ప్రయత్నమునఁ గళింగరహస్యగుహ కనుఁగొని యందు తన నీతిని యుక్తిని జాకచక్యమును ప్రదర్శించి వేషములుమార్చి శత్రువిచ్ఛేదన మొనర్చినాఁడు. ఆతనివలన మాతామహీ దౌహిత్రులగు ముక్తావళీ హిమబిందులు బంధవిముక్తలైరి. ఇట్టి యౌదార్య మే బాలికఁ బ్రేమాస్పదముకాదు? నుసిగప్పియున్న హిమబిందు ప్రణయము నిది ప్రణయించి తుషావృతినిడిన గార్హపత్య మునువలె రగిలింపఁజేసెను.

కొన్నాళ్ళు గడచినవి. ఇతఁడామెను జూడఁబోయి "యువరాణి"యని సంబో ధించినాఁడు. ఆ పలుకు లామెకు ములుకులైనవి. అంతట నామె "మొదట నొకరిని ప్రేమించి పిదప నీవై యింకొకరిని ప్రేమింప వీలగునా? ప్రేమింపకయే వివాహ మాడుదురా? ఒరులు మనసీయకయే మనసు మనసిచ్చుట పాపముగదా?" యని ప్రశ్నించినది. సువర్ణశ్రీ యేమియు ననఁజాలక కంపించిపోయెను.

ప్రేమవిఘాతమువలన సువర్ణశ్రీ బౌద్ధభిక్షువు కాదలఁచినను రాజభక్తిగాని దేశభక్తిగాని యాతనిలో గొఱవడలేదు. తన యాంధ్రదేశము పాటలీపుత్రముపై దండెత్తినది. ఇతఁడును మహాయోధుఁడై రణరంగమునకు దూకెను; గజారూఢుఁడై నిజభుజార్గళముచే శత్రుదుర్గకవాటవిపాటన మొనర్చెను. ఆంధ్రుల చమూనివహము నకుఁ బాటలీపుత్రమునఁ బ్రవేశముఁగలిగించెను.

యుద్ధమున నిట్లు స్వధర్మము నిర్వహించి బౌద్ధభిక్షుఁడగుటకు సువర్ణశ్రీ వార ణాసి కేఁగినాఁడు. అచ్చట నాశ్రమస్వీకారమునకు సర్వము సంసిద్ధమయ్యెను. కాని దైవయోగము వేఱుగనున్నది. శ్రీకృష్ణశాతకర్ణి చంద్రబాలయందే బద్ధానురక్తుఁడై యున్నాఁడు. చారుగుప్తుఁడు తన సంకల్పమును వీడక తీరలేదు. అందఱును సువర్ణ

త్రీని దాసి హిమబిందును స్వీకరింపుమని ప్రార్థించిరి. వివాహితుఁడై పాటలీపుత్రమున కధిపతియై యాంధ్రశిల్పమును విలసిల్లఁజేసిన యీతఁడు మనశిల్పిచక్రవర్తి.

## శ్రీకృష్ణ విషకన్యలు: ఉదార ప్రణయము

విషకన్యా శ్రీకృష్ణశాతవాహనుల ప్రేమ మానవసహజమగు కరుణబీజకముగా నంకురించినది. అతఁడాంధ్రసామ్రాజ్యభావి చక్రవర్తి. ఆమె యాతని వినాశనమునకుఁ గల్పింపఁబడిన యుపకరణము. ఎవ్వరి సంహారకసాధనమగుటకై తా నుగ్గుఁబాలతో విష మారగింప వలసివచ్చెనో యట్టి వానినే వలచుటకు సాహసించినది విషకన్య. మహా కరాళమృత్యుసన్నిభయైన యెవ్వతెను గాంచినంతనే వధార్హ యనిపించునో యట్టి యామెనే ప్రేమించునట్టి సంఘటనమునకుఁ బ్రధానముగ మానవునకుఁ బ్రకృతిసిద్ధమగు కరుణయే కారణముగాని యన్యముకాదు.

అట్టి కారుణికత్వప్రేరితమైనది దివ్యప్రేమ. ఆంగికాహార్యాది విలాసలావణ్యములఁ జూచికాదు, శ్రీకృష్ణచంద్రబాల లన్యోన్యము ప్రేమించుకొన్నది. తన తాత గారిచే శ్రీకృష్ణుని వినాశనమునకుఁ బ్రయోగింపఁబడనున్న యవసరమున నామె కేవలము కరుణామయియయి తా నేల యాతనిని సంహరింపవలెనని ప్రశ్నించుకొనెను. అట్టి నిర్ఘృణకృత్యమునకుఁ దా నుపకరణము కాఁజాలనని వాపోయెను. ఆ పని తన తలకుమించినపుడు చైతన్యరహితయై కేవలము మనస్సులో నీశ్వరుని వేడికొనెను. యువరాజన నెవ్వరో, యెట్టి స్వభావసౌశీల్యములు గలవాఁడో యామె యెఱుఁగదు. అచ్ఛమైన కారుణ్యముచే నతనిని ప్రేమించినది. తరుణీసహజమగు విషయవాంఛా పరిపూర్తియే యామె కామితమగునెడలఁదాతగారు సిద్ధుఁడుగాన శ్రీకృష్ణుని వినాశానంతర మనురూపసౌజన్యములుగల యొక మహారాజును బతిగా మనుమరాలికిఁ గూర్పలేకపోఁడు. కాని యామె శ్రీకృష్ణునే వరించెను. ఆమెకాదు; ఆమెకరుణచేసిన నిర్ణయ మది.

యువరాజుని కరణ్యమధ్యమున వేఁట. ఆ కీకారణ్యమధ్యమున నొక బాలిక; విషోరగపరివృత; చైతన్యరహితయు నగపడవచ్చునుగాక! సాధారణముగ నది శృంగారావిర్భూతికి బాహిరమైన ఘటన; నృత్యగీతాదివిలాస విలసితదివ్యాంగనా సందర్శనము గాదు; బీభత్సభయానకదృశ్యము. కాని, వాని కా దృశ్యమునెడఁ గరుణగలిగినది. ఆమె విషకన్యయని వైద్యులు చెప్పిరి. కాని యామెను గాపాడితీరవలెనని యాతని యభినతి. ఆమెకు సాహాయ్యపడుఁడని తోడివారి నతఁడు తొందరించినాఁడు; తానే బోవుదునని సాహసించినాఁడు. ఆమె నుద్ధరించుతలఁపే యంతటి యుద్వేగమునకుఁ గారణము. అది యే కరుణ.

బాహ్యసౌందర్య లాలసతచేగాక మానవసహజమగు మహనీయకరుణచే బర స్పరము ప్రేమించుకొనిన ప్రణయము మహోదారమైనది. విషకన్యా శ్రీకృష్ణశాత కర్ణుల హృత్రచిత్రణమున రచయిత నెఱపిన ప్రతిభ యనన్యము. అకారణహింసాకాండకు సాధనము గాలే ననెడి కరుణ విషకన్యది. దీనస్త్రీజనోద్ధరణము నుద్దేశించిన కరుణ శ్రీకృష్ణునిది. వీరిలో దయాళుత్వమెంతో ధీరత్వ మంత.

## నవలారచన: మహాకవిత్వము

ఈ నవలకు బీఠికలో స్వర్గీయ కురుగంటి సీతారామభట్టాచార్యులవారు చెప్పి నట్లుగ "అడవి బాపిరాజుగారు ధర్మములు తెలుపునపుడు ధర్మసంవేది; యుద్ధవర్ణనము నందు సమరశాస్త్రకోవిదుఁడు; శృంగారవర్ణనమున శృంగారరసమూర్తి; శిల్పమునభి వర్ణించుపట్ల మహాశిల్పి; గానముపాడించునపుడు గాయకమణి; రహస్యభేదనములఁ దెలుపునపుడు గూఢచారి; శాస్త్రచర్చచేయునపుడు శాస్త్రవేత్త".

బాపిరాజుగా రనఁగా జరిత్రను నాయికానాయకులకథలో మేళవించి శ్రోతలకు నిర్భరపరమౌత్సుక్యముగొలుపు వాతావరణమును సృజింపఁగలమేటికవి. సమస్తకళలకు, మహోదైర్యమునకు నాకరమైన నాఁటి యాంధ్రదేశమును వీరు మనకనులకుఁ గట్టఁ గలరు. ధనుర్విద్యాభ్యాసాది వీరవ్యవసాయములలో బాలురతోబాటు బాలికలును శిక్షితురాండ్రగుట, ధనాధికులు సాధారణులును గలసిమెలసి వర్తించుటవంటి వెన్నో దృశ్యములు నవలాకర్త మనకుఁజూపఁగలిగెను. నాఁటివారి కెంత మతావేశమో యంత మతసహనము. అటు బౌద్ధచైత్యములు, నిటు వేదవిద్యాశ్రమములు గూడఁ గలవు. సమస్తవినోదక్రీడలను నవలాకర్త మనకన్నులలో మెఱపించినాఁడు. ఉత్సవ ములవేళ మద్యపానరతులు, నాభరణభూషితులగు స్త్రీపురుషులు మనకు దృగ్గో చరము గాకమానరు.

ముఖ్యమంత్రితోబాటు సైన్యాధ్యక్షుఁడును రాజునకు మంత్రాంగములోని వాఁడు. వణిక్ప్రభాముఖులుకూడ నట్లే! నాఁటి వర్ణాంతరవివాహవ్యవస్థయు, వర్తక వ్యాపారసరళియుఁగూడ మహాకవియైన నవలారచయితకు వాతావరణసృష్టిలో దోడ్ప డినవి. భూమిపైనను, నదులయందును, సంగ్రామమునకేగాక గజాశ్వదళము లనేక రీతుల నుపయోగపడుట చదువరులకుఁ జర్మచక్షువులతోనట్లు వర్ణనములమూలమున బాపిరాజుగారు చూపిరి. ఇందువలనఁ గవులకున్న నిర్దుష్టదర్శనము వీరిదనుట నిస్సం దేహము. ఇంతటి చరిత్రభారమును గుదిగూర్చియుఁ బఠితల నాకర్షించుట రచనా విధానమునఁగల రహస్యముచేగాని చేకూరదు.

వైదికమతప్రక్రియలగు నభిచారహోమాదులయందు సైతము విషకన్యాసృజన ముచే నుత్సాహమును రేకెత్తింపఁగలిగినది బాపిరాజుగారి ప్రజ్ఞ. స్థూలలక్ష్యులకు

నమృతపాదార్హ్వాతులకుఁగలిగిన బౌద్ధబ్రాహ్మణమతవాదమునందు కూడ నా యిరువురను బితాసుతులగునట్లుఁ గల్పించి ప్రతీక సంవిధానరచనాసామర్థ్యమును వెల్లడింపఁ గలిగినది నవలాకర్తృకౌశలము. హిందూ బౌద్ధమతముల ముఖ్యభేదమును సంవాద రూపమునఁ బ్రదర్శించి, నవలకుజవము జీవమును రచయిత సంపాదించినాఁడు.

ఇందలి భాషను నిర్దుష్ట మనలేము. ఆ మాటకువచ్చినచో బాపిరాజుగారిదేగాదు: కవిసమ్రాట్టు విశ్వనాథవారి నవలలభాషయు నంతంతమాత్రమే!ఏ నవలయు నిర్దుష్టమైన భాషకొఱకై వ్రాయఁబడదు. మిక్కిలి పటుత్వము గల భాషవ్రాయుటయే నవలా కారుల ముఖ్యోద్దేశము. పోఁగా నిఁక శైలిసంగతి, బాపిరాజుగారిశైలి మనోజ్ఞము. శ్రీ విశ్వనాథవారిశైలి యెంత జాతీయము, సాంస్కృతికమునో బాపిరాజుగారిశైలి యంత శిల్పకళానిపుణము, కోమలము, ముగ్ధమోహనము నవకతీరదు.

అగుట కిది చారిత్రకనవలయే యైనను గేవలము యుద్ధాదివర్ణనములతో దల మునకలు గ లేదనవచ్చును. ఇందుఁ ద్రివిధములైన ప్రణయసత్యములు ప్రపంచింపఁ బడినవి. ఆ మూఁడు శృంగారకథలును మూఁడు శృంగారరసఝురులు. అట్టి శృంగార త్రివేణీసంగమమువలన నీనవల యొక పుణ్యతీర్థమైనది. ఈ కథల సంశ్లేషముచే బఠితలు కౌతుకసంభరితు లగుదురు. అందొకటి సాధారణప్రణయము; రెండవది యుత్తమము; మూఁడవది మహోదారము. ఈ దృశ పృథగ్విధానముచే బ్రపంచమునఁగల ప్రణయ వ్యాపారవైవిధ్యము విశదపడ గలదు.

రసానుకూలపదప్రయోగవిషయమున బాపిరాజుగారు తనకుఁ దానే సాటి. ఎద్దులబండిపందెముల వర్ణించునపుడు "దావానల మధ్యంబున జనించు శిఖలన్నింటి మీటి గుప్పున దుముకు జ్వాలాసామ్రాజ్ఞివలె,మహాపవనము లన్నింటిని దాఁటి విసవిసబోవు నుడిగాలిరీతి సువర్ణశ్రీ బండి......కడచిపోయినది".

సంభాషణలలో రచయిత సునిసితమైన హాస్యముతో శృంగారము నెట్లొలికింపఁ గలఁడో పరిశీలనాహ్వాము :-

హిమ :- ఆ కోకిల అంత అందముగ పాడఁగలిగినదా, యిదివఱకు! కృష్ణానది నన్ను చూచుచున్నది; నాకు సిగ్గువేయుచున్నది.

సువర్ణశ్రీ :- అయినచో నా యీ హృదయమున దాఁగుకొనరాదా ?

హిమ :- శిల్పుల హృదయములో ఱాళ్లురప్పలు ఉండును. అదిగో అంతదగ్గరగ మీరు రాకూడదు. మీకు దగ్గర దూరము ఒకటేగదా !"

యుద్ధవర్ణనా సందర్భములో నీ కవి కలమెట్లుఁ బరవళ్ళుద్రొక్కునో గమనింపఁ దగును :-

"ఒక్కసారిగ పొంగివచ్చు గంగానదిపుంపులవలె, శోణానదిపొంగువలె, ఆంధ్ర సైన్యము లన్నియు ఆ రాత్రి అఖండవృష్టిలో పిడుగులై మెరుపులై మరుత్తులై పుష్కలావర్తకమహామేఘములై పాటలీపుత్రనగరకుడ్యములపైఁ గలసినవి."

బాపిరాజు గారి యుపమానము లలంకారముల కలంకారములు; జాతీయములు సహజభూషణములు. "వయసు రాబోవు ఆడుపులివలె కృష్ణవేణి, వెలి నురువునగవు లొలుకఁబోసికొనుచున్న" దఁట! "నీటినుండి వెలువడివచ్చి రెక్కలుచాచి ఎగిరిపోబోవు కొదమరాయంచవలె ఆ శిల్పి నవ్వులలో కావ్యములు గానము చేయు"నఁట! ఈ యుపమల యందము చెప్పనలవిగాదు. ప్రారంభించినది మొదలు పఠితలను సందిగ్ధతచే బఠనవ్యగ్రులను విలంబనాసహిష్ణులను నొనరించు నుపజ్ఞగల బాపిరాజు గారు నవలలలో మహాకవిత్వమును వెలార్చిన కవిశిల్పి.

## కనకాంగి 1

ఈ ప్రపంచమునం దొక్కొక్క కాలమున కొక్కొక్క నూతనాభిరుచి జనుల యందుఁ బొడమ చుండును. ఇట్టి యభిరుచి కాలనైసర్గికమునుబట్టిగాని సంఘస్వభావమునుబట్టిగాని కలుగుట వ్యక్తము. ఆయా ప్రకృతులనుబట్టి యిట్టి పరిణామములు గలుగుచుండుటవలననే జగమెల్ల నింత నిత్యమోహనమై మనకు జీవము నొసఁగుచున్నది. ఈ పరిణామములలో దోషములున్నయెడ నవి మానవుని నిక్కమగు పురోభివృద్ధికిఁ దోడ్పడనియెడల సంస్కర్తలు మహాకవులు వెలయనే వెలయుదురు; లోపముల సవరింపఁజూతురు.

ఆంధ్రవాఙ్మయమున సంస్కృతానువాదయుగమునుండి యాంగ్లనవలానువాద యుగమువఱకుఁ గలిగిన పరిణామములు పెక్కులు. ఈ కాలమున నింకొక విచిత్రము పొడచూపినది. ఆంగ్లవిద్యాధికుల కించుక మాతృభాషాభిమానము ప్రవర్తిల్లఁ జొచ్చెను. దానితో నాంగ్లేయుల నవలలనేగాదు; వారి నాటకములనుగూడ మన వారాంధ్రమునందు నవలీకరింప జొచ్చిరి. అట్టి ప్రయత్నములలో నీ నవల యొకటి.

---

1. సరస్వతీ గ్రంథమాల; కాకరపఱ్ఱువారి ప్రచురము; ప్రథమపుష్పము. సంపాదకులు, రచయితయుఁగూడ శ్రీ కాకరపర్తి సత్యనారాయణగారే; రచన 11-10-1923. ఇది మదరాసు రాష్ట్రములో మన్నత పాఠశాలా పాఠ్యగ్రంథనిర్ణాయక సంఘము వారిచే (8-1-1925) నామోదింపఁబడి పెక్కు బడులలో బఠనీయగ్రంథముగ నేర్పఱుపఁబడెను. క్రీ.శ.1936, '37లో ప్రెయినింగుశాలకుఁ బఠనీయము.

కనకాంగి యనునది షేక్స్పియరు మహాకవి '(ఒ)థెల్లో' నాటకమును దృష్టియందుంచుకొని రచింపఁబడిన నవల. అనగాఁ గథాసందర్భములు కొన్ని యా యాంగ్లనాటకమునుండి గ్రహింపఁబడి, మన దేశకాలాచారానుగుణముగ నిందు మలఁపఁబడినవి. విషాదాంతమైన యా యాంగ్లనాటకేతివృత్త మీ నవలలో మన దేశాచారమును మన్నించి మోదాంతమగుట మార్పులలోనెల్లఁ బ్రధానము.

ఈ నవలిక[1]లో దుష్టబుద్ధి యుపన్యాసము, వసంతుని మనోవైక్లబ్యము, బ్రాహ్మణులయు మర్మాదులయు సంభాషణ... ... నందము గూర్చును. ప్రతిప్రకరణమునకును హర్షచరితాదులయందువలె భావమునూచించుచు నారంభమునందు వ్రాయబడిన పద్యము... ... అంతేకాక యాదికాలమునుండి నేఁటివఱకు నవలారంభమున పద్యరచనాసంప్రదాయము మన్నింపఁబడుచుండుట యొక విచిత్రసంఘటన. తెలుఁగునవల యీ యాచారమును కేవలము సంస్కృతమునుండియే గ్రహించిన దనరాదు. ఆంగ్లేయనవలాకర్తలు స్కాట్, హార్డీప్రభృతిమహనీయులుగూడ నీ సంప్రదాయము నాదరించిరి[2]. ఇట్టివి సంస్కృతాంగ్ల వాఙ్మయములు రెంటిలోను వెలసి, యే మర్యాద, యే వాఙ్మయమునుండి తెలుఁగులో గ్రహింపబడెనో నిర్ధరింపఁబడరాక పోవుటవలన గూడ మన యాంధ్రనవలను ద్వ్యమూలకమనుట చెల్లును.

సర్వజనసాధారణైకవేద్యములగు మృదుమధుర బద్ధవచనకావ్యము లా దినములలో జాలతక్కువ. ఆ కొఱత దీర్చిన యీ నవ... ... దనూర్దవము పొగడొందెను. నవ్యభావముల కనుకూలమగు నవ్యశైలి; అం ... మణుల గుదుగుకొని యున్నది. తాత్కాలికసాంఘికాచారమర్యాదలపరిశీలనము చేదురాచారఖండనముచే గథలో బాఠకునకు నడుమనడుమ విశ్రాంతి చిక్కును. బ్రాహ్మణులవిందువంటి మృదుహాస్యరచితసన్నివేశములు గూడఁ గష్టనిర్భరసన్నివేశ... ... యుండి యెడయెడ జదువరులకు విరతిఁ గల్పించుచున్నవి. నవలలో బ్రధానపాత్రల ... ... దు వారివారి గుణశీలతారతమ్యము నిరూపింపఁబడినది. ఇ... మనోహర కథా... ... వర్ణనలును శ్రీ చిలకమర్తివారి ... ... దుట యీ నవలలోని విశిష్టత.

దుష్టబుద్ధి గలిగిన పశ్చాత్తాపము... ... సంతసించెను. కాని యాతనికి ... యుద్యోగము నిచ్చుటకు మాత్రము రాజిష్టపడలేదు. వసంతుఁ డెప్పటియట్లు జయం

1. ఇ... పుటలు 92; మూఁడవకూర్పు 1935. 2. శ్రీయుతులు చిలకమర్తివారు, వేంకట పార్వతీశ్వరకవులు, విశ్వనాథవారు, పెక్కుమంది దీనిని మన్నించుచున్నారు.

3 "కనకాంగి"-పుట 8 (మూఁడవకూర్పు 1935)లో, శ్రీ చిలకమర్తివారి (30-9-1923 నాటి) యభిప్రాయము పొందుపఱుపఁబడియున్నది.

తుని ముఖ్యసేనానాయకుఁడుగ నున్నాఁడు. జయసేనుఁ డాతనిక్రిందఁ బ్రధానానాయకుఁడుగ నుండెను. జరిగినవృత్తాంతమంతయు నొక పీడకలవలె నున్నది. నాయిక కవకాంగి యుందలకు గౌరవార్హ ప్రజామోదముగూర్చుటతో గథాసమాప్తి. 'ఒథెల్లో' నాటకకథ భారతీయసత్త్వదృష్టికి విరుద్ధమని నవలలో విషాదాంతము చేయఁబడలేదు. దీని నొక లోపముగా భావించి చింతించిన వారున్నారు. అట్టి యాంగ్లనాటకమును మించి యీనవల కరుణారసోల్బణ మెట్లు గలిగించును. కాన దీనిని విషాదాంతముఁ జేయుట యంధానుకరణదాస్యము. ఏమియు నందు దుష్టజ్ఞ మనుకొనఁ బడు. అనుల్బణరూపమున మన భారతీయసంప్రదాయము విషాదాంతవేషమును మించి యానందమొసగుట సంతసపడఁదగినది; విచారింపఁదగినదికాదు.

## ఫాస్టు[1]-(రెండుభాగములు)

ప్రసిద్ధజర్మను పండితుఁడు 'గెథే' చెప్పిన సుప్రసిద్ధనాటకమున కిది వెదురుమూడి శేషగిరిరావుగారి యనువాదము; రెండు భాగములు.

మొదటి భాగమునఁ బ్రధానాంశ మధికారదుర్వినియోగము; అభేద్యములైన కోటలయందు దురాచారుల దుష్కృతములు, మహాప్రళయమును వర్ణితములు; రహస్యములవలనఁగలిగిన తీవ్రమనోవేదనము విచిత్రముగఁ జిత్రింపఁబడినది; అడుగడుగునకును పాఠకులకు దిగ్భ్రమ గొల్పు సంఘటనలు.

రెండవభాగ మీశ్వరకృపాతిశయము, భక్తసంరక్షణము, భాగవతవిజయము, విమలప్రేమాభిరామ మగు - యువతీయువజనుల కల్యాణము మున్నగు నద్భుత ఘట్టములు గలది.

కాని యొక మాట యనకతప్పదు. ఈ యనువాదమునందు గెథే మహాశయుఁ డుద్దేశించిన తాత్త్వికదృష్టి ప్రసారితము గాకపోయెను. "లోకము లన్నింటిని గెలిచిన వారుగూడ నింద్రియానీకమును జయింపలేకపోవుదురు. ఆసురశక్తికి భౌతికతృష్ణకు వివశమైనయాత్మ కెన్నఁడును శాశ్వతప్రాప్తి యుండదు." మూలమునందలి యీ తాత్త్వికార్థ మనువాదములో గుబురుకొనలేకపోయెను.

మనలో దినచర్యమూలకకథాసంవిధానరూపముగల నవలల కిది యొక యొరవడి యగుచున్నది. ఇట్టివి చాలసకృత్తు; తెలుఁగున 'అతఁడు—ఆమె' వంటి వొకటి రెండు ప్రసిద్ధములు.

---

1. సరస్వతీ గ్రంథమండలి (రాజమహేంద్రవరము) వారి ప్రచురణములు (1921.

## విశ్వప్రయత్నము[1]

శ్రీ చాగంటి శేషయ్యగారినవల. ఇందలి రంగరచన మంతయు నాంధ్రదేశ ఇదిముతో సంబంధముఁగలదగుట యొకప్రధానవిషయము. కథాసంవిధానకల్పనమునఁ గౌశలమున్నది. పాత్రల గుణశీలపోషణమున సమర్థత ప్రదర్శితము. సాంఘికనవల యయ్యు నపరాధపరిశోధకనవలాలక్షణములచే నతిమనోహర మగుట యిందలి యింకొక ముఖ్యలక్షణము.

## బారిష్టరు పార్వతీశము[2]

ఇది శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారి తొలితి నవల[4] హాస్యరస ప్రధానమైన వానిలో శ్రేష్ఠము శ్రేష్ఠమును.

అన్నిరసములకంటెను హాస్యము బాహాటముగ శక్తిసామర్థ్యముకొల్లది, నెందఱకైన నెప్పుడైనఁగాని యనుభవింప దగినది. ఇందు శృంగారాదిరసముల వర్గములనందువలె రహస్యముగాని, వీరాదుల వర్గమునందువలె నుపద్రవముగాని యుండదు. ప్రపంచమునందింద్రియగోచరములగు పయనలనువస్తువులను గ్రహించుటలోను, బరిశీలించుటలోను, నీ హాస్యదృష్టికలవారి కిది కలదు; లేనివారి కిదిలేదు. ప్రత్యేకముగ నిరూపింపబడిన లక్షణములనేసద్యస్స్ఫురణముతో నాకళించుకొన్నవారుమాత్రమే దీని ననుభవించి యానందింపఁగలరు. ఇదియే దీనిలోని విశేషము. అందుచే దీనికిఁ దాత్కాలికప్రభావముమాత్రమే యుండును. అనఁగా హాస్యరసప్రధానములైన రచన లొండు

1. ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల (క్రీ. శ. 1921-1925).

2 రచనము డిశంబరు 1924; ముద్రణముపొందినదియు డిశంబరు 1924; "బారిష్టరు పార్వతీశం"–శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యముగారి వ్యాసము–"ప్రతిభ" సంపుటి ౨ పుటలు 268-276. అక్టోబరు–1937.

3. వీరి మలినవల "ఏకోదరులు" (క్రీ. శ. 1931).

4 దీని నాంధ్రవాఙ్మయసూచికి–ముద్రిత గ్రంథముల పట్టిక–అనుబంధము–పుట 4–వరుస 1–పంక్తి–3–కిటగా సూచించినది.

5. రసములలో గొన్ని పరస్పరము మిత్రములనియుఁ గొన్ని వైరిరసములనియుఁ గొందఱ వాదము. కొందఱమతమున నట్టివిరోధమే లేదు. అనఁగా నొక వర్గము వారిది వ్యాపీకరణ దృష్టి(Analytical view): మఱియొక వర్గమువారిదిసమీకరణదృష్టి( synthetic view).

రెండుపర్యాయములు చదువఁబడిన తరువాత దాని ప్రభావము పఠితలపై కలిగింపఁ గలదు. కాని యితరరసములు మొగము మొత్తకుండుట కిది యనుపానముగఁ దోడ్పడును. కొన్ని రసము లాద్యంత మొకటేవిధముగ నిర్వహింపఁబడవలసినప్పు డిది వైవిధ్యమునుగూర్చి మనస్సునకు విరతిఁగల్గింప గలదు.

పరిపూర్ణారోగ్యమునకు కారణమగు హాస్యరసప్రాశస్త్యమునుగూర్చి యెఱుఁగనివారుండరు. మన పూర్వాలంకారికులు దీనిని లోతుగఁ బరిశీలించిరి.ధనంజయాదుల మతమున నిది యాఱు విధములు[1]. ఇందు రెండురెండు విధములుగలిసి యుత్తమ మధ్యమాధమ హాస్యములుగ గుదురుకొనుచున్నవి.

పాశ్చాత్యులుగూడ నపరిమితపరిశోధన లీహాస్యమునుగుఱించి సల్పిరి. గ్రామ్య హాస్యమునకు వికృతియు, నాగరకహాస్యమునకుఁ జమత్కృతియుఁ బ్రధానములని యెల్లవా రంగీకరింతురు. శిష్టహాస్య[2] దుష్టహాస్యా[3]ద్యనేక విభేదములకు మన పురాణేతిహాసప్రబంధములయం దుదాహరణములు కొల్లలు లున్నవి.[4] ఇఁక నీ హాస్యమును బ్రతిపాదించు ననంతమార్గములం[5] యందు కూడ మనవారు సిద్ధహస్తులు; పాశ్చాత్యులకుఁ దీసిపోరు[6]. అయ్యును మనలో బందొమ్మిదవ శతాబ్దియందుఁ బాశ్చాత్యుల ప్రభావమున వచనరచనము ప్రత్యేకసాహిత్యశాఖగా వర్ధిల్లుటతో నీ హాస్యరసమార్గమునకు విస్ఫారప్రచారము కలిగినది.

క్రీ. శే. కందుకూరివారి 'సత్యరాజాపూర్వదేశయాత్ర లొక[7] విధముగ దీర్ఘయాత్రాకథాగుచ్ఛము. కాని పంతులుగారి యీ రచనను హాస్యమనుటకంటె నపహాస్య

1. ఈ మతమునే మన విన్నకోట పెద్దనార్యుఁడుగూడ నవలంబించినాఁడు. 2. Humour.
 3. False Humour.
4. చూడుఁడు—ప్రబంధములు—హాస్యరసము "నవ్వులు కురిపించే నేటి రచనలు" శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు."ఆంధ్రప్రదేశ్"—నవంబరు 1960, ఆంధ్రపత్రిక-శార్వరి సంవత్సరాది సంచిక (క్రీ. శ. 1961) పుటలు 74—98.
5. శబ్దాశ్రయము నర్థాశ్రయము మున్నగు మార్గములనుగుఱించి శ్రీ మునిమాణిక్యము వారి వ్యాసములు చూడఁదగినవి. "ఆంధ్రప్రదేశ్"—మే 1960, జనవరి 1961, మార్చి 1961).
6. హాస్యసృష్టి కల్పనముగూర్చి చూడుఁడు. శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారి వ్యాసము "హాస్య కల్పన" —ఆంధ్రప్రదేశ్, పుటలు 35—47; ప్లవ—ఉగాది సంచిక; మార్చి 1961.
7. Imitation of 'Gulliver's Travels-by Jonothan swift.

విశేష[1] మనుటయే సముచితమగును; అగియొక హేళనకావ్యము. ఆ హేళనములో మెత్తదనముకంటె గటుకుదనమే హెచ్చు. వీరేశలింగముగారి సౌకుమార్యమును గొంత సౌమ్యతతో గుర్తించినవారు చిలకమర్తివారు. అనగా వీరి 'గణపతి'యందు గ్రామ్యహాస్యము లేదనిగాదు. హాస్యవిషయమున నా పంతులుగారికంటె నీ పంతులుగారు కొంత మేలు. పై రెండు కృతులకంటె కటువైన పానుగంటివారి 'సాక్షి[2]' గాని, యించుక మెఱుగైన శ్రీ వవ్వూరి రామాచారిప్రభృతుల 'వదరుబోతు'[3]గాని వ్యాసరూపములు. కీ. శే. గురుజాడవారి 'కన్యాశుల్కము' గాని, వేదమువారి 'ప్రతాపరుద్రీయము' గాని నాటకరూపములు.

ఆంగ్లవిద్యావ్యాప్తితో పాశ్చాత్యుల హాస్యరచనాప్రభావము[4] మనపైఁ జెఱఁగనిముద్ర హత్తించెను. ఇరువదియవ శతాబ్దిలో నొకటి రెండు పదులయందుకంటె మూఁడవపదిలో హాస్యము సార్థకమై సునిశితమైనది. సాహిత్యజటిలరూపములైన నాటకాదులయందుకంటె సాహిత్యసరళరూపములగు నవలాదులయందది కుదురుకొనఁజొచ్చెను. అందులకుఁ బ్రథమోదాహరణము చెప్పఁదగినది శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారి 'బారిష్టరు పార్వతీశము'.[5]

శాస్త్రిగారు 'ఎడింబరో'ప్రయాణముచేసి నాగ్లేండ్లచ్చట వ్యావసాయక శాస్త్రమున నధ్యయనముచేసిరి; ఆనాటి యువకులలో పాశ్చాత్యకథాసాహిత్యము నపరిమితముగ బఠించిన కొద్దిమందిలో ప్రముఖులు[6]. తత్సాహిత్యమును బోలునట్లు వ్రాయుట వీరి సంకల్పము. మఱల దాని నాంధ్రవాతావరణమునకు, నాచారవ్యవహారములకు సరిపడునట్లుగ గూర్చిరి.

తెలుగువారి నాటి సాంఘికపరిస్థితిని, పాశ్చాత్యవిద్యాభ్యాస ప్రయోజనములను విదేశయాత్రావశ్యకతను సమన్వయించి, తదనుగుణముగ నొక వినోదమయపాత్రను

---

1. A kind of satire, or parady.
2. Imitation of 'Spectator' by Addison and steel.
3. Imitation of 'Tattler Essays'.
4. 'Don Quicksote' of Cervantes and all the novels of Dickens and Thackary.
5. ఇది యాంధ్రమున చలనచిత్రరూపగౌరవమునుగూడా బొందెను. దిగ్విజయము నొందెనా యనుట వేఱుమాట. అది చిత్రకళాశిల్పవిషయకము, దర్శకుని నస్తువరణ సామర్థ్య విషయకము.
6. Jerumkey Jerum [English man] author of "Three men in a Boat", "Three Men on the Bummel" etc., W. W. Jecubs [English author]; Mark Twain [American Author of Fiction]; Bary Pain [English man]; Bernard shaw, Besterton; Ode House, are the favourite authors, studied by Sri Mokkapati Narasimha Sastry.

సృజించి హాస్యరసప్రధానమగు 'శాస్త్రులుపార్వతీశము'ను గల్పించిరి. ఇందలి నాయకుని పేరే పార్వతీశము. వికృతాకార వాగ్వేష చేష్టాదులవలన హాస్యరసోత్పాదన మగునని గదా,మన యాలంకారికుల యభిభాషణము! మానవసంఘములోని యాచారవ్యవహారములయందును వేషభాషలయందును హావభావములయందును సర్వసామాన్యస్థితికి వైపరీత్యము దోచునట్లుగనుండుట హాస్యరసస్ఫురణమునకు గారణము. అనగా ననుపయోగితములు (అననుకూల్యములు),నసుందరములు నగునవి హాస్యమున కుత్తేజకములు. కావుననే సర్వసాధారణవైలక్షణ్యమును ననుపయోగిత్వాదిక దోషములును హాస్యజనకములని భారతీయాలంకారికులు పలికిరి. ఇందు సర్వసాధారణవైలక్ష్య మనుదానిలో ననౌచిత్యాదులనుగూడ నధ్యాహారము లుగ. బరింతుము. కడమరసములకు భంజకమగు ననౌచిత్యము, హాస్యమునకు రంజకమగును.

పరిహాసపాత్రుని జేయుటకొక యమాయికుడగు శ్రోత్రియబ్రాహ్మణకుటుంబము లోని గ్రామీణయువకుని సృష్టించి యాయనచే లండనుప్రయాణము చేయింపనెంచిరి. పార్వతీశ మిల్లు బయలుదేరినది తడవుగ మధ్య ననేకములగు బొరపాటులు చేయును. అవి యన్నియు నవ్వుగొలుపు ప్రమాదములు; అతని యజ్ఞానమును వెల్లడించినవి. పార్వతీశము ప్రవర్తనలోని యవివేకముచే శాస్త్రిగారు మనల నవ్వింతురు. లోకజ్ఞాన శూన్యుడగు నీ యువకుడు తల్లిదండ్రులతో జెప్పకయే నిదేశమునకు బ్రయాణమగును. 'టిక్కెట్టు' కొనునపుడుగూడ తన గమ్యము చెప్పడు. అడిగినచో నీ కెందుల కనును; మావారికి జెప్పుటకా? యని యాతని పునఃప్రశ్నము. ఆ యుద్యోగి 'టిక్కెట్టు' ఏ యూరికని యిచ్చుట? నిజము చెప్పుటకు జంకి యొకయూరుపోవుచు నింకొకయూరికని చెప్పి, యాయుద్యోగిని వంచించితి ననుకొని పార్వతీశ మాత్మవంచనముచేసికొనును. మదరాసు బొంబాయివంటి నగరములలో నీ తడు బడిన తికమకలు నవ్వుగొలుపక గలవు. నాయకుడాయా నగరములలో బొందిన దిగ్భ్రమను బ్రకటించిన యవివేకమును బడిన పొరపాటులను బ్రతిపాదించుచు బ్రతిసంఘటనయందును రచయిత హాస్యము కురిపించినాడు.

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు చెప్పినట్లు మొక్కపాటివారి పార్వతీశము, నన్నయ ఋష్యశృంగునకు బర్యాయపదము. ఇతనికి నాగరకలోకమంతయు నూతనము. ఈతని దొక విచిత్రజగత్తు; సర్వము నెఱుగవలెనని యాతని కొక యాసక్తి. తనకుబట్టనిది లేదు. సర్వము నతనిచే నతిక్రతము. అతిక్రమము, నతిమానము[1], నతివర్తనము[2], మున్నగునవి యాతని యందు బ్రత్యక్షములు. ఇతడటు చిలకమర్తి

1. దురభిమానము. 2. క్షమింపదగిన నేరము.

వారి గణపతివలె నంత మూర్ఖుఁడుగాఁడు; ఇటు గురుజాడ వారి గిరీశమువలె నంత గడు సరియుఁగాఁడు. ఈ నవలలో మణిప్రవాళ శైలివలనఁ గలుగు హాస్యమునకుఁ గాని, చమత్కారోక్తులవలని, హాస్యమునకుఁ గాని ప్రాధాన్యమే లేదు. నానావిధఘటనలయందును సన్ని వేశములయందును నాయకుడు ప్రదర్శించు నమాయికత్వమువలనిహాస్యమునకే ప్రాధాన్యము. అనఁగానట్టి యవిచారితప్రవర్తనకునిదర్శనములగుసందర్భము లీ నవలలో నెక్కుడుగలవు. ప్రవర్తనావిశేషమూపాదించు స్వారస్యమే యీ రచనకు ప్రాశస్త్యము నొసఁగుచున్నది. ఇట్టిది మొత్తముమీఁద మనభాషకు నూతనము. సన్ని వేశరచనాక్రమము గూడనిర్దుష్టముగ నిర్వహింపఁబడెను. ఇట్టి యనేకకారణములచే నీ నవల సంపాదించినయంతటి లోకప్రియత, హాస్యరసప్రధానమగు మఱి యేయితరనవలయు సంపాదింపలేదు. దీని ద్వితీయభాగము వ్రాయఁబడకపోవుటయే గౌరవ మయ్యెను; వ్రాసి యింతకీర్తి గడించుట దుస్సాధము. ఇం దొక వ్యక్తిగాని, సంఘముగాని పరిహాసమునకు గుఱి యగుట కానరాదు. ఆంధ్రుల నిత్యవ్యవహారములో నవివేచకునకు[1] బారిష్టరు పార్వతీశమనియు వలదనినను వెంటఁబడుదానికి 'బారిష్టరుపార్వతీశముహాట్'[2] అనియు రూఢి కలిగెను. దుఃఖక్లేశశ్రమశోభభూయిష్ఠమగు లోకమున కౌషధమగు హాస్యరస మున్నంత కాలము 'బారిష్టరుపార్వతీశ' ముండును. పార్వతీశము చిరకాలజీవి.

## యోగేశ్వరి[3]

భారతదేశప్రథమనవలాకర్త యనఁదగు బంకించంద్రుని వంగనవల కిది పులుగుర్త[4] లక్ష్మీనరసమాంబగారి యనువాదముకాని యనువాదము; రెండు సంపుటములు.

---

1. కార్యాకార్య జ్ఞానము లేనివాఁడు. 2. Pārvatisam's Hat.

3. ఈ నవల పేరు "యోగేశ్వరి".

4. ఆంధ్రీకర్త్రి యింటిపేరు పులుగుర్త; కరమ వర్ణక్రమములన్నియుఁ బొరపాటులు. (చూడుఁడు:— ఆంధ్ర కవయిత్రులు—పుట 134—ప్రథమ ముద్రణము, క్రీ. శ. 1953, అట్లే తెలుగు విజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటము: 'తెలుగు సంస్కృతి' పుట 1048—క్రీ.శ. 1959 ముద్రణము). ఈ నవలానువాదకర్త్రి కీ.శే. కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి శిష్యురాలను మది యసాస్తము. (చూడుఁడు:— ఆంధ్ర ప్రభ, సచిత్ర వార పత్రిక—పుట 50—క్రీ. శ. 13—7—1956). ఈ యోగేశ్వరి యను నవలను పద్యకావ్యమనుటయు, "అమూల్యము" అను నరసమాంబగారి పద్యరూపకథను "పద్యకావ్య సంపుటి" యనుటయువంటివి, "తెలుగు సంస్కృతి" (పుట 1048) యందలి పొరపాటులు. స్త్రీల నుపేక్షించినదని లోకము నిందాడు "ఆంధ్ర కవయిత్రులు" ఉపేక్ష వలనఁ జేసిన కోట్లాదిప్రమాదములే "తెలుగు విజ్ఞాన సర్వస్వము" మున్నగు పెక్కింటికి నొరవడి యయ్యెను.

దామోదర ముఖోపాధ్యాయుని 'అన్నపూర్ణ'యను వంగనవల రెండుభాగములది, దీని కనుబంధము వంటిది. ఈ కందువ దానెత్తి గి నాలుగుభాగములుగల యారెండు నవలల నివే పేళ్లతో నరసమాంబగా రనువదించిరి. అనువాదమనుటకంటె దీని నను సరణ మనుట మఱియు నుచితము.

'యోగేశ్వరి' సాంఘిక నవల. స్త్రీలుగూడ యోగశాస్త్రసంబంధములైన శక్తుల నెట్లుఁ బ్రకటింపవీలగునో యీ నవల తెలుపుదుచేయును. భక్తియోగము జ్ఞానయోగము కంటెః దక్కువది కాదని యీ నవలవలన ఋజువగుచున్నది. యోగేశ్వరి, పతిభక్తి మూర్తీభవము. ఘనానందస్వామి, జ్ఞానయోగమునకు నిలయము. ఒకరొకరికిఁ దీనిపోని ప్రేమగౌరవములు క్రమముగ గలవారు. ఆమెది ప్రేమ; అతనిది గురునందిని అని గౌరవము.

బంకించంద్రుని 'యోగేశ్వరి'లో స్త్రీ, భర్త నన్వేషించుటయు దామోదర ముఖోపాధ్యాయుని 'అన్నపూర్ణ[1]'లో భర్త కర్థాంగినియై సేవించుటయు నను విష

1. క్రి. శ. 1932 మొదటి కూర్పు. దీనికి రెండవ భాగము, ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలలో 73వ కుసుమము. ఈ కవయిత్రికృతుల తెలిసినంతవఱకుఁ బదునేడు. అందు నవలానుసరణములు నాలుగు, వాని క్రమమిట్టిది:— 'సుభద్ర' 'యోగేశ్వరి' 'అన్నపూర్ణ' 'అమరవిజయము', వివరములకుఁ జూడుఁడు:— సచిత్ర వారపత్రిక—ఆంధ్ర ప్రభ—పుట 50 (క్రీ. శ. 13-7-1960). ప్రమాదినామ సంవత్సరము (క్రీ. శ. 1878) ఈ నవలాకర్త్రి జననము. నేఁటి కీమెకు 84 యేండ్లు. తనపదునేనవ యేఁటికే "మహిళా కళాబోధిని" యను పద్యకృతి నిర్మించి, క్రీ. శ. 1901 నాఁటికే ప్రథమస్త్రీసమాజమును "విద్యార్థినీ సమాజ" మనుపేరిటకాకినాడ యందు నెలకొల్పి. యపుడే యీమె 'సావిత్రి' యను మాసపత్త్రికనుగూడ నడప నారంభించిరి. (చూడుఁడు:— రాణీసంయుక్త యను నవల తొలికూర్పు—అనుబంధము—13వ సంపుటలోని ప్రకటనము; అట్లే 'మార్జనాసు' నవల (క్రీ. శ. 1911) అనుబంధము - 12వ పుటలోని ప్రకటన) పిఠాపురము మహారాణిగారు వంగదేశమునుండి పిలిపించుకొనిన 'సుహాస' యను వంగ పండితురాలియొద్ద "వంగభాషాబాలబోధిని" చిన్ననాఁడే యీమె కఱచిరి తన 'సావిత్రి', పత్త్రికలో (౧) "క్షణకాల దివ్య చింతన", (౨) 'వజ్రపేటిక', (౩) 'కళావతి చరిత్ర' (కాశీఖండములోని కథ), (౪) 'కామమంజరి, (జక్కన విక్రమార్క చరిత్రలోని కథ) యను కథలను నీతిబోధనార్థము నేఁటి కర్థశతాబ్దికిఁబూర్వమేకూర్చి పిదప వీరు నవలానుసరణము లకుఁగడఁగుట క్రమముగ జరిగినది. తమకుసన్నిహిత బంధువులై యనేకరీతుల తోడ్పడిన శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారే వీరికి—గురువులని యొకరున్నచో—గురువులు. అన్ని విధముల నా నాలుగు నవల లీమె ప్రవృత్తికనుగుణముగ నున్నవి. నేఁటికి నీమె సజీవయై యాధ్యాత్మిక చింతలో నున్నారు.

యము లీ రెండునవలలకు ననుబంధమును గూర్చుచున్నవి. స్త్రీ ప్రధానధర్మ మను నది యీనవలలకు సేతువు.

## మొగలాయీ దర్బారు

కీ.శే. ధీరేంద్రనాథ్ పాల్ ప్రణీతమైన బృహద్గ్రంథమున కిది పెక్కు భాగ ములుగా వెలువడిన మొసలికంటి సంజీవరావుగారి సుప్రసిద్ధానువాదము; చరిత్రాత్మకమైన నవల. చిత్రవిచిత్రకథ లాధికారిక వృత్తముతో నేదో యొక తీరుగ ముడిపడియుండుట యిందలి విశిష్టత; సంఘటన లద్భుతములు; కడు సులభ మైనది శైలి.

ప్రథమసంపుటమునందలి నిగూఢములైన దారుణ శవప్రదర్శనములును బిశాచ కృత్యములును ద్వితీయసంపుటమునందు భేదింపఁబడినవి. తృతీయ చతుర్థ భాగములు చారిత్రకవిజ్ఞానప్రదములు.

ఈ నవల యందలి యన్నిభాగములకును సజీవత్వ మాపాదించునవి పదనైన సంవాదములు. కథోపకథావల్లరులతో నల్లిబిల్లిగొని సాంద్రమైన కథాసంవిధానాల వాలము, పఠితల కద్భుతమును జిగురింపఁ జేయ గలదు. మొగలాయి చక్రవర్తులనాఁటి చారిత్రకాంశముల కిది విజ్ఞానము పుకోశము.

## ఘటనా చక్రము[1]

పాంచకడీదేవ విరచితమగు ప్రసిద్ధ భీషణపరిశోధక నవలలకు గారపాటి ఆంజ నేయచౌదరిగారి యాంధ్రపరివర్తనము. అద్భుతమును బుట్టించు ఘటనల కిది నిధి యగుటచే నామసార్థక్యము కలది; పఠనౌత్సుక్యాపాదకము.

## జాగిలము[2]

ఇది సీరః ౦భద్ర యాజ్ఞ్యాత్మమైన ఫ్రెంచి నవలానుకరణము. ఈమె దశాధిక గ్రంథకర్త్రి. ఈగిల మతి భీషణమగు నిరూపకనవల. ఒకప్పుడిది సంయుక్త మదరాసు రాష్ట్రప్రభుత్వము వారిచే సున్నతపాఠశాలా పాఠ్యగ్రంథముగఁగూడ నిర్ణయింపఁ బడినది. ఇందలి హంతకుఁడు భయంకరమగు జాగిలము సాహాయ్యమున జేయు హత్యలు హృదయవిదారకములు. మనము నేఁడు జాగిలములమూలమున

---

1. సరస్వతీ గ్రంథమండలి (రాజమహేంద్రవరము) వారి ప్రచురణములు.
2. 1926–'27.
3. Vide 'Telugu Culture'. P-61, Lines 10,11(1960).

హంతకుల యాచూకి నెఱుఁగుచున్నాము. అపరాధ పరిశోధకులిందలి విషమసమస్యను భేదించుటకూడ నతివిచిత్రముగ నుండును. హత్యపైహత్యల ఘటనా చాతుర్యమే యీ యపరాధపరిశోధకనవలా విజయమునకు గీటుఱాయి.

## ఛిన్నహస్తము[1]

సుప్రసిద్ధమగు ఫ్రెంచినవలననుసరించి శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారిచే 2 నిది యనూదితము: రెండు భాగములు. ప్రథమభాగము, కథాకల్పన కౌశలమునకు దృష్టాంతము ఇందలి యద్భుత ఘటనలోని క్లిష్టత, ద్వితీయ భాగమున నయోఘముల్లైన ఫలితములను బ్రసవించినది. ఆ ఛిన్నహస్తమెవరిదో యెఱుకపడు వఱకుఁ బఠనోత్కంఠత తఱుగఁబోదు.

## శశిరేఖ

శ్రీ గుడిపాటి వెంకటచలముగారి ప్రథమనవలయని ప్రతీతి. ఇందు శశిరేఖ యను నానవ్మ్యవతి ప్రణయమును చిత్రింప బడినది.

1. సరస్వతీ గ్రంథమండలి (రాజమహేంద్రవరము) వారి ప్రచురణము. శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామిగారి "కుంకుమ భరణి", "కాంచనమాల" వంటి పెక్కు నవలానువాద ములకీ మండలియే యిక్క. అశోకునికాలమునాఁటి బౌద్ధధర్మ ప్రచారముల దెలుపు నవల "కాంచనమాల".
2. "ఆర్సీన్ లుపేన్", 'కాలసర్పి' (1920–22) మున్నైనవి వీరి యపరాధ పరిశోధక నవలానువాదములు. 'లుపేన్' మర్మములు మానవహంతకిమాయలు నవిర్వాచ్యములై పాఠకులను విస్మయపరిత చేతస్కుల నొనర్పఁగలవు. రహస్యాపరాధ పరిశోధక నవలలకుఁ బ్రధానలక్షణమగు నద్భుతమునకు వీరి 'కాలసర్పి' యొక దృష్టాంతము "సుశీల", "శ్యామల" వంటి నవలలను కూడ వీ రనువదించిరి. సుశీల చరిత్ర మెంత పవిత్రమో యంత హృదయ విదారకము; అయ్యును బ్రగాఢ ప్రణయాదర్శము జూపి యనేకుల బవిత్రులఁ జేయకమానదు. అట్లే 'శ్యామల' యందలిది శిథిలప్రణయ దుఃఖగాథ. సాంఘిక దురాచారములను ఖండించుఁ బ్రేమైక నవల యని దీనినిగుఱించి యొక్క మాటలో జెప్పవఁజాలును. కె.వి నరసింహరాజుగారు కూడ "సుశీల" ననువదించిరి.
3. దీని రచనా కాలము క్రీ. శ. 1921 కావచ్చును. ప్రచురణము క్రీ. శ. 1926. 'చలం' అనునది శ్రీ గుడిపాటి వెంకట చలముగారి జీవిత సాహిత్యమునుగుఱించి యెంతోపరిశ్రమించి వ్రాయఁబడిన బృహద్గ్రంథము, శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారిది. (దేశీప్రచురణ, వెల రూ. 10 లు– ప్రథమముద్రణ–నవంబరు 1958.) ఇందు అనుబంధములో శ్రీ చలముగారి శశిరేఖ ముద్రణకాలమునుగూర్చి చెప్పఁబడిన సంవత్సరముల విషయమునందుఁ బొందిక లేదు. "ప్రచురణ కర్తలు" అనుశీర్షిక క్రింద దీనిని 1926లో సరస్వతీగ్రంథమండలి మొట్టమొదటగా బ్రచురించినట్లున్నది ("చలం" పుట–555) 'రచనలు' అను శీర్షిక క్రింద–1921 అని యున్నది. ("చలం" పుట 557) 'నవలలు' అను శీర్షిక క్రింద క్రీ.శ. 1921 అనియే యున్నది. ("చలం" పుట 560) కావున శశిరేఖ ప్రథమముద్రణ కాలము, దాని ప్రథమా వృత్తియు నాంధ్రవాఙ్మయ సూచికయు మున్నగువానినిబట్టి తుద కిందు నిర్ణయముచేయఁబడినది.

శశిరేఖకు బాలమిత్త్రుడు రామారావు. ఈ యిరువురును స్వతంత్రించి వివాహము చేసికొన నిశ్చయించుకొందురు. ఇంతలో రామారావు వున్నతవిద్యాభ్యాసము నకై విదేశములకు బోవును. తల్లి దండ్రులు శశిరేఖను మెడవిఱచి మఱియొకని కిచ్చి కట్టుదురు. ఆలోగా శశిరేఖ కృష్ణుడను నింకొకనిని ప్రేమించును. భర్తతో బునస్సంధానము జరుగనుండగా గట్టుకొనిన భర్తను గాదని శశిరేఖ కృష్ణుని యింటికివచ్చి యాతనితో నుండిపోవును. శ్రీకృష్ణునితోడి ప్రేమకలాపమువలన శశిరేఖ సుందరరావను వైద్యునియింట నుండవలసిన పరిస్థితులేర్పడినవి. విదేశములనుండి వైద్యుడై తిరిగివచ్చిన రామారావు నచ్చట శశిరేఖ చూచుటతటస్థించినది. మఱల నారామారావును ప్రేమించి యామె యాతనితో నుండిపోవుటయు జరుగును. ఇది శశిరేఖయను నాయిక జీవిత చరిత్ర.

శ్రీ చలంగారు వేదపురుషులు. వారి రచనలే వేదములు. సాధారణుల కవి యర్థమగుట యసంభావ్యము. వాని కనేకోపనిషత్తులు వెలువడినవి. ఎందఱెందఱో భాష్యకారులు దేశమునిండ; చెప్పలేము. 'శరద్దర్శనము'లవంటివే కొంతవఱకు నీచలము దర్శనములును. ఆంధ్రమున నన్నయ్య తిక్కనాదికవులకుగాని యాంగ్లమున షేక్స్పియరు వంటివారికిగాని సంస్కృతమున గాళిదాసు భవభూతులకుగాని, ప్రత్యేకముగా బృహద్గ్రంథరూపమున జీవితచరిత్రములని యీనాటికి నేర్పడినట్లువినబోము. వారినిగుఱించి యనేక సమస్య లీనాటికిని బరిష్కరింపబడనివి గలవు. దీనికి హేతువులు పెక్కులున్న . ఆ హేతువులలో వారి కీ వీరమాహేశ్వరుల వంటిభక్తులు భుజకీర్తులవంటి వందిమాగధులను లేకపోవుట యనునది యొకటి. ముందుగ నన్నయసాహిత్యము, తిక్కన సాహిత్యము, ఎఱ్ఱన సాహిత్యమునని యెవరికి వారికొక సాహిత్యముండుటయు నానాడు లేదు. ఈ యపార సౌకర్యము లన్నియు నే డుండుట వలన చలముగారిలోని ఋషిత్వమును బ్రహ్మత్వమును వేదస్వరూపత్వమును దివ్యత్వమును మహావిమర్శకులు మనకు వెల్లడింపగలుగుచున్నారు. 1

---

1 "చలం"అనెడి బృహద్గ్రంథము శ్రీ చలముగారి జీవితమును సాహిత్యమునుగూర్చి ప్రస్తుతించు వేదము. రచన, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు, శ్రీదేశిప్రచురణము. ప్రథమ ముద్రణము. నవంబరు-19 8; పుటలు 563; వెల పది రూపాయలు. చలముగారి సాహిత్యము గూర్చి జరిగిన ఖండనలకు జాలవఱ కిందులో సామాధానములీయబడినవి. ఇది గ్రంథమే కాదు. ఇష్టుల యొక్క యభిప్రాయముల పట్టిక; భాషమాత్రము చాల గొప్పదియు. జీవమైనదవియు బొగడొంది, చలంగారి భాషవలెనే చదువుకొనినవారికి దప్ప, చిదమవారెల్లరకు నర్థమగునవెడి కొందఱమొఱ గలదను సంగతి వేఱు. దానిని వినువారెవ్వరు?

శ్రీ చలముగారికిఁ గొన్ని ప్రధానాశయములున్నవనియును గొన్ని వాదములు సిద్ధాంతములు నున్నవనియు నందురు. నేఁడట్టివి లేనివారెవరు? లోకమేకీభవించుటతో బనిలేనప్పు డెందఱు కెన్ని యేనియు వాదము లుండవచ్చును. నవలలుగా వారికృతులను నవలాకర్తలుగా వారివ్యక్తిత్వమును బరిశీలింప బడునప్పుడు, వారి సూత్రములు సూక్తులు, మతములు మున్నగునవి యౌపచారికములు; నవలా లక్షణములు, నవలా కర్తల యాశయములు మొదలగువానికే విమర్శనలో ప్రాధాన్యము; ఒక యితివృత్తము, కథాసంవిధానము, పాత్రపోషణము, సంభాషణచాతురి, శిల్పము వంటివి మెచ్చుకొనఁ గలవో యాయా నవలలలో నౌచితినిబట్టి యవి యచ్చటచ్చట నింతదనుకఁ బరామర్శింప బడినవిగదా! అట్లే చలముగారి శశిరేఖ వంటివికూడ బరామర్శింపఁబడవలెననుట యంత ధర్మము కాదు. అట్టి విమర్శన పద్ధతి వలన చలము గారికి న్యాయము జరుగదు. ఏ పద్ధతి వలన వారి నవ్యత వెల్లడికాఁగలదో, యా పద్ధతి నవలంబించుటయే సహృదయవిమర్శకధర్మము. ముందు తమవి నవలలేగావని వారందురు[1]. అయినను వానిని నవలలని వానికి బ్రహ్మాండమగుఁబట్టుకారము విమర్శకలోకముపై నఁబడినది. వారు తమవి నవలలేగావని పైఁకి మాటవరుసకన్నను నవలల పోటికి వానిని బంపుటవలన[2] నవి నవలలేయనుట వారి యాంతర్యముగా నిర్ధరింపఁబడినది. కావున శశిరేఖవంటి వారి కృతులను నవలాదృష్టితో బరిశీలింపక తప్పదు. శశిరేఖకుఁ బీఠిక రచించిన స్వామీ శివశంకరులు గూడ దానిని నవలయేయని నిర్ధారించిరి. చలముగారివి కొన్ని నవల లున్నవనియు వానిని మాత్రము సాధారణ విమర్శన పద్ధతులలో విమర్శింపరాదనియు నింతకుఁ దేలినది.

విమర్శన మెన్నోవిధములు. ఒక్కొక్కరి దృష్టిపథమునుబట్టి యాయా రీతులేర్పడుచున్నవి. సందర్భానుసారముగా నిచ్చట దానిని స్థూలదృష్టిచే[3] మూఁడు తెఱఁగు లనవచ్చును. ఆత్మాశ్రయము, పరాశ్రయము, మనస్తత్వసంబంధి విమర్శనము (వ్యక్తి వైశిష్ట్యనిర్ణాయకము) నని వానికిఁ బేళ్లు[4].

విమర్శకుని యనుభవాభి రుచులను బరిశీలనశక్తిప్రతిభలను గూడ నాత్మాశ్రయ విమర్శన పట్టియిచ్చును ఇతరుల యన్వీక్షణమున కందని విశేషాంశములు రచనల

---

1. వర్జీనియావుల్ఫ్ తనవి నవలలేగా వనిన కొలఁదియుఁ బాశ్చాత్యప్రపంచ మామెకుఁ గైవారముఁ బట్టుట శ్రీ చలముగారు వినియుందురు.
2. క్రి. శ. 1933లో శ్రీ చలముగారు "మైదానము" నాంధ్రవిశ్వవిద్యాలయ మేర్పఱచిన నవలలపోటికిఁ బంపిరి. ("చలం" "చలం జీవితంలో ప్రధాన తేదీలు"—పుట 553 )
3. తొమ్మిదివిధములని సూక్ష్మతి సూక్ష్మమగు విభజన మొకటికలదు. అది యథార్థ స్థానమున మటంకింపఁబడుమ.
4. Subjective, objective and Psychological methods of criticism.
5. Lamb, Hazlitt, and Coleridge belong to the Subjective school of criticism.

యందుఁగనిపట్టి సహృదయులకు విప్పిచెప్పు సమర్థత యీ విమర్శనాపద్ధతియందుఁ గలదు. పరాశ్రయవిమర్శనమును శాస్త్రసమ్మతవిమర్శన మనియుఁ బ్రామాణికవిమర్శన మనియు ననవచ్చును. సహృదయరంజనము వడసిన లక్ష్యముల నాధారముగాఁ జేసికొని లక్షణకర్తలు సూత్రీకరించిన ప్రమాణములు, తదనంతర గ్రంథవిమర్శనా పద్ధతికి నాదర్శప్రమాణములై పరిణమించినవి; తత్ప్రమాణానుకూలములు గుణములు; తద్విరుద్ధములు దోషములు. ఇట్టి ప్రామాణికవిమర్శన, సారస్వత విభాగముల కున్నత స్థాయి సమకూర్చును. కాని రచయితతో దీనికిఁ బ్రసక్తిలేదు. రచయితృమనస్తత్త్వము వభిరుచివంటివి దీనికి సంబంధింపవు. శబ్దార్థములు రసభావములు మున్నైనవి దీనికిఁ బరమార్థములు.

రచయిత యొక్క జీవితముతో రచనను సమన్వయించి రచనాసూత్రముచేపట్టి రచయితృవ్యక్తివైశిష్ట్యమును దెలిసికొనుదానిపేరు మనస్తత్త్వ సంబంధివిమర్శనము. దీనినే వ్యక్తి వైశిష్ట్యనిర్ణాయక మనియు నందురు. ఇది రచయితదైన వ్యక్తిత్వమునకుఁ గల ప్రాముఖ్యమును గుఱుతించిన పిదప వెలువడును. పఠితృలోక ప్రాబల్యమునఁ జెరిఁగి లబ్ధప్రతిష్ఠులైన రచయితల ప్రమాణమును బురస్కరించుకొనునట్టిది. రచనకు జీవితమే యితివృత్తము. ఆ జీవిత మొకఖని. దానినుండి రచయితకొంత స్వీకరించును. సేకరించిన దానిలో నొకకొంత రచనమూలమున మన కందఁగలదు. ఆ యందినభాగమునుబట్టి విమర్శకుఁడు పరిపూర్ణ రూపమును నిర్ణయింపఁ గలఁడు. రచనలోని భాగమును జీవితముయొక్క సంపూర్ణరూపమును విమర్శకుఁడు కనిపట్టిగాని విమర్శన వెలార్పఁడు. జీవితమాధుర్యము లెఱిఁగించు నిట్టి కావ్యమును విశ్వశ్రేయమనుటలోఁ గల రహస్య మిదియే.

శ్రీచలంగారి నవలల విమర్శించునపుడు వ్యక్తివైశిష్ట్య నిర్ణాయక విధానమే మన్నింపఁదగును. కాని దీని కొక బాధక మున్నది. అఖండరూపసౌందర్యసందర్శనానందముచే దాండవించుటయందు విమర్శకుఁడు కవికల్పుఁడు; ఋషితుల్యుఁడును. సృష్టికి ప్రతిసృష్టిఁ జేయుటలో గవి యెట్టివాఁడో, ప్రతిసృష్టినుండి సృష్టికి నిచ్చెన వేయుటలో విమర్శకు డట్టివాఁడు. అనఁగా నుత్తమవిమర్శకుఁడు మహాకవివలె నవధర్మ ప్రతిష్ఠాపనముచే యుగకర్త కాఁదగును. నిష్పాక్షికమైన విమర్శకదృష్టి యిష్టుల నాకసమునకెత్తదు; అనిష్టుల నధఃకరింపదు. ఈ కఠోరవ్రతమునఁ గృతకృత్యులు కావలయునన్నచో విమర్శకు లింకొకపద్ధతి నవలంబింపవలెను.

అది సృజనాత్మకవిమర్శనపద్ధతి. రచయితృమనోభావములను గ్రహించుటకుఁ బ్రయత్నించి తదనుగుణముగ గుణదోషములను దెలిసికొని యిందుఁ దన యుద్దేశమును విమర్శకుఁడు వెల్లడించును. రచయిత ననుసరింపఁడు; కాని రచయితసృష్టిని పరిపూర్ణ ముగ నర్థముచేసికొనియే యతఁడు తన స్థితిలో దాను జెప్పఁగలఁడు1. యథాశక్తి నిష్పక్షపాతిత్వము బూని శ్రీ చలముఁగారి మహోదారభావముల బరిశీలించినచో నీ వక్ష్యమాణవిషయములు స్ఫురింపక పోవు.

శ్రీ చలముని నవలలకు, నాంధ్రభాషలో నితరుల నవలలకు వ్యత్యాస మున్నది. ఆయన లింగజ్ఞానసంబంధిరచనలు చేయును. ఒక్క నవలలే కాదు; వారి రచనలన్నియు నట్టివి.

ఒకప్పుడు సంస్కృతప్రాకృతములు, నిన్న మొన్నటివఱకు నాంగ్లము, నేఁడు హిందీయుఁ దెలుఁగును బాలించుభాషలు. ఎప్పుడు నెక్కడ నేదేశభాషకు స్వతఃప్రకాశ్తి లేదు; ఉండఁజాలదు.

సంస్కృతపండితుల తరువాత నధికముగ మనలో నాంగ్లపండితులే యాంధ్ర మున నూతనసాహిత్యప్రక్రియలను బ్రవేశపెట్టుటతో పాటుగ నూతనభావములనుగూడఁ దీసికొనివచ్చిరి. ఆ నూతనభావములు చాలవఱకుఁ బాశ్చాత్యభాషలవారివి. అట్లుఁ దెచ్చినవారిలో శ్రీ చలముగా రగ్రేసరులు. దేశకాలపరిస్థితులఘోష మన్నింపని కారణ ముచే నా రందఱను మించినవారుగూడ; కలియుగచతుర్థపాదాంతప్రళయమున నవత రించి, యుగధర్మమును నిర్వర్తింపఁజేయవలసినవారు; "సాహిత్యబాణ" మేకాదు; వీరు 'సాహిత్యాణుశతఘ్ని' యుఁగూడ.

పాశ్చాత్యదేశములలో బ్రేమించి వివాహమాడుదురని వారు చదివిరి. అది మన గాంధర్వ రాక్షస పైశాచాది వివాహరూపములలో నొక్కొక్కరూపము నాయా పరిస్థితులనుబట్టి తాల్చుచున్నసంగతిని వారు మన్నింపరు. ఎంతప్రేమించి వివాహమాడి నను 'విడాకులు' ఆ దేశములలో దప్పుటలేదు. ఆ దేశములలో కుశాగ్రబుద్ధులు కొంద ఱీయంశమును గూర్చి యాలోచనలుసాగించి సాగించి చివరకొకసందేహపరంపర వెల్ల డించినారు. ముందు వివాహ మేల? పిదప విడాకు లేల? పెండ్లిలేకయే ప్రేమించు

1. "నా మీద వాటి (శ్రీ చలంగారి రచనల) ప్రభావం అధికంగా ఉన్నా వారిలాగే వ్రాయా లనే సంకల్పం ఎప్పుడూ లేదు." ("చలం" జీవితం—సాహిత్యం) దేశిప్రచురణ, పరి చయము, పుట 2, పంక్తులు 12,13, (ప్రథమ ముద్రణము—నవంబరు 1968).

కొనరాదా ? యని యీ సంశయసారము1. ఔ నవిరి పాశ్చాత్య భావుకులు. దానికిఁ 'ప్రేమసిద్ధాంత' మని పేరు. ఆ దేశములలో నా సిద్ధాంతము ప్రచారములోనికి వచ్చెను. ప్రేమ యున్నంతవఱకే స్త్రీ పురుషులు కలిసియుందురు. అది నశించినచో నింకొకరితో గొన్నాళ్లు ప్రేమకలాపము. ఈ విధమగు ప్రేమతత్త్వము, నీ వివాహపద్ధతులుగూడ నా చదువులతో శ్రీచలముగారికి నచ్చినవి. ఆంగ్లవిద్యాసారమునఁ బారము ముట్టిన వారున్నారు; కాని వారి కా విజ్ఞానము నచ్చుటకుఁ బూర్వజన్మవాసనావిశేషముగూడఁ గావలెనుగదా ! వారికి భారతీయమైన విజ్ఞానముమాత్రమే యలవడెను. శ్రీ చలము గారికిఁ బాశ్చాత్యనాగరకతయు భావుకతయుఁ బట్టువడినవి. భారతీయమైన విజ్ఞానము వారి కా దినములలో నరగానికిఁ గొఱగాలేదు.

శ్రీ చలముగారిదృష్టిలో ప్రేమ యనునది యొక పుష్పము2. పుష్పసౌరభము వలెనే ప్రేమయు క్షణభంగురము. భార్య మరణించినచో పురుషుఁడు వేఱొక స్త్రీని పెండ్లియాడుచున్నాఁడు. అట్లే, యొక ప్రియునిమీఁది ప్రేమ నశించినచో స్త్రీయు నింకొక ప్రియునితో గలిసియుండును.

పాశ్చాత్యుల ప్రేమసిద్ధాంతానుసారముగఁ బ్రణయశీలమునందు స్త్రీకిఁ బ్రాధాన్యము. ఆమె యొకరినిగాదు; ఇద్దరిని గాదు; ఎందఱినైనఁ బ్రేమింపవచ్చును; ఒకే సారి ప్రేమింపఁగలదు; అది యామె యిష్టము.

వివాహ మొక బంధము; భార్యాభర్తలు కలిసియుండుటతప్ప దానియందుఁ బ్రేమలేదు. ఈ వైవాహికపద్ధతివలనఁ గోమలభావము లెన్నియో నశించుచున్నవి; స్త్రీ హింసింపఁబడుచున్నది యనియు నొక భావము. ఇది నిర్ణయాత్మకవిమర్శనవంటి వైఖరిగలది. ఇట్టి విమర్శనయందు విమర్శింపఁబడు విషయమునుగూర్చి న్యాయస్థానము నందువలెఁ జర్చింపఁబడి తీర్పుచెప్పఁబడును. ఈ తీర్పుచెప్పుటలో విమర్శకుని యను భవమే యనుభవము; వాని లోకజ్ఞానమే లోకజ్ఞానము. సమస్తము కూపస్థమండూకత. అందుచే నిట్టి పద్ధతిలో విమర్శకుని బరిమితజ్ఞానము, పక్షపాతమువంటివి లోకమును, గృతిని, గృతికర్తనుగూడ నధోగతిపా లొనర్పఁగలవు.

---

1. "వివాహంకాకపోయినా స్త్రీ పురుషులు భార్యాభర్తలుగా ఉండవచ్చును—దైవసాక్షిగా" ('చలం'-పరిచయము-పుట 3, పంక్తులు 20,21).

2. "ప్రేమ పుష్పమే ! స్త్రీ శరీరం తనదికదా, తనకి చిక్కిందికదాఅని పురుషుఁడు నలిపి పాడుచెయ్యకూడదు. అన్నాడు చలం ఒకచోట." ("చలం"—పరిచయము-పుట 3, పంక్తులు 8,9) ('స్త్రీ'-పుట 161) ఇట్టివి వారి మహోదారాశయములకును, మహోత్కృష్ట భావకునకు నిదర్శనములు.

శ్రీ చలముగారి జ్ఞానము భారతీయకుటుంబపద్ధతికి వివాహవిధానమునకుఁగూడ వ్యతిరేక మైనది. ఇట్టివారు పాశ్చాత్యులలో బలువురు. వివాహవిధానములో నెడనెడ లోపము లేర్పడినచో వానిని మనపూర్వులు సంస్కరించుచు వచ్చిరఁట! శ్రీ చలము గారు తా మా ప్రతిబంధకమైన వివాహధర్మమునే నిర్మూలింతురఁట! సర్వానర్థములకు నది యాలవాలము. దానిని సమూలముగ నెకలించుట వారివిధి. ఇట్టి ధర్మములు మనవారికి నూతనదృష్టిప్రతిపాదకములు. ఇవి భారతీయములైన సువర్ణశృంఖలలను ద్రెంచి వైదేశికములైన యినుపసంకెలలఁ దొడుగుచున్నవి.

'శశిరేఖ' యను వీరి నవల చివరిభాగములో నీ సిద్ధాంతము ప్రతిపాదితము. ఇతర నితర రచనలయందుకూడ నిదియే! కావున నిచ్చట దీని చరిత్ర సంగ్రహింపఁబడినది. ఆ సంగ్రహించుటకూడ సృజనాత్మకవిమర్శనపద్ధతిలో జరిగినది. నవల యదభిముఖముగఁ జెప్పఁబడినదో తదభిముఖముగనే యర్థముచేసికొనఁబడెను. కాని, నవలాకర్తమతమే మతమని దాని నే యభినందించు పద్ధతిలోమాత్రము విమర్శన నడవలేదు.

స్వామి శివశంకరులు 'శశిరేఖ'కుఁ బ్రవేశిక రచించిరి. అందలి విమర్శన వ్యక్తి వైశిష్ట్యనిర్ణాయకపద్ధతిప్రకారము జరిగినది. అనఁగా నది రచయితృమనస్తత్త్వసంబంధ మైన విమర్శన.కృతి కర్తృ మనఃప్రవృత్తులను బరిపూర్ణముగ నెఱిఁగి కృతి విమర్శించుట యన నదియే! కర్తనుగూర్చి పూర్తిగఁ దెలిసికొనుటయే దానిగుణము. శ్రీ చలము గారి యన్ని రచనలకు నిది యన్వయించును. వక్ష్యమాణము దాని సారాంశము:-

దేనికైనఁగాని జీవశక్తి వ్యక్తమనిపించుకొనుట కొకటి వస్తువు, రెండు రీతియుఁ బ్రధానములు. ఆవస్తువునందుఁ గవినూతనభావములు మున్నగునవి యిమిడియే యుండును. వస్తువునుబట్టియు దన్నిర్వాహణవిధానమునుబట్టియు సాధారణపాఠకులకు 'శశిరేఖ' యాందోళన గల్గింప గలదు. అనఁగా నా గ్రంథములో జీవమున్నది. ప్రాణ గల గ్రంథములు చాల నసమర్థములు; ఇతఃపూర్వము మనకు నీహారస్వరూపముగ నున్న వృత్తులను, సంశయాపన్నమైన భావములను దృఢపఱుపఁగలవు; లేదేని పురాతన భావనలను బాఱఁద్రోలి నూతనభావములను రగులుకొలుపఁగలుగును.

ఈ దృశమలగు నవ్యసాహిత్యప్రక్రియలను బఠించునపుడు సహన మత్యావశ్య కము. తమ సుస్థితిరోహవిరుద్ధములగు నంశములు ప్రతిపాదింపఁబడినపుడు పఠిత లుద్వే గులు గారాదు. గ్రంథ మాసాంతమగువఱకు శాంతముఁ బూనవలెను. కవిహృదయ మేమి? దాని నే విధముగ నిర్వహించెను? కావ్యము రసవంతముగ నున్నదా? లేదా? మొత్తముమీఁద గ్రంథతాత్పర్యమేమి? యనెడి ప్రశ్నలువేసికొని తగు సమాధాన ములు చెప్పుకొనుట యుచితము.

సాంఘిక ధర్మములకంటె మానవధర్మము ఉత్తమమైనవి. సంఘము తనస్థితి కొఱకై తాత్కాలికముగ నేదో నియమవాగురల నల్లుకొనును. సంఘ మధికమా? సాంఘికు లధికులా? యను ప్రశ్న విజ్ఞుల నెపుడు బాధించుచునే యుండును. సాధారణ బుద్ధులకు సంఘమే యధికము. ఆవశ్యకమైనచో సంఘశ్రేయమునకై వ్యక్తులను బలిదానముచేయుట ధర్మమనియుఁ బెక్కండ్రందురు. కాని యీ క్లిష్టసమస్య నున్నత దృష్టితో బరిశీలింపవలెను. ఏలన, స్థితప్రజ్ఞులను గనుటయే సంఘమునకుఁ బరమ లక్ష్యము. కాఁగా సాంఘిక నియమములను నిజౌన్నత్యనిమిత్తమై యతిక్రమించు వ్యక్తులను ధర్మేతరులనుటగాని, విప్లవకారులనుట గాని సమంజసము కాదు. సాహిత్యకుఁడైన యీ నవలాకర్త నిజప్రజ్ఞానుసారముగాఁ బ్రేమతత్త్వ నిరూపణమునకై ప్రయత్నించినాఁడు. అశాశ్వతమైన ప్రపంచములో శాశ్వతమైనది యొక్క ప్రేమయే యని భావుకుల యభిప్రాయము. ప్రేమ కొఱకుఁగాను సమస్తము పరిత్యజింపఁగలము; ఏ కష్టములనైనఁ బడఁగలము; స్వార్థత్యాగులము కాగలము; ప్రేమయనునది లేకపోయినయెడల లోకమునకు నాగరకత యలవడెడిదియే కాదు. ప్రేమవలననే మానవులు దేవతలకు సన్నిహితు లగుదురు.

ఈ నవలయందలి నాయిక 'శశిరేఖ' సర్వసాధారణ సహధర్మిణి కాదు. ఈమె ప్రేమస్వరూపిణి కావుననే తన కర్మ డగు ప్రియుని కోసమైయెట్టి త్యాగమునైనఁ జేసినది. స్వాతంత్ర్య రహితలైన సాధారణ యోషితలవంటి చిరంటిగాదు, శశిరేఖ. స్వధర్మప్రకార మీమె నిస్సందేహముగాఁ బతివ్రత.

శశిరేఖ యిర్వురుపురుషులఁ బ్రేమించును. శ్రీ చలముగారి 'మైదానము'నందు 'రాజేశ్వరి' యు నిదే పద్ధతి; ఏకకాలమునందిర్వురిని బ్రేమించును. ఇట్లిరువుర నువ్వురఁ బ్రేమించుట మనకు వింత; యసహజము; మన మెలఁగిన సంఘమున నిది విడ్డూరము. కాని కొందఱు రచయితలు కొన్ని తెగల నెఱుఁగుదురు. అం దిట్టి సంగతి యాశ్చర్యము కాదు. సుప్రసిద్ధ నవలాకారుడు థామస్‌హార్డీ యిందలి స్వాభావికత్వమును సమర్థించినాఁడు.

శశిరేఖకు సౌందర్యారాధనమే నీతి. ఆమె ప్రేమైకజీవిని. ఇదియే యీనవలయందలి సారము.

శ్రీ చలముగారినిబట్టి పురుషునకుఁ బ్రేమయనునది ఖేల. స్త్రీకి నట్లుఁగాదు. ప్రేమయే యామెకు జీవనము. స్త్రీ తనకును దాను బ్రేమించువానికిని శాశ్వతమగు సంబంధమున్నదని భావించును; దన్నుఁబ్రేమించినందులకై యాతనియెడఁ బ్రేమఁ జూపక మానదు. అది యామె కృతజ్ఞత. పురుషుని నైజము వేఱు. తన యిష్టము తీరఁగనే యతఁడు పూర్వ వృత్తాంతము నెల్ల విస్మరించును. స్త్రీ యొకనిని

ప్రేమించుచు నింకొకనితో గాలము గడపఁగలదు. కాని పురుషుఁడట్లు సులభముగఁ జేయఁజాలఁడు. లోకవ్యవస్థ యిట్టిది గాక పోయినచో సృష్టికే యాటంకమువచ్చి యుండెడిది. ఈ రీతిగ నర్థముఁ గల్పించు కొన్నప్పుడు 'శశిరేఖ' యుత్తమ నవల కాకపోదు.

ఈ నవలయందు కథాభాగమున గ్రాంథికభాషయు, సంవాదములయందు వ్యావహారికమును గలదు. ఇది యానాటి కింకను చలముగారిపై వ్యావహారికభాషావాద ప్రభావముద్ర పడలేదనెడి సంగతికిఁ దార్కాణ. ఇందలి నాయికానాయకు లదియుఁ బ్రకృతిదియు నగు వర్ణన లాంధ్రప్రచారిణివారి నవలలను బోలియున్నవి. శ్రీ చలముగారి మతమున నవల లనఁగా గేవలము కాలక్షేపము కొఱకు చదువఁ బడు పుస్తకములఁట! కాని యది నిజముకాదు. నవల లనఁగా వారిదృష్టిలో రచయిత తన మతమును బ్రచారము చేయుట కేర్పడిన సాధనము. కావున నిట్టి నవలలకు విసుగు పుట్టింపక వేగమే చదివించివేయు గుణము గలుగుట యావశ్యకము. నిష్ప్రయోజన నోత్కంఠ గలిగించుట కెట్టి సాధనముల నవలంబించుటకైనను చలముగారు వెను దీయరు. ఏలన వారి సిద్ధాంతములకుఁ బ్రచారము కావలెను. వారి యన్ని నవలల యందువలెనే 'శశిరేఖ' యందుకూడ జాతకకౌతూహలో ద్దీపన మున్నది. కాని యిది చాల వఱకు భాషాసంబంధి. పాశవికకామప్రకోపకములగు రసభావముల ధారయే వీరిశైలి. ఆ భాషలోని పదనుగూడఁ జదువరుల కింద్రియోద్రేకముఁ గల్గించుటవలన నేర్పడుచున్నది. కామప్రకోపనముఁ గొల్పు భావముల బ్రకటించుటవలన భాష చుఱుకైనదిగా నుండునేగాని తదన్యముకాదు[1]. ఇంద్రియోన్మాదమును రేకెత్తింపని రీతిగ వారి శ్రీ చలముగారి శైలి మెప్పుపొందఁజాలియుండినచో భారతజాతి ధన్యమైయే యుండెడిది. స్త్రీ పురుష సంబంధమగు నావేశము లేనిదే తమకుఁగలము సాగదని వారే నుడువుదురు[2]. కాన శైలి, భావావేశము నుండి విడిపడునట్టి భిన్న సామర్థ్యము కాదు. అభిప్రాయావేశములకును శైలికిని నవినాభావసంబంధము. కొందఱు వారిశైలిని మెచ్చుకొనుట యనఁగా వారి భావములను దా మెఱుఁగకయే మెచ్చుకొనుట[3].

---

1. "నాకు భాషతెలీదు. పుస్తకప్పుడు రాయడమంటే ఒక్క ముక్క సరిగ్గా రాయలేను. ("కవిగా చలం") పుట 108.
2. నా జీవితంలో యీ స్త్రీ సమస్య వచ్చి నా హృదయంలో రక్తాన్ని వుడికించిందాకా ... నేను వ్రాయగలననే నాకు తెలీదని, ఇప్పటి ఆ విషయం తప్ప యింకేదీ వ్రాయడం నాకు చాత కాదని ఎట్లాతెలియచెయ్యను" ("ప్రేమలేఖలు" రెండవ భాగము పుట 48).
3. నా అభిప్రాయంతో ఏకీభవించ మనను; కాని నా శైలిని విడదీసి యోచిస్తే నాకు కోపం. ఆ మాటకు అర్థమేమిటంటే, "మీ అభిప్రాయాలు సరైనవేకాని వాటిని అంగీకరించే ధైర్యం నాకు లే"దన్నమాట. ('ప్రేమలేఖలు' రెండవభాగము—పుట 48).

అది గిట్టనివారి కిది యెట్లు గిట్టును? వారి శైలి మెచ్చుట గ్రంథవిషయమునకు వ్యామో హపడుట; కామోద్రేకగుణము నంగీకరించుట. అది జాతికి శ్రేయముకాదు. నిర్వీర్య పడుచున్న జాతి తమ నవలలకై వెచ్చించు సొమ్మువలనవారికిమాత్ర మించుకగ నార్థిక లాభము. లోకమున వ్యక్తులకు నష్టమును ప్రభుత్వములకుఁ గొంత లాభమును గూర్చు మద్యపాన ధూమపానాది వ్యసనములు లేవా?

శ్రీ చలముగా రేదిచెప్పినను జదువరుల నాలోచించుకొనుమనియే[1] యనుట విమర్శకుల పెద్దపొరపాటు అయన యోజించుకొననీయఁడు. అతిశయోక్తులతో[2] సాంఘికాచారములయెడ నిర్నిరుద్ధక్రోధావేశములతో[3] శ్రీ వారు కథనము సాగింతురు. విషయమెప్పుడును యువతీయువకుల నరముల నుద్రేకపఱచి వెనచివేయునట్టి కామము. అందుచే వీరి పాత్రలతో వీరి కథేదము చెప్పుట యొకవేళ పొరపాటయిన చో దానికిఁగూడ వారే హేతువు. 'లారెన్స్' నాయకులతో లారెన్స్‌న కభేదము చెప్పుదురు. అది లోపమైనయెడల దదపోహము గల్పించెడి నేరము లారెన్స్‌పండితునిదే! చలము గారి కాతనితో నీ విషయమునఁ బోలికయున్నది. అతనివలె జాతకుల మనస్సు నొవ్వఁజేయుగుణ మూ యతిశయోక్తులగు ననత్యములయందే గలదు. తమ కిష్టులైన వారి నతనివలె నాకర్షింపలేనని చలముగారనుట యు ననత్యము. వీరి కామశక్తి పుష్కలము గా నున్నది. వీరికి 'లారెన్స్'తో నానుపూర్వియందుఁ గలపోలికలుఁ జెప్పనక్క ఱయే లేదు.

శ్రీ చలము గారికి బూర్వులగు 'రచయిత'లదృష్టిలో సమకాలికసంఘధర్మమే పరమధర్మము. కాని వీరిదృష్టి వేఱు. వీరిమతమున మానవప్రకృతికి సహజమైన ధర్మమే ధర్మము. అనఁగ మనస్సుచే దేహయాత్ర సాగింపుఁడని మనకు వీరందిచ్చు సందేశము. బుద్ధి పెడతల నుండఁదగిన దన్నమాట. ఈ నవ్యదృష్టి వీరి ప్రథమనవల

---

1. "మీకు తోచింది చెయ్యండి అంటాను" (ప్రేమలేఖలు, 2వ భాగము, పుట 41)."చలం గారు ఏమిచెప్పినా స్వతంత్రంగా ఆలోచించుకోమనే!" 'అక్షరాభిషేకము', పుట 62, పంక్తులు 16,17; ప్రథమముద్రణము (సెప్టెంబరు 1952).

2. "So clever, quiet, astonishing- ever written queer style-oh! what pep" అంటారు. "pep" My dear critics, readers, admirers and detractors- pep is, Life is it self, Poured out for you from my very soul అంటాను, నేను" ('ప్రేమలేఖలు' - 2వ భాగము-పుటలు 18, 9)."అమీనా నిజమైనకథ.ఆ యజమాని మాత్రం(తానుగమనిక) అంత నీచుడు కాదు—ఆ పుస్తకంలోరాసినంత. కథపట్టుకు అట్లా మార్చవలసివచ్చింది. అమీనా నిజమైన పిల్ల". 'కవిగా చలం', పుటలు 17,72).

3. 'నా తిట్లు ఎంతమంది సహృదయుల్ని వానించి దూరంచేశాయో ! మనిషిగా నన్ను ప్రేమించిన వారిని భయపెట్టాయో ! ఇంకా ఆ గుణం చావలేదు' ('కవిగా చలం', పుట 81).

యగు 'శశిరేఖ' యందే వ్యక్తమయ్యెను. దీనిని దొలిసారిగ జదువునప్పుడు కలుగు కలవరము జీవితమున భారతీయు లెవ్వరుఁ గాని మఱవలేరు.1 మెల్లమెల్లగ మనకుఁ బాశ్చాత్యులతోడి సంపర్క విషయము జ్ఞప్తికి దగును. అది యొక విచిత్రమైన తరి కాబోలు నను కొని క్రమముగ శమనచిత్తుల మగుదుము.

## దైవ మిచ్చిన భార్య2

ఇది శ్రీ చలము గారి రెండవ నవల; రెండు పాశ్చాత్యకృతుల సమీకరణము3. అనువాదమే కూడదని కొందర అందురు4. కాని యనుసరణ మనినఁజాలును. పలువ శ్రీయుతులు సుద్ధకృష్ణ, వెంకటచలము, మొక్కపాటి నరసింహశాస్త్రి, స్వర్గీయ చింతాదీక్షితులు ప్రభృతి సాహితీసమితిరచయితలయెడ నాడు పాశ్చాత్యుల1 ప్రభావ మధిక మనుట స్థూలదృష్టితో దప్పుగాదు.

సాధారణముగ వివాహములలో నితరులచే భార్య లంటఁగట్టఁబడుదురనియు భర్తకు దైవ నిర్దేశించినభార్య యింకొకర్తుకయై యుండు ననియు శ్రీ చలముగారి విచిత్రవాదము. ఈ దైవనిర్ణీతమైన భార్యనుగుఱించి యితరులకుఁ దెలియదు. వీరి కొక్కరికే తెలియును. పూర్వజన్మసుకృతమువలన వీరికిఁ గలిగిన విశేషజ్ఞాన మిది. ఈ నవలయందు వివాహమైనభార్యతోకంటె నింకొక ప్రియురాలితో నాయకుఁడగు రాధాకృష్ణుఁ డుండుట వైరితిగ సమర్థింపఁబడును. ఆ ప్రియురాలే అతనికి దైవనిర్ణీతమైనభార్య యని శ్రీ చలముగారి వ్యాఖ్య. కథాసన్నాహ మీ దిగువపద్ధతిలో నుండును :—

పద్మావతీరాధాకృష్ణు లాబాల్యస్నిగ్ధులు. స్త్రీపుంవిభేదమెఱుఁగక పెరిగి పెద్దవారైన పిదపఁ గూడ నాటపాటలలో నిమగ్ను లగుదురు. ఇరువురు జదువు కొనినవారే! చదువనఁగా నిదియే చదువు; స్వాతంత్ర్య మన్నచో స్వేచ్ఛయనియు, స్వేచ్ఛ యన్నచో స్వైరవృత్తియనియు నర్థములు గ్రహించునట్టి చదువది.

---

1. థామస్ హార్డీ నవల 'Tess of the Dubervilles' ప్రభావము "శశిరేఖ" మీఁదఁ గలదు. దానిని బఠించినను నిట్టి యింద్రియ కల్లోలమే కలుగును. రసానందము పాశ్చాత్యుల కావ్య ఫలమే కాదుగదా!
2. క్రీ. శ. 1923 నాఁటి రచన ("చలం" పుటలు 557 560).
3. 'Passionate Friends' of H. G. Wells and 'Woman thou Gavest Me' of Oscur Wild.
4. "చలం" — పుట 491 — పంక్తులు 11, 12.

1. మపాసా, ఎడ్గార్ ఎలెన్ పో, ఆస్కార్ వైల్డ్, హెచ్. జి. వెల్స్, ఎడ్గార్ లారెన్స్, షామ్, సింక్లెర్ లిక్ ప్రభృతులు.

పద్మకు యుక్తవయస్సువచ్చుసరికి మేనమామ న్యాయమూర్తికిచ్చి వివాహ మొనర్చును. ఆమెభర్త విద్యాభ్యాసమునకై విదేశముల కేగును. పద్మావతీరాధాకృష్ణులు ప్రేమించుకొనుచుందురు. రాధాకృష్ణుఁ డామెను విడిచి బ్రతుకలేక నన్నంతవఱకు వచ్చినాఁడు. కాని కారణాంతరములచే నతఁడు శకుంతలను పెండ్లియాడును. ఆమెవలన సంతానవంతుఁడు గూడ నగును.అయినను దనభార్య పద్మావతియేయని యాతనిభావన.

న్యాయమూర్తి విదేశములనుండి వచ్చును. పద్మావతి యింటియొద్దనే యాతని నివాసము. రాధాకృష్ణునియందుఁ దనభార్య ననుమానించుటయే గాదు; ఆమె కాతని తోడిసంబంధము నొకనాఁడు కనులారఁజూచును.

ఆమెను దనతో రమ్మని ప్రియుఁడైన రాధాకృష్ణుఁడు; తనతో నుండుమని భర్త న్యాయమూర్తి.

ఇర్వురిలో నెవరినో యొకరిని కోరుకొనుమని యొకనాఁ డుపభర్త రాధాకృష్ణుని బెదరింపు.

అందులకుఁ జిత్రవాక్యరచనాచణ[1] పద్మావతి యుత్తమోత్తమనాయికల వాగ్వైభవమును ధిక్కరించుచు దీర్ఘోపన్యాసము[2]. ఈ సన్నివేశములమూలమున చలముగారు చదువరుల కందిచ్చు సందేశసారాంశ మిది కావచ్చును :—

---

1. "ఎంకి పాటను రాయాలంటే సుబ్బారావు. ఎంకి మాటలు రాయాలంటే చలం;('చలం' పుట 189. పంక్తులు 17, 18) ఎంకి మాటలు పద్మావతి మాటల వలెనే నిజముగ నింత విరసములై యున్నయెడల నా "యెంకి పాటల" కు వేయి యేండ్లకుఁ గూడ నీ మాత్రపుఁగావ్యత్వమైన లభించెడిది కాదు.

2. ఎందుకు ఉండకూడదూ యిక్కడ? ఇద్దరిలో యెవరినో ఒకరిని యేరుకోవడం యేమిటి? ఎందుకు ఏరుకోవాలి: యెవరో వొకరువుండితీరాలా యేమిటి మొగనాథుఁడు ? మీరిద్దరూ అక్కర్లేదు. న్యాయమూర్తిగారూ, నేను మీ పదార్థాన్నికాదు, మీరు చెప్పినట్లు మీ ఆజ్ఞకు లోబడి వుండేందుకు. రాధా, నీదాన్ని కాదు నీతో వచ్చెయ్య డానికి. నాకోసం మీ యిద్దరూ యెందుకిట్లా బొమికముక్కలకోసం కుక్కల్లాగా పోట్లాడతారు? ఇది నా యిల్లు. నేనిక్కడే వుంటాను"('దైవమిచ్చిన భార్య')

వివాహము మంచిదికాదు[1]. పురుషుఁ డెప్పుడును స్త్రీని తనదానినిగా జేసికొన వలెనని చూచును. స్త్రీమాత్ర మట్లుఁ గాదు; ఎవరిదానను గాదనునట్లుండఁ గలదు[2].

పిదప నవలలో బద్మావతికొఱకై భర్తయుఁ బ్రియుఁడును దగవులాడుకొను చుందురు. తన భార్యను రాధాకృష్ణునియందు శంకించుటేల యొకటి నాయకుఁడగు న్యాయమూర్తికి లభించినది. అందువలన నామెను బరిత్యజించెద ననియు రాధాకృష్ణునిపై నభియోగముఁ దెత్తుననియు న్యాయమూర్తి బెదరించును.

కృష్ణుని యెడఁగల ప్రేమమూలమునను నతఁడిక్కట్టులలో బడుననియుఁ బిల్లలకుఁ గష్టముగలుగుననియుఁ దలఁచి తాను రాధ ప్రాణత్యాగమునకై సిద్ధపడి తుది చూపులనిమిత్తము కృష్ణునియొద్దకువచ్చి తన ప్రేమనంతయు నొక్కమాటు చూపఁ గలదు.

ఇంతలో నామభర్తయు నచ్చటకు వచ్చెను. ఆమ యచ్చటనే యసువులు బాసినది. ఇ ట్లాయిర్వురును గలిసి యామె జీవితమును నాశనముఁ జేసిరని నవలాకర్త

---

1. వివాహం చలాన్ని అధికంగా కలతపెట్టింది. ("చలం" పుట 408, పంక్తి—1). "పెళ్లి అనేదాంతో ఎందుకు నాకు విరోధం? పెళ్లి వ్యభిచారం క్రింద వేశ్యాత్వం క్రింద మారింది గనుక". ("ప్రేమ లేఖలు" 2వ భాగం, పుట 157). చలముగారి భావములు పరస్పర విరుద్ధములని వారి యనుచరులే ("చలం" — పుట 191—పంక్తి 11) యొప్పుకొనుట యట్లుండఁగ, దప్పనుచరులయందు కూడ వానిని గూర్చి స్థిరభావములు లేవు. అవ్యక్తము సంకులమునగు చిత్తవృత్తిని గ్రహింప యత్నించువారికి దల్లక్షణములు సాంక్రమికములు గదా: చూడుఁడు:—

"ఆయనవేరు, రచనలు వేరు కాదు" ("చలం"—పరిచయము—పుట 4, పంక్తి 17)

"చలం సాహిత్యాన్ని చదవటం అంటే చలాన్ని చదవటంకాదు. చలాన్ని చదివితేనే చలాన్ని చదవటం అవుతుంది." ("చలం" ప్రవేశిక—పుట 7, పంక్తులు 20, 22)

"చలానికీ ఆయన రచనలకు అవినాభావ సంబంధమున్నా ఆయన రచనలకంటే ఆయన యెంతో గొప్పవాడు." ("చలం" మనవిమాటలు—పుట 3, పంక్తులు 8—9)

2. "యెవరో ఒకరు వుండి తీరాలా యేమిటి మొగవాళ్లు"? ("దైవమిచ్చినభార్య"). ఇది చలముగారి స్థిరభావము కాదు. తమ మతమిది కాదని మఱల నింకొకచోటఁ జెప్పుదురు. "ఎంతో ఘోరంగావున్నా భార్య సంసారాన్ని వదలదు. వొదల కూడదు—("స్త్రీ" పుట 117). ఇది వారి స్థిరాభిప్రాయమైనచో నిందువారు క్రొత్తగఁ జెప్పన దేదియు లేదు. అంతయుఁ బూర్వులు చెప్పినదే! "నా Theories కి విరుద్ధంగా వుంటాయి నేను రాసేవి చాలాసార్లు." ("కవిగా చలం"— పుట 108)

యొసఁగుసందేశము కాబోలు! 'బ్రాహ్మణీకం' అను నవలవలెనే యిదికూడ మరణాంత మైన రచన. దయాదాక్షిణ్యములు, ప్రేమ మున్నగుగుణములను బ్రహ్మ స్త్రీలకేల యొసఁగెనో గదా! యని చలముగారును1 వారి యనుయాయులును జింతింతురు; బ్రతికి వను బ్రాణములఁ బాసినను స్త్రీ యర్పణకొఱకే యవతరించుట యని యద్రుతర్ప ణము విడుతురు.

నవలలో బాల్యమునుండియుఁ బద్మావతీరాధాకృష్ణుల యాటపాటలును ముద్దుముచ్చటలును సాగిన ట్లభివర్ణితములు. ఇవి యన్నియు వారి ప్రేమకలాపము లోని భిన్న భిన్న దశలు. అధికభాగము సంవాదముల తోడను ప్రథమపురుషయందును సాగుట యీనవలావైశిష్ట్యము.

## అమీనా2

'అమీనా' శ్రీ గుడిపాటి వెంకట చలముగారి మూఁడవకృతి. ఈ నవలలోని యితివృత్తము యథార్థమైనదని వారినుడి 3. ఇందలి దాసి యమీనా యన్నచో నవలాకారున కమితాభిమానము 4.అందుచే 'నమీనా' నమీనాకే యంకిత మిచ్చిరి. "ఇది నవలామాత్రము కాదు; ఒక నవ్యకావ్యము; అందఱకు నర్థమగునది కాదిది; కొందఱకు వెగటు; కొందఱకు విసుగు; కొందఱకుమాత్రమే మధుర కావ్యము; అమీనా! అమీనా!! అమీనా!!! అని యామెకొఱకై నవలారచయితకు గుండె గొంతుకలోన కొట్టుకొనును" అని దానినిగూర్చి చలముగారి సహోద్యుల యభినందనములు.

---

1. పద్మావతి భర్త రాధాకృష్ణునితో :—
   "మనిద్దరం కలిసి చంపాము......ఇద్దరం ముక్కలకింద చీల్చు తున్నాము."
   ("దైవమిచ్చిన భార్య")

2. ఇది నాలుగు భాగములు. క్రీ. శ. 1924 నుండి 1942 వఱకుఁగూడ నీ రచన సాగినది. మొదటి భాగము 1924, రెండవ భాగము 1936, మూఁడు నాలుగు భాగములు 1942 కావచ్చును. ("చలం" పుటలు 558, 560), ఇందలి వైరుధ్యము గమనార్హము.

3. అమీనా నిజమైన కథ. ఆ యజమాని మాత్రం (చలంగారు తానే యై యుండవచ్చును) అంత నీచుఁడుకాదు — ఆ పుస్తకంలో రాసి నంత. కథపట్టుకు అట్లా మార్చవలసి వచ్చి నది. అమీనా నిజమైన పిల్ల. ("కవిగా చలం" పుటలు 17, 72) అట్లే చూడుఁడు :— "చలం" పుట 502, పంక్తులు 1, 2.

4. నా జీవిత చరిత్రలో ఆ సంవత్సరానికి మెరుగుపెట్టిన ముసల్మాన్ కన్య అమీనా. అమీనాని తలుచుకున్నప్పుడల్లా ఆహ్లాదకరమైన ఉత్సాహానికి తోడ్పడే "పన్నీరు పువ్వు మార్దవమైన పరిమళం జ్ఞప్తికి వస్తుంది. అదే నాజూకు, అదేమొండితనం, అదేస్నేహం" ("చలం" పుట 502).

ఇతర రచనలయందువలెనే యీ నవలాకర్త యిందుకూడ లైంగికవిషయములనే ప్రస్తావించును. అమీనా పూరిగుడిసెలోనుండు తురకలపిల్ల. చేఁపలు పట్టుకొను వృత్తి వారిది. ఏదో యాదృచ్ఛికముగ నాయకున కామె తటస్థపడును; బీద బాలిక. అతనియొద్దనే సేవికావృత్తి నవలంబించియుండి యాతనితో జనవుగఁ బ్రవర్తించును. యజమానునితో నిట్లున్నందుల కామె తిట్లుదిని తన్నులుదిని యిలు వెడలిపోవుటయుఁ దిరిగివచ్చుచుండుటయు నీ నవలలోని కథ. ఆమె నట్లు దిట్టినవారు, తన్నినవారును పోని సతీవ్రతలైనను గారు; లేచివచ్చి యీ కథానాయకునితో వరుసగా నున్నవారా ముగ్గురును. ఒకతె తరువాత నింకొకతె – ముగ్గురు, నమీనా నీసడించి తరిమివేయుదురు. తుదిసారిగ నమీనా యేడ్చుచు వెడలిపోవుచున్న సమయమున నాయకుఁడు తన ప్రియురా లెందుకు గొట్టినదని ప్రశ్నించును. "మీరు పిలిస్తే వస్తానని వారికి కోప" మనుచు నమీనా నిష్క్రమణము.

అంతటి విశ్వాసపాత్రురాలి నడ్డగించి తనయింటనే[1] నిలుపుకొనలేకపోయినందులకు మర్యాదపేరిట తన కాళులకు సంకెలలు వేసికొంటినని గతజలసేతుబంధనముగ నాయకుఁడు బహుధా పరితపించినాఁడు. ఈ మార్గముననే నడచు తనమిత్త్రుని శ్రీమన్నారాయణుని జూచి యాశ్చర్యపడెడి నాయకుఁడు, తానుగూడ నదేపనికిఁ బాల్పడుట యీ నవలలోని వైచిత్రి. ఇది లోకధర్మమునకు దివ్వెపట్టుట. ఇంతకుఁ బాలుపడి తుద కాతఁడీ రీతిగా నిశ్చయించుకొనును. నీతిని గుఱించి యుపన్యాసము లిచ్చువారు నితరులలోని దుర్నీతిని ఖండించువారును దప్పదు-రహస్యముగ నవినీతికరములు, నతి నీచములును నగు పనులు జరుపుచు నుండితీరెదరు[2]. తిరిగితిరిగి తన కనుభవములో నీ విషయము రూఢియైనదని యిందు నాయకునిబలుకు.

ఈ నవలలోవచ్చు శ్యామల, సుబ్బులువంటి పాత్రలు మానవప్రకృతిలోని నైతికబలహీనతకు గుఱియగుదురు. దుశ్శీలాగారమైన యీ నీచయౌవతము నిష్కారణముగ నమీనావంటి మేటి వారిని బాటింపక యనుమానించుట యుల్లంపు మొల్లవలె నెల్లఁ జూపుట, యని రచయితృ ప్రధానోద్దేశము.

---

1 ఏలూరులో చలంగారి మొండిగోడల యిల్లు "అమీనా" లోని రంగస్థలము. కవిగారి మిత్త్రములు శ్రీ పట్టాభిరామయ్యగారీ నవలలో నొకపాత్రకూడ.
("చలం" పుట 164, పంక్తులు 18–20)

2. నవలాకర్త యీనిర్ణయమే తిరుగులేనిదగుచో బాఠకులు నవలాకర్తను గూర్చి యేమనుకొనవలెను? మఱి యప్పుడు చలముగారి నీతివిగూర్చి శ్రమపడి సమర్థించు సమయాయుల సమర్థనగ్రంథము లన్నియు వ్యర్థము లవఁగలమా ?

పోషాయందుఁ గూర్చున్నదనియో నీటుగాఁ దమకు దీటుగ నింటిలో దిరుగుచున్న దనియో యేదియో వంకపైఁ బడింబడిగ నమీనాను నాయకునిబ్రియురాండ్రెవ్వరువచ్చినను నిల్లువెడలనడపించెడివారు. ఉపభార్యలై తానువచ్చితిమన్న జ్ఞానము వారలకుండకపోవుట యీ నవలయందు సహజముగఁ జిత్రింపఁబడినది. అందుచే దీనిని మన స్తత్త్వ నిదానరూపకనవల యన్నఁ జెల్లును. అమీనా స్వాభిమానము, యజమానునెడఁగలభక్తియుఁ, జనువువంటివి స్వాతంత్ర్యప్రియుల మనుకొనువారి మనస్సులకు వచ్చునట్లు వర్ణింపబడినవి. కాని అమీనా ప్రవర్తనవంటి ప్రవర్తన దాసిజనమెల్లరకు నుండుననిగాని, యీ నవలలో సుస్పష్టతయు, నర్థవ్యక్తి గుణము నున్నవనిగాని సాధారణపాఠకుల నొప్పింపలేము. ఇఁక నవలాకర్తగారియెడ వీరాభిమాన పరులకు విశ్వజనీనత, యశ్లేశతాదిగుణముల సంగతియే పట్టదుగదా![1] నాస్తికులైన వారుగూడ వారొక్కరినిమాత్రము భగవానునిగా నంగీకరించునపుడు[2] భగవానునిలో దోషము లుండునా? అగపడునా?

శ్రీ చలముగారి యే రచనయందుగాని భాష యెల్లరివ్యావహారికమువంటి వ్యావహారికము గాదు. అది నిర్నిరుద్ధావేశములరాశి. ఆయావేశముల వెంట భాష కూడుకొనుచు రాదు. ఒక్కవాక్యము వాక్యమనఁ దగినది చదవఁగనేయర్థమునిచ్చుట యెఱుఁగము. ఈ నవలలో బంక్తికిఁ బదిమాఱులు అమీనా! అమీనా!అమీనా!యని సంబోధ

---

1. వీరి రచనలు వృద్ధులను క్రుద్ధులను చేయును. యువకులకు ప్రాణప్రదాలు. ("అక్షరాభిషేకము" పుటలు 68, 69). ఆయనలో అన్నిటికంటె అధికంగా ఆకర్షించేది ఆయన భాషే. ఆయన వస్తువు అనుకొంటారు కొందఱు.("అక్షరాభిషేకము"-పుట 83) ఈపొంతికలేని విర్ణయములమట్టి చలంగారి యెడ వృద్ధులు క్రుద్ధులైనదియు, యువకులు ముగ్ధులైనదియు, భాషకుఁగాని భావములకుఁ గాదని తెలుచున్నది. "బ్రాహ్మణ స్త్రీ తురక వాళ్ళతో పోయినట్లు రాయుట ఏమిటని గోల". లోకంలో జరుగుతూ వుండగా రాస్తే వచ్చిందా అని రచయిత. ("చలం" పుట 169, పంక్తులు 1-4). భాషకో భావములకో, వెంటకో లోకము దుఃఖించినదని తెలియక పోవచ్చును. కాని యభిమానము గ్రుడ్డిదని మాత్రము తెలియుచున్నది.

2 భగవంతుడులేని యీయనకు (శ్రీ వి. వి నరసింహారావు—నృత్యాభిమానికి) చలమే దైవం. పూర్వవైష్ణవులు శైవులు కనబడగానే విసనకర్రలు అడ్డంపెట్టుకునే వారట; వారిని చూడవలసి వస్తుందని. అట్లాగే యీయన (శ్రీ వి. వి. నరసింహారావుగారు) చలం వ్యతిరేకులను చూడ ఇష్టపడరు" ("చలం" పుట 189, పంక్తులు 7-10).

ములును బండతిట్టులును మాత్రమున్నవి[1]. ఇది వినా పదిమారులు చదువవిది, వారి హృదయము తెలియ రాదు. పిమ్మట నైన నది తెలియుట మన యభ్యూహ. ఆ మ్లేచ్ఛితవాక్యమున కా యర్థమని వారి యనుయాయులు చేయు టీకయే మనకు శరణ్యము. కొంత యర్థమును జెప్పి కడమ దానిని జదువరులు గల్పించుకొనునట్లు సూచించుట మహాకవిత్వ మందురు[2]. కాని వీరి రచనలలోని భావమంతయు మనమే యూహించుకొనవలెను. తిన్నగ నూహించుకొనినచో నొక్కొక్కచో నొక్కొక్క వాక్యము భస్మాసురుని హస్తము వంటిదిగ నుండగలదు[3]. స్వభావముచే స్వాప్నికుడును గాల్పనికవిప్లవవాదియు[4] స్వేచ్ఛాప్రణయ వాదియు స్వేచ్ఛాస్వాతంత్ర్యాభిరతుడును నైన ప్రతి రచయితయందును నిట్టిభాషా భావముల యరాజకత్వముండు నన్నజాలము. డా. యస్వీ. జోగారావు (గారు) చెప్పినట్లు వీరిభావవైభవాదిక మంతయు నొక ప్రత్యేకమగు నున్నతగవేషణకు విషయము కా గలదు[5].

## మైదానం[6]

ఈ నవల శ్రీ చలముగారి నాల్గవరచన. అమీర్ ఆలింగనము రాజేశ్వరినెట్లో యీ నవల యల్పసంతోషము, నల్పాభిరుచియుఁ గల పతితల వట్లూపిరి సలుపనీయక పారవశ్యముచే బరవశుఁ ద్రొక్కించును.

---

1. శైలి యెంత భావములతీవ్రతయైనను. నావేశపూర్ణమైనను, వాక్పారుష్యము లేనిచో దానినర్థముఁజేసికొనవచ్చును. మద్యపానవిషేధములేని ప్రదేశములలో నర్ధరాత్రమునందుఁ బ్రయాణముచేయునపు డెల్లరము వీరి భాషకంటె వాడిమిఁగలదియు, వేడిమిఁగలదియు, శక్తివంతము నగు భాషనే వినుచున్నాము; దుఃఖించుచున్నాము. కాని గర్వించుటలేదు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వీరిభాషనెట్లు మెచ్చుకొనిరో : దుర్గ్రాహ్యము ("అక్షరాభిషేకము," పుట 83–పంక్తులు 1-2). అట్లే 'భారతి', విప్లవపత్రము. ఇట్టులు వీరివి 'సాహిత్యబాణము" నిరఁట,('చలం', పుట 298, పంక్తి 17), కావచ్చును. "సాహిత్యాణు శతఘ్ని" యన్నను దప్పురాదు.
2. "Indeed the story telling of the ancients was Potential by what it left out."
3. అది(ఆయనశైలి)ఒక్కొక్కసారి తెలుగు అనిపించుకోటానికికూడ అర్హంగా వుండదు." శ్రీ కొ. కుటుంబరావుగారు. చలంగారినిగూర్చి విమర్శన; 'జ్యోతి' 15–8–49.
4. "It was his major failing that he could not see the direction of progress. And being as impulsive as he was 'progressive', and as impatient as he was impractical, he ended up,as a social anarchist"
   'Social purpose and Telugu Literature' by Sri Burra V. Subrahmanyam, Treveni-p. 106, Lines 38-41. Oct-1958.
5. "......His earnest quest for truth,his enthusiastic experiments with Life and Society are interesting subjects for a high level research."
   'చలం' పుట 298–పంక్తులు 11–14.
6. క్రీ. శ. 1927 నాఁటి రచన ('చలం'–పుట 558, 560).

'మైదానము' మీఁద జాల గాలిదుమారము రేఁగినది. అది నైజమే కదా! దానికిఁ గారణ మది 'మైదానము'[1]గుట వలననే కాని కొందఱు విమర్శకు లనుకొనిన ట్లందలి నాయిక రాజేశ్వరి 'బ్రాహ్మణప్లీడరుభార్య' యగుటయు నందును దురుష్కసంపర్కముఁ బొందుటయువలనమాత్రమే యనలేము. తమ కులమును దమ మతమును మించి తిట్టఁగల సామర్థ్యమీ యనహాయశూరుఁడైన రచయితకు లేదని యెల్లరు నెఱుఁగుదురు[2]. ఇట్టి యభూతకల్పన లన్నియు లేదా యపూర్వవిషయము లన్నియుఁ జదువరుల నాకర్షించుటకును యువతరమునకుఁ జెందిన తన చదువరుల నానందింపఁజేయుటకు నని యెవ్వ రెఱుఁగరు? స్త్రీ జనోద్ధరణమును గూర్చిన యంతశుద్ధి బ్రహ్మాండమంత గలదని వారిని గూర్చి యభిమాను లందరు. ఇందు కొంతనిజము లేకపోలేదు.

ఇందలి నాయిక పరకీయ రాజేశ్వరి; 'అమీర్' అను మహమ్మదీయుని బ్రేమించి యిలు వెడలిపోవును. ఆమె మఱియొకనినిగూడ ప్రేమించును. అతనిపేరు మీరా. ఈ వ్యాపారమునంతయుఁ బ్రేమ యనవలెను; కాముకవ్యవహార మనరాదు. ప్రేమ, స్నేహము, త్యాగము, కామము, మోహము, శృంగారము మొదలైనవాని కన్నిటికి లోకసంగ్రహార్థము[4] పాశ్చాత్యగ్రంథములనుండి యుద్ధరించి శ్రీ చలముగారు నిర్వచన

---

1. మై + దానము = శరీరదానము; మైద + అనము = మైదు + అనము = మదోచ్ఛ్వాసము నవికూడఁ జమత్కరింపవచ్చును.

2. "...దీనికికారణం: దీనిలో నాయిక ఒక బ్రాహ్మణప్లీడరుభార్య ఒక మహమ్మదీయుని ప్రేమించి వెళ్ళిపోతుంది"("చలం" పుట 468—పంక్తులు 4—6). "బ్రాహ్మణ స్త్రీ తురక వాళ్ళతోపోయినట్లు రాయటమేమిటని గోల". ('చలం' పుట 469, పంక్తి—1).

3. ఔను. శృంగారవర్ణనలతోనే ఆకర్షించాలి మీ tastesని; నేను వ్యాసాలు (Serious వి) వ్రాస్తే చదివేవారా? నా అభిప్రాయాలను తర్కించమన్నా తర్కించేవారా? నా వర్ణనలు మీ రుచులకు ఎర తిట్టుకుంటూ వాటికోసంవచ్చి నా అభిప్రాయపుబోనులో చిక్కుకోవాలనే నా ఉద్దేశం (మ్యూజింగ్స్—పుట 31) ఇట్లు బహిరంగముగఁ జెప్పకొన్న యాయనను యశఃప్రేప్సువు గాఁడనియు జెదలలగండఁడు గాఁడనియు, నంతశ్శుద్ధినిలయ మనియు స్త్రీ జనోద్ధారకు డనియు బాలకుల కాలోచనాస్వాతంత్ర్య మిచ్చుననియు 'బూతువొగడి నట్లు పొగడుట కాత్మాభిమాన మడ్డువచ్చువారు దురదృష్టవంతులు.

4. వీరికి లోకప్రవృత్తి మే తెలియదు లేనిచో రచనలకు సార్వజనీనత కలుగనే గలిగెడిది. చలానికి యితరప్రపంచసంబంధం తక్కువ ఆయనకు ఇతరులసంగతి, ఆయనమగురించి యితరుల అభిప్రాయాలు అందించేది ఆయన ఒక్కరే (ఆయన యనఁగా శ్రీ రుక్మిణి నాథ శాస్త్రి) ('చలం' పుట 185, పంక్తులు 14—16).

ములు వ్రాసియుంచిరి. అవి వారు నవలల మూలమున బోధించు తత్త్వమునుగూర్చి చర్చించునప్పు డావశ్యకమగు నేమోకాని ప్రస్తుతమునకుఁ గావు. వాత్స్యాయనుఁ డొక వేళ జన్మింపకపోయియుండినను మన జాతి కాలోపముండెడిది గా దనిమాత్రము తెలిసి కొనినఁ బ్రకృతమునకు చాలును.

మైదానమునందలి 'యమీర్' దృఢకాయుఁడు; నిరంతర యతనప్రియుఁడు. అతఁడు ప్రియురాలిని కొలుకుకొనితిని వేయుటతో నవల సాగిపోవును. ఇట్లుఁ జేయుట కూడదనుచుఁ జెప్పుటయే నవలాకారుని పరమోద్దేశముగా నూహించుకొను వైచిత్రి నెఱుఁగలేకపోయినచో మనమే వట్టి యజ్ఞానుల మగుదుము1.

మీరా రాజేశ్వరి కొక ప్రియుఁడని మున్నే చెప్పఁబడినది. ఇతనిలో మనము మార్దవము, సౌకుమార్యము, సౌహార్దమువంటి గుణముల నూహించుకొనవలెను. రాజేశ్వరి నాతనియెడ నీ గుణములే యాకర్షించిన వన్నమాట2. ఆ ప్రేమస్వరూపిణి రాజేశ్వరి యిరువుర నేకకాలమునఁ బ్రేమించును.

వీరు తమ నివాసప్రదేశమును విడిచిపెట్టి యొక మైదానములో గాఁపుర ముం డుటచేత నీ నవలకు 'మైదానము' నెడి పేరుసార్థక మయ్యెనని చెప్పనొప్పును. తన్మాత్రమే కాదు; ప్రేమ సూచకములైన వారి యాలింగనచుంబనాదులన్నియు బహిరంగములే ! వారి కాముకక్రీడల కా ప్రదేశము బహిర్ద్వారము. కామక్రీడాస్థలి, కాముకుల కలాపము నకు రణరంగము, కామవస్తువిస్తారము గలది యను నెన్నియర్థముల దృష్టితో జూచి నను జాటుమాటులేని 'మైదానము'నన్వర్థ మనవలెను3.

---

1. "నీ కథలన్నీ బూతుకథలు, నీ వ్యాసాలన్నీ అవినీతివ్యాసాలుగా మారాయి. జ్ఞాపకం వుందా నీ హృదయంలోని సౌందర్యభావం, రసాన్వేషణ, నీ అన్వేషణా అన్నీ అక్షరాలై, ఇతరుల మనస్సుల్లో ఏమైనాయి: నీచత్వం, మురికి, అసహ్యం feelings యివేకదా అవి రెచ్చగొట్టింది. ఇంక నీ ప్రేమలేఖలా ? అయింది. కాని యెవరికో, ఎన్నటికో, ఏ కొద్ది మందికో...ఎవరో చదివి ఒక నిట్టూర్పు విడవరా?" ("ప్రేమ లేఖలు"—పుట 16).

2. "స్త్రీలు అవినీతిమార్గాల సంచరించేందుకు వుత్త కండకావరంకాక అనేకరహస్యమైన Motives అందులో కొన్ని చాలా వుదారమైనవి వుంటాయని నేను Analyse చేసినందు కేగా సంఘం విరుచుకుపడ్డది నా మీద" ('ప్రేమలేఖలు' 2వ భాగం-పుట 40).

3. మైదాన్ = (పారసీకపదము) క్రీడారంగము, యుద్ధభూమి, వస్తువిస్తారము ననెడి యర్థ ములు పెక్కు గలది.

ఇందలి నాయిక[1] తన్ను సమర్థించుకొనుటకై సంఘమును హేళనచేయును. తన జీవితపూర్వార్థముకంటె నుత్తరార్థమే మహోన్నతము, మహోదారముగ నున్నదని గంభీరవాచార్భటితో బలికినది. ఈ విషయములకు గ్రొత్తలో గొందఱు సాంప్రదాయకులు[2] మూర్ఛపోయిరి: పిమ్మట రాజేశ్వరినిగూర్చి 'యామె కర్మమ'నిరి. ఆమె 'మీ కర్మ మ'నునని చలమువాదు లామెను సమర్థించిరి[3].

చలముగారి నవలలలో[4] నెల్ల 'మైదానం', 'అరుణ',[5] యను రెండును కీర్తికి నపకీర్తికి గూడ లోకప్రసిద్ధిగన్నవి. అద్భుతరచన మనినవారు వీనిని గళాఖండము లనిరి; కాదనినవారు తీవ్రముగ ఖండించిరి. 'నీతినే ప్రశ్నించిన నన్ను, నా నీతిని వీరా ప్రశ్నించునది ?' అని శ్రీ చలముగారు తృణీకారముఁజూపుట మఱియు బాగున్నది[6].

ఇట్టిచో నింతవఱకుఁ బై రెండు నవలలలో 'మైదానం' అనుదాని విహంగావలోకనము జరిగినది. ఇఁక నించుక సూక్ష్మముగ దీని తత్త్వము నెఱుఁగుటయు నుచితము.

---

1. ఆయన కథల్లోగాని, నవలల్లోగాని, నాయికలలో మాతృత్వం నా కెక్కడా గోచరం కాలేదు. అధికంగా వారు భోగలాలసలే; కామతృష్ణే అధికం"('తెలుగు స్వతంత్ర,' 'నా దృష్టిలో కవిగా చలం' అను గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారి వ్యాసము-పుట 26, డిశంబరు 26, 1956).

2. చలంగారు Tradition వదలలేదు. అర్థసంప్రదాయాలకు విషతుల్యమైన Convention తీసివేసి సత్యాన్ని విప్పిచెప్పారు." ('చలం', పుట 508, పంక్తులు 18-20).

3. "మామూలువ్యభిచారం కాదు వాళ్ళు చేసేది. వీళ్ళ మనస్సు వాళ్ళను అసహ్యించుకుంటుంది. కాని వాళ్ళ అరికాళ్ళు యీ భూమిని దాటి తేలుతోవుంటాయి, వీళ్ళ నెత్తి మీద. అదే వీళ్ళకోపం నా మీద" ('కవిగాచలం' పుట 106).

4. 'చలంసాహిత్యసమీక్ష' అనుపేరిట శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషానిలయము-హైదరాబాదునందు క్రి. శ. 1958-1959లో జర్చలు జరిగినవి. వానిలో జదువఁబడినవ్యాసములు 'జయంతి' మాసపత్రిక (1959) యందుఁ బ్రకటితములు.

5. 'చలంగారి యిటీవలి రచనలు: వాటితత్త్వం', రచన శ్రీ దిగుమర్తి రామారావుగారు, (ఆంధ్రవారపత్రిక, 3-2-1943). 'మైదానం', 'అరుణ', వాటితత్త్వం- రచన శ్రీ దిగుమర్తిరామారావుగారే; పైవ్యాస మించుక మార్చి. ('స్వతంత్ర', పుటలు 17-24. 7 మార్చి, 1959

6. "ఏదినీతి అని ప్రశ్నించినవాళ్ళకి నీతిబోధనలు చేసేది వీళ్లు"('ప్రేమలేఖలు'2వభాగం,పుట-9.)

ప్రతిపచయితకు నొక తత్త్వమో, వాదమో, మహాశయమో, యుండితీర వలయు ననగాదు. కాని శ్రీ చలముగారు తన కొకటి కల దనుచున్నారు. అందుచే కేవలము సాహిత్యాదర్శదృష్టిపథమువనే గాక వారిని స్త్రీజనోద్ధరణాశయపరముగఁ గూడ గ్రహించుటకుఁ బ్రయత్నింపవచ్చును. స్త్రీజనసమస్యలయందు నైతము లింగ జ్ఞానైక సంబంధమగు విషయములగూర్చి చించుటచే వీరు విప్లవసాహిత్యనిర్మాత యనియు, లైంగికసాహిత్యబ్రహ్మయనియు బ్రతీతి నొందిరి. నవలాకారులలో లింగ జ్ఞానబోధకవిషయముల యం దింత ప్రేయాంసు లింకొకరు లేరు; ఉన్నను వారు వీరికే శిష్యులు. స్త్రీసంబంధేతివృత్తములఁగూర్చి ప్రేముడించుట వీరి జీవిత హాస్యము. కావున వీరి రచనల సారాంశము నిట్లు క్లుప్తముగఁ జెప్పవచ్చును :-

మన స్త్రీపురుష సంయోగావశ్యకములకుఁ దక్షిణీనియమములు సరిపోయి యుండలేదు. కావుననే మన జీవితములు నిస్సారములై పోయినవి. స్త్రీపురుషు లన్యోన్యసాంగత్యము నిరాఘాటముగను, నిష్ప్రతిరోధముగను బొందవలెను. తమ్మూల ముననే మన జీవితము లానందతుందిలములు కాఁగలవు; ఔన్నత్యమును వహించి సఫలతఁ బొందఁగలవు. అందుచే స్త్రీపురుషసాంగత్యమునకు మనలో బ్రస్తుత మాతం కముగ నున్న సాంఘికనియమముల నెల్ల నిర్మూలింపవలెను.

ఇందు వీరు ప్రతిపాదించిన క్రొత్తసిద్ధాంత మేమియులేదు. ఎంతయో యవస్థ పడి వీరు 'పతివ్రత'యను సమాసమునకుఁ జేసిన నిర్వచనమే నూతన మైనదికాదు[1]. వీరి సిద్ధాంతములు చాల వఱకుఁ బాశ్చాత్యదేశములలో నూరు పేరు లేనివారిచే బ్రచారము చేయబడుచునే యున్నవి. అయినను దను తమ దేశాచారవ్యవహారములనుబట్టి వారిలో నవి సక్రమమైన పద్ధతుల ననుసరించి శాస్త్రపర్యాలోచనానంతరమే శతధా ప్రచారింపఁబడును. జీవితములో నెట్లు సమస్తసమస్యలకును స్థానమున్నట్లే యీ స్త్రీపురుషసాంగత్య సంబంధములగు సమస్యలకును సాహిత్యములో స్థానమున్నది. అగుచో నా సమస్యల దెసఁగా బరితలదృష్టిని బ్రసరింపఁజేసి వానిని స్వానుభూతితో స్వావగాహనము చేసి కొనఁగలుగుట కుపకరించునట్లే సాహిత్యకళయందు వానికి స్థానము. దేశకాల వ్యవ

---

1. సీతను బతివ్రతయనియు, శ్రీరాము నేకపత్నీవ్రతస్థుఁడనియు నందుము. తనయందుఁ బ్రీతిఁగల భార్యయందుఁ గూరిమికలవాఁడే యేకపత్నీవ్రతుఁడు. ఈ యర్థము వేశార్కినను నడిగినను, వైయ్యాకరణి నడిగినను మన దేశములో జెప్పుదురు. పాపము. శ్రీ చలముగారు పాశ్చాత్యభాషలద్వారమున నీ విషయములను ద్రావిడప్రాణాయామవిధమునఁ దెలిసికొన వలసివచ్చినది.

స్థలకుఁ బరిమితములై యున్న కొన్ని తాత్కాలికవిషయములనుగూర్చి కళావ్యాపాద మున సిద్ధాంతీకరించి ప్రచారము చేయఁబూనరాదు. పూనినచో సామాన్యముగ గళకును బ్రచారమునకునుగూడ నష్టమే వాటిల్లును.

లైంగికసమస్యలఁ బరిష్కారసంకల్పమే జీవుని తపనగా, జీవిత ప్రధానాశయముగా గలవారు కథాసాహిత్యప్రమేయము పెట్టుకొనక శాస్త్రగ్రంథ1 సంబంధములు పెట్టు కొని కారణజన్ము లనిపించుకొనుట యుత్తమము. అయినను శ్రీ చలముగారు తమ తత్త్వము నెల్లరకు విశదపఱచుటకై నవలలవంటివిగూడ వ్రాసిరి. వారి సందేశమును బూర్తిగ గ్రహింపవలెనన్న 'మైదానం' లోని కథ నించుక విపులీకరింపవలెను.

రాజేశ్వరి బ్రాహ్మణయువతి; కాఁపురముచేయుచున్నది; పిల్ల లున్నారు. భర్త న్యాయవాది; 'అమీర్' అనుమహమ్మదీయునిచే బ్రథమ సందర్శనమునందే యాకర్షింపఁ బడును. ఈమె భర్తను బిడ్డలను వీడి యా తురుష్కునితోగూడ 'నైజాము' ప్రాంత ములకుఁ బోయినది. అక్కడ నలుదెసల సుందర దృశ్యములతో నొప్పారు నొక నదీతీరము2. ఆ తీరమునందే యొక మైదానము; వీరిద్దరకు నచ్చట నూతనప్రణయ జీవితము; పొరపొచ్చెము లేమియునుండవు; అయినను వారొకళ్ళొకళ్ళ సాంగత్య ములో దమతమ భూతపూర్వజీవితములను బ్రపంచములను విస్మరించి సుఖించు చుందురు.

కొంతకాలము గడచినపిదప నమీ రింకొక స్త్రీని వాంఛించుచున్నాఁడని తానెఱిఁగి తొలుత బాధపడియు నెట్టకేల కతని సౌఖ్యమే తన సౌఖ్యమనుకొని యాతఁ డామెను పొందుటకై రాజేశ్వరి తోడ్పడును. ఈ సంఘటనయైన యనంత రము కొన్ని నాళ్ళకా రెండవ ప్రియురాలిపై వ్యామోహము వదలిపోయిన యమీరు, రాజేశ్వరి గర్భిణియని యెఱిఁగి యామె గర్భవిచ్ఛిత్తిచేసికొననిదే తా నామెతో నివసింపనని బెదరించినాఁడు. ఆమె యందుల కొప్పుకొనదు. ఇతఁడు 'మీరా'యను కుఱ్ఱవాని నామెకు సాహాయ్యార్థముంచి యెచ్చటకేని పోవును. ఇంచుక చనవేర్పడిన యీ 'మీరా' తోడ్పాడుతో రాజేశ్వరి గర్భస్రావమున కొడి గట్టినది. కాలక్రమమున 'మీరా' కూడ దనచేత నాకృష్టుఁ డగు చున్నట్లామె గ్రహించును. వీ రిట్లు రసాకృష్టిలోనుండఁగా నమీరు మఱలివచ్చుట సంఘటించినది.

---

1. శ్రీ'యను గ్రంథ మొక్కటే ప్రాయశః శాస్త్రదృష్టితో శ్రీ చలముగారుచేసిన ప్రయ త్నము. దీనిని శ్రీ పారనంది జగన్నాథశాస్త్రిగారు శ్రీ. పా. యను సంకేతనామముతో బాగుగ విమర్శించి యున్నారు. ('ప్రతిభ', జూన్, 1942).

2. నైజాముప్రాంతములోని నదీతీరమే వీరి కేల రంగమైనదో, దాని కేమైన స్వారస్య మున్నదేమో, యది యంతయు నసూహ్యము.

రాజేశ్వరి యిరువురను సమానముగ నాకర్షించుచు నెవ్వరికిఁ గూడ నాశా భంగము రానీయక 'రసికందాయము'లలో గందక వారి సాంగత్యమును సమాన ముగఁ బొందుటకై యాతనపడుచుండును. కాని మీరా అమీరులు పరస్పర మీర్ష్యతో గుమిలిపోవుచుందురు. ఈ యిర్వురలో నెవ్వరిని వదలలేక యిఁక రాజేశ్వరి యనుభవించు నుత్కటవేదనఁ జెప్పలేము. ఒకరాత్రి మీరానే రాజేశ్వరి కోరుచున్నదని యూహించి, యమీ రాతనిని జంప బోవును. రాజేశ్వరి వెంటనే యడ్డను వచ్చినది. ఆ యవమానమువలని తీవ్రవేదన సహింపలేకపోయినా దమీరు; ఆత్మహత్యచేసికొని మరణించును. రాజేశ్వరి రాజభటులచేతులలో జిక్కుటతో నవల కుపసంహారము.

## ప్రచారము ప్రధానోద్దేశము

తా నెవరో తన రచన లెట్టివో శ్రీ చలముగారు "కవిగాచలం" అను తన గ్రంథములో జెప్పుకొనిరి. తాము జన్మతః ప్రబోధకులు, నుపాధ్యాయులునఁట[1]రచ యితలే గారఁట[1]రచయితయేగాని వారి యీరచనయొక్క ప్రధానోద్దేశము వేఱుగఁ జెప్ప నక్కఱయుండదు. అడుగడుగునఁ బ్రచారమే యడ్డుతగులును. అందమైన గ్రంథములో వ్యక్తము గాఁదగిన రమణీయార్థప్రతిపాదనము నుదాత్తతయు వంటివి కంచు కాఁగడాలతో వెదకినను నిందుఁ గానరావు. విజ్ఞానమునకుఁ గాదిది; వినోద మునకని యనవచ్చును. అటులనైన నొక కథాసంవిధానము, కొన్ని సంఘటనలు, సంవాదములు, కొంత పాత్రపోషణము నౌచితీపాలనము మున్నగునవి మనోహర ములై యుండవలెనుగదా! ఈ నవల యందిట్టి లక్షణము లెందునకైన లేవు. పోనిమ్మన్నను సభ్యత, యౌచిత్యము, నభిరుచి యను వానికిఁ దిలోదకము లిచ్చి యనాగరకుల యంగడి మొఱటుభాషలో జాతివ్రత్యమును సంఘమును నిరసింప యత్నించిరేకాని యొక యవతారపురుషుఁడు సూచింపవలసిన మహోత్కృష్టమైన యాదర్శమునుగాని యాశయమునుగాని సూచింపరైరి. తాము చెప్పదలఁచిన విష యములైన యౌత్కృష్ట్యమును ప్రమాణీకరించుటకు సంఘమును దూషించిన నేమి లాభము? సంఘము గౌరవమర్యాదలతో మన్నించు సంస్థలపై దుమ్మెత్తిపోయుట

---

1. "...నేను రచయితనే కాదు; రచన నా Life product. నేను preacherని, teacherని పుటకతో. ఎట్లాగైనా మనుషుల చిక్కు తెరుద్దామనే ఆవేశం ఉక్కిరిబిక్కిరి చేస్తుంది" ('కవిగాచలం', పుట 81).

సత్యమును విమర్శించుట యగునా? కొన్ని తెగలను1 వ్యవస్థలను దూరుట క్షణికమైన కీర్తికాముదవలననని లోక మపోహపడక తప్పకున్నది. కాదేని నీ దిగువ నుదాహరింపం బడు కథాంశములవలన రచయిత సాధించిన ప్రయోజనము మృగ్యము.

పండువంటి సంసారమును పరిత్యజించి వచ్చి నవ్యప్రియయైన రాజేశ్వరి తన నూతనానుభవ మెంతో యున్నతమని గర్వించును.2 ఎంతటి రసికలుగూడ లజ్జా విరహితలై యి ట్లుపన్యసించుట సాధారణ వ్యక్తుల యనుభవమున కందువిషయము గాదు.

సాధారణీకృతి లోపించుట యట్లుండ, దుర్వ్యసనలంపటులుగూడ గృహ మును భర్తను భార్యను బంధువులను సర్వులను మఱపింపఁగల యనుభూతి నొందు చున్నా మనుకొందురుగదా! ఇందు సదసన్నిర్ణయ మెట్లు? తదను భవమే యున్నతాను భవ మనుకొనుట యాత్మవంచనమును జగద్వంచనమును గాకూడదా? ఆ యనుభూతి ఫలితముగఁ బూర్వస్థితికంటె నుత్కృష్టస్థితికి వచ్చునప్పుడే గద యది యున్నతానుభూతి యనిపించు కొనును! ఈ నవలలో రాజేశ్వరి తనపూర్వదశకంటె నే విధముగ నున్నత దశను బ్రాపించినది? సంసారము నామె త్యజించుట యున్నతప్రేమకు నిదర్శనమని చలముగారి వాదము.

ప్రేమ యనఁగా త్యాగము3. త్యాగమనఁగా కామోపభోగములఁ దనివి పనక సంసారములఁ బాడుచేసికొని ప్రియాప్రియులను బరస్పర మనుగమించుట. అదియే యర్పణబుద్ధి యని చలముగారు. ఈ త్యాగమున నింద్రియ తర్పణమను

---

1. "(ఈయన కలం) అయినవారికీ కానివారికీ 'ప్రేమలేఖలు' వ్రాసి 'బ్రాహ్మణీకం'లోని కుళ్ళును అందరి కాళ్ళావేళ్ళా పారబోసినా, ఇతరకులాల లోపాలపైగాని ఇతరమతాల వారి తప్పులపైగాని ఒక్క గీతగీయడానికైనా సాహసించ లేకపోయింది". ఆంధ్రసచిత్ర వారపత్రిక. 'తెలుగువెలుగులు'–50, పుట 7–వరుసమూడు, పంక్తులు 15–20 (7–9–1960). ఇందలి రహస్య మింకొకటి యని తోచును. చలముగారు కేవలము స్వాప్నికులు, లోకవృత్త మెఱుఁగుటకు శ్రీ రుక్మిణి నాథ(జరుక్)శాస్త్రివంటి వారొకరిద్ద రాయనకు చెలిమలు. వారి సాయమున నవగతమైన పరిమితవిషయములలో విశ్వజనీనత సాధించుట కష్టమైపోయెను. "జరుక్"గారి గోత్రము శ్రీశ్రీగారి కెఱుక.

2. ఇంటినే బంధువుల్నే భర్తనే మరిపించగల అనుభవం ఎంత ఉన్నతమో అద్భుతమో మవ్వే ఆలోచించు ('మైదానం'–పుట 1).

3. ప్రేమ అంటే త్యాగం, ఆరాధన ('చలం'–పుట 419–పంక్తి–11).

నీచస్వార్థ మున్నది1. ఇది త్యాగముగాదు; కామారాధనము; కామపరాయణత2; లజ్జాపరిత్యాగము3: ఉన్మాదము.

తా నిప్పు డౌన్నత్యము నధిగమించితినని రాజేశ్వరి4;అమీర్ తటస్థపడియుండని యెడలఁ దా నథోగతియం దుండెడిదాననని యామెచింత. అమీరుతోడి స్నేహము మఱంత యథోగతి పా లొనర్చినదేగాని తుద కీమెకుఁ గూర్చిపెట్టిన ఘనతయేమి?

రాజేశ్వరి తన యల్పాభిరుచిని సంయమన రాహిత్యమును నింద్రియలోలు పతను లాలసను సమర్థించుకొనవచ్చును. తన పతనమున కమీరులోని యాకర్షణమును గారణముగా జెప్పి నిందింపవచ్చును5. లేదా తన యున్నతి కభినందించుకొనవచ్చును. కాని 'యాత్మవ త్సర్వభూతాని' యను సూక్తికి విపరీత వ్యాఖ్య లీమె నుడికార ములు. అయినను శ్రీ చలముగారు వినీతిని బోధింపలే దనెడి సంగతిమన గ్రహింప వలెననని వారి వ్యాఖ్యాతల యాదేశవ7. కాని రాజేశ్వరి,నిగ్రహించుకొన లేనంతటి యాకర్షణీయముగ నున్నవెల్లఁ గ్రమింపఁదగినవే యని నిర్ణయించుచున్నది. సంయ మనశీలము చేసికొనినదురదృష్ట మెంత నింద్యము?

---

1. "...శర్రల విరంతుకాధికారంనుంచి బైటపడండి, లేచిపొండి,పీచులు. అధములవుతారా, జీవితం నాశన మవుతుందా, కానీండి" ('చలం' పుట 370, పంక్తులు 1–3).
2. –"చలంగోలంతా : మత్తులోంచి, మామూలుతనంలోంచి, తిరిగితిరిగి రోజూ ఒకే పనిలోంచి, ఆలోచనలోంచి, నాది, నాకోసం అనే యిరుకు గాదిలోంచి మేలుకోండి. కదలండి, సంసారమనే పేరుతో మూసికొన్న చీకట్ల లోంచి బైటికిరండి అని." ('చలం పుట 370–పంక్తులు 9–13).
3. నేను బోధించే మీరనే అవినీతి అంతా శృంగారం మీది భక్తివల్లనే : దాని వెలుగులో నావిశ్వాసం వల్లనే"–("మ్యూజింగ్సు"–2వ భాగము–పుట 209).
4. "అమీరే నాకు కనబడకపోతే యీ నాటికీ యింకా నా పెనిమిటితో కాపరం సుఖంగా మత్తుగా చేస్తో పడిఉండేదాన్ని" ('మైదానం'–పుట–1) అమీరుతో మఱియు మత్తుగా ప్రవర్తించుటయేగదా యీమె సాధించిన ప్రయోజనము :
5. "అమీర్‌తో నీకో, యింకో పతివ్రతకో స్నేహమే వుంటే మీరూ లేచిపోయేవుందురు, అతని ఆకర్షణాన్ని నిగ్రహించలేక " ('మైదానం'-పుట 1).
6. "ఆయన అవినీతి బోధించడం లేదు అనే సంగతి అర్థం చేసుకోవాలి"('చలం' పుట 336 పంక్తులు 14,15).
7. "లేచిపోమనమని చెప్పాడు చలం అంటారు. ఆయన పుస్తకాలు చదివి లేచిపోయేవా రుండరు. 'స్త్రీ'లో లేచిపోవద్దని ఆయన గట్టిగా చెప్పాడు." ('చలం' పుట 366, పంక్తులు 19–21).

మనజాతికొక సభ్యతయు నొక నాగరకతయుఁ గలవని చలముగారు నమ్మరు. కాని, యెవరి జాతియందగుచో మాత్రము తనతో నెట్టి పరిచయము ను లేనియొకానొక పురుషుఁడు వలపుమైవడిచూపులు ప్రసరించుట సభ్యతయు నాత్మగౌరవమును గల కులసతి సహించునా? రాజేశ్వరి యట్టి చూపులను ప్రేమసూచకముగ గ్రహించి మురిసిపోవు సభ్యజాతి నాతి1.

ఇందలి నాయిక తాను దేవత్త్వము నమృతత్త్వమును బడసితినని యానందించును. వానిని దనకు ప్రసాదించినవాఁ డమీరు. ఈ సందర్భమున ననేక ప్రకరణముల యందువలెనే 'అసతోమా స ద్గమయా'వంటి యుపనిషచ్ఛ్లోకముల నవమానపఱచుట యొక యపహాస్యము గావచ్చును. కాని దానివలన స్వారస్యముకంటె వైరస్యమే యుత్పన్నమైనది. ఆమె వడసిన దేవత్వామృతత్వము లమీరు యొక్క ప్రబల వ్యామోహములో మునుక లిడుటకు ఫలితములే2! మద్యపాయియు బలమైన కైపు దిగువంతవఱకు నిట్టి యమృతత్వమును దేవత్వమునేగదా, పడయునది? గంజాయి సేవించుచు బైరాగు "లదిగో! బ్రహ్మ,మిదిగో! బ్రహ్మమ" నరా? దివ్యమైనప్రేమ మనలను బునీతుల జేయును. ప్రగాఢమైన కామము మనలో ముఖ్యముగః బశుప్రవృత్తినే ప్రకోపింపఁ జూచును. బలీయమైన మోహామువలనఁగలుగు మదోన్మత్తతకును లోకోత్తరప్రేమోపలబ్ధమగుఁ దన్మయత్వమునకును శ్రీ చలముగారు జూపిన తులనను దోమను నానుజమనుటవంటిది.

"ఇహిహీ!మహి దేవకులపాంసనురాలని తన్ను జనపరంపర కెంపగుఁజూడిక్కఁజూచి, యంబాకృత మాచరించుటకు బుద్ధిఁ దలంక"క యకలంకురాల ననుకొను రాజేశ్వరి పురుషలోకమును దూయ బట్టుట మాని... తన కమీరునిపై గలిగిన వ్యామోహాము సక్రమమన్నట్లు భర్త యక్రమముగ దమ కామసంతృప్తి కొఱకై భార్యల నుపయోగించుచున్నారని స్త్రీలోకోద్ధరణబుద్ధితో రాజేశ్వరి యుపదేశము. కామోపభోగముల దనివిఁ దనని తనకు భర్తకంటె నమీరే 'యుపయోగపడు' నని తా ననుకొని తల్లియయ్యు నిల్లువెడలివచ్చిన రాజేశ్వరి లోకమునందు భర్తలు

---

1. "ఎక్కడెక్కడ నా వస్త్రాల్లోంచి నా శరీరం కనబడుతుందో అన్నట్లు వెతికి వొళ్ళంతా సిగ్గుపరిచాయి అతని చూపులు" ('మైదానం', పుట 3).

2. "మనిషికి నాకు దేవత్వాన్ని అమృతత్వాన్ని ప్రసాదించాడు" ('మైదానం', పుట 4).

భార్యలను మోహసంతృప్తికై 'యుపయోగించు' కొనుచున్నారని నిందించుట ప్రతీప సిపాకి. అందును థివ్యత్వము నమృతత్వము నొందినపతి జగద్ధిత బుద్ధితో బలికిన కొన్ని నిశ్శ్రేయసనత్యములు విన దగినవి1.

తుదిలో తాను బంధితురాలై నపుడు రాజేశ్వరి తన్నుఁ దా ప్రశ్నించుకొనెను2. సమాధానముగ దనది కామము గాదనియుఁ ద్యాగమే యనియు నిర్ధరించుకొని యాత్మస్తుతికి జొచ్చినది. ఐన నీమె చేసిన త్యాగమేమి? లజ్జాపరిత్యాగము. స్వీయ సౌఖ్యమునకై నిర్హ్రీకయై బంధువులను సంసారమును బరిత్యజించుట త్యాగ మగునా? తత్త్యాగఫలభోక్త యెవ్వరు? తన యనాలోచితకుటుంబపరిత్యాగమున లోకమునకుఁ బరితాపమేగాని పరితోషము గలిగెనా? దృప్తురాలై యింద్రియపరితృప్తికిఁ గాను బాధ్యతలనెల్ల బరిదాన మొనర్చినందులకు దా పరితాపింపక పరితోషించుట మనకుఁ బరివేదనముఁగూర్చునా? పరిదాహమా? పరోపకారార్థము స్వసౌఖ్యనిర్వాపణము త్యాగమగును గాని తన కాముక ప్రవృత్తిపరితృప్తికై హితులను సన్నిహితులను బరిక్లేశ పఱచి పరితపయ మొందించుట త్యాగమగునా? ఇఁక సత్త్వవ్యసనపరాయణతయే త్యాగనిరతి యని నిర్వచింపవలసివచ్చునుగదా! రాజేశ్వరి తీవరకత్తె గావచ్చును; తెంపరి గావచ్చును; ఆమె చేసినది తెగువయు సాహసము నవవచ్చును. త్యాగ మేమాత్రము గాదు. స్వార్థరాహిత్యము త్యాగశీలమునందలి ప్రధానగుణము. గవ్వ పెంకుఁగు గజిబిజిమాటలతో రచయిత యెంత గారడిచేసినను నవలయందంతటను నంతులేని స్వార్థవ్యామోహములే తాండవించుచున్నవి. త్యాగగుణమా కలికపుఁగలికి రాజేశ్వరి యొద్దఁ గలికమునకైనఁ గానరాదు.

## భావుకత పూజ్యము

రచయితగారే పాత్రల ముఖమునఁ దమ యుద్దేశములను బ్రకటింపనెంచిరో యా పాత్రలలో విజ్ఞానలక్షణముగాని చిత్తసంస్కారముగాని వాక్చుచిత్యముగాని చూపరైరి. అమీరురాజేశ్వరులు సాగించితి మనుకొనిన సరససల్లాపములలో విరసతయుఁ బ్రలాపములు మాత్రమే మెండు. ఆమె తన పూర్వభర్తను బూర్వకులమును నీచ పఱచుచు దూషించుటలో సంస్కారము లేదు. అట్లే బంధుదూషణయందు వాగ్వైభవము శూన్యము1. అమీరు తన ప్రియురాలి పూర్వభర్త నెపుడు దూషించినను తనది

---

1. "భార్య కౌగిలించుకోడంవల్లనో భయంవల్లనో భేదంతెలీదు: ఇట్లాంటివారు మన భర్తలు! వాళ్ళకి పెళ్ళాలుకావాలా! దేహంలో అక్రమంగా కలిగే ఆ కామ రోగాన్ని మన ద్వారా కక్కుమూసుకొని నయంచేసుకోవచ్చు" ('మైదానం', పుట-6).
2. 'నా కామమా, నా త్యాగమా నన్నీ కైదులోకి తెచ్చింది?' ("మైదానం" పుట 8).
3. "...నరుకుతా, ఒకొక్కముందనే కొప్పువట్టుక లాగి"–('మైదానం' పుట 18).

మహమ్మదీయమతమన్న విషయమును మఱచిపోఁడు1. ఆతని తిట్టులకు రాజేశ్వరికి నొవ్వు కలుగదు; నవ్వువచ్చును. ఇంతటి యమానుష మీమదనురాగములేని వారిలో సైతము చూడఁబోము. భర్తపై నెంత ప్రేమలేకున్నను సంతానవంతులగువఱకుఁ గలసియుండుట యనెడి కారణమువలనఁ గొంతయైన యనురాగబంధ మేర్పడియుండదా? గార్హస్థ్యజీవితమునందుఁ దృప్తిలేనిచో మాతృత్వము సిద్ధింపదని శ్రీ చలము గారివాదులకే తెలిసినపుడు శ్రీవారికిఁ దెలియదా2? ఆ యింద్రియతర్పణమువలనఁ గొంతకాల మనురాగము నిలిచియుండునే! మనతో జనవునుం బరిచితియుఁగలవారు సుస్పష్టముగ దుర్మార్గులని తెలిసినప్పుడే మోగాని, లేనిచో వారి నోరులు నిష్కారణముగ దూషించునప్పు డోర్చుకొనుటయే గాక యానందించుటయుఁ గలుగునా? తన భర్తను నాతని మతమును దురుష్కునిచే దిట్టించురాజేశ్వరి పూర్వజన్మతపస్సంస్కారమేమందుము3? పోనిమ్మనుకొనుటకు రాజేశ్వరిభర్తచేసిన దోష మేమైనఁ జూపఁబడినదా? ఈమె యుద్దమ్యమాన పరిప్లుతాధిక కామనివారణమునకుఁ జాలకపోవుట వినా, యా భర్తయందు ద్రోహచింతయున్నట్లు లేదు. అంత ద్వేష్యుఁ డగుట కాతఁడుచేసిన ద్రోహ మగపడకున్నది. అట్టివానిని దనప్రస్తుత ప్రేయాంసుఁడు తూలగించుచుఁ దూలఁబలికిన నెట్టి సభ్యత గలనాతియైన నవ్వులతో ప్రేరణసేయునా?

## వర్ణనల యౌచితి

అమీరుతో రాజేశ్వరి జలక్రీడాదికము వర్ణితము4. ఇట్టి వర్ణనలవలన రచయిత చాపల్యముగల యువకుల నాకర్షింపఁగలఁడు5. కాని సంయమనశీలుర కివి యౌచితీ

1. ఆ వంది మీదా, ఆ కుళ్ళు సిబ్బ మీద!" ('మైదానం'—పుట 19).
2. "రతితృప్తిలేనిది గర్భధారణములేదని...పాశ్చాత్యవైద్యులు వెల్లడించారు" ('చలం'—పుట 405-పంక్తులు 22-24).
3. "మీ నరకంలో యెవ రుంటారు?" అని రాజేశ్వరిప్రశ్న. "హిందూస్త్రీదరుకాఫర్లు." అని అమీర్ రాజేశ్వరి పూర్వభర్తను దూషించుట
4. ఆ యేటిలో రాత్రులు ఇద్దరము బట్టలన్నీ ఇవతలపారేసి స్నానం చేసేవాళ్ళం నీకర్థమౌతుందా ఆ ఆనందం...ఇద్దరం నీళ్ళలో దొర్లుతూవుంటే అమీర్ వేళ్ళు నా జుట్టునీ, బుజాల్నీ, రొమ్మునీ, తొడల్నీ తాకితే నాకు చెరువులో తామరకాడలు వొంటికి తగిలినట్టుండేది. ('మైదానం'—పుట 21)
5. డి. హెచ్. లారెన్సు 'లేడీ ఛాటర్లీ ప్రేమికుఁడు' ('Lover of Lady Chatterley') అను నవలను 33 యేండ్లకు మునుపు వ్రాసెను. ఆ ప్రఖ్యాతాంగ్లనవల యశ్లీలపూరితమని దానిపై నాంగ్లప్రభుత్వ మాంక్షవిధించినది. లండను న్యాయస్థానములోఁబడిన యభియోగ ఫలితముగ నిటీవల చర్చానంతరము (2-11-1960 బుధవారము)న దానిపై నాంక్ష సమంజసముకాదని ప్రాడ్వివాకులు తీర్పునొసఁగిరి. ఈ నిర్ణయమువలన నేఁటి బ్రిటిషు ప్రముఖుల దృష్టిపథము మాఱినట్లు విదితమైనను మొత్తముమీఁద నింగ్లాడులో మంచి చెడులనడుమ సంఘర్షమున్నట్లుఁ దెలియఁగలదు. నేఁడు మనదేశమున నట్టి సంఘర్షమే లేదు. సర్వము నిరాఘాటముగఁ జెల్లును.

మండవు. సర్వసాధారణసాంసారికజీవితములోని ప్రణయమార్గమును ధిక్కరించిన రచయిత తమ యీ నవలలో నుత్కృష్ట ప్రణయమని చూపబోయి, చూపినది కేవలము మోహము, నున్మాదమేగాని తదన్యముకాదు.

## ఏది హానిసత్వము

సుస్పష్టము, సుసాధ్యము, చైతన్యవంతమునైన యాశయములతో జీవితము నొక సాధనలీలగా భావించి జగత్కల్యాణమునకు నాత్మోన్నతికి గూడఁ దోడ్పడు నాదర్శముల నిమిత్తమై జీవించనట్టి జీవితమే యుత్కృష్టమను బరిపూర్ణముఁ గా గలదు. అట్లు ఏక ప్రథమ సందర్శనమునందు కలుగు బతుకు ప్రేమమాత్రమువలని మోహమును నిగ్రహించుకొనలేక యొకస్త్రీ తన యావత్సంసారమును, సంఘనీతిని గూడఁ బరిత్యజించి, ప్రియు ననుగమించుటలోగల యుత్కృష్టత యేమి? భర్తృదాస్య మొల్లనిది ప్రియునకు దాసియగుట కాదా? చతుర్విధపురుషార్థములయందు నిమగ్నము కావలసినమనస్సును గేవలము తాత్త్వీయపురుషార్థమునకుఁ దార్చుటయే కదా!

పోఁగా సాధారణ సంసారములలో స్వేచ్ఛాస్వాతంత్ర్యములు తక్కువయను వాదమున నెంత సత్యము గలదు? సృష్టిలో సంపూర్ణస్వాతంత్ర్య మెవ్వరికి? స్వేచ్ఛావ్యాజమున, సభ్యత, స్నేహము, సౌమ్యత, బాంధవ్యము, ననురాగము, విజ్ఞానమును గూడ వదలుకొనుదుమా? వదలుకొని రాజేశ్వరి సాధించిన ప్రయోజన మేమి? ఆమెకు సిద్ధించిన స్వైరిత యెట్టిది? నిర్నిరుద్ధమోహావేశమునకు హానిసయగుటయేకదా! సర్వేంద్రియ వ్యాపారముల మూలమనను మనస్సు పొంగులెత్తి పరవళ్ళుద్రొక్కుచుండఁగఁ దదమ్య వికారములకు లొంగిపోవుటకంటె ఘోరమైన హానిసత్వ మేముండును?

పోని మ్మనుకొన్నను నిది వాస్తవికత యనఁబడు వాధునిక వాదముదృష్టిచే గూడ సమర్థనీయముకాదు. రచయిత మానవులను దేవతలుగఁ జేయఁబోయి దానవులను జేసెను. వీరి పాత్రలకుఁ గామతృప్తియు, మోహాతృష్ణయు వినా జీవితములో నింకేదియు నక్కఱలేదు. అవి కొందఱ కాకర్షణీయముగా నుండును. కాని సాధారణారోగ్యవంతుల కసహ్యకరములుగ నుండకతీరవు. సాధారణ కామగాములగు పాత్రలమూలమున దన యాశయముల నెల్లపుడు వెల్లడించుటకుఁ బూనుకొనుట వలన రచయితకును గామచారమునఁ బ్రీతిమెండని యపోహము గలుగుటకు వీలున్నది. ఆ కామగులైన పాత్రలఁబోషించుట యందు నైతము సామర్థ్యమును నెఱపి యున్నచో గొంతవఱ కిట్టి వ్యతిరేకఫలము కలిగెడిది కా దనవచ్చును.

ఇవి కామశాస్త్రవిషయములు; కావున నెల్లరు వీనిని విమర్శింపలేరనెడి దొక వాదమున్నది. అగుచో నా శాస్త్రపరిజ్ఞానమునకు సారస్వతరూపకల్పనఁ జేయఁదలఁచిన రచయితృ సాంఘిక సేవాభిలాష మెచ్చఁదగినదేకాని సంఘటనలలో ప్రాయోభావము[1], సంభావ్యతయు[2] లోపింపరాదు. ప్రజాదరముఁ బొందఁనగు సాహిత్యము, స్వాభావికతకు సన్నిహితముగ నుండవలెను. సంఘటనలను పాత్రలను వాస్తవికతాదృష్టితో బరిశీలించు దినము లివి. ఒక జీవితసత్యమును సాధింపని రచన రచనగ మన్ననఁబడఁదు. కామగుణసంబంధిసమస్యలను జేపట్టి వ్రాసినను గామమునకేదప్ప మఱి యే విషయమునకు జీవితములో స్థానములేదన్నట్లు స్ఫురింపఁజేయు నసాధారణపాత్రలను సృజించుటవలనఁగలిగిన లోపమే యిది. సాధారణీకరణములేనిచో వాస్తవికవాదులుగూడ దానిని వాస్తవికతాదూర మందురు. అది సమాజసజీవచిత్రణము కాదన్నమాట. నిర్జీవపాత్రలు, సన్నివేశములును వికృత స్వరూపధరములుగ నుండుటయం దాశ్చర్యము లేదు.' మైదానం'లో ప్రచారమునకు సారస్వత కళను సరిగ నుపయోగింపఁజాలకపోవుటవలనఁ గలిగిన దుష్టఫలిత మిదియే.

## అస్పష్టత

[3] చలముగారి తొల్లిటిరచనలలో గొంత సంస్కర్తృభావ ముండెడిది. స్త్రీలవిషయమునఁ గొంత సానుభూతియుఁ గలదు. పోనుపోను వారి రచనలలో నస్పష్టత పెచ్చు పెరుగుచువచ్చెను. స్త్రీలయందు నిరసనగూడఁ బ్రదర్శింపఁబడినదా ? యనవచ్చును. పరిశీలింపఁగ దీనికొక హేతువు దోఁచుచున్నది. చలముగారిలో నిష్పాక్షికతయు నిదానమును గొంత తగ్గినవి. సంఘమును వారు సమ్యగ్దృష్టితోగాక వక్రదృష్టితో బరిశీలించుచున్నారు. లైంగిక సమస్యలు జీవితములో బ్రధానములే యనకతీరదు. కాని యెంత ప్రధానములైనను నితరప్రవృత్తులను వాసనావిశేషములనుగూడఁ గప్పిపుచ్చఁ గలవి కావు. అన్నింటిని గప్పిపుచ్చఁగల లింగజ్ఞానసహితమైన వైషయికాసక్తి వాంఛనీయమని 'మైదానం' బోధించుచున్నట్లుఁగూడ స్పష్టముగఁ జెప్పలేము. కొన్ని మృగములలో బ్రదర్శింపబడు కామప్రకోపము ప్రత్యేకమైనది. అట్లే యాదిమవాసులలో గొందఱియందుకూడ. అది యాయా జంతువుల నాయావ్యక్తుల నావరించి

---

1. Probability 2. Prossibility

3. రష్యనులు వ్యవసాయిక ప్రచారమును గథలలో నెంత కాంతాసమ్మితముగఁ జేయుదురో దానిలో నెంత లాలిత్యముండునో చూడుఁడు అట్లే యమెరికనులు కార్మికప్రచారమును జేయుకథలు చూఁడుడు. "గొల్లభామ" అమెరికను కథ, రచన—విలియం సారోయాన్ అనూదితము—అమెరికన్ రిపోర్టర్, పుట 8—నవంబరు 4, 1960.

'పోషకములుగ నుండవు'. అంతటి త్యాగధనురాలు నిర్మింపనున్న యాదర్శక ప్రణయ నూతనసిద్ధాంతములకీ వర్ణనము లెంతవఱకు సాధకము లన్నది ప్రశ్న. రచయిత ప్రేమౌన్నత్యమును నిరూపించుటకుగదా కలముపట్టినాఁడు! నన్నయనుండి నవ్యులవఱకు నెవ్వరును స్త్రీ ప్రణయ పులోకితులను ద్రవ్వరైరి ఆమెను ప్రేమాధిదేవత యని యారాధింపరైరి యనిగదా వీరిచింత! అట్టి యగాధప్రణయము ప్రకృతము నిరూపణీయ మగుటవలన నీ వర్ణన లౌచిత్యపాలకములా? యని యాలోచనముగాని యట్టి జలక్రీడా విహారాదివర్ణన లపూర్వము లనుటమాత్రము కాదు. నగ్నస్నానము చేయనచ్చును; లేదా సచేలస్నానము, శిరస్స్నానము, శృంగారవర్ణనలు చేయుదురు. వానినిగూడఁ గూడదని విమర్శింపరాదు. శృంగారమునందునైతము శుచిశుభ్రతలకును సారళ్యతారుణ్య లాలిత్యములకును స్థానమున్నది. నగ్నస్నానాదికములో శృంగారక్రీడావిశేషమేగాని ప్రత్యేకప్రేమగభీరత యేమి వ్యక్తమగు? నన్నదియే సంప్రశ్నము. విశేషప్రేమచిహ్నమేమైన భాసించినచో నీ వర్ణన లౌచితీపరిపోషకములుగ నుండెడివి. రచయితను గమ్యమునకుఁ జేర్చెడివి. దీని నంతయు రచయిత వాస్తవికతయని పిలుచునేమో! వ్యక్తములు గాని విషయములఁగూర్చి వాస్తవికతా వ్యాజమునవ్రాసి, యింద్రియోన్మాదముఁగొలిపి జాతిని నిర్వీర్యపఱచుటయే పరమ ధర్మముగా భావించువారికి చలముగా రిందువలననే పరదైవము. వీరు యశఃప్రార్థులు గారు; జాతిశ్రేయోభిలాషులు. ఆచారములు, సంప్రదాయములు వలదనిరి. కాని వీరిదని యొక యాచారము నొక సంప్రదాయము వెలకొని లోకమును దిండ్రించు చున్నది.

## ఏది నూతన వికాసము?

రాజేశ్వరివంటి యామెను జూడవచ్చును. అప్పటి యామె ప్రసంగము గాని, అమీరు చేసిన యవమానమునగాని యున్నతికి నిదర్శనముగాదు. క్రొత్తగా వచ్చిన యావ్యక్తియెదుట నా యొక్క రాత్రిగూడ వారు నర్మోక్తులు మానుకొనలేక పోయిరి. ఆ సరస సల్లాపములవలన బిడ్డలతల్లికి యౌవనము వచ్చెనని చదువరు లనుకొందురా? ఇది వారియందు బహుశః నూతనజీవితవికాసచిహ్నమని రచయిత భావమేమో! చలముగారి రాజేశ్వరి బంధువులను పరిత్యజించినది; స్నిగ్ధులను జేరనీయదు. ఎల్లరకు జీవితములోనుండు కోరికలను సౌఖ్యములను వదలుకొన్నది; వీనితో బాటుగ విజ్ఞానమునకు, మానుభూతికి, సభ్యతకునైతము 'తిరునామము' పెట్టెను. దివారాత్రము లేర్పడుటయు నెఱుఁగని మోహములో బడి వారిరువురు నట్లుండుట సంభవమగు విషయము గాదు. ఇదియే ప్రబంధాదులయందైనచో నా సంగతి వేఱు. అప్పు డతిశయోక్తి యని చెప్పుదుము. ఇది వాస్తవికతా యుగమునకుఁ జెందిన నవల. నాయికానాయకుల వయోధర్మమును బట్టి యిట్టిది స్వాభావికతకు దూరము. ఒకవేళ సంభావ్యమేయైనను నేమంత యాదర్శప్రాయము? అందుకే చలముగారిని కేవలము కాల్పనికవాది యనుట.

## ప్రేమలక్షణ మెట్టిది?

ప్రేమలక్షణము ప్రశాంతత; కామోద్రేకముకాదు. తన్నంతగా నాకర్షించిన అమీరెట్లు నిత్యము ప్రేమ ప్రకటించెడివాఁడో రాజేశ్వరి చెప్పుకొనును. ఆమె వ్రీడా శూన్యతయు నాతని పశుప్రవృత్తియు నిందువలన విదితమగునేగాని ప్రణయో దాత్తత యెందును విదితముగాదు[1]. ఆమెకొఱకు కామోతంద్రుఁడైన చంపుదునని యొక సందర్భమునం దీ యమీరు పల్కినాఁడు. ఆమె గర్భవతియైనప్పుడు తద్గర్భస్థశిశువు నామెకుఁ దనకును మధ్య దయ్యముగా భావించెను. ఈ యీ యుదాహరణముల వలన నతనిది గ్రుడ్డివ్యామోహమనియు నసహజకామపీడయనియు వ్యక్త మగుచున్నది; కాని రచయిత యాశించిన దివ్యప్రేమమయజీవితచిత్రణము గాదు. ప్రేమగల తావుల యందునైతము కొంత మోహము కొంత కామము నుండుట సహజము. కాని యవి తమ తమ నెలవులు దప్పక యుండదగును: అమీరువందు విజృంభించినంత యుద్ధృతమును గలుగకుండనమును జూపక, ప్రణయసూత్రములకును లోకమర్యాదకును బద్ధమై యుండుట ధర్మము. అప్పుడే యుత్కృష్టము, నిర్మలమునగు ప్రేమమయజీవితయాత్ర కవి సాధనములు కాఁగలవు. అట్టి ప్రశాంతిలక్షణయుతమైన ప్రణయమునకు ఫలముగా హృదయము ప్రఫుల్లమై సౌమ్యమై యుండును. సౌమ్యతతోఁగూడిన హృదయము సానుభూతికి నిలయము. సహానుభూతిగలచోట వైరస్యము, నవహేళన, నిరసనయు

---

1. "పళ్ళు కొరికి పట్టి...రావూ? రావూ? రాకపోతే చంపేస్తా నిన్ను అన్నాఁడు."
("మైదానం"—పుట—7).
"నేను చస్తోవుంటే నిన్నూ చంపుకుంటా అన్నాఁడు."
"పోనీలే పాపం నీకోసం నేనూ చస్తాలే అన్నాను."
"చావకపోతే చంపుతా" ("మైదానం"—పుట 19).
"ఒక నిమిషం నా వొంటిమీద బట్ట నిలవనియ్యఁడు" నా రవికలన్నీ ఒక్క పది రోజులలో చింపేశాడు ('మైదానం', పుట 28)
ఒక్కొక్కప్పుడు అతడు నన్ను విరిచేస్తాడేమో, తినేస్తాడేమో అన్నంత భయం వేసేది.... నన్ను అదుముకుని, ఇంకా అదుముకుని, ఇంకా తనతో నన్ను కలిపేసుకోవాలని అతను పడేబాధని చూస్తే నేను బతకడమే అతనికి యిష్టంలేదా? ఆ కళ్ళల్లో వెలిగేది ద్వేషంకాదా? అనిపించేది"—('మైదానం' పుట 29).
"నేను బాధతో అరచినకొద్దీ,నా పెదిమల రక్తం రుచిచూచిన కొద్దీ పులివలే ఉద్రేకిస్తాడు. అతనికి పిచ్చెక్కిందేమో! నారక్తం అట్లా పీల్చి చంపే రాక్షసి కాదుకదా! అని వొణుకుతాను" ('మైదానం', పుట 30).

నవలలని వీనిని శ్రీ చలము గారులు స్తుతింతురు. వారి మతమును బట్టియే యీ 'వాహ'మను నవలను విమర్శించి పిమ్మట సర్వసాధారణపాఠకులకు దోచు సందేహములఁగూడ నిందు జర్చించుట యుచితము.

వెంకన్నయు రామమూర్తియునన్నదమ్ములు. అన్న 'డెప్యూటీకలెక్టరు'; తమ్ముఁడుపాధ్యాయుడు; స్వాతంత్ర్యవాది. సోదరులకు సమస్తవిషయముల యందును సమ్మతియు దెడి దనలేదు. ఇరువురకుఁ గొన్ని యభిప్రాయములలో సరి పడెడిది కాదు. కొన్నాళ్ళకు రామమూర్తి భార్యను గూతురును వదలి పరలోకమును బ్రాపించును. అన్న వెంకన్నపంతులకిష్టము లేకపోయినను వచ్చి మఱ దలిని కూతును దన యింటికి దీసికొని పోయినాడు. ఇతని భార్యమేనమామ వెంకటరావు, 'జిల్లా జడ్జి'. అతఁడును సంస్కరణాభిలాషి;ఒక పేద విద్యార్థికిఁ జదువు జెప్పించుచున్నాడు' ఆ కుఱ్ఱవానితల్లి వెంకటరావుగారి యింటిలో వంట. ఆ కుఱ్ఱవాఁడు బుద్ధిమంతుడు' తెలివితేటలు గలవాఁడు. ఆ కుఱ్ఱవానికే ద్యే వాహయినకు నొప్పింతుననియు, నాతని విద్యావ్యాసంగమున కయ్యెడు వ్యయము వెంకన్నగారిదేయనియుఁ జెప్పి, వేంకటరావు గారు వెళ్ళిపోయిరి. ఆయన పంపగా వచ్చిన గోపాలరావు వెంకన్నగారియింటికి వచ్చెను. అతఁడు 'స్కూలుఫైనల్' పరీక్షలో నెగ్గినాఁడు; వెంటనే యతనికిని రవ [మ]ణకును దేవాలయములో వివాహము నిర్వర్తింపఁబడినది.

'రవణ' వెంకన్నపంతులుగారిగృహములో జాల నిర్వాహకురాలైనది. గృహమునకు నూతనశోభ వచ్చెను. రవణను బెండ్లియాడుటతో గోపాలరావు వెంకన్న గారి యింటిలో జీతము, బత్తెము లేక, కూతురు దెచ్చు బంట్రౌతుగా మాఱిపోయెను. ఆతని తల్లి యిప్పుడు వీరి యింటిలో వంటలక్క.

'ఓవర్‌సీర్' పరీక్షకు జదువుటకై గోపాలరావు చెన్నపట్టణము వెళ్ళును; మఱల సెలవులకు వచ్చినాడు కాని వెంకన్న పంతులుగారి యింట్లో రవణతప్ప దక్కిన వారందఱు నతనిని దోటకూరలో బురుగునువలె విదలింతురు. తిరిగి యతఁడు పట్టణము చదువునకై పోవును.

వెంకన్నపంతులు బావమఱది కవి. అతఁడు చుట్టము చూపుగా వచ్చి యొక సారి రవణను జూచి వ్యామోహపడినాడు. ఒక యర్ధరాత్రమందామెను వ్యర్థముగఁ బట్టఁబోయినాఁడు కూడ.

గోపాలరావు సెలవులకు వచ్చును. అతనినిగూర్చి యీ యింటిలో నెవ్వరికిఁ బట్టదు. అత డెవ్వరికి నేమియుకాఁడు. వెంకన్న పంతులు సంతాన మతని ననేక రీతుల నవమానపఱచెడిది. అన్ని యవమానములు నారోపణములు సహించి యాతఁడు మఱల మదరాసు చదువునకుఁ బోవును.

వెంకన్న పంతులే యొకనాఁ డెవరి యింటికో భోజనమునకుఁ బోయివచ్చి, పరుండి రవణపైఁ దలపుమఱలి యామెను వశపఱచుకొనుటకై యర్ధరాత్రముదాటి నిద్రవేళలో సకలప్రయత్నములు చేయుచున్నాఁడు. రవణ దూరముగా జరుగుచున్నది; వదలించుకొనుచున్నది. పట్టి బలాత్కరించు ధైర్యము పంతులునకు లేకపోయెను. ఆమె యచ్చటినుండి యావలకు వెడలిపోయినది.

పురుషమనస్తత్త్వనిదానము నిచ్చట రచయిత యుద్దేశించినాఁడు. పురుషుల బుద్ధికి వారి వయసులు తక్కువ. గ్రంథములయందు కవులు శ్రీరంగనీతులు చెప్పుదు రందురు. వారేకాదు; స్త్రీ వ్యామోహావిషయమునఁ జాలవఱకు మొగవారందఱు నొక్కబడిలో చదువుకొన్నవారే!! అననుచిక్కుట యొక్కటే తడవు.

వెంకటరావుగారు వెంకన్నగారి యింటికి వత్తురు. తనకు నిత్యము జరుగు నవమానముల నన్నింటిని గూర్చి యాయనతో జెప్పికొనినాఁడు, గోపాలరావు. 'జడ్డి' గారు వేసఁగి సెలవులలో రమణాగోపాలరావులను దమ యింటికని తీసికొనివెళ్ళినారు. ఆ రైలుప్రయాణ మొక మధురఘట్టము. రమణప్రక్కనే గోపాలరావు. వారిలో విహితమై, నిహితమై, సంపిహితమైయున్న ప్రేమాంకురము పొటమరించును. ఒకరిమనస్సు లొకరెఱు ఁగఁ గలిగిరి. ఆప్యాయన మధిక మైనది. రమణ విఖ్యాతములను గోపాలరా వర్థముచేసికొనినాఁడు. "నే నేమంటే నేం? నువ్వు యోచించు? చదువుకున్నవాడివి. మీరు సొంతంగా యోచించరు. టీచర్లదగ్గరా, పుస్తకాల్లోనూ చదివిందే నిజ మనుకుంటారు. నువ్వే మనుకుంటావు?" అన్నది మంగమ్మ. రచయితపక్షాన ఆలోచించుట పూర్తిగా మానివేసినామని మనలను గిరీశము తిట్టినట్లుఁ దిట్టవలెనని చలముగారి కున్నది. తాము స్వతంత్రాలోచనాపరులగుటవలననే యిన్ని బాధలుపడితి మనికూడ వారి యూహ.

రమణది మునుపు బందరు. కావున నా బడిపిల్ల లాప్యాయకులై యామెను చూడవచ్చుట సహజము. ఆమె వారితో చనవుగ మాటలాడును. గోపాలరావున కది యంత యు ననుమానమే! సాధారణముగ నింతకుమించి పురుషు లెదుగలేరని రచయిత వ్యాఖ్య. స్త్రీకి స్నేహము, పరిచితి, పరులతో నరమరికలేకమాట్లాడుట మున్నగునవి యావశ్యకము లని పురుషులు భావింపరు. కాంతాకాంచనవర్జితులుగానివా రామెను దానితోబాటుగఁ దాఁచియుంతు రని చలముగారి హేళన.

1. "ఏమి మగవాళ్లు" అనెడి శ్రీ పాకాల రాజమన్నారుగారి నాటిక, స్త్రీపురుష బుద్ధుల వ్యత్యాసమును నిరూపించునది, యీ సందర్భమునఁ దలఁపునఁ బారునట్టి చక్కని కృతి.

యుందు వాతావరణప్రభావము; ప్రకృతిసిద్ధమై ప్రకోపించియుండు నవాగరకమై నయి కోద్రేక మది. నాగరక వాతావరణములో బుట్టిపెరిఁగిన సామాజికులయం దది ప్రదర్శింపఁబడదు. అట్టిది నాగరకతకు విరుద్ధముగఁ గొన్నిఘట్టములయందు 'మైదానం'లో వర్ణితము.

నేఁడు సాధారణప్రజల గార్హస్థ్యజీవిత మంత తేజోవంతము గాకపోవచ్చును. ఇట్టి కొన్నింటిని ప్రధానమైన లైంగికసమస్యలుగఁ బరిగణించినను సాంఘికములైన వానిని ప్రేమసంబంధములైనవానిని శయనాగారపు పేర్పాటులలోని లోపములను గూడఁ బై వానితో ముడిపెట్టరాదు. తన్మూలమున నే సమస్యకుఁ బరిష్కారమార్గము స్ఫురింపక యంతులేని యస్పష్టతాంధకార మొకటి యల్లుకొనును. మానవజీవితసంబంధి సమస్య లన్నిటికి నే కొంచెమో సంఘముతో సంబంధ ముండకతప్పదు. అంతమాత్రముచే వాని నన్నింటిని సాంఘికసమస్యలనఁ జాలము కదా! భౌతికరసాయనాది సమస్త శాస్త్రసమస్యలకు మానవజీవితముతో నింతయో యంతయో సంబంధము ండును. కాని వానిని ప్రముఖముగ భౌతికరసాయనాదిసమస్యలని వ్యవహరించుట యుచితము. అట్లే లైంగిక, ప్రణయ, సాంఘిక సమస్యల కెంత సాన్నిహిత్యము న్నను నవియెల్ల లైంగిక సమస్యలు కావు. వాని వానిని ప్రత్యేకవిషయములుగఁ బాటించుట యుక్తము. ఇట్టి యావశ్యకతను (శ్రీ) చలముగారు రెండువలననో పాటింపక యంతులేని యస్పష్టతకు దారి తీయుచు నవలలో సమస్యలను గలగలిపి పులగము చేయుచున్నారు.

## అంతస్స్ఫూర్తి[1]

చలముగారు తా నంతశ్శుద్ధితో వ్రాయుచున్నా నందురు. ఇఁక వారి యనుయాయుల మాటలతో బనియే మున్నది? వారి 'మ్యూజింగ్సు' మున్నగు వాని ప్రమాణములు చాలును. ఒకవేళ వారిది సదుద్దేశమైయైనను[2] లోకమున కా యర్థము గోచరించుట లేదు[3]. లోకము వారి నపార్థముచేసికొనుట కవకాశములు చిక్కినవి. అందస్పష్టత యొక హేతువు. ఆయన యశఃప్రార్థి యనుటకు నిదర్శనము లున్నవని మున్నుఁ జెప్పఁబడినది. తన్నుగూర్చి యెల్లరుఁ జెప్పుకొనుటయే తన గొప్పతనమునకు

---

1. అంతస్స్ఫూర్తి, అంతశ్శుద్ధి యనగా Sincerety.
2. "కొందరు ఆధునిక కవులవలె "నా మంచిపాట నేను పాడుకుంటా!" నవక సంఘశ్రేయావికై సాంఘిక రచనలను చేయటం ప్రశంసింప తగినది". ("చలం" ముగింపు పుట 548—పంక్తి 13).
3. "చలం చాలా అపార్థమైనాడు" ("చలం" పుట 365—పంక్తి 13).

నిదర్శనమని యాయన వాదము. వారి మిత్త్రులు నట్లే భావింతురు[1]. కాని లోకోప
ద్రవమునుగూర్చి కూడ నెల్లరకుఁ బట్టునుగదా![2] వారి కలములోని వాడిమికి, వేడి
మికి వీరాంగముతో వెలువడు నిష్ప్రతిరోధావేశమే కారణము. 'బాణాసురుని భల్లము
వంటిద'ని పేరుమోసిన వీరి కలమునుండి యరిషడ్వర్గములు ప్రకోపించి శైలీరూపమున
ధారాప్రాయముగఁ బ్రవహించును. విషయము, నావిధానము గూడ నేఁటి యువకు
లను గామోద్రిక్తులఁ జేయుచు నాకర్షవంతమై యుండును. ఒకటిమాత్రము శ్రీ
చలముగారిలో నున్నది. తాము నమ్మినవి తప్పులైనను సరియే యా యుద్దేశములను
సిద్ధాంతములను మొగమోడక మొండిధైర్యముతో జెప్పఁగలరు. వారికి నీయసా
ధారణధైర్యసాహసము లున్నవి. తమ విశ్వాసములను జాలవఱకు అనుపానయోగ్యము
లుగ గూడఁ జేయుదురఁట! చెప్పెడివాని నట్లాచరణములో బెట్టఁగల్గుట గొప్ప విష
యమే! కాని యవి సదాశయములగూడ నైయున్నచో బాగుండెడివి. వారికి
స్పష్టము ప్రశాంతమునగు సమగ్రయోజన కొన్ని సందర్భములలో లోపించినట్లుఁ
దోచును. ముఖ్యముగ సాహిత్యనవలాదృష్టితో సారించు రచనలయందు కంటెఁ
బ్రచారదృష్టితో సారించువానియం దెక్కుడు అస్పష్టత కానవలెనుగదా! నిర్నిరుద్ధా
వేశముతో, భావావేగముతో, బిందూషణతీవ్రతతో, సంయమనరాహిత్యముతో సాగు
వారిరచనలలో లైంగికసమస్యలు, ప్రేమసంబంధముగల సమస్యలు, సాంఘిక
సంస్కారములు మున్నగునవి పరస్పరసంబంధము నేగాక తమతమ ప్రత్యేకస్థానము ను
గూడ గుఱుతెఱుఁగియుండవలసినవి. అవి యట్లుఁ బ్రత్యేకింపఁబడమిచే వారి రచనలలో
నస్పష్టత యొకటి నెలవుఁగల్పించుకొన్నదనియు సమ్యగనుశీలనముగూడఁ గొంతవఱకు
లోపించినదనియు నింతకు ముందే సూచింపబడినది.

వివాహము[3]

శ్రీ చలముగారి నవలల క్రమములో నిది యైదవది. ఇదియు 'బ్రాహ్మణీకము' వలె
గూడ స్త్రీస్వభావమును భర్తలదౌర్జన్యమును మన సంఘజీవనమును వ్యాఖ్యానించును

1. ఆయనను గురించి అందరూ ఆలోచించడమే, ఆయన గొప్పకు నిదర్శనము" ("చలం" పుట 550. పంక్తులు 21,22).

(నవంబరు 1958, ప్రథమావృత్తి)

"మొదట ఉద్ధతులూ క్రూరులూ అయినవారు వయస్సు మళ్ళీ మళ్ళగానే ఉద్ధవులూ అహింసాపరులుగా మారడంలేదా! ...ఈ చలం మరొక విధంగా నడచి వుంటే "మా కర్మ ఇట్లా కాలింది" అని మనం పరితపించే అవసరం ఉండేది కాదు". ("ఆంధ్ర సచిత్ర వార పత్రిక" తెలుగు వెలుగులు—50, పుట 7. 7—9—1960).

3. రచన క్రీ. శ. 1928, దేశిప్రచురణ—పునర్ముద్రణము—ఫిబ్రవరి, 1956.

4. రచన క్రీ. శ. 1937.

ఎంతదా చిన నేమి ప్రయోజనము ? స్త్రీలకు శిక్షణ మగత్యము. వికాసమును గలిగింపవలెను. పురుషుడు ప్రేమించి ప్రేమింపఁబడుట క్రమము. స్త్రీ యెంతసేపుఁ దన యానందమును దనలో ద్రవ్వుకొనుచు దిరిగి పదిలముగ నిక్షేపించుకొని భర్తృ ప్రేమ స్మరించుచు మురిసిపోఁగలదు. పురుషుఁ డెంతసేపు ననుభవింత; దాఁచికొనలేఁడు. ప్రేమవిషయములో స్త్రీల కున్నదితృప్తి: పురుషుల కనుభవించినదితృప్తి. ఇది చలము గారి మతమునుబట్టి స్త్రీ పురుషుల ప్రేమతత్త్వము. బందరునం దింతమంది కళాశాలా విద్యార్థులతో రమణకు మైత్రి; అందఱితో గలిసిమెలిసి తిరుగును. తనతో నుత్తరోత్తర కాఁపురముచేయునా ? గోపాలరావులో నీర్ష్య కిది యంకురార్పణము. వెంకట్రావు గారితో నెదుటఁబడి చెప్పలేక గోపాలరావు "కార్యం చెయ్యండి" అని యొక చీటి వ్రాసి వారి బల్లమీఁద పెట్టినాఁడు.

ఆయన దానిని చూచుకొని 'మీరు అతిథులు; ఇందులో నా యిష్టమేమున్నది?" అనెను. "రమణ మీరుచెప్పినది యొప్పుకొన దనినాఁడు, గోపాలరావు. "రమణను నీ వర్థము చేసికొనలేదు; అమూల్యమైన పిల్ల: స్వతంత్రాలోచనలు గలది. ఆమెను దిన్నగా నర్థముచేసికొని తరింపు మ"నినాఁడు, వెంకటరావుగారు.

భర్త కెప్పుడు భార్యను నమిలి తినివేయవలెననియే ధోరణి. యౌవనమునకుఁ దోడుగఁ బట్టరాని మోహపిశాచము పట్టుకొన్నది. గోపాలరావు రమణకొఱకై యెన్నో ప్రయత్నములు చేసినాఁడు. అన్నియు వ్యర్థమైనవి. స్త్రీ విషయములో బురుషున కధికమైన ప్రేమ, ద్వేషముగా మాఱుట బహుసులభము. కోపము, భగ్న ప్రేమవంటివానివలన నరుఁడు పశుతుల్యుఁడగునని చలముగారి సందేశము.

ఆమె రానందుల కామె నాతఁడు కోసిఁ కొఱతవేసినాఁడు. రమణ యన్నిటిని సహించినది. చివఱ కాత. డేదువసాగెను. అప్పుడు రమణ నోరు మెదపినది. ఆ రాత్రి మొదటిసారిగ నాలోచింప సాగినాఁడఁట!"రమణ యెందుకు రాదు?"అని గోపాలరావు. అంతమాత్రము నిగ్రహములేక భర్తలకు సులభముగ వశపడునట్టి భార్యలు త్తమ యమా యకురాండ్రు; నవివేకినులు నని గోపాలరా వనుభవముమీఁద దుదకు గ్రహించినట్లు శ్రీ చలముగారి భాష్యము.

ఆమెకు. బెంకితనము, నతనికిఁ గోపము, రెండును జన్మజన్మాంతరములనుండి వాసనావిశేషములుగవచ్చు సహజానుబోధములు. ఇద మిథ్య మని తెలిసి ప్రయోజన మేమి ? తెలిసినంతమాత్రమున నందఱు వీనిబారినుండి తప్పించుకొన గలిగినారా ? స్త్రీ చూపు దిట్టతనమంతయుఁ బురుషుని కట్టివేయుటకొఱకు; చులకన గ లోఁబడని మొండిపట్టుఁదలచే నామె యతని నాకర్షించును. దీనినే వ్యక్తిత్వమును నిల్పుకొనుట యని చలముగా రందురు. కామవ్యాపారమునం దని దాని యర్థము మననుఁ కఁదింప వలెను. స్వతోరమణీయమైన చాతురియు, నాత్మబుద్ధియు నశించినచో స్త్రీల కునికి

పట్టే లేదు. తమ వ్యక్తిత్వమును నిలఁబెట్టుకొనవలె ననెడి యా జ్ఞానము స్త్రీలకుఁ బ్రకృతిదత్తము. ఒకరు చెప్పరు. వారు వానినిగూర్చి యాలోచింపనైన నాలోచింపరు. పురుషునినుండి దూరముగ నుండవలెనన్న పరిజ్ఞానము వారికి జన్మతః సిద్ధించును. అది యాత్మరక్షణోపాయము. అంధముగ సృష్టి యాజ్ఞల ననుసరించుటయే యిందు స్త్రీ చేయుపని. ఆమె యట్లుఁ దన్నుఁదా గాపాడుకొనుచుండుటఁ జూచి పురుషుఁ డోర్వ లేఁడు. మూర్ఖుఁడై క్రుద్ధుఁడై యామెను బట్టిపలార్చి పీల్చి పిప్పిఁజేయ జూచును. స్త్రీ ప్రకృతిలోగల స్వీయరక్షణ మనెడి యీ రహస్యము నెఱుఁగక తన యాజ్ఞలకు స్త్రీ తిరుగఁబడుచున్న దనుకొనుట యొకటి పురుషలక్షణమైపోయెను.

రమణ కళాశాలావిద్యార్థులతో గూడిమాడియుండుటయే గోపాలరావునకు గుండెలో బుండుగా నున్నది. వెంకటరావుగారి కూఁతు రరవింద సెలవుల కింటికి వచ్చుట మఱియు బులిమీఁదఁ బుట్రయైపోయెను. ఆమెకు మదనపల్లిలో చదువు; పెండ్లి కాలేదు; ఆమెతో రమణకు మైత్రి కుదిరినది. ఇఁక నామె గోపాలరావున కగ పడుటయే లేదు.

ఒకనాఁడు రమణాగోపాలరావు లరవింద'కారు'లో వాయుసేవనమునకు వాహ్యాళి వెళ్ళిరి.. అరవిందతోనప్పుడు గోపాలరావు సంభాషించినాఁడు. ఆమె దంతయు చలముతత్త్వము. ఆమె సంభాషణమే గోపాలరావునకు నచ్చలేదు.

అరవింద కతిథిగా 'వాగ్లీ'గారు వచ్చిరి. ఆయనకు వారియింటఁ బ్రత్యేకముగ నొక గది. ఆగదిలో రమణారవిందలు నతఁడును. వీరు వినా యాగది నిర్మక్షికము.

"ఆయనయందు మీకు స్నేహమో భక్తియో యది బాగుగనే యున్నది; కాని దీనినిగూడ నా పరపురుషుని సేవకై వినియోగించుట మీకు క్రమమైనపని గాదు.'' అని యరవిందతో ననివేసినాఁడు, పట్టలేక రమణభర్త. వాగ్లీగారి నట్లు నన్యథా భావింప రాదని యరవింద. గోపాలరావునకు వాగ్లీతో భోజనములముందు సంభాషణ జరిగెను. గోపాలరావునకు వాగ్లీవిషయము సంతృప్తికరముగ లేదు. వాగ్లీతో గలిసిమెలిసి యుండ వలదని రమణ కాజ్ఞాపించినాఁడు, భర్త. ఇంతలో నరవింద వచ్చినది.

రమణ వైపు ఖరిచూచి గోపాలరావు వేడిపించుచున్నాఁడని గ్రహించి, "నరేలే! స్త్రీ జన్మ యింతే" యనుచు నరవింద పరుండెను. స్త్రీ భర్తచేతిలో గీలుబొమ్మ యనియుఁ బరపురుషుని స్పృశించుటయో లేదో కూడ నాలోచించుకొను స్వాతంత్ర్యము లేనిదనియు నిచ్చట శ్రీ చలముగారి వ్యాఖ్యాతల హృదయము. ఎంతవఱకు స్త్రీలను బంధించుట, బాధించుట, శోధించుట తప్ప పురుషుల కాత్మవిమర్శనయే లేదనియుఁ బురుషు లుత్తములగుచో లోకమంతయు బాగుపడుననియు రచయితృభావము. అదినిజమే! ఒక

పురుషులే యేం ? స్త్రీలుకూడ ప్రత్తిని చాంద్రుడు కావచ్చును. ఏదియొక్కటకు పూర్తిగ సత్తమయ్యే పురుషుడిచినను లోకమును బాగుచేయ కలదు. వాతావరణమునుబట్టి యది స్త్రీలకు సులభమని పూర్వు లనుకొనిరి. నేడది పురుషులకే సులభమని చలముగా ననుచున్నాడు. స్వస్త్రీ నెవ్వరుగ గన్నెత్తిచూడరాదు; పురుషుడు తాను గనపడిన వారినెల్లరు గన్ను లింతలుచేసికొని చూచుటయే! ఇందువలన బురుషులదృష్టి వగాలక తప్పదు. ఇది చలముగారి లోకవిమర్శనము. అగుచో నిం దొక విషయ మున్నది. ఇది నేటి పురుషుని ప్రవర్తనను గావచ్చును. ఇంతమాత్రమున దీని న్యాయ సమ్మతమనుకొన రాదు. పురుషుని మాయామసలమని పూర్వులు చెప్పిరా? మఱి నేడు మీరు క్రొత్తగ జెప్పున దేమున్నది? పూర్వమునుండియు వేయి తెఱగుల నట్టిపురుషుల వ్యవహారమును ప్రతిహాత మగుట లేదా? పురుషుడు భార్యకు ద్రోహము చేయరాదనియు, పరమహోరా జేమిచేసిననేమి? యనెడి దుర్భావనను మాఱిపోవలె ననియు నొప్పుకొనని దెవ్వరు? ఇట్టి వెల్లట బూర్వోక్తవిషయములే యను సంగతిని యశఃపరిప్ప యంగీకరింపనీయదుగాక!

వాగ్లీగారి వ్యవహారము 'ఐడ్డి' వెంకటరావుగారికే వచ్చలేదు; కూతును మందలించిరి.

మఱల నొకనాడు రమణారవిందలు వాగ్లీగోపాలరావులు నలుగురు గలిసి వాహ్యాళికి వెళ్ళినారు. వాగ్లీయు విందలింకను ముందుముందునకు బోవుచు రమణా గోపాలరావులనుగూడ రమ్మనిరి. అది గోపాలరావున కిష్టములేదు. రమణ భర్తను మన్నింపక వారివెంట వెళ్ళెను. గోపాలరావు కాళ్ళీడ్చుకొనుచు బ్రొద్దుపోయి యిల్లు చేరినాడు. రమణ తిరిగి, తిరిగి వచ్చినది. ఇంటికి రాగానే యామె 'భరతము' పట్టించినాడు, భర్త గోపాలరావు.

ఇది వాగ్లీగారికి గిట్టలేదు. ఆయనవచ్చి యొకచేతితో రమణను దగ్గఱకు లాగు కొని గోపాలరావు చెంపపెట్టు పెట్టెను. దిమ్మదిరిగి గోపాలరావు పడిపోయి నాడు. వాగ్లీ రమణ తడుచు రమణ భర్తను సమీపింపబోవును. వాగ్లీ తన సొమ్మంతయు బోయినట్లు ప్రకటించుచుండెను[1]. రమణ యాతనిని వదలి భర్తను కౌగిలించు

---

1. "రమణా! రమణా! నీకేం భయంలేదు. నేను రక్షిస్తాను. వాణ్ణిపోనీ. నీకుయోగం నేర్పుతాను. నిన్ను దేవత్వాని కెత్తుతాను. ఈ నీచుడితో నీకేమిటి? రా, మనిద్దరం నేమా యొకరి కొకరం సృజింపబడ్డాము" ('వివాహం' పుట 92, పంక్తులు 16,18).

కొన్నది. వాగ్లీ తిరిగి పరితపించును[1]. ఆమె భర్తను గట్టిగా వదుముకొనినది. చాల సేపటివఱకు మాటలాడని గోపాలరావు వెట్టకేలకు:-

"వాడితో వెడతావా?

"ఛీ! యెందుకు వెడతాను"?

"నామాట వింటావా"?

"ఏం చెప్పినా వింటా నండీ";

"ఏం చెయ్యమన్నా"?

"ఏం చెయ్యమన్నానరే; మీపాదసేవచేసుకు బతుకుతానండీ! మీరే నాతండ్రి; నాదైవం";

ఈ నవలకు వివాహమని యెందుకుఁ బేరుఁ బెట్టినట్లు? భర్త యెట్టివాఁడైనను గాని వివాహమొక ప్రేమానుబంధము నల్లు ననికదా; గోపాలరావుకంటె మేధకుఁడు లోకమున నుండ డు. కాని వివాహమాడినస్త్రీ భర్తను విడనాడఁజాలదు. ఇదియే వివాహములోని సుగుణము.

చలముగారి తత్త్వమునందు గడితేఱి గడుసుదేరిన చదువరి కొక్కనికిఁదప్పఁ దక్కిన సాధారణపాఠకుల కీ నవలాపఠనముచే స్ఫురించు గొన్ని భావములు, ప్రతి ప్రశ్నములు నీ క్రిందఁ బొందుపఱుపఁబడినవి:—

పరిస్థితుల ప్రభావము (వాగ్లీ ద్రోహచింత) చే రమణాగోపాలరావుల ప్రణయము పరిపక్వమైనది. భార్యాభర్తల కట్టి కలయికయే యుచితము. తల్లిదండ్రులు చేయునట్టి పునస్సంధానము కృతకము; అంతరప్రేరణ మందు లేదు; కావున ననుచితము; లేక, తలిదండ్రులుగాని యితరులగు బెద్దలుగాని బాధ్యతదాల్పనప్పు డిట్టి పునస్సంధానములు తప్పవని హెచ్చరికయా? తలిదండ్రులు చేసెడి పునస్సంధానము కృతక మనుట, తత్పూర్వమునుండియు వధూవరుల మధ్య సాగు రాకపోకలు, మాటపలుకులు మున్నగు వానివలన భార్యాభర్తలనడుమఁ బెరిఁగెడి ప్రేమానుబంధమును గుఱుతింపకపోవుట. వెంకటరావుగారు రమణను గోపాలరావునుగలిసి చెన్న

---

1. వాగ్లీ : ఇదేమిటి ? మన ఆలోచనలన్నీ యేమైనాయి ?
 రమణ : యేం లేదు, అదంతా చెడ్డకల వెళ్ళండి ;
 వాగ్లీ : పడవలో ఏమన్నావు ?
 రమణ : ఏ మంటే నేం ?
 వాగ్లీ : వాణ్ణి వదిలేసిరా, మాట్లాడుదాము.
 రమణ : ఈయనతో ముందు మాట్లాడాలి.

పట్టణములో గాంపురము పెట్టుమనుట యొక నవీన పునస్సంధాన విధానమేగదా? కావున నెంత పార్వ్యాభర్తలైనను వారిని గలుపువా రొకరుండితీరవలసి యేవచ్చుచున్నది. లేక వారు గలిసినపిమ్మట నిది యామోదము ద్రవేయుటయని యవహేళన మను కొందమూ? ఇట్టి వెన్ని యో నేడింటింట వెలసెను. హేళనచేసిన నివి పోవునవి గావు. వేలకొలంది కట్నములు గానుకలు పుచ్చుకొనిన శ్రీమంతులే వ్యయమున కోర్వలేక చేయుచున్న పునస్సంధానము లివి. నేడు మనలో వైదేశిక సంస్కారప్రభావాన్వితులు గాని వా రెవ్వరు? కావున నిట్టివానిని నేటిమన సంఘజీవన ప్రతిబింబములు కావన లేము.

స్వస్త్రీయందు మన మపేక్షించెడి గౌరవమర్యాదపుగస్కృతిప్రవర్తనము, పరస్త్రీయం దున్నచో దాని నభినందింప లేము. అది మనయందుండు పరస్త్రీవాంఛకుఃప్రతిహతి.

స్త్రీ విద్యావతి యగుచో నెదుట మెచ్చులాడి ముఖస్తుతులు పలుకుదుము; చాటున మాటునఁ దూలవాడుదుము. లోకులు సంస్కరణము నభిలషింతురు; కాని దానివలనిబాధ నోర్వలేరు.

అన్యకాంత తనతో జనవుగ నుండవలెను; తనకాంత యన్యునితో నట్లుండిన నది దుస్సహము. ఇది యాధునికుల సాధారణ మనస్తత్త్వము.

యోగాదివిద్యల బోధనల వ్యాజమున సంఘములో నమాయకకన్యలను వం చించు వాగ్మీవంటి ప్రబుద్ధులు కొందఱు.

పరిస్థితుల ప్రభావముచే మొదటినుండియు దాస్యభావమున బెరుగుట కలవడిన (గోపాలరావువంటి) వారికి భర్తృత్వపు నిండుదనము, మగ్గల లజ్జాలక్షణములు, వలపు లోతులు నెట్లుఁ దెలియును? గోపాలరావు వంటి భర్తల కాత్మవిశ్వాసము లోపించుట యం దాశ్చర్యమేమి?

రమణ వాగ్మీకి మాటలిచ్చుటనుబట్టి పురుషులకంటె స్త్రీలే పరిస్థితుల కధీన లగుదురని యనుకొన వచ్చునా.

ఎవడు సాహసించి శేవా, వంచించి తనసొంతనుగా జేసికొనునో తఱుచుగ స్త్రీ వానిదియగు ననెడి సందేశ మీ నవలలో లేదుగదా!

కూఁతులకు సంఘసంస్కార మనెడి మిషచే స్వేచ్ఛ నీయఁగోరువారు కొంచె మాలస్యముగఁ గన్నుఁదెఱచి పశ్చాత్తప్తులగుదురా? అరవిందవిషయమున వెంకటరావు గారి తాటస్థ్యము, దాని ఫలితము, వంటివే రచయిత వాంఛించు చిరకాల వాంఛితములా?

అనర్ఘునకు గొప్పభార్య దొరకుట యనఁగా, నిందు వియ్యమున సమతలేక పోవుట. అందువలన నాపదలు పెక్కులు. గోపాలరావున కాత్మవిశ్వాసము లేదు. స్వభార్యతో మాటాడుటయే యతిచరించుటగా దొలుదొలుత భావించును. ఆత్మగౌరవము లేనివాఁడుగావున నామె సిగ్గుపడుచుండ నది తనయం దసహ్య మనుకొనినాఁడు. దానితో ననేకములైన యపోహములు.

మానవహృదయమున గాలుష్య మున్నది. కావున సంఘముగూడఁ గలుషితము. సంఘమనఁగా, నిట్టిదిసుమా యని వాస్తవికతయను రచనాఫణితి మనకు గనువిప్పుఁగలిగించును.కాని యిది యాపాతరమణీయము.సంఘమునందుఁ గాలుష్యము పూర్వమునుండియుఁ గలదు. నేఁటిదికాదీ సమస్య. లోకముననున్న కలుషత్వమును జూచి సహింపలేక బాధపడి లలితహృదయులను క్షణకాలము కావ్యరూపమున లోకాతీతమగు నానందమును నభిలషింతురు. సుందరే మనసున బాధపడుమనకు వాస్తవికత పేరిటమఱలఁ గ వ్యధలలోఁగూడ నాకాలుష్యము నా వ్యధయు ప్రత్యక్షముగావలెనా? మనకు లోపించిన యానందానుభూతి నీయవలెనా? నిత్యము మన కున్నవ్యధను బెంపొందింపవలెనా; కావ్యము! ఆదర్శచిత్రణము క్షణకాలమైనను లోకక్షోభలను మఱపించి యానందస్థితినిఁ జేకూర్చునుగదా! వాస్తవికత్వప్రయోజనము, హెచ్చరికయు ప్రబోధమును నగుచో నాదర్శచిత్రము రసానుభూతిని గల్పింపదా? ఏది పతితలకు వాంఛనీయము?

నాగ్లీతో నరవిందకు మదనపల్లి చదువువలన బరిచితి. యోగవిద్యాభిమానము భక్తియు నీమె కాతనివలన గుదిరినవి. అట్టి యరవింద యేమయినది చివఱకు? నాగ్లీ యయోగ్యత యెట్లుఁ బరిణమించియుండును? "అన్ని యున్నియుఁ బీడకల" లనుకొనునట్లుఁ బెండ్లియైన రమణ నేసేసిన [illegible] పెండ్లికాని సరవిందను మన్నించునా? యని మన మనుకొనుటయే రచయిత యుద్దేశము కాఁబోలును!

చలముగారి రచనలలో ప్రధానముగ బతితలును, బతితులును గానిపాత్ర లుండరు. వారియందు రచయిత కేదో యాకర్షణ మున్నది. బహుశః సంఘద్రోహమునకు వారు గురులై యనెడి సానుభూతి రచయిత కున్నదేమో! మనకుమాత్ర మట్టి సానుభూతి శరచ్చంద్రుని[1] పాత్రలయందుఁ గల్గును. అనఁగా మన చలముగారికి దనపాత్రల యం దభిమానము;మనకుమాత్రము తఱచుగ శరచ్చంద్రుని పాత్రలయం దభిమానము.

---

1. నేఁడు చలముగారికి మహనీయు లనేకులతో బోలికలు చూపఁబడుచున్నవి. అవి య[illegible]చితముగ యథాస్థానమున పట్టంకింపఁబడును.

ఈ నవలకు 'విద్రోహము' నెడి నామసార్థక్యము రమణాగోపాలరావుల విద్రోహము నిల్పుటవలననా ? లేక వాగ్లీయరవిందల పలాయనముగాని, ద్రోహముగాని యూహ్యా మగుటవలననా ?

## కొండపల్లి ముట్టడి[1]

[ The Seize of Kondapalli ]

శతావధానులు శ్రీ శేషాద్రిరమణకవులు రచించిన యిది చరిత్రాత్మకమైన నవల[2].

దీనిమూలమున విస్మృతాంధ్రపరాక్రమమును జ్ఞాపకపఱచుట వీరి ప్రథమాశయము. ఆ నాఁటి కాంధ్రదేశాభ్యుదయము నభివర్ణించు నవలలు వ్రేళ్ళపై లెక్కింపఁదగియుండుటవలనఁ దల్లోపమును సవరించు కర్తవ్యజ్ఞానమును బ్రసంగించుట యీ నవలాకర్తల యుద్దేశములో రెండవది. అదియే యీ నవలారచనకైనట్టి చోద్యము. చరిత్రాధారములను జరిత్రదృష్టితో సమన్వయించి, కథాకాలమునాటి పరిస్థితుల గమనించి జాతీయతాప్రబోధకముగ వ్రాయుట వీరి మూడవ యుద్దేశము. విజయనగర సామ్రాజ్యనిర్మాణమునకుఁ ద్యాగధనులగు రాయలు, తిమ్మరుసు, మాధవవర్మ లోనగుఁ జారిత్రకపురుషులేగాక రామభద్రుడు మున్నగు గవిరాజు లెట్లు సేవచేసినదియు, గృహకార్యపరతంత్రలగు సుందరివంటి విద్యాసుందరు లెట్లుఁ జరిత్రాంతలైనదియు వర్ణించుట దీని యుద్దేశములలో నాల్గవది. కథాపాత్రముల నిర్వహించిన కార్యభార స్వార్థత్యాగములవలన నాంధ్రజాతి యంతయు స్వాతంత్ర్య సంరక్షణకై పాటుపడినట్లుఁ దెలుపుటయేగాక స్వాతంత్ర్య [illegible] దైపికమని సూచించుట యీ నవలకైన యైదవయుద్దేశము.

ఆకస్మికముగ కొన్ని దుర్ఘటనలు కల్పించి కథలోని యే ప్రముఖపాత్రమునకో హఠాత్కాండ నంటగట్టి, యనర్థముల నన్నింటిని సమకూర్చి హఠాత్తుగ నే మహాపురుషునో యుదకునో దుమికించుచుఁ గథావేగమును దగ్గించుట సర్వసాధారణముగ నా నాటి నవలలలో గనఁబడు నాచారము. అందువలనఁ గల్పన మనుకూలముగ నున్నను

1. క్రీ. శ. 1928, ఇది వెంకటరామ అండ్ కో. వారి ప్రచురణము. తొంబది తొమ్మిది పుటలది. "1951 లో శేషాద్రిరమణ కవుల కొండపల్లి ముట్టడి, ఆంధ్ర పాఠకలోకమునకు సమర్పింపఁబడినది." అని శ్రీ కొడాలి దామోదరయ్యగారు తెలిపిన విషయము పొరపాటు. చూడుఁడు: ఆంధ్ర పత్రిక - ప్లవ సంవత్సరాది సంచిక (ఏబది రెండవ సంచిక) పుట 115-రెండవ నిలువువరుస-పంక్తులు 22-23 (1961-62) బుద్ధిరాజు హనుమంతరావు విరచితమైన 'కొండపల్లి ముట్టడి' అను నవల వేఱు.
2. శేషాద్రి రమణ కవుల తొలినవల 'వసుంధర'

నముచార మగుటచే నింకను సంరక్షకుఁడు రాలేదేయని ప్రాయికముగఁ బాఠకుఁడు నిరీక్షించు చుండును. అట్టి పరిస్థితులలో నొక వీరునిహత్య కథారంభములో జూపి[1] తత్సోదరిని సంతాపక్రోధాధీనమనస్కను గావించి కథావల్లికకు జీవముఁబోయుటచే ప్రారంభమునుండియు నీ నవల పఠితలకు నిర్భరౌత్సుక్యమును గల్పించుచున్నది.

శేషాద్రిరమణకవుల తొలి నవలయగు 'వసుంధర'యందు కూడ నిల్లే యొక సాధ్వి సహగమనముతో గథారంభమగును[2]. ప్రారంభముననే పాఠకులను గథాప్రపంచమునఁ బడఁద్రోయుటకుఁ బన్ను నిట్టి యంత్రజాలమును, గూర్చు నిట్టి యఖండ సామగ్రియుఁ జాల వరుదుగ నప్పటినవలలలో నగపడఁగలవు.

పదునాఱవ శతాబ్దియందు స్వాతంత్ర్యేచ్ఛ యే తెలుఁగున రగుల్కొనినదియుఁ ద్యాగమూర్తులు రాజ్యకుభార్థులై యందు దుమికి యే విధముగ నంతర్హితులైనదియు నీ నవలయందుఁ బ్రతిబింబించు చున్నది. దుర్గభేదమునకు వీరులు పన్ను పన్నుగడలును బ్రతిపక్షులు గుహాముఖమును బాలించు సింహములవలె నాత్మరక్షణమునకుఁ బాటుపడు క్రమమును జరిత్రకాలానుసారముగ నిందు కవులు పొందుపఱచినారు.

పరిమిత పాత్రలఁ గథారంభమునందుఁ బ్రవేశపెట్టి యందఱకు నుచితవిధుల నేర్పఱచి యితివృత్తమును సరసముగ నిర్వహించుటచే నీ నవల ప్రశంసాపాత్రము. నవలాకర్తలు స్వయముగఁ బరిశోధకులు. కథాస్థానమును గనులార దర్శించినవారు; అందుచే నీ నవలలోని వాతావరణము కథాకాలమునకుఁ బాత్రలకును బాగుగ సమన్వితమగుచున్నది. సంఘటనలు, సన్నివేశములును దృశ్యకావ్యమునందువలెఁ గన్నులకుఁగట్టుట యిందలి ప్రాశస్త్యము.

## ఏకవీర[3]

ఏ కావ్యేతివృత్తమునకు బీజము, బుద్ధితత్త్వముగాక రసభావతత్త్వమైయుండునో యట్టి కావ్యములో రసభావముల కఠినమైన జీవితమును ద్రవ్వుకొనుటయందు గాని, త్రవ్వుటయందుగాని తత్కవికి వ్రీడాభయములని యుండవు. ఇట్టి కార్యనిర్వహణముల

---

1. 'కళాపూర్ణోదయము' నందు కలభాషిణిని సిద్ధుఁడు చంపబోవునట్టి కథాంశ మిట్టి నవలల కెల్ల నాచార్యకము నెఱపినది. కీ. శే. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'శ్మశానవాటిక' యగు 'విషభుజంగము' నవలపై నగపడు ప్రభావము నిదియే। కథాసంవిధానమంతయు నిందలిది రెండవ రామాయణమని సూచింపఁబడినది కూడ.
2. 'విషభుజంగము' సాధ్వీసహగమనాంతమైన నవల.
3. తొలుత "భారతి" లో నెలల తరబడి యనుక్రమణిక నవలగఁ బ్రకటింపఁబడినది. హిందీలోనికిఁ బరివర్తింపబడునని యెన్నాళ్లనుండియో వదంతి. శ్రీపుటవర్తిచే అణ్ణామలై విశ్వవిద్యాలయమువారు మఱియాళములోని కనువదింపఁజేయుచున్నారని యింకొకవార్త. పతివ్రతలకు మాతృగౌరవము నిల్పఁగల్గుట కఠోరవ్రత మగును.

పట్ల బుద్ధితత్త్వముచూపు నిస్సంగత్వమును నిస్సంగత్వమనుటకంటె ప్రీడాభయము లనుట యుచితము. రసభావమయమైన జీవితమును ద్రవ్వుకొనుటకుఁగాని త్రవ్వుటకుఁ గాని కోరుకునట్టి కళాకారుఁడు సప్తసముద్రయానము చేసియుఁ దా నెటుఁ గని త త్తీర భూముల పైఁ గాలుమోపుటకు భయపడు 'క్రిస్టపర్ కొలంబసు' వంటివాఁడు. ఒకానొక కళాస్రష్ట, కవియుఁగూడ నైనపుడు తాను నిరుద్ధవాజా వేకు డగుట తత్కళకుఁ గళంకము నాపాదించుటయే యగును.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఈ యుగమున మహాకవియని వందిమాగధులవలననేగాక తమ ప్రతిపక్షులచేగూడ నుతులు వరళ్ళతములు గొనిన కవిసమ్రాట్టు. ఒక మహాకవియు మహోదారశిల్పియు నవలాకర్తయైనప్పుడు విన్యసింపఁబడు మహనీయ శిల్పము పేరే 'ఏకవీర'1.

ఇది శ్రీ సత్యనారాయణగారి తొలి నవలగాని2 తొలినవల ఆయనయే మఱలనిట్టిది వ్రాయలేరు.ఇందలి యితివృత్తమునకుఁ జరిత్రతో గొంతసంబంధముఁ గల్పింపఁబడినది. కాని కొందఱనుకొనునట్లుగ నిది చరిత్రాత్మక నవలకాదు. కొన్ని ప్రబలమైన తాత్కాలికసాంఘికాచారము గ్యాదలవలన నీ నవల యీ నవలయైనది. అయ్యును నిది కొందఱ నుకొనునట్లు సాంఘికనవలయుఁ గాదు. దత్తశీలములుగలపాత్రల ప్రవర్తన మొకానొక వాతావరణములో నీ నవలేతివృత్తమై కూడివచ్చి కూర్చున్నది. అందుచే నిది మనస్తత్త్వనిదానపరమగు నవల.

ఏకవీర యందలి యితివృత్తము సాధారణమైనది. సాధారణమైనదాని నసాధారణముగఁ జిత్రించుటయే శిల్పము. ఎఱుఁగుట కెల్ల రెజీగియు నెల్లను వెల్లడింపలేనిదే కళ. కుట్టాన్ మీనాక్షిని ప్రేమించెను. వీరభూపతి యేకవీరను ప్రేమించినాఁడు. కుట్టాను రాజవంశకరీరము. మీనాక్షి సాధారణ కుటుంబములోని బిడ్డ. వీరి యిద్దరకు వివాహము సంప్రదాయ విరుద్ధము. ఏకవీర మహాధనికులు, భోగులు నైనవారి పుత్త్రిక. వీరభూపతి సర్వసాధారణవంశమువాఁడు. వీరియిద్దరి యుద్వాహముగూడ సంప్రదాయసమ్మతము కాదు. అందువలననే యీ వివాహములట్లు జరుగకపోయినవి. భోగభాగ్యములనుబట్టి ఏకవీరకు వివాహము కుట్టాన్‌తో జరిగినది. అట్లే మీనాక్షివీరభూపతులుగూడ భార్యాభర్తలు గాక తీరలేదు. ఇవి కేవలము దైవఘటనలు; విధ్యవశ

1. 'Marriage a la Mode' is the Restoration Comedy of Dryden. In the aspect of plot, both the themes of that comedy and 'Ekaveera' look alike, a little. But in the aspect of civilization, culture, import, purport, purpose and everything, they both fall widely apart.

2. అగుటకు వీరి తొలినవల "అంతరాత్మ" (1918).

హార్యతకు నుదాహరణములు. కాని యీ వ్యతిక్రమప్రణయ వివాహాబద్ధులొక రొకరిని యర్థముచేసికొనుటకుఁ గొంతకాలము పట్టినది. ఆ యర్థముచేసికొనుటకూడఁగొన్ని విపరీతపరిస్థితులలో జరిగెను; జరిగి విపరీతపరిణతులను గూడఁ బొందెను. కట్టకడకుఁ గథ కరుణావిలమైనది.

ఈ కథకుఁ బ్రాతిపదికలు సనాతనభారతీయధర్మములు, నాదర్శబద్ధమైన సంప్రదాయములు, వీని కన్నింటికి వతీతమైనవిధియు. విధి యనునది మానవశక్తి కతీతమైనది. మానవుఁ డంతశ్శక్తులవలనఁ దనను దాను జయింపవచ్చును; కాని విధి యజయ్యము. అట్టి యదమ్యమైన విధి విచిత్రముగ నీ నవల లోని పాత్రలయెడఁ దన యప్రతిహత ప్రభావమును నెఱపినది. ఆ దుర్దమవిధి యను గారణమే లేనియెడల నిందలి సంఘటన లిట్లు గుదురుకొనెడివే కావు.

పాత్రౌచిత్యము, వాస్తవికత యనునవి ప్రధానాకర్షణములై యీ నవలకుఁ బ్రాణముఁబోసిన శక్తులు. ఇందున్న ప్రధానపాత్రలు నాలుగును విలక్షణత్వముఁ గలవి. ఏ పాత్ర కా పాత్ర నిర్దుష్టము. ప్రతిపాత్రయుఁ బఠితృసహానుభూతికిఁ బాత్రము. ప్రతిపాత్రయు నింకొక పాత్రతో దారతమ్యపరిశీలనమునకు దిగినది. దేని కది యొక మహనీయశిల్పపు ముద్ద; ఒక యమృతబిందువు. తద్విశేషము లన్నియుఁ గొన్ని "విశిష్టనవలల" నెడి ప్రకరణమునందు వివరింపఁబడఁగలవు.

ఈ నవలానామసార్థక్యమెుక్క దానిని గూర్చి చర్చించినచో పాత్రల శీల సంపదకూడ సంగృహీత మగును.

ఏకవీర యీ నవలయందలి పాత్రలన్నింటిలో బ్రధానమైనది; విచిత్రమైనది. ఆమె పదునాల్గేండ్ల ప్రాయమునఁ బట్టరాని భావావేగముచే ముందువెనుక లారయ లేక వీరభూపతికిఁ బ్రణయలేఖ వ్రాసిన యుచితానుచితపరిజ్ఞానశూన్యురాలు; కట్టాన్ తన భర్తగా, నత్తవారియింటికి వచ్చునప్పటికిఁ బదునెనిమిదియేండ్లది; ప్రౌఢ; తన మనస్సును, దన ప్రేమయుఁ దన్నలయించినపు; తనభర్త యింకొక యువతిని బ్రేమించుచున్నాఁడని మెల్లమెల్లఁగ దెలిసికొనియు నతనిని ద్వేషింప లేదు. ఇంతలో నేకవీర యం దొక విధమగు ద్వంద్వప్రవృత్తి యేర్పడినది. అం దొక ప్రవృత్తి యామెకు ధర్మప్రేమను, రెండవ ప్రవృత్తి మధురప్రేమను జ్ఞప్తికిఁ దెచ్చుచుండును. పోనిపో నిమెయం దంతర్ముఖత్వ మొకటి యతిశయించెను. ధర్మమునెడ భక్తి, యధర్మమునెడ భయము ననునవి యా యంతర్ముఖత్వలతకుఁ బరిణామములై చిగురు కొనిన రెమ్మలు. ఆమెలోని మౌగ్ధ్యము, సౌకుమార్యము, నమ్రతయు ననునవి యా రెమ్మలు దొడిగిన మొగ్గలు. అవియే క్రమక్రమముగ ననలెత్తినవి. ఆ ధర్మభీరుత్వముచే

గలిగిన యామె మెత్తదనము విపరీతపరిస్థితులలో దన్నుదా మించిన యంతిమ దశా విశేషమునందు కఠినమైన 'నోబిలి' సిద్ధాంతములను ఖండించి, స్వమతస్థాపన మొనర్చుకొన్నది. భర్తృజీవితమును సుఖపఱుపవలెనని తల్లి నేర్పించిన యేకవీరచదువులు శ్రీసుందరచొక్కనాథశివున కుపయోగపడినవి; ఆమెను గారణజన్మురాలిని సార్థకజన్మురాలిని జేసినవి. తన త్వగింద్రియనైశిత్యము, ధర్మము నతిక్రమించిన యొకానొక ధర్మసూక్ష్మమును సాధించుటవలన నీక సాధారణధర్మమునకు దన తనువు సాధనము కాజాలక పోవుటచే నేకవీర యశఃకాయమును దాల్పకతీరలేదు.

ఇంక సంగ్రహించిచెప్పుచో గుట్టాన్ యుద్ధమునందు మహాధీరుడు; ప్రణయ వ్యవహారమునందు మహాధీరుడు. అందు వజ్రకఠినమైన మనస్సే యిందు కుసుమ కోమల మగును. తన మీనాక్షి వీరభూపతికి భార్యయైనదని తెలిసినప్పుడా వెన్నవంటి మనసువలననే యత డు ఘోరనరక మనుభవించినాడు. కాని మఱల నాతని హృదయ మార్దవములో బటిష్ఠత యొకటి యున్నది. దానివలన దన దారుణప్రియవేదనను నిగ్రహించుకొని, నిశ్చేష్ట మొనర్చుకొని, తుదకు దపశ్శాలి యైనాడు. అప్పుడు మీనాక్షియందు సోదరీవాత్సల్యము, నేకవీరా వీరభూపతులప్రణయాకర్షణయం దీర్ష్యా కలితమైన స్థితియు సిద్ధించినవి.

వీరభూపతికూడ నేకవీరవలెనే తాత్కాలికోద్రేకమున దన ధర్మమును విస్మరించెను. కాని తుదిలో మరణింపలేదు. ఏకవీరయందుగల సౌకుమార్య మాతనియం దెక్కడిది? కుట్టాన్‌వలె దపస్వికాగల మనోనిగ్రహ మెక్కడిది? అతడు సాధారణ మానవుడు. కావుననే తన మిత్రుడుకుట్టాన్, మీనాక్షిని బ్రేమించెనన్న యుదంత మాతనిలో నీర్ష్యను బ్రజ్వలింప జేసినది. అది సాధారణమానవసహజము; నిర్దుష్టము. తన్మూలముననే యాతడు మీనాక్షియందు విరక్తుడైనాడు.

మీనాక్షిలో నసాధారణగుణము లేవియు లేవు. కుట్టా నొక మహావేదనకు లోనై తన మనస్సు మార్చుకొనెను. ఈమె యట్టి యవస్థల నెఱుగకయే మనస్సు మార్చుకొన్న యమాయకురాలు. యథాలాభసంతుష్టితో మెలగు లఘుహృదయ లగు సాధారణస్త్రీల కీమె ప్రతినిధి. ఈమె మనస్సునకు లోతులేదు. సాధారణ కుటుంబినుల కది సాధ్యమా?

మధుర ప్రేమ,ధర్మప్రేమ లను పేరిట పరస్పరవిరుద్ధములైన రెండు ప్రవృత్తుల యంతస్సంఘర్షము రేగగా వానిలో బ్రతికి యొకదానికిని బ్రతుకక యొకదానికిని జయము సమకూర్చిన యేకవీరప్రాధాన్యమునుబట్టి యీ నవల కీ పేరు కుదురుకొని యున్నది.

తాకికములైన సంఘటనలకు మనస్సులపై గల విచిత్రప్రభావములను విధి యనెడి యజ్ఞాతశక్తికి మానవజీవితములపైఁగల చిత్రవిచిత్రప్రభావములను ప్రాతిపదికగ స్వీకరించి, శిల్పప్రఘటావేత్తృతతోగాక శిల్పపరిణతప్రజ్ఞతో రచింపఁబడిన మన 'యేకవీర' వంటి మఱియొకనవల యాంధ్రమునసేగాదు, యావద్భారతీయభాషలలోను నభూతో నభవిష్యతి.

## ఏకోదరులు[1]

శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారిచే రచితమైన యీ నవల గంభీరమైనది. హాస్యరసపోషణ ప్రసిద్ధిఁగల యొక రచయిత కరుణరసపూరితముగ వ్రాసిన వానిలో నిది ప్రథమము[2]. ఇది స్వతంత్రమైన నవల[3]; సాంఘికేతివృత్తము గలది. కుల మతాది భేదములవలన నుత్పత్తిల్లు సాంఘిక సమస్యలను స్వీకరించి నవలవ్రాయుట మాత్రమే యిందలి ఘనత కాదు. కరుణావిలముగ వ్రాయుట యిందలి ఘనత[4].

ఒక కులభ్రష్టుడు మతాంతరవివాహమునకుఁ గడఁగును. ఆతని జీవితగాథ యెంత శ్రమాన్వితము, శోకభారము నైనదో నిరూపించుటయే దీని ముఖ్యోద్దేశము. శ్రీ శాస్త్రిగారి యీ నవలయందలి సన్నివేశములు హృదయవిదారకములు; ఎవ్వరికైనను గాని మన సాంఘికవ్యవస్థనుగూర్చి మనోవైకల్యమును గలిగింపఁగలవు.

## ఇనుప కోటలు (?)

ఇది 'ఆంధ్రావర్డ్స్వర్త్' అని ఓగ్వాల్డ్, జె. కూల్డ్రే దొరగారివలన సార్థకమైన బిరుదుపొందిన కట్టమంచి వెంకటరావు కవిగారిచే రచింపఁబడిన నవల. వారొక విశిష్ట వ్యక్తి; యచ్చమైన కవి; బహుప్రసిద్ధులు. వారికి భాషనుగూర్చి పట్టింపు కవిత్వమంటే లేదు. వారి వ్యక్తిత్వమునుగుఱించి యించుకయైనఁ దెలిసికొనక రచనల తత్త్వము నవగాహనము చేసికొనలేము.

---

1. క్రీ.శ. 1931లో ముద్రితము. ద్వితీయావృత్తి రాలేదు.

2. శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి 'దీక్షితులు' దీని తరువాతిది.

3 వీరు కొన్ని స్వతంత్రములైన కథలను గూడ రచించిరి. అవి 'ప్రతిబింబములు' అను పేరిట క్రీ శ 1931లో ప్రకటితములు. వాని పునర్ముద్రణము రాలేదు. తొలుత నవ భారతి, సఖి మున్నగు పత్రికలలో ప్రకటితములు నేటికిని వీరిచక్కని కథలు పత్రికలలో ప్రకటితము లగుచున్నవి. మృదులము నచ్చము నగు హాస్యమున కివి పెట్టినది పేరు.

4. ఇట్టి సమస్యనే యితివృత్తముగఁగొని శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావుగారు రచించిన 'నెలవంక' మఱియు మనిశితమై, సుకుమారబుద్ధులకు మనోవైక్లబ్యమును గూర్పఁగలదు "కొన్ని విశిష్టపాత్రలు" అనుప్రకరణమున నీనవలనుగూర్చి యించుక ముచ్చటింపఁబడును.

5. క్రీ. శ. 1933 తరువాతి రచన.

వీరి రచనావస్తువు అతిసామాన్యమైనది. అది నిత్యము మన కంటికి గనిపించినను వానినిగూర్చి పట్టించుకొనము. ఏ మాత్రమును మనము ప్రాధాన్య మీయని సంగతులను స్వీకరించుటయందే కవికొండలవారు కవులలో కొండయంతటివా రగుచున్నారు. అది వారి నిరాడంబరమైన సాధారణత. అదియే ప్రత్యేకత. ప్రజల జీవితములోని మిక్కిలి సామాన్యసన్నివేశములను ప్రజల భాషలోనే నూతనదృక్పథముతో వర్ణించుట వారి యాశయము. ప్రాణికోటికి మించిన కావ్యవస్తు వేమున్నది? రచయితలు రచయితలకై వ్రాయరు. మానవకోటికై రచించుటకే వీరి ప్రయత్నము. ప్రకృతిదియు మనుష్యులవియు, ప్రతిబింబములు వీరి రచనలో నగపడును. ప్రకృతియే యాయన కుపాస్యము. ప్రకృత్యుపాసనము, ప్రకృతి యూపిరియగుట, మున్నగు గుణములే శ్రీ కవికొండలవారికి 'వర్డ్స్‌వర్త్' బిరుదమును సంపాదించిపెట్టినవి. ఈ గుణములే వారి మనసులోని మాటను, మాటలోనిమనసునుగూడ మన యెదుట రూపుకట్టించి నిలిపి ప్రాణముపోసి చిన్నచిన్న ఘటనల సమాహారముగ గావ్యరూపమున నిర్మింపజేయగలవు.

ఇక వీరి నవలలో రసికహృదయాంతరాళములను స్పందింప జేసి జల్లు మని పింపగల తంత్రీనిస్వన మున్నది. అది ప్రశాంతతతో మన చిత్తములను ద్రవీభూత మొనర్చును. అర్థవిస్మరణముతో జిత్తవిస్మరణమును గాఢస్ఫురణమును రాగనురక్తియు నొందిన పాఠకుడు శాంతతన్మయుడై వీరి యీ రచనలో జానపదప్రాణికోటిజీవ స్పందనగీతిక నతిశ్రుతిపేయముగ నంతర్వాహినిగ వినవచ్చి యనుభవించ గలడు. ఈ దృష్టితో బరిశీలించినప్పుడు శ్రీ కవికొండలవారి నవలావిశిష్టత వ్యక్తము కాగలదు1. ఒక్క మాటలో జెప్పవలయునన్నచో వీరిది భావనాత్మక వాస్తవికత2. సంస్కృతాంధ్రపదములను విచిత్రముగ సమన్వయించు వీరిభాష కొందఱ కాశ్చర్యము గూడ గొల్పును. సాంఘికేతివృత్తములు చేపట్టి మానవతావాదులై సహజముగను, గారుణికత్వ ముట్టిపడునట్లుగను రచించినవారు పెక్కురున్నారు. కాని వారి మార్గముకంటె శ్రీ కవికొండలవారిది పైజెప్పిన తత్త్వమునుబట్టి యించుక భిన్నమై క్రొత్తపద్ధతి కొరవడి యగుచున్నది3.

---

1. వీరి కథలుగూడ విశిష్టము లైనవి. 2. Imaginative Realism.

3. 'Satapatramu' is an English rendering by the poet Sri Kavi Kondala of his own Telugu poems, composed years ago. A pleasant function was got up on the morning of January 22nd, 1961 at the Theosophical Lodge, Rajahmundry, where Part I of 'Satapatramu' (A century of Petals) of Sri Kavi Kondala, a well-known, very popular poet, a short story writer, was released by Sri A. Rama Rao, President of the said Lodge and tributes were paid by Dr. T. Kanaka Raju, F. R. C. S. and others to the poet's keen observation of Nature, village life and powers of story telling. (Vide 'The Indian P. E. N,. Vol. XXVII No. 3, P. 108, March, 1961).

## చెలియలికట్ట

ఇది శ్రీ విశ్వనాథవారి నవల. క్రమముగ 'అంతరాత్మ', 'ఏకవీర', 'మాబాబు', 'వీరవల్లఁడు' ననువాని తరువాతి దిది1. అనఁగా మొత్తము మీఁద నైదవ నవల.

నవలా తత్త్వము లాఁతేడని చెప్పఁబడుచుండినను వందు సాధారణముగఁ బఠితల నాకర్షించునవి ప్రధానమైన, నాలుగు మాత్రమే. వాని నితివృత్తము, శిల్పము, పాత్రపోషణము, భావౌచిత్యము ననవచ్చును. వానియందైన నొక్కొక్కటి యొక్కొక్క రచనలో బఠువరుల నెక్కువగా నాకర్షింపఁగలదు. ఈ దృష్టితో బరిశీలించినపుడు శ్రీ విశ్వనాథవారి పెక్కునవలలవలె నిదియు భావౌచిత్యమునకు నిధానము. ఈ భావౌచితిని గుర్తించినచో నొక్కొక్కరచనలోఁగల మూలభావము నొక్కొక్క వాక్యములో జెప్పవచ్చును. ఆత్మవంచనము, జగద్వంచనము పేరు 'స్వర్గానికినిచ్చెనలు' అందుము. అట్లే యార్ష వివాహబంధ మిహపరసాధన మనుట 'చెలియలికట్ట'.

(౧) ఇతి వృత్తము:-

ఒడుదుడుకులులేని సర్వసాధారణసాంఘికేతివృత్త మీ నవలలోనిది. కథలో జమత్కృతి లేదు; తీవ్రత శూన్యము. ఇందలి నాయిక రత్నావళి, తణికోద్రేకములకు లోనై సంసారము త్యజించివచ్చుట, పతితయై పరితాపమొందుట, వైరాగ్యముచే నాత్మహననమున కొడిగట్టుటయు ననునవి సాధారణ సంఘటనలు. పాత్రలుసాంఘికములు. సంప్రదాయబద్ధమైన సంఘజీవితమునకును, నిర్లక్ష్యమైన వ్యక్తిజీవితమునకును నడుమఁగలిగిన సంఘర్షముచిత్రించుట యీ యితివృత్తమునకు లక్ష్యము. కాన నసాధారణవైచిత్రి యిందేమియు లేదు.

(౨) శిల్పము:-

దీని కితరములైన పాత్రముల యున్మీలనము, భావౌచిత్యమువంటి వాలంబనములు. ఇందలి శిల్పప్రాధాన్యమునఁగూర్చి శంకించినవా రున్నారు2. కుశాగ్రబుద్ధితో నూత్మవిశ్లేషణముచేసి మఱియునిందలి సన్నివేశరచనాశిల్ప మల్పమని కొందఱు

---

1. వీరి నవలల రచనా కాలక్రమమును గూర్చి ప్రత్యేకముగ నొక గ్రంథస్థ ప్రమాణమని యేమియు లేదు. వారు చెప్పునది, లోకి మనకొసునది, లేదా, పత్రికలలో బ్రకటితమైనదియు మాత్రమే ప్రమాణము. ఒక్కొక్క పర్యాయము వారు రెండుమూఁడు నవలల నారంభించుటయుఁ గలదు. వెనుక వ్రాసినది ముందుఁ బ్రకటిత మగుటయు, ముందు వ్రాసినది వెనుకఁ బ్రకటిత మగుటయు నున్నది.

2. "ఇందలి శిల్పమునుగూర్చి ప్రత్యేకముగా విడదీసి చెప్పఁదగిన విషయము కనఁబడదు." ('తెలుగు స్వతంత్ర' పుట 17, పంక్తులు 23_25) (28 డిశంబరు 1956).

భావించిరి. కాని ప్రధానములుగాని పాత్రలచేతలవలన సన్నివేశకల్పనముచేసి తన్మూలమున ప్రధానపాత్రల చేష్టితముల వ్యాఖ్యానమును వ్యంజితము నొనర్చుట విశ్వనాథ వారి సన్నివేశ రచనాశిల్పవిశిష్టత[1]. అప్రధానములను వాచ్యముచేసి ప్రధానములను ధ్వనింపఁజేయుట యాంధ్రసాహిత్యమునందెల్లఁ బ్రత్యేకలక్షణము. మన కవిత్వములోని యాత్మను, శిల్పౌచిత్యమును నెఱిఁగిన వారెల్లరు శ్రీవిశ్వనాథవారి మార్గము నే యవలంబింతురు.

వీరి యితరనవలలలో నధికముగనున్న వర్ణనాశిల్ప మిందు దక్కువగ నున్న మాటనిజము. చెలియలికట్టలో సంవాదము లకంటె నితివృత్తవిస్తరణముకంటెఁ దర్క రచనాచణత్వ మెక్కువ; చర్చాధోరణి మెండు; మీమాంస మిక్కుటము; బంధురమైనది భావన. ఇందువలన నా తర్కాదికము విసుగుఁగొల్పదు; దానిని బెంపొందించిన విధానమునం దంతర్భూతమైయున్న లక్ష్యములు, నంత సుదృఢము లైనవి. కావునఁ జదువరి యీ నవలను గథాసమాప్తి నెఱుఁగఁగోరి చదువఁడు. పోనుపోను మీమాంసల శిఖారహస్యముల దెలిసికొనవెంచి యౌత్సుక్యముతో జదువును. ప్రేమ యనఁగా నేమి? యను మీమాంస ప్రథమాధ్యాయముననే జరిగినది. రత్నావళి రంగారావుల మధ్య దానినిగూర్చి చాలఁ జర్చోపచర్చలు సాగినవి. ప్రేమమునుగుఱించి యామె భావము వేఱు; అతని యభిప్రాయము వేఱు. తుద కీ వాదముల ద్వారమున నేమి నిరూపింపఁబడినదో యెఱుఁగవలె ననెడి యుత్కంఠ యడుగడుగున లెత్తుచుఁ జదువరులను ముందునకు నడిపించును. తాదృశములగు తర్కవితర్కము లీ నవలలో నెక్కు. ఇతివృత్తముతో సుదృఢసంబంధములేని యుపకథలుగాని సంఘటనలు గాని యనావశ్యక పాత్రలు గాని యిందులేవు.

(3) పాత్రపోషణము:-

పాత్రలసంఖ్య యిందుఁ బదికి బైపడియే యున్నది. ప్రధానపాత్రలవ దగినవి రత్నావళి రంగారావు సీతారామయ్య లవి. కాని కడమవికూడ నొక్కొక్క స్థాయిలో నిర్వహింపఁబడెను. కొందఱు రత్నావళిభర్త సీతారామయ్యనే యప్రధాన పాత్ర యని భ్రమపడిరి[2]. కాని యన్నిటి కంటె మహోదారమైనది, సీతారామయ్య

---

1. "ప్రధానపాత్రలంత ప్రధానములుకాని పాత్రలచేతలచేత యిట్టి సన్నివేశాలను విశ్వనాథకల్పిస్తాడు". ('స్రవంతి'-పుట 25, పంక్తులు 28-29) (మార్చి 1959). "ఉద్వేగ భరితమైన ప్రధాన పాత్రలకు ఆలంబనముగా మాత్రమే మిగిలిన పాత్రలను ఉద్దేశించాలి. అందులోనూ రత్నావళి చేసిన పనికి సీతారామయ్య దుఃఖము వ్యాఖ్యానమే కాదు." ('స్రవంతి'-పుట 26, పంక్తులు 29-30; పుట 27-పంక్తి 1) (మార్చి 1959).
2. "మిగిలిన పాత్రలంత ప్రధానములు కావు; సీతారామయ్య కూడను". ("స్రవంతి" పుట 26-పంక్తి 4) (మార్చి 1959).

పాత్ర. దానిపరముగనే చాల వఱకు గథలో జాత్రోన్మీలనముఁ జరిపించి రచయిత దాని నుదాత్తమొనర్చినాఁడు. సీతారామయ్యను గూర్చి చదువునపుడు చేయెత్తి నమస్కరింపవలెనని బుద్ధిపొడమును; ఎంతో సహానుభూతియు గలుగును. యథార్థ మూహింప, రత్నావళీరంగారావులు కథాశరీరములో నెక్కువభాగ మాక్రమించుకొన్నను సీతారామయ్యయే తచ్ఛరీరమును నడిపించు చైతన్యశక్తి. నవలాకర్త వ్యక్తపఱుపఁదలఁచికొన్న విషయమంతయు రత్నావళితోడనే యున్నది. కాని యావిషయమునకు విషయి యైనవాఁడు సీతారామయ్య. ఇతఁడు మచ్చలేని మంచివ్యక్తి. ఇతని శాంతౌదార్యములు దయాక్షమలవంటి గుణములే రత్నావళి హృదయములో రత్నదీపకళిక లైనవి;విద్యావివేక సంస్కారపశ్చాత్తాపములను ప్రాయశ్చిత్తబుద్ధిని గలిగించినవి; తుద కామె నాతని పాదోపాంతమునఁ జేర్చినవి.

రత్నావళి:—

ఈమెలో జాల నాకర్షణ మున్నది. కాని నవల పూర్తియగులోపల నామె స్వరూపస్వభావములలో దీవ్రతరపరిణామముగోచరమగును. ముగ్ధయు నమాయకయు సాధారణసంసారమున బెడ గుపడు నభ్యర్హితస్నుషయు వయసుమీరినభర్త కనుఁగు భార్యయు నగు రత్నావళి క్రమక్రమముగఁ బరిస్థితుల ప్రభావముచేత యౌవనోన్మాదినియుఁ గాముకియు. స్వైరిణియు నగుట చూడఁగలము. ఇంకను గొంతకాలము గడచును. అప్పు డామెలో వాదబలము ను దర్కపటిమయు, వివేకమును, సత్యాన్వేషపరతయు స్పష్టములు కాఁగలవు. నూతనవ్యక్తుల పరిచితివలనఁ గలిగిన నూతనానుభూతు లామెలోని విజ్ఞానవివేకసంస్కారములను ద్రవ్వి తండములుగొనును. దాఁగియుండి ప్రేరణచే వెలువడిన యవి యామెను ననవద్యవర్తనగగా, విదుషీమణిగా, దీర్చిదిద్దుట చూడఁగలము. వైరాగ్యమువలన వివేకము, వివేకమువలనఁ బరితాపము, పరితాపమువలన ధర్మజ్ఞానము, దానివలన నిష్కృతివాంఛ, తన్మూలమున శరీరపరిత్యాగము గూడివచ్చినవి.

పరిసరప్రభావముచే నామె భ్రష్టురాలగుటయం దాశ్చర్యము లేదు. రంగని సాంగత్య మెట్టి భ్రష్టలకునైనఁ బశ్చాత్తాపము కలిగించును. విపశ్చిద్వరిష్ఠయగు వ్యక్తికిఁ బశ్చాత్తాపము రావలెనేగాని యది ప్రాయశ్చిత్తరూపమును దాల్పకపోదు. కాని రత్నావళి కా పశ్చాత్తాపముకలుగుట కంత వివేకము, సంస్కారము ననావశ్యకము; కేవల మనుభవమే చాలును. అగుచో రత్నావళి విషయమునం దది సర్వసాధారణమైన పశ్చాత్తాపముకాదు; గుండెలలోఁతులు దూఁటినది; త్వగస్థిభూతశరీరనుగా జేసినది. సంస్కారముతోగూడిన వివేకమువలనఁ గలిగినది; అది యంతటితో నాఁగునా? ఆమెలో ధర్మమును నిల్పెను. ఆ నిల్పుటయే యామె గుణశీలముల వైశిష్ట్యము.

రత్నావళి పరిణామమునొందుటకుఁ గావలసిన సాధనసంపత్తి యంతయు పేకరింప బడినది; పరిణామము పొందుట కనువగు వాతావరణసృష్టి యంతయు మెలకువతో జరిగెను. అయినను నా పరిణతి నభివ్యక్తము చేయుటయందు మందోత్సాహము కొన్ని తావులలో నగపడును. ఆపరిణామవేగ మించుక యెక్కువ పడించెను. అట్టిచో వాస్తవిక వాదులు కొందఱు తప్పుఁబట్టుదురు.

సైజముచే నాయిక రత్నావళి సామాన్యయువతి. అనూచానులగు సాధారణగృహస్థులయింట బుట్టినది. శిష్టాచారసంపత్తికి నిలయమగు సద్బ్రాహ్మణ కులమునను గోడలు మెట్టినది. ఆమె పదునాఱవయస్సు గడువేను; ఇందులో రెండేండ్లు కాపుర పుటనుభవము. భార్యాభర్తలకాపురము సౌఖ్యావహమై సాగుచునే యున్నది. ఆధునికనాగరకతా వాసనలు సోకుటకు గూడ వీలులేని వాతావరణమే యిప్పటివఱ కామె ప్రపంచము. తాదృశములైన పరిస్థితులలో రంగారా వామె హృదయమునందు నూతన భావబీజముల నాటినాఁడు; క్రొత్తయూహాలు రేకెత్తించినాఁడు. ఆమె క్రొత్తపోకడలు పోయినది.

కొందఱువిమర్శకులు రత్నావళీ రంగరావుల ప్రథమ సమావేశమునుగుఱించి యిట్లూహించిరి. అతఁ డామెను మొట్టమొదటి సారిగా గలిసికొనిన సమయమెట్టిది? అర్ధరాత్రము. ఇంట నందఱు నిద్రాముద్రితులు. గోడదూకి యతఁ డామెగదిలో ప్రవేశించినాఁడు. ఆ పరిస్థితిలో సైజముగ నామె యేమిచేయఁగలదు? భయముచే గోల చేయును; లేదా విహ్వలించి నోటమాట రాక మూకీభవించును. కాని మఱఁది యగపడగనే యామె తహతహలాడినదని మాత్రమే రచయిత వచించినాఁడు. భయపడవలదనియుఁ దా నామెతో గొన్ని సంగతులు మాటలాడవచ్చితిననియు నతఁ డనిన వెంటనే యేమిమాటలాడెదవని యామె ప్రశ్నించినది. విహ్వలచిత్తయైనచో వెంటనే యటులఁ బ్రశ్నింపలేదు. ఆమె తన మనమును బూర్తిగా నధీనములోనుంచుకొన్నట్లుఁ దోచును. అనఁగా నాతనిరాక నామె పోఁకకుఁగైకొనలేదు; ఆ ధీరత సంభవమా? యని కొందఱి విమర్శన.

దీనికి సమాధానము బహుసులభము. నను ప్రదీపమునకుఁ బోయివచ్చిన రంగారావుగదిలో దీపముపెట్టు వృత్తాంతముతో గథ యారంభమైనది. ఆ దీపముపెట్టి పోవుచున్న వదినెగారిని రంగారావు దగ్గఱిల్లినాఁడు; ఆమె యోసరిల్లినట్లు వర్ణితము[1]. రెండేండ్లనుండియుఁ గాపురము చేయుచున్న గృహిణి కటులదగ్గఱిల్లుటలోని భావము తెలియును; అతని యావైఖరి నామె యాలోచించుచునే యుండును. కావున నర్థ

1. 'చెలియలికట్ట'—పుట 7. అయిదవ కూర్పు. (ఆగష్టు 1954).

రాత్రమం దాత.డు గదిలోనికి వచ్చుట యామె కాశ్చర్యము గొలుప నక్కఱలేదు. రంగారావు నడవడి క్రమక్రమముగనే యామె నాకర్షించెననుటకు దీనినొక యుదాహరణముగఁగూడఁ జెప్పవచ్చును.

పిదప రంగారా నామె వయసులో నున్నదనియుఁ దనయన్న వయసు మీఱిన వాఁడనియు నామె చదువుకొన్నదనియుఁ దనయన్నకుఁ జదువురాదనియు నామె యందగత్తెయనియు భర్తయందగాఁడుకాదనియుఁ జాలదూరము తులనాత్మకపరిశీలనమునకుఁ గడగును[1]. ఆతనియుద్దేశ మామెనుబొగడుట అయిన నాతని పరిశీలనము సోదరదూషణ మనియు ననవచ్చును. అప్పుడు రత్నావళి మాఱుమాటాడ లేదు; ఆలోచించుచు నిలుచున్నది. దీనినిగూడ దప్పనలేము. అటు పతిదూషణమునుగాని యిటు స్వసౌందర్యస్తుతినిగాని కాదనుస్థితిలో నామె లేదు. రంగని యామాటలలోని భావము నామె యోజించుకొనుచుండును; తాత్పర్యమును గాదు. అది యర్ధరాత్రము. అందును దలవనితలఁపుగఁ దనతో నంతవఱకు నెక్కువగఁబరిచయము లేనిమఱఁది రహస్యముగవచ్చి పలుకుట. ఆ పలుకుల యుద్దేశము, నామె యూహించుకొనుచుండటయే సహజము. వానిని నివారింపఁబ్రయత్నించుట కృత్రిమముగ నుండును. అతనినైజ మామెకుఁ గ్రమక్రమముగఁ దెలియుచున్నది.; అంతేమియుఁ గ్రొత్తఁదన మామెకు గోచరింపలేదు. తానూహించినట్లే యాతఁడు మెలఁగుచున్నాఁడు. కావున నామె పతిదూషణమును నివారింప నాసక్తిఁజూపకపోవుట యుక్తియుక్తము. తన భర్తయెడ నామె దురభిప్రాయమునుగాని, గార్హస్థ్య జీవితమునం దసంతృప్తినిగాని వెల్లడింపలేదు. మఱి యా దూషణము నెట్లాహ్వానించెనని విమర్శించుట పొరపాటు. అది యామె యాహ్వానించుటకాదు; సహించుటయుఁగాదు; రంగని భావము నర్థముచేసికొనుటకై యామె తీసికొను విశ్రాంతి; లోకనింద రాకుండఁ జూచుకొనుట.

మఱఁది తన భర్తను దూషించుచుండఁగా సహించి యూరకొన్నదనియు, నందుమూలమున నామె పతిని ద్వేషించుచున్నదనియు సందేహించుటకుఁ దావులేదు. ఆమె వయస్సు పదునైదేండ్లు. రంగని కింటిలోగల పలుకుబడి యామెకుఁదెలియును. వానిమాటల కూరకొనుట యనఁగా ముందువిని, పిదప నాలోచించిచూత మను కొనుట; సంసారము గుట్టు రట్టుచేసికొనకపోవుట. కించిత్తైన స్వతంత్రముగ నాలోచించు ప్రవృత్తి యామెలో లేదనలేము. ఆ బీజమే లేనిచో రంగనిబోధల కంకుర మేర్పడదు. మఱఁది మాటకుఁ జెవియొగ్గు గుణ మామెలో నుండుట వలననే యంత

1. 'చెలియలికట్ట'-పుట 23. పంక్తులు 10_20. అయిదవ కూర్పు. (ఆగష్టు 1954).

మూఁడినది. [illegible] ధిక్కరించుట యామెను ముగ్ధత్వమునకును నైజప్రవృత్తికిని [illegible] అట్లుఁ జేసినచో దొలుదొలుతయే రంగని [illegible] బోవును. ఇతివృత్త విస్తరమే లేనిచో నవల యెక్కడిది?

రంగనిమాటల నామె యంగీకరించినట్లు దోఁచుననుట తప్పు. అతనిని ధిక్క రింపకుండుట, యామె మనస్తత్త్వమునకు విపరీతార్థమును గల్పింపదు. తాను పెరిఁ గిన వాతావరణమునకు [illegible] సంఘటన మామెలో ప్రతినిర్యాతనమును గలిగింప లేదనియు [illegible] లేదనియు [illegible] భ్రమ. ముం దది ప్రథమ[illegible]ఘటనమే గాదు. అప్పటికే నూతని నామె కాదనవడపోసెను.

మఱఁది లక్నోనుండి తిరిగివచ్చినాఁడు. భర్తయూరలేఁడు; మఱఁదితో రత్నా వళి [illegible]హ్యాళికి సముద్రతీరమున కేఁగును. అప్పటికే యామెలో జాల మార్పు వచ్చినమాట నిజము. కాని తన్మాత్రమున నట్టి కుగ్రామములో వాహ్యాళికిఁ బోవ సాహసించుటయా? వచ్చిన మార్పు వ్యక్తిగతము. వాయుసేవనమునకుఁ బోవుట! అంతటి సాహస మా మఱఁది చేసెననుట యత్యుక్తి యని యింకొక వాదము. ఇచ్చట సంఘమును బరిగణింపకపోవుటయే వ్యక్తిలోవచ్చినమార్పు. ఆ మన్నించుటయే యున్నచో మార్పు వచ్చెననము. ఇంకొక సంగతి. అది యా యిరువురికి వాహ్యాళి. కాని లోకముదృష్టిలోనది వదినెమఱఁదులు సముద్రమును జూడఁబోవుట. లేదా విద్యా వంతు డైన మఱఁది వదినెగారికి సముద్రమును జూపఁబోయినట్లును లోకమున కర్థము రావచ్చును. అతనిని బరపురుషు డనియు నీ మాత్రమునకే యామెచూపినది స్వేచ్ఛ యనియు నాఁడుది సాహసించుటయా? యనియు ననుకొనుట తగదు. కాదేని యీ చిన్న సాహసము రానున్న పెద్ద సాహసమునకు సోపానము.

ఇల్లువీడి చెన్నపట్టణము పోయినదిమొదలు చివరివఱకు రత్నావళి పాత్రపోషణ మద్భుతముగ నిర్వహింపఁబడినది. ఆమె యొక తప్పిదముచేసినను వంతకంతకు నామెలో విస్తరిల్లుచున్న వివేకము, విచక్షణ జ్ఞానముమొదలైనవి పఠితలసానుభూతిని జూరగొనును.

[illegible]

ఈత డు [illegible] లోని [illegible] రక్షింపఁబోవు వివేకి. సంస్కార రహితమైనచదువు, [illegible]నములేని పుస్తకజ్ఞానము, ననుష్ఠానయోగ్యములుగాని వ్యర్థసిద్ధాంతములు, [illegible] జేసి యాలోచనలు, వైదేశికసంప్రదాయవ్యామోహ మున నూతనజగత్సృష్టి నుద్దేశించెడి యుద్రేకము, వశముగాని వయఃప్రాదుర్భావము, వంటి వెన్నియో యాతనిని వంచించినవి. దానితో నాతఁడు నిస్సహాయుఁడై నాఁడు. రత్నావళి నాతఁ డంటిపెట్టుకొనియుండుటకీ నిస్సహాయతయే కారణము. ఈతని యందలి ప్రధానగుణ మాత్మవంచన.

### సీతారామయ్య

రత్నావళీరంగారావులవలనఁ గథ నడచినచో దానిని నడపించినవాఁడు సీతారామయ్య. అతఁడే రత్నావళికి భర్తయు, రంగారావున కగ్రభ్రాతయుఁగానిచో గథ యట్లుసాగదు. అతఁ డుపాధియగుటవలననేయా యిరువురు పాత్రలును భాసించిరి. అప్రధానపాత్రవలెనుండు ప్రధానపాత్ర యీతనిది. రచయిత యీతని నాలంబనముగఁ జేసికొని సమస్తము నభివ్యక్తమొనర్చినాఁడని యింతకుముందే చెప్పఁబడెను.

### సరస్వతి

ఇఁక సరస్వతి యొకతె.ఈమె కథలో జాల తక్కువభాగము నాక్రమించుకొనిన పాత్ర; చాలఁదక్కువగ మాటలాడినది. కాని యా తక్కువలోనే మిక్కిలి విషయ మిమిడియుండెను.ఆ యిమిడికలో నిరుద్దమగు వ్యాఖ్యానముకూడఁగలదు.త ద్వ్యాఖ్యకు హేతువు స్వానుభవము. ఒక సమయములో సీతారామయ్య మిక్కిలి కోపమువచ్చి రత్నావళిని గొట్టెను. రత్నావళి మఱలఁగొట్టెను[1]. మరునాఁడు సరస్వతి సందర్భము చూచుకొని రత్నావళితో 'పిచ్చిదానా! ఎవరికేదిప్రాప్తియో వారికది లభించును. నీవు మనస్సునకు నచ్చినవానిని పెండ్లిచేసికొందువు. వానికిఁబక్షవాతమువచ్చును; మఱూచి కమువచ్చును!?' అని మన కర్మసిద్ధాంతమును సోదాహరణముగఁ జెప్పినవిధానము బహువివేకసమన్వితము. అనుభవమువలన వచ్చిన వివేక మామెది. ఆమె తక్కువ చదువుకొనలేదు; రంగారావువంటివారి యభిప్రాయములో సంస్కారము గలదియుఁ గాదు. కాని యామెది అచ్చమైన సంస్కారము ఆమె మాటలలోనే యామె రూపము పూర్తిగఁ గోచరించును. రత్నావళి తానెంత పెడత్రోవఁద్రొక్కినను సరస్వతి మాటాడినపుడెల్ల వదినెగారు మాటాడిన వన్నియుసత్యమేమో! యనుకొనెడిది. ఎవ్వరికిని భయపడని రంగారావు సరస్వతికి భయపడును.ఆమెలోని వివేకముతనన్నొడింపఁగలదనెడి యాతనివిశ్వాసమే యా భయమునకు హేతువు.

### రంగని స్నేహితులు

రంగనికి మిత్రులు నలువురు.ఈ నలుగురకు నాలుగురకములైన మనఃప్రవృత్తులు. రత్నావళి తనత్రోవను దిద్దుకొని గమ్యము నన్వేషించుటకీ నల్వురు నాల్గుతెఱగులుగఁ దమతమ ప్రవృత్తి ననుసరించి తోడ్పడిరి. వారిలో ముకుందరావొకఁడు. అతఁడొక విలక్షణమైన వ్యక్తి. అందఱు నాతనివలన నాకర్షింపఁబడుదురు.

---

1. 'చెలియలికట్ట'—పుట 52, పంక్తి 10. (ఐదవ కూర్పు-ఆగష్టు, 1954).
2. 'చెలియలికట్ట'—పుట 57—పంక్తులు 19—22 (1954).

(8) భా వౌ చి తి

ఈ నవలామూలమున రచయిత చెప్పనెంచిన భావ మేమి ? ఆ భావ ముచితముగ వెల్లడింపఁబడెనా ?

సంప్రదాయము ధర్మమునకు సంకేత. ఆచారచోదితముగాని యాచరణము మనలను ధర్మమునుండి వేఱుచేయును. ఒక నీతి యొక్క నియమమును లేనినాఁడు పరిరక్షలేని ధర్మ మెట్లు విచ్ఛిత్తిచెందినట్లగునో ప్రదర్శించుటయే చెలియలికట్టకు లక్ష్యము. శ్రీ విశ్వనాథవారి రచలన్నిటియందును సాధారణముగ నీ భావమే ప్రతిఫలించును. కాని యీ నవలయందిది యుపబృంహితమై యుపభుక్తమైనది. ఈ భావమే విస్తరిల్లి సర్వ రూపము దాల్చనున్న 'వేయిపడగల' కీ 'చెలియలికట్ట' యుపక్రమము.

ఒక సంఘములోనున్నవ్యక్తి దాని సంప్రదాయము లను బరిత్యజించుట, సముద్రుఁడు చెలియలికట్టను దాఁటివచ్చుటవంటి విపాకము; అంతటి విపత్కారము. ఆ విపత్తెట్టిది ? ఆ నవలలో నది గీతమాలికలయందు వెల్లడింపఁబడినది[1].

రంగారావు తనది 'సోదరసోదరీభావమ'నుచు వదినెగారగు రత్నావళిని కౌఁగి లించుకొనినాఁడు. ఆ కౌఁగిలి యాపాదించిన యావదయు వారి యిరువురియందుఁ గలిగించిన సంచలనమే "చెలియలికట్ట"- చెలియలికట్టదాఁక సముద్రుఁడు చనఁడు. చెలియలికట్ట ముట్టుకోఁడు. చెలియలిని ముట్టుకొందురా" యనిన రచయితగీతము[2] కీడుచాటి రత్నావళీరంగారావుల జీవితవిపరీతపరిణామమును సూచించుచున్నది.

వివాహము, ప్రేమ, సౌందర్యము మున్నగు వానినిగూర్చి యీ నవలలో దీర్ఘమైన చర్చోపచర్చ లున్నవి. ప్రేమ వివాహము ల సంబంధమును పాశ్చాత్యసులోచనములనుండి చూచినరంగారావు టీకటిప్పణి రత్నావళి నాసికపై తాఖీ ప్రాయములవెల్లువయందు ముంచెత్తినాఁడు. కాని నిలఁబడి కొట్టుకొనిపోక యామె నిలఁద్రొక్కుకొనెను.

ఆర్యావర్తము కర్మభూమి. హైందవుఁడు కర్మనిష్ఠాగరిష్ఠుఁడు. వానికి కేవల మైహికము ప్రధానము గాదు. ఆధ్యాత్మికచింతన యావశ్యక మగును. జీవితములో నిహపరసమన్వయసాధనము గార్హస్థ్యము. దానికి వివాహము హేతువు. వివాహమన 'విశేషముగవహించునది' యని యర్థము. విశేషముగా ననఁగా నైహికముగా మాత్రమే గాక పారలౌకికముగాగూడ నని యర్థము. పరలోకమునందు, చనిపోయినతరువాత, మనము కాబోవుమార్పులకు సానుకూలపడుటకు నీ జన్మములో కొన్ని కార్యములు

1. 'చెలియలికట్ట'—పుటలు 3, 4 (1954). 2. Id ప్రారంభమందలి గీతమాలిక.

చేయవలసియుండును. అట్టికార్యములు స్త్రీపురుషులుకలిసి దంపతులుగానేర్పడి యిచ్చట చేయుదురు. అప్పు డది వివాహమగును."[1] ఇది స్థూలముగ నీ నవలలో రత్నావళి నుండి వెల్లడియగు సత్యము. కావుననే కథాంతమున నామెయందుఁ గలిగిన సంచలన మంత యుదాత్తముగ నున్నది. ఆమె సీతారామయ్యకోఁఅ కున్మాదినివలెఁ బోయెను. కాని క్షమింపుమనుటకుఁబోలేదు; తిరిగి తన్నంగీకరింపుమనుటకుఁ బోలేదు. ఆమె కోరిక వీనికెల్ల నతిభూమి; సర్వాతిశాయియైనది.

ఆమె తనకుఁదానై యొక తప్పుచేసెను. దానికిఫలము ధర్మచ్యుతి; అపవిత్రత; అసతీత్వము; కేవలము పశ్చాత్తాపము చాలదు క్షమాభిక్షవేడుట నిష్ప్రయోజనము. ఆమె యికఁ బవిత్రురాలు కాలేదు. ఆముష్మికచింత యొక్కటియే యామెను దరింపఁజేయవలెను. అ జ్ఞాన మామె కబ్బినది; తత్త్వము బోధపడెను. కావుననే "నీ కుమారునిచే ధర్మముగా గద్దినము పెట్టింపుమ"ని కోరినది.ఆమె యట్టి పతనావస్థనుండి యెట్టి గుచ్ఛ్రియస్థానమందుకొనెనో యూహింపలేము.

సీతారామయ్య చాల నుదారుఁడు,క్షమాబుద్ధి కనధి యని రత్నావళి యెఱుఁగును.[2] అట్టిచో నామె క్షమాభిక్షవేడుకొని జీవితశేషము నాతనిసేవలో దరలింపవచ్చు గదా! మరణింపనేల? ఈ సందేహమును నవలాకారుఁడే తీర్చెను. "ఒకభార్య భర్తను వదలి లేచిపోయెను. ఆమె తరువాత పశ్చాత్తాపపడి మఱల భర్తయొద్దకుపోయి తనను స్వీకరింపు మనెను. అతఁడు స్వీకరింపవలయునా? వలదా?[3]" ఈ విషయము తన మిత్త్రుఁడు తన్నడిగినట్లు రంగారావు రత్నావళి నడుగును[4]. రంగారావునకు సమాధానమిచ్చు సామర్థ్యము వాలుతక్కు. అతనికిఁగల పరిజ్ఞానము పూజ్యము. ధర్మమును గూర్చిన విశ్వాసమే యాతనికి నాస్తి. ఆ ప్రశ్నకు రత్నావళిచేసిన పరిష్కార మద్భుతము. అట్టి స్త్రీని భర్త "స్వీకరించుట ధర్మముకాదు; ఆమె పోయి మఱల భర్త నడుగుటయే ధర్మము కాదున్."

---

1. 'చెలియలికట్ట' పుట 101, పంక్తులు 10. (1954). శ్రీ విశ్వనాథవారి శైలి యవని ష్పష్టతిమగ నుండును: వేదము పత్రశద్ధవంస నీ రీతిగ నేర్పడినది; ఉక్తలేఖన మగుట దానికి గాయ మని యున్ను నడివినదాని కిది యుదాహరణము. పై భావము నింకను శ్రద్ధాసక్తి యున్నచో నింకను బాగుగఁ జెప్పఁగలరు.
2. "ఓసి! పిచ్చిదానా, వజ్రమువంటి కాపురము పాడుచేసికొనకుము. నీ యదృష్టముకొలఁది ధర్మరాజువంటివానిని జేపట్టితివి". 'చెలియలికట్ట'-పుట 58-పంక్తులు 8-10 (1954).
3. Ibid, P. 274, Lines 8-11 (1954). 4. Ibid-P. 280. Lines 14-18 (1954).
5. 'చెలియలికట్ట'-పుట 280. పంక్తులు 19, 20. (1954).

[illegible]ంగనికిఁ జిత్తశుద్ధి లేదు. ఆమెలో గలిగిన జ్ఞాన మతనిలో నుదయించు టెట్లు? తన పాశ్చాత్య[illegible]జ్ఞానమును [illegible] అతఁడు దుష్టుఁడై పోయినాఁడు. [illegible] బడుటయే [illegible] దివలి కాతని పని. ఎందుల కనిన [illegible]

[illegible] మొదలుపెట్టి [illegible]దమునొద్ద పాడెనో దానిని గడి[illegible] యొద్ద [illegible] మొదలుపెట్టి గోరి ప్రతిష్ఠాపురము జేరినది; తుఫానులఁ గూడ [illegible] యొకానొక బుద్ధితీవ్రతలో నుండెను; మార్గమధ్యమున నా తుఫానులో [illegible] నగ[illegible]డి యీమెను బల్కరించుట యందు దృష్టము స్ఫురించదని యొక విమర్శనయున్నది[1]. ప్రతిష్ఠాపురమునకు [illegible]లనే యీ వ్యక్తు లిద్దరకును [illegible] చేసికొని[illegible].

ప్రేమికులు, దంపతులు : వయోధిక తారతమ్యము :-

శ్రీ విశ్వనాథ [illegible] నవలలలో సాధారణముగ నాయికానాయకులనడుమ వయస్తారతమ్య మధికము. 'చెలియలికట్ట'లో [illegible] చాలఁ జిన్నది; సీతారామయ్య పెద్దవాఁడు; 'బద్దన్న సేనాని'లో దిప్పన్న పెద్దవాఁడు; కాదమ్మ చిన్నది. కావఁ దన కంటెఁ జిన్నవాఁడగు బద్దన్న నామె ప్రేమించెను. 'ధర్మచక్రము'న మష్ట్రశ్రీ వీర పురుషదత్తులకును వయస్తారతమ్య మధికము. 'తెఱచిరాజు'నందలి వాసంతీసారథుల సంగతి యెఱుఁగనివారు లేదు. ఈ తారతమ్యము విమర్శకలోకమున నొక గగ్గోలు కల్గించినది[2]. అదియొక గాలిదుమారముకి; పెద్ద సమస్యగాదు. దానిని బెద్ద సమస్యగా విమర్శకులు చేసిరి.

"క్రమవిరుద్ధములయిన స్త్రీపురుషసంబంధములు" అనెడి యుపశీర్షికతో దీనిని బై జెప్పిన విమర్శకులలో నొకరు దీర్ఘముగఁ జర్చించిరి; స్త్రీపురుషసంబంధములలో స్వేచ్ఛయు, విధవావివాహోద్యమము, నతిబాల్యవివాహములు నింకను స్త్రీ పురుష నియమ రహిత స్వైరవిహారము మున్నగు సంఘటనల నెన్నిటినో వెనుకటి సాంఘిక పరిస్థితులపేరిట నీ క్రమవిరుద్ధ స్త్రీపురుషసంబంధములకు నుపోద్ఘాతములుగ వివరించిరి. ఎన్నియో నవలలలో నిట్లుఁ జిత్రించుటచే నిది యాదృచ్ఛికముగాదు; ఒక సిద్ధాంతముగఁ బ్రతిపాదింపవలెనని రచయిత బుద్ధిపూర్వకముగఁ బ్రతిపాదించుటయే యని వారు నిర్ణయించిరి[4].

1. 'తెలుగు స్వతంత్ర', పుట 21 పంక్తులు 27–34. (28–12–1956).
2. Id. పుటలు 21,22 (28–12–56)
3. "తెలుగు స్వతంత్ర" పుటలు 28–32 (మార్చి, 1959).
4. "ఈ క్రమవిరుద్ధమైన స్త్రీపురుష సంబంధముల చిత్రణకు ఈయనలో అంతు కనపట్టదు". "స్రవంతి" పుట 31–పంక్తులు 16, 17 (మార్చి, 1959).

ముందుఁ గ్రమవిరుద్ధ మనఁగానేమి? ఆచరణము[1]నందున్న దానికి వ్యతిరేక మని కదా! యర్థము. విమర్శకుల యభిప్రాయములో నాచరణ మనఁగా నేఁటి నడవడి. పురుషులు నేఁడు సమవయస్కులనో యొండు రెండేండ్ల చిన్నవారినో పెండ్లియాడుట కలదు. శ్రీ విశ్వనాథ వా రట్లుఁగాక పురుషు నిరువది ముప్పది సంవత్సరములు పెద్దగా జిత్రింతురు. ఒక్కొక్కప్పుడు స్త్రీని పురుషునికంటె పెద్దగాఁ జేయుటయు గలదు. ఈ రెండును గ్రమవిరుద్ధములుగ వ్యవహరింపఁబడినవి. బాదమ్మ బద్దన్నకంటెఁ బెద్దదగుట తత్కాలోచితము. అం దా నాఁడు తప్పులేదు. ఇఁక మిగిలినది. విమర్శ కులకు బాధగలిగించినదియు. బురుషుఁడు చాలఁ బెద్దవాఁడగుట. ఈ యాచారము తరతరములనుండి నిన్న మొన్నటివఱకు మనలో నున్నది. నేఁడు లేదు. ఆ నాఁడు మన తాతదండ్రులెల్ల సౌఖ్యమెరుఁగరు. నేఁడు మనమే యెరుఁగుదు మనరాదుగదా! నాఁటివారుకన్న గంపెడుసంతానములో మన మొకరము. దాంపత్యసౌఖ్యము లేనిచో సంతానము గలుగదని శాస్త్రజ్ఞుల ఘోష. నేఁటిది సదాచారముకానిచో నది యిట్లుండవలెనని సూచించు నధికారమేగాక బాధ్యతయు రచయితకుఁ గలదు.

అధికవయస్తారతమ్యముఁగల వివాహములుపూర్వములు;సమవయస్కులవి, కించి దూనవయస్కులవియు నేఁటివి; గతమునఁ గొన్ని కులములయందుండి భావిలో నందఱియందు వ్యాప్తినొందఁగల, ,బాదమ్మబద్దన్నల వివాహములవంటివి. అనఁగా వృద్ధ స్త్రీలతోడి వివాహములు. ఇవి యాయుఃక్షీణకరమగు బాలాతపముతోఁ బోల్పఁ బడి నవి. పూర్వవివాహములనెరుఁగుదుము; నేఁటివి చూచుచునే యున్నాము. ప్రాఁతవి నిజముకావు: నేఁటివే నిజమని యెట్లనలేమో, యట్లే తప్పక రానున్నవానినిగూడఁ గాదన లేము. పలన సత్యమనఁగా నేఁటిదే కాదు. తప్పక కాఁగలదియు సత్యమే! సత్యవిషయములనే ప్రతిపాదించిరిగాని యసత్యములను రచయిత ప్రతిపాదింపలేదు. భూతవర్తమానములఁ బోల్చుకొని భావి నూహించుకొనుట సాధారణులకే సులభ మైన పని. క్రాంతదర్శులు, త్రికాలవేదులు, ఋషులు నగు కవులకు సత్యము గోచ రించుట యం దసహజత్వ మేమున్నది?

పోఁగా "మగవాని కెంతవయస్సు వచ్చినను బెండ్లిచేసికొనువయసుమాత్రము దాఁటదా?" యన్న విమర్శకుల ప్రశ్నకు సమాధానములు శ్రీ విశ్వనాథవారి నవ లలో నెల్లెడ నున్నవి. వయస్సునఁ జాలఁదారతమ్య ముండవలెను. పూర్వవివాహ ములే వివాహములు. ఆర్షేయమైన వివాహముయొక్క నిర్వచనమును లక్ష్యమును మనము మఱచిపోయితిమి. నేఁటి వివి యొకవిధమైన పెండ్లిండ్లు; వీని లక్ష్యము వేఱు. ఇది యంతయుఁ గాలములోనిమార్పన్న నెపమున నూరకున్నచో మనము పొందఁ

1. "వితతక్రమే" = విస్తృతాను ష్ఠానే (శిశు. 14_58. మల్లి. వ్యాఖ్య)

లోన్ను నభోగతి ప్రయోజనకరమైనది; కాన నించుక వెనుక చూపు మనకు శ్రేయమని వారివాదన, మన ప్రాచీనస్మృతి కొంత సాహాయ్యపడునని వారి విశ్వాసము.

“యువతీయువకులమధ్య ప్రేమయుండవలెను, దాంపత్యభావము వర్ధిల్లవలయునని కోరవలయును; కాని యిట్టి ప్రణయసిద్ధివివాహ మేమిటి”[1]? అని పైవిమర్శన ఖేదము వెల్లడించెను[2]. ప్రేమ దాంపత్యభావము, వయస్సాతమ్యముగ మధ్యురాదు. కామతృష్ణకు రావచ్చును. కాని మన తలిదండ్రులు నడుమను దాతమాతృవల నడుమనుగల ప్రేమ భావము కంటెను దాంపత్యభావముకంటెను నెక్కువన దంపతులనడుమ నఖండమైన ప్రేమదాంపత్యభావములున్నవని నవలారచయితలు మూయలేరు. ఒకవేళ వయోవ్యత్యాసము కామతృప్తికి సద్దువచ్చినను నవలా దాంపత్యములో గాఢ దంతప్రథమమైనదిగా నంగీకరింపఁబడలేదు. నేఁడుదానికే పట్టాభిషేకము. కావున నా వివాహము లీవివాహములుగావు. అవి సంతృప్తులు అనియు, నాదర్శప్రాయములనియు రచయిత విశ్వాసము. రచయిత ప్రకటించు నాదర్శములను విశ్వాసములను బ్రశ్నించుట యొకవిమర్శనగాదు. ప్రతిపాదించిన విషయమును నిర్దేశించినయాశయమును స్పష్టముగ వివరించుటలో, నిర్దుష్టముగ నిరూపించుటలో రచయిత పొరపడినఁ దప్పుపట్టవలసినవారమే మనము. అతఁడు తప్పునైనను సమర్థించుటలో జమత్కృతిఁజూపినప్పుడు దానిని నభినందించుట సానుభూతిపూర్వకవిమర్శన.

ప్రేమ, వివాహము, కామేచ్ఛ యున్నగునానినిగూర్చి ‘చెలియలికట్ట’యందెంతయో చర్చ జరిగినది. ఇట్టి చర్చలేని విశ్వనాథవారి నవలలే లేవు. వారిదృష్టిలో వివాహసంబంధ మతిపవిత్రమైనది; అది యొకసన్నిధి కాదు; దానినుండి భార్యాభర్తలు విముక్తులు గాలేరు; దాంపత్యజీవితములో వయస్సాతమ్యాదికములవలనఁగలుగు సుఖదుఃఖములకంటె నాదాంపత్యభావము, తద్ధర్మము గొప్పవి. ఈ యంశమును నిరూపించు నుద్దేశముతోడనే రచయిత సీతారామయ్యగారికి వెంటనే మూఁడవపెండ్లి జరిపించిరి. ఆ భార్య యతనితో సుఖముగ నున్నది. వారికిఁబెదునంటి కొడుకును గలిగినాఁడు. రెండేండ్ల జీవితములో రత్నావళియు దాను సుఖపడుటలే దనుకొనలేదు. ఆ భావము నామెలో రంగడు కల్పించెను. కావున వైవాహికజీవితమును సంతృప్తితో ముందుకు సాగించునవి “నేను సుఖపడుచున్నాను, లేదు” అను భావములుకావు; వేఱుభావములున్నవి. అవియే దాంపత్యభావము, తద్ధర్మము నవివానికి సంబంధించును. కావున

---

1. “స్రవంతి” పుట 31_పంక్తులు 22, 23 (మార్చి 1959).

2. “కూఁకటుల్ గొలిచి చేసిన కూరిమినెయ్యమ్ము” అవి కావ్యములలో గవులువర్ణించినట్లుగా జేసిన ముచ్చట పెండ్లిండ్లు. ఇట్టి నవలలలోనివి సాధారణముగా జరిగెడి వాస్తవికపుఁ బెండ్లిండ్ల వంటివి.

నిట్టి వివాహము లుచితములని సిద్ధాంతము చేయుటయే రచయిత యుద్దేశము. అవి యాదృచ్ఛికములు గావు. టాల్‌స్టాయి 'వైవాహికజీవితము'1 నెడి నవల రచించెను. అం దాతఁడుచేసిన సిద్ధాంతమే యిది. ఆ నవల తమ కీ ప్రతిపాదనయందు: జాలఁ దోడ్పడెనని రచయిత చెప్పుచున్నారు. ఆయా భాషలలో నది యింత గగ్గోలు గలిగింపలేదు.

ఈ రచయిత యిట్టి "వివాహములను బ్రోత్సహించు చున్నార"2ని విమర్శకులకు విచారము. తా నెంత ప్రోత్సహించినను తనజాతిపెడదారిఁ ద్రొక్కుచున్నదని రచయితకు విచారము. మదరాసుపోయిన నెల దినములలోనే రత్నావళి పడుచువాఁడగు రంగనితోడిసాంగత్యముకంటె పెద్దవాఁడగు సీతారామయ్యతోడిదాంపత్యమే తన కెక్కుడు తృప్తికరముగ నున్నట్లు గ్రహించినది. క్రమక్రమముగ నామె యావిషయమునే పలు చోటులయందు స్పష్టము చేసెను. ఇందువలన గార్హస్థ్యజీవితములో సంతృప్తి కేవలము కామోపభోగములచే గలుగునది కాదు; అది దాంపత్యధర్మము నర్థముచేసికొనుటలో నున్నది; అని రచయిత యుద్బోధ. "ఆప్తేయ పౌరుషేయములో నున్నదికాని వయసులో నేమున్నది?"3యని రత్నావళిమేనమామ రత్నావళిని సీతారామయ్య కిచ్చినాఁడు.

స్త్రీపురుషుల సహజదేహదార్ఢ్యమునకుఁ గొంత ప్రాధాన్య మిచ్చి4 నవలా కారుఁ డిట్టి వివాహములు సమర్థించుకొనును. సనాతనధర్మము, సంప్రదాయము, సంఘము, వ్యక్తిజీవితము మున్నగువానియెడ రచయిత దృష్టియే వేఱు. అది

---

1. 'Married Life' Tolstoy.
2. "తెలుగు స్వతంత్ర" పుట 21-పంక్తులు 39-40. (28 డిశంబరు, 1956).
3. "చెలియలికట్ట" పుట 16-పంక్తులు 12, 13 (1954).
4 రైలులో వృద్ధుఁడు రత్నావళితో దన కూఁతును సీతారామయ్య కిచ్చుటను గూర్చి చెప్పిన విధానము చాలఁ జమత్కారమైనది :— "మా యల్లునకు నలుబది యై దేండ్లుండును. మూఁడవ సంబంధ మిచ్చితిమి. కొడుకు పుట్టినందుకు సంతోషించుచున్నాము, గీఁత బాగుగా మందవలయుమగాని కొంచె మేండ్ల తారతమ్యములో నేమున్నది? నా పిల్ల నఱువది యేండ్ల వృద్ధున కీయ లేదు. మగవాండ్ర కఱువది యేండ్లవఱకు వయ సుండును. స్త్రీలకు నలుబది యైదేండ్లతో వయ సుడిగిపోవును. ఈ తారతమ్యము చూచుకొని యిచ్చితిని...... "ముప్పది యేండ్ల పురుషుఁడు, మూఁడేండ్ల యాఁడుది" యని మన దేశములో వాడుక". ("చెలియలికట్ట" పుట 246, పంక్తులు 18-24 ; పుట 247 పంక్తులు 1, 2. (1954).

యాధ్యాత్మికము. మానవజీవితములోని లౌకికవ్యవహారము లన్నిటికి నట్టయడుగున నొక ధర్మము, నొక యాలౌకికచింతయు నున్నవి; అవి యావశ్యకములు. అవి నశించిన నాఁడు సమాజమునకే నాశనము వాటిల్లును. ఈ దృఢములైన విశ్వాసములే శ్రీ విశ్వనాథవారి నవలలయందుఁ బ్రస్ఫుటములు. అందు మూలమున వివాహమునకు దానికి వారు చెప్పునర్థము లౌకికార్థముకంటె భిన్నమైనది. ఈ నాఁడు కేవలము భౌతిక శాస్త్ర దృష్టితో జీవితావశ్యకముగ, ఇంద్రియతర్పణ మొసఁగు నొక యనుభవముగ, సృష్టి సాధారణలక్షణముగ బరిగణింపఁబడుచున్న వివాహమునకు వారు చెప్పునర్థము పట్టదు. ఈ వివాహము వ్యావహారికమైన నిబంధనము. అది యాధ్యాత్మికానుబంధము[1]. ఈ వ్యత్యాసమే యట్టి వివాహముల కాధారశిల.

అ సా ధా ర ణ త :—

ఇతివృత్తమునుగూర్చి యింకొకశంక. రత్నావళీరంగారావులు వదినెమఱఁదులే కావలయునా? మఱఁది వదినెతో పాపముచేయుట యెంతేని యుండునా? యన్నవి విమర్శనలు. కాని యితివృత్తములో ప్రాయోభావము లేకపోలేదు. మఱఁదియే వదినెగారితో నట్లు పాపమున కొడిగట్టెననుట చదువరి కొక యాఘాతమువలెఁ దగులును. అదియొక యసాధారణమైన బాధ. అట్టి బాధ ననుభవించినప్పుడే హద్దులను దాఁటి పూర్వమర్యాద లురలి బద్దెలను మీఱి ధర్మసంబంధ మెడలినప్పుడు కలిగెడి తీవ్రబీభత్స రూపము చదువరిమనస్సత్యపథగోచరము కాఁగలదు. తత్స్వరూపసర్వస్వము ప్రత్యక్షమైనప్పుడే దానిమాటున దాఁగియుండిన ధర్మతత్త్వము, దానివిలువయును స్పష్టము లగును.

కావుననే ధర్మగ్లాని సంభవించినదని సాధారణముగ నిరూపింపక తద్గ్లాని నెంత యధికముగ, నెంత యుచ్ఛ్రియముగఁ జిత్రింపవలెనో యంత యధికముగ, నంత యుచ్ఛ్రియముగను నిరూపించిరి[2]. ఇతివృత్త ముదాత్తముగాక యొక నీచఘటనము నాధారముగఁ గలిగియుఁ దన్మూలమునఁ బఠితల కధికముగ బాధకలిగించి చివరికొక యుదారసత్యమును బ్రతిష్ఠించుటవలనఁ బ్రతిపాద్యము, ప్రతిసంధానము నొంది సుస్థిరముగ హత్తుగొల్పఁబడినది. తెల్లనిగోడపై తెల్లనిసీమసున్నఁపుకణికతో నొక బొమ్మను

1. "చెలియలికట్ట" పుట 201-పంక్తులు 4—10 (1954). 2. గీ॥ "కదలిలోఁ గొండ యంతటి కరడు లేచి" నది. సముద్రము హోరునఁ గదలి పెల్లగిల్లినది. కాడియెత్తువఁ గెరటమొకఁడు
తరలి ప్రత్యంతమగు పర్వతమువలెఁగడుఁ
జాపుగా నెమ్మదిగ పాగిపాగి బయలు దేరినది...... "చెలియలికట్ట" పుట 3, పంక్తులు 1—6 (1954).

గీసితిమి. అది యగపడదు. ఆ బొమ్మనే నల్లబల్లపై గీసితిమి. అది కనఁబడును. తెల్లని మేఘమునుండి యొక విద్యుల్లేఖ మెఱయును. ఆ కాంతి కన్నులలో గొట్టవచ్చిన ట్లుండదు. నల్లని మేఘమునుండి మెఱసిన విద్యుల్లేఖ మిఱుమిట్లుగొల్పి కొట్టవచ్చినట్లుండును. ఉపాధిభేదముచే వర్ణ్యమును రాణింపఁజేయుట చిత్రలేఖన మెఱిఁగినవా రెఱుఁగుదురు. అట్లే యసంభవములుగాని యసాధారణాంశములను సంధానించి చదువరుల నాకర్షించుట సాహిత్యశిల్పమర్మజ్ఞత.

ఇంత పుష్కలముగ 'చెలియలికట్ట'లో భావౌచిత్యమున్నది. కాని యదియే లోపించినట్లుగఁ గొందఱు విమర్శకులు భావించిరి. వారు ప్రధానముగఁ జూపినవి నాలుగంశములు.

(౧) రత్నావళీ రంగారావుల మనస్సులలో సాంసారిక జీవితమునుగూర్చి యొక యభిప్రాయము తాత్కాలికముగ గలిగినది. కాని వారు దానికి నిలఁబడలేకపోయిరి; దీనికి హేతువు రంగనియార్థికదుఃస్థితి; యన్నది వారు చెప్పిన మొదటి యంశము.

దీనిని యథార్థ మనలేము. తమతమ యుద్దేశముల కనుగుణముగఁ బ్రవర్తింపలేకపోవుటకు వారిది వివాహముగాకపోవుటయే కారణముగాని యార్థికదుఃస్థితికాదు. తమ బంధమువైవాహికబంధమే యైనచో నార్థికదుః స్థితిని బట్టి యెవ్వరును విరక్తిఁ జెంది విడిపోఁజాలరు. వివాహితులైన పేద లెందఱు విరక్తులుగాక యథాశక్తితో సంసారము నీడ్చుకొనిపోవుటలేదు? రత్నావళి మనస్సు మఱలుట విజ్ఞాన వికాసములచే గల్గిన పశ్చాత్తాపప్రాయశ్చిత్తచింతలవలన నని నిరూపితము. రంగని కా వికాసమే గలుగలేదు.

(౨). పాత్రపోషణచేయుటలో రచయిత కుండగూడని పక్షపాత మున్నదని రెండవ యారోపణము.

ఇది యొక వాదముకాదు. రచయిత తాఁ జెప్పఁ దలఁచుకొనిన యంశమున కనుగుణముగ శిష్టదుష్టపాత్రల నిర్మించుకొనును. ఏ యల్పముగనో యొకపాత్రదెసకైనను మ్రొగ్గని మహాకవియే యుండడు. అంత రాగద్వేషరహితులు రచయితలు గానేల? మహామునులై తపస్సునకుఁ గూర్చుండ రాదా?

(౩). నవలలోనిఘటనలనుబట్టి గాక రచయితచేసిన వివరణములనుబట్టి రత్నావళీరంగారావులు దుష్టులని వ్యక్తపడినదఁట! వీరికంటె సీతారామయ్య శ్రేష్ఠుఁడని చాలఁదక్కువగ వెల్లడియైనదఁట!

రత్నావళి కర్తను కొట్టినది; రంగడు తినిన యింటి వాసములు లెక్కపెట్టినాడు. తమ్ముడెంత దుర్మార్గుడైన తన భార్యకు దుర్బోధలుచేయుచున్నను వన్నెకు సీతా రామారావు యా తమ్మునకై యిల్లు గుల్లచేసికొని మార్వాడియప్పుల పాలైనాడు. ఇట్టి ఘటనలకంటె వారి వారి సదసద్గుణముల నిరూపించు ఘటన లింకేమి కావలెను?

(४). మానవునిబట్టి ధర్మము లుండవలెనట!

ధర్మమునుబట్టి మానవప్రవర్తనాదిక ముండవలెనని రచయితవాదము. దాంపత్య ధర్మ మనునది, మానవులను దినములనుబట్టి మారు నా? మారునట్టి తాత్కాలిక ధర్మములుకొన్ని; అట్లు మారని సార్వకాలికసద్ధర్మములుకొన్ని. "సత్యంవద, ధర్మం చర"వంటిదే సనాతనదాంపత్యధర్మమును.

కావున "చెలియలికట్ట"లో నౌచిత్యభంజకము లని నిరూపించుటకై నెలకొనబడిన సమస్తవాదములు నపాస్తములు.

## వేయిపడగలు[1]

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి యాఱవ[2]నవల యిది. దీని గుణదోషములనుగుఱించి పెక్కువిమర్శనలు[3] వెలపడినవి. ఇట్టి దీనినిగూర్చి చెప్పుట బహుకష్టము. ప్రగతికాముల మనుకొను కొందఱు రాజకీయ వేత్తలదృష్టిలో నిది యభ్యుదయనిరోధకసాహిత్యము. నేటికంటె గతకాలము మేలను కొనకపోవుటయే వారి దృష్టిలో నభ్యుదయ మన్నమాట. మొత్తముమీద నిందు లోపములకంటె గుణములే యధికమని సాహిత్యపరు లంగీకరింతురు. నేటి యభిరుచు లనుబట్టి దోషమగుచో ప్రధానదోషము గ్రంథస్థౌల్యము. కాని యది కేవలము దోషము

1. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి నవలలపోటీయందు అడవి బాపిరాజుగారి "నారాయణ రావు" తో బాటు బహుమాకృతి నొందిన నవలా శ్రేష్ఠము. "ఆంధ్ర సచిత్ర వార పత్రిక" లో దొలుత ప్రకటితము. దానిమండిపునర్ముద్రితము, పుటలు 416, రసతరంగిణీ గ్రంథ మాల–9 (క్రీ. శ. 1939).
2. "అంతరాత్మ, ఏకవీర, మాబాబు, హీరవల్లడు, చెలియలికట్ట" యు క్రమముగ నైదని చెప్పుదురు.
3. వానిలో జెప్పుకొనదగినవి :– "విశ్వనాథ సాహిత్య సంచిక", "విశ్వశ్రీ" మాస పత్రిక (జనవరి–1954 సంపుటి 2–సంచిక 2) కృష్ణాపత్రికవారు ప్రకటించిన "శ్రీవిశ్వ నాథవారి సన్మానసంచిక" (గుడివాడది) 1956 ; విశ్వనాథవారి ఆకాశవాణి ప్రసంగము (వాణి–సంపుటము vi, సంచిక 22, పుట 1, 7–4–1955) : "విశ్వనాథ సాహిత్య సమాలోచనము" ("స్రవంతి", డిశంబరు 1958: మార్చి 1959) ఆంధ్రపత్రిక ఉగాది సంచికయు (1961) వంటి వానిలో గలవు.

కాదు. మన కన్ని విషయములయందువలె నభిరుచి విషయమునందుకూడ ప్రధిమ తగ్గుటచే స్థౌల్యము నొకదోష మనుచున్నా మని దీనిని జదివి తన్మయులైనపెద్ద లందురు. ధృఢత్వమునుగాదని 'నాజూకు'పేరిట యల్పత్వమునకై యంగలార్చఁగా నది పేలవత్వమై పీటలు పెట్టుకొని కూర్చుండుటచే నిప్పు డటమటించుచున్నాము. 'వేయిపడగల'ను మించిన బృహత్కాయముగల నవలలు పెక్కు ప్రపంచ సాహిత్య మున మన్నన నొందుచున్నవని ము న్నుదాహరింపఁబడినవి. కానఁ బెడఱెక్కలు విఱిచికట్టఁబడిన యొక మహాకావ్యము 'వేయిపడగలు' నవల యనఁదగును1.

ఎంత సంగ్రహించి చెప్పినను దీనినిగూర్చి పదియంశములైనఁ జెప్పక తప్పదు.

దేశోద్ధరణము :-

'వేయిపడగల' ప్రధానాశయము దేశోద్ధరణము. అదియుఁ బూర్వవైభవ స్మరణపూర్వకము. ఎట్లన, జగన్నాథుఁ డొకవేయితలలదేవుఁడు. ఆతనినిగూర్చి మాయ యావరించెను. మనజాతియందు శక్తి నశించినది; భక్తి దిగఁజారెను. అన్నివిధముల నగమ్యగోచరస్థితిలోనున్న దేశము నుద్ధరించుటకు శ్రీ విశ్వనాథవారు తమ ప్రయత్న మును వివరించుటయందు వేయిపడగలు విస్తరిల్లినది.

మన పూర్వనాగరకత నధఃకరించి నవనాగరకత వచ్చిపడినది. ఈ పరిణతియే కథావస్తువు. కథానాయకుఁడు ధర్మారావు పూర్వనాగరకతాభిమాని. ఈ నవల యందలి గుణదోషముల నిర్ణయించుట కిదియే యాధారము. తన్నాగరకతా చిహ్నముల ని ట్లన్వయింపవచ్చును.

(1) దేవమాతృకములకుఁ బ్రతినిధి పసిరిక.

(2) ఐహికాముష్మికముల సంబంధమును ధర్మారావు, గణాచారి, హరప్పయు సూచింతురు.

(3) పాతివ్రత్యమున కరుంధతీప్రభృతు లుదాహరణములు.

(4) దైవస్వరూపముగా గిరిక చిత్రింపఁబడినది.

(5) ఆర్షవివాహము, పూర్వనాగరకత కొక విలక్షణము.

సంస్కృతీ సంప్రదాయముల క్షైణ్యము:-

ప్రాతదంతయుఁ బోవుచున్నది. క్రొత్తదంతయు వచ్చుచున్నది. ఇందులకు రంగాజమ్మ యొక నిదర్శనము. పూర్వకాలపు భావోన్మాదము, పాతివ్రత్యము, వర్ణ స్వచ్ఛతయు నున్నగువానికి నామె లక్ష్యభూతురాలు. ఆ పూర్వసంస్కృతి వన్నెలు

1. 'Nārāyana Rāo' is also an Epic, with its wings clipped.

చిన్నెలు నన్నియు నీమెతో నంతరించినవి. కృష్ణమనాయనింగారిలో బ్రాహ్మ రాజలక్షణములు మూర్తించెను. ఆయనతో వనిచెల్లు కట్టె. సేవదాసితో భగవద్భావమే పలాయనమయ్యెను. సేవదాసీత్వమే దిగజారిపోయినది. అన్ని దాస్యములుచెల్లును. వేఱొక పరదాస్యమే కూడవచ్చినది. రుక్మిణమ్మారావుగారితో రెండు గుసంప్రదాయ మెఱిఁగిన రాజ్ఞీత్వమే నశించును. ఆనాటి చిహ్నమైన సరోజిని నేడు నిల్వఁజాలదు.

పూర్వాంధ్రాచార్యుల కాలంబనమైన కేశవరావుగారుకూడ గతించిరి. గోపన్న చనిపోవుటయనఁగా భక్తిప్రపత్తిసేవా తపయాపరోక్షానుబుద్ధులు మాయమగుటయే! పసిరిక నొత్తుకొనివచ్చు నదేవమాత్స్యకన్యలను గూర్చి పూర్వులు హెచ్చరించియే యున్నారు. ఏ తల్లి గణాచారి స్వర్గమర్త్యపాతాళములకు గడియగా నున్నదో యా తల్లి గణాచారి కూడ నూడిపోయినది. గొలుసుతో లాగి నేలకు బిగించి కట్టివేయఁబడిన స్వర్గ మాగొలుసు తెగినంతనే శతసహస్ర గుణీకృత వేగముతో పైకి సాగిసాగి కానరాకుండ బోయెను. అట్టి గణాచారితో ప్రేమయు నంతర్హితుఁడైనాఁడు. "ఆహా! యింక నేమి మిగిలినది"! అని ధర్మారావు ఆక్రోశించినాఁడు.

ధ్వని:—

ఈ నవల వ్యంగ్యప్రధానమైనది. వేయిపడగ లనఁగా సహస్రముఖమైన ధర్మము: ప్రధానముగఁ జాతుర్వర్ణ్యము. ఊరిపెద్దకు నాలుగుతలలపా మగపడెను; దంపతులకు రెండు తలలది. రాజు, గణాచారి, ధర్మారావును బలిపీఠపుఁగోళ్ళు. కృష్ణమనాయని మరణముతో విరిగిన యా కాలక్లే పదునాలేండ్లున్నది; హారప్పనాయని కాలమున నతుకఁబడి యాతనిమృతితో నిరుపయోగ మయ్యెను; గణాచారి నిష్క్రమణముతో బరమనిరుపయోగమైనది. ధర్మక్రమచ్యుతి వీనిచే వ్యంజితమై యొంటికాలు నన్ను నిరుపయోగమయ్యెను. ఆ యొంటికాలు ధర్మారావు.

పూర్వాంధ్రజాతివైభవము సహస్రభోగములుగ భాసించి రూపరి యదృశ్యమైనటుల వ్యంజింపఁజేయుట యందుఁ జరిత్రప్రసిద్ధిగల నాగులతోడి సంబంధ మిందు సంధానితము. భారతీయనాగరకతాసంప్రదాయములను శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారివలెఁ ద్రవ్వి తలకెత్తఁగలవా రీయుగమున లేరు.

సుబ్బన్న పేట[1]కట్టించిన బ్రాహ్మణుఁడా యూరు నాల్గువందలయేం డ్లుండునని నిర్ణయించినాఁడు. ఆయన సర్వజ్ఞుఁడేకాని సర్వశాస్త్ర కాకపోవుట దానికి హేతువు. ప్రజలకు నీడ నిచ్చుటకై యిన్నినాళ్ళు స్వామి పడగలు విరిసినవి. కాని

1. "సుబ్రహ్మణ్య" శబ్దమునకు "సుబ్బన్న" వికృతి ; "శేషవ" శబ్దమునకు "శొబ్బన్న" వికృతి.

కాటువేయుటకుఁగాదు. ధర్మముచేత బొండుమల్లెలు విరిసినట్లున్న స్వామివారి రెండు వేలకన్నులును నాలుగుదిక్కులఁ దనివితీరఁ జూచుచుఁ బ్రశాంతమహస్సులను విరజిమ్మినవి. స్వామికి వీరన్ననాయనివంశ్యులు ప్రతినిధులు; బ్రాహ్మణప్రచారకులు; కాఁపువాగడఁపు టాఁడుపడుచులు వ్యాఖ్యాత్రులు. ఇట్లు ద్యావాపృథ్వులమధ్య, స్వర్గమర్త్యధామములమధ్య, ప్రత్యక్షాప్రత్యక్షములమధ్య నొకానొక సుస్థిరసంబంధ మీ నవల వలన నేర్పడినది.

పైనుండి కాపాడువాఁడు భగవానుఁడు; క్రిందనుండి రాజు, బ్రాహ్మణుఁడును. ఈ రెండు మహాసంస్థలకును మధ్య తీరనిలంకెయగు గణాచారి దొక మహద్వ్యవస్థ. ఇది యొక ధర్మమండపి. స్వామి, ప్రభువు, బ్రాహ్మణుఁడు, గణాచారి యను నీ నల్వురు దీనికి నాలుగు స్తంభములు. ఇది యంతయు నీ నవల యారంభముగాని నాఁటి కథ.

కాని నవలా ప్రారంభముననే "వేయిపడగలపాము—విప్పారుకొనివచ్చి కాటందుకొన్నదీ-కలలోన రాజును" అని గణాచారి వ్యాఖ్య. ఆమె భాష్యములు పనులు నన్నియు భావ్యర్థ సూచకములు. ఆమె యా నడుమ వేయిపడగలనాగు కలలోరాజును గరచిన దనెను. పిదప బట్టాభిషేకసందర్భములో నెల్లరు: 'బాము పా మ'నినారు. ఈ రెంటికినిగల సంబంధము సర్వారాయఁ డడిగెను. తనకును సరిగా నట్లే కలవచ్చినదనియు సుమారు రెండునెల లైనదనియు రంగారావు పలికెను. క్రొత్త'దివాను'గారిని దొలగించి నాగేశ్వరరావును నియమించిన ట్లుత్తరువు లిచ్చినరాత్రి యాయనకు నిద్దురలేదు. నిద్రపట్టునప్పటికి తెల్లవారుజాము రెండు గంటలు కొట్టిరి. అప్పుడప్పుడే కలఁత నిద్దుర; దానిలోనే వేయితలలపాము; తన మంచముకడఁ దోఁకమీఁద నిలిచియున్నది. ఆతఁడు దానిదెస జూచుచు నూఱుకొనినాఁడు. అది కన్నులనుండి నాలుకలనుండి గరళము గ్రక్కుచున్నది. రంగారావునకు నవ్వువచ్చెను. కోపము మితిమీఱఁగా నా సర్ప మాతనిని వేయిశిరస్సులతో వేయిచోటులఁ గాటు వేసినది.

సుబ్రహ్మణ్యశాస్త్రితోబాటు మండపమునకుఁ బ్రధానాంగముగదా, రాజు! ఆ రాజునేల స్వామి కాటుకొనెను? కులాచారదేశాచారములకు రంగారావు దూరమైనాఁడు. కృష్ణమనాయనికి నీతనికి హస్తిమశకాంతరము. కృష్ణమనాయఁడు, ధర్మారావు, గోపన్న మున్నగువారి "నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁ డ"న్న పద్యగోష్ఠి రంగారావునకు గిట్టదు. వంశాచారప్రకారము తన్నధిరోహింపలే దన్న 'లక్ష్మణస్వామి'[1] తిరుగబాటునకుఁగాని, యభిభూతాభిహతిజాతమగు నాతని మృతికిఁగాని రంగారావునకుఁ జీమకుట్టలేదు.

1. ఇది యేనుఁగు పేరు.

౪ వా స్త వి క త:-

"వేయిపడగల"లోని వ్యంగ్యము నటుంచి విచారించినచో ధనవంతుల దౌష్ట్యము, నిరుపేదల యిడుములు నధికారు లధికారులగుట, మన పురాతనవిగళన క్రమము, గ్రామజీవితశాంతిశోభలు, ప్రకృతిసౌందర్యపరప్రసాదము మొదలగు తెక్కు విషయములు మిక్కిలి వాస్తవికముగ వర్ణింపఁబడినవి.

ఈ నవలలో నాంధ్రగ్రామీణజీవితము, నాంధ్రసంస్కృతియు నంతట నున్నది యున్నట్లుగఁ బ్రతిఫలించుచున్నది. దీని నెవ్వరుఁ గాదనలేరు. 'వేయిపడగల'లో సుబ్బన్నపేటకు గేంద్రస్థితి. ఇది తెలుగుసీమలోని గ్రామములకుఁ బ్రతిబింబము, ప్రతినిధియు. ఆ యూరిలో గోవెల; కొలను; స్వామివారికి గళ్యాణోత్సవములు; నూరేగింపులు; నలంకారములు; హరికథలు; కృష్ణలీలాతరంగకీర్తనములు; దేవదాసి నృత్యనాట్యములు; కూచిపూఁడివారి నాటకములును. ఆంధ్రదేశజనపదములలో బూర్వము వెల్లివిరిసిన సాంస్కృతిక జీవిత మంతయు నిందు మనోహరముగ వర్ణితము.

కృష్ణమనాయని ధర్మప్రభుత్వము, రంగారావు పాశ్చాత్యనాగరకతా ప్రలోభనము, నా రిరువురితరములనడుమఁగల యంతరము నీ నవలలో జక్కగఁ జిత్రింపఁబడినవి. ఆ నాఁ డాంధ్రావనిలో గలిగిన కొన్ని యవాంఛనీయపరిణామములు గూడ నిందు సుస్పష్టములై సహృదయుల హృదయములకు హత్తుకొనిపోవును. అప్పటి కప్పుడప్పుడే యస్తమించుచు నప్పటి కస్తమించిన కొన్ని తెలుఁగుకళల తుదిమెఱపు లీ నవలలో మనకు గోచరించుచున్నవి.

దేవదాసీసంస్థయందలి యౌన్నత్య మెల్ల విరిసి రూపొందిన గిరికవృత్తాంత మంతయు నొకస్వాప్నికగాథ; మఱపురాని మధుర స్మృతి. ఏ కవిగాని తనకు, బూర్వమందున్న యొక వందయేండ్ల సాంఘిక చరిత్ర నింతకంటె వాస్తవికముగను సజీవముగను రమణీయముగను జిత్రించిచూపిన కావ్యమును జూడఁబోము.

౫ వి భి న్న నా గ ర క త లు:-

మన నాగరకత కాధారభూతమైనది యాముష్మికవిషయసంపత్తి; ఐహికము పాశ్చాత్యము, ప్రాచ్యనాగరకతయందు మృత్యుప్రభావచింత, భగవత్స్వరూప నిర్ణయము, భూగోళముపై ఖగోళప్రభావము, నైహికాముష్మికములసమ్మేళనము, మొదలైనవన్నియు నిమిడియుండుటవలన జీవితమొక నిరంతరసాధనగఁ బరిగణింపబడును. వ్యష్టిజీవితమున కాశ్రమముల యాధార మెట్లో సమష్టిజీవితమునకు వర్ణాశ్రమము లట్లు. ఇట్టి వర్ణవ్యవస్థలో నేఁడు తాఱుమాఱు; అశ్రమ్ము మందుమా, పుట్టినది మొదలు గిట్టువఱకు కొక్కటే యాశ్రమము.

పరమార్థ విచారణ సన్నగిల్లుటతో నైహికచింత బలిసిపోయినది. మన యాచారవ్యవహారములు వ్యత్యస్తము లైనవి. ఉత్తమగతుల విచార ముపదేశవేదికలకే యొప్పగించి యనుష్ఠానమునం దైహికమునకు దాస్యముచేయునట్టి యాధునిక తాత్త్వికుల తోడివే తంటాలు.

౨. అంత ర్వ్యా ఖ్యా తా ర్థ వి వ ర ణ:—

'వేయిపడగల'యందు జరిగిన వ్యవసాయ మంతయు ననువ్యాహారణము; సనాతన సంప్రదాయములలోని యంతరార్థపరామర్శము. తదనుధ్యానము చేయుటవలన మనకుఁగలుగు ననువ్యవసాయ మపూర్వమైనది. ఈ కృషియందు రచయితృప్రతిభా వ్యుత్పత్తు లమేయములు. సూత్రప్రాయముగనున్న యాచారనిష్ఠమైన వ్యవహారముల కిం దద్యతనతార్కికదృష్టితో వివరణచేయఁబడెను.

ఇది యిదంతనులకుఁ గొందఱకు సరిపడలేదు. వారు దీని నంతర్భావితార్థము గాని, యంతర్వ్యాఖ్యాతార్థము కా దనిరి. కాని సప్రమాణమైన వాదముతో బూర్వ పక్షముచేయనిదే కాదనుటెట్లు? స్వదేశభాషామతసంప్రదాయనాగరకతాదికమునుగూర్చి నవలలు వ్రాయుట యెవ్వరికైనను దప్పుకాదుకదా! అపుడిఁక జాతీయరచన లనఁగా నెట్టివి? అనేకాంశముల యందలి నిగూఢార్థములు, మహర్షుల మహాశయములు, నెత్తి చూపుటగాక జాతీయకవికి ధర్మమేమి?

రామన్ పండితుఁడు, బోస్ మహాశయుఁడు వంటివారు పదార్థ విజ్ఞాన వృక్షశాస్త్రములలో ఋషీశ్వరులు. ఖగోళజ్యోతిర్విద్యలయందు నిష్ణాతమైనది యార్ష విజ్ఞానము. దీనిలో నూతనవిషయ గవేషకులు కొందఱున్నారు. వారు ఋషితుల్యులైరి. ఉత్తమకవులు మాత్రము ఋషికల్పులుగారా? మహార్థములకు 'వేయిపడగల' కర్తను భాష్యకారు లనకతీరదు.

౩. పా త్ర సృ ష్టి పో ష ణ లు:—

'వేయిపడగల'యందుఁ బ్రధానపాత్రయు, నాయకుఁడును ధర్మారావు. ఈయన రామేశ్వరశాస్త్రిగారి పూర్వపుణ్యముల పంట; సావిత్రమ్మ నోములఫలము; అరుంధతి పాలిటి వసిష్ఠమహర్షి; హరప్పకు బృహస్పతి; గిరికాదేవికి స్వర్గమునకు నిచ్చెన; ఊహాజగత్తులో లక్షాధికారులబిడ్డఁడు; భగవంతునకు బావమఱఁది; మహామేధావి; స్థిర భాషి; గుణగరిష్ఠుఁడు; ఇంగితావగాహి; గుణదోషాభిజ్ఞుఁడు; శృంగారలీలావిదుఁడు; నయకోవిదుఁడు; ధీరుఁడు.

ఇతఁడు రెండులోకములవాఁడు; ఒకలోకములో మూకీభావము; వేఱొక లోకములో నియత వాగ్వ్యాపారము; ఒకజగత్తు దివ్యము; మఱియొకటి భౌమము;

ఒకటి పునీతము; ఇంకొకటి ఇంద్రియాభిభూతము. సెలవులు వచ్చినచో గణాచారి దేవదాసి, పసిరిక, సుందరశి వంటివారితో నీతనిజగత్తు; అవి రానిచో గిరిక, శివరావు, కళాశాల మున్నైన వానితో సాగిపోవు నీతనిపని.

శ్రీ సత్యనారాయణ గారివలెనే కాలమున కెదురీదు దిట్ట ధర్మారావు; ప్రతి విషయమునను బ్రతిఘటనమే; ప్రతిపతరణమే: పలుభాషాపండితు డయ్యు సనాతన ధర్మబద్ధబుద్ధి; అద్యతననాగరకతాంతరార్థము నాకళించుకొని పరిణమించిపోవుచున్న మన సనాతనపద్ధతులకై వ్రాకులాడినవాడు. నదీమాతృకములు, విద్యుద్దీపములు, మరబియ్యము, చలన చిత్రములవంటి వెన్నియో యీతని నిశితపరిశీలనమునకు గుఱియైనవి.

ధర్మారా వీ కథకు సూత్రధారుఁడు. ఈతనినీడపారని యంశముగాని, భావముద్రపడని పాత్రగాని నవలలో లేదు. సూర్యపతి కితఁడొక శంఖము, కిరీటి కితఁడొక సారథి, సచివుఁడు, సర్వమును; రాఘవరావునకుఁ గవిత్వవిషయములో గవితా పితామహుఁడు; హరప్పకు క్షుణ్ణమనాయని గరలకై హికాముష్మికములయందు దుపద్రష్ట, మార్గదర్శియు; గోపన్నకిల వేలుపు; పోఁగా స్త్రీలవిషయమున రుక్మిణమ్మారావుగారికిఁ బ్రత్యక్షముగను సరోజినిదేవికి బరోక్షముగను జ్ఞానదాత, రంగాజమ్మగారికిఁ బెద్దబిడ్డఁడు; అరుంధతీ రథంతరీ ప్రభృతులకు వేదరాశి; కళాతపస్విని గిరిక విషయములో వేఱుగ జెప్పవలసినదే లేదు. ఆమెకళాతపఃపరిపాకమునకుఁ బ్రతివిషయములోను జేదోడువాదోడునై సాయుజ్యము ప్రసాదించిన పుణ్యమూర్తి యతఁడు. ఆయననుండి ధైర్యముచేఁదుకొని సాయుజ్యముపడసిన భాగ్యవతి యీమె. తుదకుఁ దనకుఁదెలియకయే శిష్యసంతతిలో నుండి నిష్కృతినొంద మంగమ్మయుఁ బ్రయత్నించినది. ఈమె ధర్మారావునకుఁ బ్రశిష్యురాలు.

అన్నిటిని మించి ప్రధానమైనది సుబ్బన్నపేటజీవితావధి. అంతగా రంగారావునకు సోకినలనరములకుఁ బ్రాఁకినవిషము సునానీ బియ్యాట్రీసుల నిష్క్రమణానంతరము దీర్ఘవ్యాధితోగాని పరిష్కారము పొందలేదు. జమీకిఁబట్టిన ఋణబాధను, రాణులకుఁబట్టిన యాముష్మికబాధను, స్వామికిఁబట్టిన 'బూజు' బాధను దన పవిత్రతతో క్షాళనమునర్చిన హరప్ప, యోగనిష్ఠాపరుఁడు; కారణజన్ముఁడు. తనజన్మ సఫలమగుటతో యోగనిష్ఠయం దసువులరాల్చిన యాధ్యాత్మవిదుఁ డాతఁడు. తండ్రి 'యీట్సన్' దొరను బోధనకు నియమించి తన నవ్యమార్గములలోని కితనిని ద్రిప్పుకొనఁ జూచెను. కాని యాప్రభావపరిప్లవమును నిరోధించి కొమరుని నియమింపఁ గలిగినది తల్లి. ఆమె తన ప్రాణప్రయాణవేళ తనయుని వేషభాషలను నిర్ణయించి పుణ్యమునఁబోయినది. కాఁగా హరప్ప భావనావిధానమువెల్ల నొక తీరునకుఁదెచ్చి రూపరేఖలుదిద్దిన గౌరవము ధర్మారావునకు దక్కెను.

కుమారస్వామి యన్నివిధములచే ధర్మారావునకుఁ బ్రతికృతి. మంగమ్మ మన స్తత్త్వపరిణతికిఁ గుమారస్వామియే కారణభూతుఁడు.

గిరికయనఁగా దేవదాస్యమునకుఁ బరాంకోటి. దేవదాసీత్వముపట్ల లోకమున కప్పటికే కొంత నిరాదరణ మున్నది; అజ్ఞానజన్యమగు నేహ్యాభావ మున్నది. గిరిక దానిని దొలఁగించెను. ఆమె తాను నడయాడిన త్రోవలను బునీతము చేసినది; కథా వీథిలో దన భక్తిప్రపత్తులతో రంగవల్లులు రచించెను. ఆమె కట్టు, బొట్టు, మున్నైన వెల్ల నతిలోకఁపు సంతరింపులు. ఆమె దివ్యాంగన; సాయంసంధ్యల వేళ దేవళములో జూడవలె నామెను. ఆ కళాతపస్వినికి స్వామిస్వప్నదర్శన మనుగ్రహించినాఁడు. గిరిక యమృతబిందువు. బంగారు తల్లి; మోహవల్లి. ధర్మారావుగారి తండ్రియొక్క సంపూర్ణమనోరథమే గిరిక. ఆమెకు నలుబదికాదు; నాలుగువేలయేండ్లు. ఆమె యుగ యుగాలనాఁటి కళాధిదేవత; వేణుగోపాలుని జేపట్టుటకు సుబ్బన్నపేఁటలో నవత రించిన యాదిలక్ష్మి; సుగుణరాశి.

రాజురాక గాని, రాణివాసఁపువారియునికి గాని, దేవాలయములో నామె యుండుట కాటంకము గల్పింపఁజాలదు. అరుంధతీరథంతరీప్రభృతులతో గలిసి గిరిక నడపిన దృశ్యములు గాని, వదినల ఛలోక్తుల కామె యొసఁగిన సమాధానముల సార స్యములుగాని స్వర్గములు దిగివచ్చినవా యనిపించును. రత్నగిరి భరతమునఁ జాళులు దున్నఁగా, ధర్మారా వాముష్మికబీజములు నాఁటగా, భోగప్పహారప్పల యాలన పాలనములో దెలుఁగుసీమయందు విరిసిన వెల్లువవలనఁ గళాతపస్సు, పంటకుఁదిరిగి సంక్రాంతికల్యాణోత్సవానుభూతి నొసఁగి గిరికపేరిట భగవంతునితో సాయుజ్య కైంకర్యము నొందెను.

దివ్య వాతావరణము[1]:-

నవల యొక మహానది. తటాంచలములయందు దీనికి లోఁతుతక్కువ. ప్రవా హములోనికిఁ బోవఁబోవ వేగ మందుకొనును. నవలలో గొంతదూరము సాగినఁగాని సాధారణముగఁ గథాసంవిధానము సుడులు తిరుగదు; చదువరి తీపినీటికిఁ జేఁపవలె సెక్కఁడు. "వేయిపడగల" విషయ మట్టిది గాదు. ఇది తటాంచలముల నొరసికొనుచుఁ బోవు ప్రవాహి. నవలారంభమువనే పాఠకుఁడు ప్రవాహావేగమువలన స్వశక్తిఁ గోల్పో

1. Supernatural Element.

పుటచే నా వెల్లువదయ కథిను డు. ఈ పరాధీనతకు హేతువగు వేగమునకు హేతువు నవల దివ్య వాతావరణముతో నారంభించుట[1]. అందుచే నిందలి దివ్యవాతావరణమును 'గారణం కారణానా'మ్మనఁ దగును.

ఇచ్చట విశేష మింకొక్కటి. గణాచారి యాలుమాసములకుఁ గథారంభ మగుననఁగా రాజు మరణించునని చెప్పెను. సుబ్బన్నపేట నిర్మాణమునకుఁ బ్రాఁచగు కాపుఁగథయు రామేశ్వరశాస్త్రి వివాహగాథలును భూతపూర్వవిష యములు. ఇవి వర్తమానాంశపోషకము లగుటయేగాక నాయకుఁడగు ధర్మారావును గుఱించి పాఠకునకుఁ బూర్వపరిచయమును గల్గించును. అంతేకాదు. తత్పరిచితిచే "నట్లు పోవుచున్న గణాచారి కెదురుగ నొక మహాపురుషుఁడు వచ్చుచుండె[2]"నని సూచింపఁబడిన ధర్మారావునకుఁ గథలో సార్థకము, సజీవమునగుఁ బ్రవేశము గల్గినది.

ఇట్లుఁ గథారంభమునకు మునుపే కల్పింపఁబడిన యలౌకికవాతావరణమునకుఁ గథలో బ్రధానముగ సాహాయ్యపడినవారు సుబ్రహ్మణ్యేశ్వరస్వామియు, గణాచారియు, పసిరికయు ముగ్గురు.

అన్వర్థమైనది సుబ్బన్నపేఁట. అస లాయూరు పాములయూరు. అక్కడను బట్టి యది యంతయుఁ బాముల మయముగఁ దోఁచునుకి. అందలి ప్రజలందఱు పాముల వాండ్రు. రంగారావు పట్టాభిషేకకాలమునఁ బ్రస్తావనగాఁ దనకలఁ దనవారి కెఱిఁగించినాఁడు[4]. దానినిబట్టి నాగలోకము స్ఫురణకువచ్చును. తండ్రినిగూర్చి

---

1. "వేయిపడగల పాము—విప్పారు కొనివచ్చి
   కాటందుకొన్నదీ - కలలోన రాజును" "వేయిపడగలు" (ప్రథమాధ్యాయము—పుట 1. పంక్తులు 1, 2.) (1939).

2. "వేయిపడగలు" ప్రథమాధ్యాయము—పుట 5, రెండవవరుస, పంక్తులు, 4—6 (1939).

3. "వేసఁగి మండుటెండలు లేఁతరావియాకుల మీఁదపడి ధగధగలాడి కదలినపుడు తళతళ మెఱయు గోధుమవన్నె త్రాఁచుల పడగలవలెఁ బ్రకాశించు చుండెను. రావియాకుల చిన్నచిన్న తోఁకలు చాచిననాల్కల వలెఁ దోఁచెను. దూరమున నాకాశములో దెల్లని సన్నని మబ్బులు పలుచనై చెరలాడి తెల్లత్రాఁచులు మసకలాడినట్లు, పడగలు విప్పినట్లు, ఒకదానిపై నొకఁడు దూఁకినట్లు, కఱచుకొన్నట్లు, పదవళ్ళు త్రొక్కినట్లు, నానారీతుల గోచరించెను." ( "వేయిపడగలు" ప్రథమాధ్యాయము - పుట 5, వరుస 1, పంక్తులు 4-14) (1939).

4. "వేయిపడగలు" అధ్యాయము 4, పుట 28, వరుస 2, పంక్తులు 6—30 (1939).

యప్రయత్నముగ నిరసనగ మాటలాడిన యరుంధతికిఁ గనఁబడిన పామునకు ధర్మారావు మంచముదిగి నమస్కరించి ప్రార్థించినాఁడు[1]. ఆ వచనము నన్నపార్యుని యుదంకుఁడుచేసిన నాగ స్తవమును దలఁపించు ఫణితిలో నడచెను.

దివ్య వాతావరణమునందు గణాచారిప్రాధాన్యము రెండవది; ఆమె యేదియో విశేష ముండిననేగాని యిలు వెడలదు; ఎప్పుడు జపముచేసికొనుచుండును. స్వప్నములు గనుచుండును. ఆ స్వప్నములలో నామెకు రాబోవుసంగతులు తెలియఁగలవు. ఆ మఱునాఁడే శుచిశుభ్రములఁ బాటించిన పిదప నూరిలోనికి బయలుదేరును[2]. పూర్వము చెప్పఁబడిన ట్లిమె స్వర్గమర్త్యలోకములకు లంకె వేయఁగలది; బలిపీఠములో ప్రధానాంగము. కుంభీనసుఁడు చివరిలో బసిరికను గఱచుట కంగీకరించి మధ్యవర్తి మాత్రము గావలెననెను. ముసలిపా మప్పుడు గణాచారి పేరు చెప్పినది. ఏ కాఁపు సుబ్బన్న పేఁటనిర్మాణకారణభూతమైన సన్నివేశమున కాధారమో యా కాఁపుకూఁతురే గణాచారి. చివరకుఁ దాఁ బరుండిన పాక తగులఁబడుటతో నాగ్రామ వినాశనమున కామె హేతువుగూడ నైనది. ఆ తరువాత గుండేరువరదపొడిచి సుబ్బన్న పేఁటను 'సుభాన్ పేఁట'గా జేసివేసెను.

అలౌకిక వాతావరణసృష్టికారణములలో బసిరిక యొకఁడు. ఈ విషయముతో నీతని పాత్ర యంతము. పసిరిక మంగకడుపునఁ గాచినకాయ. ఆ శిశువును జూచి పురిటిలో మంగమూర్ఛపోయినది. అదేమి శిశువు? ఈనకట్టపుల్ల కంటె సన్నము; ఆకుపచ్చనిరంగు; జుట్టు బూడిదవర్ణము. అందఱును పాముపిల్ల పుట్టినదనినారు[3]. కొందఱు కులముచెడిన దీనికి మంచిపరాభవముజరిగిన దనుకొనిరి. తండ్రి రామేశ్వర శాస్త్రిగా రొక్కరే "మంగా! నీ వదృష్టవంతురాల వనిరి. స్వామి కీమెయెడ దయ కలిగినది. ఈమెయందు ధర్మమింకను జెడిపోలేదు. తద్ధర్మమును రక్షించుకొనుట మంగకు విధాయకము.

---

1. "వేయిపడగలు" అధ్యాయము 6, పుట 48, వరుస 2, పంక్తులు 1–8 (1939).
2. "గ్రామమున కంతకుఁ దగిలివచ్చు వార్తయైనచో వేఁపమండ పుచ్చుకొని తల విరియఁబోసికొని తిరుగును. ఒకవ్యక్తికి సంబంధించిన దైనచో జుట్టు ముడివేసికొని, రావిమండ పుచ్చుకొని బయలుదేరును. శుభమైనచో నెఱ్ఱనిచీర కట్టుకొని మామిడిమండ పుచ్చుకొని బయలుదేరును. అశుభమైనచో దెల్లని చీరనే తాల్చును."
   "వేయిపడగలు" అధ్యాయము 9, పుట 95, వరుస 1, పంక్తులు 15–20 (1939).
3. "కాని రెండు కళ్ళు; రెండు చేతులు; మొగము; కన్నులు; నాలుక యిన్నియు నుండఁగా పామనుకొను టెట్లు? ......శిశువు కదలాడెను; పాము మెలికలు తిరిగి నట్లుండెను... శిశువేడ్చెను: పాము కూసి నట్లున్నది. మంగ సుబ్రహ్మణ్యేశ్వరుని దలఁచి పాప కాముదము పెట్టెను". "వేయిపడగలు" అధ్యాయము 3, పుట 20, వరుస 2, పంక్తులు 12–21 (1939).

పసిరిక కై కండ్లు వచ్చినవి. ఈదురుగాలికొట్టినచో నోరుతెఱచుకొని యా గాలి పోసికొనువాఁడు; తల్లికిఁ దెలుపక యేపోయి యే చేవిలోనో పొచ్చును. వాఁడంతే! పైరుపచ్చలు వాఁడుగా బుట్టెను. వానికిఁ పైరునకు సంబంధము. వాఁడే పైరు; పైరే వాఁడు.

పైరనఁగా, దేవమాతృకములని. కావుననే సుబ్బన్నపేఁట పరిసరములలో సర్వాధునాతననాగరకతకుఁ దోడుగ నదీమాతృకములు ప్రబలినవి. తుద కంతయు జలమయమై పసిరిక తిరుగుటకుఁ జోటులేకపోఁగా మంగకు, ధర్మారావునకు వలబడి కలిగెను.

ఆస్తిక్యబుద్ధి దేవమాతృకములపై నాధారపడియుండు ననియు నది సర్వసమృద్ధి కారణ మనియు శ్రీ విశ్వనాథవారు విశ్వసింతురు. దీనికి వేదము ప్రామాణ్యము. నదీ మాతృకములు నాస్తికతను బెంపొందింప గలవు; కృత్రిమములైన కలుపుల ప్రబలఁ జేయును. అట్టి నాస్తికత్వమునకు నేఁడు నవనాగరకత యొకతోడు. పసిరికకు గోపాల కృష్ణారెడ్డి యన గా బెరిగిన వ్యామోహము ప్రబలము. కాని యా రైతుబిడ్డ కృతక భావములయందు నిమగ్నుఁడైనాఁడు. అతడు స్వార్థవ్యామోహితుఁడైనాఁడే పసిరికచెడిపోయెను; ధర్మారా వంతటివాఁడు పిలిచినను రాలేదు[1]. రెడ్డి తనగడి యారము, కళ్ళజోడు, 'ట్వీడ్ కోటు' మొదలగు వానితో బసిరిక నలంకరించెను. తమ పసిరిక చెడిపోయినాఁడని పక్షులు; 'ఇస్' అని రోసినట్లు పాములు.

బుస్సుమని పసిరిక యడ్డుపోయినను తుపాకితో గొన్ని పక్షులను, మడమతో గొన్నిపాములను రెడ్డి చంపివేసినాఁడు. తిరిగి యొకనాఁడు పసిరిక పక్షులకొఱకు వెదకినాఁడు. పాములు, పక్షులు, బుస్సలుకొట్టినవి; కూసినవి. చివరకొక వృద్ధసర్పమి ట్లన్నది. "నీవు వానివెంటఁబోతివి; వానివలె వేషము వేసినావు; వాఁడు రైతు బిడ్డ. వాఁడే మాకు నిల్వనీడలేకుండఁ జేసెను. అట్టి చెడిపోయినవానితోడనా, నీకు సాంగత్యము? ఇఁక నీదారిని నీవుపోవచ్చును."

పసిరిక విలపించినాఁడు; ద్విజలోకము నర్థించినాఁడు; గుండేటిలోబడి మరణించెద నని బెదరించినాడు. అప్పు డొక వృద్ధనాగ మన్నది: నీవును మేమును, తత్వతః భిన్నుల మైతిమి. మే మిప్పు డాటలో నిన్ను గఱచెద మనుకొనుము: విషమెక్కి చని పోయెదవేమో"!

---

1. "గోపాలకృష్ణారెడ్డియు బసిరికయుఁ గలిసి మెట్టపొలము వద్దకుఁ బోయిరి. పక్షు లన్నియు నెచ్చటి వచ్చట దాఁగు కొనెను. పాములన్నియుఁ బుట్టలలో దూరెను. ఒక పెద్దపాము పుట్టలోనుండి తలయెత్తి పసిరికను రమ్మని సన్న చేసెను... పసిరిక పోలేదు". "వేయిపడగలు" అధ్యాయము 34, పుట 388, వరుస 2, పంక్తులు 22–26) (1939).

నరే కఱవుము; బ్రతికినచో గనిసియుందము; లేదా, నష్టమేమి? యని పసిరిక యనఁగా నెవరికి వారు గఱవవెఱచిరి. గణాచారి మాధ్యస్థ్యము నంగీకరింపగా నెట్ట కేలకుఁగుంభీనసుఁడు కఱచెను. పసిరిక గిలగిల తన్నుకొని నెత్తురుగ్రక్కి చనిపోయి నాఁడు. యావద్ద్విజ జాతియు రుతములతో బుస్సులతో విలపించినది. గణాచారి యొదలు తెలియని దుఃఖావేశములో బాదుకొనుచుఁ బోయెను1. ఆకుంభీనసుఁడు గూడ జాతిపైఁ దల కొట్టుకొని మరణించినాఁడు. అప్పటి ప్రకృతి యంతయు నొక విషాద గీతాలాపము. పట్టరాని దుఃఖమున ధర్మారావు సమస్తమును ద్రవ్యిపోసికొని యింక పదునైదు దినములలో సర్వనాశన మగుచున్నందులకు వగపోయి "నేను భరించ లేనిదేమున్నది"? యనెను. తీతువుకూసినది. గణాచారిపాట వినిపించుచునే యుండెను.

ఈ పసిరిక సృష్టియు, నానితోగథ నిర్వహించిన విధానము, వాతావరణమును నవరించిన పద్ధతియుః ప్రపంచవాఙ్మయములలో గనివిని యెఱుఁగనివని రచయితకు బ్రహ్మరథము పట్టిన వారున్నారు2. అసహజముగ నున్నదని నిందించినవారున్నారు. ఈనవలయందు వర్ణాశ్రమవ్యవస్థను గుఱించియు వెల్లడింపఁబడిన యభిప్రాయములతో నేకీభవింపనివారు కొందఱు. వారి యభ్యంతరములు సారస్వత సంబంధములుగావు. కావ నవి మన కప్రస్తుతములు. పోగా వస్త్వైక్యము లోపించినదని కొందఱవాదము. అది యథార్థముకాదు. ఇంతవఱకా వైక్యమే సాధింపఁబడినది. ఇఁక బసిరికపాత్ర యసహజముగ నున్నదని మఱికొందఱ యాక్షేపము. అనగా, నట్టివ్యక్తులుండరని. అదికొంత నిజముకావచ్చును. కాని పాత్రలు నిజముగ నుండనక్కఱలేదు. రచయిత యవి నిజమనెడి భ్రాంతిఁగలిగించినఁ జాలును. అసంభావ్యముగాక ప్రాయోభావము

---

1. 'ఒక శిరసు వాగన్న —యొయ్యారముగవచ్చి
నిజముగా నా తండ్రి — నిన్ను గఱచిందిరా" ("వేయిపడగలు" అధ్యాయము 34, పుట 809, పంక్తులు 19-22, (1954).

2. "పసిరిక వంటి సృష్టి మఱి యే సాహిత్యము నందును లేదు. ఈ పాత్ర కేవలము విశ్వ నాథ సత్యనారాయణగారి ప్రతిభా ప్రసూతము" ("స్రవంతి" పుట 27, డిశంబరు 1958). "ప్రపంచంలో నూతనంగా సృష్టింపఁబడిన పాత్రలు రెండే గోచరిస్తాయినాకు... పసిరిక పూర్వము యె[ఎ]వ్వరి ఊహకును తట్టనిది. ఎవరును ఊహించలేని ఒక ప్రత్యేకమైన సృష్టి. ('స్రవంతి' పుటలు 20—21, మార్చి 1959). 'పసిరిక సృష్టి...ప్రపంచ సారస్వతమున కవివిని యెఱుఁగనిదిగా సహృదయు లెల్లరకును గోచరించు విషయము ('విశ్వశ్రీ' విశ్వనాథ సాహిత్య సంచిక-పుట 97, జనవరి 1954).

గల్గియుండుట [illegible] ముఖ్యము. పసిరిక యొకవ్యక్తిగా నవలలో [నాయకుడు]
సహృదయులెల్ల [illegible]సుకొందురు. అతని తుదిగడియలు కరుణారసమున కాయువు
పట్టులు. [illegible] యాఘట్టము చదువు సారస్యపరు లుండరు. ప్రాయోపా
[illegible] సమయమున [illegible] చుట్టుకొలగును?

ఇంకొక విశేషము. షేక్స్పియరు మహాశయుడున్నాడు. అతని సృష్టి 'క్యాలిబర్న్'[1] [illegible]. క్యాలిబర్న్ జంతువు, పశు, రాక్షసి, మానవుడుకూడ. 'మిరాండా'యొక్క ప్రభావముచేత నతడు మాటాడును. అదియెంతో చక్కనిభాష; రెండవ [illegible]; విమర్శకుల మెప్పు సంపాదించుకొన్నది. మన "పసిరిక" యన్నివిధముల 'క్యాలిబర్న్'ను మించిపోయినాడు. పసిరిక కరుణారసోల్బణముగ మాటలాడ గల్గుటయం దాశ్చర్యములేదు. అతడు మాటలాడలేకపోయినచో నది యాశ్చర్యము. ఆ మాటలవలన సహృదయులకు గన్నీరొలికినచో నది యాశ్చర్యము. ఏ సాంకేతిక ప్రతిపత్తికి పసిరిక ఉత్పన్నమో దానిని విమర్శకు డెఱుగనిచో మన కాశ్చర్యము. ఎఱిగినచో నాతని కానందము.

౯. భాష: కవితాశక్తి:—

'వేయిపడగల' యం దాశ్చర్యము గలిగించునవి రచయితృభాషాశక్తి కవితాప్రతిభలు. ఇవి రెండును నిందులో బరిసీమ నంటినవి. శక్తిగలభాషయనగా గవిత్వభాష. అది యే శైలి. వీరిశైలి యావేశములో వీరుమాట్లాడినట్లే యుండును. కర్తృత్వాహంకారము, భావగ్రంథిబంధనము, భావనాకుటిలిననన్నింటిని గరగ బోసికొని వచ్చినట్లేయుండును. వీరి యావత్సాహిత్యమునందు నెచ్చట జూచినను గోచరమగునది మన సంప్రదాయ ముద్రయొకటి. వేదపురాణేతిహాస మహాకావ్యముల యందలి విషయసంగ్రహముపై వీరికి గల యభిమాన మది. దేశీయములైన పలుకుబడులను పాటించుట శబ్దసిద్ధిని లోక వ్యవహారమునందే నిరూపించుట పూర్వమహాకవి నిబద్ధార్థమేర్పడ శబ్దప్రయోగము చేయుటవంటివానియందు శ్రీ విశ్వనాథవారికి విపరీతమైన యిష్టము. వాక్యనిర్మాణ మపరిష్కృతముగ నెడనెడనుండుటయు గలదు. అంతర్థవ్యక్తిగుణము లేదనియు నది క్లిష్టాన్వయ దూరాన్వయ భూయిష్ఠము గూడననియు గొందఱందురు. దానికిగల దొక్కటియే హేతువు. వారు వాక్యములను సరిదిద్దుకొనుట యుండదు: అదంతయు శిష్యకోటికి నుక్తలేఖనము; ఏమఱక భావము నాశ్రయించుకొని పోయిననగాని బోధ పడదు. జాతీయముపై నాధారపడుటవలన వెనుదిరిగి చూడవక్కఱలేదని వారి

1. Caliburn in Tempest of Shakespeare.

యూహ. అదియంతయు కొక భవ్యావేశము. కథాసాహిత్యము చెప్పఁబడును గాని వ్రాయఁబడదు. కాన వీరి నవలలశైలి భవ్యావేశములో శిష్టులు మాటాడినట్లుండును. చాలవఱకుఁ బ్రయత్నపూర్వకముగ వ్రాసినట్లుండదు. వర్ణనాత్మకశైలి నవలంబించి నప్పటి సంగతివేఱు .

పలుకుఁబడులు, నానుడులు, లోకోక్తులువంటి వాని విషయములో ముందువీరిని జెప్పి పిదప నితరులఁ జెప్పవలెను. పలుకుఁబడి ప్రాధాన్యముగలది వీరి రచన. భావ గౌరవమునుబట్టి నడుమ నడుమ భాషయు నురువగుట యొందును గలది. నిర్నిరుద్ధావేశముచే వీరివాక్యసంయోజనములో గ్లిష్టతయేర్పడును. అయ్యు నింతకుమించిన తెలుఁగుభాష వేఱొకటి యుండదు.

కవిసమ్రాట్టుగారి కవితాసామర్థ్యమును గుఱించివ్రాయఁబూనుట సాహసము; దుస్సాధము. వీరిలో నుత్ప్రేక్షోపమ లడుగడుగునఁగొల్లలు. వర్ణనల విషయము పరిశీలింపఁగా వీరి ప్రతిభ వెల్లడియగును. ప్రధానముగ జ్యోత్స్నాపులకిత యామినులు, ఋతువులు, జలప్లుతులు, వీరివర్ణనలలోనెల్లనధికముగ మనల నాకర్షించునవి. ఈ వెన్నెల లేయే ఋతువులలో నెట్లుండునో, యేయేరాత్రిభాగముల నేయేతెఱఁగులు వోవునో యందొకేవెన్నెల వేర్వేఱుతావులలో నెట్లువేర్వేఱుగనుండునో పెక్కురీతుల వర్ణింపఁబడినవి. వానిని జదువుట కెంతోయాశ్చర్యము. చెప్పవలయుననిన యొక్క కుమారస్వామి సంభాషణలు చాలును.

ఊహాశక్తి, కల్పనాసామర్థ్యము మున్నగువానినిగూర్చి సంగ్రహించిచెప్పుట కష్టము. అట్లని మానుట నిష్ఠురము. వీరి కవితాకల్పనా శక్తికి నొండురెండుదాహరణముల నిచ్చుటకుఁ బూర్వము కొన్నిఘట్టములు సూచించుట యుక్తము. అవితొల్లిఁటి యాంధ్రకళలవైభవము[1], దేవదాసి[2], వర్షర్తువర్ణనము[3], ఋతుప్రాప్తమైన ఆఁబెయ్య[4], వృషభరాజు దీనావస్థయు[5],వంటివి. రొక్కముపంటలఁ గూర్చినవ్యామోహము[6], వినతి పత్రములలోనిబూటకము, పట్టణములవ్యాప్తి[7],మరదంపుడు బియ్యముల తారతమ్యము[8], ఆయుర్వేద ప్రాశస్త్యము[9]వంటి వింకనుబెక్కులు. ఇవియేగాదు. మనయభిరుచులెట్లుఁ గృతకములైనవియు సారంగధర నాటకవిమర్శన[10]యందు విశదీకరింపఁబడినవి.

---

1. 'వేయిపడగలు.' అధ్యాయము 12, పుట251 (1954).
2. Ibid 274 (1954). 3. Ibid 407 (1954). 4. Ibid 605 (1954).
5. Ibid 606, 607 (1954). 6. Ibid 429 (1954). 7. Ibid 287 (1954).
8. Ibid 297 (1954). 9. Ibid 564–566 (1954).
10. Ibid 517–518 (1954).

కల్పనా సామర్థ్యమునకు ఋతువర్ణన సంగతి పరిశీలింప దగినది[1]. ఇటీవల ప్రభుత్వ మూలనే బహుళ ప్రచారము నొందిన వనమహోత్సవముల యావశ్యకతల నెన్నడో నిరూపించిన వేయిపడగలలోని వృషసన్నిధి వృత్తాంతము[2]. ఇది యెంతమనోహరమో యంత యద్భుతావహమగు కల్పన.

అవి సుబ్బన్నపేటలో వృక్షద్వీపములు నెలకొల్పబడు దినములు. నాడచ్చట వృక్షములు వీథివీథికేగాదు; ప్రతిపదమునను గలవు. అవియు నానా జాతులవి. వేప, రావి, మఱ్ఱి, దిరిసెన, గంగరావి, ఇవియవి యననేల? ప్రాంతయూరంతయు వివిధ వృక్ష శోభితము. దీపస్తంభములకు దిగెలు వేయుసమయము వచ్చినది. ఒకతరువునకు మూలచ్ఛేద దండన విధింప బడెను; ఇంకొకచెట్టునకు చేతులు తెగినవి; వేఱొక దానిప్రతిశాఖమునకు దెగవేయ బడినది. మఱియొకవృక్షము కృతాఘకపోలగాఢచపేటము; వేఱొకదానికి శిరచ్ఛేదశిక్ష. ఇది యేతీరు. వృక్షవర్గమంతయు దశోధావ ద్విహంగమ రుత ములమిషచే నేడ్చెను; మూల్గెను; శరణువేడెను. నిర్దయమైన విధి, "పొండు, పొండు, గుండె రాయిడుదుకున గూళ్ళు కట్టుకొనుడు; మీకింత యున్నతస్థితి యెందుకు" అన్నది. పాపము! చేతులు తెక్కలల్లార్చినవి. నోళ్ళుదెఱచినవి. ఇది యిట్లుండ నాదివట వృషసన్నిధుల వృత్తాంతమింకను నెంత కరుణ రసోల్బణముగ నున్నదో చెప్పలేము.

వేసంగిపోగా వానకాదువచ్చెను. ప్రతివరము నొక ప్రావృణ్ణీలమేఘుడు, వడ మటికసుమలలో, వింధ్యాద్రులలో, హిమవద్గిరిశిఖరములలో, బ్రహ్మదేశశైలములలో, జాగ్రత్తగా దానే మహీధ్రమునకు, ఏ క్ష్మాభృద్ధారకు, ఏ శిలోచ్చయకోణమునకు ఏ వృషదుపరిభాగమునకు దగులకుండ దన్నుదా బరిరక్షించుకొనుచువచ్చి యన్ని మేఘములను దేశముమీద గురియుచుండగా దాను దన చెలిమికాండ్రతో గలిసి సుబ్బన్నపేటకేవచ్చి యచ్చట దన ప్రియమిత్త్రమైన యా మహాన్యగ్రోధ శిఖరముననే గూర్చుండి యాతనితో మంతనములాడుచుండును.

ఆ మేఘుని పేరు వృషసన్నిధి. ఆ వృక్షము పేరాదివటము. అది మహాబలశాలి. వచ్చినమిత్త్రమును భుజములమీద జేతులువైచి 'యెన్నాళ్ళకువచ్చితివ'ని కదలించి వేయును. వృషసన్నిధి గతసంవత్సరమువచ్చినపు డాదివటమును గౌగిలించుకొని[4] "మిత్త్రమా! నీవు బుట్టి నాలుగువందల వరములైనది. నే ననాదినైన మేఘమను.

1. "వేయిపడగలు" 441–442 (1954
2. I bid 537–538 (1954)
3. "వేయిపడగలు" అధ్యాయము 20, పుటలు 253, వరుస 1, పేరా 2 నుండి. (1939)
4. "అపృచ్ఛ స్వప్రియ సఖమముం తుంగ మాలింగ్య శైలమ్" మేఘదూతము.

మన మైత్రి నేఁటివఱ కవ్యవహితముగ సాగుచున్నది.ముందునాఁటికి మఱల మనము కలియుదుమో!కలియమో!" యనెను. అమృతమూర్తియైన మిత్త్రినినోటినుండి యశ్లీలము వచ్చినందుల కాదివట నుప్పుడే భయపడినది.

యథాప్రకార మా సంవత్సరము వృషన్నిధి వచ్చెను. మనస్సులో నేమో దిగులుగనే యున్నది: వచ్చి చివఱకుఁ జూచెను. ఆదివటము లేదు. అది సుబ్బన్న పేఁట కాఁబోలు నని పరిసరములనున్న పది పదునొకండు గ్రామములు వెదకినది. ఎల్ల లన్నియు నీ యూరికే సరిపోయినవి. మఱి యాదివట మేది? ఆదివట మేది? వృషన్నిధి యొడ లంతయు దుఃఖాశ్రుమయ మయ్యెను. కాని పట్టుకొని యాదరించు స్నిగ్ధుఁడు లేఁడు. ఒక విద్యుద్దీపికా స్తంభముమీఁద శ్రమాపనోదార్థ మొఱగెను. అది యతనికిఁ గొఱత వేసి నట్లున్నది. దైవము దయఁదాల్చి యొకఝంఝు జడమైనవృషన్నిధిని దన్నుకొనుచుఁబోయెను. ఆదివట మేమైనదో వృషన్నిధియు నదేయైనది.

ఈ సందర్భమున నిచ్చుట పుచ్చుకొనుట యను దాని భేదములు వర్ణింపఁబడినవి. దాన ముచ్ఛ్రితము; పరిగ్రహము లంబమానకర్ణియగు గర్దభము. అడుగవలసివచ్చు సరికి, చే సాచవలసివచ్చుసరికి జగత్ప్రభువంతటివాఁడు వామను డైపోయినాఁడు.

వివరములసంగతి యటుంచి యోజింపఁగా గృష్ణమనాయనివంటి ప్రభువుల పరిపాలనమే యున్నచో 'జమీందారీ'లను గుఱించిన నేఁటి రాద్ధాంత మంతయు ననావశ్యక మనిపించును. ఒకప్పుడు మనదేశ మన్ని రంగములయందు నింతటి యౌన్నత్యము వహించినదికదా! యని యీ నవలఁజదివి గర్వింపని వా రుండరు[1]. నవలాకర్త తన కవ్యవహితపూర్వమందున్న యొక శతాబ్దినాఁటి యాంధ్రుల సాంఘికజీవనచిత్రణమున కిందు దిక్కటీపట్టెనను యొకమాటలో నిజముచెప్పుట. ఇట్టి యుత్తమనవలయైయుండికూడ 'వేయిపడగ' లభిరుచిపెంపొందని పాఠకులవలనను సానుభూతినెఱుఁగని చదువరులవలనను స్థౌల్యవైపుల్యములనుగుఱించి మాటపడుచునేయున్నది.

---

1. 'వేయిపడగల' నంతర్జాతీయముగఁ బలుకుబడి లభించుటకుఁ జేయు ప్రయత్నము లన్నియు నాంధ్ర ప్రశస్తికి వైజయంతులు. యమ్. యన్. రాయ్. మహోదయుని వంటి వ్యక్తి 'వేయిపడగల'ను గూర్చి మెచ్చుకొనెనని వదంతి. చూడుఁడు :— ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక, పుట 143, పంక్తులు 13-17 (1961—62). ఇదిచాల శుభోదర్కము.

## నారాయణరావు[1]

అడవి బాపిరాజుగారు రచించిన దీ నవల; నవలల స్పర్ధయందాంధ్రవిశ్వవిద్యాలయము వారిచే బహూకరింపబడి 'వేయిపడగల'తో ప్రాతినిధ్య బహుమతిని బంచుకొన్నది; సాంఘికములు[2], ఐతిహాసికములలో ప్రసిద్ధిగన్నవి కూడ నాలుగైదు నవలలు వీరివి కలవు.

సాంఘికములైన నవలలలో వీరు తమ దృష్టిని కేవలము పాత్రపోషణమందే వ్యగ్రము చేయరు. దానిని వాతావరణసృష్టియందును, సంఘర్షణ వర్ణనమందును గూడ ప్రసరింపజేయవలెను. దేశమున సంఘటిల్లు కొన్ని ఘటనలలో ప్రధానపాత్ర వహించు కొందఱు వ్యక్తులుందురు. అట్టి కొందఱను దృష్టియందుంచుకొని నవలాకర్త తన నవలలో పాత్రల సృష్టిచేయుట సముచితయుక్తము. అది విస్తృతమైన సాధించుటకు సులువైన నిశ్రేణి. తన్మూలముననే 'నారాయణరావు'లోని భూస్వామ్య దర్పదిగ్మూలనము గాని 'తుఫాను'నందలి కార్మిక సంఘర్షణలు గాని 'నరుడు'లో హరిజనస్త్రీ 'యాంగ్లోయిండియను' వనితయైపోయినట్టి వివాహము గాని విచిత్ర మనిపింపవు; చదువరికి సన్నిహితముగను వాస్తవికముగను నగపడును.

'నారాయణరావు'నందలి కథ సాధారణమైనది; కథాభాగము కడు సూక్ష్మము; వర్ణనలు విశేషము; అందును శిల్పకళాకౌశలయుక్తములైనవి మెండు; పాత్రలసృష్టి యధికము; పోషణమున వైవిధ్యమున్నది. నవల యామూలాగ్రము సహృదయులకు ఐత్సౌత్సుక్యము గల్గింపకపోదు. అందులో పాత్రలసంఖ్య యధికమగుటచే గొంతవఱకు జదువరికి బ్రాంతపాత్రల దలంపోసికొను క్లేశముగూడ గలదు.

విశ్వలాపురము 'జమీందారుడు' శ్రీ లక్ష్మీసుందరప్రసాదరావుగారు, శాసన సభ్యులు. తమకున్న యాదర్శములను గార్యరూపమున బెట్టుట వీరి ప్రధానలక్ష్యము. భూస్వామ్యకుటుంబములోని మంచిచెడ్డలలో తుపాతుల నెఱిగిన వ్యక్తి వీరు; కావు

---

1. దీని నాల్గవ యావృత్తి 18—2—1953. శ్రీ శివలెంక శంభుప్రసాదుని ప్రచురణము—ఆంధ్ర పత్రిక ముద్రణాలయము — చెన్నపురి.

2. సాంఘికములైన వీరి యితరనవలలు :— కోనంగి, తుఫాను, జాజిమల్లి, నరుడు, వీనిని గూర్చి యథాసంభవముగ 'గొండఱు విశిష్టనవలాకర్తల'ను ప్రకరణమున బ్రసంగింపబడును.

3. హిమబిందువు, గోన గన్నారెడ్డి, అడవి శాంతిశ్రీ, అంశుమతి, మధురవాణి (అసమగ్రము-తంజావూరాంధ్ర రాజులనాటి కథ).

నవే సాధారణకుటుంబములో దన రెండవకూఁతు నిచ్చుట కియ్యకొనిరి. వివాహసంబంధములనుగుఱించి యాయనచేసినయాలోచనలు ప్రస్ఫుటముగా నున్నవి.వీరి మేనల్లుఁడు జగన్మోహనుఁడు; మొదటినుండియు నతని వినోదవిహారవములనుగూర్చి విని పిల్లనీయ వొల్లనిమేనమామగా రాతని రాకపోకలఁగూర్చి జాగ్రత్త వహింపకుండుట కొంచెము లోపమనెడి విమర్శన యొకటి యున్నది. కాని యది యుచితము గాదు. మేన మామకు మేనల్లుని రీతులు నచ్చకయే శారదను సాధారణకుటుంబమువాఁడైన నారాయణరావున కిచ్చిరి. కడమ రాకపోకలు, వానిలోని దుశ్చింతలును, మగవారు పట్టించుకొనరు. అందును బ్రసాదరావుగా రుదారులు. వాని నెల్ల నెఱిఁగి జగన్మోహనునితో శారదకు సమావేశములు సమకూరకుండఁజేయవలసినది తల్లి వరదకామేశ్వరి; లేదా—యామె పెద్దకొమార్తయు మొదలైనవారు. కాని శారద నిట్లు సాధారణకుటుంబము వాఁడైననారాయణరావునకిచ్చుట వారెవ్వరికినిష్టములేదాయె! తమయున్నతవంశప్రతిష్ఠకది భంగమని వారి యూహమాయె! మాటరియైన జగన్మోహనుని మందలించుట తమ ధర్మమని వారెఱుగరు. పెండ్లియైన శారదను సరసములాడరాదనియు, భర్తపై నామెకు ద్వేషము రగుల్పరాదనియు నీ మూర్ఖుఁడెంచునా? వరదకామేశ్వరీదేవియే స్త్రీసహజముగ నా సంబంధము తమ యంతస్థునకు దగినది కాదని గర్వించుటయు గొప్పలు పల్కుటయు జరిగినది. పెండ్లివారు పల్లెటూరివారనియుఁ దమకుఁ దీసిపోవుదు రనియు గర్వించుటయే తప్పు,జగన్మోహనుని దుష్ప్రవర్తనలువినినప్పుడు తమ యున్నతస్థితిగతులను గమనించి తన కూఁతులతో నెక్కుడుగ నాతఁడు కలిసికొనకుండ కట్టుదిట్టములు వరదకామేశ్వరి చేయకపోవుట, పెద్దపెద్ద లోఁగిళ్లలోని క్రుళ్ళును, నిరర్థకగర్వమును, స్త్రీలమూర్ఖతను లోకమున కెత్తిచూపుట.

నారాయణరావుతండ్రి సుబ్బారాయ డుగారిపాత్రను జాలఁజక్కగ నవలాకారుఁడు పోషించెను. నారాయణరావుతల్లి జానకమ్మగారి యౌదార్యమును మెచ్చి మెచ్చుకొనఁదగినది. పురుషులు పరాభవము మఱచిపోఁగలరు; నిత్యజీవితములో బెక్కింటిని బట్టించుకొనరు. స్త్రీలలో బరాభవాగ్ని రగుల్కొనుట యనఁగా బ్రతీకారము నకు దారితీయుట. అయ్యును జానకమ్మగారి స్వభావము వేఱు. ఆమె తనకుమారుని వివాహములో జరిగిన పరాభవములను, నమ్మలక్కల సూటిపోటిమాటలను గుర్తెఱిఁగియు, నౌదార్యముతో వాని నన్నిని లెక్కసేయ లేదు; కోడలిని గూఁతుకంటె నధికముగాఁ బ్రేమించినది. ఇది స్త్రీలోకమున కాదర్శచిత్రణము.

సూర్యకాంతము పాత్రయొకటి యాకర్షణీయమై యున్నది. నారాయణరావు ముద్దుమురిపెములచెల్లి సూర్యకాంతము. ముఖ్యముగ నీ పాత్ర చాలఁజాలిఁగొలిపి మనహృదయముల స్పందింపఁజేయఁగలదు.తన యన్నగారికి వదినెగారికి మధ్యవర్తినిగ నున్న ఘట్టములలో నీమె యమాయకత్వము మనలను ముగ్ధులఁజేయును. వారి యిరు

వృద్ధి కలుగుటకు తెక్కు గొలుసుల చాటుపడిన 'సూరీసు'ను దేవకన్యక యన్నను దప్పు గాదు. దినదినము కను దురితముల గుదుర్చుచున్న వదినగారి మనస్సు నించుక కరగింపగలిగినది యొంటిగ 'సూరీసు'నకు సాధ్యము. దీనితోనే కథలోని మొదటిమెట్టు ప్రారంభమైనట్లు తోచును. ఈమె భర్త దూరదేశములలో నున్నాడు. అతనిపై గల యతిస్నేహము, పాపముశంకించు చుండెడిది. అట్టి భయములనెల్ల ధీరతతో మట్టుపెట్టుకొనెడిది 'సూరీసు'; తన మనస్సును జముకమై సంలగ్నమొనర్చుకొనెడిది. అటు భర్తృవిహిత మగు గోరుచు నిటు సన్నపనల కలుగకొలకు శ్రమపడుచు నణకువతో మెలగిన యీ పాత్ర స్త్రీలోకమున కింకొక యాదర్శచిత్రము.

శ్రీ రాజా క్రొవ్విడి బసవరాజేశ్వర జగన్మోహనరావు 'జమీందారు'గారిది వారి కేశవలన. ఈ స్వామ్యవ్యవస్థ శిథిలమగుచున్న యీ దినములలో సంఘమున మన మెచ్చుటకైన జూచుటకు వీలగునది వీరిమూర్తి. ఆ భోగలాలస, యా మద్యపాననిరతి, యా వేశ్యాలోలత్వము, యాగదాస్తిని జిల్లీగవర్నరులకు దస్కూరగా వెచ్చించుటయు, నవనాగరికమునకు భయ్యమున్న మాత్రము, ఏకృతిలో సికూడ చొప్పవాడనను కొను నాత్మవంచనము వంటి లక్షణములన్నియు పతనశీలమగు నాటి భూస్వామ్యసంఘ జీవితమునకు సంబంధించినవి. ప్రతి స్వామియు నింగ్లాండులోనున్న రాజకుటుంబము నాడననియో 'యాంగ్లో-ఇండియను'సంఘమునకీ దేశములో మూలస్తంభమువంటి నాడ ననియో గర్వించిన దినములవి. అ క్లెంగిలిబ్రతుకునకు సిగ్గుపడక తిరిగెడి వ్యక్తుల కెల్ల అడివి బాపిరాజుగారు జగన్మోహనుని పాత్రయందు సమాధి కట్టించిరి.

స్వజాతి స్వమతాచార భాషా వేష వ్యవహారములను మఱచి పరజాతి సంపర్కము గోరువారి కీడు తెక్కు గుణపాఠము లున్నవి. తనపేరు వినినంతనే తన్నెల్లరు మోహింతురని తలపించువాడు, జగన్మోహనుడు. వివాహిత యైనను శారదముందు దన్నుః బ్రేమింపవలెను. అందులకై తా నామెను బ్రేమించినట్లు నటించి తన తుచ్ఛతృష్ణను దీర్చుకొనుట కాతని తీవ్రయత్నము. శారదకు నారాయణరావన్న నించుక ప్రీతియున్నది. శారదతల్లి యొద్దఁ దాఁ దీసికొనిన చనవును దుర్వినియోగపఱచి శారద నారాయణరావును ద్వేషించునట్లుః జూచుట జగన్మోహనుని పని. నారాయణరావు నొద్ద నవమానమునకు పాలై కూడ మఱలఁ దలయెత్తుకొని తగుదునని తిరిగినవీరుఁడు జగన్మోహనరావు. పతులయందు ముగ్ధలమనస్సులు విఱచుటకై యత్నించు నీ సాహసికుఁడు తిన్నయింటివాసములు లెక్కబెట్టువాఁడు. అమాయకురాలైన శారదను మోసగింపఁజేసినయత్నము లిందులకు సాక్షిభూతములు. కుచ్చితములు కడకు వ్యర్థములై కూలద్రోయబడుననుట కీతనిపాత్ర నవలలోగన్న ప్రాముఖ్య ముదాహరింపఁదగినది.

నారాయణరావు మిత్త్రములైన రాజారావు, ఆలము ప్రభృతులవి మఱికొన్ని పాత్రలు. ఇవి బాగున్నవి. నాయకుని బావమఱంది లక్ష్మీపతి పాత్రగూడఁ బ్రశంసనీయము. రాజేశ్వరరావు కొంచెము సామ్యముచే జగన్మోహనుని దలఁపింపఁజేయును. కాని యిర్వురిలో వ్యత్యాసము కలదు. రాజేశ్వరరావే సంఘములో బెరిఁగెనో యే సంఘపుఁగట్టుబాట్లు మన్నింపవలెనో యా సంఘమున సభ్యులైన సుబ్బయ్యశాస్త్రి గారిభార్య పుష్పశీలయొక్కతగులమునఁబడి యామె నిలు వెలువరించుకొనిపోయెను. యువకుఁడు రాజేశ్వరరావామెను దీసికొనిపోయినది, హైదరాబాదు. అచ్చట వీరి కాఁపురము. తరువాత నితఁడు జీవనోపాధికై వెదకులాట. మొత్తముమీఁదఁ దగులున దియుఁ దప్పునదియు నెఱుఁగని రాజేశ్వరరావు తన యాలోచనల నెల్ల నాశయము లుగ వగచు పడుచువాఁడు. సీతాకోకచిలుకవంటిది, పుష్పశీల. ఈ చపలచిత్తను నమ్మి యా యమాయికుఁడు తమ దాదర్శప్రణయ మనుకొనును. తుద కామె నిజస్వరూపము వ్యక్తముకాఁగా, దానంతకుముందు సాటినారియెదుటఁ బలికినవి దాంభికము లైనవి. ఇఁక నితఁడు వారికిఁ దన మొగ మెట్లుఁజూపఁగలఁడు? చంచలస్వాంతయైన పుష్పశీలనెట్లు భరింపఁగలఁడు? ఇటుఁ గష్టము లోర్వలేక, యటు నాశయము నాహుతి యొనర్పనులేక యెట్టకేల కాత్మహత్యకుఁ బాల్పడినరాజేశ్వరరావు మనకు దయనీయుఁడు. జగన్మోహనునిలో నట్టి శోభ గానము.

జీవితమున మఱలఁదిరిగి సాధింపలేని యొక విజయమును సాధించినట్లుగఁ దలఁచినవాఁడు రాజేశ్వరుఁడు; జీవిత నిశ్రేణిలో హఠాత్తుగ నంతిమసోపానమున కెగిఱిన ట్లూహించుకొనినవాఁడు. లోకమున కాదర్శప్రాయమైనది తన యానందమయజీవితము; పుష్పశీలవలనఁ దా నొకయున్నతస్థాయి నందుకొంటి ననుకొనిన యతఁడు గాఢాంధతమసములో మఱలఁ దిరిగిలేవలేనట్లుఁ గుప్పగఁగూలిపోయెను. తెలిసియుఁ దెలియని నేఁటి కొందఱుయువకులు మనలో సాధింతుమనుకొను నాశయములకు జీవితముతో బోరాటము ఘటిల్లునపు డుద్భవించు చైతన్యవంతమైన సంఘర్షముచే 'నారాయణరావు'నవల, విచిత్రవాస్తవికతకు నిలయమై వన్నెఁదెచ్చుచున్నది.

సూర్యకాంతముభర్త రామచంద్రరావు. ఇతనిధైర్యసాహసములు ప్రఖ్యాతి గాంచినవి. చేతిలో ధనములేకపోయినను నున్నతాదర్శములు కలిగి స్వయంకృషివలన విద్యావిషయములో నితఁడు పడినపాటు లపారములు; ఎన్నియో కష్టములకోర్చి హార్వర్డ్ విశ్వవిద్యాలయములో విద్యనభ్యసించి గణితశాస్త్రమునందుఁ దనకున్న చాకచక్యము నమెరికాయందు నెఱపిన ధీరుఁడు. హార్వర్డ్ నందుఁ బట్టముపుచ్చుకొనవలెనని యతనికి గలిగిన యూహాకుఁదగిన యవకాశ మేర్పడెను. స్నేహపాత్రులైన కానాల్డ్సన్ లియోనారాకన్యలు జరిపిన వాగ్వివాదములు మిక్కిలి ప్రశంసార్హములు. కాని, తన స్థితిని గుర్తెఱిఁగి జాగరూకుఁడై లియోనారాకన్యపట్లఁ బ్రవర్తించి స్వదేశమునకుఁ దిరిగివచ్చుటయందు రామచంద్రరావు చూపిననేర్పు విస్మరింపరానిది.

రోహిణీదేవి, శ్యామసుందరీదేవి పాత్రలు నవలను శోభిగించుటకుఁ గల్పించినట్లుఁ గనఁబడుచున్నవి. శ్యామసుందరీదేవి శాంతము, విచక్షణాజ్ఞానము, జాలి మొదలగున వన్నియును సూర్యకాంతమునందుఁ బ్రతిబింబితమై యున్నట్లుండును. తన సోదరునివలె మెలఁగుచున్న నారాయణరావునకై విద్యావతియగు శ్యామసుందరీదేవి మన సొక్కప్పుడు చలించుట యధీరతకుఁ దార్కాణ మవఁదగియున్నది. కాని యామె చివరకు నారాయణరావుమాటవిని యాతని స్నేహితుఁడైన రాజారావును వివాహముచేసికొనుట కంగీకరించినది. ఇది యామెకు నారాయణరావుపైఁగల గౌరవమునకు నిదర్శనము.

ఓర్పు నేర్పులను ధైర్యసాహస సౌందర్యాదిగుణములనుగూర్చి నారాయణరావుపాత్రకు నవలాకారుఁ డాయువుపోసినాఁడు. అయనకు విద్యార్థిదశలో నే యే యాశయములుగలవో యవియే తుదివఱకు సాధింపఁబడినవి. శారదను మునుముందుగ జూచినప్పు డాతనికిఁగలిగిన మధురభావము లన్నిటికిఁ గవి తన కలముతో మెఱుఁగులు తుఱఁగలించెను. పెండ్లియైనవెనుక భార్యలోని మార్పునకు, నత్తవారియింటఁ దన మనస్సునకుఁగలిగిన నొవ్వులకు, నోర్చి యాతఁడు గుండె జాయిచేసికొనినాఁడు. హృదయమెంతగ నెత్తురియుచున్నను వెలికిఁ గానరాకుండ నుండుట గొప్ప నిగ్రహశక్తి. ఈ సంయమనము నధికముగ నలవఱచుకొన్న బుద్ధిమంతుఁడు, నారాయణరావు. తన బాధలు కొంతవఱకు మఱచిపోవుటకై యాతఁడు యాత్రలుచేసి మనస్సు మాఱడవెట్టుట ప్రశంసనీయము. అతఁడు తన స్నేహితులందఱితో సద్బుద్ధిగలిగి మెలఁగి వారికిఁ జేదోడువాదోడుగనుండి తగిన హితముగూడఁ గఱపెడివాఁడు; తన బావగారైన రామచంద్రరావునకు విద్యాభ్యాసవిషయములందు సాహాయ్యముచేసి చెల్లెలికిఁ జదువుచెప్పించి శారదకుఁగూడ విద్యాసక్తిఁగలిగించినాఁడు. అంతకుముం దామెయందుఁ దల్లియు జగన్మోహనునియువలనఁగలిగిన మార్పును మఱలించుట కాతఁడు చూపిన నేర్పు మేయము. దుఃస్థితియందున్న జగన్మోహనుని నవ్వులపాలుగానట్లుఁ జేసి యాతని బేరునిలఁబెట్టి ఋణబాధావిముక్తునిగఁ జేయుటయందు నారాయణరావుచూపిన త్యాగౌదార్యనిరతి యత్యద్భుతము. పునస్సంధానమునాఁడును, దదుపరియుఁ దన భార్యలోఁగలిగిన మార్పునీతఁడు తిలకించెను కర్తవ్యము నెంచి యాతఁ డామె నంటఁడు. ఆమె యభీష్టముప్రకారమే దూరముగనుండుట యాతని యుదారత. ఆమెరీతులనైన నాతఁడు జాగరూకతతో గమనింపఁడు. ఆమె వైముఖ్యమునకుఁగల కారణముల నారయఁడు. ఇవిలోపములుకావు. ఆతనిమనస్సన్న్యాస మట్టిది. అతఁడొక ప్రబలమైన సామోపాయము మూలమున నొక సత్యాగ్రహవిధానముమూలమునఁ దన యావచ్ఛక్తియు వినియోగించి శారదాదేవిమనస్సును దనవైపుఁ ద్రిప్పుకొనెను. మొత్తముమీఁద శారద నారాయణరావునకు మానసికముగఁగూడ భార్యయగుట నవలలో మనోజ్ఞముగ సంఘటింపఁబడినది.

నాయికయైన శారదాదేవియందుఁగల శాంతి సౌందర్య గాంభీర్యాభిజాత్యా మాయకత్వములను నవలాకర్త వికసింపఁజేసినాఁడు. శారద వయస్సుచే గడుఁజిన్నది. ఆమె లేతమనస్సులోని యాలోచనలను నవలాకారుఁడు బాలుఁడై తన రచనలో బ్రతిబింబింపఁగలిగెను. తండ్రితనొక్క సాధారణకుటుంబమునందిచ్చి పెండ్లిచేయుచున్నప్పుడు విజృంభించిన శక్తులవడుము నామెచూపిన గంభీరత కన్యలకునెల్ల నొరవడి. తల్లి నారాయణరావుపైఁ దన కీర్ష్య మొలకెత్తించినపుడు శారద యించుక సంచలించినది. తొల్లిఁ దన తల్లియూహాప్రకారము జగన్మోహనుఁ డొక సౌందర్యరాశి యనియు, నాతని మనసు విశాలమనియుఁ దమ యంతస్థునకుఁ దగినవాఁ డనియు నమ్మెను. కాని తనకు వివాహమైన యనంతర మాతఁడు పరపురుషుఁడు. అతనికిఁ గొంత యెక్కుడుగఁ జన విచ్చినట్లుఁ జదువరులకుఁదోఁపించుట యా తల్లి పెంపుతీరు నిరూపించుటకు. స్వయముగ శారద తన యత్తవారియింటి యాచారవ్యవహారములు గౌరవమర్యాదలు నెఱిఁగియుండియు భర్తయందుఁగల మమకారమునకు వైముఖ్యము నాపాదించుకొనుట, మౌగ్ధ్యము, స్త్రీజనసహజమగు వ్యక్తిత్వవికాసనిరోధకగుణము. గొప్పవారి యింటఁబుట్టియు జగన్మోహనున కంతటి చనవిచ్చుకొనుట యసమంజసముగ నున్నదన రాదు. గొప్పవారి గేహములు విచక్షణజ్ఞానశూన్యము లనుటయే రచయితృసందేశ మనఁదగును. తన పునస్సంధానమువేళ భర్తయొద్ద శారదచూపిన యసమంజసప్రవృత్తి పతనోన్ముఖమగు నాఁటి ధనికస్వామ్యసంఘజీవితమునందలి వాస్తవికతయనుట కవి హృదయము. తరువాతనైనను చెన్నపట్టణమువచ్చినపిమ్మటనైనను శారద నిజపరిస్థితుల నర్థముచేసికొని ప్రవర్తింప వలసినవిధము నాలోచింపకపోవుట, కులీనతాగర్వాంధతవలని నిర్విమర్శయనవలెను. భర్త తన్నేమనుకొనునో యే రకముగ దండించునో యను భీతికూడ నామెకుఁగలిగినట్లుఁదోఁచదు. అమాయకత్వాభిజాత్యగర్వము లీమెలో సీమలుదాఁటిన ట్లగపడుచున్నవి. ఈమెతుదకుఁ దన తప్పిదమును దెలిసికొని జగన్మోహనుని గపోల చపేటవిపాకునొనర్చి కూలి పోయినసంసారమును గూడఁదీసికొన్న యదృష్టవంతురాలు.

రచయితృకళాప్రతిభలు :—

ఈ నవలా చిత్రణమున బాపిరాజుగారు తన కళాచాకచక్యమును, బుద్ధిచాతుర్యమును శిల్పనైపుణ్యమును బ్రతిబింబింపఁజేసిరి. ఏ యే పాత్రరచనము నే తీరుగఁ బోషింపవలెనో, యాయన చక్కగ నాలోచించి కలమును గుంచెఁగావించిరి. బాపిరాజుగా రొక్క నవలాకారులేగారు; స్థాపత్యశిల్ప చిత్రలేఖనసంగీత కవిత్వములవంటి లలితకళలలో మన్ననలొందిన మహామహులగుట యీ నవల తార్కాణింపఁగలదు. తెలుఁగుభాషయందు వాస్తవికతఁగల నవలలు నైతిహాసికనవలలు[1] నుద్భవించుటకు

1. 'హిమబిందు' విందు శ్రేష్ఠము. దానిని గూర్చి యథాక్రమమునఁ బరిశీలింపఁబడును.

బాపిరాజుగారు మార్గదర్శు లన్నఁజాలును. 'నారాయణరావులో' సమకాలీనాంధ్ర సాంఘికజీవితము వితతముగఁ బ్రతిఫలించుటయే యిందులకు సాక్ష్యము.

విజ్ఞానము :-

భారతదేశస్వాతంత్ర్యసమరమునాఁటి సాంఘికరాజకీయార్థికాదిపరిస్థితుల వర్ణనాక్షప్తి 'నారాయణరావు'. ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణవాంఛయుఁ బెనుభూతమువలె వెన్నంటు దేశదారిద్ర్యమును యుద్ధపర్యవసానముగఁ బెరిఁగి మిన్నంటుధరలమూలమున మూలుగునట్టి ప్రజలయిక్కట్టులును. గూలినాలిజనము పడుపాటులును, వరశుల్కముల సమస్యలవలననలుఁగు నడిమితరగతికుటుంబముల దీనావస్థయు నిందు నిపుణముగఁ జిత్రింపబడినవి. రష్యాలో సంభవించిన 'బోల్షివిక్కు'విప్లవము ప్రపంచప్రజానీకమునందు నెలకొలిపిన జాగృతికిని వలసల పెత్తనములునశించి ప్రజాప్రభుత్వము లేర్పడినప్పుడే దేశపురోగమనము సాధ్యమనెడి యభివృద్ధికాముకుల యభిప్రాయములకునుగూడ నీ నవల నెలవు. ఇందలి ప్రతిఘట్టము, ప్రతిపాత్రయు సామాజికవాస్తవికతకును, విభిన్నవ్యక్తుల మనస్తత్వమునకును బ్రతిబింబము. అపరిమితమైన యాత్మవిశ్వాసమును, సునిశితమైన విమర్శనాశక్తియు నిర్మలమగు మనస్సును నిస్స్వార్థత్యాగనిరతియు నపారధైర్యసాహసములునుగల నాయకుని పేరీ నవల కుచితమై కుదురు కొన్నది[1].

## బ్రాహ్మణీకం[2]

ఇది శ్రీ చలముగారి యాఁటవనవల. దీనికిని 'వివాహము'నకును గొన్ని పోలికలుగలవు. ఈ రెండు నొక శ్రేణికిఁజెందినవి. నామకరణము, కథాసంవిధానము మున్నగువానిలో నీ రెంటికిఁగల సాన్నిహిత్యము గమనార్హము. ఈ రెండు నవలల యందును రచయిత యగపడఁడు. 'బ్రాహ్మణీకము'నందు ముందే కనిపింపఁడు. శిల్ప దృష్టిచే నీ రెండు నవలలును బరిపూర్ణములని చలమువాదులు చెప్పుదురు. అందు కొంత సత్య మున్నది. దానికిఁదో దస్పష్టతయుఁ గలదు. తెలుఁగుగాక యాంగ్లము గాక యే భాషయుఁగాక రసభావముల పటాపంచ లొనర్చుకొని బహిర్గతమగు నా'తన భాష' వారి యాత్మీయతకుఁదప్ప నెల్లరకు నుద్దేశింపఁబడినది గాదు. అది నిర్నిరుద్ధావేశపుముద్ద; జాజ్వల్యమానకామాగ్నిపిండము. అం దొక శైలిలేదు. తజ్జ్ఞుల మను కొనువారికిఁదప్ప నెల్లరకుఁదెలియు శిల్ప మందుండుట యొక నిబ్బరమైన దబ్బఱ.

'బ్రాహ్మణీకం', 'బడదీది' యనుసరణమని కొందఱు. ముందు 'చలము సాహిత్య' మంతయు మీటర్లింక్ ప్రభృతులకు భావదాస్యమని పెక్కుమంది. యథార్థమూహింప 'బడదీది'విధవ. 'బ్రాహ్మణీకం'లో సుందరమ్మయు విధవ. ఇరువురును జాలి

1. భారత సాహిత్య 'అకాదమీ'వారి యాదేశమున దీనిని శ్రీ రమేశ్ చౌదరిగారు హిందీ భాషలోని కనువదించిరి.
2. క్రీ. శ. 1937 నాఁటిది.

రూలు స్వభావమువంటి స్వభావముగల వా రనఁబడుదురు. శ్రీ చలముగారి నిఘంటువులో నిర్లజ్జయు శీలత్యాగమును వంటివి జాలి లక్షణములు. ప్రేమ మున్నగు పదముల కీ నైఘంటికుని నిర్వచనములు మునుపే పరిశీలింపఁబడినవి.

'బడదీది'[1]భర్త ప్రాణప్రయాణవేళ తన మీఁది ప్రేమ నితరులపైఁ జూపుమని యామెను గోరును. సుందరమ్మభర్త మరణించియుఁ దా నామెను వదలననియు, నామె శిరోముండనాదులు చేయించుకొనరాదనియుఁ గోరును.

ఏయొక రచనను గాని విమర్శించునపుడు తద్రచయితయొక్క యుద్దేశమేమి? అతఁ డేభావముతో రచించెను? తత్ప్రయత్నమునందుఁ గృతార్థుఁడయ్యెనా? యనెడి దృష్టితో విమర్శించుట ధర్మము. జీవితవిషయమున నెట్లున్నను సాహిత్యసందర్భమునందైన నట్టి సమ్యగ్దృష్టి లేకున్నచో జాతులు జగములు నెట్లు నిలువఁగలవు?

మన సంఘము నిజముగ నింత పతనమైనదా? యని చలముగారి నడిగి ప్రయోజనము లేదు. మనమే పరిశీలించుకొనవలెను. ఇది వాస్తవికతయని వారివాదము. సాధారణప్రజలమైన మన కీ పతనస్థితి గోచరము కాదు. భూతదర్శనియో దూరదర్శనియో ధరింపనివారు నవలాకర్తలు కాలేరన్నమాట! శృంగారములో శరీరానుభూతికి సంబంధించినంతవఱకుఁ బ్రణయము ప్రధానము. ఆ ప్రణయములేని శరీరైక్యము కామోద్రేకమని శ్రీచలముగా రంగీకరింతురు. ఈ నవలలోని పురుషపాత్రల పాశవిక కామోద్రేక మెంతవఱకు వాస్తవిక మన్నది ప్రశ్న. ప్రణయములేని సుందరమ్మ నిప్పువంటి దయ్యును బరపురుషగమనముచేయుట యా పరిస్థితులలో నూటికిఁ గోటికినైన జరుగువిషయమా? ఈ నవలలోని యితివృత్తపు సాధారణీకరణమున కే యుగము నాఁటి యాంధ్రజాతిజీవిత మాలంబమన్నది మృగ్యము.

చలముగారి కైవారికోల, మిందులో వైదికసంప్రదాయబద్ధబ్రాహ్మణకుటుంబమును లోకవ్యవహారమును గడు నేర్పుతో వాస్తవికదృష్టితో జిత్రింపఁబడిన వనును. వైదికసంప్రదాయములలో బెరిఁగిన బ్రాహ్మణకుటుంబమునకును చలముగారికిని గల సంబంధము గోక లాష్టమికిని 'పీరుసాహేబు'నకును గల సంబంధమువంటిదని కొందఱివాదము. జన్మలో శాకాహారులు గానివారు నేఁటి భోజనశాలలలో శాకాహారపాచకులు కాఁగా తత్పాకాన్నమును నలభీమపాకమని తినువారు లేరా? విన్నన్న చెప్పినదే వేదము. చలముగారు వర్ణించినదే వాస్తవికవైదికసంప్రదాయము. "అహో! పేరూరి దౌర్భాగ్యం వ్యాఖ్యాతా సూప శంకరః". ఎట్టి పరిస్థితులయొత్తిడియందును గాలుజారుట స్త్రీస్వభా

1. శరత్ నవల: పెద్దక్కయని యర్థము.

వముగాదు. పడఁతియున్న కామునఁదలఁపక 'యా యొద లా చీరె యట్టి యేవపుఁజం దము' మగవార లందఱకు మదనవికారముఁగొలుపునమట పురుషమనోవృత్తి తెలుఁగు టయుఁగాదు.

ఇందలినాయిక సుందరమ్మ. ఆమెపేరు సార్థకము. ఆ వంశమువారందఱు ధ్యానించిన దేవతల సౌందర్యమెల్ల సుందరమ్మలో మూర్తీభవించినది. కదలని, నవ్వని, నిబ్బరఁపుశాంతిగల నిగ్రహఁపు సౌందర్య మామె సౌందర్యము. విలాసములు చూపక పోయినను నెమ్మదిగఁ జందమామవలె నా చీకటియింట నిశ్శబ్దముగఁ దిరుగుచుండఁగ నామెను జూచుటయే యానందమని కవిగారివర్ణన. ఆమె నడకలే పువ్వులు; ముఖకాం తులే ముచ్చటలు.

సుందరమ్మలోని ముఖ్యమైన సుగుణము, దోషముకూడ, భూతదయ;తా నెంత విచారమునైన భరింపఁగలదు; కాని యెవరికైనఁ జివరకు చీమ నీటిలోబడినను - దాను సాహాయ్యముచేయక యుండలేదు.

ఆమెకు బాల్యముననే వివాహము. పునస్సంధానమైన కొలఁదిదినములకే భర్తృ వియోగము. ఆ భర్త స్త్రీలోలుఁడు. చనిపోవునపుడు తాను సుందరమ్మను వదల ననియుఁ, గేశఖండనము చేయించుకొనవలదనియు నీ జన్మకెల్లఁ దానే భర్తననియు నంటఁబట్టుకొనియే యుండెదననియుఁజెప్పి పోయెను.

ఆమె చాలఁ బూర్వాచారపరాయణురాలు; వీని నన్నిటిని నమ్మినది; భర్తృ మరణమునకుఁ గ్రుంగిపోయెను; అన్నాహారములుమాని శల్యావశిష్టయైనది.

అప్పులపాలై తండ్రి 'హరి'యన్నాఁడు. ఆ స్తి అప్పులవారికే దక్కినది. 'నా' యన్నవారు లేక మేనమామయింటికి బెజవాడ చేరవలెనని తల్లితో, గంపెడు చీకటి నెత్తినివేసికొని, యామె తట్ట బుట్ట కట్టుకొని బయలుదేరినది.

దారిలో యువజను లెల్లరు నామెను దేరిపారఁ జూచిరి. ఆమె కేచూపును లేదు.

ఆమూలము రతణలోనున్న శిష్టాచారపరురాలైన సుందరమ్మను మోసగాండ్రు, క్రూరులు, నాచారరహితులు, నూతనవిద్యాపండితులు, ధనాన్వేషణతత్పరులు నుండు నట్టి యీ క్లిష్టమైన లోకముమధ్య పారవేసినది,జీవితము. అది యేమాత్రము కరుణలేక తామరపువ్వును ముండ్లకంచెల మధ్యలో పెద్దగాలి విసరివేసినట్లైనది.

సుందరమ్మ మేనమామకొక కూఁతురు; పది యేండ్లది. ఆ పిల్లకుఁ జదువుచెప్పు టకని వీదవాఁడైన యొక 'ట్రెయినింగు' విద్యార్థిని యింటియం దుంచుకొని సుంద రమ్మ మేనమామ భోజనము పెట్టుచున్నాఁడు. అతని పేరు చంద్రశేఖరము.

అతనికి సుందరమ్మ నచ్చినది. పరోక్షప్రయత్నములు చాల నైనవి. సుందరమ్మ గాఁడవయే లేదు. చివర కీతఁడు జబ్బుపడును. దిక్కులేనివాఁడుగదాయని యుపచారముచేయరాఁగా నీతఁ డామెను వశపరచుకొనఁజూచినాఁడు. ఇంకొకసారి యర్ధరాత్రము నాతఁడు కామాంధుఁడై యొంటిఁ బరుండియున్న యామెను బలవంతమునఁ బట్టుకొనును. మఱియొకతూరి యతఁ డిటువంటిదే ప్రయత్నము. ఆమె యదే యసమ్మతి. దానితో నాతఁ డేడ్చును. ఆ యేడ్పుతో జాలిగుండెగలయామె వశమైనది. ఆమె ననుభవించుటకేగాని యాదుకొన నంగీకరించుటకు శక్తిగాని, ధైర్యముగాని లేని యాతఁడు పలాయన మైనాఁడు. ఆమె యేమైనది? అతనికోర్కె నెఱవేరినది. శీలపరిరక్షణమున కద్దుతగులు జాలిగుణమున్న స్త్రీ బాధ్యతకు లోనుగాక తీరదు. పురుషుఁడు పారిపోవును; తప్పించుకొని తిరుగును. తత్సాంగత్యదోషసూచకముగఁ బ్రకృతి స్త్రీకి ముద్రవేయును.

ఇప్పుడు సుందరమ్మ గర్భిణి. ఈ సంగతి మేనమామ గ్రహించినాఁడు. చంద్రశేఖరమున కామె నంటఁగట్టి తాను బైటపడెను. ఆమె తల్లి తీర్థయాత్రలకుఁ బోయినది.

చంద్రశేఖరమున కింకొక గ్రామమున నుపాధ్యాయవృత్తి. అతఁడు తా నెంతో ప్రేమించితి ననుకొనిన సుందరమ్మ,భార్య కాఁగానే యాతనిదృష్టిలో బ్రాచికపుల్లకంటె హీనమైపోయినది. ఆమెను. నానాబాధలుపెట్టినాఁడు. దిక్కులేని యామెకే యష్టకష్టములు. సుందరమ్మజీవితము సీతమ్మయశోకవనము. అగ్నికి వేఁడి; తేలునకు కొండె; భర్తకు భర్తృస్వభావము; ఇవి యొకరు కల్పించినవికావు; అనుభవింపవలసినవేకాని; అనుకొని లాభములేనివి.

మేనమామ తన కీతని నంటఁగట్టి తాను విముగడ యైనాఁడు. ఆమె కీ పెండ్లిగాని కాఁపురముగాని కావలెనన్న వెంటఁబడినవి గావు. ఆమె యిష్టానిష్టములతో బనిలేకయే కాలము సాగిపోవుచున్నది. ఆమెపాలిటి కదియంతయు నొక మహాపాతకము. ఐన నేమిచేయఁగలదు? ఇరుగుపొరుగువారు పలుకరింపరు; పలుకరించినను మంచిచెడ్డలు కనుగొన బోరు.

తుద కామె ప్రసవించెను, ఆ బిడ్డకు జబ్బు. మందునకు రాగికాని లేదు. వైద్యుఁడేదో చీటి వ్రాసి యీయఁగ నీమె మందులకొట్టునకుఁబోయి యా మందిమ్మన్నది. డబ్బులేనిదే మం దెట్లువచ్చు నన్నాఁడు కొట్టువాఁడు. ఆమె గత్యంతరములేక తిరిగి పోయినది.

అక్కడనే యున్న 'యబ్రాహ్మణుఁ డొకఁ డిది యంతయుఁ జూచెను; వినెను. ఆతఁడు నాయఁడు. ఆతనికి బ్రాహ్మణ్యముమీఁదనే కోపము. అనఁగా వ్యక్తులపైఁ గాదు. ఆ కులముపై. ఒక బ్రాహ్మణినైన వశపఱచుకొనుట యాతని జీవితలక్ష్యము'

క్రోధము కామ మగుట యట్టివారికెల్ల నొక సాంక్రామికజాడ్యము. బ్రాహ్మణుల పురాకృతపాపఫల మది యని చలముగారి వ్యాఖ్య. నాయుడు నాసురసంధ్యవేళ పోయి యా మం దిచ్చి యామెను గోరును.

'నేనా'!యనివినయఅపును గాని, యాశ్చర్యమును గాని, యా భయమును సందే హమును గాని యేదేవుడైన నాలించెనా? లోకమునకు చెవు లున్నవా? ఆ రోదన వినఁబడునా? నేలమీద బడియున్న బిడ్డవైపుఁ జూచుచు 'నేనా'! యనిన యా దిక్కుమాలిన తల్లి మొఱ యెవరికి బట్టినది?

ఒక్క నిమేషమే యోజించెను. ఏదో మనోభావము దేవునివేషములో ప్రత్య క్షముకాఁగా, నింతలో నీ రాక్షసు డు. తనయిల్లు, కాఁపురము, దేహము, నభిమా నము, పసిపిల్ల, తనశుచిత్వము నన్నియుఁగలలు; మాయ; మనఃపటముమీఁద జలించు నింద్రజాలము లనిపించినవి. తాను దనబాధయే వాస్తవములు. నిన్నటిరాత్రిపురు షుఁడు భర్త. ఈరాత్రిపురుషుఁడు వీఁ డెవఁడో! కాని భర్తకంటె ధూర్తుడు గాకపోవ చ్చును; సత్యవంతుఁడును గావచ్చును. ఏమైన నేమి? ఏమిజరిగిన నేమి? ఆమె యాలో చనా లోకములను సందేహకాలమునుగూడ నతిక్రమించినది. ప్రాణములకంటె ముందుగ నాత్మ, కన్నులనుండియే గడపదాఁటి యూర్ధ్వలోకముల దృష్టినిలిపెను. ఇఁక నా దేహ మును గాల్చిననేమి? ఆ కట్టె ననుభవించిననేమి? ఆమె జ్ఞానశూన్యత్వమును మౌనాంగీ కారముగ గ్రహించినది నాయనికిఁ.

సుందరమ్మ రక్తములోఁగలిసి జీవించిన బ్రాహ్మణాత్మలును, జపములు, తప ములు, శ్రోత్రియత్వము, యజ్ఞములు, నాధ్యాత్మికసంపదయు నాధిక్యగర్వమును, శూద్రునిగుమ్మమున కవతల నిలబెట్టిన, జ్ఞానమున కవతల నిలబెట్టిన, శాస్త్రముల కవ తల నిలఁబెట్టినయధికారమును"అయ్యో!అయ్యో!యని యొక్కటే యాక్రోశమని" శ్రీ చలముగారి టీక. బ్రాహ్మణులనుండి యన్యాయము, నవమానము, తృణీకారము నోపి కతో యుగములుగ భరించిన శూద్రులయంధకారము, మౌఢ్యము, శూద్రాత్మలక్రౌ ర్యము, సేవలో దాస్యములో గ్రుంగి త్రోవతెలియక పెనఁగులాడుచున్న వారివేదన, నిరాశ, బ్రాహ్మణులచేతులలో జిక్కిమానప్రాణములఁ గోల్పోయిన శూద్రవనితల యవ మానాగ్ని, యన్నియుఁగలిసి నాయనిరక్తములో దాండవమాడుచుఁ దృప్తినొంది యనంతకాలములో నిద్రకై పరుగులెత్తుచున్నవని శ్రీచలముగారి భాష్యము.

సగ మీలోకము నిప్పటికే దాఁటిన సుందరమ్మ కడప్రాణములు తమ శరీరమునకు జరిగిన యీ తీవ్రన్యూనతాపరిహారార్థము తుదిప్రయత్నముచేసినవి. అంతటి రాక్షస ప్రయత్నములోను జలింపక గడ్డకట్టిన సుందరమ్మరక్తము పెనుఘోషతో మేలు కొన్నది. హృదయద్వారములయందు సముద్రపువరదవలె వచ్చి ప్రవేశించెను. చెంపలు తళతళమన్నవి. కన్ను లగ్నివలె మెఱసినవి. వక్షము దీర్ఘోచ్ఛ్వాసముతో నిండిపోయి

పది. నడుము, కంఠము మహోశివితో బై(కి లేచినవి. ఈ లోక(పు సంకుచితవాసనలను, శరీర(పు స్వల్పబంధనములను త్రెంచుకొనిన యామెయాత్మ,యతిక్రమించి పూర్వలోకములయందు జ్వలించు మహాశక్తులతో, బ్రాహ్మణతేజస్సుతో నా నిమేషమున సంబంధముకల్పించుకొన్నది.

ఆ దివ్యవిగ్రహామునం దా మహాసౌందర్యమునం దొక నిమేషముక్రింద నిర్జీవమైపడియున్న యా కళేబరమున నొక నూతనవిద్యుచ్ఛక్తిని జూచి విభ్రాంతు(డై వెనుకకు నాలుగడుగులువేసెను, రామయ్యనాయ(డు. ఏమిజరుగ(బోవుచున్నది? చంపివేయునా? మీ(దికి( దూ(కి చీల్చివేయునా? ఏమిటి యా చూపు? ఏమి యా శబ్దములోని చలనము? ఆమె యెవరు?సాధారణమానవియేనా? లేక - రాక్షసి, దయ్యము, మహామారి, మహిషాసురమర్దని, శక్తి, కాళికయునా?

అత( డింకొక కాలు వెనుకకు వేసినా(డు; ఆమె కన్నులనుండిజ్వలించు వెలు(గును భరింపలేక భగ్గుమని మండిపోయినా(డు; నిలువున( గాలిపోయినా(డు; భస్మపటలమైనా(డు; వెనుకనుండి వెలి(గెడిదీప మూతనిగ్రేలాడుపంచె కంటుకొన్నదా? కాళ్ళ నడుమనుండి యూర్ధ్వశరీరమున కెగసిన మంటలా యవి? ఏమయినదో!ఏమి జరిగినదో! సుందరమ్మ నిట్టనిలువున( బిల్లమీ(ద( బడినది.బై(ట గాయములేదు; లోపల విషములేదు.

బ్రాహ్మణుల కడపటిమాహాత్మ్యము: 'బ్రాహ్మణీకం'. ఈ యుగమునకు బ్రాహ్మణీకము సుందరమ్మతో నంతమైనది. 'వివాహం', 'బ్రాహ్మణీకం', 'జీవితాదర్శం',[1] వంటివాని నామకరణములలో జాల సాభిప్రాయవిశేషమున్నట్లు( దో(చును. 'బ్రాహ్మణీకం'చదివి కొంద ఱింకను చలముగారికి బ్రాహ్మణాభిమానము చావలేదనిరి. కొంద ఱాత(డు బ్రాహ్మణీకమును సమాధిస్థాపనముచేసినా( డనిరి.) ఎవరి యూహ నిజము? ముం దీనవలయందలి పరమార్థ మిదియేనా?పురుషపిశాచములవలన దేవతాంగనలవంటివారు బలియగుట యీ నవలవలన నూహ్యముగదా! ప్రేమయు వాత్సల్యమును లేక సాధారణముగ స్త్రీజాతి మనలేదు. వనిత పురుషునివాంఛల కాధారము. ఈ నవల యాద్యంతము లద్భుతములు. అందును నుపసంహారము హృదయవిదారకము. కాని యా కాఠిన్యము, యా భీకరత్వము, సుందరమ్మకు సమయమునకు రాలేదేమి? చీఱు చీమ కపకారముచేయలేని భూతదయయన(గా, నిదియా? ఎంత పేదరాలైన నంత విషమించువఱ కా తాటస్థ్యమేమి?ఇంతకు నిట్టివా రెందఱు స్త్రీ లుందురు? "ఎందఱుస్త్రీలు, పతివ్రతలు, సుశీలలుననిరో!సుందరమ్మవలె, 'నేనా'!యని తమ మానధనము నాశించిన పురుషులతో"-నని శ్రీ చలముగారి సానుభూతి. కాని యట్టి సుశీలలు పతివ్రతలు, నెల్లరు వారికే యగపడుట యొక వైచిత్రి.

---

1. క్రీ. శ 1948నా(టినవల; చలముగారిది.

## అరుణ[1]

ఇది శ్రీ చలముగారి యేడవనవల; 'పురూరవ'కు[2] టీక; యధర్మశృంగారము నకు నిరాశాప్రేరితవైరాగ్యమునకును బన్పుశము. రెండు దినములలో జరిగిన సంఘట నలను జిత్రించునవల యిది. ప్రేమకుఁ గామమునకును నడుమ మూఁగులాడెడి పాత్ర లిందు రమారమి పది యున్నవి. అరుణ యందలి నాయికపేరు. చలముగారి నాయిక లందఱు నొకేతీరుగ నుందురనుట విహంగావలోకనము. వారిలో మఱల భేదముల వర యుట సూక్ష్మదృష్టి. శశిరేఖ యరుణ వంటివారు విభిన్నవ్యక్తులు.

అరుణ దేనిపై మనస్సునిలుపునో యదియే యామెకు లోకము. కడమలోక మామెకు నష్టప్రాయ మనవచ్చును. తన్నుగూర్చి యామె పట్టించుకొనదని తక్కిన లోకము బావురుమనుఁగాక!

ఒకవ్యక్తిని ప్రేమించుచు[3] క్షణములో నతనిని మఱచిపోయి తనపనిఁదాఁజూచు కొనుస్త్రీ యెవ్వరేని యున్నచో నామె యరుణ యనఁదగును. ఇది యరుణయం దలి వైశిష్ట్యము[4].

ఇచ్చట స్త్రీపురుషుల ప్రణయతత్త్వములను రచయిత నిర్వచించిరి; వారి భాష్య కారులు వ్యాఖ్యానించిరి; అది సాధారణ లోకధర్మమునకు విరుద్ధము. పురుషుఁడు భార్యనే కాదు; పరస్త్రీనిగూడఁ దన దానినిగఁ జేసికొనఁజూచునఁట! అటుల నమకొన్న నేగాని యాతనికిఁ దృప్తియుండదఁట! స్త్రీప్రకృతి తద్విరుద్ధము; ఒక పురుషునితోడనే యుండుట యామె కలవిగాని పని. ఆమె హృదయమార్దవము, సౌకుమార్యము నట్టి వఁట! స్త్రీపురుషస్వభావము లిందు విపరీతవ్యాఖ్యావిషమూర్ఛితములు. పరపురుషవాం ఛను మనసుమెత్తఁదన మనుట, దుర్వ్యాఖ్యగదా! ఇంతకు నరుణ వివాహమాడిన భర్తతో సుఖముగ నుండలేకపోవుట మనోమార్దవమనియు, హృదయసౌకుమార్య మనియు నవలాకారుని వాదము.

---

1. క్రీ. శ. 1935నాఁటిరచన యని దేశీప్రెస్‌వారి పునర్ముద్రణము [1955]నందుఁ గలదు. ఇది 1939నాఁటి ప్రచురణమని 'చలం' అను గ్రంథము. [పుటలు 558, 560] [నవంబరు1958ముద్రణము].  2. క్రీ. శ. 1947నాఁటినాటకము; చలముగారిది.

3. "ప్రేమించుచున్నా నమకొనుచు"నని విమర్శకు లన్నను దప్పురాదు.

4. ఈ నవల నొక గొప్పకళాఖండమని శ్రీ కొంతి కృష్ణమూర్తిగారు [చూడుఁడు 'కథలురాయడమెట్లా' పుట61, 1955].

అరుణ యొకవంక నొకవిద్యార్థిని ప్రేమించును; మఱియొకవంక పీటరును; వేఱొకదెస 'నమీరుద్దీనును'1. నేను బార్యమైతిని? ఇఁక ముం దేమగుదును? అని యాలోచింపరా దనుట యరుణతత్త్వము. ఆమె చేఁజిక్కినదాని ననుభవింపు మనును; నిన్న యనునది లేదు; రే పనునది యేమో! ఆమెది భూతభవిష్యములకంటె వర్తమానము స్థూలము, ప్రత్యక్షమునని 'ఉమర్ ఖయామ్' స్వభావము 2.

చక్కనయ్యా చిక్కినప్పటికి నందమే యని లోకోక్తి. కొందఱిలో నవస్థాభేద మగపడదు. అరుణ యట్టిది. ఎప్పుడు నాకర్షముగనే యుండఁగలదు. ఒకొక్కక్క స్త్రీ రతీదేవినుండి యొక వరముపొంది పుట్టును. కాని యరుణకు మాత్ర మట్టివి పది వరములు.

ఆమెభర్త జయరావు. ఇంటఁ బ్రియులనడుమనుండఁగా నాతఁ డామె నింటికి రమ్మనును; తా నేమి లోపముచేసినాఁడో చెప్పు మనును. ఇచ్చట రచయిత భర్త్రృలోకముపై విఱచుకొనిపడినాఁడు. ఆ లోపముమాటయే యీ కాలములో నెంతో మంది స్త్రీలను, మిక్కిలి యమాయకలను, దీనురాండ్రైన యనాథలను, బంచాయతులలో, గృహములలో, న్యాయస్థానములలో వీథులలో, బదిమందిలో - నడుగుచున్నారఁట! అది స్త్రీ నలుగురిముందుఁ జెప్పుకొనలేనిలోపము; ఆమెకే తెలియనిలోపము; చెప్పినను లోపమని లోక మొప్పుకొనని లోపమునఁట!ఎంత కామశాస్త్ర సాంఘికశాస్త్రాదుల పాండిత్యము నిచ్చట గుప్పించెనో గదా, రచయిత!

ఈ క్రొత్త కాలములో క్రొత్తయూహాలలో క్రొత్తపిలుపులలో, క్రొత్తవాతావరణములో నలుదిక్కులయందుఁ క్రొత్తయాశలుపెట్టి యాత్మనే యశాంతిపఱుపఁగల క్రొత్తకాంతులలో స్త్రీని ప్రాఁతగూండ్లయందుఁ దుక్కుపురాణనీతులయందు నవజీవితముతో నెట్టిసంబంధములేక పుచ్చిపోయిన నీతి నిబంధనలయందు దుర్భరమైన గృహములయందుఁ గన్నులుమూసి బంధింపవలెనని యింకను బూచుమూర్ఖపులోపమే యది యని రచయిత యావేశపడును. స్త్రీలను జిగురింపఁజేయు వసంతోత్సవము లోకకళ్యాణప్రదముగ జరుగుచునుండఁగా దలుపులుబిగించి స్త్రీని 'నా మొగముచూడుము! నా బొట్టుచూడుమని' పలుకుచు నామె కెదురుగ నిలచియుండెడి లోపమేయది యని చలముగారి విమర్శన. స్త్రీ లా లోపము నెట్లుఁ జెప్పుకొందురని పాప మాయన సానుభూతి.'భర్త'యను పదనుముందు ధర్మములు, సమస్తమగు నిష్టానిష్టములు, హృదయములు, స్వేచ్ఛాస్వాతంత్ర్యములు, ప్రేమలు, పాపములు—సర్వము దాసోహమ్మని తల యొగ్గి తప్పుకొనవలసినదే యని నవలాకారుని విమర్శనకశాఘాతము.

---

1. రచయిత యితనిని 'Wild beat' అని వ్యవహరించినాఁడు. 2. Epicurian philosophy.

స్వేచ్ఛ, స్వేచ్ఛయని యందుమేగాని మనలను బంధించి నిలఁబెట్టు నీ దేశము, సంఘము. కట్టుబాటులు, మర్యాదలు, ప్రకృతిభౌతికసాంఘికాదిసిద్ధాంతములును పరిగఁ బనిచేయుచున్నంతవఱకే మన స్వేచ్ఛావాదములు. ప్రణయములును. శరీరము తన ధర్మమును నిర్వర్తించుచున్నంతసేపే యసత్యములు, శరీరఁపు నిబంధనల కెదురుతిరుగుట, గంతులు వని నవలారచయిత బోధించును. స్త్రీ కెంత నరకముగ నున్నను సంసారమే స్వర్గమనియు నెంత యముఁడైనను భర్తకంటె మిత్రుఁడులేఁడనియు మనచే ననిపించునది భీరుత్వమా? విజ్ఞానమా?యని చలముగారి ప్రశ్న.

చూచువారికి వీ రెంతప్రేమతో నుండిరో యనిపించునటుల నరుణ చివర కాప్యాయముగ భర్తతో, వెళ్ళిపోయినది. కాని పాపము వారికిఁ బొగబండి యందలేదు. వారు తిరిగివచ్చిరి. ఒకప్రియుఁడు మఱలఁ బ్రేమకలాపములు సాగించెను. అబద్ధముల యింద్రజాలములో, శృంగారఁపు మాయవలయములో దిరదిరదిరుగుచుఁ దేలిపోవునరుణ మాటాడినది. ప్రియుఁ డటులఁ జూడ రాదఁట!తన యీ జీవితమునకు మాయ యబద్ధము వనియుఁ దెగిపోయినవి. వాస్తవమును సత్యమును గ్రహించుట కెంతసేపు? బుద్ధుఁడన్నిదినములు శ్రమపడినను జివరిలో జ్ఞానోదయముకలుగుటకు రెండు నిమేషములే గదా!పట్టెను? విరక్తికలుగుటకు రమణమహర్షి కెంత కాలముపట్టినది? మఱల నరుణ యుపన్యసించును. తా నిందఱఁ బ్రేమించుట యెందులకో చెప్పుకొన్నది. మగసిరికల వాఁడు, ధీరుఁడు, బలశాలి తనకొఱకై యటులబాధనొందుచుఁ బ్రాధేయపడుచో నామె భరింపలేదఁట!మఱల మగవారిని జూచినచో నామె కసహ్యాము. కాని తన పాడు శరీరము నేదో గొప్పవారినుండిదాఁచుకొన్నచో నామెకుఁ దనపైననే మఱింత యసహ్యాము.

పొందిపొసఁగని యిట్టి భావములతో సదమదమగు నరుణ తుదకు భర్తను బ్రియులను విడిచి యెక్కడికో వెడలిపోవును.

జీవితములో దన దేహమునకుఁ దన శృంగారభావములకు నెట్లు స్వర్గము ద్వారములు తెఱచినదో యట్లే తన యాత్మకుఁ దన యాధ్యాత్మికసందేహములకు నెప్పుడో యే యాశ్రమమునుండియో కైలాసము ద్వారములుదెఱచునని యీ నవలలో నొక పాత్ర యభిభాషణము. ఆ యన్నది యరుణభర్తయో, నవలాకర్తయో చెప్పలేము.

అరుణ చలముగారికిఁ బ్రియము; అరుణాచల మంతకంటెఁ బ్రియమైనది. 'అరుణ' రచించుటవలన శ్రీచలముగా రరుణాచల మంతటిపవిత్రు లైనారని యమాయిక యౌవన మూహించును.

చలముగారి నవలలలో పరిపడని కొన్నియంశములవలన నేర్పడిన యస్పష్టతను గుఱించి యింతకుఁ బూర్వ మీ ప్రకరణమునవే చెప్పఁబడినది. 'అరుణ'యందుకూడ

సమన్వయముగాని సమస్యలను వానివలన నేర్పడిన యస్పుటతనుగూర్చి యించుక విమర్శించుట ప్రకరణౌచితికి భంజకముకాదు1.

శరీర మొక్కటియే ప్రేమసాధన మనియు నెవరికో యొకరికిఁ దృష్ణ తీర్చుటయే స్త్రీశరీరధర్మమనియు నిజముగనో హేళనగనో 'యరుణ' యొకచోట2 యుపదేశించును. ఇట్లుపన్యసించిన యరుణ వెనుక నింకొకసందర్భములో3 తన వెంటఁబడినవారిని గుక్కలు పందులునని తిట్టును. ఇందలి సామంజస్యము పరిశీలింపఁ దగినది.

అతఁడు వెంటఁబడుట తన కిష్టములేనిచో నతనిని నిరుత్సాహపఱపవలెనుగదా! దానికిబదు లాతని నవ్వునకు సమాధానముగఁ దిరిగి నవ్వుటయం దర్థముగాని లోకజ్ఞానముగాని యేమున్నది? స్త్రీపురుషులు నిరభ్యంతరముగ నొకరిసాంగత్య మొకరు పొందుటకై యెట్టి సాంఘికమర్యాదలను, నియమములను పాటింపనక్కఱలేదని చెప్పునప్పుడు కొంతవఱకైన నొకరివెంట నొకరుపడనిచో నొకరి కొకరిపై నిష్టమున్నదియు లేనిదియు నెట్లుఁ దెలియును? ఇష్టములేనట్లుఁ దెల్లముచేసినను వెంటఁబడినపు డసహ్యించుకొనట యుచితము. కాని తన కిష్టమున్నదనియే పురుషుఁడు వెంటఁబడినపుడు తద్భిన్న భావమున్నచో దాని నామె వెల్లడించుట ధర్మము, బాధ్యతయుఁగదా! ఆమె కిష్టముండినయెడల నతఁడు ప్రేమారాధకుఁడును లేనిచో గుక్కయుఁ బందియు నగునా?

పురుషప్రేమనుగూర్చి చెప్పుచు నింకొకరిని గోరుట యింకొకరి 'నుపయోగించుకొనుట' యని చలముగారు నిర్వచించిరి4. ఇట్లుఁ జెప్పిచెప్పి మఱచిపోయి మఱల మగవాఁ డూఱుకొన్నను నాఁడుది యూఱుకొనదని యింకొకచో ననిరి5.

---

1. చూడుఁడు :— 'చలముగారి యిటీవలిరచనలు, వాటితత్త్వం' (ఆంధ్రవారపత్రిక 3–?–1943). 'మైదానం, అరుణవాటితత్వం' (శ్రీ దిగుమర్తి రామారావు–స్వతంత్రపత్రిక–పుట 17–మార్చి 7, 1959) పై వారపత్రిక వ్యాసపునర్ముద్రణమే స్వతంత్రది. అట్లే. చూడుఁడు ;— 'సాహిత్యసమాలోచన' (చలం) పుట17, హసజ–తెలుగుస్వతంత్ర, (31–1–1959).
2. "శరీరం ఒక్కటే ప్రేమసాధనం. ఏ పీచుఁ డైతేనేం? భర్త అయితేనేం? బ్రాహ్మఁ డైతేనేం? ఆ మహమ్మదీయు డైతేనేం? ఏదో కాలక్షేపానికి; ఎవరికో ఒకరికి తృష్ణతీర్చడం" (అరుణ'–పుట83–పంక్తులు9–11)(1955).
3 నన్ను చూసి చిరునవ్వు నవ్వితే నేనూ నవ్వాను. అంతే వెంటపడ్డాడు. ఈ మొగాళ్ళు... కుక్కలు." (అరుణ–పుట1. పంక్తులు22–23). (1955).
4. "ఏం అవసరమైతేనేం? శారీరకం, మానసికం, హృదయికం, ఏమి టాభేదం? ఏ అవసరమైతేనేం యింకొకర్ని కోరడమేగా ప్రేమ; ఇంకొకర్ని ఉపయోగించుకోవడమేగా ప్రేమ; (అరుణ, పుట13, పంక్తులు3–5). (1955).
5. "మొగవాడు వూరుకున్నా ఆడది వూరుకోదు, ఏసంగతినైనా మంచాలఅసహ్యాపు Levelకి లాగిందాకా". (అరుణ, పుట11, పంక్తులు22, 23). (1955).

ఇంకొకరిని గోరుటయే యింకొకరి నుపయోగించుకొనుటయే యని ముందుఁ బ్రేమను నిర్వచించినవా రెవ్వరుగాని లేరు. చలముగారే యాద్యులు. కావున నెవ్వరినో హేళనచేయుటకై చేసినదికాదీ నిర్వచనము. వీరివలననే యిది యువకుల భావలో నేఁడు వ్యాపించెను. లోకములోనివారి యెల్లరి ప్రేమను హేళనచేయుట యందుమా? యదియుఁ బొసఁగదు. ప్రణయధర్మ మెఱిఁగినవారు కొంద అయిన నున్నారు. ఒకరి నొకరు వాడుకొనుట, యుపయోగించుకొనుట యను నిర్వచనములను వైఁగా నసహ్యించుకొనువారు పెక్కండ్రు. కావుననెవ్వరినో వెక్కిరించుట కేర్పఱచిన లక్షణము కాదిది. ప్రేమ యనఁగా నదే చలముగారి యభిప్రాయమే. ప్రేమనిర్వచనమే యది యైనపుడు, స్త్రీ యేసంగతినిగాని తక్కువస్థాయిలోనికి దించునని వా రసహ్యించుకొనఁదగిన దేమున్నది?

అరుణమీఁది యాకర్షణఫలితముగఁ బ్రియుఁడు రాత్రులు నరములబాధపడలేక యామెను చంపుదమా? పరాభవింతమా? యని ప్రశ్నించునట్లు నవలలో వర్ణితము. అట్టిచో బురుషులు కుక్కలవలెఁ బ్రవర్తింతురని కలదు1. నిగ్రహములేక వ్యామోహమునకు లోనగుచో బ్రమాదములుకలుగఁగలవని యీ నవల చెప్పకయే చెప్పుచున్నది. పూర్వ మీవిషయమునే గ్రహించినపెద్దలు సంఘములో గొన్ని నియమములను, మర్యాదలను నేర్పఱచి యుండవచ్చును. వ్యామోహమును నిగ్రహించుకొననిదే ప్రమాదములు కలుగును గాన నీతినియమములను సంఘశ్రేయోభిలాషులు నిర్మించుట యెల్లదేశముల యందును గలదు. ఈ నియమములను మర్యాదలను గాలానుగుణ్యమైన యావశ్యకతలనుబట్టి వివేకముతో మార్చుకొనవచ్చునుగాని వానిని బాటింపనే యక్కఱలేదనుట చలముగారు తాను ముందుఁ జెప్పిన దానికి వెనుక వ్యతిరేకముగ సిద్ధాంతీకరించుటకాదా?

తన్ను బురుషుఁడు కాంక్షింపవలెనని స్త్రీ కోరుట కొంటెతనము నీర్ష్యయు నని యొకచో చలముగారు తేల్చిరి2. కావునఁ గేవలము లోకములో బురుషుఁడు స్త్రీని వెన్నాడి హింసించు చున్నాఁడను చలముగారివాద మసాస్త్రము. స్త్రీలును సాధారణపురాండ్రుగారని వీ రనేకప్రకరణములలో నిరూపించిరి. కావున మన నవలాకర్తకు స్త్రీపురుషపాత్ర లిట్టివే లభించుననుట తప్పుగాదు.

---

1. పండితులే స్త్రీవ్యామోహంలోపడి కాలుజారేటప్పటికి కళ్ళు కనబడక గొలుసువిప్పేవాటి చెయ్యి కరిచేకుక్కల్లాగు ప్రవర్తిస్తారు". (అరుణ, పుట 12-పంక్తులు 8,9).(1955).

2. ఎందు కనుకున్నావు ? నేను కోరుకున్నాను, నువ్వు నన్ను కాంక్షించాలని. ఎందుకా ? కొంటెతనము ; ఈ మొగాడు యెందుకు అంతసుఖంగా (నన్ను)నిర్లక్ష్యం చెయ్యాలి ? అని ఉడుకుమోతుతనం", (అరుణ-పుట76-పంక్తులు7-9).(1955).

తన యాకర్షణమునుండి తప్పించుకొనుటకుఁ బ్రయత్నించు నుత్తముని వశ పఱచుకొనుటయే స్త్రీప్రధానప్రవృత్తి యని నవలాకర్త యొక యుద్దేశము నిచ్చట నిహాళః సూచింపఁ దలపెట్టినటులున్నారు. ఇట్టి యుద్దేశములయందలి యౌన్నత్య మేమియో యూహింపఁజాలము. బెర్నార్డ్‌షా పండితునివంటివారుకొందఱు స్త్రీ నీ విధముగఁ జిత్రించినమాట నిజమే!కాని మన నవలలో నీ ప్రకరణమున నీర్ష్యకంటెఁ గూడ వాకర్షణప్రియత్వమే[1] యధికముగ ద్యోతక మగుచున్నది. అంతులేని తన యాకర్షణప్రియత్వమును సంతుష్టినొందించుకొనుటకై యరుణ తన యాకర్షణమునకు జానిపలై యీర్ష్యచంపుకొనలేక కుమిలిపోవుచున్న యారాధకులను సంతతసామీప్య ములో నుంచుకొనుటకై చేసిన ప్రయత్నమేకదా యీ నవలలోని ప్రధానకథ. అందఱుఁ గలసియున్నరాత్రి యారాధకులకుఁగాని యామెకుఁగాని సంతృప్తికరముగలేనట్లే నవ లలో వర్ణింపఁబడెను.

స్త్రీ యటు కొంటెతనముచూపుటవలనఁగాని యిటు పదిమంది ప్రియులతో గూడి రాత్రులు గడపుటవలనఁగాని పొందు ననుభూతి యెట్టిదో యనూహ్యము; నస్ప ష్టము. అట్లే తదనుభూతిమహనీయతగాని తద్రచనాదర్శముగాని తత్కల్పనారామ ణీయకముగాని సువ్యక్తము గాదు. తుదకు జీవితములో నోటమి నొందినట్లే యరుణను రచయిత చిత్రించినారు. ఆమె యోటమికి సంఘముదే బాధ్యత యనుటకు వీలులేదు. భర్తను జూచి భయపడుట యామె కనావశ్యకము. వయోవంతురాలు నేఁడు పురుషుని యాశ్రయమునుగాని మనోవర్తినిగాని కోరనిచో స్వతంత్రురాలుగ జీవింపవచ్చును. అరుణ యంతకుఁ బూర్వము 'నర్స్'పని చేసినట్లుఁగూడ రచయిత చెప్పిరి. పురుషుని యొక్క యాశ్రయముమగాని యధీనమగుటనుగాని కోరని వయోవంతురాండ్ర నాశ్ర యము గోరుమని బాధించుపద్ధతి మనయం దాచరణములో లేదు. ఎందువలన నరుణ మాయ మయ్యెను? ఆమె యొక యాశయము నేదైన సూచించునా? లేక జాగ్రత్త సుమీ యని సంఘమును బ్రబోధించుచున్నదా? ఇట్టి వెన్నో సంశయములు పొడమును. ఏమనుకొనుటకు వీలులేని విషమస్థితి నవలలోని విషయములనుబట్టి యేర్పడుచున్నది. ఇది యంతయు నస్పష్టతాదోషము వలనిఫలము.

కామసంబంధమగు వాంఛలు నావశ్యకములు నందఱకొకే తీరుగ నుండవు. మనోద్రఢిమయు సంయమనమును గూడ నెల్లరకొకే రీతిగ నుండవనుట నిజము. నీతినిగుఱించియు, నైతికమూల్యములఁగూర్చియుఁ గొంతవఱకు భిన్నాభిప్రాయము లుండవచ్చును. రాజేశ్వరి, అరుణ మున్నగు చలముగారిపాత్రలయందుఁ బ్రత్యేకమగు నుదాత్తతగాని రామణీయకముగాని లేదు. అయినను నట్టి పాత్రలను సానుభూతితో నాకళించుటకొనుట యుచితమనినఁగూడ నంగీకరింపఁగలము. అదియే నవలాకారుని

1. Vanity.

యభిప్రాయమును గావచ్చును. కాని యీ రచనావిధానము సానుభూతిసంపాదనము నకు సాధకముగ లేదని చెప్పకతప్పదు.

తమ రచనలను విమర్శించువారే తలుపులుమూసికొని రహస్యముగ వానిని జదివి సంతసింతు రని చలముగారు విమర్శకులనుగూర్చి పెక్కుమాటలు వ్రాసిరి. అది సత్యమేయైనను వారి రచనల యుత్కృష్టతోదాత్తతలను సూచింపదు; చదువరుల యాల్పాభిరుచి కావచ్చును. క్షణికచాపల్యమువలననో, తాత్కాలికకుతూహలదౌర్బ ల్యమువలననో నగ్నచిత్రములను రహస్యముగఁ జూచుటవంటిదే తమ నవలలను జదువు టయు నని తన్మూలమున వీ రంగీకరించు చున్నారు. తమ రపేక్షించినట్లుగ నగ్నచిత్ర ముల విలువయే దేశమున వీరి రచనలకు లభించుచున్నది. చదువరులలోను విమర్శకుల లోను గొందఱకు సాధారణమైన నీరసాభిరుచు లున్నంతమాత్రమున రచయితగారి కృతు లుత్తమాదర్శప్రతిపాదకములని నిరూపింపఁబడునా? వానిని జదువనివారు మహానుభవమును మహదనుభవమును గోల్పోయి రనఁగలమా?

నగుబాటు చేటుకాదా ?

పతితలలోఁగల సౌందర్యాదిద్యుతికి సంతుష్టిఁగలిగించుచు, మహోత్తభావముల తోడ ను నుదారాశయములతోడను దన్మయతఁగొలుపుచు రసచర్వణముమూలమున మనో బుద్ధులను హృదయమును చిత్తమును వికసింపఁజేయఁజాలుటయే యుత్తమసాహిత్య కళాలక్షణము. శ్రీ చలముగారి రచన లిట్టి మనోబుద్ధివికాసములకు కంటె వికారమునకే దోడ్పడు చున్నవి. అట్లు మనోవికృతిచేయుటయే భూరిగుణమని దేశము, వారికి బ్రహ్మరథముపట్టినది. అనుభవజ్ఞానము, విచక్షణసామర్థ్యమును లేని యువకులు జీవితపథ ముల నింకను నన్వేషించుకొనువయసునందే వీరి రచనావాగురలోఁబడి జీవితపరమార్థ మునుగూర్చి పొరబడుట కవకాశము లున్నవి. చేటయంతమబ్బుపట్టినను ముసురను కొను నమాయికులవలె, నింత దుమారము రేఁగినను వివర్తనము విప్లవమునను కొను నేఁటి మనయువకులు సభ్యతయుఁగూడవీడి రచనలు సాగించు చున్నారు.

సావిత్రీసీతారుంధతీప్రభృతిపతివ్రతలు వేనవేల సంవత్సరములనుండి మనదేశప్రజా బాహుళ్యమునేగాక మేధావంతులైన విదేశీయపండితులనుగూడ నద్భుతపఱచు చున్నారు. బహుసంఖ్యాకములైన యిట్టి యుత్తమస్త్రీపాత్రల యుదాత్తతతోఁగాని, రామణీయకముతోఁగాని తుల్యయోగితగల పాత్రనొక్కదానినైన శ్రీ చలముగారు సృష్టింపలేదు. ఇఁక వారి యనుయాయివర్గముమాట వేఱె చెప్పనేల?

ఘనీభవించిన యంధాచారవ్యవహారములలోని మూఢతను మాలిన్యమును జూప వచ్చును. కాని సంఘ మే సంస్థలను పౌరాణికమహావ్యక్తులను బవిత్రభావముతో నారా ధించునో యట్టివానికిఁగాని వారికిఁగాని నిష్కారణముగ న్యూనత నాపాదించుట తమ

యల్పాభిరుచినే వెల్లడించునని మనవా రూహింపరు. తమ యశక్తత, యవ్యక్తత, వైరస్యము, నీరసత్వమును వారు గ్రహించుటలేదు. వీనినే పరమప్రమాణములనుకొని వీరు సంఘమునకు సందేశమునీయఁబోవుట నగుఁబాటుచేటుగాదా? ఈ దృశములైన రచనలు మన సాహిత్యములో జిగురించుచున్న యభ్యున్నతినికంటె సంక్రమించుచున్న ప్రమాణముల పతనమునే సూచించుచున్నవి. జర్మనుమహాకవి గెథే చెప్పినటులఁ గవి ముం దారోగ్యవంతుఁడు గావలెను. రచన సాగించుట కాతనికిఁ గావలసినంత వ్యవధి యున్నది[1]. శ్రీ చలముగారి కరుణాచలము పరిపూర్ణారోగ్యమునొసఁగి మనజాతికి మహోదారసాహిత్యమును బ్రసాదించుఁగాక!

## ఆత్మబలి [2]

స్వర్గీయ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యుత్తమనవల యిది. నవలారచనమునఁ దొలుతొలుత వీరు శ్రీ వేంకటపార్వతీశ్వరకవుల కేకలవ్యశిష్యులు. వలన వారి బంకించంద్రుని యనువాదములే వీరి నవలారచనకుఁ బ్రోత్సహించినవి. ఇందుచే వీరికి బంకించంద్రుఁ డాదర్శము; వీరేశలింగము, చిలకమర్తిప్రభృతులు గారు. నవలాస్వరూపము తమకు వంగనవలాకర్త బంకించంద్రునిరచనలు చదివినపిమ్మటనే గోచరమైనదని వీరి యభిభాషణము[3]. అందును దుర్గేశనందిని, రాజసింహ, యను యనువాదములును, 'శ్రీ'[4]యను చాగంటి శేషయ్యగారి రచనయు వీరి నాకర్షించినవి.

మూఁడువందలయిఱువదితొమ్మిది పుటలుగల 'ఆత్మబలి'యందలికథ బహ్వాల్పమైనది. సంభాషణకౌశలమువలననే సాగింపఁబడిన నవల యిది. ఆ వ్యావహారికభాష కూడ ధారాళము, ప్రాంజలము. విధవరాలైన యొకయువతి పునర్వివాహోద్యుక్తురాలయ్యు యుద్ధమునకుఁ బోయియున్న కుమారునకుఁ దనపైఁగల ప్రేమను గుఱుతించి యాత్మసుఖమును బరిత్యజించి యా కుమారునకుఁ దగినపెండ్లిచేయుట యీ నవలలోని కథ.

కథను దెలిసికొనుటకంటెఁ దద్రచన కనుకూలించిన యాలోచనావిధానము నారయుట ముఖ్యము. ఆంధ్రపత్రికాసంపాదకులగు శ్రీ శంభుప్రసాదుగారి కొక నవల వ్రాయుదునని మాటయిచ్చి 'ట్రాము'లో వచ్చుచుండఁగా నీ నవలాకర్త యొక చిన్న

1. "Let the Poet be healthy first, there is time enough to write". [Goethe].
2. క్రీ.శ.1942నాఁటి ఆంధ్రవారపత్రికాప్రచురణము. ప్రథమావృత్తి 1951,ఏప్రియల్, షష్టిపూర్తి ప్రచురణము.
3. చూడుఁడు :— వీరి 'అనుభవాలు : జ్ఞాపకాలు'(రెండవ సంపుటము).
4. అద్వితీయప్రతిభాశాలియగు సీతారామరాయల జీవితవిశేషము లిందు వర్ణింపఁబడినవి.

సన్ని వేశమును దర్శించెనట। తాను ప్రయాణించుచున్న యా 'ట్రాము'లో నెవరో తెలి యని 'యాంగ్లో–ఇండియను' స్త్రీపురుషుల నిర్వురను శ్రీపాదవారు జూచిరి. అందు స్త్రీకి సుమారు ముప్పదియైదేండ్లుండవచ్చును; పురుషునకుఁ బదునే డుండును. ఆ యిర్వురను జూచి, యందలి యువకుఁడు సైనికుని దుస్తులలో నుండుటచే, నతనిని యుద్ధమునకుఁ బోవుచున్న కుమారునిగ, నామెను దల్లిగ భావించి యా భావనముండి కథనెల్ల నల్లు కొనినారు. కావున శ్రీపాదవారి యుపజ్ఞము 'ఆత్మబలి'.

ఇది వీరి కడగొట్టునవల; మైదవది. 'మిధునానురాగము'నుండి 'రక్షాబంధనము' వఱకుఁగల నాలుగు నవలలో భాషాసంబంధముగ వీరిదృష్టి వేఱు- ఈ 'యాత్మబలి' యందు భాషావిషయికముగ నా దృష్టిలోఁగలిగిన పరిణామము గమనింపఁదగినది. వ్యావహారికము పటిష్ఠమైనదని తమకు ధ్రువమైనపిదప శ్రీపాదవారు సంధానించిన నవలయే 'ఆత్మబలి'.

## తుఫాను[1]

తెలుఁగునవలాసారస్వతములో బాపిరాజుగారిని కేవలము నవలాకారులని యెవ్వరు ననరు. సర్వతోముఖమైనది వారి ప్రతిభ. ఆయన నవలాసాహిత్యసంభూతి యంతయు నొక కళాఖండము. భూతతః బాపిరాజుగా రొక శిల్పిఁపుముద్ద యగుటయే యిందులకు హేతువు. తమ నవలలయం దుత్తమఘట్టములలో నాయన యెన్నఁడును వచనము వ్రాసినదిలేదు. అది యంతయు మహాకవిత్వశిల్పము. వారి నవలల కా కవితా శైలి కలిగించిన సాహిత్యకగౌరవమే విశ్వనాథవారి నవలలకు జాతీయమును గలిగించి నది. కాని యది యమేయము; ఇది పరిమితము. ఒక్కొక్క నవలలోనే బాపిరాజుగారు చేయు జీవితవ్యాఖ్య బహుముఖమైనది; విశ్వనాథవారి దేకోన్ముఖము. అది యించుక జిగికి రంజకమై బిగికి భంజక మయ్యెను. ఇది యించుక బిగికి రంజకమై జిగికి భంజక మయ్యెను. ఆ మార్గములో వా రెంతయో, యీ మార్గములో వీ రంతయన్నది సారాంశము.

వెన్నెలలను, సన్నజాజులను, గులాబీలను,నమ్మృతవీచికలను నింపుకొన్నది, బాపి రాజుగారిమనస్సు. ఆ వెన్నెలవాకలతాఁకును బూఁటీయతేనెలసోనలసోఁకును నమ్మృత వీచులప్రేకయుఁ దాళలేక నవలలరూపమున నాయన తన మనస్సువెలార్చినాఁడు; హృదయమును జిదిమి నవలాసాహిత్యపుమొగ్గలను వెలిగించినాఁడట। తత్కాంతిపుం జము క్రమక్రమముగ సర్వత్ర వ్యాపించినది. ప్రధానముగ బాపిరాజుగారి భాషకు గులాబీల క్రొత్తదనము, జాజుల గుబాళింపు, శరజ్జ్యోత్స్నల ధాళధళ్యమును గలవు.

---

1. క్రీ.శ.1945.

కథారచనలో పాటవముతోపాటు మృదుత్వము, మాదకత్వము, సౌందర్యమును మిళితములై యున్నవి. కాని భావుకులైన సహృదయులను బాపిరాజుగారిశైలి యాకర్షించిన ట్లేదియు నాకర్షింపలేదు. ఈ సత్యమునకు తుఫాను లక్ష్యభూతము.

తుఫానునందు కథారంగము నాటి తెలుగుప్రాంతము; చెన్నపట్టణము. అతి గంభీరుడు నచంచలుడు నగు 'త్యాగతి' యిందు నాయకుడు. ఈ నవలకీ పేరతనిని బట్టియే యన్వర్థము. హేమకుసుమసుందరి యిందలి నాయిక; ఇరువదియవ శతాబ్దపు గన్య; స్నిగ్ధహృదయురాలు; సుకుమారి; చాలవఱకు ధీర; విద్యావతి[1]. ఈమెకు ప్రేమనుగుఱించి సుస్పష్టమైన యభిప్రాయములు లేవు. ఆ పదమునే యామె యంగీకరింపదు. 'ప్రణయము'ను పద మామెకు నచ్చును. ఇది 'ప్రళయము'ను దానికి సన్నిహిత పదమగుట కారణము. ఇట్టి పదముల నెన్నుకొనుటవలన నామె విచిత్రభావసంకీర్ణత ప్రస్ఫురిల్లుచున్నది. వివాహమునుగూర్చి కుసుమకుగల భావములు విచిత్రములు.

ఇక నామె భౌతిక శరీరవర్ణనమున బాపిరాజుగారి శిల్పకళాభిజ్ఞతకు గవితా శైలి యొడికము గూర్చెను. పాలసముద్రముపై వెన్నెల నైగనిగ్యమువంటి దామె సౌందర్యము. కృష్ణవేణిని, నీలాలను విరియబూసిన నీలమందారవృక్షమును విడంబించిన దామె తలకట్టు. శరత్కాలమునాటి పూర్ణిమాకాశము, వికసించిన తామరపూవు రేకు, లేతతునియకవటాకు నామె ఫాలభాగమునకు సరివచ్చు ననవచ్చును. వెడదలై, కోసలై, విస్ఫారితమధ్యములై శోభించినవి యా కన్నులు. ఇం కెంతయో యంగ ప్రత్యంగవర్ణన మున్నది.

ఈ శరీరసౌందర్యమున కా విద్యాసంస్కారముల యన్వయముచే వైషమ్యము కల్పించి యమాయకత్వము, నిష్కపటత్వము, నసహనత్వము, మున్నగు గుణముల నామెలో రచయిత దోహదము చేసెను. దానితో హేమకుసుమపాత్ర చిక్కులతో గూడిన సంకీర్ణపాత్ర మైనది. ఈ సంకీర్ణతవలననే యామెకు గథలో ప్రాధాన్యము. విభిన్నాను భూతులవలన గలుగు నిట్టి సంకీర్ణతయే జీవితమునకు సంపూర్ణత నిచ్చుచున్నది. కావుననే యా పాత్రలయందు మంచికిగాని, చెడునకుగాని యొక పరిపూర్ణత్వము గోచరించును. సద్విషయమున బరిపూర్ణతకు 'త్యాగతి'యు, నసద్విషయమున బరిపూర్ణతకు హేమయు నిదర్శనములు. ఇట్టివారిని సంపూర్ణప్రకృతు లనుట లెస్స.

ముందు నవలయందే గాదు; ఏ కథయందైనను స్థూలముగ బాత్రలు ద్వివిధము. అట్లుగా నిసితెలుగులకు మానవులు చిత్రింపబడుదురు. వారిని సంపూర్ణప్రకృతు లనియు, నసంపూర్ణప్రకృతు లనియు విభాగింప వచ్చును. శీలచిత్రణమే ప్రధానముగ

---

1. తెలుగులో బి.ఏ.(ఆనర్సు) ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలు.

గల కథానిర్వహణమున కెప్పుడును సంపూర్ణప్రకృతు లనఁదగు పాత్ర లొక రిరువు రుందురు. వారికే నాయికానాయకు లని గాని, సహాయనాయకాదు లని గాని, ప్రధాన పాత్ర లని గాని, మనపూర్వలాక్షణికుల వ్యవహారము. పైఁజెప్పిన శీలచిత్రణప్రధాన కథలయందు వారివి దత్తశీలములు – వారిలో బరివర్తన ముండదు. వారు కథ కధీనులు గారు. కథయే వారి గమనమున కధీనము. కథలోని పదకమునకుఁ దద్గతకార్యవేగము నకు నధీను లగుచుఁ బరివర్తనములకు లోనగు పాత్ర లసంపూర్ణప్రకృతులు. ఒక్కొక్కప్పుడు వీరు పరివర్తనము జెందక యెక్కడనో యొక యెడ సంపూర్ణత్వము నొంద వచ్చును. కథాంతమువఱకు నసంపూర్ణప్రకృతు లట్లే యుండనక్కఱలేదు. సాధారణ ముగ నిట్టివారు పార్శ్వముఖచిత్రములవంటివా రగుటచే వీరి కీ పేరువచ్చెను. పదు నేడవశతాబ్దియందుఁ బరివర్తనరహితసంపూర్ణపాత్రలకు హాస్యజనకపాత్రలనియుఁ బ్రత్యేకపాత్రలనియు, వికారచిత్రములనియుఁగూడ నాంగ్లసాహిత్యములో వ్యవహృతి. పాశ్చాత్యపండితులు చెప్పిన లక్షణానుసారముగ నేఁడు మనము వీరిని సంపూర్ణప్రకృతు లనియు[1] నసంపూర్ణప్రకృతులనియుఁ[2] బిలుచుచున్నాము. కావున శీలప్రధాననవలల యందుఁ బరివర్తనహీనపరిపూర్ణపాత్రము, నాటకీయనవలలయందుఁ బరివర్తనసహిత మైన యపరిపూర్ణపాత్రము సాధారణముగ నుండఁగలవు.

సంపూర్ణప్రకృతులుగూడఁ బరివర్తన మొందుచున్న ట్లుందురుగదా! వారి కెట్లీ పేరు సార్థకమన్న ప్రశ్నము రావచ్చును. శీలచిత్రణమే ప్రధానభూతమైన కథాప్రసంగ సందర్భమునందా యొక రిరువురి పాత్రలగమనము నొక్కొక్కప్పుడు పరిపూర్ణముగా రచయిత చిత్రించుట జరుగుచున్నది. అనఁగా భిన్నభిన్న దేశకాలపరిస్థితులలో భిన్నభిన్న వ్యక్తులతో నేర్పడు సంబంధబాంధవ్యములను సూచించునప్పుడా యా పాత్రల సమగ్రస్వభావమును రచయిత నిరూపింపవచ్చును. కాని యీ పరిపూర్ణచిత్రణమువలన, నీ సమగ్రనిరూపణమువలనను బాత్రల శీలములలో బరివర్తన మేమాత్రమును గలుగదు. ఆ యా పాత్రలనుగూర్చిన మన పరిజ్ఞానములో మాత్రమే పరివర్తనము గలుగును. మన పరిజ్ఞానవిస్తరమును బరివర్తనమును బాత్రలశీల పరివర్తనము ననుకొనుట భ్రమ. మన జ్ఞానము విస్తరిల్లినపుడుగాని యా యా పాత్రల గుణశీలములలోని వైవిధ్యము వెల్లడికాదు. కావున రచయిత మన జ్ఞానమును విస్తరిల్లఁజేయును.

ఈ రీతిగ సమస్తదృష్టికోణములనుండియు సునిశితపరిశీలనము నెఱపఁబడి కథ కావశ్యక మైనంతవఱకుఁ బోషింపఁబడినను బాత్రలు దత్తశీలములుగలిగి పరివర్తనము నొందనప్పు డపి స్వయంసంపూర్ణములు గాన సంపూర్ణప్రకృతులు. తాము పరివర్తన

---

1. Flat Characters.
2. Round Characters: vide, 'Aspects of the Novel' by E. M. Forster, P, 25 [1953] and 'The Structure of the Novel' by Edwin Muir, P. 25 [1954].

మొందకయుఁ దమ్ముగుఱించిన మనజ్ఞానమును బరివర్తన మొందించి సమగ్ర మైన ర్పుటవలననుగూడ నీ పాత్రలు సంపూర్ణప్రకృతులు. ఇట్టి పాత్రలకుఁ దోడ్పడుటకై తప్ప శీలప్రధానమగు నవలలలో గథ కొక ప్రాముఖ్యమని లేదు. పరివర్తనమున కను వగు నసంపూర్ణప్రకృతులకుఁ దోడ్పడుటకై తప్ప కథాప్రధానమగు నవలలలో శీలచిత్రణ మున కొక ప్రాముఖ్యమని లేదు.

మార్పునుసది రాక సంపూర్ణప్రకృతియైన కుసుమసుందరియొక్క గుణదోష సమన్వితమగు శీలమునుగూర్చి మనజ్ఞానము 'తుఫాను'నందు సర్వతోముఖవికాసము నొందెను. ఆమెలోని యీ పరివర్తనరాహిత్యముపేరే 'తుఫాను'. త్యాగతిజీవితము పేరే 'తుఫాను'. ఆ సంపూర్ణప్రకృతులకుఁ దోడ్పడినవే తక్కిన ప్రధానపాత్ర లన్నియు. నాయికకు మదరాసువంటి మహానగర మునికి సంపన్నగృహస్థుని యనుఁ గుఁదనయగా నామె పెంపు. ఆమెకుఁ బాశ్చాత్యవిద్యానాగరకతల వాసనయబ్బ టరుదు గాదు. స్త్రీపురుషసంబంధములనుగుఱించి తొల్లిఁటినుండియు నామెభావములు విచిత్రములు. ఆమె యతివాదధోరణిలో మన భారతీయసంస్కృతీసంప్రదాయములు కొట్టుకొనిపోయినవి[2].

పురుషులనుగూర్చి యీమెకుఁగల యభిప్రాయము పాలపై పొంగువంటిది. స్త్రీని బురుషుఁడు బానిసగాఁ జేసికొనెనని యేమేమో యీమె వగచును. స్త్రీపురు షులమధ్య భేదమునేగాని సామ్యము నామె చూడఁజాలదు. వారి సృష్టినిర్మాణరథము నకుఁ జక్రములవంటివా రనియుఁ దుల్యావిధిబాధ్యతలు వారికిఁ గలవనియు నామె చది వినచదువులు తోఁపనీయవు. సహకారదృష్టిగాని సమన్వయభావముగాని యీమెకుఁ బట్టదు. అట్టిచో నొకర్యార్థమో ప్రకృతి ననుసరించుటకో విధిబాధ్యతలను బంచుకొని స్త్రీపురుషులు నిర్వర్తించుటయందున్న యానందము, నాదర్శము నామె కెట్లు స్ఫురిం చును. స్త్రీబానిసగాఁ జేయఁబడుట కనువగుచో నా పని పురుషుఁడుగాకున్న నిం కొకరు చేయుదురనియు నది పురుషుని తప్పుగా దనియు స్త్రీప్రకృతికి నైజమైన కొన్ని లక్షణములను దా మార్పలేదనియు నామెకుఁ దెలియరావు.

త్యాగతి, కల్పమూర్తి, నిశాపతిరావు, తీర్థమిత్త్రుఁడు, శర్వరీభూషణుఁడు మున్నగువా రామెకు మిత్త్రులు. అల్లైలోకేశ్వరి, సీతాసుందరి, సోఫీ మొదలైనవా రామెకు స్నేహితురాండ్రు.

---

1. "పిలిచేవారూ, పిలువఁబడేవారూ ఒప్పుకుంటే స్త్రీపురుషసమాగమం నీతిదూరంకాదనేవాడు పోస్తూంటుంది" (తుఫాను).

2. రచయిత యీమెను తెలుఁగు బి.ఏ.,(ఆనర్స్)గాఁజేయక యింగ్లీషుబి ఏ.,(ఆనర్స్)గాఁ జేసియున్నచో గొంతకొంత బాగుగ నుండెడిదేమో ! కాని మదరాసుమహానగరమునం దా వ్యత్యాస మేమియులేదని రచయితయూహకావచ్చును.

త్యాగతిది గంభీరవిగ్రహము. అతని మొగముమీఁది రేఖలు సుస్పష్టమై శిల్పము నందలి యొంపులను దలఁపింపఁగలవు. అతఁడు నవ్వఁడు. కాని నవ్వుకంటె విలాసముగల దేదో యాతని పెదవులపై నాట్యమాడును. మొగములో గాంభీర్యము, చూపులో దీక్షత, వాక్కులో మేఘమంద్రస్థాయియు నున్నవి. అతని యాలోచనములు, భావము లును నిగూఢములు; ప్రస్ఫుటములు కావు. నవలలో దుదియం దాతఁడు ప్రదర్శించిన సహనము, వినాయకరావుగారి దుఃఖోపశాంతికై యతని యుక్తియుక్తములైన ప్రయత్నములును ప్రశంసార్హములు; ప్రసన్నగంభీరమైన యాతని విగ్రహమును రచయిత వర్ణించినప్పుడే చదువరుల కాతని గుణగణము వ్యక్తము కాఁగలదు. తద్గుణసంపదయే యాతనిలో దుదివఱ కభివ్యక్తము. అతనిది మొమ్మొదటినుండియు సంపూర్ణప్రకృతి. అందుఁ బరివర్తనము లేదు. త్యాగతిరూపము తనకు రక్షణ కల్పించునని కుసుమసుందరి గ్రహించెను. అతని చూపులముం దామె హృదయము నగ్నమూర్తి యయ్యెడిది. తన రహస్యము లాతనికిఁ జెప్పవలెనని యామె కోరిక. త్యాగతి యనిన నామె కెంత భయమో యంత భక్తి.

కల్పమూర్తి సింహమువంటివాఁడు; ఉన్నతశరీరుఁడు. అతని రేఖలు సుస్పష్టమైనవి; హృదయము నవనీతము; పూజాశక్తులు ప్రశంసార్హములు; మనస్సు నిర్మలమైనది. విశాలఫాలము, విస్తృతనేత్రములు, విపంచివలె నాసిక; బంగారపు టొడలు; "అతనిని జూచి ముచ్చటపడుదురుగాని యెందులకో చాలమంది భర్తగా నంగీకరింపఁగోరరు" అని హేమ పలుకును. కల్పమూర్తి యామె నర్థించినాఁడు. అతని పూర్వపుణ్యము గొప్పది. చివర కతఁడు సీతాసుందరి నుద్వాహమాడి సుఖపడును. అసంపూర్ణప్రకృతి యాతనిపాత్ర.

నిశాపతిరావు సంగీతశక్తి యద్భుతమైనది. అతఁ డుత్తరదక్షిణదేశములలో పేరుగాంచినాఁడు; సంగీతముతో హేమను బంధించివేసెను; సహృదయుఁడు; ఆమె నర్చించి తన పూజ నంగీకరింపఁ బ్రార్థించును; వైఫల్యమునొంది మనస్సు మార్చుకొని చివరకు లోకేశ్వరిని ప్రేమించి చరితార్థుఁడైనాఁడు. సంపూర్ణప్రకృతి కీతఁ డొక యుదాహరణము.

తీర్థమిత్రుఁడు సన్నగ, పొట్టిగ, కర్పూరశలాకవలె నుండెడివాఁడు; విలాసవతి వలె సుగంధద్రవ్యములు, చీనిచినాంబరములలో మునిఁగి తేలెడివాఁడు. ఇతనికి వివాహమైనది; ఇరువురు పిల్లలు; ఏదో వ్యాపారసంస్థలో నుద్యోగము; ఇతని భార్యపేరు కనకలత.

స్త్రీపురుషస్నేహమునుగూర్చి హేమకుఁగల భావములన్నియు నిర్మలములైనవి. అనఁగా నంతశ్శుద్ధితో గూడినవి. అనుభవములేమిచే నవి పొరపాటులైనను నామె వానిని మనస్ఫూర్తిగ విశ్వసించెడిది. అందుచే నమాయకత్వ నిష్కల్మషత్వ చిహ్నా

తము లామెకు విపరీతభావము లనకతీరదు. ఇత్థంభూతమని నిర్ణయించుకొనలేని నిశ్చయ మునకు రాలేదామె మనస్సు. కావుననే తీర్థమిత్రునివంటివాఁడుకూడ నామె మిత్ర బృందములో స్థానము సంపాదింపఁ గలిగినాఁడు.

తీర్థమిత్రునకు స్త్రీపురుషసంబధ మనఁగా, నిత్థంవిధమనిన దృష్టియొకటి యున్నది. అది లాలస, లంపటత్వము. అతనివంటి స్త్రీసౌందర్యలోలుఁ డుండఁడు. హేమకుసుమవంటి సౌందర్యవతి యాతని కగపడలేదు. ఆ హేమయైనను స్నేహ పాత్రురాలు. ఇఁక తీర్థమిత్రునకుఁ గావలసిన వంచనాసామర్థ్య మంచితము. అతని కామాగ్ని కాహుతియైన యూరోపియభామలసంఖ్య నంచింపరాదు. ఆ యగ్ని వికృత మైనది. నిర్మలమైన తన కన్నులలో నాతఁడు కర్కశత్వమును దాఁచుకొనినాఁడు. అతని కామాభిచారహోమాగ్నియందు హేమ కడసారి యింధనము.

ఆమె ప్రవేశపరీక్షకు జదువుదినములలో నతనికిఁ బరిచయము. అప్పు డామెకుఁ బదునాఱేఁడులు. ఆ దినములలో నామెది పాలసముద్రఁపుటమృతము జిడ్డుకొనిన లక్ష్మీ బాలయొక్క కాయద్యుతి. ఆమె ప్రథమదర్శన, మీతనికి స్త్రీయనెడి దివ్యకామామృత కలశము నడచివచ్చి యెదుఱొమ్ముపై పిడికిలితో గ్రుమ్మిన ట్లైనది. తన సర్వస్వము ధారవోసి యామెను బొందఁదలఁచినాఁడు. తన సమస్తశక్తులను గేంద్రీకరింపఁజేసి రం జింప నాకర్షింపఁ బ్రయత్నించినాఁడు. ఇతనిభార్య వినయ సౌందర్య సౌశీల్యవతి; ఇద్దఱు బిడ్డలు నమృతఁపుఁజిసుకులు. ఇంత యుండియు హేమ నీతఁడు కాంక్షించుట మన భావములో బాశవికకామము ; రాక్షసక్రౌర్యము.

అతనిభావనములో వివాహ మొక నైమిత్తికకార్యక్రమము వంటిది. దాని కొక విశిష్టమైన విలువయని లేదు. పోఁగా బలహీనాత్ములకు, గృహనిర్వహణమునకు నొకస్త్రీ యావశ్యకము. ఇఁకఁ బిల్లలమాట? దాని నతఁ డంతగా బట్టించుకొనఁడు.

నవలాంతములో సంపూర్ణపరవశమున త్యాగశీలి యొకసారి తీర్థమిత్రుని దూయఁ బట్టును. హేమకుఁ గోప ముప్పెనవలెఁ బట్టరానట్లు పొంగినది. దానికి హేతు వామె దృష్టిలో దమ చిరకాలనిర్మలస్నేహము. తత్కోపాటోపముచే నామె తీర్థమిత్రునితో బొంబాయినగరమునకుఁ బలాయన మగును. 'పేరలుకఁ జెందిన కాంత లుచితవ్యాపారము నేర్తు రేర్పఱచుకొనరాదు. అట్టివారికిఁ బటిష్ఠమైన కారణముండితీరవలె ననలేము. అంతము హేమ తొలుతనుండి యెంత స్వతంత్రురాలో యంత చంచలురాలు. ఈ రెండు గుణములే యామెను నడపించుశక్తులు. వీనిలో నాదినుండి యంతమువఱకును మార్పు

రాదు. కావుననే యసద్విషయనులయం దామెది సంపూర్ణప్రకృతిగ మున్ను నిర్ధరింపఁ బడెను. ఇందలి యౌచిత్యమే నీ రీతిగ నన్వయించుకొనుట యుక్తము. విమర్శకు లిందుకుఁ జాల వగచిరి1. కాని హేమ శీలమున కీ పలాయనము పరాకాష్ఠ; యుత్కర్ష మిందువు.

ఆమె యిట్లు చేయు ననుకొనలేకపోవుట మన యెఱుఁగమిచీకటివలన గాని. మొమ్మొదటినుండియు నామె సర్వస్వతంత్రతయు జంచలతయుఁ జాటిచెప్పుచునే యున్నవి. ఆమె యీ రీతిగఁ బ్రవర్తింపకపోయినచో నది యనౌచిత్యము. ఇది యౌచిత్యము. అంతటి స్వాతంత్ర్యమున కంతటి సౌందర్యము తోడు గానిచో కథ వేఱుదారి పట్టెడిది; ఆమె సద్విషయములలో బ్రవర్తించుట జరిగెడిది. ఆ సౌందర్యమున కా స్వాతంత్ర్యచాంచల్యములు తోడు గానిచో నామె యుత్తమగృహిణి కావలసియుండెను. సంపన్నత, సౌందర్యము, విద్యా యౌవన స్వాతంత్ర్యచాంచల్యములు వ్యస్తముగనే వెట్టిఁగొలుపఁగలవి. అట్టియెడ నవియెల్ల రాశీభూతమైనపుడు హేమకుసుమసుందరి యం దీ తీరునఁ బరిణమింపక వేఱొకతీరుగ నగునా?

తన్నేమియు ననలేక తీర్థమిత్త్రుని నంత నిశితముగ విమర్శించినపుడు హేమకు త్యాగతియందు మనస్సువిరిగిపోవుట యామెప్రకృతికి విరుద్ధముకాదు. ఇతని యందు విరక్తియొకటి; అతనియందు రక్తి వేఱొకటి యని వాదింపవచ్చును. అది యాపాతరమ ణీయము. సాధారణముగ మన మిత్త్రునియందుఁగలుగుఁ బ్రత్యేకవిరక్తి యాతని విరోధియందుఁ బరిణతినొందుచుండుట లోకపద్ధతి. దానికిఁ దోడు తీర్థమిత్త్రుని సహజ ప్రయత్నములు కొన్ని లేవనుకొనరాదు. ఆతనియందలి ద్వేషమున కితనియందలి యభిమానము తోడై తెగఁబాటున కామె నిలుఁగొలిపెను. ఇది యామె చాపల్యము. స్త్రీపురుషసంబంధములఁగూర్చి యామె కెన్నఁడు నింతయు మించిన నైతికభావములు లేవు. మొదటినుండియు రచయిత తద్విషయమును బన్నుకొనుచునే వచ్చినాఁడు. కథా గమనము ననుసరించుచుఁ బోవునపుడింత కిన్ని వేళ మింకొకవిధముగ ఘటింపఁబడినచో బాధ కలిగెడిది2.

---

1. "హేమకారెక్టర్ యిక్కడ బాగా దెబ్బతిన్న దనుకుంటాను. ఆమె స్వభావానికి ఇది ఒక గొడలిపెట్టులాంటి సంఘటన. ఇది ఆవిడ బాల్యచాపల్యానికి నిదర్శనం కావచ్చును. నవల వోరిడ యిక్కడ అతికినట్లున్నది. సంవిధానం పేలవమై తోచినది. అంత సహజంగా నవలని నడిపించుకువచ్చిన బాపిరాజు యిక్కడ తప్పటడుగు వేసినాడు, అనిపిస్తుంది." శ్రీ పాలమడుగు వేంకటేశ్వరరావు, 'ఆంధ్రప్రభ' సచిత్రవారపత్రిక, పుట20,(9–12–1959).
2. "తీర్థమిత్రునితో పారిపోవటం హేమ చపలతని నిరూపిస్తుంది. ఎందుకో అటువంటి సంఘటన అక్కడ ఉచితం గాదేమో అనిపిస్తుంది. క్లైమాక్స్'లో కనబడే యీ లోపం ఎలా అయినా కొంచెం బాధ కలిగిస్తుంది. కథని మరోవిధంగా నడిపితే బావుండే దేమో"? శ్రీ పాలమడుగు వేంకటేశ్వరరావు. ఆంధ్రప్రభ — సచిత్రవారపత్రిక — పుట 20,(9-12-1959).

తుదకు నవల మోదాంతము. నిశాపతి లోకేశ్వరులు, కల్పమూర్తి సీతాసుందరులు, వివాహమాడుదురు. హేమకుసుమ తన బావయైన శ్రీనాథమూర్తిని దన వానినిగఁ జేసికొన్నది. తీర్థమిత్త్రిని మనస్సు పరివర్తనఁజెందును. చివరకీ నవల వెన్నెల వాకలు, పిల్లగాలులు, పూలసౌరభములు, సేసలు మున్నగువానిని నింపుకొనఁగలదు. త్యాగతి జీవితచిత్రణమే యిందుఁ బ్రధానమైనను హేమకుసుమసుందరి యాలంబనము, నామె శీలప్రభావమునుగూడఁ బ్రముఖము లైనవి. నవలలోని కవితాశైలీప్రాశస్త్యము నుగ్గడించుట పునరుక్తి. పాలసముద్రఁపుటలలపైఁగట్టు తెలినురుగుతెట్టెవలె నడచు వర్ణనాత్మకశైలిచే ముగ్ధులుగానివా రుండరు.

రాజ్యలక్ష్మమ్మ వినాయకరావుగారల వాత్సల్యమమృతసదృశము. కాఁగా, నించుక విస్తరిల్లిన ప్రస్తావికేతివృత్తము శకుంతలా శ్రీనాథమూర్తులది. అద్భుతమైనది వారిప్రేమ. శకుంతల దేవలోకబాలిక. శ్రీనాథమూర్తియో నవ్యప్రేమికుఁడు వారి చిన్ననాటిముచ్చటలు, పెండ్లిసమయము మున్నగుఘట్టములు పఠితలను దివ్యలోకయాత్రచేయించి తీసికొనిరాగలవి. శ్రీనాథమూర్తికిఁగల జ్ఞానతేజస్సుచే మనోదృష్టి మిఱుమిట్లువోని చదువరియుండఁడు. అంతటి దాతనిబోధము 1.

శకుంతల మరణము శ్రీనాథమూర్తిని వీఁకఁడిఁగాఁ జేయును. అతని బలహీనతలు విజృంభించినవి. ప్రేమ విష మైనది. దాని నడ్డుకొనుశక్తి యాతనికి లేదు. సుశీలాదేవితోడి ప్రణయప్రకరణము ప్రేమికుల మనస్తత్త్వము నొరసిచూడఁగలది; సౌశీల్యమునకు విషమపరీక్ష. ఉత్తరదేశయాత్ర, 'స్వామీజీ'తో బరిచయము, మున్నగునవి యాతని కింద్రియప్రకోపశమనమును గూర్చును. సుశీలతో నీతని ప్రణయఘట్టము పరిశుభ్రగుణశీలగంగామహాస్రవంతిలో గలియు నొక మలినమైన వేణిక. శ్రీనాథమూర్తి శీలపరిణామనిర్ధారిణి సర్వమాలిన్యనాశనక్షమ మగుట వేఱుమాట. అయ్యును సామ్యభేదనిరూపణాదిశిల్పప్రయోజనము లీ వృత్తాంతములో సాధింపఁబడినవి. జీవితము దినదినగండము; ఒక నిరంతరసాధన; అందుఁ గడచిబ్రతికినవాఁడు లేఁడు. అందును సౌశీల్యవిషయ మతిచంచలము, దుఃఖావహము, పరాధీనము, భయనికేతనము. స్త్రీసాన్నిధ్యనైరంతర్య మెంతటివారికిని బరీక్షాస్థానమే! ఈ గుణపాఠ మిటులుండఁగ నిం దింకొక వైచిత్రి యున్నది. అది లోకధర్మి. త్యాగతిని, తీర్థమిత్త్రినిగూడ వీడి తన్ను హేమకుసుమ యొల్లఁగా శకుంతలతోడిదే లోకమనుకొనిన శ్రీనాథమూర్తి తాను సుశీలను వలచును. తాను వలచిన వారు తన్నొల్లకపోవుట సాధారణజీవితచిత్రము. లోకపద్ధతిని సజీవముగఁ జిత్రించుటవలన నిది వాస్తవికత యని కొందఱు విమర్శకు లనిరి. నేఁటి నాగరకసంఘజీవితమున కిది రత్నదర్పణమని మన్నించినవారు కొందఱు.

1. "దేహానందం మనస్సుఆనందానికి పునాది. మనస్సూ దేహమూ ఆత్మకు పునాది. ఆత్మ విద్యుత్తులాంటిది. అందుకు మనశ్శరీరాలు ఇంధనాలు". (తుఫాను).

ఒక్కటిమాత్రము నిజము. శ్రీనాథమూర్తి కైలాసయాత్రతో దివ్యుఁడు, నుత్తమచిత్రకారుఁడు నగును. మానసికజీవితరేఖ లాతనివి యుజ్జ్వలముగఁ దిరిగి తీర్చి దిద్దఁబడినవి. అతఁడు స్వామితో నెఱపినవాదములు జిజ్ఞాసువులకుఁ పరిశీలనార్హములు. మానవప్రకృతి, సౌందర్యతత్త్వము, లలితకళలు మొదలైన వానినిగుఱించి యాతని యనుశీలనములు ప్రతిభాపునున్మేషములు. ఆంధ్రమహిళాసభాకార్యక్రమము లిం దెంత హృద్యములై యుజ్జ్వలములో శిల్పచిత్రకళాదికములుగూడ జీవనమార్గదర్శకము కాఁగలుగుట యింతకంటె హృద్యమై చదువరిమనస్సు నానందతుందిల మొనర్చును. ఇందలి విశిధసన్నివేశసంఘటనలు నానాముఖాతులను గల్గించుచు నీ నవలాకర్తకుఁ జిరకీర్తి నార్జించిపెట్టినవి; నవలాసాహిత్యశిల్పమున కొకస్థాయిని జేకూర్చినవి.

## విశ్వభారతి [1]

డా.పోణంగి శ్రీరామ అప్పారావు దీనికర్త. భారతీయసంస్కృతిని జిత్రింప వలయుననెడి యాశయముతో రూపొందిన దీ సాంఘికనవల. "ఆదిలో 'విశ్వభారతి' నిర్మాణములో నమూల్యములగు సలహాల నొసంగిన శ్రీ అడవిబాపిరాజుగారిచలవయే యిది యింతయును"—అని నవలాకర్త చెప్పుకొనియున్నారు.[2] ఆప్రసక్తి సప్తమప్రకరణ మునకుఁ జెందియుండును. కుమారదేవముననఁ బ్రతిసంవత్సరమునుజరుగు గోపూజోత్సవ సందర్భములో బ్రదర్శింపఁబడు గోవర్ధనోద్ధరణాదికృష్ణలీలలవర్ణనగల సప్తమప్రకరణమట్ట మీ నవలలో నుత్కృష్టమైన కళాఖండము. బృహత్'విశ్వభారతి'[3]చతుర్థముద్రణమునందు[4] కూడ బాపిరాజుగారి యశఃప్రభావమునుగూర్చి ప్రసంగము గలదు. నవలలో గోసేవకుఁ బ్రాధాన్య మిచ్చుటయందు వారి తీరుపరితనము కొంతయున్నది. కాని యదియే కథను దేల్చివేసి నవలారచనోద్దేశమునకుఁ బటిష్ఠత నాపాదింపలేకపోయినచో నామాట వేఱు.

---

1. దీని ప్రథమముద్రణము1946: ఆంధ్రవిశ్వకళాపరిషదధికారులు దీనిని బ్రవేశపరీక్షకు నిర్ణయించినపుడు దీని ద్వితీయావృత్తి 1950. ప్రకాశకులు — వాణీబుక్‌డిపో, భీమవరము. పిమ్మట నిది తృతీయావృత్తి నొందినది. ఉస్మానియావిశ్వవిద్యాలయము ప్రవేశపరీక్షకుఁ బాఠ్యమై చతుర్థావృత్తి నందెను. ఈ నవలకే యొక సంగ్రహరూపముగూడఁ గలదు. అది యాంధ్ర — మదరాసురాష్ట్రములయందు స్కూల్‌ఫైనల్‌పరీక్ష కుపవాచకము. అందుచే క్రీ.శ.1950,1956,1958లలో నది నాలుగావృత్తుల నొందినది. ఇందుఁ జతుర్థ ముద్రణము, 'అరుణశ్రీగ్రంథమాల(సికందరాబాదు)'వారిది (1958).
2. ద్వితీయముద్రణము(1950) (వాణీబుక్‌డిపో)నందలి 'మనవి' (పంక్తులు4—6).
3. నాలు గావృత్తులుగనిన లఘు'విశ్వభారతి'కంటె నిది భిన్నమనుట.
4. క్రీ.శ.1959గావచ్చును; సంవత్సరసంఖ్య యందీయఁబడలేదు.

అది వారి భావముల తీరుపరితనమునకు రచయిత స్పష్టమైన రూపకల్పనము చేయలేక పోవుట. ఇందు భారతీయసంస్కృతీచిత్రణప్రధానాశయ మెట్లుఁ బచేళిమము గాలేదో యట్లే కథాసంవిధానమును బచేళిమము కాలేదు.

విశ్వనాథుఁడు విజయేశ్వరసంస్థానపురోహితుని కనిష్ఠభ్రాత. చిననాఁడు వట్టి యల్లరిగఁ దిరుఁగుచు నొకనాఁడు రాజకుమారునితో దగవుపెట్టుకొని వానిని లాగి చెంపపైఁ గొట్టెను. అదే సమయమునకు సంస్థానాధీశుఁడును విశ్వనాథుని యగ్రభ్రాతయు వచ్చుటకు వచ్చిరి. ఈ సంఘటనముతో విశ్వనాథుఁడు పశ్చాత్తాపము నంది కాశికి జని గొప్పపండితుఁడై మఱలివచ్చెను.1 అతఁ డాతిరిగివచ్చునప్పటికి సంస్థానేశ్వరుఁడు స్వర్గస్థుఁడై నాఁడు. విశ్వనాథుఁడు గోదానదీతీరమున నాశ్రమము నిర్మించుకొని యోగాభ్యాసాదివిద్యలవలనఁ బ్రసిద్ధిఁగాంచెను.

ఇప్పటి సంస్థానాధిపతి రామమోహనుఁడు. ఆతనికూఁతురు రజని; విశ్వనాథుని శిష్యురాలు. అక్కడికి సమీపములోని గ్రామము కుమారదేవము. ఆ యూరిలో పెద్ద భూస్వామి రామయ్య. రామయ్య జ్యేష్ఠపుత్త్రుఁడు కృష్ణరాయలు. ఈతఁడు విశ్వనాథుని శిష్యుఁడే! వీ రిరువురును గొంతకాలము విశ్వనాథుని యాశ్రమముననే నివసించిరి. పిదప నెవరికివారు దమతమ గృహములయందే యుండి విద్యావ్యాసంగము సాగింపఁ జొచ్చినారు. రజని సంగీతమునను రాయలు సాహిత్యమునను గృతశ్రములై కృతవిద్యులై రి. వారి కప్పుడే పరస్పరానురాగ మేర్పడినది. విద్య ముగిసినపిదప విశ్వనాథుఁడే రామయ్యను సంస్థానాధీశునిగూడఁ బిలిపించి రజనీరాయలలవివాహమును గుదిర్చి జరిపించినాఁడు.

రామయ్య ద్వితీయపుత్త్రుఁడు కేశవుఁడు. ఈతనికి గోసేవయన్నను వ్యవసాయమన్నను నభిమానము; చదువుసంత అంతంతమాత్రమే! భవాని కేశవునిసహోదరి. అన్నయుగురామయ్య బోధింపఁగా గురువుగారియంత పండితురాలై నది. ఈమె సౌందర్యమునకు వశ్యుఁడై రామగిరిసంస్థానాధిపుఁడు గిరిబాబు తనప్రథమపత్ని స్వర్గతినొందఁగా నీమె నుద్వాహమైనాఁడు. కేశవునకు రామగిర్యాస్థానిలోని 'మొఖాసాదారుఁడు' తన కూఁతురు చంద్రనిచ్చి పెండ్లియొనర్చెను.

భూస్వామిరామయ్యకుఁ గేశవుఁడు జనించినవేళకే విశ్వనాథుని సూచనపైఁ బొలములో నొక పుట్టఁ ద్రొప్పింపఁగా నందులోనుండి యొక తెల్లత్రాఁచు ప్రక్కనున్న

1. ఇది శరచ్చంద్రుని ప్రభావము.

గంధ:పుత్రో:పులోనికిఁ బోయినది. వెంటనే నచ్చట ద్రవ్యింపఁగా వేయి యెకరము లకు సరిపడు 'నీటిజల' పడెను. దానితో రామయ్యయైశ్వర్య మెత్తుకొన్నది. ఈ రామయ్యభార్య యీశ్వరమ్మ.

గిరిబాబు ప్రథమభార్య కొక కూఁతురు. ఆ గిరిబా బొక వచ్చివిలాసపురు షుఁడు; అది యెఱిఁగి భవాని యాబిడ్డను సాకి తన పతిని సన్మార్గప్రవర్తకు నొనర్ప వ్యర్థముగఁ బ్రయత్నించినది. కాని గిరిబాబు భవానిముఖమును జూచుట కూడ మానివేసెను. భవాని తన సవతిబిడ్డను జేరదీసి 'భారతి'యని పేరుపెట్టి యామెకుఁ దానే యుపాధ్యాయురాలై విద్యగఱపినది.

రజనీరాయలల కొకపుత్త్రుఁడు కలిగెను. వాని పేరు విజయుఁడు. వాఁ డల్లారు ముద్దుగ బెఱుఁగుచుండెను. ఒకమాఱు వాని కారోగ్యముచెడినది. వాఁడా రుగ్మతలో మూఁగవాఁడయ్యెను. అందఱ కదియొక చింత. అత డల్లరిచేయుచుఁ దిరుగు చునే యున్నాఁడు; ఒకనాఁ డూఱకొనలేకగంధఁపుదోపునకుఁబోయి యందలిత్రాఁటను గొట్టెను. అది పడగ నేలకుఁగొట్టుకొని చనిపోయినది; దానితో నచటిబావిలోని'జల' యింకిపోయెను ఇట్లుండ విజయుఁ డొకనాఁడు గోదావరీస్నానమునకుఁబోయి ప్రవాహములో గొట్టుకొనిపోయినాఁడు.

గిరిబాబు విలాసములెక్కుడై మంచమువట్టెను;భవాని పరిచర్యయు, భిషక్కులు పరిశ్రమయుఁ జేయఁగా దుద కెట్లో బ్రతికిబట్టగట్టినాఁడు; బుద్ధిమంతుఁడుగూడ నయ్యెను. అనఁగా భవాని జీవితము ధన్యమైనది. ఆమె యింతలో విజయుని గూర్చిన దుర్వార్త విని భర్తతోడను భారతితోడను బుట్టినింటికి వచ్చి వేసెను. విశ్వనాథుఁడుకూడఁ గుమారదేవమునకు వచ్చి "విజయుఁడు క్రొత్తగూప ముతో మీకు లభించు"నని యూఱడించుట జరిగినది. అప్పుడే భారతి విశ్వనాథుని హృదయము నాకర్షించి 'విశ్వభారతి' యనుపేర భూషింపఁబడెను.

కుమారదేవము గోసంతతికి నునికిపట్టు. ఆ గ్రామములో గోపూజోత్సవము ప్రతివర్ష శిశిరఋతువునునోజ్ఞదర్శనము. ఆ నేఁడు తెగుళ్ళుతగిలి యాలమంద లెన్నో నశించినవి. సమీపగ్రామమున నుండుఁ డెల్లదొరల యాహారము నిమిత్తమై దేశీయులు గోవుల నమ్ముచున్నారు. ఇది యంతయు జూచి కేశవుడు కదు ఖేదపడినాఁడు. రాయలును గేశవుఁడును గోసంరక్షణమునకై బద్ధకంకణులై ప్రచారము గావింపఁ జొచ్చిరి.

విజయుఁడు పడవలవారికిఁ గొందఱకు దొరికెను. వారాతనిని రక్షించినారు.కాని యోగివలె నాతఁడు పండ్లు తప్ప మఱేమియుఁ దినకపోవుటచే వా రాతనిని గోదావరి యొడ్డున వదలి వేసిరి. అతఁడు కాల్నడను వచ్చి విశ్వనాథు నాశ్రమముజేరి యాశ్ర

ర్యమున నాతనిని జూచియుఁజూడఁగనే కెవ్వుమని కేకపెట్టెను. వానికి కంఠముపెగలినది. విశ్వనాథుఁ డాతనిని గుఱుతించి రజనీరాయలలను, రామయ్యాయీశ్వరమ్మలను, భవానీగిరిబాబులను, చంద్రాకేశవులను, రామమోహానుని నందఱ నొక్కచోఁగూర్చి యాబాలు నొప్పగించినాఁడు.

పిదప భవాని కొక మగపిల్లవాఁడు; చంద్రకొక యాఁడుపిల్ల; రజనికి రెండవ కొడుకు.

విశ్వనాథుఁడు రజనీరాయలలను బిలిచి తన యాశ్రమమునందు 'విశ్వభారతి' గురుకులమును నడపి తన యాశయమును ప్రచారముచేయవలయు ననెను. అందు భారతియు, విజయుఁడును ప్రథమవిద్యార్థు లగుదురని యాతని యాదేశము. వారల్లే యంగీకరించిరి. విశ్వనాథుఁడు హిమాలయయాత్ర కేఁగెను. ఇచ్చట 'విశ్వభారతి' యాదర్శగురుకులమై నెగడినది. అది సర్వమానవసౌభ్రాతృత్వమునకును విశ్వభారతికిని బుట్టినిల్లు. అందు జాతిమతవర్ణవిభేదములు నాస్తి. ఈ గురుకులము ప్రపంచసంస్కృతికిఁ గేంద్రస్థానము. ఉత్తమము నున్నతము నగు కట్టుబాటులతో నం దాదర్శమైన విద్యావిధానము జరుగుచుండెను.

విశ్వనాథుని ఛాత్రుఁడు రాయలు. రాయలశిష్య భవాని. ఆమెశిష్యురాలు భారతి. ఇది విద్యాపరంపర. ఈ పారంపర్యమున మొదటివాఁడు విశ్వనాథుఁడు. చివరిబాలిక భారతి. వీరి నాద్యంతములుగఁగల మధ్యగాథ 'విశ్వభారతి' కాఁదగును.

'విశ్వభారతి' విశ్వనాథవ్యవస్థాపితగురుకులము. ఇది చాల నుదాత్రాశయములు గలదై దేశీయులను జక్కనిపౌరులుగా దీర్చిదిద్దు నుద్దేశములతో నెలకొలుపఁబడినట్లు! దాని కార్యక్రమవర్ణనము చెప్పుచున్నది. నవలలోని కథ యంతయు నా యాశ్రమము నాశ్రయించుకొని నిర్మింపఁబడెను. అందుచేగూడ దీనికి 'విశ్వభారతి'నామము సార్థకము.

"అమ్మా!భారతి నీయొక్కభాగ్యమేకాదు, ఆమెను విశ్వభారతిగ గుర్తింపుము."2 అని భవానితో విశ్వనాథుఁడు పలికెను. ఈ భారతి గురుకులములో విద్యార్థినిగఁ జేరుటతో గథ పరిపూర్తిఁగన్నది. కావునఁగూడ నీ నవల 'విశ్వభారతి'యని యుద్దేశింపఁబడియుండవచ్చును.

---

1. 'విశ్వభారతి'—పుటలు191,192. (శ్రీనివాసాపబ్లికేషన్స్,5054,మార్కెటువీథి, సికిందరాబాదు). క్రీ.శ.1959లేక1960ప్రచురణకావలెను. 2. Ibidem,P–179–Lines19;20.

అన్నిటినిమించి నటకవి 'విశ్వభారతి'యొకటి ప్రసిద్ధము. అదియే మన నవలా కర్త కీ పేరు స్ఫురింపఁజేసియుండును.

విశ్వభారతియొక్క యుదాత్తాశయములు నందలి విద్యావిధానముయొక్క కార్య క్రమమును వర్ణింప బడినట్లే, గోపూజోత్సవపంచదినకార్యక్రమము వర్ణింపఁబడినట్లే, కాశీకిఁబోయివచ్చిన విశ్వనాథుని పాండిత్యమెట్టిదో, యాయనయొద్ద విద్యనేర్చిన నాయికానాయకుల సంగీతసాహిత్య విద్యల పాటవ మే పాటిదో కూడ సంగ్రహము గను సందర్భోచితముగను నవలాకర్త సూచించియుండినచో వారివారి కళాశిల్పజ్ఞానము వలన నవల కొకింత నిండుదనము వచ్చెడిది. రచయిత చెప్పనుద్దేశింపనివానిని మన మడుగరాదు. కాని గురువునొద్ద రాయలు సాహిత్యవిద్యాధిదేవత యైనాఁడు; రజని సంగీతసరస్వతి యైనది, యని యొక్క మాటలో గొట్టివేయఁబడినపుడు రసజ్ఞులైన పాఠకుల కా సాహిత్య పులోతులేవి? యా సంగీతపుఁజూపు నానందమయజగత్తులేవి? యనెడి కుతూహలము కలుగును. కేవలవినోదమున కేగాక కొంత విజ్ఞానమునకుఁగూడ నవలలు కొందఱు చదువుదురు. లలితకళాప్రసంగములుగల నారాయణరావు, వేయిపడ గలు, తంజావూరిపతనము, భువనవిజయము, సప్తపర్ణి, చిత్రశాల, రాజశిల్పి, వంటి పెక్కు నవలల నెఱిఁగిన మనజాతి పైపై మాటలనుగాక కళాశాస్త్రవిజ్ఞానపులోతుల నించుక వాంఛించుట తప్పుగాదు.

విశ్వనాథకృష్ణరాయలలయు, రజనీశవానులయు బాత్రోన్మీలనములు గమనింపఁ దగినవి. అట్లే కృష్ణరాయ కేశవులయు, రజనీశవానులయు స్వభావశీలములయందుఁగల సారూప్యవైరూప్యములను గుఱుతింపఁగలము. ఈ నవలయం దొక ప్రశాంతమైన పల్లీ జీవనశోభను వర్ణించుటకు ప్రయత్నముజరిగినదేమోయని యనుమానము. ఏ యుద్దేశ మును దిటవుగ వేరూన లేదు. రామయ్యకుటుంబజీవితము నొక యాదర్శప్రాయమైన చిత్రణముగ రూపొందింప నవలాకర్త యుద్దేశించిరేమోయనికూడ ననవచ్చును.

అన్నింటికంటె నింకొకటి ముఖ్యము. బాపిరాజుగారి యాశీఃప్రభావము ప్రకట ముగ నంగీకరింపఁబడుట యితఃపూర్వము ప్రసక్తము. ఈ నవలారంభమున గూఢముగ శరచ్చంద్రుని ప్రభావమునుగూడ బఠిత లనుభవింతురు. నవలయం దంతటను శ్రీవిశ్వ నాథవారిప్రభావము నట్లే సువ్యక్తము. వా రీ నవలాకర్తకు గురువులు. ఆ ప్రభావ మంతయో యింతయో తప్పదు; అందుఁ దప్పులేదు గూడ.

శ్రీ విశ్వనాథవారి 'వేయిపడగలు' సుప్రసిద్ధము. అందలి సాంఘికార్థికవిజ్ఞాన మంయు జీవిత మంతయు నాఁటి సంస్థానాధీశుల నాశ్రయించినది. వారి కాశ్రితులగు ధర్మారావు నావరించినది. ఈ మన నవలయందును గథకు సంస్థానాధీశ్వరులును వారి యాశ్రితుఁడగు విశ్వనాథుఁడును నాలంబనములు. విశ్వనాథుఁడు సంస్థానపురోహితుని పుత్త్రుఁడు. అందు వేయిపడగలపామునకున్నట్లే, యిం దేకైకఫణముగల మహాసర్పము

నకు ప్రాధాన్య మున్నది. అందలి దేవదాసి గొప్పది; అచ్చరల యపరావతారము; అమృతబిందువు; దివ్యసుందరి. ఇందలి దేవదాసి చిన్నది; విద్యలలో మిన్న; తేనెచినుకు; మానవలోకసుందరి. ఆమె కా మహానవలయందుఁగల ప్రాధాన్య మమేయము; ఈమె కీ లఘునవలయందుఁగల ప్రాధాన్యము సుజ్ఞేయము. పుష్పలతయొక్క రాధికాపాత్రాభినయ మనోజ్ఞఘట్టములుగల గోపూజోత్సవముల సందర్భమే1 నిజమున కీ నవలయొసఁగు విజ్ఞానానందముల కాయువుపట్టు. దేవదాసిఘనతకు రెండునవలలును గైవారించు ననుట యుక్తము. శ్రీ విశ్వనాథ వారికిని, డా॥అప్పారావుగారికిని భారతీయసంప్రదాయములపై నభిమాన మున్నట్లు వారివారి రచన లిచ్చు సాక్ష్యము లుండనే యున్నవి. ఆ యీ కారణములవలన 'విశ్వభారతి'పై 'వేయిపడగల'ప్రభావము కొంత పడినది. పోనిండు; అది వచ్చిపడలేదు. ఇదియే దానికిఁ బ్రతిధ్వని; అందును నించుక దుర్బలమైన ప్రతిధ్వని. గురువుల నెప్పుడు మించుట శిష్యులకు దుర్లభముగదా!

## ఆదర్శం [2]

అంతటి [?]నరసింహాముగా రనఁగా నెంతటివారో తెలిసికొనుటకు వారి'యాదర్శము'ను నవల యొక్కటియే చదివినఁ జాలును. ఆయన చాల విద్యాధికుఁడు; ఆంధ్రభాషలో బెద్ద పట్టభద్రుడైన మనిషి.

ఈ నవలయందుఁ గొడుకు రామిరెడ్డి మాలపిల్లలతోఁజేరి చెడిపోవుచున్నాఁడని తండ్రి సుబ్బారెడ్డి కొట్టుటయాదిగా, నాయఁడైన యన్నయ్యను వివాహమాడుటకై కమలను నిరాకరించువటకునుగల యావ దుపన్యాసము వర్ణాంతరవివాహములను బ్రోత్సహించుట కుద్దేశింపఁబడినది.

ఈ నవలనే యుపన్యాస మనుటకాదు; వీరి నవలలన్నియు నట్టివి. వర్ణాంతర వివాహములను బ్రోత్సహింపకపోవుట, గాంధిమహాత్ముని దాయాదులగు 'కాంగ్రెసు' వారికిఁ దలవంపులనియు దన్మూలమున వారివంటి యల్పులులేరనియుఁ వన గ్రంథముల మం దంతటను నిరసించుటలోఁగల యాశిత్యి మొకటి దురూహ్యము.

---

1. 'విశ్వభారతి'-ప్రథమ ముద్రణము-పుటలు115-165(1950)వాణీబుక్‌డిపో-భీమవరం).

2. రచన క్రీ.శ.1946, ప్రథమముద్రణము. క్రీ.శ.1950 డిసెంబరు;రెండవముద్రణము క్రీ.శ.1959.

3. వీరి యితరనవలలు సాంఘికములు :'భాపం'.అనగముగ నివి మనస్తత్త్వశాస్త్రసంబంధులు (1958,1961):'స్వగతం' ఇది యొక నవలిక వంటిది-రచన1954-ముద్రణము 1959; 'ప్రేమలిపి''శోభాదేవి',మొదలైనవి మఱికొన్ని. చారిత్రికము: రామరాయలు. పిల్లల నవలలు:'కోటప్పిన్నసాహసం', 'దయ్యాలపోలన్న ధైర్యం', 'మంత్రాలరామన్న మొండితనము' వంటివి.

వీరి నవలలు నవలలుకావు; చెట్లక్రింద పామరజనుల కుద్దేశింప బడిన యుపన్యాసములు. ఇం దొక పాత్రపోషణము లేదు. 'ఆదర్శము'న నొక పాత్రచే గథచెప్పించుట యెక్కువైనచో, 'స్వగతము'లో దానిని సంపన్నపరచుటయే యధికము. పాత్రసృష్టిపోషణము సంవాదనిర్వహణము నని యుండుటకు వీలులేనివి వీరు ప్రచారముచేయనెంచిన యాశయములు. తమ తమజీవితాభిమానవిషయము లస్పృశ్యతానివారణము, వర్ణాంతరవివాహము, వర్గవర్గభేదనిర్మూలనము, స్త్రీవిద్య యని రచయితయే తమ గ్రంథముల యాద్యంతములలో జెప్పుకొందురు.

ఇట్టి వానిని ప్రచారముచేయుటయే పరమోద్దేశమైనప్పు డుపన్యాసములే గాని నవలలు కలిసిరావు. ఈ యాశయముల ప్రాశస్త్యమును జదువరులు ప్రశ్నింపరాదు. అట్టి ప్రశ్నలను రచయిత తానే యవ్యూహచేసికొని యేమైన సమాధానములను నవలలో నిచ్చినాడా? యన్నచో నంత లోతుగల యాలోచనమే వీరి రచనలో మన మపేక్షించుట తప్పు. ఇందలి వట్టి నేలబారు విషయముల నతురాస్యులు చదువరు; అతురాస్యులు కానివారికి జదువ వీలే లేదు. కావుననే గ్రంథకర్త యుపోద్ఘాతములలో ఖేదపడురీతిగ దనకు దగు ప్రోత్సాహము, పాఠకలోకమునుండి లభింపకుండుట.

రచయిత కెట్టి యాశయములైన నుండవచ్చును. కాని వానిని జెప్పురీతి నవలల కనుగుణమగు రీతిగ నుండవలెను, గదా! కొన్ని సన్నివేశములు వాతావరణము కథా సంవిధానములు నని యుండవలదా? ఇంత విద్యాధికుడేమెఱుగ; యని రచయితను నిందింపరాదు. విద్యావంతులను సృష్టించుచున్నట్టి యున్నట్టి విశ్వకళాపరిషత్తులు విద్యాబోధన విషయమున నింకను 'తాజమహాలు' లగుచున్నవిగదా, యని యుపచారింప నగును.

పిదప నంతశ్శుద్ధివిషయము. ఇది రచనకు సహజము నాపాదింపగలదు. అంతశ్శుద్ధి యుండేదెది? కాంగ్రెసువారి నడుగడుగున దూషించు రచయిత యంతశ్శుద్ధి, యెఱిగిన వారి కెఱుకయే! వర్ణరహిత సమాజమును రచయిత గ్రంథములలో నపేక్షించును; నిత్యజీవితమున వర్ణము పేరిటి బలముమూలమున ననేక లాభములు సంపాదించుచుండును. ప్రణాళికలలోని విషయముల ననుష్ఠానములోనికి దెచ్చుటకు త్రికరణశుద్ధి కాంగ్రెసువాదులకు లేనిదేమి? తన కున్న దేమి? రచయితకున్న యంతశ్శుద్ధిస్ఫూర్తియే తన పాత్రలను సంక్రమించును.

ఈ నవలలో దౌలత యన్నయరెడ్డి వలదని యెంతచెప్పినను వినక వర్ణాంతర వివాహములవలని యాపదలకు జంకననికమలయు, తుదిలో దలిదండ్రులమాట జవదాటలే నన్నది. భార్యాభర్తలవలె మెలగిన వారిమధ్య రసాభాస మంతశ్శుద్ధిలోపము వలననే వచ్చెను. వర్ణాంతరవివాహముకావలెనని కమలమనినను, వలదనుచు దౌలత నాతడే ప్రశ్నల నామె నడిగెనో తుదిలో నట్టి వివాహ మనర్థదాయకమని గ్రహించిన కమలముగూడ నా ప్రశ్నలనే యాతని నడిగినది. ఇంక పాత్రల మనోబుద్ధులు వికసించిన దెక్కడ? పాత్రల శీలగుణములను బోషింపబడిన దెక్కడ?

రచయిత సంఘసంస్కారము కోరవచ్చును. దాని నొక పద్ధతిలో నిబంధింప వలెను. నవలాప్రక్రియ నెన్నుకొనిన రచయిత కుండెడిసాధకబాధకము లున్నవి. శ్రీ విశ్వనాథవారి కార్ష సంప్రదాయములయందున్న యభిరతికంటె శ్రీ యంతటి వారి కాంగ్ల సంప్రదాయములయం దభిరతి యధికముగ లేదు. ఆ యభిరతి యడ్డుతగిలి యుపన్యాసధోరణిలోనికి దించుచున్న దన్నచో నవలాప్రక్రియ యొకరిరచనను ననిపి, యింకొకరి రచనను ననుపకుండు టెట్లు? ఆయన యాప్రక్రియలో సమ్రాట్టుకాఁగా, నీయన యభిరాట్టు కాలేకపోవుటచే దానికి వ్యక్తిగతసామర్థ్యమునే కారణముగఁ జెప్పుట యుచితము; ప్రక్రియాపరమైన లోపమున్న దనరాదు.

'ఆదర్శము'నందు శైలి దారుణమై యున్నది. వీరి యన్ని నవలలయందు నది చాల వఱకుఁ బ్రవాహోదకము వలెనే యుండును. ఆంగ్లపదములు వాక్యములో నెక్కడనోగాని యడ్డురావు. రచయిత యే మండలమునకుఁ జెందునో కొంతగ నా మండలనుపదములు నా యేసయు నుండుట సహజము. కాని యొక్క రాయలసీమ లోని శైవమతకుల శాఖాంతరవివాదము లెల్ల పాఠకుల నాకర్షింపవు. మఱియు భాషకు జీవనమొసఁగు పటుత్వ మీ నవలాకర్త కలవడలేదు; శైలి పేలవమై యుండును. పవో తన యభిమానవిషయములతో బాఠకులను బీడింపఁగోరి వారు కలిసి రాక దూసికొని బ్రతికిపోయిరన్న కోపముచే వారి నభిశపించుట[1] యుక్తముగాదు.

ఇంకొక విచిత్రము. ప నవలాకర్తగాని ప్రధానముగఁ దన నవల బాగున్నదని చదువరులు మెచ్చుకొనఁగోరరు. ఈనవలాకర్త యాశయము వేఱు. పాఠకుల మెప్పుగా దీయనకుఁ గావలసినది; తాను నవలలో జెప్పినట్లు బాఠకు లాచరింపవలె నఁట!తాఁ జెప్పినట్లుఁ జేసినప్పుడే మన జాతి కభ్యుదయము కలుగునఁట[2]! ఇది ప్రచారకు లుపన్యసించుచుఁ గోరుకోరిక. ఒక రిద్దరు నవలాకర్త లిట్లు వ్రాసికొనుట యెటుఁ

---

1. "మఱి అచ్చుకావడానికి ఆపైన అయిదు సంవత్సరాలు పట్టింది దీనికంతా కారణము పాఠకులనుండి ప్రకాశకులకు ప్రోత్సాహము లేకపోవడమూ, ప్రకాశకులనుండి రచయితలకు ప్రోత్సాహము లేకపోవడమూను. ఇతరభాషాప్రాంతాలలో యిట్లా లేదుకాని మన ఆంధ్రజాతికే ఈ దుర్గతి పట్టుకొంది. పుస్తకాలుకొనిచదివే అలవాటు ఇకనైనా మన ఆంధ్రులు అలవరచుకోవాలి". 'స్వగతం'; "ఒకమాట"(1959).

2. "నా నవలను చదివి పాఠకులు బాగుందని మెచ్చుకుంటే నా కంత ఉత్సాహం వుండదు. దానిలో చెప్పినట్లు ఆచరిస్తే ఆఫికానందం కలుగుతుంది. దీనివల్ల వారికీ దేశానికీ అసలు మానవజాతికీ అభ్యుదయం కలుగుతుంది. 'ఆదర్శం'; 'ఒకమనవి', (1959) "దయచేసి కథలోపడి కొట్టుకపోకుండా సాంఘికసమస్యాపరిష్కారంవైపు దృష్టివహించితే సంఘానికి సేవచేసినవా రౌతారు" 'బాపం'; 'ఒకవిషయం'(1961).

గుదుము. కాని యది కళానుధ్యుక్తధర్మము గాదు[1]. నవలాగుణము లాకర్షించుచో నానందముకొఱకు విజ్ఞానవినోదములకొఱకును లోకులు నవలలు పఠింతురేగాని మతముపుచ్చుకొనుటకొఱకెవ్వరు పఠింతురు? అది తత్ప్రక్రియా పఠనప్రయోజనమని యెవ్వరనిరి?

ఈ నవలలోని యితివృత్తము భారతదేశములో 'సహాయనిరాకరణోద్యమ' మారంభించినది మొదలు సుమారు మనకు స్వరాజ్యముప్రాప్తించు మేరవఱకుఁ గొనసాగిన సాంఘికచరిత్ర. అస్పృశ్యతాపిశాచమునుగూర్చిన చర్చ లిందెక్కువ. మనకు స్వరాజ్యము లభించి విద్యాధికుల సంఖ్య యభివృద్ధిచెంది నాగరకత యెంతో పెంపొందినను మానవత్వము మాత్రము పెఱుగని కారణముగా నస్పృశ్యత నివారణము కాలేదనియు సాంఘికాసమత్వ మట్లే యున్నదనియు నవలాకర్త వాదము.

తన యుద్దేశముల నొకచక్కని చిక్కని పదకముతో సుందరమైన పాత్రసృష్టితో సన్నివేశచారువైన యితివృత్తమునుండి పాత్రోన్మీలనమును రూపొందించునట్టి కళా చాతుర్యముతో బ్రదర్శించుట నవలాకారుని నైపుణి. అట్లుగాక పట్టరాని యావేశమున నేలఁబారుధోరణిలో గళాహృదయమెఱుఁగక యుపన్యసించుకొనుచుపోవుటకు వేయి నవలలు వ్రాయనేల? ప్రజాస్వామ్య మేర్పడి ప్రచురణసంస్థలు, గ్రంథాలయములు, ననివార్యముగఁ గొన్ని ప్రతు లమ్ముడుపోవు సౌకర్యములును జెలిగినందువలని యుపచారమే గదా, యిది! కథాగమనముతో సాంఘికసమస్యలెన్నియేని జోడింపఁబడి యుండవచ్చును. విషయముతో వానిని ముడివేసి పాత్రపోషణాదికౌశలముచూపి నవలాకర్త చదువరుల నాకర్షించుట ధర్మము. కథకుఁ గళానైపుణ్యమునకు లెక్కసేయక సాంఘిక సమస్యా పరిష్కారమువైపునకే దృష్టిని నిగుడింపుమని రచయిత పాఠకులను గోరుట శిల్పధర్మమును ధిక్కరించుట.

---

1. "We do not write because we want to, we write because we must". Maugham, 'The Summing up'. P. 159-160. Thus, we see, according to Maugham that the only function of art, is to satisty the urge of creation in the artists. But again he says in the end that "The value of art is not beauty, but right action". 'The summing up' P. 207. This end of his argument seems to forget its beginning, for, if the only aim of art is to provide self-expression for the artist, how would this neccessarily result in leading men to right action in demanding from art a certificate to the effect that it must streng then our charcter and make it fitted for right action-[one wonders where Maugham himself would stand, if his works were to be judged by this standard]-is not Maugham going to an extreme diametrically opposed to that held by the Aesthetas of whom he is so contemptuous?

## అసమర్థుని జీవితయాత్ర 1

ఆంధ్రదేశములో సుప్రసిద్ధమైన వ్యావసాయికకుటుంబమున జన్మించి, మేధావంతు లనిపించుకొని గ్రామజీవితము లోతుపాతులను బాహ్యరంగముగఁ గల మనోజ్ఞములగు కథానికల రచించి పేరుగాంచిన శ్రీ త్రిపురనేని గోపీచందుగారు 'అసమర్థుని జీవితయాత్ర'వంటి[2] నవలలనుగూడ రచించుట మన యదృష్టము. ఈ నవలలోగూడ గ్రామీణమైన సుస్థిరస్థానిక పూర్వరంగమే శోభ గూర్చుచున్నది.

పరమాజ్ఞానికి బాధలే యుండవు. అతనికి బాధయని యొక్కటియు ననిపింపదు. అట్లే పరమజ్ఞానికిని. అన్నియుఁ దెలిసినవాఁ డెట్లో సమాజమునందు నెట్టుకొని పోఁగలఁడు. తెలిసియుఁ దెలియనివాఁ డటుసంపూర్ణముగ నజ్ఞుఁడును గాఁడు; ఇటు విజ్ఞుఁడును గాఁడు. అతఁడు పరమమూర్ఖుఁడు; అన్నియుఁ దెలియును; ఏమియుఁ దెలియవు. ఇట్టి మూర్ఖుఁడు జీవితముపట్ల నిదమిత్థ మనఁదగు నిర్ణయములేక పాడగును; అసమర్థుఁడని ప్రసిద్ధి కెక్కును; అసమర్థుఁడుగనే యస్తమించును. అతఁడు కాలానుగుణముగఁ దన యభిప్రాయమును మార్చుకొనఁజాలఁడు. దొడ్డ చలనమునఁ గాల మాతనికి నెదురొడ్డి ప్రతిఘటించును. ఒక్కటియుఁ గలసిరాదు; అన్నియు నెదురు తిరుగును. జీవితపు టావలియొడ్డు నాతఁడు చేరలేఁడు. దేహపదార్థములకుఁ దనలోని యాత్మవస్తువునకు సంఘర్ష మేర్పడును. దానితో జీవితమునం దొక సమన్వయమని కుదురదు. ఆతనికి వెట్టియెత్తును. ఆ వీటిఁడితనమునందే యాతఁ డంతము నొందుటయుఁ గలదు.ఇదియే 'యసమర్థుని జీవితయాత్ర'లోని యితివృత్తము.

ఈ నవల యొక యుత్కృష్టకళాసృష్టి. సీతారామారా వందులోని కథానాయకుఁడు. ఉన్నతశిఖరాగ్రమునుండి స్వచ్ఛమైన జలముతో భూమిమీఁదపడి మలినాతి మలినమై మురికికూపములోనికిఁ బ్రవహించు సెలయే రీతని జీవితము.

మరణశయ్యపైనుండి తండ్రి తమ వంశప్రతిష్ఠ నిలఁబెట్టుమని సీతారామారావు నడుగును. ఆ పేరుప్రతిష్ఠలకై ప్రాఁకులాడి, తండ్రి కిచ్చినమాట చెల్లించుకొని శ్రీరామచంద్రునివలె నిభుషలో దానును యశస్విగావలె ననిచేసిన ప్రయత్నములలోనే యాతని యసమర్థత ధ్రువపడినది.

ఇతఁ డెందులకుఁ గొఱమాలిన వ్యర్థుఁడుకాఁడు; ఆస్తిపాస్తులు, చదువుసంధ్యలు గలవ్యక్తి. ఈతనిది పెద్దవంశము3. తండ్రినిమించినచేయి కావలెనని యాశయము. అంతే

1. This is influenced by Dostoievskian gloom, if not by 'The Idiot'.
2. వీరి రెండవనవల 'పరివర్తనం'. (దేశికవితామండలిప్రచురణము – విజయవాడ–2).
3. 'మా రాజుల వంశం' అని నవలాకర్త.

కాదు; చిన్నతనములో నతనికి మహోన్నతాశయము లుండెడివి. అదర్శప్రాయమైన జీవయాత్రఁ గడపవలెనని యాతడు వ్వేళ్ళు లూరెను. కడమవారికంటె నేదో విశిష్టత సాధింపవలె ననియు నేదో నారి కతీతుఁడై తా నుండవలె ననియు సీతారామారావు కాంక్ష. దానికిఁగా నాతఁ డెప్పుడు నేదో యాలోచించుచు నుండురు.

కాని తండ్రి యాశయములకును బరువుప్రతిష్ఠలకును, దన యున్నతాశయముల కును నెట్టి యంతుపొంతు లగపడవు. కులప్రతిష్ఠను గూలిపోనీక నిలఁబెట్టవలెననియుఁ దండ్రియాశయములను గౌరవింపవలెననియు, దానికనియు దీనికనియు నీతఁ డాస్తిని హారతికర్పూరమువలె హరింపఁజేసినాఁడు. ఆదిలో బెం డిలిచేసికొనరా దనుకొనెను. వివాహము చేసికొనుట, సంతానము నాపాదించుట, పిదప దాని పోషణభారము వహిం చుట మున్నగునవి యాతనికి హేళనగ నుండెడివి.

అయ్యును గొన్నాళ్ళకు గురుకులములో నొక యువతిని బ్రేమించుటతో నాత నికిఁ బెండ్లికోరిక కలిగినది. పెండ్లి, దానివెంట పిల్లలు, తదుపరిని గర్భస్రావములు, సాగిపోయినవి. ఏ వేవి యాతని కసహ్యములో వేనిని వేని నాతఁడు చేయవల దను కొనినాఁడో వాని వాని నెల్ల సీతారామారావునకుఁ జేయక తప్పలేదు.

కుటుంబరక్షణార్థ మాతని కుద్యోగముచేయవలసి వచ్చెను; పిల్లనిచ్చిన మామ రక్షకభటశాఖోద్యోగి. మన కథానాయకున కొక వ్యాపారసంస్థలో మామ యుద్యోగ మిప్పించినాఁడు. అది గిట్టలేదు. తమ సంస్థకు యజమానుఁడు తన కూఁతు ర త్తవారిం టికిఁ బోవుచున్నందున మన సీతారామారావును బండి తెమ్మనినాఁడట! ఇతనికిఁ గోపము వచ్చెను; యజమానునితో దగవులాటపర్యంతము కథ ప్రాఁకినది. అట్టివాని యొద్ద నుద్యోగమిప్పించినాఁడుల కాతనికిఁ దన మామపైఁ గూడఁ గోపము. అధికారి యుద్యోగమునుండి తీసివేయఁగనే సీతారామారావునకుఁ బెండ్లము, బిడ్డలు, సంసార మునందుఁ జిరాకు; భార్యపైఁ గోపము, భార్యాసంతానములను దిట్టుట, కొట్ట బోవుట, కొట్టుట, యేదియుఁ గానిచో బిఱ్ఱబిగిసికొని మునుఁగుతన్ని పరుండుట వంటివానితో జీవిత మంతయుఁ బచ్చిపుండుగా నుండును.

అసమర్థునకుఁ జికా కెక్కువ. అది కూడ దన్నపుడు పుట్టునదే కోపము. ఎదుట నున్నవా రెల్లరును దన్ను హేళనచేయుచున్న ట్లాతని కగపడుదురు. కట్టుకొన్నభార్య కూడఁ దన్నవహేళన చేయుచున్నట్లే యాతనికిఁ దోఁచును. సొంతకూఁతురుకూడఁ దన్ను లక్ష్యపెట్టనట్లు గోచరించును. అతఁడు భార్యను కసరుకొనువాఁడు. ఆమె పట్టించు కొనదు. ఇతఁడు చాటునకుఁ బోయి పశ్చాత్తాపపడును.

లోకముతోబాటు సీతారామయ్య తానును బ్రేమఁ జూపఁబోవును; భార్య పలు కదు. అతఁ "డీ కూరబాగున్న దే!" యనుచుండును. ఆమె యులుకదు. "ప్రతిదిన మిట్లేల చేయఁగూడ"దనును. "ఎప్పటివలెనే చేసితినే!" యని మితభాషిణియగును భార్య.

మన నాయకున కామెనుండి తా ననుకొన్న సమాధానము రాదు. అందుచే దిరిగి కోపము; మఱల( గసరుకొనుట. భార్య పలుకదు. అత(డు తిట్టును. ఆమె నోరుమెదపదు. తన తిట్టులకు భార్య విలువనిచ్చుటలేదని యాత(డు బాధపడెడివా(డు. మఱియు దూషించెడివా(డు. భోజనముచేయక యలిగి లేచిపోవుట యాచార మయ్యెను. భార్య బతిమాలవలె నని యాతని కోరిక. కోపముగ నున్నవానిని బలుకరింపరాదని యామె యభిప్రాయము. అతనికి( గోప ముద్దీపించును. శివమెత్తి యామె కొక చపేటము ప్రసాదించువా(డు. అయిన నామెలో సంచలనము కలుగదు.

సీతారామయ్యలో బరివర్తనము కలుగును. యశఃప్రార్థియై, యాస్తిపోగొట్టుకొని, బ్రతుకుతెరవులేక, యిల్లుగడవక, మనస్థైమిత్యమును గోల్పోయి చేతకాక, పెండ్లము బిడ్డలను హింసించు చున్నా(డన్నది, లోకము. అతనికి నిజముగ వెఱ్ఱిపట్టినది. ఆతని లోని జడత్వ చేతనత్వములకు నడుమను దేహపదార్థాత్మవస్తువులకు నడుమను నిత్యనిర్విరామసంఘర్షము ప్రారంభించెను. తద్భిన్నశక్తుల ఊాఊాపిడి నడుమ నీ వ్యక్తి యుక్కిరిబిక్కిరి యగుచున్నా(డు. అదియే యాతని వైక్లబ్యము.

మనోవైకల్యమునం దీ లోకములోని ప్రతివిషయము నాతని ప్రాణమునకు విద్దూరముగ( గనిపించును. అత(డు వెఱ్ఱియెత్తి వీథులవెంట( దిరుగుచు బీదలసాదల ననాదరముచేయువారి నధిక్షేపించుటకై వెఱ్ఱిచేష్టలు చేసెడివా(డు; తా ననుకొనినది యనుకొనినట్లు బహిరంగముగ( బదిమందిలో జెప్పినందుల కాతనికి దేహశుద్ధి యైనది. ఆ దెబ్బలతో బైపై వెఱ్ఱి పలాయన మయ్యెను. స్థూలద్రవ్యమునకు నంతరాత్మకు నారంభించిన ద్వంద్వయుద్ధ మప్పుడు మఱియు( దీవ్రతరరూపమును దాల్చినది. అందాత్మకే విజయము. పదార్థమునకు( బరాజయము; అన(గా నది రూపాంతరము(ను దాల్చెను. మన యసమర్థున కది యంతశయ్య.

మానవున కొక్క తెలివియుండుటయే చాలదు; ఒక్క విజ్ఞానమే చాలదు; దాని నుపయోగించుకొను పద్ధతులుగూడ( దెలియవలెను. ఉత్తమసంస్కార ముండిననేగాని వాని తెలివితేటలు, విజ్ఞానవివేకములు, చదువుసంధ్యలు సద్వినియోగమునకు రావు. సీతారామయ్యకు( జదు వున్నది: జ్ఞానము, సంపదయు నున్నవి. వంశము పేరుపొందినవంశము. ఏమి ప్రయోజనము? వానిని వినియోగించు విధాన మెఱు(గ(డు. ఉత్తమసంస్కారము తక్కువ. ఎంతవిజ్ఞానముండియు నాతనికి( దోడుపడలేదు. తనకు( గల గుణమొక్కటియు నాతనికి సాయముచేయలేకపోయినది. భార్యకు బిడ్డకే యాత(డుపయోగపడ(జాల(డయ్యెను; భారముకూడ నైనా(డు.

ఈ నవలద్వారమున శ్రీ గోపీచందుగా రనేకవిధములైన వ్యక్తులను బరిచయముచేసిరి; ఒక్క సీతారామయ్యయందే పెక్కు తెఱ(గులగు వ్యక్తిత్వములను జిత్రించినారు. ఎల్లవేళల( గాకపోయిన నేదోయొక సమయమునందు సీతారామయ్య

వలెనే మనలో నందఱును బ్రవర్తింతురు. ఆతనివలె నాలోచింపకపోవచ్చును. మన
రహస్యముల నెఱిఁగిన ట్లీ నవల మాట్లాడఁగలదు. అదియే యిందలి ప్రత్యేకాకర్షణము.
దీనిని జదివినంతసేపు మన మొక్కొక్క సమయములో ననుకొనుచుండు విషయములే
స్ఫురించును. మనలో నాకస్మికముగ నొక గొప్పయుద్యోగి కావలెనని యొకరు; హఠా
త్తుగ లక్షాధికారి కావలెనని యింకొకరు; ఏ పనిగాని, యే ప్రయత్నముగాని చేయక యే
యొక లక్షరూప్యముల మూట, యావశ్యక మగుచో, మార్గమునఁబోవుచుండఁగఁ దన
కాలికిఁ దగిలిన నెంతబాగుండు ననుకొనెడివా రెందఱు లేరు?

ఒక పురుషుఁ డొక స్త్రీని గామించును. కాని యామెను బలుకరించుటకు
భయము; తాను నిద్రలేచుసరికి స్వయముగ నామెయేవచ్చి పరిచర్యలు చేయుచున్నచో
నెంత బాగుండునని దివాస్వప్నములుగాంచుట యాతని కలవాటు. ఇది మానవప్రకృ
తిలోని దౌర్బల్యము. ఇదియే యసమర్థత; చేతగానితనము. అది తా ననుకొని కలలు
గన్నయట్లు జరుగదు. దానితో నాలోచనపై నాలోచనలు; నిరాశ; చికాకు; చీకాకు;
జీవితముపై విరక్తియు. తన్నుఁదా నసమర్థునిగా నిరూపించుకొనుటకు గావలసిన
లక్షణము లివి.

‘అసమర్థునిజీవితయాత్ర’లో మన స్తత్త్వచిత్రణ మద్భుతముగ నున్నదనుట దాని
సారాంశము నొక్కమాటలో జెప్పుట. అసలితివృత్తమే ప్రధానముగ నాయకుని
మనఃప్రవృత్తి నిదానము. ఈ నవలారచయిత వేలాదిజనులలోనికి సూటిగ దూసికొని
పోయిరి. సీతారామయ్య యనఁగా, నొక్కవ్యక్తికాఁడు; పెక్కండ్ర సమాహారరూ
పము; వారివారి లక్షణముల నుచితరీతిని సంపుటీకరించి రచయిత యాయత్తపఱిచిన
రసగుళిక, నీరసుఁడగు సీతారామయ్య. ఈ నవలలోని ప్రతివాక్యము ప్రతిదృశ్యము
మనలో నెవరికో యొక్కరికి బాకువలె గుండెలకుఁ దాఁకుచునే యుండును. ‘అసమ
ర్థునిజీవితయాత్ర’ మానవసృష్టికి లోఁతైన నిర్వచనము; గంభీరమైన వ్యాఖ్యానము.

## చివరకు మిగిలేది [1]

ఇది ప్రసిద్ధనవలాకర్త శ్రీ బుచ్చిబాబు[2] గారి విశిష్టనవల. ఇటు దీనిని సాధా
రణపాఠకు లంతగా మెచ్చుకొనలేరు. దానికిఁ గారణము లందలి శిల్పప్రౌఢిమ;
చైతన్యస్రవంతి[3] యననేమో యించుకయైనఁ దెలియక పోవుట; ప్రతివిషయమునను
వాచ్యత నపేక్షించుట వంటివి పెక్కులు. అటు మహావిజ్ఞుల నీ నవల యంతగఁ దల

1. దీనికి సంక్షిప్తరూప మొకటి, దక్షిణభాషాపుస్తకసంస్థసహకారమునఁ బ్రకటితమై యాదర్శగ్రంథమండలి[విజయవాడ]వారిచే బ్రచురింపఁబడినది, కలదు. [మే 1957].
2. అసలుపేరు సుబ్బారావు.
3. శ్రీ బుచ్చిబాబుగారు చైతన్యస్రవంతి (stream of conscience) యని యొక కథానిక వ్రాసిరి. అది చదువఁదగినది.

యూహింప లేదు. దానికిఁగూడఁ గారణములను సంగ్రహింపవచ్చును. ఉచ్చస్థాయికిఁ జెందిన పరమవిజ్ఞానసంపన్నుఁడైన హేతువుచే రచయితనుండి కొన్ని తావులయం దింత కంటె సత్యమైన విషయములు, శ్రావ్యమైనభాషయు నపేక్షించినదోషము ప్రముఖమైనది. ఇటు పామరులుగాని యటు పండితులుగాని తమ దృక్కోణమునుండి పరామర్శించి యభినందింపఁగలుగుట, సానుభూతిఁజూపఁగలుగుట. ఈ నవలలో నాయకుని నీతి నియమములనుగూర్చి తీక్ష్ణతఁ జూపుటకు వీలున్నది. కాని యది యతివాదమై పోవును. ముందు మితవాదము నవలంబించుట యుక్తము.

ఇందలి నాయకుఁడు దయానిధి. నేఁటి సామాజిక పరిస్థితులనుబట్టి జీవితమును నెట్టుకొని పోఁగలవాఁ డిట్టివాఁడని రచయిత యుద్దేశించి యుండవచ్చును. సర్వథా సాత్త్విక ప్రవృత్తు లుండుట లోకమున దుర్ఘటము. ఇంచుక కొట్టిమిట్టాడు రజస్సంపన్నత గలిగి పరిస్థితుల నదుపులోనికిఁ దేఁగలమని ప్రజ్ఞకుఁగొట్టుమిట్టిపడు యువకు లుందురు.

ఆదర్శకవ్యక్తిని జేయఁబోవఁగ దయానిధి యయోమయవ్యక్తి యైనాఁడని యా యువకు లనుకొనుటయం దాశ్చర్యము లేదు. వారి కాతఁడు తన మనస్సులో నున్న యాదర్శమును విప్పి చెప్పవలెను; జీవితవిధానముచే వ్యాఖ్యానించిచూపిన నది వారికి దెలియుట కష్టము. వీరే వాచ్యత నపేక్షించు నప్రౌఢులు.వారిది తప్పులేదు. భాష వారికందును; భావములు శిల్పచాతురియు వారి కందుబాటులో నుండవాయెను! అది సగ మూఁకలితీరినవారి సదమదము.

ఇట్టివారు దయానిధి పాత్రౌచిత్యముతో సమాధానపడఁజాలరు. చూడఁగా నతఁ డుద్యోగ పుఁ బాయలోనుండి వచ్చినవాఁడు; వైద్యవిద్యలో బట్టభద్రుఁడు; వివేకి. అయ్యు నతని తెలివితేటలు పనికిరావు. సంఘమెన్నో ప్రతిబంధకములుపెట్టి యాతని నపార్థము చేసికొన్నది. కాని సంఘ మంతటిగ్రుడ్డిది కాదే! వ్యాధిగ్రస్తులకు చికిత్సచేయుటలో నిపుణుఁడైనప్పు డీతనిని సంఘము కోల్పోవునా? యని విమర్శింప వచ్చును. రచయిత నిరూపింపఁదలఁచినది యదియేకద ః సంఘమున సదసత్తులు రెండు నుండవచ్చును. సదభిప్రాయములుగలవారిమాట యే నేఁడు నెగ్గుచున్న దను కొనుదేవతల కొక నమస్కారము. వారు భూలోకమున స్వర్గముచూడఁగలవారు. అట్టి వ్యక్తులు తక్కువ; అట్టివారుకండనియే మన రచయిత సందేశము. గుణమునకు నైపుణ్యమునకుఁ బ్రజ్ఞకును సమాజ జీవనములో నేఁ డుచితస్థాన మున్నదనుకొనువారు రత్నింపిదను మనము పోనొట్టుకొనుట నెఱుఁగరు; లేదా యాపోగొట్టుకొనుటయందు నిశ్చింతులన్నది నిశ్చయమానము. మిక్కిలి ధనము సంపాదించినవ్యక్తి పోనుపోను జిక్కులలో బడఁగా నాదాయము తక్కువయైపోవుట, సమాజము కేవలము గుణలుబ్ధ మనుకొనువారి దృష్టిలో వాస్తవికతకు దూరము.

దయానిధి కోమలియొద్దకుఁ బోవువాఁడు; కాని విషయముల నాశించుకోవఁ జాలఁడు. అమృత మనినచో నాతని కెంతో యిష్టము. అగుచో బ్రయోజన మేమున్నది? మాత్రు దేవస్మరణ మాతనిని గదలించివేయును. ఆమె తలఁపుతో నాతని మనస్సు వెన్నవలెఁ గరఁగిపోయెడిది. అతనికి మామగారితో వ్యక్తిగతముగ భేదాభిప్రాయములున్నవి. ఉన్నను భార్య నిందిర నాఁథముగ వదలివేసి తుదిలో బ్రాణాపాయస్థితియం దుండఁగా నామెను చూడఁ బోవుటలోగల యౌచిత్యమును శంకించిన వా రున్నారు. ఎంతసాధనపై నతనికి దనతో దాను సమాధానపడఁగల శక్తిసామర్థ్యము లలవడినవో సానుభూతితో బరిశీలించినవారి కట్టిశంకలురావు.

అమృతమన్నచో, నాతనికిఁ జాలగుటి; ప్రేమ ను గూడ. అమృతము జగన్నాథము లిరువురును గథాసందర్భమునకు మంచి పురి కలిపించినారు. నారయ్యపాత్ర చిత్రణము సర్వజనాదరణము నొందినది. కోమలిది జానపద జీవిక.[1] ఆమె చిన్నపాయ లోనుండి వచ్చిన పడుచు. దానికిఁదోడు లోకానుభవశూన్యత. ఎంత సరిపుచ్చుకొంద మన్నను నిది కావ్యము గాని లోకము గాదు. కావ్యమును కేవలము లోకము దృష్టితో నిర్మింపఁజూచుటవలన గోమలిమాటలలోని వెకిలితనమును సభ్యమైనదని పామరులుగూడ నంగీకరింపనంతటి యశ్రద్ధ వాటిల్లినది. అది వాస్తవికత్వ యథాతథత్వముల నగ్న రూపము. మూఢాచారనిరతిఖండనమున కనేకవిధానములున్నవి; విషయములునున్నవి. జుగుప్సాకరములగువానినే[3] ప్రసంగింప నక్కఱలేదు.

అగుచో బూర్వసాహిత్యమున నిట్టి ప్రసక్తి లేదా యనవచ్చును. అది దోష మగుచో రెండుదోషము లొక గుణమగుననెడి లెక్కతప్పు. అది గుణమగుచో నిచ్చట నా విషయుచర్చనుగూర్చికంటెఁ బదప్రయోగములను[2] గూర్చిన పట్టింపునకు సమాధానించిన ట్లగుటలేదు. రజస్వల, ఋతుమతి, ఏకవస్త్రవంటి పూర్వులపదము లలో గొంత గోపన మున్నది. ఏమాటయైననేమి యన్నచో నిఁకఁజెప్పఁగలదిలేదుశి. పదౌచితి నష్టవిధౌచిత్యములనుండి తుడిచివేయుట మేలు.

ఇంతటిమాత్రమేకాదు; కొన్ని సంవాదములు చిలిపితనము గలవి. మఱి కొన్ని మొఅటు సంభాషణములు. ఒకచోటఁ బచ్చిశృంగారముకూడ నగపడును. సుశీలచే నింక నందముగఁ దిట్టింప[4]వీలున్నది. మాటలధోరణి సహజముకా దనలేము.

---

1. స్త్రీ బహిష్ఠ యగుట మొదలైనవి.
2. "బైట వుండటం......" మొదలైన వాని విమర్శన.
3. It is to forget that words are the very rascals,
4. 'పెంటముండ' వంటి తిట్టులు వాస్తవికములైనను సభ్యములు కావు. ఒక్క చలము గారి విషయముననే వీనికి సర్వలోక సమ్మతి. మిగత వెవ్వరి కర్హమగును? అంతటి రాగద్వేషాగ్నులు రగులువారి కెవ్వరికోగదా!

అయినను నోరే చేయికాదు గదా! నోటిమాటకుఁ జేతివ్రాఁతకు సాన్నిహిత్యము సాధించుట యనుకొని కాఁబోలు నోటితో జేయిచేసికొన్నది మన సుశీల.

మాటలకు మర్యాదయేమిటి? ఇంతకంటె నసభ్యములు వ్రాసినవారు లేరా? లోకములోని మాటలనుగ మాటలు గ్రంథములోని కెక్కించినవారు లేరా? ప్రజలచేతఁ బ్రజలకొఱకు నడపింపఁబడు ప్రజాపరిపాలనములో బాలశిక్షలే మహాభారతములుగదా! రచయితల కిష్టానుసారము రచించు స్వామ్యము లేదా? ఉన్నది. కాని, ప్రాజ్ఞదుర్జనులకు బుచ్చిబాబుగారిపై గంపెడంత యాశ. అందువలన నింతయంతస్తాపము. నేఁటి సాటి రచయితలలో వారికిఁగల సంస్కార మెవ్వరికి లేదు; శిల్పమార్గము నాన్యతోగమ్యము. బ్రహ్మసృష్టికి వంకలుదిద్దు కవిసృష్టిలో సర్వాంగసుందరికి శోఫ సహింతుమా?

ఈ నవలాకర్త పూర్వాచారవ్యవహారముల ఖండనకుఁ బ్రయత్నించిరి. ప్రేమకు రసికతకు సంబంధించినంతవఱకుఁ గొన్ని సంభాషణలలో నిందుఁ గటుత్వమును బరిహరించి సరసత నాపాదింప వీలున్నది. దయానిధి, యమృతము నర్ధరాత్రివేళ నేకాంతముగఁ గలసికొన్నపుడు వర్ణింపఁబడిన సన్నివేశము చదువుట కింపుగ నుండిన నుండవచ్చును. కాని చదువుట ముగిసినవెంటనే మనస్సు నొవ్వకపోదు.

నవలలో రచయిత రాజకీయములను లాగుకొనివచ్చిరి. వివాహసమయములో స్వాములవారినిగూడఁదీసికొనివచ్చుట వంటి వన్నియు హేళనకొఱకై యుండఁగలవు. ఆచారవ్యవహారములు, తత్త్వవిషయములును యథోచిత సన్నివేశములలో జర్చింపఁబడ వలసినవి. మూలనున్న ముసలమ్మను దీసికొనిరావలసిన యగత్యమేమియు నంతగ నగపడదు. ఇందిర మరణదృశ్యముమాత్రము సజీవచిత్రణము. అది యెంత గంభీరమో యంత పరిపూర్ణము, దయనీయము, నుజ్జ్వలమును. నవలను సమాప్తము చేసిన చదువరికి దానిలో బ్రహ్మసమాజప్రభావప్రేరితమైన యొకనాఁటి వంగసాహితీ ధోరణీసారణులు సయ్యాటించు స్వరములు వినిపింపఁగలవు.

దయానిధి యేమి సాధించినాఁడో తెలియనివారు పెక్కురు. తా నేమి సాధింపవలెనని యనుకొనెనో యతనికే తెలియదని తమ్మోదార్చుకొన్నవా రిందులో జాలమంది. 'సిరికింజెప్పక' బయలుదేరిన దయానిధి కథలో దిరిగి తిరిగి బయలుదేరిన చోటికేవచ్చుట సాధారణపాఠకుల కర్థముగాక వేధించును. జీవితములో బ్రయత్నముల వ్యర్థత్వము నెల్లరు నంత చులకనగ నంగీకరింపరు. ఏదో సాధించితి ననుకొనుట యొక సంతుష్టి. ఆత్మవంచన జగద్వంచనల నంతగ నేర్వని దయానిధి తన శక్తినెఱిఁగి తన యదృష్టముతో సమాధానపడినను లోకము దానిని నిస్పృహగ నిరాశగ నపార్థము చేసికొనును ఎవ్వరిపైననో కోపించి నాయకుఁడు తిరిగి కోమలితో నింకొక యాత్రపై వెడలిపోయినాఁడనియే వాచ్యార్థమును స్వీకరించులోకమున కెంత పలుచని

మాటలతో జెప్పినను భావప్రౌఢిమయు శిల్పచాతుర్యమును దెలియవు. ఇంచుక చిక్కనై శ్రుతి పేశలమైన చక్కని భాషలో జెప్పియున్న యెడలఁ గ్లేశపడక ప్రౌఢులైన నీ నవల నభినందించితీరెడివారు.

ఇది యాంధ్రనవలాసాహిత్యములో నూతనమైన యొక యాలోచనామార్గమును, నవలా శిల్పమును బ్రవేశపెట్టిన నవలయని గుణగ్రహణపారీణులకు విదితము. ఇందులోని నాయకుఁడు దయానిధి యేకాంతముగా నుండి మనుష్యులెల్లరిమధ్య మనజాలని విచిత్రవ్యక్తి. వైద్యశాస్త్రవిద్యార్థిగా జీవితము నారంభించిన యాతనికి వివిధమనస్తత్త్వములతో సన్నికర్షణచే జీవితసమస్యల మూల్యమును గుఱించి గవేషణచేయుటకుఁ బ్రేరణకలిగెను. అతనికి బుస్తకజ్ఞానమే గాని పుస్తకేతరజ్ఞానము శూన్యము. జీవితఁపు టంతరార్థ మాతని కాకళింత కాదు.

జీవించుటకు బదులుగ జీవితమునుగూర్చి యాలోచించెడివాఁడు దయానిధి; తర్కవితర్కములచే సాధించిన సిద్ధాంతములతో దన్నుఁదా బంధిచుకొన్న వాఁడు; జీవితములో దాఁగసిలిన విషాదము ననుభవించుటకుఁగాను సహజలక్షణములను గోలుపోయినవాఁడు. పరిస్థితుల నెదుర్కొనుట కితనికి గుండెనిబ్బరము చాల లేదు; మానసిక బలము కుదురుకొనలేదు; వానిని దిరస్కరించుటకుఁ గావలసిన తాత్త్వికదృష్టి నెలకొనలేదు; స్వాభావికవిషయములకు, సహజప్రవృత్తులకు గూడ నపార్థములు పతించుకొని వానిని జయింపవలెననెడి ప్రయత్నములలోనే యావజ్జీవితమును నింపివేసికొనిన యమాయికుఁడు దయానిధి. ఈ హేతువువలననే సంఘజీవిగా నందఱితో గలసిమెలసి యాతఁ డుండలేకపోయెను. అన్వేషణాసక్తత్వ మాతని జీవలక్షణము.

తనభార్య తన్ను విడచి చంద్రన్నతో వెడలిపోయినరాత్రియే పదిమందిని బ్రోగుచేసి చెఱువుగట్టునఁ జెడుగుడియాడి తెలవారుకడ వేడినీళ్ళస్నానమునకై చంద్రన్న యింటికే వెళ్ళిన నారయ్య యెన్నికష్టములు సంభవించినను నవ్వునట్టిశక్తి నింకను బోగొట్టుకొననివ్యక్తి[1]. అతని జీవితములో గష్టసుఖములనుచు విశ్లేషింపఁదగిన యనుభవములేవియుఁ గొన్ని లేవు.

జీవితయాత్ర నారంభించియు నారంభింపకమునుపే జీవితములోని విషాదమును బసిగట్టి నిరీహాదృష్టి నలవరచికొనిన జగన్నాథమును, నాగరకతకు సుదూరముగ బ్రతికినకోమలియు, నమృతహృదయయగు నమృతమును, నీ నవలలో మఱపురానివ్యక్తులు. ఎల్లకాలము గాకున్నను జదివినపిదపఁ గొంతకాలమైన మనలను వెన్నాడుటనుబట్టియే గదా; పాత్రల సజీవత్వ నిర్జీవత్వములు నిర్ణయింపఁబడుట!

---

1. 'చివరకు మిగిలేది' పుట 7—సంక్షిప్త ప్రథమ ముద్రణము. (మే—1957).

ఈ నవలలో గథావస్తువునకు విశిష్టతయుఁ బ్రయోజనమును జాలఁతక్కువ. ప్రాథమికదశయందున్న పాఠకులకుఁ గథాస్థౌల్యము ప్రధానము. కాని శిల్పమర్మముల నపేక్షించు ప్రౌఢుల కది ముఖ్యముకాదు. చైతన్యస్రవంతిమార్గమున సాగిన యీ నవలావసానమునందుఁ బునశ్చరణాత్మకముగ నాయకుఁడు యావత్కథను దలక్రిందుగఁ బండ్రెండుఘట్టములలో విభజించి పదిపంక్తులలో స్మరించుకొనును. ఈ సింహావలోకనము, జీవిత మెప్పుడు నొక చక్రపరిభ్రమణమువలె గుండ్రని పరిధిగలదియే యని చూపి చెప్పుట కాదు. కాని కొందఱివిషయమునకైన జీవిత మొకవృత్తము; కల్పనకంటె నద్భుతముగొలుపు యథార్థవిషయము. అందుచే నట్టి పరిసమాప్తి నవల కొకశిల్పవిశిష్టత నమ్చును. అది సార్వత్రికము గాకపోయినను దుర్ఘటమును గాదు.

కథకుఁ బ్రాముఖ్యము లేకపోఁగా నిఁకఁ గేవలము శిల్పధర్మము నారాధించుటకా? యీ నవలను జదువుదుమని కొంద ఱనవచ్చును. మానవజీవితమునకు సంబంధించినట్టి భౌతికమానసికాధ్యాత్మికసమస్యలను వివరించి చర్చించు ప్రకాశమైన యాలోచన లీ నవలకు నవ్యాతినవ్యమగు మూల్యము నాపాదించి సాధించిపెట్టినవి.1

బృహత్ప్రణాళిబ్బంహితమైన సాంద్రకథగల నవలావిశేషములనే యభినందించు మన తెలుఁగు వారికిఁ గ్రిక్కిఱిసిన కథయందుకంటె దానిని జెప్పువిధానమునందు రంజన మున్నదని నేర్పినవాఁ డీ నవలాకర్త. సజీవత్వము, రససమంచితత్వము, హితకారకత్వము, లోకవృత్తప్రదర్శకత్వమును గల యుత్తమాంధ్రనవలాసాహితీస్రవంతిలో నిది యొక నూతనచైతన్యధార. కథాకల్పనయందును బాత్రలనిర్మాణమందును నాదర్శముల వ్యక్తీకరణమునందును వాతావరణసృజనమునందును నీ నవల ప్రత్యేకతఁగన్నది.

ఉన్నతాదర్శములకును గఠోరానుష్ఠానమునకును సముచితసంగ్రామము సాగుచుండును. ఈ సముదాయముయొక్క రంగభూమియే మానవజీవితము. వ్యక్తిత్వమన్నది యేమాత్రముగల మానవుఁడైనను గొన్ని యాదర్శములతో జీవితయాత్ర నారంభించును; బాల్యమునుండి తన భావిజీవితమునుగుఱించి యేవేవో యాలోచనలు చేసికొని యెన్నెన్నో స్వాప్నికసౌధముల నమాయికముగ నప్రయత్నముగ నిర్మించుకొని జీవితరంగములోనికి దుముకుచుండును. ఆ కలలుగను దినములలో దన యాశయసిద్ధికిఁ దానే సాధకుఁడ ననుకొనుటయు సైజము.

కాని సమాజము, లోకమునననవి యావ్యక్తి నంత యాప్యాయముతో నాహ్వానింపవు. అందు నిరనురోధప్రపంచుఁడు, నిర్ఘృణసమాజుఁడు నగును. దుఃఖబహుళము భూరినిర్దయాసంతరమునైన యా లోకమున నిష్ఠురపరిస్థితులు, నిష్కారుణికసమస్యలు నత

---

2, 'Chivariki (raku) migilethi' (di) is a great new effort in the realm of the Telugu novel of which any writer can be proud" 'Triveni' — Vol. XXIII No, 2, Page 112, Lines 34-35, (Oct, 1958).

నిని దారసిల్లి పరీక్షింపఁగలవు. అతని యాదర్శజీవితనవన విధ్వంసమునకై మానవరూప దానవు లెల్లరు నొక్కుమ్మడిగఁ గుమ్మకు చేయుచున్నా రనిపించును. అతని జీవితనౌక గమ్యస్థానమును జేరుటకుముం దెన్నో పాషాణప్రతిబంధకములు. జలావర్తములు, ప్రళయఝంఝలు వంటివానితో సమవేత మగుచున్నది. అట్లు గమ్యమును జేరలేని జీవితనావ లెన్నియో యుండును. కొన్ని చేరినను వాని తెరచాపలు చినిఁగిపోగలవు. మొత్తముమీఁదఁ జేరనినౌకలే యధికము. గమ్యముచేరుట యొకటి; చేర ప్రయత్నించుట యింకొకటి. చేరలేనివి ప్రయత్నింపనేలే దనలేము. చేరుకొన్న కొలదిపాటి వానిని గథలలోఁజిత్రించి, చేరుకొనని వానిని విస్మరించుట, సాధనకు విలువయేలే దనుట; అసలే యదృష్టహీనుల నవహేళించుట.

నెరవేరని యాదర్శములేల ? పోనిమ్మని మానవుఁ డీపవాదర్శమును లేక కేవలము హృదయవిరహితయంత్రమువలెఁ బ్రయాణము సాగింపఁగలేఁడు; దైవదత్తమైన బుద్ధి, హృదయము నున్నంతవఱ కాతఁడు యథాశక్తితో నాదర్శసాధనకై యత్నించును. అట్టివాని నాలోచనాదశయందుకంటె ననుభవదశలలో నాపదలుచుట్టుముట్టును. నడచునాఁడే పడును; వాని కాళ్ళకే ఱాళ్ళుతాకుఁడు; ఆ పడుచులేనుచుండుటలో నొక యానంద మున్నవాని కున్నది. ఒక యదృశ్యశత్రువుతో జేయు మల్లయుద్ధోల్లాసమువంటి దది. సుఖజీవిత మతనికి దూరము. నిత్యోపాస్తియు, నిరంతరశివరాత్రి జాగర్యము నాతని వంతు. ఆదర్శముల నూహించుకొనుట యౌవనధర్మము. అపారజీవితపారావారములోఁ దీరముచేరలేనివారు నిరాశోపహతు లగుటయు ననివార్యమగుఁ బర్యవసానములలో నొకటి. వీరిలో సాధనమాత్ర సంతుష్టులగువారు కొందఱు. ఏవంవిధజీవితమును గథావస్తువుగ వరించి శ్రీ బుచ్చిబాబుగారు రససిద్ధులనిపించుకొనిరి.

మానవుని బరీక్షించునపు డాతఁడు సాధించినదేమి ? ఏయే విజయములు పొందెను ? సంఘమున కెట్టి సాహాయ్యమును సుఖమును సమకూర్చెనని లెక్కలుకట్టుట యంత యోగ్యము కాదు. అది కేవలము శల్యపరీక్ష. ఎల్లరిని విజయము వరింపదని యెఱుఁగుదుము. ఆతని యాదర్శము లేమి ? తత్సిద్ధి కాతనిసాధనము లెట్టివి ? ఏయే ప్రతిఘటనశక్తుల నాత డు వశపఱచుకొనవలసివచ్చెను ? ఎంత త్యాగము చేసినాఁడు ? తన ధనము సంతోషము నెంతమేరవఱకుఁ గోల్పోయినాఁడు ? ఇట్టి కొలగఱ్ఱలతో నట్టివారిని బరీక్షించుట యుక్తము. మన యాశలు వేఱు; అదృష్టములు వేఱు. ఆశయసిద్ధులమధ్య సమన్వయమే మన జీవితసర్వస్వము. మహామహు లనేకు లనుకొన్న వానినెల్ల సాధింపలేకపోయిరి. అట్లని వారిని ద్రోసిపుచ్చము. వారి యచంచలవిశ్వాసమును, దీక్షను, గృషిని, త్యాగమును బ్రశంసింతుము. వారు ప్రజానీకము నెంత యుత్తేజపఱచిరి ? ఎంతగ నుద్బోధించిరి ? అని పరిశీలించి వారిశ్రేష్ఠతను నిరూపించుట మన విధి. అపజయముల సింహాసనముమీఁదనే మానవుని విజయయశము ప్రతి

ష్టింపఁబడును. వారు షట్చక్రవర్తులైననేమి ? పొందిన సుఖమేది ? వారి జీవితము లాద్యంతచింతాపర్యవసితమహాకావ్యములు గావా ? అయిన నా దుఃఖపరంపరల నీఁదుకొనుచువచ్చి వారి కీర్తి మన హృదయముల నానందపరవశ మొనర్చుట లేదా? ఈదృశమైన ప్రవిదారుణభావపరంపరలే యీ నవలలో చిత్రింపఁబడినవి.

సాంఘికచారిత్రికాది విభాగములలో నిముడనిది యీ నవల. మనయం దిట్టివి కొల్లలు. మానవవ్యక్తిత్వమునకును దదావేశములకును దత్పరిణతులకును బ్రాధాన్య మిచ్చు వస్తుసంవరణముగల నవలలు మనలో మృగ్యములు. తల్లోపనివారణార్థమే యీ నవలలో దయానిధిపాత్రను గథానాయకపాత్రగ సృజించుట జరిగెను.

దయానిధి యువకుఁడు; ఉన్నతవిద్యావంతుఁడు; నవీనాదర్శములు గలవాఁడు: పరిసరప్రపంచము నవగాహింపఁ బ్రయత్నించినాఁడు. అతని యాకాంక్షితము, వ్యక్తిత్వము, నర్థముచేసికొనుటకై ప్రపంచము సిద్ధముగఁగూర్చుండదు; పైఁగా నవవాదులతో నభాంశములతో నతనిని హింసించును. గోదానదీతీరమందున జగన్నాథముతో నౌకా ప్రయాణము, వర్షము వెలిసినపిదపఁ గాత్యాయనితో గొండలనడుమ నాట్యముచేసిన సంధ్యాకాంతాస్మృతి, యర్ధరాత్రమునం దమృతములో గోచరించిన యెట్టనిశక్తి, తన్ను గదలించి కాల్చివేసిన యామె మత్తుసౌందర్యము మొదలైన యెన్నో యనుభవముల యొత్తిడి నాతఁడోర్చుకొనజాలఁడు. అవి యతనిని దల క్రిందులు చేయును. ఇఁక నాతఁ డావాతావరణమున నుండలేఁడు; రాయలసీమకుఁ బోవును. ప్రజల కక్కడ సేవచేయుచు జీవితము గడపుట యాతని యాకాంక్ష.

అచ్చట దయానిధి కదృష్టము కలిసివచ్చినది. ఇంతలో మఱల పూర్వఁపుటనుభవము లాతనిని జుట్టుముట్టినవి. తత్రత్యు లేవో యభిప్రాయములు పెట్టుకొని మన నాయకుని యాకాంక్షల నర్థము చేసికొనరు. స్వర్గమునకుఁబోయినఁగూడ నొడి నేకులు తప్పలేదు. అచ్చటఁగూడ నతనికి జీవితమొక నిరంతరసంఘర్షమైపోవును. ఎల్లరు దూర మగుదురు. తుద కొక్కడే మిగిలిపోవుట యగును. జీవితమునకుఁగల యర్థమేమి యని యాతఁ డిన్ని దినములు గవేషణైకకేళీనిరతుఁడై నందుల కప్పుడా యర్థము స్ఫురించినది. తనతో దాను సమాధానపడుటయే మిగిలిన కర్తవ్యమని యాతఁడు గ్రహింపఁగలఁడు[1]. ఇది భావసారము.

---

1. "చివరకు మిగిలింది-దాని సమాధానం కాదు; సమాధానం తేల్చుకునే టందుకు తను చేసిన యత్నాలు-జ్ఞాపకాలు-తనతో తాను సమాధాన పడటం-అది మిగిలింది" 'చివరకు మిగిలేది' తుదివాక్యము.

ఇందు రచయిత కొన్ని యాదర్శములుగల నాయకుని జిత్రించుటయే కాదు; ఆధునికసామాజికజీవితములోని కొన్ని సమస్యలనుగూర్చియు బ్రస్తావించును. మానవుల మధ్య నసూయాద్వేషము లేల ప్రబలుచున్నవి? మనుజు లేల పరస్పరము ప్రేమించుకొనలేకున్నారు? మానవుడు సాటిమానవుని నుపేక్షించు దయాప్రేమ లేకారణమువలన లుప్తము లగుచున్నవి? ఇట్టివి చాల సంగతులు రచయితను గలవరపఱచెను. సాటి మానవుని బ్రేమించలేకపోవుటయే మన జీవితములో నొక పెద్ద యనర్థమని నవలాకర్త చెప్పఁదలఁచినాడు. మానవుల మధ్య దయాప్రేమలు ప్రవర్తిల్లుట యావశ్యమనెడి దానికంటె నే రచనకుఁగాని వేఱు మహాశయము లుండఁబోవు; ఏ రచయితకుఁగాని మహాదాశయము లుండఁబోవు; ఇది ప్రపంచమహాకవు లేకాలము నుండి పిండిన పరమసత్యము. మన నవలలోని యాదర్శము కూడ నిదియే! యుగధర్మమును దృష్టియందుంచుకొని యుద్భవించిన కొద్ది నవలలలో నిది యుత్తమము.

విశేష మింకొకటి. పెద్దవారుచేసిన యపచారములకు వారి సంతానము బాధ్యత వహింపవలసివచ్చుచున్నది. ఒక ప్రల్లదుఁడుచేసినదానికిఁ దత్సంఘ మెల్లను దూషిత మగుట యపూర్వముకాదు; ఆ ఫలానుభవముల నన్నిటిని సంస్కర్తలు తొలగింపను లేరు. కాని వీలున్నంతలో ప్రయత్నములుచేయుట మన విధి. పలన, నమాయికులు తమపూర్వుల యపరాధములకు హింసింపఁబడుచున్నారు. అందువలన సంఘములో వ్యక్తిగతములైన నైతికమూల్యములకు దావు లేకున్నది. తా మెంతటినీతిపరులైనను దమ నీతికొక విలువలేదని వ్యక్తులకు దోచుచున్నకారణముచే సమాజములోని నైతిక స్థాయి పతనమగును. ఈ నవలద్వారమున రచయిత సమాజమునకు జెప్పనెంచిన యంశములలో నిది కూడ ముఖ్యము. దీనిని పరిశీలనార్హ మనకతీతము.

ఉదాత్తమైన నవల లన్నిటియందువలెనే యిందును శృంగారఘట్టములు లున్నవి. అవి యించుక పరిష్కరింపఁబడుట మేలు. ఇందలి స్త్రీపాత్రల శీలస్వభావములలో వైవిధ్య మున్నది. జీవితములో మనకు వీ రెచ్చటనో యెదురైనవారివలెనే గోచరింతురు. వీరిలో నాగరకత యననేమో కొందఱకుఁ దెలియదు; తెలిసియుఁగూడ విచిత్రముగఁ బ్రవర్తించువారు కొందఱు. ఇది యాధునికలోకచిత్రము. కథానాయకునకు వారితో గలిగిన పరిచయమునుబట్టి మనము, సన్నివేశప్రాయమునుగల మానవసహజములగు బలహీనతలు, సుగుణములు నన్నిటిని నంతశ్శుద్ధితో నిరూపింప బడుటవలననే యీ నవల నెన్నిపర్యాయములు చదివినను పఠనవ్యగ్రత తఱుగదు.

పాత్రోచితభాష మిషగా సంఘకులగోత్రాదులనుబట్టియు మండలములను బట్టియుఁ బలురకములైన పలుకుబడులు పాఠకుల నుక్కిరిబిక్కిరిచేయుట పాశ్చాత్య నవలలయందును దప్పలేదు. ఒక సుఖము నపేక్షించి యింకొక దుస్తరమైన కష్టమున కోర్చుట మానవస్వభావము. పాలకై ఊయిమోయుట, వరుగుతో దాఁగరము నెంచుట, నినుముతో నగ్నియు సమ్మెటపోటుతినుట వంటిది, నేఁటి నవలాపాఠకులకు

గలుగు నానందానుభూతి. అది భాషాపరమైన సార్వత్రికక్లేశము. దాని నిచ్చటఁ బేర్కొన నక్కఱలేదు. ఒకరికిఁ బ్రాంజలమైనది, యింకొకరికి జటిలభాష. అధికారతారతమ్యములనుబట్టి యది యంతయు నేర్పడును. శ్రీ బుచ్చిబాబుగారి శైలి పాఠకులను బ్రత్యేక మాకర్షించునది. తెలుఁగుతీయఁదనము, చుఱుకుఁదనమునుగూడఁ జూపఁగల చిన్నవాక్యముల రచన వీరిశైలికి విశిష్టత నాపాదించును. అన్నింటిని మించినవి వారి యుపమలు. ఆంగ్లసంస్కారభానము దీనిపై లేదనలేము; కాని యా యుపమలు హృదయాహ్లాదకరములు; సుగమములు. అవి మనలను వారి పరిభావనాపథమునకుఁ బట్టుకపోవును; ఎంత యపూర్వములో యంత రమణీయములు; శైలిని రసమయ మొనర్చినవి. వారి నిశితపరిశీలనసామర్థ్యమునకు నికషోపలములు; ప్రకరణౌచితికిఁ బరాకాష్ఠలు. భావస్ఫోరకత్వముచే గొన్ని ఘట్టములను భావాత్మకములైన గద్యపద్యములుగ మార్పఁగలిగినవి, వీరి యుపమానోపమేయములు. ఇవి కొన్ని సన్నివేశములలో గవితాధారలై ప్రవహించినవి.

వీరి ప్రకృతివర్ణనలుకూడ జాలఁ బ్రత్యేకతఁగలవి. ఏదో వర్ణింపవలెగదాయని ప్రకృతిని వీరు వర్ణింపరు. సందర్భోచితినిబట్టియుఁ బాత్రలహృదయగతభావవిశుద్ధిని బట్టియు నా యా సామగ్రిని స్వీకరించి యనుభవజ్ఞుఁడైన చిత్రలేఖకుఁ డగుటచే మన నవలాకర్త శబ్దవర్ణభావచిత్రములను జిత్రించును. అవియుఁ గథతో నభిన్నాధ్యవసానము లగుటచే జదువరులు చిత్రీయమానచిత్తు లగుదురు. ఆ భావచిత్రణములు సన్నివేశములకు ఝుడితిస్ఫూర్తి నొసఁగును; భావోద్వేగమును గల్పించును. ఆంగ్లసాహిత్యమున నింత యమేయపాండిత్యముగల నవలారచయిత సకలాంధ్రతలమునను దుర్లభుఁడు. రచనాశిల్పవిషయమున నితఁ డాధునికధోరణుల నవగాహన మొనర్చుకొన్న దిట్ట; రచించిన దొక్కటేనవల యైనను నుజ్జ్వలభావిగల నవలాకర్త; ఇంచుక భద్రముగ మెలఁకువతో గలముసాగించినచో నాంధ్రనవలాసరస్వతిచే బట్టుసెల్లాలు కట్టింపఁగల యువకుఁడు.

జీవితమునకొక దర్శనపథము నలవరింపవలెనన్న యుద్దేశ మీ నవలలో సఫలమయ్యెను. ఆర్థికసాంఘిక చారిత్రకాదివ్యాసనముల కతీతమై యొక మానవు నింకొక మానవునితో స్నేహపాశమున బంధింపఁగల మానవత్వముయొక్క శక్తిసామర్థ్యము లిందుఁ దరిచిచూపఁబడినవి. ఆ దృశ్యములను దన్మయీభావముతో ననుభవింపఁగలము. వర్ణించుటకుఁ బదజాలము చాలదు. ఈ జీవితరహస్యము, దీని పరిజ్ఞానార్థమై మానవుఁడు చేయుప్రయత్నము . నే మహాకావ్యమునకైనను మూలశిల గాకతప్పదు. ఈ నవలకు నదియే పునాది.

పరపీడకు దుఃఖించువారికంటె ధన్యులు వేఱుగ నుండఁబోరు. బాధపడఁగల హృదయమునకే ప్రేమలోని యగాధత్వము వెల్లడియగును. ఎద యదియెంత సుతిమెత్తన యగుచో నంత సుకుమారముగ వేదన ననుభవింపఁగలదు. మన కథానాయ

కు డగు దయానిధిని గుణనిధి యనలేకపోయినను గరుణావధి యనవచ్చునేమో! అతని వేదనను స్థూలము, ప్రత్యక్షము ననలేము. కాని బహుసూక్ష్మ మనవచ్చును. అది యొక యంతశ్శోభము: దురదృష్టవంతుని వ్యాకులత. దయానిధి లోకమునఁగల శోభితలకుఁ బ్రతినిధి. ఒక పారమార్థికదృష్టితోగాక కేవలము భౌతికదృష్టితో బరిశీలించినయెడల నాతని వేదన యర్థము కాదు ; ఎంతేని నిమ్నునకు గుహ్యయగును. ప్రకృతియొక్క భౌతికాంశమునకు కంటె దాని యంతస్సారమునకే విలువయెక్కువ యీయఁబడిన దీనిని నవలామాత్రముగ బరిగణింపరాదు. ఇది శిల్ప ప్రౌఢిమగల కావ్యము. భావముతోబాటుగ శైలి యింకొక యించుక హృద్యమై యుండినచో గద్యకావ్యమయ్యెడిది. అయ్యు నా హృద్యత నీ రచయిత యంతగాహీనిగ సాధించినాఁడు. అది యాతని భావగతము. శబ్దగతమైన హృద్యతకంటె భావగతమైనది గంభీరము కళోచితమునని గుర్తెఱిగినవా డగుటచేతనే యీ రచయిత శిల్పి.

దేశకాలములతో బరిస్థితులను సమన్వయించుట యే నవలాకర్త ప్రత్యేకత. కథానికా కర్తకును నాటకకారునకును నిది సహా వర్తింపదు. దేశకాలములు వ్యక్తుల యందుఁ గలిగించు పరిణతిని యోజించుట నవలాకారుని ధర్మమేయైనను దేశమును గూర్చికంటె కాలమునుగూర్చికంటె చింతన, కడమ రచయిత లందఱికి నంతగా బట్టనిది నవలాకారునకు ముఖ్యము. సాపేక్షసిద్ధాంతము[1] ప్రకార మాతనిలో నీ చింతనమును నాల్గవ పరిణామముగా భౌతికశాస్త్రము పేర్కొనును. ఖగోళ శాస్త్రమునందుఁ జెప్పఁబడినట్లు దినదినాభివృద్ధి నొందుచున్న యనంత విశ్వమును జూచియు ననంతకాలమునుగూర్చి చింతచేసియుఁ దా నెంతయల్పుఁడో మానవుఁడు తెలిసికొనుటయందుఁగల దైన్యముకా దిచ్చట ప్రసక్తము. ఈ మహావిశ్వమును మహాకాలముతో యోజించుటవలన నేర్పడు నాల్గవ పరిణామమునుగూర్చిన జిజ్ఞాస నావలికులెల్లరకు నెచ్చటనో మేదస్సులో నుండవచ్చునుగాక! ఆ జిజ్ఞాస కవికిఁ గథకునకు నాటకకర్తకు నెల్లరకుఁగూడ నుండవచ్చును. అదియున్నచో నా రచనకు నిండుఁదనము సమకూరుచున్న మాట నిజమే! రచయిత లెల్లరకు సాధారణమగు నిది నవలాకారునకుఁ బ్రత్యేకలక్షణము కాఁ జాలదుగదా! నిజమే!

కాని తన పరిసరములు, నా కాలము, నప్పటి యాచారవ్యవహారములు మున్నగునవి కల్పించిన సంకెలలు, నిర్ణయించిన యెల్లలు, వానిలో నలిగినలిగి యొదిగి, నిలద్రొక్కుకొని యెదురుతిరుగఁబోయి యెసలారలేక విఫలురైన వ్యక్తులు తుదకు వా రా విషయములతో బడుచున్న సమాధానమును రచయిత మననముచేసి యా యా దృశ్యములలోని దైన్యమును దనలో జీర్ణించుకొని తన్ను దా నాకళించుకొని, తదనుగుణ

1. The Theory of Relativity.

ముగ రచనలలో జీవితమును దిద్దుదిద్దుట నవలాకారుని బాధ్యత. ఈ చెప్పిన యావ చ్చైతన్యము, జిజ్ఞాసయు నుత్తమనవలాకారుని ప్రత్యేకశక్తి. ఇతరశిల్పుల కిది ముఖ్యముకాదు. అట్టి ప్రత్యేకశక్తియే 'చివరకు మిగిలేది'? ప్రదర్శింపఁబడెను.

## మృత్యుంజయులు

తెలంగాణమువీరగాథకుఁ జెందిన నవల; రచయిత శ్రీ బొల్లిముంత శివరామ కృష్ణ. దేశ్‌ముఖ్, రావుసాహెబ్, వెంకటరామ నారాయణరెడ్డి యొక భూస్వామి. అప్పన్న యాయనకు ప్రతినిధి. పటేల్ పాపిరెడ్డి యింకొకఁ డీతనికిఁ దోడు.

నారాయణరెడ్డిపేరిటఁ ప్రజాపీడన మొనరించుపని యాతని ప్రతినిధులకు నిత్య కృత్యము. ఆ యూర మల్లారెడ్డికుటుంబ మించుక స్వతంత్రభావములు గలది; పారతంత్ర్య మొప్పలేనిది. ఈ మల్లారెడ్డి పెద్దభార్యకొడుకు నరిసిరెడ్డి; చిన్నభార్య రాములమ్మకొడుకు ఎల్లారెడ్డి; కూతురు రాజమ్మ. ఈమెను అప్పన్న దురహం కారియై దుర్మార్గులచే నవమానింపఁజేయును. నారు కుళ్ళిపోవుచున్నను దమ పొల మున మొక్కనాటుకొనుట మాని యప్పన్నమాటచొప్పున నారాయణరెడ్డిపొలమూఁ డ్చుటకై రాములమ్మ రానికారణమువలననే యామెకూతున కీ భంగపాటు.

"ఏలుకొనితిను వానికిఁ జైన గీలుకొని తినువాఁ డ"న్నట్లు, బీదప్రజానీకము నింటిపన్ను, బూడిదపన్ను, గోతిపన్ను, లంచములు, మున్నగువానితో నారాయణ రెడ్డిప్రతినిధులు పీడించుట యీ నవలలోని యితివృత్తము. పాలకుని దురంతములు మితిమీఱఁగా దుదకుఁ బాలితులు తిమగఁబాటుచేయుట జరుగును. దీనికి మల్లారెడ్డి కుటుంబమును బాధ్యముగా నప్పన్నవర్గమువారు భావించి, యం దెల్లారెడ్డియు, రాములమ్మయుఁ దప్పించుకొనఁగా గడమవారి నెల్లర హత్యగావింతురు. అచ్చు పోసిన యాబోతువలె నూరిపైకి ఏలుచుకొనిపడిన నారాయణరెడ్డిని విమర్శించి నందులకు రాములమ్మ సింహమువలె యీడ్చుకొనివచ్చిన పాపిరెడ్డి తుదకు సుబాన్‌ఖా నుని బడితెదెబ్బలతో దలపగిలి మరణించును. గ్రామములలో ప్రజోద్యమము పెరిగి హైదరాబాదువఱకు వ్యాపించినది.

కథాసంవిధానములో నంత పసలేదు; ఒడుపుతో రచింపఁబడిన గొప్ప సన్ని వేశములు గాని యొనగూరిన ఘటనలుగాని లేవు. పాలకులనైచ్యము, ప్రజాహింసయు వానిఫలము నీ నవలలో బాగుగ వెల్లడింపఁబడినవి. ఎంతేని ప్రజానష్టముకావచ్చును.

---

1. ప్రజాశక్తిప్రచురణము, విజయవాడ; ప్రథమావృత్తి _25_10_1945.

ప్రజాశక్తికి జయ మనివాక్యము. అందువలనఁ బ్రజలు మృత్యుంజయులు. ఈ నవలలో దాత్కాలిక ప్రజాజీవితమును వాస్తవికదృష్టితో జిత్రించుటయే రచయితకుఁ బ్రధానోద్దేశము. అం దాతఁడు కృతకృత్యుఁడైనాఁ డనక తీరదు.

ఆంధ్రప్రజాజీవితము నీ దినములలో సజీవముగ వర్ణించిన నవలలు లెక్కకు మిక్కిలి లేవు. 'మాలపల్లి', 'వేయిపడగలు', 'నారాయణరావు' వంటివి కొన్ని చెదురుగ వ్రేళ్ళపై లెక్కింపఁదగి యుండెను. ఇఁకఁ దెలంగాణమునఁగల యాంధ్రప్రజల జీవితమును వర్ణించు నవలలఁగూర్చి చెప్పవలసిన యావశ్యకమే లేదు. తెలుఁగునవలా సాహిత్యమునఁ దెలంగాణములో బ్రజాజీవితచిత్రణము బాగుగ జరుగలేదనెడి లోపమీ నవలవలన దూరీకృతము.

హైదరాబాదుసంస్థానములో నిన్న మొన్నటివఱకుఁగూడఁ దురుష్కుల నిరంకుశపాలనమునందు నానాకష్టములుపడిన యొక కోటిమంది యాంధ్రులనుగుఱించి యెవ్వరో కొందఱు విద్యాధికులకు దప్ప నాఁడు మదరాసురాష్ట్రమునఁగల రెండు కోట్లమంది యాంధ్రప్రజల కేమియు దెలియదనుట యతిశయోక్తి కాదు. తెలుఁగు మాతృభాషగా గల యంతప్రజ నైజాము రాష్ట్రమున నున్నదనెడి భావము మదరాసు రాష్ట్రపుటాంధ్రప్రజాసాధారణ్యమున కా దినములలో సరిక్రొత్త. ఇటీవల పరిస్థితులు మాఱిపోయినవి. తెలంగాణమునఁ బ్రజలు స్వాతంత్ర్యమునకై పోరుసలుపుటయు నందువారు వీరోచితమగు పాత్రవహించుటయుఁ ద్యాగములు చేయుటయు సోదరాంధ్రప్రజలదృష్టి నాకర్షించెను. అదియేగాదు. జాతీయోద్యమఫలముగ యావద్భారతదేశమునకును సంపూర్ణస్వాతంత్ర్యము సమీపించుచున్నకొలఁదియు నాంధ్రప్రజలలో నూతనజాతీయచైతన్య మభిస్ఫురితమై "విశాలాంధ్ర"నిర్మాణాసక్తిఁ బెంపొందుట జరిగెను. తన్మూలమునఁగూడ తెలంగాణముప్రజల పరిస్థితుల నెఱుఁగు నభిలాష సాగరేయ పర్వతేయాంధ్రులలో వర్ధిల్లినది.

వారిలో నన్నివర్గములవారు నన్నితరగతులవారు నీ నవలారచనకాలమునఁ దమసోదరులగుఁ దెలంగాణపుటాంధ్రులనుగూర్చి తెలిసికొనుట కవి ముందంజవేయు దినములు. ఇతరులతోబాటుగ నాంధ్రరచయితలుగూడ తెలంగాణముప్రజలనుగుఱించి రచింప నారంభించిరి. అట్టి ప్రయత్నముల ఫలితమే 'మాభూమి'[1], 'ఎరుకలలచ్చి'[2], పెక్కు తెలంగాణపుగేయములు మున్నగునవి. మన యీ నవలయు నట్టి వ్యవసాయమునే వ్యక్తపఱచును.

ఆనాఁడు తెలంగాణమునఁ బ్రజలు, కొల్లరియగు నైజాము, నతనిక్రింద దోఁపుడుకాండ్రగు నుద్యోగులను బీడించుటవలన దుర్భరమగు జీవితము గడపుచుండిరి. ప్రజలధనమానప్రాణములకు రక్షలేదు. సామ్రాజ్యవాదులు, వారికి బానిసలగు సంస్థానాధి

1. ఇది శ్రీయుతులు సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావుగారల నాటకము.
2. శ్రీ కొప్పరపు సుబ్బారావుగారి రచన.

పతులు వారిక్రింద 'జాగీర్‌దారులు' మొదలగువారు దోఁచికొనఁగా భారతావని కెంతనష్టమువాటిల్లెనో చూడవలయు నన్నచో నొక్క తెలంగాణముప్రజలదుఃస్థితిఁ జూచిన బోధపడును. నిరంకుశప్రభుత్వోద్యోగులు, 'జాగీరుదారులు', 'దేశముఖులు', 'వతన్‌దారులు', పెట్టుబడిపెట్టువారును ప్రజలరక్తమును త్రాగిన జలగలు. ఆనాఁటి వెట్టిచాకిరి, దారితెన్నులులేనిపన్నులు, లంచములు, భూముల దురాక్రమణము, తిట్లు, దెబ్బలు, హత్యలు, నభిమానవతులకు భంగపాటులు మున్నగునవి వర్ణింప నలవికావు.

ఈ నవలయం దట్టి దౌర్జన్యము లెన్నియో సజీవముగ నిస్సపత్నముగఁ జిత్రింపఁ బడినవనుట నిస్సందేహము. తెలంగాణమునందలి ప్రజ లీ దౌష్ట్యముల నెదిరించి నడపిన వీరోచితమగు పోరాటముగూడ నుజ్జ్వలముగ నిందు వర్ణింపఁబడినది. ఈ రచనకు రెండుమూఁడు సంవత్సరములముందు[1] నైజాముప్రభుత్వ మాంధ్రమహాసభను, సామ్యవాదపక్షమువారి ప్రజాహితోద్యమములను నాశనముచేయుటకై విశ్వప్రయత్నము లొనర్చెను; వేలకొలఁది ప్రజలపైనను ప్రజాసేవకులపైనను దోషారోపముచేసి వారిని గారాగృహముల కంపినది; రజకళటదళములయు భూస్వాముల దోఁపిడికాండ్రయు సాహాయ్యమున, ప్రజలను గాల్పించి వారి గుండెనిబ్బరమును సడలింప యత్నించెను; ప్రజానాయకులను గారాగృహములలో నిర్బంధించి యమానుషకృత్యములకు గుఱి చేసినది. కాని యీ దౌర్మార్గ్యములవలనఁ బ్రజల యుద్యమమున కభివృద్ధియే గాని క్షైణ్యము రాలేదు. చివరకుఁదన తుది యాయుధమగు రజకళటుల సిబ్బందిని గూడఁ బ్రభుత్వము ప్రయోగింపవలసివచ్చెను.

మన యీ నవలయందు రచయిత నాఁటిప్రజల వీరోచితప్రతిఘటనను జిత్రించు టయేగాక హైదరాబాదుప్రజలకును బ్రజాహితోద్యమములకును నొక సందేశమును గూడ నందించుచున్నాఁడు. సాయుధులగు ప్రభుత్వభటులను బ్రతిఘటించుటకుఁగాను నిరాయుధులగు ప్రజ లవలంబింపవలసిన 'గొరిల్లా' యుద్ధవిధానమును సూచించుటయే యీ సందేశము. నైజాముప్రభువు నిరంకుశభూస్వామ్యవిధానమును నాశనము చేయుట కా యుద్ధపద్ధతికంటె వేఱుపద్ధతిలేదని యీ నవలారచయిత చాటి చెప్పెను.

హిందూ మహమ్మదీయ సమస్యనుగూడ నీ రచయిత బాగుగఁ బరిష్కరించినాఁడు. నైజామునవాబు హిందువుల కెట్లో తురష్కులకుఁగూడ నట్లే సమాన శత్రువుగా నిరూపింపఁబడెను. ప్రజోద్యమనియమమునకు హిందూమహమ్మదీయుల యైక్యము ప్రధానమని గుఱుతింపఁజేయుటకే రచయిత పాపిరెడ్డిని సుబాన్‌ఖానుని ప్రబల ప్రహారమునకుఁ బాలొనర్చుట. ఆ స్థితిలో నీ యీ మతభేదములు లేవు. ప్రజాశత్రు వెల్లప్రజకు నెల్లమతములకు శత్రువే! ఇట్టి సంఘీభావమును సందేశముగ నొసఁగిన యీ నవల తన ప్రధానాశయమును సాధించి విజయమును జేపట్టినదనుట నిస్సందేహము. తెలంగాణపుఁ బ్రజోద్యమనవలల కిది యీ నాఁ డుత్తమ ప్రతినిధి.

---

1. క్రీ. శ. 1945.

# సప్తమ ప్రకరణము

## స్వాతంత్ర్యానంతర యుగము ౧.

### క్రీ. శ. 1947–1953

(౧) శిష్టవ్యావహారిక భాషావాదము.

(౨) ఐతిహాసిక పరిశోధనలు : విజ్ఞానచంద్రికామండలిస్థాపన.

(౩) ఆంధ్రరాష్ట్రోద్యమము.

(౪) భాషాప్రయుక్త రాష్ట్రపునర్విభజనోద్యమము.

(౫) సహాయనిరాకరణోద్యమము.

(౬) తౌరుష్కాంధ్రము [తెలంగాణము] లో నాంధ్రమహాసభలు సారస్వతోద్యమములు.

(౭) రజాకరు దుండగములు : ప్రజాతంత్రశక్తులు.

(౮) ఆంధ్రరాష్ట్రావతరణము.

(౯) భాషా సాంఘిక రాజకీయాది చైతన్యము : ఆంధ్రప్రదేశము వ్యవస్థాపన.

(౧౦) సంస్కారములు; ప్రజాహితప్రభుత్వసంస్థలు; సాంఘిక రాజకీయపరిణామములవలని యాటుఁపోటులు; పై యన్నిటి పరిణామచిహ్నములుగ వెలువడిన కొన్ని నవలలు:—

# సప్తమ ప్రకరణము

## స్వాతంత్ర్యానంతర యుగము

## ( Post–Independence Era )

## (క్రీ.శ. 1947–'53)

### ఉపోద్ఘాతము

కథావశేషులు గిడుగు వేంకట రామమూర్తి పంతులు, శ్రీ పట్నుదొర[1]గారి ప్రోత్సాహముతో శిష్టజనవ్యావహారికభాష, గ్రంథరచనమునకు గ్రాహ్యమైనదిగా జేయుట కత్యంతము కృషిచేసి[2] చాలవఱకుఁ గృతకృత్యులైన కాలమది. వీరేశలింగముపంతులుగారు వీరి భాషాసంస్కరణోద్యమములో గొంత యాథార్థ్య మున్నదని యంగీకరించి దానిని ముందునకుఁ దీసికొనిపోయిరి[3]. గురజాడవా రట్టిభాషయే ప్రజాసేవకు నిజమైన సాధనమని నిరూపించి నాటకము, కథానికలను రచించి ప్రజామోదముగాంచఁ గలిగినారు.

ఐతిహాసికపరిశోధనవిషయములో గథాశేషులు కొమఱ్ఱాజువారు తమ విజ్ఞానచంద్రికామండలిస్థాపనమూలమున, చిలుకూరి వీరభద్రరావు[4] మల్లంపల్లి సోమశేఖర శర్మ[5] మారేమండ రామారావు, భావరాజు కృష్ణారావు, డా. నేలటూరి వేంకటరమ

---

1. క్రీ.శ. 1906 నుండి 1940 వఱకు. 2. నాఁటి యాంధ్రదేశములో వీరు పాఠశాలల పరీక్షాధికారి. కావున నుపాధ్యాయ వృత్తి యందున్న గిడుగు వారికి వీరితో బరిచితి.

3. "సంఘసంస్కరణలో వీరేశలింగముగారికి — చేదోడువాదోడు అయిన గిడుగువారు" అను వ్యాసము — కృష్ణాపత్రిక-సంపు-59-సంచి-13-పుట 7-(30-4-1960).

4. క్రీ.శ. 1916లో వీరు 'కర్ణసామ్రాజ్యము, నాయకురాలిదర్పము' అను రెండు చారిత్రక నవలలు ప్రచురించిరి. ఆంధ్రవాఙ్మయసూచిక, కర్ణసామ్రాజ్యమును 1911నాఁటిదిగా బేర్కొనును. 5. 'ఘోరకలి', 'దేవీప్రసన్నము' వంటి నవలలనేగాక వీరు చిన్న కథలుగూడ రచించిరి.

ణయ్య, సురవరము ప్రతాపరెడ్డి[1] ఆచార్య ఖండవల్లిలక్ష్మీరంజనము ప్రభృతి మహోదయులలో వైజ్ఞానిక తృష్ణరేకెత్తించి, చారిత్రకపరిశోధనపరిజ్ఞానము, నిశితనిర్ఘృణ విమర్శనవైపుణ్యము, నుద్రేకభూయిష్ఠరచనావిధానము, నుత్తేజకరసంస్కృతీపరిణిష్ఠను మనదేశమున సర్వవ్యాప్తమొనర్చి రనుట సత్యసమ్మతము.

ఆధునికాంధ్రజీవితమును దీర్చిదిద్దుటలో భాగస్వామ్యముగల రెండవ యుద్యమము ప్రత్యేకరాష్ట్రోద్యమము[2]. నాఁడు ప్రథమాంధ్రమహాసభ[3] యాంధ్రులకుఁ బ్రత్యేకరాష్ట్రమును గోరుటయేగాక భారతదేశమంతయు భాషాప్రయుక్తముగ విభజింపఁబడవలయునని తీర్మానించినది.

భారతదేశమున ననేకజాతు లున్నవి. ప్రత్యేకభాష, ప్రత్యేకసంస్కృతి, ప్రత్యేకకులమతవ్యవస్థలు, ప్రాంతీయప్రత్యేకతలును గలిగిన యీ వివిధజాతుల సమ్మేళనమే భారతదేశము. మన ప్రజయందు భిన్నత్వములో నెంత యేకత్వమో, యేకత్వమునం దంత భిన్నత్వ మున్న దన్నమాట. ఈ వాస్తవికసత్యమును గుఱుతించి నంతమాత్రముచే భారతదేశైక్యమున కెట్టి భంగము నుండదు. సాంఘికజీవితమునం దభ్యుదయము గోరువారికి మనలో నీ నగ్నసత్యమునెడ గనువిప్పు కలుగలేదు. కులమతభాషాసంస్కృతిసంబంధులగు నభిమానములు నశింపవు; నశించిన ట్లగపడి వర్గభేదములుగ నీ దేశమునందువలెఁ దలయెత్తును. కాన నవి నశింపవలె నని కోరుటకంటె దద్దురభిమానద్వేషములు నశింపవలె నని కోరుట యుచితము. శత్రువులనుగాదు; శత్రుత్వమును జంపుకొనవలెను. శ్రీ విశ్వనాథవారు తమ నవలల ద్వారమున నీ విషయము నందు నిరంతరకృషి చేయుచునే యున్నారు. బుచ్చిబాబుగారు దీనికే యింకొక పేరిడి దానిని సాధించిరి. అట్లే యెల్లరు తమతమశక్తివంచనలేక యత్నించుచునే యున్నారు. ఈ సత్యమును గొందఱు మహనీయులు మనలోముందుగ గ్రహించి, భిన్నత్వమునం దైక్యసాధనమున కనుగుణముగ భాషాప్రయుక్తరాష్ట్రపునర్విభజనము జరిగినపుడే సుదృఢము సుస్థిరము శాశ్వతము నైనట్టి యైక్యభారతదేశ మావిర్భవింపఁగలదని వాదించిరి. తొలుదొలుత నీ సత్యమును బైటికిఁదెచ్చి ప్రచారము చేసిన సంస్థ యాంధ్రమహాసభ.ఇది మన జాతీయవాంఛలకు దర్పణప్రాయము. పిదపఁ బెక్కుసంస్థలుగలిసి యీ సత్యమును సాధించినవి. అభ్యుదయకాముకులైన భారతీయు లెల్లరు నేఁడు దీనిని శిరసా వహించుచున్నారు. ఇది యవితథమైన మన రాష్ట్రోద్యమవిజయము.

---

1. 'శుద్ధాంతకాంత' అముద్రితనవల. ఒకప్పుడు డా॥ బి. రామరాజుగారియొద్ద నున్నది.

2. దీనికి మూలపురుషులు కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, జొన్నవిత్తుల గురునాథము మున్నగు మహనీయులు. 3. క్రీ.శ. 1913లో బాపట్లయందు జరిగెను.

ఇఁక మూఁడవది, భారతజాతీయమహాసభవారు ప్రారంభించిన 'సహాయనిరాకరణోద్యమము'. దశాబ్దులతరబడి మితవాదనాయకత్వమునందున్న 'కాంగ్రెసు'సంస్థ, గాంధి మహాత్ముని సారథ్యమున నీ యుద్యమమునకుఁ బూనుకొనెను. భారతదేశమంతటిదాని స్వాతంత్ర్యసంపాదన మనఁగా, మాటలతో సాధ్యముగాదనియు గొప్ప త్యాగము సత్యాగ్రహము మున్నగునవి యావశ్యకములనియు గ్రహించి, ప్రజలనందుల కాయత్తపఱచుటకై మహాత్ముఁడీ నిరాకరణోద్యమసంప్రదాయమును బ్రవేశపెట్టినాఁడు. ఇది యాంధ్రావనిలోగూడఁ దీవ్రరూపముఁ దాల్చినది1. ఒక విదేశీయ వస్తువులనేగాదు; విద్యాసంస్థలను న్యాయస్థానములను బెక్కురుత్యాగధనులు బహిష్కరించిరి. అస్పృశ్యతానివారణము,మద్యపాననిషేధము వంటి నిర్మాణకార్యక్రమములతోఁబాటు పన్నుల నిరాకరణమువంటి ప్రత్యక్షచర్యలుగూడఁ దీవ్రరూపమును దాల్చినవి2. నాఁడు సర్వత్రస్వాతంత్ర్యపిపాస; పారతంత్ర్యపరమనారకత్రాస. అందుచే బిమ్మటి యుద్యమము3, లన్నిటిలో గూడ నాంధ్రదేశము సముచితపాత్ర వహించెను.

ఇట్టి యుద్యమము లన్నియు సాగరేయ పర్వతేయాంధ్రదేశభాగములలో గొనసాగుచుండగ నైజాము పరిపాలనములో యమయాతన లనుభవించుచున్న కోటి మంది తెలుఁగుసోదరులయం దొకనూతనజాగృతి రా నారంభించినది. ఇతఃపూర్వము4 నుండియే యీ యప్రమత్తతకుఁ దెలంగాణఁపు టాంధ్రమహాసభనాయకత్వమువహించి యుండెను. అట్లే యనేకసంవత్సరములుగఁ దెలంగాణపుటాంధ్రుల యభ్యున్నతికై యనేక సాహిత్యసంస్థలు కృషిచేయుచున్నవి. నైజాముక్రూరపరిపాలన ఫలితముగ నామరూపములులేకుండఁబోఁగల ప్రమాదమునుండి తెలుఁగుభాషను గాపాడి యీ విధ సారస్వతపరిషత్తులు తెలంగాణమువారి పునరుజ్జీవమునకుఁ బునాదులు వేసినవి. వానిలో 'శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము' హైదరాబాదు, 'ఆంధ్రసారస్వతపరిషత్తు'ను బ్రధానములు.

ప్రజాజీవమునఁగలిగిన యీనూతన జాగృతి యొక్క దశాబ్దము తరువాతఁ బ్రభుత్వముతోడి పోరాటముగఁ బరిణమించి రైతుల తిరుగఁబాటురూపమున వ్రేళ్ళ

1. క్రీ.శ. 1921–1922.

2. గుంటూరుజిల్లా పెదనందిపాడులో పన్నుల నిరాకరణము; చీరాల పేరాలలయందు 'ఉప్పు సత్యాగ్రహము'; పలనాడులో నడవిపుల్లరి నిరాక్రియ;— 'హనుమంతు' నాయకత్వమున రైతులు ప్రభుత్వముతో పోరాటము; నరసీపట్టణము మన్యప్రజలు సీతారామరాజు నాయకత్వమునకు వ్యతిరేకముగ సాగించిన సాయుధమగు పోరాటము, మొదలగునవి.

3. క్రీ.శ. 1930, '40, '42లలో కాంగ్రెసు నాయకత్వమున సాగినవి; క్రీ.శ. 1936నుండి ప్రజాస్వామ్యవాదుల నాయకత్వమున సాగినవియు.

4. క్రీ.శ. 1935; 5. క్రీ.శ. 1945.

దన్నెను. శతాబ్దులుగ సాగుచున్న భూస్వాముల దోఁపిడికాంద్రతనమునకును వెట్టిచాకిరి కిని క్రూరనిరంకుశవిధానమునకును వ్యతిరేకముగఁ బ్రజలు కొన్నియేండ్లు[1] తీవ్ర ముగఁ బోరాడిరి,

అర్ధశతాబ్దిగా బెరుఁగుచున్న జాతీయోద్యమాదుల ఫలితముగ 'బ్రిటిషు' వారు భారతదేశాధిపత్యమును వదలుకొనిన పరిస్థితివచ్చినది. దానితో మనభారత దేశమంతయు స్వాతంత్ర్యము సంపాదించుకొనఁగలిగెను.

కాని తెలంగాణమున 'రజాకారుల' దుండగములు మితిమీరిపోయినవి[2]. వేలాది వీరులు నేలకొరగిరి. అవి మట్టిలోనుండి మహావీరు లుద్భవించిన దినములు. మన ప్రజల త్యాగములతోడను మన వీరుల రక్తములతోడను నవ్యాంధ్రజాతిచరిత్ర నిర్మింపఁబడుచున్న కాల మది. ఆంధ్రజాతి మాతృభూమిలో నొక భాగమైన తెలం గాణమునఁ దెలుఁగుతల్లి హృదయవేదనమును బ్రజల వీరగాథలను జిత్రించుచు రచనలు ప్రకటించుటకుఁ గానిఁ చేయుటకు గాని వీలుగాని కాల మది. అయినను పెక్కు గీతములు, గేయములు,పదములు, బుఱ్ఱకథలును మన రచయితలచే నిర్మింపఁబడినవి. ప్రజా సామాన్యము నుండి యెన్నో క్రొత్త రచనము లుత్పన్నము లైనవి[3]. 'రథచక్రాలు[4]', 'పులుల సత్యాగ్రహము', 'మృత్యుంజయులు'[5], 'ఓనమాలు','దవానలం', 'ప్రజలమనిషి' వంటివి కొన్ని ప్రసిద్ధ నవలాకారుల సానుభూతికి గూడ నిదర్శనములు.

అశేషరక్తతర్పణఫలితముగ దెలంగాణము తిరిగి యూపిరిఁబీల్చుకొనఁగలిగెను. ప్రజాతంత్రశక్తులు సమీకరింపఁబడి పురోగమించినవి. తెలంగాణము నాంధ్రదేశము నను విభజనము పోయి యుకొక్కటి యాంధ్రులు నొక్కటిగావలె ననెడి వాంఛ యొక్కటి మొదటినుండియు నున్నది. కాని యప్పు డాంధ్రులకు ప్రత్యేక రాష్ట్రమే

1. క్రీ.శ. 1947—'52 మధ్యకాలము.

2. తెలంగాణములోవి 'ఆకునూరు' 'మాచిరెడ్డిపల్లి' గ్రామములలోని దురంతములు.

3. ఖబడ్దార్, ఖబడ్దార్, నైజాం పాదుషాహీ [సోమసుందర్] వంటి పాటలు, "మాభూమి" [సుంకరవాసిరెడ్డి భాస్కరరావుల] వంటి నాటకములు, భావిపైన పరిపూర్ణవిశ్వాసము నిలిపి ప్రజాకవిత్వముపేరిట సూటిగ మాటాడిన ["కరకు నిజాంతోనుకలిసికటికవారు దొరలునాఁడు చీల్చినారు తెలుగుభూమి చేర్పవలెను ఒకటి"గా—వంటి] పెక్కుగేయములే గాక అన్యాపదేశముపేరిట ["త్వమేవాహం", "పర్వదశ", "మార్చిఆన్", [ఆరుద్ర] "శగ్నకాంతి", "ఝుంఝూసంగీతం," (దాశరథి); 'విషాదాంధ్ర, తెలుఁగుతల్లి' [శ్రీశ్రీ] వంటి పెక్కు ప్రౌఢరచనలును వెలువడినవి.

4. ఇది తెలంగాణమునుగూర్చిన తొల్లిటి రాజకీయనవల. 5. గత ప్రకరణమున సమీక్షింపఁబడెను.

లేదు. దానికై యాశించి యాశించి వారు కడు విసిగిపోయిరి. అమరజీవి పొట్టి శ్రీరాములు బలిదానమగుటతో నాంధ్రుల కెట్టకేల కొక రాష్ట్రము సిద్ధించెను. పిదప నాంధ్రప్రజానీకము, వివిధరాజకీయపక్షములు నైక్యకంఠముతో నాంధ్రరాష్ట్రమునం దటు తమయభిప్రాయమును వ్యక్తముచేసినవి. అత్యధికసంఖ్యాకులగు ప్రజలును, రాజకీయపక్షములవారును తెలంగాణమునం దిటు తమవాంఛను వ్యక్తీకరించిరి. దానితో నెట్టకేలకు యావదాంధ్రజాతి సమగ్రాభివృద్ధి కావశ్యకమగు భౌతిక పరిస్థితు లేర్పడుటకై యనన్యత్యాగరూపమగు 'నాంధ్రప్రదేశము'నెలకొనెను.

ఇంతటి రాజకీయ సాంఘికచైతన్యమునకుఁ దోడుగ నితరసాధనసంపత్తియుఁ దోడ్పడఁ జొచ్చెను. అది విద్యావ్యాప్తికి - నందును సర్వశక్తియుక్తమగు సామాజికజీవనచిత్రణమునకుఁ దోడ్పడుకథాసాహిత్యవిస్తరణమునకుఁ గలిసివచ్చినది. ఈ సాధనసంపద ప్రధానముగ నాలుగువిధములైనదని చెప్పవచ్చును.

(౧) రచయితల వ్యక్తిగతప్రయత్నము.

(౨) ముద్రాయంత్రాదికముల తోడ్పాటు.

(౩) విశ్వవిద్యాలయముల ప్రోత్సాహము.

(౪) గ్రంథమాలలయు సాహిత్యసంఘాదికములయుఁ గృషి.

నాఁటినుండి నేఁటివఱకు సంస్కర్తలు తీవరించుట యొకటితప్ప, సంఘసంస్కారాభిముఖముగఁ బ్రగతి మనలో మందముమందముగ నున్నది. కావునఁ బ్రతిభావంతుఁడగు రచయిత ముందునకుఁ ద్రోసికొని రావలసివచ్చుటయేగాని మనలో బ్రజాపక్షమునుండి ప్రోత్సాహము తక్కువ. దీనికి మఱల నార్థికస్థితిగతులవంటి కారణములు పెక్కు. కావున రచయితల వైయక్తిక కృషి నేఁడు ప్రముఖస్థాన మాక్రమించు చున్నది.

పిమ్మట నానావిధపత్రికలు, నాకాశవాణియు మున్నగు ప్రజాహిత ప్రభుత్వసంస్థలు సేయునట్టి ప్రోది ప్రశంసింపఁదగును. పత్త్రికలు బహుమానములను సమీక్షలను బ్రకటించు చున్నవి. ఆకాశవాణి వివిధ రచయితలచే నంచలపద్ధతిని[1] నవలా నాటకకథనములను బ్రోత్సహించు చున్నది. పత్త్రికలు గూడ నంచల పద్ధతిని

---

1. ఒక వారములో నొక రచయిత యారంభించి ప్రసంగించు నవలలో నికతమ పదిమంది రచయితలు క్రమముగఁ బది వారములలో ముగింతురు. అట్లే భిన్నభిన్న నాటకకర్తలు రచించిన భిన్నభిన్నాంకములు వారక్రమమున నభినయింపఁబడును.

గథారచనమును బ్రోత్సహించు చున్నవి. పెక్కునవలలు, దినపత్త్రికల సారస్వతాను బంధములయందును బతువారపత్త్రికలలో సశేషమాలాపరంపరలుగ మాసముల తర బడియుఁ బ్రకటింపఁబడుట యెల్ల రెఱిఁగిన విషయము.

సాంఘికరాజకీయపరిణామములవలన నాంధ్రప్రదేశములోని ప్రజాజీవితము నందుఁ గలిగిన ఱాఁకుడప్పులు నాటుఁబోటులు సంఘుతణము వంటివానిని గొన్ని నవలలు వాస్తవికదృష్టితో జిత్రించినట్లే క్రమక్రమముగ మన స్తత్త్వశాస్త్రపరిశోధనములవలనఁ బ్రపంచనవలాసాహిత్యమునందుఁగలిగిన నవ్యమార్గములనుగూడఁ గొన్నిటిని మన నవలలు చిత్రింప యత్నించినవి. అనఁగా బ్రపంచనవలాసాహిత్యములో గలిగిన నూతనవికాసము ముద్రాయంత్రాదికముల సాహాయ్యమువలన మన సాహిత్యములోగూడఁ బ్రతిబింబించినది. బాహిరఁపుజగత్తునందు జరుగు సంఘటనలను మాత్రమే చిత్రించుటతో మన నవలాకర్త లింతకుఁబూర్వము సంతుష్టిఁజెందు చుండిరి. ఇప్పు డాంతరజగత్తులో ననఁగా బాత్రల మనస్సులయందు రేకెత్తు భావ పరంపరకుఁ బ్రాధాన్యము వచ్చిపడినది. దీనిని దృష్టియందుంచుకొని మనస్తత్త్వ మనోవిశ్లేషణశాస్త్రపరిశోధనల ఫలితమునుబట్టి మనలో గొందఱు పాశ్చాత్య విజ్ఞానమును మనకుఁ బ్రదర్శితలకెత్తుటకై నవ్యమార్గములలో నవలారచనముసాగించి పతితల మన్ననలను జూఱకొనిరి.

ఈ నవలల విచిత్రశిల్పము నభినందింపవచ్చుగాక! వీనిలో వాస్తవికత యెంత వఱకున్నదో నిర్ణయించుటమాత్రము వాస్తవికతావాదులకుఁ గుదురలేదు; కుదురఁ జాలదు. ఏలన మనకుఁ బరిచితమైన జగమగుచో నది వాస్తవికముగఁ జిత్రింపఁబడెనో లేదో చెప్పఁగలము. ఎన్నియో పరిశోధనలు సలిపిన శాస్త్రజ్ఞులకే పూర్తిగ నంతుజిక్కని మానవుని మనస్సులో గలిగెడి భావసంచలన మెంతవఱకు వాస్తవికముగఁ జిత్రింపఁబడినదో నిర్ణయింపఁగలవా రెవ్వరు? మరుక్షణమునఁ దన మనస్సెట్లుండునో తానే యెఱుఁగని సాధారణమానవుని నిర్ణయముపై నాధారపడవలెను గదా!

వీని మూల్యము మాటయెటులున్నను నీ తెలుఁగు రచనలు గూడఁ బ్రపంచ నవలాసాహిత్యసాహచర్యమున ముద్రాయంత్రాదికముల పుణ్యమాయని మనలో నెలకొన్నవి.

విద్యార్థుల కుపవాచకములుగ నిర్ణయించియు బహుమతులనుగూడఁ బ్రకటించియు విశ్వకళాపరిషత్తులు నవలలను బోషించుట యుదాహరింప నక్కఱలేనంతటి స్పష్టమైన సంగతి. పత్త్రికలప్రోత్సాహమునఁ బ్రజాసాధారణ్యమునం దెక్కువ సంతోషమునుగూర్చు నవలలు వెలువడుచున్నచో విశ్వవిద్యాలయముల ప్రాపున శిల్పసామగ్రిచే బండితుల మెప్పింపఁగల నవలలు వృద్ధియగుచున్నవి.

నవలలకు గ్రంథములయు గ్రంథమాలలయు నండ యింకొకటి. ఇట్లే సంఘాదుల నవ్యప్రచురణములుగూడఁ జాలఁ జేయూఁత. ఇవి యన్నియు జాతీయోద్యమము, ప్రజోద్యమము వంటివాని ఫలితములుగఁ బొటమరించి విజృంభించుచున్న సంస్థావిశేషములు. విద్య నతురాస్యులస్థాయికి దెచ్చుట వీనికి ధ్యేయము.

నవలాసారస్వతవిస్తృతిసాధనసంపత్తి, సౌకర్యార్థ మిట్లుఁ జతుర్విధముగఁ బోషకశక్తులనుబట్టి విశ్లేషింపఁబడెను. కాని మన ప్రకరణవిభాజనము యుగానుక్రమణిక ననుసరించునట్టిది. అందుచే సాధనసంపత్తినిబట్టి మన నవలాసాహిత్యమును బరిశీలించుటకు వీలుపడదు. ఆ యా నవల లే యే ప్రోత్సాహకారణములచే నుద్భవించినను సాధ్యమైనంతవఱకు రచనాకాలక్రమమునుబట్టి యథాపూర్వకముగనే సమీక్షింపఁబడఁగలవు. ఈ స్వాతంత్ర్యానంతరయుగము బహువిస్తరముగలది. కావున మన క్రమక్రమాభ్యుదయమునుబట్టి సౌకర్యార్థ మిది మఱల మూఁడు ప్రకరణములుగ విభజింపఁబడును.

# స్వాతంత్ర్యానంతర యుగము

## - ౧ -

## *క్రీ. శ. –1947–1953*

### --: ఏకవీర సేనాని[1] :--

భారతదేశము స్వాతంత్ర్యముఁబొందినపిదప విశ్వనాథసత్యనారాయణగారిచే రచింపఁబడిన దీ నవల. సమస్తరంగములలోను స్వాతంత్ర్యపిపాస పెరిఁగినట్లు వెనుక నిరూపింపఁబడిన యానాఁటి పరిస్థితులయందుఁ జాలమందికి స్వాతంత్ర్య మనఁగా, స్వేచ్ఛ; స్వేచ్ఛయనఁగా, స్వైరవిహారము; నీతినియమరాహిత్యము నని యపార్థములు పుట్టినవి. ఆత్మానుభవమైనపిమ్మట నీ దినములలో నించుక నిజము తెలియుచున్నది. స్వేచ్ఛ పరిపూర్ణమైనది కాదు; నిరపేక్ష్యము కాదు; ఎవరిలెక్కలో వారికి శృంఖలము లున్నవి. స్వేచ్ఛ నెపమున నిష్టులను బైకెత్తుటకు, ననిష్టుల నణఁగఁద్రొక్కుటకు వీలుగాదని యిప్పుడిప్పుడు మనకు విదిత మగుచున్నమాట యదివేఱు. దశాబ్దులుగఁ గారాగారములలోనుండి యప్పుడే వెలుపలికివచ్చు బంధితునిదృష్టి, తన్నెదుర్కొనిన మహాకాంతిపుంజముచే నెట్లు మిఱుమిట్లుగొనునో యట్లే స్వాతంత్ర్యభావమువలన మన దృష్టు లా దినములలో మిఱుమిట్లువోయినవి.

---

1. క్రీ.శ. 1948.

దానితో సంప్రదాయము లనినచో జాలవలకు లక్ష్యము సడలెను. ఎవరికివారు తమతోడనే సృష్టియారంభించిన దనుకొనుట; లేదా- పురాతనవిషయము లేవియు సాధువులుగావను నొకరోఁత; అధునాతనములు సర్వము సాధువులనెడి యొక ప్రీతియుఁ బెరిఁగినవి. శతాబ్దులతరబడి బంధతాపపీడ ననుభవించుటవలన నిట్టి యపోహాలు గలుగుట యెందునుఁగలదు. విశ్వనాథవారు-కాదుకాదు-బద్దన్నసేనాని, యిట్లు మాఱు చున్న జాతియందు యుగసంధిలో మిగిలిన సంప్రదాయలేశమునకుఁ బ్రతినిధి; ఆ సంప్ర దాయమును ధిక్కరించి దాని ధాకకు నిలుపోపక నిలువున నిహతినొందినాఁడు.

—: బాదమ్మ బద్దన్నల ప్రణయ పరిణామము :—

ఈ నవలకు నాయకుఁడు బద్దన్న. ఇతఁడు కులముచేతఁ బంచముఁడు; మతము చేతఁ శైవుఁడు. "శివుఁడు జ్ఞానాకృతి; ఆత్మస్వరూపుఁడు; సంఘమేర్పఱచునట్టి రూప ములనెల్లఁబొందు వాఁడుగాఁడు; కావున వీరశైవ మనుదాని కర్థములేదు;" అని పలు కుచు కరవాలభైరవుని ఖండించినవీరుఁడు, జ్ఞానియు వీరశైవఁపు దౌర్జన్యముల నరి కట్టిన శాస్త్రయు ప్రశస్తమైన ఖడ్గవిద్యానిపుణుఁడును బద్దన్న.

ఇతనికి వయస్సు సుమా రిరువదిరెం డేం డ్లుండును. ఈతఁడు తనకుఁ గత్తి విద్యలో గురువైన బాదమ్మను దన మనస్సునకుఁదెలియకయే, తన మనస్సున యామెనుగూర్చి కోర్కెకలదాయను సందేహపూర్వకమైన యూహపుట్టకయే, వలచియున్నాఁడు. బాదమ్మభర్త తిప్పన్న, కడువృద్ధు; భార్యలుపోయినపిమ్మట లక్ష్మీదేవికి ముద్దుబిడ్డఁడైన ముదుసలి తిప్పన్న పడుచుభార్యయగు బాదమ్మను గొను కొనెను. తిప్పన్నదృష్టిలో నిప్పటికిని ముప్పదియేండ్లబాదమ్మ యువతి. బాదమ్మ దృష్టిలో, బద్దన్న యువకుఁడు. ఈ దృష్టివిశేషముల పరిణామము చూపుటయే రచయితదృష్టి. రచయిత కిట్టిదృష్టి యేలయుండవలెనని ప్రశ్నించుట యొక విమర్శన మనుకొనిరి లోకమునఁ గొందఱు విమర్శకులు[1].

లోకమునందున్న సాధారణ సమవయస్క వృత్తాంతమును వ్రాయుటకు విశ్వనాథవారే గావలయునా ? మన విమర్శకులే చాలును. ఒకభ్రాంతి, యొకవైచిత్రి, యేదోయొక చమత్కారము, పఠనానిర్భరకౌతూహలముగొలిపినట్లు, సర్వసాధారణ

1. "ఈ నవల లన్నిటిలోను పురుషుఁడు పెద్దవాఁడు; స్త్రీ చిన్నది. దేశమునకథలు వ్రాయుటకు సమానవయస్కులు లేరా?" (స్రవంతి—పుట 30—పంక్తులు 8, 9. మార్చి 1959). సమాన వయస్కులే యుండవలె ననెడి యౌవనాక్రోశముమాటున యౌవత రక్షణాదికధర్మముగూడఁ బ్రతిబింబించు మనస్తత్త్వము తొంగిచూచుచో, నది యుచితము కా దనలేము.

మగు చౌకబాఱు కథన మెల్ల వేళల గౌతూహలముగొలుపఁగలదా ? కనుక రచయిత యిట్టివాని నవలంబించుట యొకశిల్పచమత్కారము. ఆ చమత్కృతిలో నవసిద్ధాంతముల ప్రతిపాదన మున్నచో,నదినవలాపఠనానంతరముకూడ మనల నాలోచనా నిమగ్నులను జేయఁగలిగి జీవత్కథ యగుచున్నది. అందు సత్యమున్నదేమో పరిశీలింపుమని మనలను యావజ్జీవితము వెన్నాడుచున్నది. దానితో గావ్యధర్మము నెఱవేఱినట్లే! కవి విజ్ఞానమున లోపమున్నచో, నతఁడా మాత్రముచేఁ గవి గాకపోఁడు.

కొప్పాక, ఱాదమ్మపుట్టినయూరు; మెట్టినయూరు గోశాల. అది బద్దన్న కభిజనము. కరవాలభైరవుని సంహరించిన బద్దన్నకు గాయమేర్పడఁగా నీమె వైద్యుని దెచ్చుటయేగాక బద్దన్నకుఁ జాల సపర్య లొనర్చినది. ఱాదమ్మ నకారణముగ బద్దన్న యందనుమానించుచు తిప్పన్న పీడించుచుండును. తన మూలమున ఱాదమ్మకీ కష్టము కలుగుచున్నదని బద్దన్న గ్రహించి యెట్టకేలకు 'నీకు తిప్పన్నయే కావలసినచో మా యింటికి వచ్చుట మానివేయు'మనినాఁడు. దానితో దనకుఁదెలియకున్నను నామెనుగూర్చి తనలో దట్టమై రక్తవిలీనమై మనస్సును స్పృశింపనిదై యున్నకోర్కె పొంగి, యుబికి, ప్రాఁతపడినగాయమును బెల్లగించెను. ఇప్పుడు చూచినచో నిదివఱకతఁడు తనయందుఁ బ్రవర్తించినప్రవర్తన యంతయు నీ కోరిక కనుగుణముగ ఱాదమ్మ కగపడినది. కాని తన ప్రకృతి కొంచెము పచ్చియాఱినదగుటచేతను జీవితసుఖముల ననుభవించుటచే మనస్సు కొంత దిట్టతనమునొందిన దగుట చేతను తిప్పన్న వృద్ధుఁడు, కోపనుఁడునైనను బరువుగ బ్రతికినవాఁ డగుటచేతను ఱాదమ్మ తొందఱపడి ప్రేమింపలేదు.

కాని బద్దన్న కా మనోద్రఢిమ యెట్లుండును? కొప్పాకనుండి యామెకుఁ బుట్టింటివార్తలు దెచ్చితినని పుచ్చకాయలతోఁటకడ లేనిప్రసంగముకల్పించుకొని యాతఁడు పలుకరించుటకు వచ్చినాఁడు. ఆమె యాతనిభావము గ్రహించి విసుగఁబడి నవ్వినది. అయినను నిలఁద్రొక్కుకొనెను. కాని బద్దన్న యూరకొనఁడు; ఇరువురకు దిప్పన్నపొత్తు దొంగిలించుటను గూర్చి వ్యంగ్యసంభాషణము తోఁటయొద్ద నడచినది. పిమ్మట రావిచెట్టుక్రిందఁ, బిదప మండుటిసుకలో, దదుపరిఁ గృష్ణయందలి నీటిపాయయొద్ద, వారి ప్రణయము దుఃఖము, కోపము, విఱుగఁబడినవ్వుట, దుమ్మెగుర(బోయుట, యిర్వురు నెదురుగా గూర్చుండి యొకరి యఱకాళుల నొకరియఱకాళుల కానించి బలాబలములు చూచుకొనుట, కిలకిలలు, పరుగులు, భుజములు, వీపులు రాచుకొని త్రోసికొనుటగా బరిణమించి చెట్టపట్టాలు పట్టుకొనుటలోనికి దిగెను.

బద్దన్న కాత్ర మాగదు. కామవిద్యయందుఁ బరిచయములేని యాతని బుద్ధి కామెవచ్చి తన్నేల కౌఁగిలింప దనిపించును. మన్యువేగము మితిమీరఁగ నతఁడు పుచ్చకాయబద్దతో నామెవీపు బాఁదినాఁడు. ఆమె యిదియంతయు గ్రహింపకపోలేదు.

కాని తా నస్న్యునిభార్య; ఏమి చేయఁగలదు? తొల్లి జబ్బులోనొవ్వఁ బలికినందుల కాతఁడీమెను మన్నింపుమని వేఁడికొనెను. కాక, చేయునది యేమున్నది? నిన్ను గొట్టుటకు నాయొద్దఁ బుచ్చుబద్దలు లేవు గదా? యని యామె యాతనితో జాలిగఁ బలికెను.

రాజకీయములలో మనస్సు పక్వమైనట్లు బద్దన్నకుఁ గామవిషయమునఁ గాలేదు. అనుమానముచే దిప్పన్న, బాదమ్మ నింకయుఁ బీడించుచున్నాఁడు. ఆమె నింటి నుండి గెంటివేసెను. అప్పుడామెకు బ్రాణమంతయు బద్దన్నగా గనిపించినది. వయస్సు వచ్చినప్పటినుండియు నా వయస్సు వంట యామెకుఁ గనిపింపలేదు. తన ప్రేమ యంతయు బద్దన్నకోసము కూడుపుఁగట్టి యుంచెను. అది యిన్నాళ్లకుఁ బంట మొగముతిరిగినది. వెంటనే యామె బద్దన్న యింటికిఁ బోయెను. ఆమెను జూచి యతనికి జాలి కలిగినది. కాని ప్రణయమునఁ బ్రౌఢిమ నెఱుఁగనిది యాతని లేఁత వయస్సు. బద్దన్నతండ్రికూడ నూరలేఁడు. పరిస్థితు లాతనిని బలవంతపెట్టి యా పనులు చేయించు చున్నట్లుండెను. పై పెచ్చు బద్దన్న కొలబద్దవేఱు. బాహ్యా లోకమునుండి విషయముల నతఁడు తెలిసికొనఁడు. తాను బాదమ్మను బ్రేమించెను; కావున నెవ్వరును దానిని దోష మనరాదు. లోకము తనకొలకు గాదు; తాను లోకముకొలకు. ఇతని ప్రణయ మింతటి స్వార్థపరమైనది.

దెబ్బలుతిన్న బాదమ్మ కాతఁడొడలెల్లఁ గాఁచెను. అదివఱ కెఱుఁగని యామె శరీరము కొంచెము కొంచెము బద్దన్నకుఁ గనిపించినది. అప్పుఁడాతని కది మును పెఱుఁగని యొక విచిత్రానుభవము. అతని యొడ లతనికే తెలియదు. వారి సుఖానుభవములో బద్దన్నతండ్రి యింటలేనికాలమంతయు నొక త్రెంపులేని ప్రవాహమై కాన్పించును. వారి యొడళ్ళు వారి కిక్షుఖండములవలెఁ బర్వపర్వమధురములై యున్నవి. ఎంతైనను గామరసికతయందు బాదమ్మ శిక్షితురాలు; బద్దన్న యశిక్షితుఁడు. ఇతని కామెయందుఁ బూర్వముగల గురుభావములో నామెవేఱు; తాను వేఱు; ఇప్పటి యీ గురుత్వభానములో నామెయుఁ దా నొక్కటియే!

ఒక్కప్రొద్దున నానాఁడు తనతండ్రి వచ్చునని బద్దన్నకు దోఁచెను. అప్పటికిఁ దమ యొడళ్ళెఱుఁగనిస్థితిలో బెరభావముయొక్క ముద్ర వారిమనస్సులపైఁబడె నన్న మాట. బద్దన్న కెట్లును దుర్దనమందుని జూడఁబోవలసియున్నది. కావున నతఁడు బాదమ్మతోగూడి పోనెంచినాఁడు. బాదమ్మసుఖమునకు మేరలేదు. బద్దన్నపై విశ్వాసము పదిరెట్లయ్యెను. చూచినచో బాదమ్మ ముప్పదియేండ్లదివలెఁ గనిపింపదు. ఇరువదియేండ్లదిగా నగపడును. ఇరువురు బేళ్ళుమార్చుకొనిరి. బద్దన్న కామెతోడి యా ప్రయాణము వేల్పువీటికిఁ బూలతెరవువెంటఁ బోవుచున్నట్లుండెను.

అతనికి సంసారానుభవములు ప్రారంభింపఁజొచ్చినవి. 'నాదెండ్ల'లో వారు కొంతకాలము గడపిరి. అట్లతఁడు రాజకీయములమీఁదఁ దిరుగుచున్నను సంసారానుభవముల కష్టసుఖములు తల మునుకలుగ ననుభవించుచునేయున్నాఁడు. ఒకరి నొక రనుకొనుచుఁ బడుచు నుండిరి. బద్దన్న యొకప్పుడు నీవే నాప్రాణమ వనును. విసుగుగలిగినచో నిన్ను నేను లేవదీసికొని రాలేదు; నీవే వచ్చితి వనును. అల్లే యొక్కొక్కప్పుఁ డామెయు నతనిపై ప్రణయకోపముచే 'నీవు నన్ను తలమునుఁగ దాఁడి ప్రమాణముదాఁక ముంచితి' వనును; మఱియొకప్పుడు ముదుసలిభర్తలతో గాఁపురముచేయువారికిఁ బ్రేమ దెలియదనును. ఇంకొకప్పుడు రాచపడుచుల కత్తి యుద్ధప్రసక్తి వచ్చును దానితో రైకలయుఁ గోకలయు ముడులు కోయుటను గూర్చి ప్రసంగములు రాఁగలవు. కామస్వరూపము తెలియనప్పుడు ప్రేమించుట వలనఁబాపము రాదని యొకరు వాదింతురు. తమ ప్రేమలు భగవంతుఁడు కల్పించిన వని యింకొక రనుకొందురు.

ఇట్లు వారి ప్రణయజీవితము గడచుచుండును. నంబయ్యచే దిరస్కృతుఁడైన బద్దన్నకుఁ ద్రిపురాంతకుని వేంగినడిమేరుల విషయాధీశునిగఁ జేయవలెనని కోరిక పుట్టినది. నంబయ్య మౌర్ఖ్యము నందుమూలమున రాజునకు వెల్లడింపవలెనని యాతని యుద్దేశము. ఈ సంగతి యర్ధరాత్రమున నిద్రలో దోఁచి యతఁడు చరాలున లేచి ప్రయాణమై పోవుచు బాదమ్మను కొప్పాకపొమ్మని హిత ముపదేశించినాఁడు. తన కర్తవ్యమంతయు నెఱవేఱి తిరిగి యతఁడు కొప్పాకకేఁగుసరికి వా రిర్వురకు బూర్వ సౌఖ్యానుభవములు లేవు. చిక్కియున్న యామెయొడలు, కౌఁగిలికిఁ దక్కువ యయ్యెను; పెదవి, చుంబనమునకు వెలితియయ్యెను.

బద్దన్న కిప్పుడు నిముస మూపిరితీసికొనుటకు వీలులేనంత పని; దేశము స్వతంత్రమైనది. తా నిఁక సేనానిగ బ్రతుకుట చాలవఱకు విరమించుకొనినాఁడు. బాదమ్మయందలి తనప్రేమ లోకమున వ్యభిచారముగ భాసించినదని కష్టసుఖములచే నతఁడు గ్రహించుకొనెను. వా రిరువురు నిపుడు సాధారణమైన పాటుమానిసులుగ జీవితము గడపుచుండిరి. త్రిపురాంతకుఁడు తన కొసంగిన విజయవాటముపై నధికారము చెల్లించుకొనుటకుఁగాని తండ్రియిచ్చిన పొలముత్రొక్కించుకొనుటకుఁగాని బాదమ్మ యెంతపోరినను బద్దన్న పట్టించుకొనఁడు. యుద్ధములుచేసి సైన్యములుకూర్చి యాతఁడును గత్తివిద్యనేర్చి యాతనిని వలచివచ్చి యామెయు, నెట్టకేలకుఁ దాము సుఖ మనుభవించుటకై యట్లువచ్చితిమన్న విషయమునే మఱచిపోయిరి.

కొన్నా ళ్లిట్లుఁ గడవఁగా, బద్దన్నపై గిట్టని కొందఱు కొలముపెద్దలు బాదమ్మనుగూర్చిన యభియోగము దెత్తురు. వీరు గ్రామములుదిరిగి దానినుండి తప్పించుకొనఁజూతురు. కానిదాని విచారణవేళ దాఁపైనది.బద్దన్నకు దిగులుపెఱిగెను.

కాని యామెలో నుత్సాహరేఖయే ప్రకాశించెను. తలదువ్వుకొని. కొప్పుపెట్టి చెంగావి చీరెఁగట్టి తనకున్న నగలన్నియు బెట్టుకొని యామె నాఁటిరేయి బద్దన్న యెదుట నిలిచినది. ఆరేయి వారియిద్దరి శృంగారము వెన్నెలలు పట్టలేదు.

నాఁటి సాంఘికపరిస్థితులనుబట్టి తనకుఁబట్టనియభియోగమునుదెచ్చిన యొకానొకవాదితో గత్తియుద్ధముచేసి ప్రతివాది తన నిర్దోషిత్వము నిరూపించుకొనవలెను. సంప్రదాయవిరుద్ధమైన తన యధర్మశృంగారమునకుఁ బశ్చాత్తాపపడినట్లు బద్దన్న యనమర్థుఁడైన నంబయ్యకత్తికి బుద్ధిపూర్వకముగా బలియైనాఁడు. ఎన్నెని పర్యాయములు తమ ప్రణయ ముత్తమ మైనదని పైకిఁజెప్పుచు బద్దన్న లోనమాత్రము కుములుచువచ్చినట్లుగఁ దన్ను దాను గత్తితో గ్రుమ్మికొని బద్దన్నశవముపైఁబడి మరణించునప్పుడుగూడ బాదమ్మ తమది లింగజ్ఞానాతీతమైన ప్రణయమనియు లోకమువారి సూత్రములు దానికిఁబట్టవనియు నుద్ఘాటించుచు సంప్రదాయమును లోకధర్మమును నిలఁబెట్టుటకై మాత్రము మరణించినది 1.

తొలుత ధర్మముతో బాదమ్మయుఁ గామముతో బద్దన్నయుఁ దమ ప్రణయ జీవితముల నారంభించి, తుద కామె ప్రేమతోడను నతఁడుధర్మముతోడను ముగించి రన్నట్లు వర్ణించి వారి ప్రణయ వృత్తాంతపరిణామము మూలమున రచయిత వక్రరీతిని సంప్రదాయధర్మములను నిలబెట్టెను .— ఇట్టి ప్రియులు తమ్మిదాము సమర్థించుకొనఁజాలరు రని రచయిత ముసుఁగువడ నుపాలంభించిన గడుసుపోకడను విమర్శకులు గమనింపనికారణమువలనఁ బాత్రలశీలములకే యపార్థములు కల్పింపఁ బడినవి. అందుచే నీ నవల దుర్వ్యాఖ్యావిషమూర్ఛిత యయ్యెను2.

*"అతఁడు జారుఁడుగాఁడు; నేను జారిణినిగాను. మా ప్రేమకు మీసూత్రములు పట్టవు. మాది లింగజ్ఞానాతీతమైన సంబంధము," అన్నది రచయితకాదు. విమర్శకు లట్లనుకొనుట పొరపాటు. లింగజ్ఞానాతీతసంబంధవిషయము నవలలో దుదివాక్యముగ

---

1. The innocent lie, on her dying lips, was like that of Desdimona's, to save the reputation of her Lord.

2. "బద్దన్న బాదమ్మలసంబంధము లింగజ్ఞానాతీతమైన సంబంధమని రచయిత చెప్పినాఁడు. కాని ఆమాట రచయిత మాటలోనే వున్నది. కాని నవలలో దాని చిత్రణము ఎక్కడా లేదు." రసభుని; 'విశ్వనాథసాహిత్యసమాలోచనము'; ౭. స్రవంతి — పుట 31 —పంక్తులు 14—16(మార్చి, 1959). ఈ విమర్శన కేవల మొక యింగ్లీషు.ఎం.ఏ., పట్టభద్రునిదే యనుకొనరాదు. నవలాకారునకుఁ జాలఁ బ్రియమైన శిష్యుని వాగ్వైఖరిగ దీనిని గ్రహింపవలెను.

భాదమ్మచే నుపన్యస్తము[1]. అట్లనిపించినది యీ నవలపులో(తు. పాత్రల స్వభావ మెఱి(గినవిమర్శనము సహృదయవిమర్శనము. ఈ నవలలో నాల్గవప్రకరణమున( బుచ్చతో(టసన్నివేశమునందలి చమత్కారమును నాఱవప్రకరణమున నాయికానాయకుల ప్రథమసమాగమము, వారివారి మనస్తత్త్వములు, వా రనుభవించిన సుఖాభాసమును, బదియవప్రకరణమునందు భాదమ్మ కత్తిసాము ప్రదర్శించిన సన్నివేశమును వంటివి యుత్కృష్టములు. వీనిని బరిశీలించినచో శీలముల నపార్థముచేసికొనుట యుండదు.

బద్దన్న

బద్దన్నజీవితము ప్రధానముగ రెండు తెఱ(గులైనది. (౧) ఖడ్గజీవితము; (౨) ప్రణయజీవితము. ఇట్లు విభజించుట కేవలము సౌకర్యార్థమేయైనను ఖడ్గజీవితమునం దత( డెంత సిద్ధహస్తు(డో, ప్రణయజీవనమునం దంత యమాయకు( డనవచ్చును.

కరవాలభైరవుని గుఱ్ఱ(పుముంగాళుల నొకటివెనుక, రెండవదిముందుగ అంఘనవేగములో నున్నప్పు డొకేమాఱుగ నరకుటయందు బద్దన్న కరలాఘవఖడ్గలాఘవములు వెల్లడియగుచున్నవి. ఇత(డు శత్రువుధరించిన కవచము తుత్తునియ లగునట్లుగ నొక్క క్రమపద్ధతిలో విహరింప(గల(డు; ఒకేదెబ్బతో గుఱ్ఱము రౌతులిర్వురుగూడ రెండు తుండెము లగునట్లు ఖండింప(గల(డు; శత్రువుచేతివ్రేళ్లు తెగిపోవునట్లు కత్తిదూయ(గల(డు. వేయేల కొప్పాకకత్తివిద్యకు(, జాళుక్యులవిద్యకు( దనకాలమున(గల పలుకత్తిసాములకు నీత(డు సమీకరణశక్తి యన(దగినవా(డు. ఈ విద్యయం దీతనికి భాదమ్మ గురుత్వము నెఱపెను. అదియే వారి ప్రణయజీవితమునకు దారితీసినది.

తొలుత కరవాలభైరవునితోగాని కథలో నడుమనడుమ నితరులతోగాని కట్టకడపటికు నంబయ్యతోగాని చేసిన కత్తియుద్ధములో నీత( డెన్న(డు నాత్మవిద్యాస్తుతి చేసికొనినది లేదుసరికదా; యెదిరి విద్యనుగూర్చి ప్రశంసావాక్యములనే పలికెను. కాని, యక్కఱయగుచో శత్రువులగుండెలు వ్రీలిపోవ(గల వ్యంగ్యార్థ మొప్పువాక్యములు పలుక(గల(డు.

బద్దన్న యం దన్నిటికంటె(గల గుణము సంప్రదాయబద్ధత. అత(డు తన కులము తా నెఱు(గును; దాని యర్హానర్హత లెఱు(గును. అట్లే యనర్హతగల విషయములలో వినయభూషణు(డై మెల(గెను. "దొరా! నాచర్మముగోసి నీకు

1. 'బద్దన్నసేనాని' పుట 252—తుదివాక్యము—పంక్తులు 6,7(1948).

చెప్పులుకుట్టించి యిచ్చెదను; చూచితివా, నాకులము నామాటలలోనే వెల్లడియగు చున్నది," యనిపలికి "నీకులముగాదు, నీ వినయము వెల్లడియగుచున్న"దనెడిఁ బ్రశంసల నందినాఁడు. అంతేకాదు. తా నర్హుఁడుగాని పదవులను గోరకపోవుట యందును దాను దేశమును శత్రువులచేతినుండి విడిపించినను బూర్వచక్రవర్తులే దానిని బరిపాలింపవలెనని కోరుటయందును దాను బాదమ్మను బ్రేమించుటవంటి విషయములలో నొకవేళ మర్యాదను ధిక్కరించినచో నర్హమగు శిక్షకు సంసిద్ధుఁడై బొమ్మిచ్చి కత్తిని దూసిపోనిచ్చుటయందును సంప్రదాయపాతివ్రత వెల్లడించినవాఁడు, బద్దన్న. అందుచే నీతని నెఱిఁగినవారు సర్వథా. సర్వదా సంప్రదాయబద్ధుఁ డందురు.

బద్దన్నయందు కులమునుగూర్చిన పొరబుద్ధులు లేవు. కులవైషమ్యములతో సంఘము కొంకులుపోవుచున్నకాల మిది. మానవహృదయమున స్వార్థరాహిత్యాది పరివర్తనములు రానంతవఱకుఁ బ్రయోజనము లేదని యెంత పొంకముగనో రచయిత బద్దన్న పరముగ నిరూపింపఁగలిగెను. కత్తివిద్యనేర్చిన తమ యెల్లరిది యొక కులము. పదుమూఁడువందలమంది తమకులమువా రున్న సైన్యములో నొక చతుర్థకులజుఁడు కలఁడఁట!"ఆయనతో మనకు పొరపులేదు.అతఁడుమనగురువునకు శిష్యుఁడు. మనయంద ఱకు నొకగురువువిద్య." ఇది బద్దన్న కులసమన్వయదృష్టి. ఈ దృక్పథము మనలో నొకప్పు డుండెడిది. మఱల నిది రావలయుననుట, కాలమున కెదురీఁత గావచ్చును. ఐనను నిది రచయిత యాశయము. ఈఁతకు మిక్కిలిలోఁతు లేదు.

"కత్తియుద్ధముచేసి గెలిచినచో నను గెలిచినవాఁడు సేనానాయకుఁడగు"నని పలికి పదునొకండ్రతో గటారితనము నెఱపి మఱియుఁ బదుమూఁడువందల సైన్యమునకుఁ దనయందు లక్ష్యము కుదురునట్లు జేసికొనినవాఁ డగుటచే బద్దన్నకుఁ బ్రజలమనస్తత్త్వ నిదానము తెలియు ననవచ్చును.

పశ్చిమచాళుక్యుల యధికారమును ధిక్కరించి తనదేశము నుద్ధరించుటకుఁ దగిన పన్నుగడ లన్నియు లేవదీసిన, విప్లవమంతయు జరిపిన యెల్ల యాందోళనమును బద్దన్న మేధాజనితమే ! కావున నీతని నొక విశిష్టమైన విప్లవకారకుఁ డనియు వీరుల నాకర్షింపఁగల నేతయనియుఁ జెప్పనొప్పును. ఆ నాఁటికే ప్రజలకుఁగూడ రాజ్య విషయములు పట్టవలెనన్న వాఁ డీతఁ డొక్కఁడే కనిపించినాఁడు.

కొప్పాకలో ముదుసలి వీరునియొద్ద మొదటఁ గొంతగ యౌవనోచితాహంకా రము బ్రదర్శించియు నీతఁ డా వృద్ధుని దాను దాఁకలేనని వెంటనే గుఱుతింపఁ గలిగెను. తన్మూలమున గుణపక్షపాతము కుదిరి, పూర్తిగ నహంకృతి యుడిగి, వినయ మలవడి, కొప్పాకవిద్యనేగాక యాతఁ డావృద్ధునికడ నౌత్తరాహుల విద్యను గూడ నేర్చుకొనుట సంభవించినది.

ఈతనికి బాదమ్మ, ఖడ్గవిద్యతోబాటు ప్రణయవిద్యయు నేర్పినది. ఈమె నేర్పిన శస్త్రవిద్యవలననే యుద్ధమునం దాతడు కరవాలభైరవుని గెలిచెను. ఆ యుద్ధమున నేర్పడినగాయమునకే యామె చికిత్స చేసినది. అది మానుపట్టుచుండ నా గాయముపుట్టి యెగిరిపోవునట్లుగ నామెపైఁగల యనురాగ మాతని మనస్సునుండి పైకుబికెను. పోనుపోను ప్రణయ జీవనఘట్టములో దినదినాభివృద్ధినొందిన యాతని మనసునం దధర్మభీతియొకటి కలిగినది. ఐనను జన్మజన్మాంతరవాసనగల దనఁదగు నా యనురాగమును నిగ్రహించుకొనలేక పోయినాఁడు. కొప్పాకపోయి యామె తల్లిదండ్రులతో మాటాడివచ్చితినను నెపముగల్పించుకొని యాతఁ డామెతోడి ప్రణయమును బరసీమకుఁ గూర్చెను.

తన్నుగూర్చి యితని కెన్నఁడును భయములేదు. దేశస్వాతంత్ర్యమునుగూర్చి మఱల నింతయత్నముఁచేయువారు తొందరలో దొరకకపోవచ్చునని యితఁడు తన ప్రణయజీవితమునుగూఁడ దిరస్కరించెను. దేశమున శాంతి నెలకొనినపిదపఁ దాను సాధారణభటునివలె నగుదు ననియు నప్పుడు ప్రణయమే పులకరింపఁ బ్రణయజీవిత మనుభవింపవచ్చును గదాయనియు ననుకొన్న స్వార్థరహితుఁడు బద్దన్న సేనాని.

పుచ్చకాయలతోఁటయొద్ద బాదమ్మతోడి యాతనిమాటలు మొదలైనవి వ్యంగ్యవైభవముగల ప్రణయసంవాదములకును కరవాలభైరవుఁడు నంబయ్యా మున్నగువారితో బలికిన యుద్ధసమయములోనిపలుకులు వ్యంగ్యార్థములుగల వీరరససంవాదములకును నిదర్శనములై యున్నవి. బాదమ్మతో బ్రణయసాంఘికాదివిషయములలో నాతఁడు కొన్నికొన్ని యెడల నంత గంభీరముగ సమాధానము లిచ్చును.

స్వార్థరాహిత్యముతోబాటుగ నాత్మప్రత్యయము,వినయపరత్వము నీతనియందు నెలకొన్నవి. ఎట్టిదైన నీతనిలో మనస్సుచేనూహించువిషయములయం దెంత సునిశితత్వము గలదో, కొన్ని లోకవ్యవహారములు తెలిసికొనుటయం దంత మాంద్యముగలదు. రాజకీయములలో బరిపక్వమునొందిన యా మనస్సు కామచారమునం దపరిపక్వము. బాదమ్మను దాను బ్రేమించెను; కావున నెవ్వరు దానిని దోష మనరాదను నహంకారమాతనిది. దీనికి హేతువు, తమది లింగజ్ఞానాతీతమైన సంబంధమనెడి యొక దురహంకృతి. సహజమైన యా యమాయికతకు సహృదయులు మధురభావపులకితులై జాలి నొందుదురు. ఒక్కొక్కప్పు డాతనిది తాను లోకాతీతుఁడ ననుకొనునంతటి యహంకారము. సందర్భమునుబట్టి యాతఁడు సజ్జనులయెడ వినయమును, దుర్జనుల యెడ దౌష్ట్యమును జూపఁగలఁడనుట కిట్టివెన్నో యుదాహరణములు.

బద్దన్నకుఁ బ్రజ్ఞయు వినయమేగాక రాజనీతిజ్ఞతయు మిక్కిలి కీర్తినార్జించిపెట్టినది. కత్తులు కటారులు మొదలైనవానిని యుద్ధవేళలలో గూఢత్వమునకై చర్మవర్తకులపరముగ నెగుమతిచేయించుట యిందులకుఁ దార్కాణ. ఈ స్వాతంత్ర్య

యుద్ధమునకు "నీవు బ్రహ్మవు; నీవు విష్ణువవు" వని దుర్జయమందుఁ డీతనిని బొగడెను. విష్ణుశర్మ త్రిపురాంతకులుగూడ నీతనిని మహారాజునొద్ద నగ్గించిరి. పాలి మేరయూళ్ళలో నొకవీరుని యధికారమేగాని స్వదేశాభిమాన మనునది యుండదని నంబయ్య యెఱుఁగని రాజనీతిని దాను దెలిసికొన్నవాఁ డగుటచే నీతని పన్నుగడలు కొనసాగినవి.

"మనలో మాటాడునది మనోవిషయకమైన ద్రోహము" ని గాంగునితో, బద్దన్న పలికెను. కావునఁ గ్రియారూపమున గాదు; మనస్సుచేతనైనను రాజద్రోహము తలఁపరానిదని యాతని రాజనీతి పలికించినది. అతనియం దాత్మపరిశీలనము గలదు. కాని యతనిని దోషరహితుఁ డనలేము.

నంబయ్యపైఁ గోపముచే త్రిపురాంతకుని రాజుగాఁ జేయించిన దీతనిలోఁగల పగసాధించు గుణము. అధికారవాంఛలేక స్వాతంత్ర్యాభిలాషమాత్రమే గలవాఁడయ్యును దానిని నామమాత్రముగనే యుంచెనుగాక! అయినను విరోధముసాధించు గుణమునకే యది నిదర్శనము. వ్యూహములు పన్నుట, సేనలు సమకూర్చుట ప్రవహించునదిలో గజాశ్వయుద్ధముల నడపించుట మొదలైనవి, మన కాతని యుపజ్ఞతను బట్టించును.

త్రిపురాంతకుఁ డొసఁగిన రాగిరేకులుగల మూటను మిత్త్రిని బుద్ధివిని విప్పకుండుటలో మిత్త్రివాక్యపరిపాలన మున్నది. బాదమ్మపైఁగల తనప్రేమ లోకమునందు భిన్నముగ భాసించినదని తెలిసికొనుట కీతని వయస్సుగాని బుద్ధిశక్తిగాని చాలలేదు. తనకీర్తి కది మచ్చదెచ్చినదని క్రమక్రమముగఁ దెలిసికొని యేమిలాభము? భక్తిభావము లేని బద్దన్నకు శరీరమే లేదు. ఈతనికిఁ గొందఱయెడ నింత దాసభావ మన్నమాట.

పోనుపో నేదో యొక దైన్యమును వెల్లడించిన బద్దన్నలో దన కంత దేశభక్తి యున్నను దనయందు దేశమున కింతయేని కృతజ్ఞతలే దనెడిభావ మొకటి స్ఫురించి, యాత్మప్రియంభావుకత్వమును బెంపొందించును. ఆత్మగౌరవముగల యాతనికి బాదమ్మ తనమూలమునఁ గూలినాలికి దిగుట తలకొట్టుకొనిన ట్లున్నది. తా మెన్నఁడు కూలిచేసికొనినవారు గారు. నాగయ్యతో యుద్ధముచేయుటయే తనకత్తికి మర్యాదానష్టమని యాతఁడెఱుఁగును. నంబయ్యగారితో 'దొరా! నీచేతిలో నేను చనిపోయినచో మర్యాదానష్టము లేదు' అనుచు బద్దన్న తిరిగి యుద్ధమారంభించుటలోగూడ నాత్మగౌరవము మరణనిశ్చయమును వెల్లడి యగుచున్నవి. అతఁడు రాజకీయవిషయములయందును ప్రణయవిషయములయందునుగూడఁ బోనుపోను మనస్సన్న్యాసియైనాఁడు. బాదమ్మతోడి యాతని తుదినాళ్ళ జీవితము చాల విరక్తితో గూడినది. అట్లే నంబయ్యపైఁ గత్తిదూయకపోవుటయందును నాతనిదైన వైరాగ్యము సువ్యక్తము.

ఇతఁడు స్వార్థ మెఱుఁగని వీరుఁడు. పోనుపోను ప్రణయవిషయములో దన తప్పు దా నెఱిఁగి సంఘమునుండి యధర్మమును శాశనమొనర్చుటకై విట్టనిలువునఁ బీలయగు నంబయ్యకు బలిగావలయునని బలియైన త్యాగయశోధనుఁడు. అన్ని విషయములచేత నీతని దాదర్శకమైనపాత్ర. ఇందుఁ జైతన్యస్ఫూర్తియుఁ గ్రమతః బరిణతియుఁ గలవు. జాతీయోద్యమదినములలో మనజాతిలో వెల్లడియైన నిస్స్వార్థపరతకు, ధర్మదృష్టికి, త్యాగశీలమునకుఁ జైతన్యస్ఫురణకును బద్దన్న యొక ప్రతినిధి.

**బాదమ్మ**

ముసలితిప్పన్న పడుచుభార్య బాదమ్మ; ముప్పదియేండ్లది; కొప్పాకపుట్టిల్లు. అచట ఖడ్గవిద్య పంచములయందే కలదు. ఆ పంచమవర్ణస్థులలో స్త్రీలయందునుగలదా విద్య. దానిలో బాదమ్మ బద్దన్నకు గురుస్థానీయురాలు. అతఁ డీమెవేర్పిన విద్య వలననే సేనానాయకుఁ డైనాఁడు. ఈమె తన ఖడ్గవిద్యానైపుణ్యమును గాంగుని యంతఃపురస్త్రీలతో మైత్త్రిసూచకమైనసాములోఁ బ్రదర్శించెను. ఎదిరికాంత లై దాఱు సారులు చేయియెత్తినప్పుడు సాములో గత్తిపదను శరీరమునకు సోకకుండునట్లుగ నీమె వారి రైకలను నెమ్మదిగఁ గత్తిరింపఁగలదు. అట్లే స్త్రీలలో స్త్రీలు వరుసవావులకు పదినమఱఁదం డైనపుడు కత్తియుద్ధముచేయుచు నొక రొకరి కోకముడులు కత్తిరించుకొను విద్యగూడ నీమె నేర్చెను [1].

తిప్పన్నకు బాదమ్మయం దనుమానము. భర్త కెట్లును శంకయేయని కాబోలు, తనకు బద్దన్నపై వల పంకురింపకపోయినను బదన్న తన్ను వలచినప్పుడీమెకుఁ గోపము రాలేదు. ఈమెకు మాటనేర్పు మెండు. తిప్పన్న తనకు మగఁడగుట, తన బాబునకుఁ బది నిష్కములు, బది నివర్తనములు నిచ్చుటపాటిదే యన్నది, బాదమ్మ. పుచ్చకాయలతోటఁకడ బదన్నతోడి సంభాషణమందును బిమ్మట నాతనితోడి సుఖదుఃఖములయందును నామె వాగ్వైభవము స్పష్టమగుచున్నది,

కరవాలభైరవునివలన గాయపడిన బద్దన్నకుఁ జికిత్సచేయింప నామె బ్రాహ్మణ వైద్యునికడకుఁ బోవుటనుబట్టియు, బదన్న పైకిరావలసినవాఁడు గాన నతనితో దనకు లేనిపోనిసంబంధములంటకట్టవలదని భర్తతో జెప్పుటనుబట్టియు బాదమ్మకుబద్దన్న

(1) శ్రీ విశ్వనాథవారికిఁ గత్తియుద్ధమనిన ప్రీతి. తన్ను గజ్జలతో నెదిరించిన రెండువందల మందిని 'వేయిపడగల'లో గృష్ణమ నాయఁ డడ్డఁగలఁడు. (పుట. 24-వరుస 1-తుది పేరా,1939). 'భగవంతునిమీఁదపగ'యను పురాణవైరి గ్రంథమాలలోని ప్రథమ నవల యందు వీరుల విద్యాప్రదర్శన సందర్భమున సుమారు వందపుటల ఖడ్గయుద్ధ ప్రసంగముండును. 'కడిమిచెట్టు'న భల్లాతవర్మ, మయూరశర్మయు, జేయు ఖడ్గయుద్ధము సుదీర్ఘముగ వర్ణితము.

పై(గల ప్రీతి వెల్లడియగును. ఆమెప్రకృతి ప్రణయప్రకృతి. అదికొంత పచ్చియారినది. అందుచే బద్దన్న చిత్త మెఱి(గియు( దా నామె యాతనిని ప్రేమింపరాదనిదృఢత్వము బూనెను.

యుద్ధవిషయములయందున్న యాలోచనము బద్దన్నకు మఱియొక విషయమున లేదనియు, నాతనికి ముందుముందు విరోధులెక్కువ యగుదు రనియు(బ్రస్తుతము వారి కాతనితో బనియుండుటచే నాతని ప్రణయవర్తనమును సహించు చున్నా రనియు లోకముదృష్టిలో దమ నడవడి తప్పిదమైన దనియు: దమరు లోకమున నున్నా రుగాని తమరు తమరుగా బ్రతుకుట లేదనియు, గ్రహించుకొని చాలమారు లామె బద్దన్నకు లోకజ్ఞానము బోధించినది. తాను వెంకమ్మయనియు, బద్దన్న నాగన్న యనియు మాఱు పేరులతో బ్రతుకుట యామె కిష్టములేదు.

చూడ(జూడ( గ్రామముతో నారంభించిన బద్దన్నజీవితము ధర్మముతో బర్యవసితము. ధర్మజ్ఞానముతో నారంభించిన బాదమ్మజీవితము పోనుపోను ప్రేమతో బర్యవసించెను. 'నీ భర్తకంటె నింకను ముసలివారగు భర్తలతో స్త్రీలు చాలమంది కాపురము చేయుచున్నారు; నీకంటె( బదియేండ్లు చిన్నవానితో నీవులేచివచ్చితి'వని బదన్న యొకప్పుడన(గా,'వారికి ప్రేమయన నేమో తెలియ' దన్న ది బాదమ్మ. ఇది వారి ప్రణయజీవితములో గలిగిన వ్యత్యస్త పరిణామము.

తిప్పన్నతో బద్దన్నను దారతమ్యముచేసిచెప్పుచు: దిప్పన్న ప్రకృతి ధనాభిలాష గలదిగావున మెత్తదనము తెచ్చుకొనదనియు, బద్దన్నప్రకృతిబాల్యమునుండియుమృదువైనదనియు నీమె చెప్పెను. అన(గా నతనిప్రకృతి సహజముగ మృదువైయున్నను నా మృదుత్వము బాల్యమునకు( జెందినదిగాక, యూహకు(జెందినమృదుత్వ మనియు, నందుచే మృదుత్వమనగా దనభాషలో నిశితత్వ మనియు నీమె వ్యాఖ్యచేసి చెప్పినది. పూర్వము బద్దన్నయందు స్వార్థములేదనియు( బోనుపోను యుద్ధముముగిసిన పిమ్మట లోకదృష్టిచే దోషముతోగూడిన స్వార్థమేర్పడినదనియు వివరించెను. "కొందఱు మనుష్యులు శరీరముతో దక్కువ జీవింతురు;మనస్సుతో నెక్కువజీవింతురు. సాధారణులకు మనస్సు కన(బడనిది.మన మనస్సు మనకు( గన(బడుచున్నది. ఎల్లరకు నా శక్తియుండదు. మన కగపడు మన మనస్సుల ప్రకారము మనము నడచుచున్నాము. లోకులు తమ కగపడు ప్రపంచము ప్రకారము తాము నడచు చున్నారు." అని పలికి లోకమువారికంటె( దమ విశిష్టత నీమె బద్దన్న కుపన్యసించు చుండును.

బాదమ్మ మానవమనస్తత్త్వ మెఱిఁగినది. 'నీయం దొక దోష మారోపించుకొని యా దోషమును వ్యాపింపఁజేసి యాదోషముచేత నేనెంతవఱ కావరింపఁబడుదునో యూహించి యా మేరవఱకు నా నిందను ద్విగుణీకరించుకొని నాతో మాటాడమికి మొగముచెల్లమి తెచ్చిపెట్టుకొంటివి' అని యామె బద్దన్న మనోవ్యాపారమును టీకాప్రాయ మొనర్పఁగలదు.

ఒకప్పుడు కోపముచే బద్దన్న మఱల దేశమును విభజింపఁగల ననఁగా, జేసేతుల స్వాతంత్ర్యము తెప్పించిన యాతఁడే యట్లుఁ జేయుట న్యాయముగాదని యామె చేసిన యుపదేశము దేశాభిమానమును జాటుచున్నది.

బద్దన్న కామ మెఱుఁగని పసివాఁడనియుఁ దా నెఱుఁగని దోషముచేత బాధపడుచున్నాఁడనియు నతనికి జీవితప్రఘాణమునఁ దనవంటి యంతరాయము తగిలిన హేతువుచే బ్రతారింపఁబడినాఁ డనియు నప్పుడప్పుడు బాదమ్మ తన్ను దాను నిందించుకొనుట యామెయందలి పశ్చాత్తాపగుణము.

వైష్ణవమతరహస్యముల నెఱిఁగిన పలుమంది దాసరులయొద్ద నామె యనేక రహస్యములు తెలిసికొనిన నాగరకురాలు. కొప్పాకవాడలో నందఱు వైష్ణవులు. తిప్పన్నయొద్ద నున్నప్పుడీమెకు జీవితము వేఱు; మతము వేఱుగఁ గనిపించెను. బద్దన్నయొద్దకు వచ్చిననాటినుండియు నా భేద మగపడ లేదు.

పోనుబో నామె తాను బద్దన్నయొద్దకు సుఖ మనుభవించుటకై వచ్చితిననికూడ మఱచిపోయెను. ప్రేమమాటయే మఱచిపోయిన యామెకా యూరి పరిషత్సేవకుఁడు వచ్చి 'బద్దన్నతో బరిషత్తు నెదుటకు రమ్మ' ని నప్పుడు మొగములో దిగులు గనిపింప లేదు. మీఁదుమిక్కిలి హృదయములో నుత్సాహరేఖయే గోచరించెను. తాము నిద్రపోవు చున్నామనియు నాగయ్య తమపైఁ బగచే మేలే చేసినాఁడనియు బ్రతుకుటగాని బ్రతుకు బ్రతుకుటకంటె నేరమునకుఁ దగినశిక్ష యనుభవించుటయే తమవంటి యుత్తాలప్రకృతులకు యోగ్యమనియు నామెతన మనస్సును గ్రమగ్రమముగసహగమనమునకు సంసిద్ధపఱచుకొన్నది. కత్తియుద్ధము నంబయ్యగారితో చేయుటకై నా కభ్యాస మెందులకని బద్దన్న నన్నయ్యగారితో బలికినమాటల కర్థ మామె గ్రహించి 'యతఁడెట్లును జనిపోవును; నేనును జనిపోవుదు' ననెడి నిశ్చయమునకు వచ్చెను. అతఁడు బుద్ధిపూర్వకముగ మరణించిన వెంటనే యెచ్చటినుండివచ్చెనో వచ్చి, తన కత్తి గుండెలో గ్రుమ్ముకొని బద్దన్నమీఁదపడి మరణించుచుఁ దమ ప్రేమకు లోకమువారిసూత్రములు పట్టవని వెల్లడించినది, బాదమ్మ. జాతీయోద్యమ దినములలో మన దేశమున వెలసిన స్త్రీలయందలి ధైర్యసాహసౌదార్యసహనాదిగుణములకు బాదమ్మ ప్రాతినిధ్యము వహింపఁగలదు.

**తాత్కాలిక సాంఘిక పరిస్థితులు:—**

'బద్దన్న సేనాని 'యందుఁ జిత్రింపఁబడిన సాంఘికజీవితము శాలివాహనశకము పదునొకండవ శతాబ్దినాఁటిది. ఆ దినములలో మతోత్సవములయందుఁ గాగడాలు, నాముదఁపుసిద్దెలు నుపయోగింపఁబడుచుండెడివి. ఇతరములైన యూరేఁగింపులుకూడ బాగుగ వెలసెను. విజయవాటమునకుఁ దూర్పుదిశగా బోరాదనెడి నియమ మొకటి వీరశైవులచే నుల్లంఘింపఁబడినట్లు మన యీ నవల చెప్పుచున్నది. కావున సంఘములో నా నాఁడున్న మతసంప్రదాయప్రాబల్యమును జెప్పలే మనవచ్చును. ఆ యొడంబడిక లోకనాఁటితో జెల్లిపోరానివి.

ద్వంద్వయుద్ధములు, దొమ్మియుద్ధములు, మొదలగునవి యనేకములు కలవు. వానిలో గజతురగపదాతులు పాల్గొనును. కత్తిసాములో బంచములు, నందులో స్త్రీలు కూడ నేర్పు గలిగిన కటారికత్తెలుగా నుండెడివారు. యుద్ధసమయమున వీరులు మంచి చెడులు మాటలాడుకొనుచు యుద్ధముచేయుట యాచారము. రాజాంతఃపురస్త్రీలు గూడ నీ కత్తియుద్ధప్రదర్శనములఁ దిలకించుట పరిపాటి.

పరిపాలనావిధానమునందును శిక్షావిధానమునందును గ్రామమునకు, గ్రామపరిషత్తులకు, గ్రామసభలకు నధికారము లుండెడివి. ఒకదోషి కొకగౌరవముగల వ్యక్తి పూఁటయుండుట యాచారము. సాతులు, నభియోగము తెచ్చినవ్యక్తులును వేఱు వేఱుగ నుండవలెను. పురాధిపతులు పట్టిసేనాధిపతులతో ఖడ్గయుద్ధము చేయరు. చతుర్థకులజులు పంచములతో గత్తియుద్ధమునకు దిగరను మర్యాద గలదు.

ఒక సేనానిమీఁద మఱియొకసేనాని తనకుఁబట్టని యభియోగము తెచ్చినచో నీ సేనాని యా సేనానితో ఖడ్గయుద్ధముచేయవచ్చును. పరభార్యాపహరణమునకు శిరచ్ఛేదనము దండనము. ఆదండన విధించునధికారము చిన్నదైనను, గ్రామపరిషత్తునకుఁ గలదు. నేరములు గ్రామపరిషత్తువఱకుఁ దేనక్కఱలేక యేకులమువా రాకులముకట్టడినిబట్టి దండనవిధించు చుండవచ్చును. దండన తప్పించుకొనుటకై తన గ్రామమునుండి పారిపోయినదోషిని స్వగ్రామమునకుఁ బరగ్రామపరిషత్తు తన భటులనిచ్చి పంపివేయుట కలదు. ఇది కొన్ని పరిస్థితులలో గొందఱుకొందఱు దోషులయెడలనే జరుగును.

పండుగలలో బబ్బములలో క్షత్త్రియకాంతలు ఖడ్గవిద్యాప్రదర్శనముల నేర్పాటు చేసికొనెడివారు. ఒక మహావీరుఁ డొక సామాన్యవీరునితో స్నేహయుద్ధముచేసిన యెడల నా దినములలో నాసామాన్యవీరున కదియొక గౌరవము ; అంతవాఁడుగా నితఁడును బరిగణింపఁబడువాఁడు. శిష్యుని మెచ్చుకొనుటకు ఖడ్గగురువు కత్తితో భుజము పైఁగొట్టును. కత్తివిద్యలో నది ముద్దిడుకొనుట యన్నమాట.

ఆనాఁటి యాంధ్రులకంటె ద్రావిడు లెక్కువ నాగరకులుగ భావింపఁబడుచుండిరి. అందుచే ద్రావిడులయిన చోళులనుద్ర యాంధ్రుల నాగరకతపైనను విద్యపైనను నధికముగఁ గనిపించుచుండును. చోళరాజులు క్షత్రియులు. వెలనాటిచోళులుచోళులుగారు; క్షత్రియులునుగారు; ఆంధ్రదేశస్థులైన చతుర్థకులజులు. వారికిఁ జోళులని పేరు పెట్టుకొనుట యొక యాధిక్యము. సామంతరాజులైనచో నే కులమువారైనను సరే, వెలనాటిచోళులని పేరుపెట్టుకొందురు. ఆనాఁటి తెలుఁగుదేశ మొక విచిత్రమైన తెలుఁగుదేశము. బద్దన్నచే బ్రళయమంతటి మహావిప్లవప్రయత్నము జరుగుచున్నది. అది యాంధ్రు లెల్లరకుఁ దెలియును; కాని పశ్చిమచాళుక్యాధికారు లెవ్వరికిని దెలియదు. ఐక్య మనఁగా, నాఁ డాంధ్రులదే యైక్యము. రహస్యగోపన మనఁగా, వారిదే రహస్యగోపనము.

ఇట్టి వనేకమైన సాంఘికపరిస్థితు లీ నవలవలన వెల్లడియగుచు నాఁటి మనవారి జీవితవిధానమును బట్టించుచున్నవి.

## జీవితాదర్శం1

ఈ నవలయు "వెన్నెలతోటలు" 2 ను శ్రీ చలముగారి రచనలలో నొక శ్రేణికిఁ జెందినవి. ప్రేమతత్త్వము నున్నగు వానిలో వీని కీ తుల్యత. ఆప్రేమ యనివార్యము, నదమ్యమును.

"కొందఱు గొప్పప్రేమ తెచ్చుకొని పుట్టుదురు. దాని నేదియు నడ్డుకొనఁజాలదు. నిజమైన ప్రేమ నర్థముచేసికొనుట కష్టము. అది మనకు వలనుపడదు. ఆ ప్రేమ నీతిచట్టముల నతిక్రమించిపోవును." ఇది యీ నవలలో రచయితదైన యాశయము.

భీమునిపట్టణము మనోజ్ఞమైన ప్రదేశమని వెంకయ్యనాయఁ డుద్యోగుల వినోద క్రీడామందిరములో జెప్పఁగా ననంతపురమునుండి నరసింహారావు, లక్ష్మణసింగును దానిని జూడవత్తురు. కాని వారి కది నచ్చదు. వారు తిరిగి పోఁబోవుచుందురు. ఇంతలో వారికి దేశికాచారి దర్శనమిచ్చును. అతఁ డెంత గొప్పవాఁడో యంత మంచివాఁడు. కనఁబడినవారి నెల్ల నాప్యాయముగఁ బలుకరించును. వాయుసేవనమునకై వాహ్యాళి కేగుటయాయన కనుదినము పరిపాటి. ఆయన గొప్ప ప్రకృత్యారాధకుఁడు. మనుష్యులకు స్నేహము చాల నావశ్యకమనియుఁ దనవంటివారికి మనుష్యులు లేకయే జీవించుపద్ధతి నేర్చుకొనవలసివచ్చుచున్న దనియు నాతఁడు పలుకును.

---

1. క్రీ.శ. 1948. 2. "వెన్నెల తోటలు" అనునది శ్రీ చలముగారి కథల సంపుటి. కథాసంపుటముల ప్రథమ ప్రచురములకుఁ గాలాంతరమునఁ బేళ్ళు మాఱినవి. మాఱిన సంపుటములలోనిది యీ "వెన్నెల తోటలు" అను సంపుటము.

"జీవితాదర్శం" లో ప్రధాన పాత్రలు నల్వురు. వారు దేశికాచారి, లాలస, లక్ష్మణసింగ్, మాల్వాంకర్లు. వారి తత్త్వములు వారి పలుకులను బట్టియే వ్యక్తమగును.

(౧) దేశికాచారి :—

నవలారచయిత యీ పాత్రపరముగ సౌందర్యము వస్తునిష్ఠితమా? యను విషయమును జర్చింపఁజూచును.

సౌందర్య మెందున్నది? మానవుని బుద్ధినిర్ణయమే సౌందర్యమునకుఁ బ్రమాణము. కొందఱు సుందరవస్తువులలోని సౌందర్యమునుగూడఁ గనుఁగొనలేరు. కొందఱు కందమైవానిలోని యందమే యగపడును. సర్వసాధారణవస్తువులలోనైనత మనంతసౌందర్యమును దర్శింపఁగలవారు మహానుభావులు. ఈట్సు1 వంటి సుప్రసిద్ధులగు "ఐరిషు" కవులకుఁ బ్రకృతిసాంగత్యసౌందర్యారాధనము లధికము. సాధారణముగఁ గవులకుఁ బ్రకృతి యారాధ్యదేవత2. ఆమాటకువచ్చినచో గవులకేగాదు; ఇంచుక హృదయమున్న యెల్లరకును బ్రకృతి యారాధనీయము. దేశికాచారిది హృదయముగలవారిశ్రేణి.

లక్ష్మణసింగును నరసింహారావును దేశికాచారి కొండజాళ్ళమీఁదకుఁ దీసికొనిపోయి 'ఈ ఖీమ్లీ' 3 కొకవిధముగాదు; అనేకవిధములు కూడివచ్చినవి; ఈ కొండలు, నీ నది, యీ యడవి, సముద్రమున వరుసగ నా జాళ్ళు- నేను జెప్పి యేమిప్రయోజనము? మీరే దర్శింపవలెను; బుద్ధిమంతులవలె నుండిరి" యని సూచించి వెడలినాఁడు.

వారికి 'ఖీమ్లీ' యందు క్రొత్తసౌందర్యము గోచరించును; నిరుత్సాహరేఖ యంతరించును. తమకును దమలోనున్నదని తమకేదెలియని సౌందర్యభావనకును నొక సందేశ మొసఁగుటకై సముద్రము వారిని గట్టివేసినది. తా మాలోచింపకయే తత్సౌందర్యమును గ్రహించుచున్నట్లయినవి, వారి మనస్సులు. ఇందేమియు లేదు. వారి మనస్సులపైనున్న యావరణమును దేశికాచారి తీసివేసినాఁడు. తక్కినపని 'ఖీమ్లీ' చేసినది. ఎవరికిఁగాని తమ మనస్సులపైని యాచ్ఛాదనము తొలఁగవలెను. అట్టివారే ధన్యులని రచయితయొక్క హృదయము. "సత్యము హిరణ్మయపాత్రవలన మఱుఁగుపడినదనియుఁ దత్సత్యధర్మములను దర్శించుటకు దానినిదొలఁగింపవలె" ననియు ఋషులెన్నఁడో యుపనిషత్తులలో బ్రార్థించిరి4. మన నరసింహారావు నతని మిత్త్రుఁడును

---

1. In all poor foolish things live a day
   Eternal beauty wandering on her way.
2. Nature is the Godess of poets. 3. భీముని పట్టణము.
4. హిరణ్మయేన పాత్రేణ సత్యస్యా పిహితం ముఖమ్
   తత్త్వం పూషన్న పావృణు సత్యధర్మాయ దృష్టయే."

బ్రకృతియం దెంతో యానందమున్నదని గ్రహించినారు. వీరి యూహాలు ప్రకృతి ప్రియుఁడైన "థోరో" మహాకవి భావములను దలఁపించును1.

స్వాతంత్ర్యము, బానిసత్వము, నౌదార్యము, దారిద్ర్యమువంటి పదములకు చల ముగా రిందు వివరించు నర్థములు గమనార్హములు. స్వతంత్రత యనఁగా విధివిరామ బాధ్యతారహితస్వైరవృత్తి. మనము పరప్రభుత్వములకుఁ జేయునవి మనమీఁద బరువై కూర్చుండు దాస్యబానిసత్వములు గావు; నిత్యము పెద్దలకుఁ బురోహితులకుఁ జేయునవియే దాస్యబానిసత్వములు. మన దారిద్ర్యము పరప్రభుత్వము దోఁపిరితనము వలన నేర్పడినది యనరాదు. అది సాంఘిక మతసంబంధ మూఢాచారవ్యవహార జన్యము.

(౨,౩) లాలసా లక్ష్మణసింగులు :—

లాలస లక్ష్మణసింగును వివాహమాడును. తన కిష్టమున్నంతకాలమే యా వివాహబంధమని యామె యతనితో దమ వివాహసందర్భమందే చెప్పివేసినది. రచయితదృష్టిలో లాలస యొక నిర్దుష్టురాలైన పరిపూర్ణయైన వనిత. ఎంత భర్తయైనను స్త్రీని తనది యనుకొనుట తప్పని మాల్వంకరు వాదించును. ప్రాణములేని యాస్తులవే తమ వనుకొనుటకు వీలులేని దినములు వచ్చినవి. అట్టియెడ సప్రాణయైన స్త్రీని

---

1. ప్రకృతిలోని యే చిన్నవస్తువునందైనను మిక్కిలి నిష్కల్మషమును బ్రోత్సాహకరమును నైన సహజీవనవిధానము, స్నేహభావము నగపడుచున్నవి. సాధారణ వ్యక్తియేగాదు; ఎంతటి మానవద్వేషియైన, నెంతటి విచారగ్రస్తుఁడైన, మనస్సు వించుక విశ్చలముగ నుంచుకొని ప్రకృతిమధ్య జీవించినచో నతవి కే విచారము నంటదు. మనస్సారోగ్య ముగ నున్నయెడల, తుఫానువంటి ప్రకృతిప్రకోపము, విజృంభణమును మనకు మధుర సంగీతమువలె వినఁబడును. దంభరహితుఁడు, ధైర్యవంతుఁడు నైన వానికిఁ బ్రకృతి కించిత్తు విచారమును గలిగింపలేదు. సర్వర్తు స్నేహానుభూతివలన సంపూర్ణానందము నొందుచు, నైహికబంధమేదియుఁ దన జీవితము నొకమోయలేనిబరువుగ మార్పఁజాల దనెడి ప్రగాఢవిశ్వాసమును గుదుర్చుకొనినవాఁడు థోరో కవీంద్రుడు. ప్రకృతియొక్క యమాయకత్వ నిష్కల్మషత్వ ప్రయోజకత్వములు సార్వకాలికములు. మానవుని పట్లఁ బ్రకృతికిఁగల సానుభూతి, వర్ణన కతీతము. తన్ను బూర్తిగా నభినందించు మానవుఁడు ప్రకృతికాంతకు లభింపలేదు. ప్రకృతిని బక్షులు, పుష్పములు నభినందించు చున్నవి. మానవుఁడు కన్నులున్న కబోది; కదతేరలేఁడు. ముందుఁ బ్రకృతిని గన్నులు చూచుటలేదు; కన్నుల ద్వారమున మనస్సు చూచుచున్నది. ఆ మన స్సున్నవాఁడే ప్రకృతియొసఁగు నానందము ననుభవింపఁగలఁడు.

బురుషుఁడు తనసొత్తుగా భావించుట ఘోరమని యాతని విచిత్రవాదము. ప్రేమ, మమత్వముమీఁద నాధారపడి యున్నది. అందుచే లక్ష్మణసింగు పలుకు లాలోచింపఁ దగినవి. తనది యన కొనక యే వస్తువుపైన నెవ్వరికిఁ గాని ప్రేమ కలుగదు. పరస్త్రీలపైఁ గలుగుదానిని ప్రేమ యనవు. అది వాంఛ. సింగు తనకు వివాహము గాక పూర్వమే లాలసను ప్రేమింపలేదు; వాంఛించినాఁడు. కావున యోజింపఁగా నేది యైనను దనది కావలయు నని కోరి తనదియైనపిదపఁ దనది యనుకొనినంత కాలమే యది ప్రేమ. తనది కానినాఁ డది మఱల నీర్ష్య, వాంఛ, విరహము మున్నగునవిగఁ బరిణమించును.

వివాహబంధవిరహితమైన సంఘము చాల నారోగ్యవంతమై యానందమయమై యుండునని చలము గారు స్వప్నములు కందురు. మనకు సొంతమను భావము నశింప వలెనని యాయన వాదము. మఱి యది కేవలము నుత్తవాదమో ప్రయోగమో తన సాధనయో యాచరణమో యనుభవమో యేమియుఁ జెప్పరాదు. తా నెఱిఁగిన కాఁపురములలోనిచిక్కులు తీర్చెడువిధాన మగపడక యీ సిద్ధాంతమును బ్రతిపాదించె నేమో ! దేనినిగాని సొంత మనుకొనక ప్రేమించుట యనునది యెట్లు సంభవించునో రచయిత నిరూపింపలేకపోయినాఁడు.

పోఁగా వివాహ మనునదియే యేర్పడనినాఁడు[1] లేక మనసంఘమునుండి వివాహ వ్యవస్థ మాయమైననాఁడు, మానవులే మారుదురా ? నారి స్వభావము లేమగును ? అప్పుడు వారి నున్నతు లనవలెనా ? ప్రేమ యనునదియే రూపుమాసి పోయి కామోద్రేకము రాజ్యమేలదా? స్త్రీ పురుషులలో నెవ్వరి కెవ్వరును సొంతము గాకుండఁ బోవుటయనునది యెప్పటికిని జరుగుపనికాదు. అట్టిది కోరువారే తమదనుక వచ్చినప్పు డందలి యసంబద్ధమును గ్రహింతురు.

లక్ష్మణసింగు మంచి సంస్కారముగలవాఁడు. సత్యాగ్రహోద్యమములో జెఱ సాలకుఁబోయెను. లాలసకూడ నట్టిదే ! ఈమె సింగును విడిచిపెట్టి మాల్వంకరు నంటుకొనిపోయినది. మాల్వంకరు, దేశికాచారిలక్ష్మణసింగులకు మిత్రుఁడే. ఎట్టి

---

1. వివాహ మనునది మనలోమనము చేసికొనిన వ్యవస్థ యనుకొనువారిలో చలము గారొకరు. అప్పుడు వీరి భాషలో నది యనుబంధముకాదు. అందుచే నది త్రెస్పిపోవు ట యనునదియే పూఁశక్కి. విశ్వనాథవంటివారు దానివి జన్మానుకృతానుబంధ మందురు. అప్పుడు వారిభాషలో నది వ్యవస్థకాదు. కాన నది క్రొత్తగా నేర్పడు ననుకొనుటయే యబద్ధము.

నాద్యమైన నమ్మతనుగ వాయింపఁగలఁడు. లాలస మాల్వంకరుని వీడి తిరిగి దేశికాచారియొద్దకుఁ జేరును. ఆమె లక్ష్మణసింగుతో జెప్పుమాటలు విన్నచో నాబృందము సంగతి యంతయు వెల్లడి కాఁగలదు.

లాలస తన యింటినుండి వెడలిపోవునపుడు, రచయిత భాషలో, సింగు మంచితనము, సౌందర్యమును బ్రకటించినాఁడు. లాలసా దేశికాచార్యులమధ్య నెన్నఁడు ప్రేమలేదు. ఉన్నది యైక్యము, శాంతి. సముద్రములోనిచేఁప నెంత ప్రేమించియు నేల మీఁద సుఖపెట్టలేమని దేశికాచార్యు లెఱుఁగుదురు; లక్ష్మణసింగెఱుఁగఁడు. అందుచేత నతనికి శాంతి చేకూరినది; జీవితమును మథించి, రాగద్వేషములుపొందక, సుఖపడు విధాన మాతనికిఁ దెలియును. సింగుతోనున్నచో నామెకు ఘటిలుఁ దన స్వామ్యములనుగూర్చి వివాదము. ఆచారితో నా బాధలేదు. ఆయనలోనున్నది ప్రేమ కతీతమైన శాంతి. కోర్కెలు భయములు లేనివాఁడతఁడు; బాధ తప్పించుకొనుటలో నేర్పరి; బనను బాధయనిన భయపడఁడు. ఆవశ్యకమైనచో నోర్చుకొనును. ఆతని హృదయాకాశములోనున్నది పరమశాంతి.

ఈ నవలలోని పాత్రలన్నియు నొక విశిష్టస్థాయిలో నుండును. అది స్వేచ్ఛాప్రణయతత్త్వసంబంధము కలది. చలముగారి నవలలలో నెల్ల నదియే దీని ప్రత్యేకత.

దేశికాచారి జీవితాదర్శము శాంతి. అనఁగా, స్త్రీకి, ప్రణయవ్యాపారములలో సంపూర్ణ స్వాతంత్ర్య మొసఁగి పురుషుఁడు బాధ్యతలు పెట్టుకొనకుండుట.

శాంతి ముఖ్యముకా దనలేము. కాని స్త్రీకి స్వేచ్ఛావృత్తి నొసఁగుటవలన లభించుశాంతి నెల్లరు ననుభవింపలేరు. ఇఁకఁ బ్రకృత్యారాధనముసంగతి.అటు పాశ్చాత్య మహాకవులు నిటు మన వేదకాలఁపు ఋషిపుంగవులు నభిమానించినదే యిది. ఆధునికాంధ్రకవులలో దువ్వూరిరామిరెడ్డి, కవికొండలవెంకటరావుకవివంటి మహాశయులీ శాఖీయులు. ప్రకృతియం దభిమానము పఠితలకుఁగలిగించుట కవులబాధ్యత యనక తీరదు.

ప్రకృతిసౌందర్యము నభినందించు నభిరుచిఁగొలుపుటయందు నవలాకారులలో ముందు చలముగారిని జెప్పినపిదప వేఱొకరిని జెప్పవలెను. మన జాతికిఁ బ్రకృత్యారాధనమును బ్రేమయుఁ గఱపిన దేశికాచార్యులు శ్రీచలముగారికంటె నన్యులుగారు.

## నారాయణభట్టు[1]

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి ప్రథమనవల [2] యిది; నన్నపార్యునినాఁటి యైతిహాసికేతివృత్తము కలది. అనాదియైన భారతధర్మమును బరిరక్షించిన మహామహుల చరిత్ర మనకు నిత్యస్మరణీయము. చరిత్రరచన పరమావధి, యట్టి మహాపుణ్యపురుషుల గుణానుకీర్తనమే. ఇప్పటికి రమారమి తొమ్మిదివందల సంవత్సరములక్రిందటి యాంధ్ర దేశములో రాజమహేంద్రవరమునం దట్లు స్మరింపఁదగిన మువ్వురుమూర్తులు వెలసిరి. వారు నారాయణభట్టు, నన్నయ్యభట్టు, రాజరాజనరేంద్రుఁడు ననఁబడు వారు. వీరి మార్గదర్శకత్వముననే యాంధ్రవాణి కితరదేశభాషలకులేని విశిష్టప్రభావ మేర్పడినది. అట్టి యాంధ్రభాషాసంస్కృతుల విశిష్టత సంపూర్ణముగ గ్రహింపఁగలిగిననాఁడే నేఁటి స్వతంత్రభారతమున తమ విధిబాధ్యతల నిర్వహణమునకుఁ దెలుఁగువా రందఱు బద్ధకంకణులు గాఁగలరు; భారతదేశముకూడ సమగ్రస్వరూపముతో సుందరము కాఁగలదు.

మహాభారతాంధ్రీకరణ మొక్క తెలుఁగువారి చరిత్రయందేగాక, యావద్భారతీయచరిత్రలోను ప్రధానఘట్టము. దూరమున నొకానొక విదేశరాజు భరతభూమిని గొల్లగొట్టుటకు వచ్చినకాల మది. మధ్యదేశము దాక్షిణాత్యులతో జెలిమిచేసి యఖండ భారతమును నిర్మింప యత్నించెను. మహాభారత మఖండభారతమునే చిత్రించినది. మహాభారతమువలెనే మన భారతీయధర్మమును విశ్వజనీనము; ఏతాదృశమైన భావనమును బహుకాలముగా మననముచేసి యీ నవలాకర్త మన 'నారాయణభట్టు'ను సృజించినారు. ఇందలి గుణములన్నియు రాజరాజ, నన్నయ, నారాయణభట్టుల యితివృత్త స్వీకరణమువలనఁ గలిగినవి; ఆ యితివృత్తమును మననముచేసిన మన రచయితయొక్క ప్రజ్ఞావిశేషమువలనఁ గలిగినవి.

ఐతిహాసికనవలారచనాధికారము సంపాదించుటకుఁ గావలసిన సామగ్రినంతయు సంతరించుకొని యాంధ్రమహాభారతైతిహాసికరచనమునాఁటి మహోజ్జ్వలచరిత్రము నీ నవలయందు శ్రీ నోరివారు చిత్రించిరి. ప్రధానపాత్రలేగాక పలుపాత్ర లితరములు గూడ నా కాలమున నిశ్చయముగ నున్నవే యిందుఁజూపఁబడుట సత్యమునకు

---

1. క్రీ. శ. 1849 రచన; ఆంధ్రవారపత్రికలో నిది ప్రథమమునఁ బ్రచురితము; 1968 లో తెలుఁగుభాషాసమితి బహుకృతినొందినది. ఆంధ్ర, మదరాసు, ఉస్మానియా, ఉత్కళ విశ్వకళాపరిషత్తులు దీనిని దమతమ పరీక్షలకుఁ బాఠ్యముగ నిర్ణయించినవి. ఆంధ్ర మద్రాసు రాష్ట్రములలో మున్నతపాఠశాలావిద్యార్థులకు దీని సంక్షిప్తరూపము పాఠ్యము. దీని ప్రథమముద్రణము క్రీ. శ. 1949 ; ద్వితీయముద్రణము 1954.

2. రుద్రమదేవి, కర్పూరద్వీపయాత్ర, (పిల్లలనవల) వాఘిరా, మల్లారెడ్డి, కవిసార్వభౌముఁడు ననునవి క్రమముగఁ దరువాతివి.

మఱియుఁ జేరికగఁ దీసికొనిపోవుట. నందమపూఁడిశాసనకాలమే యీ కథాకాలము; అనఁగా సుమారిప్పటికిఁ దొమ్మిదివందలతొమ్మిదియేండ్లనాఁటి విజయనామసంవత్సర మది. ఆ దినముల పంచాంగమునంతయు గుణించుకొని, తదనుసారము నవల లోని విషయములనన్నింటిని జిత్రించుట మన నవలాకర్త యుద్దేశించిన నిర్దుష్టత కెంతయు నిదర్శనము.

నన్నపార్యుని యాంధ్రమహాభారతములో యథార్థమగు తెలుఁగుసాహిత్య ముద్భవించినది. ప్రపంచమహాకవు లెవ్వరికంటెనుగూడ నన్నయ తన్మూలముననే తీసిపోఁడు. అట్టి నన్నపార్యుఁ డీ మన నవలానాయకుఁడగు నారాయణభట్టుచే బ్రోత్సహింపఁబడియే మహాభారతాంధ్రీకరణమునకుఁ బూనుకొనెను. ఆ కాలములో నారాయణభట్టు వాఙ్మయధురంధరుఁడు. ఈ నవల కేవల మాంధ్రభారతావతరణము కథ. దీని నిర్వహణమున నవలాకర్త నెఱపిన కౌశల మనన్యము. మహాకవిగా, నాటక కర్తగా, కథకుఁడుగా, విమర్శకుఁడుగా మన నవలాకారుడు సముపార్జించిన యను భవసంపద యీ నవలకుఁ జిరస్థాయిని సమకూర్చిపెట్టినది.

దక్షిణదేశచరిత్రలో రాజరాజనరేంద్రునికాల మొక స్వర్ణయుగము. ఈ యుగచిత్రణమును రాజరాజుమామ యగు గంగాయకొండ రాజేంద్రచోళుని కాల చిత్రణమునుగూడ నీ నవలలో గ్రిక్కిఱిసి యున్నవి. బౌద్ధ మా నాఁడు కొడికట్టి, మినుకుమినుకుమనుచు, వెలుఁగు ప్రసరింపలేక, తాంత్రికప్రయోగములలోనికిఁ జాటు మాటుగ దిగజాఱెను. తన్మతానుయాయులు రాజరాజునకు వ్యతిరేకముగఁ బన్నిన రాజకీయఁపుటెత్తులును నానివాని పరిణామములును నాయూ తిరుగఁబాటు లెట్లడఁచి వేయఁబడినవియు నీ నవలయందు విశదముగ వర్ణితములు. ఇవి యన్నియు మన మహా భారతావతరణమునకుఁ బూర్వరంగములుగఁ దీర్పఁబడినవి. చోళులకుఁ బశ్చిమచాళు క్యులకును నడుమ సాగిన 'కొప్పము' సంగ్రామవర్ణనమును చక్రకోట్యదుర్గము ముట్ట డియు నిరుపమానములు. మధ్య యుగములలో దోషులను దండించు విధానమునకు నిదర్శనము లనఁదగిన మూఁడు విచారణసభ లీ నవలయందు విశదముగ వర్ణింపఁబడి నవి. నాఁటి సాంఘికరాజకీయసారస్వతేయప్రజాజీవిత మిందు నిర్దుష్టముగఁ జిత్రితము. సమస్తవిధముల రచయిత యుద్దేశ మిందు సఫలీకృతమయ్యెను.

అసంఖ్యాకములగు పాత్ర లిందున్నవి. అన్నిటిని సృష్టించియు, లేనివానికి వ్యక్తిత్వముతో జీవముపోసి జవముకూర్చుటవలననే యీ ప్రయత్నము విజయవంత మైనది. ఇందు సర్వానర్థప్రతిఘటనసామర్థ్యము గల వజ్జియప్రగడ మంత్రీశ్వరుఁ డెంతో రాజకీయధౌరంధర్యము గలవాఁడు; అల్లే సుజాతవృత్తాంతము కరుణరసభూయిష్ఠము. ఈ నవలలో వీరరస మంగియైనది; శృంగార మపాస్తము. చరిత్రవిషయికనవలగా దీనికి మన సాహిత్యములో సమున్నతస్థాన మున్నది.

రాజరాజుకాలమునాటి ప్రజాజీవితము సజీవచలనచిత్రనిశదత్వము నొందుటయే యీ నవలలోని శ్రేష్ఠత. ఆ మహారాజసన్నిధియందా కాలమునాటి ప్రముఖపండిత కవుల నందఱను సమావేశపఱచి, వారితోబాటుగ నారి నెల్లర నుత్తుంగతలూగిన సర్వోద్యమసులను జదువరుల మనఃఫలకములపై హత్తుకొలిపి యశోకుని జీవితగాథకుం జెందిన మహాద్భుత గేయమాధుర్యమున వారి నోలలాడించిన మన నవలాకర్త చలనచిత్ర నిర్మాతగాని కేవలము నవలాకర్త కాదు.

## మల్లిక [1]

దీనికర్త శ్రీ ఇలింద్ర రంగనాయకులుగారు [2]. ఇందలికథ మల్లిక యను పంచముల పసిబాలికయందు కేంద్రీకృతము. ఇది కాలానుగుణమైన నవల.

అమరావతీపట్టనమునఁగల బహుసుందరోద్యానములలో గట్టఁబడిన యొక యాశ్రమమునకు వికటానందుఁడు, స్వామి. ఈతఁడు సన్న్యాసి యయ్యు భోగి; కుటిలస్వభావుఁడు. తన యాటలుసాగించుకొనుట కాయూరిలోని బ్రాహ్మణుల నంద ఱను గట్టుకొనినాఁడు. ఆ యూరిలోనే లక్ష్మీనాథశాస్త్రి యను నుత్తమబ్రాహ్మణుఁ డొకఁడు గలఁడు. అతఁడు సర్వజనులు సమానులే యని పంచముల నాదరించి వికటా నందుని యెదిరించిన ధీశాలి.

మల్లిక పార్వతీశంభుదాసులను బంచమకులజుల యేకైకపుత్రిక ; పదెనిమిది యేండ్ల వయస్సుగల ఒక దినమున, మల్లిక పూవులమీఁదమోహముచే వికటానందుని వనమునఁ బుష్పములు కోయుచుండును. ఈమెను జూలతోఁ గొట్టి తరుముకొనివచ్చు చున్న వికటానందుని శిష్యులబారినుండి రక్షించి లక్ష్మీనాథశాస్త్రి తన గృహమునకుఁ దీసికొనిపోయినాఁడు. ఆ దినమునుండి యామె వారియింటికిఁబోయి పుష్పములఁ దెచ్చుకొనుచుండును. పంచములబాలికను దాఁకినందులకు మైలఁబడిపోయెనని వికటానం దుని శిష్యులాతని నవమానించి, యా సంగతి తమ స్వామికెఱిఁగించిరి. లక్ష్మీనాథ శాస్త్రికిఁ గుడిభుజ మనఁదగిన యొక శిష్యుఁడు కేశవుఁడు.

లక్ష్మీనాథశాస్త్రి తమ్ముఁడు మాధవుఁడు; ఈతని యన్నగారికి వ్యతిరేక తత్త్వము ; అన్నగారు పంచములను జేరఁదీయుటకు సహింపలేక వికటానందుని బోధ నలు బాగుగఁ దలకెక్కించుకొనినవాఁడు. ఒకసారి లక్ష్మీనాథశాస్త్రి పితృశ్రాద్ధమునఁ బంచముల నందఱను భోజనమునకుఁ బిలిచెను. అది సహింపలేని యతని తమ్ముఁడింటి

1. క్రీ. శ. 1949 రచన. Approved for class use; (Vide) Consolidated list D/ 23-5-50 Page 132.
2. Ilindra Ranganāyakulu, M.A., L.L.B., Principal, Subbārāya and Nārāyana College, Narsāraopet, Guntur Dt. (A. P.).

నుండి వెడలిపోయి వికటానందుని యాశ్రమమున బిత్రుకార్యము నిర్వర్తించినాఁడు. పంచము లందఱు లక్ష్మీనాథశాస్త్రిని దేవునిఁగా భావించు చుండిరి. ఇతని యింటినుండి భోజనములు ముగించుకొని వెడలుచున్న పంచములతో వికటానందుఁ డీతని దంతయు మోసమని చెప్పి యీతనిని బరిక్షించుటకై తమ గూడెమునకు భోజనార్థము పిలువు మనినాఁడు. వా రది పాపమని యెంచి దానిని నిరాకరించుటయే గాక యాబూట కఁపు సన్న్యాసిని వెక్కిరించిరి. కాని మల్లిక కోరికపై లక్ష్మీనాథుఁడు వారి యింటికి విందుగా నేఁగును. అతఁడు పంచముల కొఱకొక చిన్న పాఠశాల నెలకొల్పి, యందు కేశవు నుపాధ్యాయునిగ నియోగించినాఁడు.

ఆయూరిలోనే వణిక్ఛ్రేష్ఠుఁడు, ధనగుప్తుఁడనువాఁడు గలఁడు. అతనికి నాలు గైదోడలు. విదేశవ్యాపారముచేసి యతఁడు కొల్లగ ధనము సంపాదించెను. ఆతని ప్రథమకళత్రము పిల్లలులేకయే గతించినది. పిదప నాతఁడు హైమవతియనెడు సుందర బాలికను వివాహమాడినాఁడు. ఆమెకుఁగూడఁ బదియేండ్లైనను సంతానము కలుగ లేదు. వణిక్కునకు సన్న్యాసులయందు నమ్మిక. భార్యతోఁగలిసి వికటానందుని సందర్శనమున కేఁగెను. వికటానందుఁ డామె సౌందర్యము నెంచి యచ్చెరువొంది, యెట్లైన నామెను బొందఁగోరి యొక విచిత్రవ్రత ముపదేశించినాఁడు. ఆవ్రత మామె యేకాంతముగఁ జేయవలెను; భర్తగాని యితరులుగాని దగ్గఱ నుండరాదు. వణిజుని చూపులు, చేష్టలు, మాటలు, ననుమానించి హైమవతి యావ్రతాచరణమునకు నిరాకరించెను. బూటకఁపు సన్న్యాసి యని వికటానందుని దూలనాడినది. అతఁడు పగఁ బూని యామె శీలము మంచిదిగాదని భర్తకు నూఱిపోసెను. ఆమె నెట్లయిన నా వ్రతమున కొప్పింపనిచో, నామెతోఁబాటు భర్తనుగూడ నాశనమొనర్చెదనని సన్న్యాసి. వ్రత మాచరింపుమని పతివలనఁ బ్రతిదినము హైమవతికిఁ బోరు. ఆమెకుఁగూడఁ బంచముల పై నాదరాభిమానములు. అందుచే దదభిమానముగల లక్ష్మీనాథుని గుఱించి విని యాయన దర్శనము కొఱ కెదురుచూచు చుండెను.

ఒకనాఁ డతఁడు పంచములయింట విం దారగించి వచ్చుచున్నాఁడు. ఈ వార్త విని యామె యాతనిని జూచుటకై వీథిలో వేచియుండి, తన గృహములోనికిఁ దీసి కొనిపోయినది. తన దీనస్థితి నతనికిఁ జెప్పుకొనఁగా నతఁ డామె కభయమిచ్చి, ధన గుప్తునకుఁ దాను నచ్చఁజెప్పెద ననెను. ఈ సంగతి శిష్యులవలన వికటానందుఁ డెఱిఁగి నాఁడు. ఎఱిఁగి. ధనగుప్తుఁడు తన భార్యను లక్ష్మీనాథునం దనుమానించునట్లు దుర్బోధలు చేసెను. ధనగుప్తునకు సత్యజ్ఞానోదయము గావింపవలెనని లక్ష్మీనాథుఁడు స్వర్గముగఁ గృహాభిముఖుఁడై నాఁడు.

అమరావతియందలి భూములలో మూఁడువంతులు ధనగుప్తునివే! అతఁడు వికటానందుని ప్రోద్బలముచేత నా పొలము రైతులనుండి లాగుకొనెను. అపుడు పోరాటము జరుగఁగా నందులో లక్ష్మీనాథునకు సాహాయ్యముచేసిన కేశవుఁడు దెబ్బ లచే మృతినొందినాఁడు. ఈ సంగతి నెఱిఁగిన యూరిలోనివారెల్లరును లక్ష్మీనాథునందు సానుభూతిఁ జూపిరి. వికటానందుని చర్యలు నిరసింప నారంభించిరి. కేశవుని మరణవార్త విని ధనగుప్తుఁడు "దీనికెల్ల నీవే! కారణ"మని భార్యను బాధించెను. ఆమె యర్ధరాత్ర మున నా యూరిచెఱువులోఁబడి యాత్మహత్య చేసికొన్నది. భార్యమరణముతో గను విప్పుగలిగిన ధనగుప్తుఁడు, లక్ష్మీనాథుని శరణువేఁడి తన ధనమంతయు నాతని బుద్ధివిని పంచములకై వెచ్చించినాఁడు. పదివేలరూప్యములతో బెద్దమందిరము గట్టించి పంచ ముల కోరికపై దానికిఁ 'కేశవమందిర'మని పేరిడెను. ప్రజలందఱుఁ దనకు వ్యతిరేకు లైరని గ్రహించిన వికటానందుఁ డా పట్టణమునుండి పారిపోవుటకుఁ బ్రయత్నించు చుండగా, లక్ష్మీనాథుని యత్నములచే నా భవనమునందే బంధితుఁడైనాఁడు. పిదప విచారణజరిగి యాతనికిఁ బదిసంవత్సరముల దండన విధింపఁబడినది.

ఈ నవలయం దంటరానితనము విపులముగ వర్ణితము. ఆ దినము లస్పృశ్యతా నివారణనినాదసాంద్రీభూత వాతావరణము గలవి. రచయిత యుగధర్మమును జీర్ణించు కొని యీ సంస్కృతికిఁ జిహ్నముగ దీనిని రచించినాఁడు. దేవునిదృష్టిలో నందఱు సమానులు; అందఱు నాతని బిడ్డలు. మతములు మతభేదములు మానవకల్పితములు. అయినను సర్వమానవసౌభ్రాత్రమునకు మూలసూత్రము ప్రేమ. కులమతభేదములు మానవసౌదర్యమున కడ్డురావు. కులమతద్వేషము లడ్డువచ్చును. ఆ ద్వేషములకు హేతువు స్వార్థపరత; అజ్ఞానము; సంస్కారవిహీనత. పాపము పామరుల కీ భేదము తెలియదు. తెలిసినవారు తెలుపరు; తెలిపినచో సంస్కర్తల మని వీరు లోకవంచనము చేయుటకు వీ లుండదు. తమ నాయకత్వము, పలుకుఁబడియుఁ నా పామరు లపైఁ జెల్లుబడి కావు. సర్వత్ర స్వార్థమున్నది. మన హృదయగతకాలుష్యమును గప్పిపెట్టి, కులమతభేదములను లోపములుగ, లోకానర్థహేతువులుగఁ జూపుట నేఁడు పరిపాటి. ఇంతేకాదు; ధర్మవిజయమునుగూడ నీ నవలకు లక్ష్య మనవలెను. ఇది భారతదేశస్వాతంత్ర్యానంతర ముచితాశయములతో వెలువడిన నవల.

ఈ నవలకు 'లక్ష్మీనాథశాస్త్రి' యని గాని 'వికటానందుఁడ'ని గాని పేరు రావలెను; కాని 'మల్లిక' యను పేరెట్లుచిత మని కొందఱు ప్రశ్నింతురు. ఆమెకథ నవలయం దాసాంతమురాలేదని శంకింప నక్కఱలేదు. మల్లికయొక్క యస్పృశ్యతయే నవలలోని పాత్రలను భిన్నపక్షీయులుగ విభజించినది. ఆమె లక్ష్మీనాథశాస్త్రి యింటికి గాని వికటానందుని యాశ్రమమునకుఁగాని వచ్చిపోవుచుండుట మొదటినుండియు సహింపఁబడినచో నీ కథయే పుట్టెడిదికాదు. శాస్త్రిసోదరుఁడు మల్లికను దమ యింటికి రానీయనందులకుఁ దుదిలో బశ్చాత్తప్తుఁడైనాఁడు. ఆమెయు నామె నంటి

గున్న యంటరానితనమును ఒరోతుముగ నవలలో ప్రాధాన్యము వహించెను. నాయకుడు ప్రత్యక్షముగఁ బ్రశిఘట్టమున నుండ నక్కఱలేదు. జరుగుకథ యంతయు నాతనికి సంబంధించినదిగ నుండినఁజాలును. శాస్త్రిసోదరుని పశ్చాత్తాపరూపమున నస్పృశ్యతానివారణమను ఫలము మల్లికకే లభించుచున్నది.

## తపస్విని [1]

తపస్విని యనఁగా దీనురాలు. ఈ నవలయందు శ్యామల యను దీనురాలు నాయిక. అందుచే నీ నవల యన్వర్థనామము గలది.

శ్రీ ఘండికోట బ్రహ్మాజీరావు బి. ఏ., దీనిని రచించిరి [2]. ఇందలి కథా కల్పనము సుసంఘటితము. కథ కల్పితమైనను రచనాపాటవముచేత సత్య మనిపించు చున్నది. ఇంతకుఁ బ్రాయోభావము కథకుఁ బ్రాణముపోవుచున్న దనుట.

శ్యామల :—

శ్యామల యీ నవలయందుఁ బ్రధానురాలు. ఆద్యంతము నీమెకు సంబంధించిన కథయే యుందు వర్ణింప బడెను. ఈమె యెంత సౌందర్యరాశియో యంత సుశీల; యంత ధీర. చిన్ననాఁడు చాల నల్లారుముద్దుగా పెఱిగినది. వయస్సుతో బాటు లోకజ్ఞానము వృద్ధికాఁగా నామె తల్లిదండ్రులచిత్తమునకు నచ్చునట్లు వర్తించు చుండెను.

చలపతి కిచ్చి పెండ్లిచేయుటకు నిశ్చయించి తండ్రి యా ప్రయత్నములు చేయు చుండఁగా నీమెకొక దుస్స్వప్నము వచ్చినది; దానివలనఁ దన జీవితమునందు సౌఖ్య మనునది కలుగదని నిరాశతోఁ చెను. అందుల కనుగుణముగ నీమెకు వివాహము గాక పూర్వమే తండ్రి మరణించుటయుఁ దల్లి ధనలోభముచేత నీమె నొక వృద్ధున కిచ్చి చేయుటయుఁ దటస్థించినవి. శ్యామలను భారతనారీమణుల ధర్మమెఱిఁగిన యువతి యనవచ్చును. తన శ్రేయము వాంఛించెడి మాతాపితరుల యిష్టానుసారముగఁ బ్రవర్తించుటయే ధర్మమనియు, మానవులకు సుఖదుఃఖములు వారివారి పూర్వకర్మాను సారముగఁ బ్రాప్తించు ననియు భావించి యూరకొన్నది. ఆమె ధర్మజ్ఞత కిది ప్రబల నిదర్శనము.

---

[1] Prescribed by the Andhra University, Ft. St. G. G. Part I B, dated 10-2-1948 and 3-5-1949 for the Intermediate Examination in Arts and also Science ( I. A. and I. Sc. ) as a Nondetailed Text. The same, also in the Osmania University, for B. A. in 1958-59.

2. 'ప్రేమ్‌చంద్' 'నిర్మల' యీ నవలకుఁ బ్రతిపదిక (1949).

వివాహమైనతోడనే శ్యామల యత్తవారి యింటికి వచ్చెను. ఆమె యొక్క రత్నఖచిత విశాలసౌధము; శివరా వొక పూరిగుడిసె. భర్తదెస మసలుటకుఁగాని నవ్వుచు నవ్వాయి నొందుటకుఁగాని శ్యామలకు సంకోచము. తన తండ్రియీడు వాఁడు భర్త. అందుచే గౌరవాస్పదుఁడయ్యెనే గాని ప్రేమాస్పదుఁడు కాలేదు. భర్తను జూడఁగనే యామె కుల్లాస మెల్ల చల్లబడుచుండెను. ఈమెకుఁ దనయం దనురాగము గలుగుటకై భర్త శివరా వెన్నో యత్నములు చేసెడివాఁడు. అవి యామెకు రుచింప వయ్యెను. ప్రకృతిధర్మము నెవ్వరు నిరోధింపఁగలరు?

శ్యామల సవతికుమారులనుగూడఁ దన కుమారులవలెఁజూచి ప్రేమించి పోషించెడిది. ఇది యామెయందైన పుత్త్రి వాత్సల్యమునకు ప్రబల సాక్ష్యము. 'ఆఁడుబిడ్డ యర్థమగఁడ'న్న సామెత ననుసరించి వియ్యమ్మ తన్నెన్ని విధముల దూషించినను సహించుట శ్యామల యోర్పునుగూర్చి చెప్పకచెప్పుచున్నది. కుమారుఁడగు భార్గవుని కడ దా నాంగ్లభాష నేర్చుకొనుచుండఁగ భర్త తన్ను శంకించి యాతనిని ఛాత్రాలయమునకుఁ బంపివేయునపు డీమె యేమి చేయుటకును జాలక చాలఁ బరితపించినది. భార్గవుని గాపాడుటకై తన రక్తమును దానముచేయ సిద్ధపడుట, యామె యౌదార్యమునకుఁ బుత్త్రిప్రేమకును జిహ్నములు.

'నీ రక్తము తీసినచో ప్రాణభయ ముండు'నని శివరావు పలుకగా 'నా ప్రాణ మింతకన్న నే నాఁడు పనికివచ్చు'నన్నది శ్యామల. శివరావు పాషాణహృదయముకూడ నీ మాటలవలనఁగరఁగిపోయెను. శ్యామల సుశీల యని యందుచే నాతనికి సువ్యక్తమైనది. అప్పులఁ దీర్చుటకై యిల్లు వేలము వేయింపఁబడునప్పు డీమె తన నగల నీయ యత్నించును. తన ప్రేమను జూఱఁగొనుటకై భర్త యెన్నియో బాధలు పడుచుండుటఁ జూచి జాలిపడి మనమును మార్చుకొని భర్తకు సంతోషము కలుగునట్లుఁ బ్రవర్తింప నారంభించిన శ్యామలను ధర్మబుద్ధి గలదనుట నిస్సందేహము. పుత్త్రిదుఃఖోపహతుఁడై కృశించు భర్తకు దుఃఖోపశమనముగలుగురీతిని మెలఁగుట, యీమె యంతర్వర్తిని యని చెప్పకచెప్పు చున్నది. శ్యామల సౌశీల్యమువలననే యశోధర తన మఱఁదికిఁ గట్న మక్కఱలేక విమలను వివాహమాడుటకై సమ్మతించెను. తాను జిక్కి శల్యమైయుండుటఁ గాంచి తల్లియుఁ జెల్లెలును గారణ మడుగఁగా, నీమె తమ యింటిగుట్టు బయలుసేయదు. ఇది యెల్ల నామె గాంభీర్యము.

అత్తవారియింట శ్యామల కెంతమాత్రమును మనశ్శాంతి లేదు. అందుచే దన సోదరి విమల పెండ్లికి వచ్చి కొన్నిమాసము లుండెను. శ్యామల కొక కొమార్త. ఆమె పేరు జ్యోతి. నిరాశోపహత యగు శ్యామల కామెయే యాశాజ్యోతి. ఆ

బిడ్డయందలి ప్రేమచేతనే సర్వకష్టముల నామె సహించినది; జీవితమున సుఖ మిసుమంతయు లేకున్నను జీవించినది. తన సంసారపరిస్థితికంటె నా బిడ్డభావిజీవితమును గూర్చిన చింతయే యామెను వేధించెడిది. అందుమూలముననే కడు నుదారహృదయయగు శ్యామల లుబ్ధురాలయ్యెను. ఇప్పుడు సొమ్ముమెచ్చించుట యేమాత్రము గూడ నామెకు గిట్టదు; ఆమె కడుపునిండ నాహారము తినుటకూడ మానివేసెను; తిన్నచో నామెకు దన బిడ్డ కేమియు మిగులదనెడి భీతి-ఆమె ముఱికిబట్టలనే ధరించును. ఉదికించినచో సొమ్ముమెచ్చమగుట దుస్సహము.

భర్త ప్రేమపూర్వకముగఁ జేయించిన నగలైదాఱువేల విలువగలవియున్నవి. వానినిఁ బ్రాణప్రదముగఁ జూచుకొనుచుండెను. అవియే తన్నుదన పిల్లలనుగూడ రక్షింపఁ గలవు. స్నేహితురాలగు యశోధర తనయొద్దకు వచ్చెను. ఆమె కుమారుఁ డీమె పుట్టినింట హఠాన్మరణము నొందినాఁడు. అప్పుడు శ్యామల సానుభూతికి మేరలేదు. అస్వస్థుఁడైన బాలునకుఁ జికిత్సలు చేయించెను. దుఃఖితయగు యశోధర నొంటిగఁ బంపనొల్లక యామెతో శ్యామల తన కిష్టములేకున్నను దానుగూడ నత్తవారింటికి వచ్చివేసినది. ఇది యామె పరోపకారబుద్ధిని లోకజ్ఞతను విదితముచేయఁగల సంఘటనము.

ఈమె సవతికుమారులలో రెండవవాఁడు కేశవుఁడు. ఇతఁడు తన గదిలో బ్రవేశించి యర్ధరాత్రమునఁ దన నగలపెట్టెను దొంగిలించి నప్పుడు, తెలిసియుండియు నీమె తద్విషయమును భర్తకుఁ దెలుపదు; పైఁగా రాజభటులకు దొంగతనముసంగతి పితూరిచేయవలదని బతిమాలును. తుదకు దొంగతనము కేశవునిమీఁద బుజువైనను నధికారులకు లంచమిచ్చి యభియోగము నెత్తివేయింప యత్నించుట యీమె పుత్త్రిస్నేహమునకుఁ బరాకాష్ఠ; సద్భావమునకు స్తోత్రపాఠము. కేశవుఁ డాత్మహత్య గావించుకొనఁగా నీమె శివరావుకంటె నెక్కువగ దుఃఖించెను. ఇదియు నామె ప్రేమ వేనోళ్ళఁజాటు చున్నది.

నగలు పోయినదిమొదలు శ్యామలలో గలిగిన పరివర్తనము గమనార్హము. ఆమె జీవితమునం దొకగొప్ప మార్పుగల్గెను. అంతకుఁ బూర్వమునుండి యున్న త్యాగము. సౌజన్యము, మార్దవము, మున్నగున వన్నియుఁ బోయినవి. లోభము, కాఠిన్యము, నవిశ్వాసము, నిరాదరణము, నధికమయ్యెను. భర్తను గన్నకొమార్తను మాధవునిగూడ నతికఠినముగఁ జూచుటకు నిర్దయముగ వర్తించుటకును బూనినది. అది నానాఁటికి వృద్ధికాఁజొచ్చెను. భర్త యార్జన ముడుగుట, వృద్ధుఁ డగుట, యిల్లు వేలమగుట, నగలుపోవుట, వంటివానివలన నీమెకు గుండెలో నొక కొండంతదిగులు. అది జ్యోతి భవిష్యత్తును గుఱించినది. ఆ చింతయే శ్యామల నింత కఠినాత్మురాలుగ నొనరించెను. ఈమె పెట్టుకష్టము లోర్వలేక మాధవుఁడు- సన్న్యాసులలో గలసిపోయి

నాఁడు. ఆతనిని వెదకుటకు శివరావు బయలుదేరి పోవుచుండగా దన యొద్ద ధన ముండియు నాతని దారిబత్తెమునకు గూడ లేదనునంతటి పిసినిగొట్టైనది శ్యామల. ఇది యామె నిర్దయకుఁ గాఠిన్యమునకు నిదర్శనము.

శ్యామల నొంటిపాటునఁ జూచి తన వలపును దెలిపినాఁడు, చలపతి. ఆమె యెంతయో కష్టపెట్టుకొన్నది; తన దుస్థితికిఁ జింతించినది. శ్యామల శీలశుద్ధిని విదితముచేయుట కిది గీటురాయి. ఆమెయెడ నిట్లు ప్రవర్తించినందులకు యశోధర తన భర్త చలపతిని నిందించెను. అతఁడు హృదయమాఁగి చనిపోయినాఁడు. దానితో యశోధరనే శ్యామల యూఅడింపవలసివచ్చినది. నైజమైన దయాళుత్వ మామె కప్పుడు బాసటయయ్యెను.

కుమారుని వెదకఁబోయినభర్త యెంతకును రాఁడు;తమకడఁగల ధనమెల్ల వ్యయమైనది. జీవితమున నిఁక సౌఖ్యమనునది కలుగ దనెడి నిరాశ యొకటి. తన మూలమువనే పండువంటి శివరావు సంసారము పాడయ్యెనని యామె వగచుట వేఱొక హేతువు. తాని క బ్రతికి యుండుట నిరర్థక మనెడి నిరాశోపహతి దీనికిఁ దోడు. ఇన్ని కారణములచే బహిష్కరించుకొని మనోవ్యాధికి గుఱియై మంచమువట్టిన శ్యామల తన బిడ్డను శయ్యమ్మ కప్పగించును. తన జ్యోతిని వృద్ధున కిచ్చిమాత్రము వివాహము చేయవద్దని యామె చరమసందేశము. జీవిత మెల్ల ధారవోసి నేర్చుకొన్న గుణపాఠము నా దుబిడ్డకుఁ జెప్పి యామె తన యిహలోకయాత్ర ముగించుకొన్నది. కేవలము భర్తృధర్మనిర్వహణమునకే యున్నట్లు శివరావు తుదిఘడియలలో జేరుకొనెను.

శ్యామలచరిత్రయందు సుఖము, సంతోషము ననునవి లేశమేనియుఁ గానరావు. అంతయు నసంతుష్టి, దుఃఖమును. తన్ను మొమ్మొదట చలపతికిచ్చి వివాహము చేయవలెనని సన్నాహములు జరుగుచుండగనే యామె కొక దుస్స్వప్నము వచ్చును. అది యామె భావిజీవితసూచక మైనది. తన తండ్రి మరణించుట, తల్లి ధనలోభమున దన్ను వృద్ధున కిచ్చుట, పియ్యమ్మపోరు, పుత్త్రుఁడగు భార్గవునియందు భర్త తన్నవమానించుట, భార్గవుని మృతి, జ్యోతిపుట్టుక, ఇల్లుగుల్లయగుట, తనయం దభిమానముగల యశోధరకుఁ బుత్త్రశోకము, దురభిమానపరుఁడగు కేశవుని యాత్మహత్య,మాధవుని సన్న్యాసము,చలపతి తన్ను భంగపఱుపఁజూచుట,యశోధరకుఁదనవలన భర్తృవియోగము, పేదరికమువలనఁ దల్లి తనవిషయమే పట్టించుకొనకుండుట, మొదటనుండియు మగపిల్లలయందుకంటె నాఁడుపిల్లలయందు తనతల్లి తక్కువ యభిమానముచూపుట వంటి కారణశతమునుబట్టి శ్యామలజీవితమంతయు దుఃఖభాజనముగనే గడచినది. అందువలననే వినువారి కది జాలిగొలుపును. భగవంతుఁ డామెను బాములు పడుటకే బ్రతికించినాఁడు.

తన సౌశీల్యమువలనఁ దన సోదరి విమలకు దగినవరుఁడు లభించుట యీామెకు జీవితదుర్దినములలో నొకమెఱపుమెఱయుట వంటిది. ఎంతటి కారుమబ్బునకైన వెండి వెన్నెల యంచులు కట్టవచ్చును. అది 'కన్నీటి కెరటాల వెన్నెల' యనదగు ఘటన; 'నిట్టూర్పుగాడ్పులో నెత్తావి.' ఎంత దుఃఖభాజకమైనను జీవితము కేవలము గాఢాంధకారబంధురము గాదని రచయితృశిల్పము సందేశ మిచ్చుచున్నది. దీనిని సజీవచిత్రణ మనవచ్చును. జీవితము స్వప్రయోజనము; సతతము నిష్ప్రయోజనముగాదు. అది యొక నిరంతరసాధన; అనుభవైక పరిపూర్ణము.

పైఁజెప్పిన పెక్కువిషయములను బట్టి శ్యామల తపస్విని యైనది. ఆమెవలన నీ నవలకు సార్థకాభిధ. శ్యామలయనఁగా బరిస్థితులప్రభావము. అది యీామె నొత్తిడిచేసెను. దానితో నామె తపస్విని గాక తీరలేదు.

**శివరావు**

ఇతఁడు శ్యామలభర్త; కథానాయకుఁడు. ఇతనికి వయస్సు నలుబది; న్యాయవాదివృత్తిలో దల నరసెను; బొజ్జపెఱిగినది; జీర్ణశక్తి తక్కువ; ప్రథమభార్యవలన ముప్వురు కుమారులు. వారిలో భార్గవుఁడు పదునాఱు సంవత్సరములవాఁడు. కేశవుని వయస్సు పంద్రెండు. మాధవునకే డేండ్లు. శివరావునకింటిలో దలచెడిన తోఁబుట్టు వొకతె. ఆమె పేరు వియ్యమ్మ. గృహకృత్యముల నామెయే నిర్వర్తించుచుండును. న్యాయవాదివృత్తివలన నాదాయము కొంతబాగుగ వచ్చెడిది.

ఇతఁడు దాంపత్యవిజ్ఞానకుశలుఁడు. శ్యామలను సంతోషముపెట్టును. యాభరణములు చేయించెను; ఆమెతో నాయుసేవనమునకై వాహ్యాళి కేఁగెడివాఁడు. సర్వవిధముల శ్యామలకు వినోదముగూర్చుట యతనికి దినచర్య యైనది. ఎంత చేసినను శ్యామల కతనియం దనురాగముమాత్రము గలుగలేదు. అన్నియు నచ్చును; అతఁడు మాత్రము నచ్చలేదు; ఆమె కాఁపురమునకువచ్చిన నెలదినములకే యీతఁ డింటిపెత్తన మామె కప్పగించెను. శ్యామలమాటలు విని వియ్యమ్మనుగూడ దండించువాఁడు. ఎన్ని తెఱఁగుల నుపన్యసించినను భార్యకు తనయం దనురాగము కలుగకున్నది. శివరావున కిది యొక తీరని విచారమై పోయెను.

ఒకనాఁడు కామానందశాస్త్రి వచ్చినాఁడు. ఇతఁడు శివరావునకు మిత్త్రము. వృద్ధులైనభర్తలు యువతులైన భార్యలను వశమొనర్చుకొనుటకుఁగొన్ని విధానముల నాఁత డీతని కుపదేశించెను. దానితో శివరావు వేషభాషలు మాఱినవి. ఇప్పుడు శృంగార ముట్టిపడ పలుకును; వేషము ధరించును; తన పూర్వప్రతాపముల నామె యెదుట వర్ణింప మొదలిడినాఁడు. ఈ సంగతులు వినిన శ్యామల యీతనికి వీఱిఁడి యెత్తిన దనుకొనును.అప్పుడే పడకగదిలో ద్రాఁచుబా మగపడినదని వియ్యమ్మ వచ్చి చెప్పినది. శివరావు కంసమున కఁతులేదు. కడకు భార్గవుఁడువచ్చి దానిని జంపువఱ

కెవ్వరును దిక్కులేకపోయిరి. శివరావు పరాక్రమ మెల్లబట్టబయ లయ్యెను. తన్ను మెప్పించుటకొఱకే శివరా వంత బాధపడుచున్నాఁడని శ్యామల కవగత మైనది. అందుల కాతనియెడ జాలికలిగెను. క్రమముగ నా భావ మనురాగముగ మాఱినది.

శ్యామలకు భార్గవునియందుఁగల పుత్త్రిస్నేహమును శివరావు వేఱొకవిధముగ నర్థముచేసికొనినాఁడు. ఆమెయం దగపడిన మార్పునకుఁగూడ నదియే కారణమయి యుండునని సందేహించెను. భార్గవునేదోయొక మిష పెట్టి యింటినుండి కదిపి ఛాత్రాలయములో నుంచవలయునని యాతని నిశ్చయము. ఉబుసుపోకకై భార్గవునికడ శ్యామల యాంగ్లమును నేర్చుకొనుచున్నది. శివరావుమనస్సు దీనికిఁగూడ నపార్థము కల్పించెను. ఆతని యనుమానమున కిది దోహదము. శంకవలనికోపముచే దండ్రి, కొడుకు చదువునందు లేనిపోనితప్పులు పట్టఁబూని వ్యర్థుఁడగును. మఱియుఁ గోపము మితి మీఱినది. ఇంటియొద్ద నాతనికిఁ జదువు బాగుగ సాగుటలేదని వంకపెట్టి తండ్రి కుమారుని ఛాత్రాలయమునకుఁ బంపఁబోఁగా నందులో నవకాశము లభింపలేదు. దీని నెల్ల భార్గవుఁ డూహించినాఁడు. తానే పోయి యందుఁ జేరెను.

సవతితల్లికిఁ దనయందు వాత్సల్యములేదనియుఁ దండ్రికిఁ దనయం దపోహకలిగె ననియు భావించి, యతఁ డభిమానధనుఁడై నానాఁటికి క్షీణించిపోవుచుండెను. తన తల్లియే యున్నచో నిదియిట్లు జరిగెడిది కాదని యాతఁడెఱుఁగకయే యెఱిఁగినాఁడు. ఇంటికిఁ దీసికొనిపోయినఁగాని భార్గవుని యారోగ్యము కుదుటపడదని వైద్యులు. ఇంటికి దీసికొనిపోవలయు నన్నచో శ్యామల యచ్చట నుండునుకదా ! యని లోపల శివరావు- ఇంతలో భార్గవుఁ డున్నచోటనే తనువుచాలించును. అప్పుడుగాని శివరావు నకుఁబట్టిన యనుమానభూతము వదలదు. చేతులు కాలినపిమ్మటనాకులు పట్టుకొనుట యైనది శివరావుబ్రతుకు.

అతనిపట్ల వార్థకమునకుఁ బుత్రశోకమొకటి తోడు. తనవృత్తి నిర్వర్తింప లేకున్నాఁ డిప్పుడు శివరావు. దినదినమునకుఁ గ్రుంగి కృశించుట యాతనివంతు; రాబడి తీసికట్టు. దురదృష్టవశమున నిప్పుడు శ్యామల కొక కూఁతురు; ఆ పసిదాని భావినిగూర్చి చెప్పరానంత భీతి. తా నొక ధనికునియొద్ద నప్పుదెచ్చి యత్యాశచే నా సొమ్మింకొకనికిఁ బెట్టుబడిపెట్టి శివరా వొక గ్రామమును దాకట్టుఁ బెట్టించుకొని నాఁడు. తన కివ్వవలసినవారేమో, యివ్వరు. తా నీయవలసినవారికేమో, తప్ప లేదు. శివరా విల్లు వేలమయ్యెను. జ్యోతి పుట్టుకతో నిది సంభవించినది. జ్యోతి యాకృతి సర్వవిధముల భార్గవుని యాకృతియే. జీవితనిరాశచెందిన శివరావున కిది యొక యూఱట. సంతానవ్యామోహము శివరావును మఱల ప్రపంచోన్ముఖుని జేసెను. మృత్యువుకౌఁగిలికై పరుగిడిన యాతఁడే తిరిగి గడ్డిపోచ నాధారముగఁ జేసికొని విపత్తులయొద్దు జేరుటకుఁగాను గాలుసేతులు కొట్టుకొనుట.

శివరావునకు మఱఁదలు విమల. ఈమె వివాహమున కేఁగిన శివరా వింటికి మఱలివచ్చును; శ్యామల రాదు. మనశ్శాంతికై పుట్టింటఁ గొన్నాళ్ళున్నది. శివరావు ద్వితీయపుత్త్రుఁడు కేశవుఁడు; అతనికి దుస్సాంగత్యములు. మందలించినచో నెదిరించి యతఁడుతండ్రినే కొట్ట బోవును. జ్యోతి పుట్టుకతో నా తండ్రి కీ కొడుకులపైఁ బ్రేమ తగ్గుట కేశవుని యా నడవడి కింకొక కారణము. శివరావు ప్రాణము లన్నియు జ్యోతియందే నిలిపినాడు. అతనికి జ్యోతీశ్యామలలతోడిదే లోకము.

తండ్రికిఁ దమయందేమాత్రము కూడ ప్రేమలేదని గ్రహించిన కేశవుఁ డొక నాఁడు తండ్రిపంపున నంగడి కేఁగు మాధవుని నిరోధించెను. కేశవుని గర్భశత్రువని తిట్టి శ్యామలవచ్చిన యండఁజూచుకొని శివరా వతనిని గొట్టఁబోయి త్రోపువడి యింటి నుండి వెడలనడప నెంచి 'పుష్టియెత్త నిమ్ము; కన్నము వేయ నిమ్ము' అని విదిలించి నాఁడు. కేశవుఁ డా క్రోధము మనమున నుంచుకొని తల్లి నగల నపహరించెను. ప్రభుత్వమువారికిఁ బితూరిచేయవలదని గోలపెట్టినది, శ్యామల. శివరా వది వినలేదు. నేరము కుఱ్ఱవానిపై "బుజు" వయ్యెను. లంచమిచ్చి నేరము రద్దుచేయింపవలెనని తల్లి ప్రయత్నము. ఇంతలో గేశవుఁ డాత్మహత్యకుఁ బాల్పడినాఁడు. శివరావున కిది రెండవపుత్త్రశోకము; మూలుగుచున్న నక్కపై తాటిపండు.

పిసినారితనము పెఱిగి శ్యామలపెట్టుబాధల కోర్వలేక శివరావు మూడవ కొడుకు మాధవుఁడు సన్న్యాసులలో గలసిపోయెను. శివరావును దైవము చేయువరీక్ష పూర్తికాలేదు. గ్రుడ్డివానిచేతికఱ్ఱ సైతము జాఱిపోయినది. వంశోద్ధారకులగు ముగ్గురు కొమాళ్ళున్నను బునర్వివాహమాడుటవలని యాత్మకృతదోషమును నిందించుకొని నాఁడు. ఖిన్నుఁడై యాతఁ డిల్లుసేరుసరి కిచ్చట శ్యామల మరణము. చివరకు మిగి లిన దెవ్వరు? జ్యోతి, వియ్యమ్మ, శివరావును మాత్రమే. పురాకృతకర్మశేష మనుభవింపక వేరికిఁ దీరును?

శివరావుపాత్ర ప్రథమమునఁ బ్రశంసనీయముగనే కానిపించును. అతఁడు విద్యా వంతుఁడు; ఆర్జనపరుఁడు; సంపన్నగృహస్థు; అతనికి మువ్వురు కుమారులు. ప్రథమపత్ని వియోగముతో నాతనిసిరి మాటిపోయినది. తానుమానుకొని పెద్దకుమారునకుఁ బెండ్లి చేసినచో నాతని యదృష్ట మడ్డముతిరిగెడిది కాదు. అథ్యుఁడనుగదాయని శ్యామలను వివాహమాడుట యాతని మొదటితప్పు. భార్యాభర్త లిద్వురిలో నెవ్వరికిని సుఖము లేదు. విశేషించి శివరావున కీ పెండ్లివలన నిహపరములు రెండును జెడిపోయినవి; ప్రేమలేనిభార్యవలన నిహముచెడెను. నష్టపుత్త్రుఁ డగుటచే బరమును జెడిపోయినది. కన్న కొమరుని భార్యయం దనుమానించెనన్న లోకనిందమాత్రము మిగిలెను.

తెచ్చినయప్పు తన సంపాదనమీఁద దీర్చి, తాకట్టుపెట్టించుకొనిన యా గ్రామము దక్కించుకొన యత్నించిన దురాశాపరుఁడు, శివరావు. వడ్డీయాశ మొదలు చెఱచెను. ఉన్న యిల్లుకూడ నూడినది. శ్యామలను సంతోషపెట్టుటకై పౌరుష మును పలుకుచుండఁగా వియ్యమ్మ వచ్చిచెప్పిన పామువృత్తాంత మాతనిని బిరికిపందగ నొనర్చి దాంభికవచస్సందర్భునిఁ జేసెను. అనుమానము, నిర్దయయు శివరావు పుట్టుకతో బుట్టినవి. అతఁ డెత్తువారి చంకబిడ్డ; అసమీక్ష్యకారి; దూరదృష్టిలేనివాఁడు; దురహం కారి; ధనాకులదాసుఁడు. తన సర్వనాశనమునకు శ్యామల నకారణముగా నిందిం చును. మన తప్పు నితరులపై నెట్టక మనదిగా నంగీకరించుచో మనము మానవాతీతు లము గామా?

భార్గవుఁడు :—

ఇతఁడు శివరావు పెద్దకుమారుఁడు ; పదునాఱేండ్ల ప్రాయముగలవాఁడు; రూపవంతుఁడు; గుణవంతుఁడు. ఇతని చరిత్ర యువకుల కాదర్శప్రాయ మైనది. విద్యా భ్యాసము చేయువారి కావశ్యకములగు వినయాదిసద్గుణములు, బుద్ధికుశలతయు, వ్యాయామక్రీడాపరతయు నాతనికిఁగలవు. అతఁ డనావశ్యకములగు పనులవంకకుఁ బోఁడు. కర్తవ్యనిర్వహణ మాతనికి రక్తనిష్ఠమైన గుణము. కావుననే తరగతిలో ప్రథమశ్రేణి బడయుటయు బహుమతుల నొందుటయు సంభవించినవి. శివరావు వేఁడికొన్నను ఛాత్రాలయమున నవకాశము లేదనిరి. కాని భార్గవుఁ డడుగగనే యది లభించెను.

నిర్భయముగఁ బామును జంపుట యాతని సాహసమునకు నిదర్శనము. తండ్రి యెన్నియన్నను నెదురాడకుండుట పితృభక్తి. తల్లిని దలఁచుకొని కన్నీరు మున్నీరుగ విలపించుట మాతృభక్తికిఁ దార్కాణము. భార్గవుఁ డభిమానవంతుఁడు గావుననే తండ్రి తనపై మోపిన దోషమున కసువుల నర్పించినాఁడు. తండ్రిమాటలు విని మొదట శ్యామలకుఁ దనయందు వాత్సల్యము లేదనుకొనెను. కాని యందలి సత్య మెఱిఁగి, యసాధారణమైన యామె మాతృప్రేమను గ్రహించి, తన పొరపాటునకుఁ బశ్చాత్తప్తుడైనాఁడు, భార్గవుఁడు.

తన యీ యపరాధమునకు క్షమాభిక్ష వేఁడుకొనుటకే యతఁడుశ్యామలవచ్చు వఱకును ప్రాణములు నిలుపుకొన్నది. 'చచ్చి యామెకడుపునఁ బుట్టుట' భార్గవుఁడు చేసుకొన్గిన ప్రత్యుపకృతి. తన చరమవాంఛగా నతఁడు దైవమును బ్రార్థించినట్లే 'జ్యోతి'రూపమున శ్యామలకుఁ బుట్టెను. ఆ కోరికయే యాతని శీలమునకు గీటు ఱాయి. ఏ కారణముచేతనైనను దనమీఁది కొక యపనింద వచ్చినప్పు డభిమాన ధనుఁడు ప్రాణములనర్పించియైన దానిని బాపికొనును. భార్గవుఁడు బ్రతికియుఁ బ్రాణ ములఁ బాసియు మనకు బోధించు నీతియే యిది.

యశోధర :-

శ్యామలకష్టములను జూచి యామెకు సాహాయ్యమొనర్చిన సుహృదురాలు యశోధర; ఆమె గుణములను బ్రశంసించిన గుణగ్రహణపారీణ; యసూయావిరహిత; కట్నములకై వాగ్దానములను భంగమొనర్పరాదను నమ్మికలోనిది. కట్నము లేకయే తన మఱఁదికి శ్యామలచెల్లియగు విమలను జేసికొన్న ధర్మబుద్ధి యీయామె; ఐదువందల రూప్యములను శ్యామలయే పంపిన దనుకొనునట్లుగ నామెతల్లి యనంతలక్ష్మికిఁ బంపిన యుదారురాలు. యశోధరయనఁగా, దనభర్త శ్యామలయెడ నొనరించిన యపరాధమున కాతనిని గఠినముగ మందలించి వైధవ్యమునుగూడ భరించిన నిష్కాపట్యకతాస్వరూపిణి. ఇంకను సమయోచితప్రవర్తనము, వాక్చాతురి, గృహకృత్యనిర్వహణశక్తి, యల్పసంతోషము, శీలశుద్ధియుఁ గల యీయామె చరిత్రముగూడ శ్యామలచరిత్రవలె స్త్రీజనమున కాదర్శము కాఁగలదు.

శ్యామల స్వప్నము: భావ్యర్థసూచనము:-

వివాహము నిశ్చయింపఁబడినప్పుడే శ్యామలకు స్వప్నము వచ్చెను. అందు ముందగపడిన దొక తరంగితమైన నది; అనఁగా సంసారము. ఆ సంసారమను నదిని దాఁటుట యనఁగా సుఖమయజీవితమును గడపుట. ఇందులకు భర్త కావలయును.సుందరమగు నొక నావ యగపడుట, శ్యామలను మొదట నిచ్చుటకు నిశ్చయించిన చలపతి కట్నము కోరకయే లభించుట. ఆ చలపతి కిచ్చి శ్యామలకుఁ బెండ్లిచేయవలెనని యత్నించు చుండఁగనే యనంతరామయ్య మరణించుట, రామకృష్ణయ్యగారు పెండ్లి నిరాకరించుటయు, శ్యామల గోలపెట్టినను బడవవాఁడు నిరాకరించుట కర్థము. శ్యామల కింతలో వేఱొక పడవ లభించుట, శివరావు తటస్థించుటయే! దానికిఁ దెడ్లు, చుక్కాని, తెఱచాపయు లేకపోఁగా, దూట్లుపడియుండుట యనఁగా నా సంసారమును జక్కఁగా నడిపించుటకుఁ దగిన సాధనసామగ్రి లేదనియు,శివరావు వృద్ధుఁడగుటచేతను బిల్లలు గలవాఁడగుటచేతను గయ్యాళిగంపయగు వియ్యమ్మ యుండుటచేతను జాల గృహచ్ఛిద్రములు కలవనియు సూచ్యము.

గత్యంతరములేక శ్యామల యా పడవనెక్కెను. ఇది శివరావుతోడి యామెకుఁ బెండ్లి. రంధ్రములవలన నీరు లోపలికిఁబోయి కలలో బడవ నట్టేట మునిఁగెను. శివరావుఁ తాగన్న కొడుకు శీలముసుశంకించి విద్యార్థిసదనమునఁ జేర్పించినాఁడు; వియ్యమ్మ యల్లరిపెట్టినది. కేశవుఁ డవినయపరుఁడై మరణించెను. భార్గవమాధవులును గతించిరి; ఆస్తి యెల్ల నప్పుల పాలైనది; శ్యామల మనోవ్యాధివలన మరణించెను: జీవితమున శివరావుపుట్టిమునుఁగుట కీ యంశము లన్నియుఁ దోడైనవి. ఈ రీతి నవ్వయుపఁదగు స్వప్నవృత్తాంతము కావ్యార్థసూచనము కలది.

**తపస్విని : పరమార్థము :—**

ఇది యొక సాంఘికనవల. కొన్నికొన్ని సంఘములలో గొన్నికొన్ని దురాచారము లుండును. వానివలనఁగలుగు ననర్థములు లెక్కకు మిక్కిలి. హిందూమతమందు వివాహ మనునది యొక పవిత్రకర్మ. వధూవరుల సమ్మతి ననుసరించి వారివారి తలిదండ్రులు తమతమ సంఘధర్మముల ప్రకారము వివాహము చేయుదురు దంపతులు సంసారసుఖదుఃఖముల ననుభవించుచు, వంశవృద్ధికిఁ గారకు లగుచుండుట వివాహ పవిత్రబంధమందలి ప్రధానాంశము.

వరశుల్కకన్యాశుల్కాదులను బరిగ్రహించుట నింద్యమైనపని. 'తపస్విని' యను నీ నవలయందు వరశుల్కముకొఱకై నిర్ణయింపఁబడినసంబంధము నిరాకరింప-బడును. తన్మూలమునఁగలిగిన యనర్థము బాగుగ నవలలో నిరూపితము. ఇందు మూఁడు కుటుంబముల కరుణవృత్తాంతములు వర్ణింపఁబడినవి.

అం దనంతరామయ్యగారి దొక కుటుంబము. వివాహవ్యయముల విషయములో నాలుమగలు తగవులాడుదురు. అనంతరామయ్య మరణించును. ధనాభావముచే ననంతలక్ష్మమ్మ శ్యామలను వృద్ధున కీయవలసివచ్చినది. అందువలన శ్యామల జీవితము దుఃఖభాజన మగును.

రెండవ కుటుంబము రామకృష్ణయ్యగారిది. ఈయన శ్యామలను దన కుమారునకుఁ జేసికొన నంగీకరించి, ధనాశచే దానిని మానుకొని యైదువేలకట్నమునకు లోభించి యశోధరను చలపతి కిచ్చి పెండ్లిచేయుదురు. ఆమె భర్తను దూలనాడినది. ఆతఁడు మరణించినాఁడు. దీనికెల్ల ధనలోభము హేతువు. శ్యామలనే చలపతికిఁ జేసికొనినచో నిట్లు జరిగెడిది కాదు.

శివరావుకుటుంబముకరుణగాథ ముఖ్యముగ మూఁడవది. యోగ్యులైన పుత్త్రిలు ముగ్గురుండఁగా నీతఁడు ద్వితీయమునకుఁ బాల్పడును. తమ యసమర్థతచే నెట్టి వారికిలయమునుగాని శంకించుట కిట్టివారు వెనుదీయరు. శివరా విట్టి యకృత్యముచే దనయులను భార్యను సర్వసంపదను గోలుపోయిన యభాగ్యుఁడు.

ఈ మూఁడు సంసారముల వృత్తాంతములును జక్కఁగ సంఘటనలతో బాత్రపోషణములతో నిందుఁ గూర్పఁ బడినవి. నింద్యమై నిర్మూలనార్హమైన యీ వరశుల్క-పిశాచవిషయము మహోరచయిత లెంద ఱెందఱు తమ ప్రభావమును బ్రసరింపఁజేసినను దీరునది గాదు. ఈనవల తెలుఁగుదేశములో నడిమితరగతి కుటుంబములకు సంబంధించిన యనేకసమస్యల ప్రతిబింబము.

## రుద్రమదేవి [1]

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారిచే విరచితమైన యీ చారిత్రకనవలయందుఁ గాకతీయులనాఁటి ప్రజల మతసాంఘికరాజకీయపరిస్థితు లద్భుతముగఁ జిత్రింపఁబడినవి. అనాదిగభారత దేశమునఁ బురుషుని వ్యక్తిత్వమునను సరించి స్త్రీవ్యక్తిత్వము నిర్ణయింపఁ బడుచున్నది. అట్టి కాలములో స్త్రీయగు రుద్రమకు రాజ్యము సంక్రమించిన విధ మును దదనంతరము ప్రతాపరుద్రుఁడు చక్రవర్తియగుట కేర్పడినపరిస్థితులును వర్ణితములు. తాను స్త్రీయయ్యు నల్లకల్లోలముగ నున్న రాజ్యపరిస్థితుల కేమాత్రము కలఁతనొందక ధైర్యస్థైర్యములతో గాకతీయసామ్రాజ్యభారము నవలీలగ వహించిన రుద్రమదేవి పరి పాలనాదక్షతయు నాంధ్రరాజన్యుల ప్రభుభక్తిపరాయణత్వమును వారి శౌర్యపరాక్రమ ములునుగూడ నిందు నిరూపింపఁబడెను.

అపుడు గణపతిదేవచక్రవర్తికి వార్ధకము. ఆయన వ్యాధిగ్రస్తుఁడై యున్న సమ యమున నాంధ్రులకుఁ బ్రధానోత్సవము లనఁదగు శరన్నవరాత్రములు దరిసినవి.ఆయన తనకుఁ బ్రతినిధిగా శరన్నవరాత్రములు జరుపుటకై భావిచక్రవర్తిని నిర్ణయింపవలసిన యావశ్యకతను నిరూపించుచు నీ నవల ప్రారంభమైనది.

రాజు తన్నిర్ణయమునకై పేరోలగముండుట జరిగెను. అందుఁ జాళుక్య వీర భద్రేశ్వరులును మహాదేవరాజులును దమతమ పుత్రులే రాజులు గావలయునని యెవరికి వారు వాదించుచుండఁగా రాజగురువులగు శ్రీ విశ్వేశ్వరశంభుదేశికులు రుద్రమయే రాజ్ఞిగావలసినదని సూచించిరి. అది రాజానుమతి నొందెను. తత్ప్రకారముగ సర్వము నిర్ణయింపఁబడినది.

అంతవఱకుఁ జక్రవర్తి యనంతరము పట్టాభిషిక్తుఁ డగునని తలఁపఁబడెడి హరి హరదేవుఁడుగాక దీనివలన రుద్రమ యనంతరము మహాదేవిరాజపుత్త్రుఁడు ప్రతాప రుద్రుఁడు పట్టాభిషిక్తుఁడగు సూచన లేర్పడినవి చాళుక్యవీరభద్రేశ్వరుఁడును హరి హరదేవుఁడే చక్రవర్తియగునని యంతవఱకుఁ దలఁచు చుండెను. తద్విరుద్ధముగ జరు గుట కియ్యకొనని సామంతులు కొందఱు వీరభద్రేశ్వరునితో గలసి రాజద్రోహసంఘ

---

[1] మహాకవి కాళ్లకూరి నారాయణరావు విరచితమైన 'ప్రతాపరుద్రమదేవి' కంటె నిది భిన్న మైనది. అసమగ్రమై శిథిలావస్థలోనున్న 'ప్రతాపరుద్రమదేవి', శ్రీవాత్సవగారి (తుది నాలుగున్నర పుటల) పూరణముతో దొలికూర్పుగ ఆగష్టు 1961లో వెలువడినది.

ముగ నేర్పడి నలుదిక్కులనుండి కాకతీయరాజ్యముపై దండెత్త నుంకించు చుండిరి. వీరు శత్రువులగు పాండ్యుఁడు, కొప్పెరుజింగఁడు, మహాదేవరాజు, కాళింగులు మున్నగువారికిఁ జేయూఁత నొసఁగుటకై రాజ్యమునఁ గల్లోలముల లేవదీయఁ బ్రయత్నములు సలిపిరి. ఇంతకు రుద్రమపరిపాలనమును గూలఁద్రోయుటయే వీరి యాశయము.

రుద్రమయు రాజభక్తిపరాయణులగు తిక్కనామాత్యుఁడు, గోనగన్నారెడ్డి, యన్నయమంత్రి, త్రిపురాంతకుఁడు, మేచయనాయకుఁడు మున్నగు మహాశూరుల సాహాయ్యముచే దమకోటను సర్వవిధముల భద్రపఱచినది. ఆమె శత్రువుల నందఱ నోడించి సుస్థిరసామ్రాజ్యమును స్థాపించి యుద్ధమునఁ దనకు సాహాయ్యపడిన శూరుల నెల్లఁ దగురీతిగ గౌరవించెను. పిదప నామె దుష్టుల శిక్షించి ప్రజానురంజకముగ రాజ్యము పాలింపఁ గడఁగినది.

ఇట్లు గణపతిదేవచక్రవర్తి కాలమునఁ బ్రారంభమైన యీ నవల రుద్రమ శత్రు రాజన్యులఁ బాఱఁద్రోలి విజయపరంపరలఁగొని స్థిరప్రభుత్వమును స్థాపించుటతో ముగిసెను.

భారతదేశ స్వాతంత్ర్యసాధనానంతర మాంధ్రు లెల్లరు సంపాదించిన తేజఃపుంజమే యీ నవలాస్వరూపము.

## అరుణోదయము 1

శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి నవలలలో[2] నిది మూఁడవది. ఈ నవలకు పూర్వము రచించిన 'కులములేనిమనిషి' యను నవలలో వీరు బాగుగఁ గీర్తినొందిన మాట నిజము. కాని దానికి హేతువు, వా రధికముగ నవలంబించిన వ్యక్తివాదబలము ; అధికముగ నుద్దేశించిన సాంఘికప్రయోజనము కాదు. అందుచే నిది యొక రచయితగఁ వీరికిఁ గీర్తి చేకూర్చినది; ఇది యొక విశిష్టరచయితగ యశము నాపాదించినది. కాఁగా నీ విశిష్టత యెట్టిది?

ఇంతకు ముం బూర్వముది గుణమునకుఁ బ్రాధాన్యమిచ్చుయుగము; రాశికిఁ గాదు. ఈ మన నవలనాఁటిది రాశికిఁ బ్రాధాన్యమిచ్చుకాలము; నూటికి నూఱుపాళుల ప్రజాస్వామిక యుగమన్న మాట. దీనికిఁ బూర్వమప్పుడు పదిమందిలో నొకరుచెప్పినను

(1) About 1950 A. D.

2. 'ఏకేంకావాలి?', 'కులంలేనిమనిషి', 'అరుణోదయం', 'మారుపేరు', 'చదువు', (1952) ఇవి వీరి నవలలు. ఇందు 'చదువు' ప్రశస్తమని పలువురభావము. అది మన యాధునికుల మన సత్త్వనిరూపక నవలలలో నొక యుత్తమమైన నవల. 'ఆడజన్మ' కుటుంబరావుగారి కథల సంపుటముల యందొకటి. శ్రీ అడపా రామకృష్ణారావుగారు దీనినెట్లు నవలలలో జతించిరో యనుమానము. The All India Telugu Writers, conference 1960, Souvenir P. 62, Column 2- lines 11, 12. (1960)

సత్యము సత్యమే! ఇప్పుడన్ననో, యధికసంఖ్యాకులు చెప్పినదే సత్యము. పదిమందిలో నలువురుమాత్రమే చెప్పినచో సత్యమునైనను సత్యము కాఁజాలదు.

ఇది యుగలక్షణము. అనఁగా, రచయిత గుణము నుద్దేశింపఁడు. సముదాయము నుద్దేశించును. జనబాహుళ్యవారాశి కొక రత్నముకాదు; పదికోట్ల గులకఱాలు, వారధినిర్మాణమునకుఁ గావలెను. ఒక యుగంధరుఁడు, చాణుక్యుఁడు, తిమ్మరుసువంటి మహామంత్రియు, మహామేధావియుఁ గాఁడు, నేఁడు మనదేశమును రక్షించునది; అణుశతఘ్నికిఁ గుఱికాఁగల కోటానుకోట్ల సేనాబలము. నేఁడు వెలువడినవి, వెలువడఁగలవియు, మహోదారరచనలు గావు; వేదములు గావు; కోట్లాది బాలశిక్షలు. ప్రజాస్వామికప్రభావము సముత్తేజితతరంగములలో నంతర్లీనమయి మన రచయితల యుద్దేశమును, రాజకీయప్రయోజనముల సాధనపేరిట, నాకలోకమునుండి నాగలోకమునకు గుంజుకొని వచ్చుచున్నది.మానవారాధనమే సాహిత్యప్రయోజనము. ప్రతిభ యను పదము కలికములోనికి రాదు; ఎవ్వరేని ప్రతిభావంతు లున్నచో వారు గతకాలస్మృతిచిహ్నములే గాని వర్తమానమునకుఁ గర్తలుగారు.

నేఁడు ప్రజలను దృష్టియం దుంచుకొననిది రచనయే కాదు. ఆ ప్రజ యెవరు? వారి స్థాయి యేమి? ఒకే స్థాయిగల ప్రజానీకమని యొకటి యున్నదా? ఇట్టి ప్రశ్నలకు సమాధానము లుండవు. పూర్వము పాఠకులు ధనికస్వాములు; మేధావులు. మఱి వారి పేరేమి? వారు ప్రజలు కారా? బిచ్చగాండ్రు, నిరక్షరాస్యులుమాత్రమే ప్రజలా? ఇందు మొదటివారికి. జదువఁదీరిక యుండదు; రెండవవారు చదువలేరు; ఇఁక మన మెవ్వరికై వ్రాయుచున్నాము? అధిక సంఖ్యాకులగు వర్గములవారికి. ఎట్లుఁజూచినను దిరిగి సంఖ్యాబలము, ప్రజాస్వామ్యము నున్నగు విషయములే వచ్చును. నూఱు మందిలో దాత్కాలికైకమత్యము గల యేబదియొక్కమందిమాత్రమే ప్రజ. తక్కిన వారు దద్భిన్నులు. ఇది ప్రజాస్వామ్యములోని రహస్యము. అనఁగా, నలుబదితొమ్మండ్రపై నేబదియొక్కమంది నిరంకుశత్వము పేరు ప్రజాస్వామ్యము. ఈ యీ కారణములచే నధికసంఖ్యానులకొఱకై రచింపఁబడినది నేఁడు సాహిత్యమయితీరును. వారి కతరజ్ఞాన ముండుటయు, లేకపోవుటయుఁ బ్రశ్నలేగావు. మన రచనలవలన వారు ప్రయోజనము పొందుచున్నారా? యనునదియు యోజింపము. మనము వారి నుద్దేశించిమాత్రము వ్రాయుచున్నాము. కాన మనది సాహిత్యము కాకతప్పదు. పిదప వారికర్మము.

ఇట్లుఁ బ్రజానీకము నుద్దేశించి రచనలు సాగించుటయే పరమోద్దేశముగాగలది యభ్యుదయసాహిత్యమార్గము. ఆధునికాంధ్రాభ్యుదయసాహిత్యమునందు విమర్శకులు, గేయకవితకు శ్రీ. శ్రీ. గారి నెట్లు ప్రథములుగ గౌరవింతురో, నవలాకథానికారచనములకు కుటుంబరావుగారి నట్లు ప్రముఖులుగ గౌరవింతురు. వీరి 'అరుణోదయం'

పూర్వార్ధము రాజకీయమైన యభ్యుదయశోధననాళికయందు సాధించిన సాహిత్యక ప్రయోగముకంటె భిన్నమైనదికాదు. కాని యీ ప్రయోగములో ఫలించినవి స్ఫటి కఁపుపలుకులవంటి పలుకులుగావు; బండికందెనవంటిది లభించినది. కుటుంబరావుగా రెప్పుడును గథాసాహిత్యసింహాసనము నధిష్ఠింపఁదగిన కృతకయువరాజుగనే గోచరిం తురు. కొందఱిమతమున వీరు శ్రీ చలముగారి తరువాత వత్తురు. ఆ వేంకటచలము గారు వివర్తనశీలురు; నేఁడు యోగులైరి; ఒకప్పుడు లైంగికవిషయములచే వెక్కసము గొల్పినవ్యక్తి నేఁడు తత్త్వాన్వేషణముచే వెక్కసము గలిగించుచుండెను. పోనిమ్ము. ఆయన సారస్వతపట్టాభిషేకమును నిరసించి యోగాభ్యాస పట్టభద్రుఁడయ్యెనందము. మఱి కుటుంబరావుగారి సంగతియేమి?

చలముగారివలెనే వీరును జాలవఱకాత్మప్రియంభావుకులు. ఆ సింహాసనప్రలో భము వీరికిని గడుఁదక్కువ. పరిణతము, స్తవనీయమునగు తన సృజనాత్మక కళకంటె నాయన కెప్పుడును దన వ్యక్తిగత మనోవ్యాపారము ముఖ్యము. వీరి తొలి నవలలు కొన్ని కథలవలెనే స్త్రీపురుషపాత్రలనుండి యుద్భవించినవి కావు. ఆ యా పాత్రలే వీరి నవలలలోనుండి యుద్భవించినవి. పోను బోను వీరి పాత్రపోషణౌచితి పెరిఁగినది. ఆ విషయమున వారి కళాకౌశలము నేఁడు పరసీమ ముట్టె ననవచ్చును. కాని ప్రారంభ దశలో వీరి కొక యుద్దేశమని యుండెడిది. అది చాల సహేతుకమై సరళముగఁగూడ నుండెడియుద్దేశము; శిల్పదృష్టితో జూచినప్పుడా రచనాపరిసమాప్తికి రూపరేఖలు తీర్చి దిద్దఁగల దా యుద్దేశము; బుద్ధికిఁగాని, రసభావములకుగాని సంబంధించిన యొకానొక ప్రేరణఁ గలిగింపఁగలది యా యుద్దేశము. ఆ దినములలో ననివార్యముగ నా పాత్ర లెల్ల నాయనకు వశవర్తులై మెలఁగెడివి. నిరంతరముగ నా దినములలోను నప్పుడప్పు డీ దినములలోనుగూడ సారస్వత మనఁగా, నాయనమతమున సాధారణముగ రచయిత మనోభావములను దృష్టాంతీకరించుట కొక సాధనము. లేక, రచయిత పూర్వమే నిర్ణ యించుకొనిన యొక నిర్ణయమునకు దారితీయు సాధనము.

అట్టి వీరినుండి యా నాఁడు సకృత్తుగ వెలువడిన యద్భుత నవలల పేళ్ళు 'నీకేం కావాలి?', 'కులంలేనిమనిషి'యు. ఇతివృత్తములకుకంటె వీనిలో బాత్రలకును బరి సమాప్తులకంటె నితివృత్తములకును బ్రాముఖ్యమెక్కువ. ఇట్టి యుత్తమరచనలు మొత్తముమీఁద నా దినములలో వీరియందపవాదము లనఁదగియున్నవి.

ఇంతలో నొకటిన్నర దశాబ్దులకుఁ బైఁగా 'నభ్యుదయరచనము' మన యాంధ్ర దేశమును దూసికొనిపోయినది. ఆ నాళ్ళలో కుటుంబరావుగా రెట్టకేలకుఁ దన యాత్మ కళాదిగ్గమైనదిగదా యని భావించియుందురు. ఏలన నన్నినాళ్ళకుఁ దన పాత్రల నొక యార్థికరాజకీయసిద్ధాంతము నన్వేషించు మార్గములలోబెట్టుట కాయన యుద్దేశింపఁగలిగినారు. దాని ఫలితమే మన 'అరుణోదయ' మనవచ్చును.

ఈ నవల వారిరచనలలో నెల్ల నపరిష్కృత మగుట చాల నిరుత్సాహకరము. వా రింతకుఁబూర్వము చక్కనికథలు, నవలలును వ్రాసిరి. దీని తరువాతఁగూడ నుత్తమరచనలు వచ్చినవి. కాని నడుమంత్రముగనే యీ యంతశ్శుద్ధిలేని, విజయ వంతముకాని రాజకీయసాహిత్యప్రయోగము వచ్చిపడెను. దీని కంతకు మూలము శ్రీ చిత్తూరినాగయ్యగారు నిర్మించిన 'స్వర్గసీమ' చలనచిత్రము 1. మన యీ నవల చాల వఱకు దాని ననుసరించెను. ఆ నిర్మాత తన చిత్రమునందుఁ జాటుమాటు వ్యాపా రాదికముతో మేళవింపఁజూచిన ప్రణయప్రలాపాదు లిందును రసాభాసమునకే దారి తీసినవి. ఆధునికాంధ్రకథాసాహిత్యకులలో కుటుంబరావుగారి రచనాపాటవ మవంధ్య మైనది. అట్టి వీరికే కారణాత్మకమయ్యుఁ గళాత్మకముగ నెగడఁగల యొకానొక ప్రత్యేకరచనావిధాన మలవడనియెడల నది యితరుల కిఁక నంతశ్శోధన మావశ్యమని నిరూపించుటలేదా?

ఒక నిర్దిష్టప్రయోజనముతో వీరు తఱచుగ రచనలు సాగింతురు. అది బుద్ధీం ద్రియవ్యాపారప్రేరకము కావచ్చును; రసభావములను ప్రేరేపింపఁజాలదు. అప్పు డది నవలగా జదువరుల మనస్సులను రసింపలేకపోవును. తల్లిక్షణమునకు మన 'యరుణో దయ'మే యుత్తమోదాహరణము. నేఁటి మన స్తత్త్వనవలాకర్తలలో నుత్తములుగఁ దమ్ము గణింపఁదగు 'చదువు' వంటి ప్రశస్తనవలలు వీరివి కలవు. అయినను దమది యని పేర్కొనఁదగిన యొక రచనావిధానమింకను వీరి కలవడలేదని "అరుణోదయము" సాక్ష్య మిచ్చుచున్నది.

## అతడు - ఆమె 2

ఈ నవలాకర్త వుప్పల లక్ష్మణరావుగారు. ఇది దినచర్యవిధానము నవలం బించి వ్రాయఁబడిన నవల. నూటికి నూఱుపాళ్ళు దినచర్యయై యాథాతథ్యము గలిగియున్నచో నది నవలయే కాదు. నవల కొంత కల్పితమై యథార్థభ్రాంతి నాపా దించుట యనునది యుండవలెనుగదా! అంతయుఁ గల్పనాతత్త్వభూయిష్ఠమైయై, దిన చర్యతత్త్వ మించుకయు లేనియెడల నిది దినచర్యప్రక్రియ నవలంబించిన నవలయగు టయే కల్ల కాఁగలదు. అందువలన నీ రెండుతత్త్వముల సమన్వయించుటయే యిట్టి దానిలోని యసిధారావ్రతము. తత్సాధనవలననే దాని కా ప్రత్యేకతయు. ఈ పద్ధతిలో సాగిననవల తెలుఁగునం దిది యొక్కటియే 3 ప్రసిద్ధ మన్నచో నాశ్చర్యము లేదు. కల్పనాతత్త్వ దినచర్యతత్త్వములను సమన్వయించుటలో రచయిత కృతకృత్యుఁడయ్యె ననియే చెప్పఁదగును.

---

1. ఈ 'స్వర్గసీమ' చిత్రమునకుఁ 'దిరుగు (గఁ) బాటు' అను చలనచిత్ర మొక యనుకరణము.

2. మొదటి కూర్పు క్రీ. శ. 1950.

3. శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి 'సరళాదేవి డైరీ', యిటీవలి సందిగ్ధ ప్రయత్నము.

సుమారు ముప్పదియేండ్లకు మునుపు మన రచయిత జర్మనీదేశములో నున్నప్పుడు తమ కుటుంబపత్రిక 'ఉషఃకాలం' కొఱకై యీ నవలారచనము నుద్దేశించిరి. భార్యాభర్తల దినచర్యగా 'ఆలీవ్ వాడ్సలీ' రచించిన చిన్నకథ యీ నవలాకారునకు స్ఫురణలో నున్నది. ఈ నవలయందలి కొన్ని ప్రకరణము లప్పుడప్పుడు 1 'ఉషఃకాలం' లో ప్రకటింపఁబడినవి. పది సంవత్సరములపాటూరకొనియుండి మఱలఁ గొన్ని ప్రకరణములను జేర్చి, యూరపుఖండ పర్యటనానంతరము వచ్చి రచయిత ప్రకటింప నెంచినాడు. కాని కథ నింకయు బెంచివ్రాసినచో బాగుగ నుండునని యెంచి మార్పులను గూర్పులను గొన్ని క్రొత్తఘట్టములను గూడఁజేర్చి నవల పూర్తిచేసినాఁడు.

ఈ నవలలోని నాయిక శాంతమ్మ; ఎం. ఏ., పట్టభద్రురాలు; చెన్నపట్టణములో 'క్వీన్ మేరీ' కళాశాలయం దుపన్యాసకురాలు; తెలివిగలది. ఆమెలో జాణుకుఁదనమునకుఁ గొఱతలేదు. చిదంబరశాస్త్రి యిందలి నాయకుఁడు. ఈమెతో నాయనకు నాలుగుసంవత్సరములకుఁ బూర్వమునుండియుఁ బరిచయము. ఆతఁడు సీమలో 'బారిష్టరు' పట్టమునొందివచ్చి చెన్నపట్టణమున న్యాయవాదివృత్తి నవలంబించినాఁడు; మంచివాఁడుకూడ ; అతనికి నుల్లాసముగనుండుట యిష్టము. ఇద్దఱు నాంధ్రులగుటచేత నిద్దఱు పెండ్లికానివా రగుటచేతను జెలిమిబాగుగా గుదిరిపోయి వారు 'రిజిష్టరు' పెండ్లి చేసికొనిరి. వివాహ మైననాఁడే మనుగుడుపులకై కాశ్మీరము వెడలిపోయి రా దంపతులు. అచట రెండు నెల లుండిరి. శాస్త్రికి వేసఁగిసెలవులు గడచిపోయినవి. ఇరువురు పట్టణము వచ్చినారు. ఆమె తన యుద్యోగము మానివేసినది. ఆ సంసారసాగరమీఁదుచు శాంతమ్మయు శాస్త్రియు సాగించిన జీవయాత్ర యీ నవలలో వర్ణింపఁబడెను. రాజకీయేత్యాదిభావములలో వీ రిర్వురకును గించిద్వ్యత్యాసము లున్నవి. కాని యొకరు నతివాదులు కారు. తల్లిదండ్రులైన పిదపఁగూడఁ బట్టరాని పరస్పర ప్రేమతో నెడనెడ భిన్నాభిప్రాయులయ్యు వారుపొందిన యపారసౌఖ్య మిందలి వర్ణ్యవస్తువు.

సరిక్రొత్తగఁ జాల సంతోషముగ గడు నుల్లాసముగ వారు వైవాహికజీవితము నారంభించుటలో మన నవల యారంభించును. వీరి యీ నూతనజీవితయాత్ర సుఖపడుటకు వచ్చెనో చిక్కులగుటకు వచ్చెనో సాంతము చదివిచూత మనెడి యుత్కంఠ పాఠకుల కీ నవల కలిగించు నసుట నిక్కము. పై కెట్లున్నను సాధారణముగ నెంత భార్యాభర్తలుగూడ దమ సౌఖ్యమునుగూర్చి మనసులోనిమాట పొక్కనీయరు. వారి

1. క్రీ. శ. 1949 కిఁ బూర్వము.

మనోగత మెఱుఁగుట దుస్సాధముగదా! యనినచో నీ నవల దినచర్యారూపము కలది. ఇవి శాంతయు శాస్త్రియు నెవరికివారు ప్రతిదినమును వ్రాసి పదిలపఱచుకొను దినచర్యలు. ఇందలి వ్రాతకోతలు కడు రహస్యము లైనవి. ఎవ్వరికిని దెలియునవికావనెడి వారిభావ మొకటిమనల నావరించును. ఈ రహస్యతత్త్వమే కొంత యథార్థత్వభ్రాంతి నందలివిషయములకుఁ గల్పించి, యీ రచనకు నవలాత్వమును సంపాదించిపెట్టు చున్నది. ఈ దినచర్యలు చదివిన మనకేమైన నా రచయిత్రీరచయితల స్వభావశీలములు, నాఁటి సాంఘికాచారసంపత్తియుఁ దెలియునేమో యని పరిశీలించినచో జాల విషయములు తెలియఁగలవు.

నవల వినోదమునకేగాని విజ్ఞానమునకుఁగా దని 'మామ్' పండితుని వాదము. ఆయన నిర్వచనమే యంతిమనిర్వచనమైనచో మన నవల 'అతడు-ఆమె' చాల మంచి నవల యగును. విజ్ఞానము గలిగించినను నది యేమి విజ్ఞానము? పాశ్చాత్యుల సంస్కారమే యం దెక్కువ 1 యనినచోమాత్ర మది మనజాతి యందుకొనవలసిన యాదర్శమని రచయిత వాంఛితము కాబోలుమఱి యనలేము. ఇందు వర్ణింపఁబడిన విషయములు సగమునకుసగము విదేశములకు సంబంధించినవి. సాధారణపాఠకుల కందుబాటులో నుండునవి కావు 2. కాని వాని నవగాహనచేసికొన యత్నించినవారికిఁ గొంత విజ్ఞానముకూడ నలవడకపోదు 3.

ఈ నవలలో నాయికానాయకుల మధురసాంసారికజీవితము చిత్రితము. ఎందఱో పాత్రలు వారికి నిత్యజీవితములో దారసిల్లు చుందురు. ఈ వచ్చిపోవు పాత్ర లందఱివలనను బ్రధానభూతమైన మన నాయికానాయకుల జీవితము పుష్టినొందుచుండును. తన్మూలమునఁ జదువరులకు శాంతాశాస్త్రుల శృంగారభూయిష్ఠమైన నిత్యయౌవనజీవితవసం

1. 'No one, in his senses, reads a novel for instruction or edification. If he wants instruction or edification, he is a fool. if he does not go to the books, written to instruct or edlfy. 'The world's Ten greatest Novels' P. 17., - 13-16. (July 1956)

1. 'అతడు_ఆమె' పుట 126 (1950).

2. "అక్కడ చూపిస్తాను శాంతానికి పారిశ్రామికనాగరికతయొక్క మహిమ, సంపదాన్ను! లండనులోకూడ కొన్ని స్థలాలు చూపించకూడదు శాంతానికి. ఈ స్టెండు— — డాకిల్యాండు—పోప్లరు—క్యానను స్ట్రీటు—
ఆ దుర్గంధం—కుళ్లు—దరిద్రం- చండాలం - అధోగతీ – చూస్తే ఎవరికైనా నిరుత్సాహమే వస్తుంది." (Id- P. 237- Lines 28-31) (1950)

3. స్త్రీకి ఆర్థికస్వతంత్రం అంటూ స్త్రీలని మత్యపరచి- మగవాడిని ఆడదాన్నికూడా మిల్లులో బానిసలుగా చేసేశారు- ఇంగ్లండులో పెట్టుబడిదార్లు. సరి, రష్యాలో చెప్పనే అక్కరలేదు. ఆడది ఉమ్మడిఆస్తి అన్నారు." (Id. P. 185 lines 12-14) (1950).

తోద్యానమువనే నివాసమేర్పడుచున్నది. తనకుఁ జిఱుకోపమువచ్చి పుట్టింటికిఁగాని గ్రామాంతరము గాని పోయినచో శాంతకు శాస్త్రి లేనిజీవితమున శాంతి యగోచరము1.

ఆతఁ డామెయందలి ప్రేమచేత దైవము తనకోసమే యీామెను సృజించెననియు నామె పుట్టినదాదిగఁ (బెండ్లి కాకమునుపుగూడ) దనయా స్త్రీయే యనియు భావించెడువాఁడు2. ఆమె తన వివాహమునకుఁ బూర్వమునందలి యనుభవములను జెప్పునప్పుఁ డాతఁడుపొందిన యసూయయు శిరోమణిగారిపై కోపముసుగూడ నాతని ప్రేమకు నిదర్శనములు. చిన్ననాఁటి తన యనుభవములు చెప్పుచున్నంతసేపు నామె తా నేల యందులకుఁ బ్రారంభించితినా యని భయపడుచునే యున్నది. అతఁడు మాత్ర ముత్సాహముతోనే వినును. తమ సంసారమువంటి సంసారములో వివాహమునకుఁ బూర్వముజరిగిన జీవితసంఘటనము లొకరితో నొకరు చెప్పుకొనుట మంచిదని యాదంపతు లనుకొనిరి. అది కథాపీఠముగా నవలకుఁ దోడ్పడుట శిల్పప్రయోజనము. అదియునుగాక, కళాశాలావిద్యార్థినుల యా వయస్సులో సత్యకాలఁపు టుత్సాహము, తెలిసియుఁ దెలియని యుల్లాసము, మాయమర్మము లెఱుఁగని సరసము, సంతోషముగ సింగారించుకొనుటయుఁ దప్ప తమ దేహములనుగూర్చిగాని, మోహములనుగూర్చిగాని వారి కేమియుఁ దెలియదని యొక మన స్తత్త్వనిదానము నట్టి వివరణములలో రచయిత వెల్లడించినాఁడు 3.

క్రొ త్తగ సహావిద్యావిధానము ప్రవేశపెట్టఁబడిన కళాశాలలో శాంత యుద్యోగముచేయఁగోరుట శాస్త్రి కనిష్టము. విద్యార్థుల కన్నులు నుపన్యాసకుల చూపులు నామెపై నిలుచుట యనఁగా దన కేమో యఘాయిత్యముగ నుండునని యాతఁడు

1. “ — - అర్బుద అవ్యయ అచింత్య అమేయ పరార్థాల పూర్వము - పృథ్వి ఒకదేశకాల అవిరతిక నిరంతరం-ఆపస్సాక అవ్యక్త శక్తితాండవం.తేజస్సాక మహోగ్రతాపశాంతి. వాయువాక విశ్వకిరణతరంగం.ఆకాశం వకచతుర్థావిస్తృ(స్తృ)తప్రదేశం. గగనపథాన్న గ్రహగోళాల చెండ్లాట. నక్షత్రకోటి సూర్యకోటిప్రచండవేగభ్రమణం - ధూమకేతుబృహత్తారలసంఘాతనిర్ధూమధామం —— - ఒకరి నొకరు వేట,- సంఘాతం-సంహారం- సమరంణం- వినాశం. ఇదే జీవశక్తిలీల- ప్రాణశక్తిక్రీడ- చైతన్యశక్తికేళి - పరిణామశక్తి పురోగమనం - - (‘అతడు- ఆమె’- పుట 227-228). (1950). 2 ‘అతడు-ఆమె’ పుట 15- పంక్తులు 19-22) (1950).

3. నా పెదమల (వుల) మీద ఎవరో నన్ను ముద్దుపెట్టుకున్నట్టు గ్రహించాను. ఒళ్ళు ముచ్చెమటలు కమ్మేశాయి. సిగ్గు, కోపం పక్క సారిగా వచ్చేశాయి. దానికితోడు ఎక్కడలేని భయంవేసింది. దీపాలు వెలిగాయి ‘బాలూ’అని తెలుసుకున్నా”- (అతడు- ఆమె-పు 13- పంక్తులు 11-13. (1950).

వాదించెను. " నేనంతటి యప్సరసని గానోయ్, నాయనా ! 1 "అని భార్య మొఱ పెట్టుకొన్నను 'నీవు పసిడిబొమ్మ'వని భర్త వర్ణించును.ఆమె నవ్వుకొని 'ప్రాణనాథా! నీ ఆజ్ఞనే శిరసావహించెద! 'నన్నది. ఇట్లు సరసముగ నేకవచనప్రయోగము చేయుచునే యీామె శాస్త్రిని దైవముగ భావించి పాదములు కన్నుల నద్దుకొనుచుండును గూడ 2. మొత్తముమీఁదఁ బ్రాచ్యపాశ్చాత్యసంస్కారముల విచిత్రసమ్మేళన మీ భార్యాభర్తల శృంగారజీవితము; కేవలము భారతీయసంస్కారవాసనయేగల మనకు సులభముగ గ్రాహ్యము కాదు.

అట్లే తెలిసినవారికిఁదప్ప సాధారణపాఠకులకు వినోదముతోఁబాటు విజ్ఞానమును గలుగుట కష్టము. చాలవఱ కిందు వైద్యన్యాయవాదివృత్తుల బ్రతుకులు బైటఁబడినవి. స్వపత్నీ పరస్నేహాసహిష్ణుతగల భర్తృగాఢానురాగమున కీ నవల మణిదర్పణము మానశృంగార మిందు నాయకపరముగఁ జూపఁబడినది. ఏలనఁ, బురాణమహాపతివ్రతలవలె మన నాయిక తన పతిని గాఢముగఁ గామించిన కాంతల కథలు విని వారి నీతఁడు మన్నించియున్నచో బాగుండెడి దనుకొనుచుండఁగా, నాతఁడామెను గామించినవారిపైఁ జిట్టుబుట్టు మనుచుండును 3. బ్రహ్మచారుల వసతిగృహములు 4, నూతనవైవాహితులు నిర్మించుకొను గాలిమేడలు 5, భార్యల యడుగులకు మడుగులొత్తి యేలుకొను ననుకూలురగు భర్తలు 6, స్త్రీల ప్రసవోద్భవవేదన 7, మాతృత్వము8, న్యాయశాస్త్రములోని లోపములు, న్యాయవాదివృత్తియందలి సాధకబాధకములు 9, ఆదర్శపత్నీత్వ మాతృత్వములు 10, స్తుతిసులభమగు స్త్రీస్వభావము 11, పరిహాసరసికత 12, యాత్మగౌరవహాని కలిగినచో, నా జాతిదౌర్భాగ్యమునకు స్త్రీ వాపోవుట 13 న్యాయవాదివృత్తిని దూయబట్టుట, శీలములేనిసంఘమును జలకడిగి వేయుటయుఁ 14 బరిపూర్ణమగు నింద్రియనిగ్రహము సాధ్యమా ? యని [ జాతి యుగమునాఁటిదైనను] మానవస్వభావమునకు సహజమైనదియే ధర్మమని నిరూపింపఁ

1. 'అతడు-ఆమె' P 39. line 31 (1950)
2. 'అని పాడుతూ నాపాదాలని తన కళ్ళకద్దుకుంది: రాత్రి చాలసేపువరకూ కబుర్లు చెప్పుకున్నాం'' "అతడు_ఆమె" పు 55 పం 27-28. (1950)
3. 'ఆనాడు శాస్త్రి హెస్పికోర్కి తీర్పువుంచేనే నాకెంతో సంతోషం అతదేమి చేశాడో నాకు తెలియదు. నేనతన్ని ఎన్నడూ అడగను. అతను ఏమి చేసినప్పటికికూడా, మన స్ఫూర్తిగాను, సహజంగాను, స్వభావయుతంగాను, ప్రవర్తిస్తే నాకదే సంతోషం. ధైర్యవంతులు క్షణమాత్రం ధర్మంవీడినా తప్పులేదు. పిరికిపందలు మాత్రం ధర్మాన్ని ఎన్నటికీ పాటించలేరు ... ... (Id.P. 126. Lines 18- 22 )
4. Id P. 54 lines 29-32 5. Id P. 58, lines 11-26.
6. అతడు-ఆమె పుట 61- పంక్తులు 20_21 : 7. Id. P. 67 L. 11-17: 8. Id P. 68 L. 5-7: 9. Id. P. 73, L. 22-31; 10. Id. P. 75; 11. Id. P. 76, L. 1-4; 12. Id. P. 88, L. 8; 13. Id. P. 113, L. 1-2; 14. Id. P. 114, L, 1-22;

జూచుటయు 1, వ్యంగ్యశృంగారము 2 సాంఘికదురాచారముల యవహేళన 3, దేశభక్తియనెడి యావేశము 4, స్త్రీల పరిసరాలనుకూలప్రవర్తనము ,5 మున్నగునవి యీ నవలలో జక్కగ వర్ణింప బడినవి.

స్వతంత్రదేశములో రాజకీయభేదములు దాంపత్యధర్మప్రతిబింబములు గావనియు 6, భార్యాభర్తలలో సహజముగ సామరస్యమని యున్నచో, నొక రొకరిని దనవైపున కా కర్షించుకొనవచ్చుననియు, నీ నవలాకర్త చెప్పకచెప్పు సారాంశము 7. పాశ్చాత్యభారతీయసంస్కృతుల సాంకర్యదృష్టియందు వివాహనిర్వహణవిధానాదర్శ మీ నవలలో జూపఁబడెను8.పరదేశములలోని స్వాతంత్ర్యమును9 నాగరకతను10 గూర్చి విజ్ఞానము గలిగించు ఘట్టములు నిం దున్నవి.

ఇది మొత్తముమీఁద నవలయగునో కాదోకాని పఠనార్హతగల గ్రంథము. ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞానములు రెండునుగల యుత్సాహవంతులు, ధనవంతులు, విద్యావంతులు, నదృష్టవంతులునగు నుత్తమదంపతుల స్వాప్నికసుందరదృశ్యము లిందుఁ జిత్రింపఁబడినవి. ఈ దృశ్యములు సత్యము లన్నభ్రాంతిని గలిగించి, కేవల మాశాబోధనులు, భావతూలికలు ననిపింపనంతటివఅకు, దీనినిమించిన నవలయే యుండదు.

## కనకాభిషేకము[11]

ఈ నవలాకర్త డాక్టరు కాకర్ల వేంకట రామనరసింహము [గారు]; ఆంధ్ర విశ్వకలాపరిషత్కళాశాలయం దాంధ్రశాఖలో ప్రధానాధ్యాపకులు. ఆ యనుభవముతో సంభావించిన రసభావసంస్కృతులను రచనాసమయమున సమున్మిషింపఁజేసికొని సర్వాదరిచితములైన పదముల నిబంధనముతో నీ నవలను విశిష్టపథమునఁ గూర్చిరి. పాఠకులు దీనివలన నవదృష్టిని నందుకొనుట వీరి యాశయము.

ఆంధ్రరాష్ట్రోద్యమ మధికమైనకొలఁదియు నాంధ్రదేశీయమైన కథావస్తువును నవలారచయితలు నిరూపింప నుద్యమించిరి. అందును బ్రాచీనమై ప్రశంసనీయమైన చరిత్రాంశమును గొందఱు రచయితలు మన పూర్వకవులజీవితగాథలనుండి స్వీకరించిరి.

---

1. Id. P· 126; 2. Id.P. 129, L. 24-26; 3. Id. P. 130; 4. Id. P. 140; 5. Id. P. 156;
6. 'అతడు-ఆమె', పుట 54.పంక్తులు.29-32; 7. Id. P. 58, lines 11-26; 8. Id. P. 160; 9. Id. P. 185, lines 12-14; 10. Id P 237, lines 29-31.
11. ప్రథమావృత్తి క్రీ. శ 1950 వీరిది 'రఘునాథరాయలు' ప్రథమావృత్తి. క్రీ. శ 1951; శ్రీ. కె. యస్ వి. గోపాలమూర్తిగారి 'రఘునాథవిలాస'మను నవల వేఱు; అది యిటీవలిది. అల్లే 'నోరి'వారి 'కవిసార్వభౌముఁడు' విప్పుడిప్పుడు పూర్తియైన నవల.

అట్లుఁజేసినవారిలో 'చిలకమర్తి'వారు ప్రథములు. వారి నవలపేరు 'శాపము'. అది భీమనకవి జీవితవిషయములకు సంబంధించినది. పిమ్మటఁ జెప్పఁదగిన ప్రయత్నము శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి 'నారాయణభట్టు', 'రుద్రమదేవి', మల్లారెడ్డి' నవలలలో నగపడును. నన్నయ్యకాలమునాఁటి నవల నారాయణభట్టు 1; తిక్కనకాలమునాఁటిది 'రుద్రమదేవి' 2. మహాకవులనిన మన దేశమున మొదటినుండియు నాదరము మెండు. శ్రీనాథుఁ డొక మహాకవి. సారస్వతేయులైన శ్రీనాథాదుల జీవితములఁ జిత్రించి, నవలలుగా లోకమున కందించుట యొక నవ్యపథ మన్నమాట. తన్మార్గమునఁ బోవు నది 'కనకాభిషేకము'.

శ్రీనాథుని విస్పష్టమైన జీవితము నీ నవలారచయిత చరిత్రాధారముతో గవేషణ మొనర్చి యిందు నిరూపించుటకుఁ బ్రయత్నించెను 3. కవితల్లజులు కవిత లల్లి వారిని వీరిని రంజింపఁ జేయువారుమాత్రమే కారు ; ప్రజాహితవిధానమైన, సమాజ సంఘటనారూపమగు రాజకీయకార్యములయందుఁ బ్రవేశించి చాతుర్యమును బ్రదర్శించువారు నగుదురు; శ్రీనాథుఁ డట్లుఁజేసిన మహనీయకవి. ఈ నవల యిట్టి యంశములను బ్రతిపాదించుట కుపక్రాంతమైనది. రచయితలు పాఠకులయం దిట్టి దృష్టిపరిణామము కలుగఁజేయుట యత్యంతము సముచితము.

కవులు రాష్ట్రీయహితసాధకు లగుట పాశ్చాత్యులయందే కాదు; భారతీయులయందు నెప్పుడో ప్రసిద్ధమని యీ నవలచెప్పును. కవుల విషయమై యిట్టి చారిత్రక సంఘటనముల సేకరణ మత్యంత ముపకారి కాఁగలదు. కాకతిసామ్రాజ్యము విచ్ఛిన్నమైన యనంతరకాలమున దక్షిణదేశమందు రాజులు, సామంతులు నందఱు ను భిన్నభిన్నమతులైనప్పుడు శ్రీనాథకవిసార్వభౌముఁ డా మూలనుండి యీ మూలవఱకు సంచారముసాగించి, తెలుఁగుదేశమున సారస్వతమైన యైకమత్యము నంపాదించినాఁడు. అదియే పాలకుల నందఱ నుద్బోధించెను. ప్రౌఢదేవరాయల సమక్షమున శ్రీనాథుని ప్రజ్ఞావిభవములఁ జాటుట కీ కనకాభిషేకము సమర్థ మగుచున్నది.

శ్రీనాథుని విషయమున లోకమునందు వ్యాపించిన కథ లనేకములు గలవు. వాని నీ నవలాకర్త యిం దాదరింపకపోవుట స్పష్టమగును. మహాకవుల విషయమున బయలుదేరు దుర్వాదములకుఁ బ్రామాణ్య మీయ నావశ్యకములేదని యీ కృతికర్త

---

1. క్రీ.శ 1949. 2. క్రీ. శ 1950; 'ఢిల్లీసాహిత్యఅకాడమీ, వారి భాషాంతరీకరణ నిర్ణయము 1956. 3 ఈ నవలాకర్తకు శ్రీనాథుఁ డభిమానకవి యనుటకుఁ బ్రబలాధారములు గలవు.

భావము. చారిత్రక ప్రసిద్ధియున్న విషయములనే పొదివి యీ రచయిత 'కనకాభి షేకము'ను నిరూపించెను. ఇందు వచ్చు ముఖ్యపాత్రలను వారివారి విశేషములను సంగ్రహముగ నిట్లు గుఱుతించుట యుక్తము.

శ్రీనాథడిండిములు, ప్రౌఢదేవప్రతాపులు, దుగ్గనభీమనలు, మహామంత్రీమాచలదేవులు, చంచలాసర్వమంగళలు ననువారి స్వభావశీలములలో గొంతకొంత సంవాద విసంవాదము లున్నవి. వాని సూక్ష్మముగా భావింపవలెను. వీరివీరి చరిత్రలను జాగ్రత్తా సమీక్ష చేసినచో బాత్రల స్వభావతారతమ్యపరిశీలన మగుచున్నది.

ఇందు వివిధములైన దాంపత్యచిత్రణములు, ప్రేమచిత్రణములు నున్నవి. వీనిలో నిపుణముగ సమీక్షింపఁదగినవి శ్రీనాథదంపతులయు డిండిమదంపతులయుఁ జిత్రణములు. అట్లే ప్రౌఢదేవ పట్టమహిషులయుఁ బ్రతాప మాచలలయు, వీరన చంచలలయుఁ బ్రీతియోగములంతగా బ్రాధాన్యము లేకపోయినను సర్వమంగళాజీవితము సర్వమంగళాత్మకము.

ఏ నవలయందుఁగాని విషయ మొక్కటి సర్వప్రధానముగ నుండును. ఒక వ్యక్తియే ముఖ్యుఁడగును; 'కనకాభిషేకమ'ని యీ నవలకుఁ బేరు. ఈ వైభవము నొందినది శ్రీనాథుఁడు. దానికిఁ గారకుఁడగు ప్రభువు ప్రౌఢదేవరాయులు. కథాగమనమును బరిశీలించినచో, ప్రజాపాలకుఁడైన ప్రౌఢదేవుని రాజ్యశ్రీస్థైర్యసంపాదనము ముఖ్యముగఁ గన్పట్టును. ప్రజాసువ్యవస్థ యీ నవలయందుఁ దేలిన ముఖ్యాంశము. దానిని సంపాదించుటయు స్థిరీకరించుటయు నిందలి ముఖ్యకర్తవ్యములు. శ్రీనాథునకుఁ గనకాభిషేక మొనరించుటమూలమున నది సుసాధ్యమని మహాప్రభువు తలఁచినాఁడు. మహామంత్రియు నట్లే తలఁచెను. కనకాభిషేకానంతరమునుండి శ్రీనాథుఁడీ సువ్యవస్థకు సుముఖుఁడు. కావుననే యీ నవల 'కనకాభిషేక'మైనది.

ఇది శ్రీనాథునకు జరిగిన కనకాభిషేకమే యైనను బరిణామమునఁ బ్రజలకే కనకాభిషేకము. ఇట్లూహించినప్పుడే యీ నవలానామౌచిత్యము సుసంగతముగ నుండును. ఇందు కనకాభిషేకము కేంద్రస్థితి వహించిన విషయము కాదు; కేవల మాది విషయము. కనకాభిషేక మాదిగ బ్రజాసుస్థితిసంపాదనకార్యమునందే యందఱు సంలగ్ను లగుదురు. వ్యతిరేకించిన స్వార్థపరులు దురుద్యమమును భంగపఱచినఁగాని సువ్యవస్థ సంఘటము కాదు. అందువలననే ప్రతాపాదుల కార్యభంగకరణము ప్రసక్తమైనది. కాఁగా బ్రతాపాదుల కార్యసౌకర్యము సంపాదించుటకు శ్రీనాథుఁడు సపరివారముగఁ బ్రయత్నించుట యిందు విశదమయ్యెను. ప్రసన్నగంభీరుఁడైన కవి ప్రశాంత చిత్తముతో గార్యసాధకుఁ డగుటయు నీ నవలయందు సువ్యక్తము.

నవలకాలమునాఁటి యాచారములు :—

రచయిత యా నాఁటి యాచారములుగ నిర్దేశించిన వాని నిట్లుఁ జూపవచ్చును. ఈ యంశము లా యా పాత్రలలో గోచరించు చున్నవి. కవులుగా మహాకవులుగాఁ, బ్రఖ్యాతిఁబొందినవారును బొందువారును నానాశాస్త్రములయం దారితేరియుందురు. దైవచింతనము, యోగవిద్య, దానధర్మములు, దయాదాక్షిణ్యములు, లౌకికాలౌకికవిజ్ఞానముగూడ వారికుండెడివి. శ్రీనాథడిండిము లిట్టివారు. ఇంత కవితాసంస్కారములుగల మాచల గాని వల్లభరాయలుగాని స్వభావకోమలతయు దాక్షిణ్యసంపదయుఁ గలవారే. శ్రీనాథానుయాయులు, డిండిమానుయాయులు నందఱును రమ్యప్రకృతులు. కవులకు, నుదారసంస్కృతులకును రాజాస్థానములయం దర్హమైనప్రవేశమున్నది; లోకమున నింత గౌరవమని యున్నది; సముచితమైన సమ్మానము లున్నవి. రాజు లనేకభార్యల స్వీకరించెడి వారు. తద్వర్గమువారు వేశ్యారాగమును జూపుటయుఁగలదు విలాస వినోదములు వారల కధికములు. అందులకై వా రకార్యములఁగూడఁ జేసెడివారు. ప్రతాపరాయ వీరనదండనాథు లిందులకు దృష్టాంతములు.

రాణివాసస్త్రీలకు ధనుర్విద్యావైశారద్య ముండెడిది. మోహనాంగి నృత్యాదులతోబాటు శస్త్రాస్త్రసామర్థ్యమును సంపాదించెను. వారయౌవతము దుశ్శీలాగారముగాక, నానావిజ్ఞానసంపాదనచణము. లోకమున వేశ్యలకుఁ బలుకుఁబడి యున్నది; తగిన గౌరవమును గలదు. నానాకళావిజ్ఞానముతో లోకమును వారు రంజింపఁజేయుదురు. ప్రజోపయోగికార్యములయందును బ్రవర్తింతురు. కొందఱు దండనాథులుస్వార్థపరులై యన్యాయములుచేయుట కలదు. వీరన రాజద్రోహముఁ దలపెట్టెను; రాజనాథుని రెచ్చఁగొట్టెను; బ్రాహ్మణకుమారికను జంచల నన్యాయముచేసెను. ప్రతాపుఁడు సర్వమంగళను జెఱపట్టఁజూచినాఁడు. ఈ విధానమే వారివారి వినిపాతమునకు దారితీసినది. మద్యపానము కొందఱకొందఱ కుండెను. అది వారి యనర్థమునకే హేతువైనది. దేవాలయములు, వాని సంస్కృతిశిల్పములు, నభినందనీయములుగ నున్నట్లు మన నవలనుబట్టి నిరూపనీయము.

ప్రధాన పురుష పాత్ర : శ్రీనాథుఁడు :-

ఇతఁడు కమలనాభుని పౌత్త్రుఁడు; మారనామాత్యుని పుత్త్రుఁడు : సంపన్నుఁడు; బ్రాహ్మిదత్తవరప్రసాదుఁడు; సర్వశాస్త్రపారంగతుఁడు; జన్మతఃకవి. కొండవీటి రెడ్డిరాజుల యాస్థానిలో సర్వవిద్యాధికారి; నానాదేశసంచారముచేసి నానారాజాస్థానములయందుఁ దన కవితాప్రభలు వెదచల్లినాఁడు; ప్రౌఢదేవరాయల యాస్థానికేఁగెను; శ్రీ యరుణగిరినాథడిండిమభట్టారకులతో వాదమున విజయము పొందినాఁడు. అంతటితో డిండిముని కంచుఢక్క బ్రద్దలై పోయినది. రాయలు సంతసించి శ్రీనాథున కపూర్వసత్కార మొనర్చెను. అదియే కనకాభిషేకము.

ఇంత యశస్వియైనను శ్రీనాథునకు గర్వాహంకారములు లేవు; సంపద లిఖయములు లేవు. తనకున్న దంతయు దానధర్మములయందు వినియోగించెడి వాఁడు. దుగ్గన భీమన లీతనికి శిష్యులు. ఇందు దుగ్గన బావమఱిదియే ; భీమనకుఁ గల సంపదకెల్ల శ్రీనాథుఁడే హేతువు. మాచలదేవి వేశ్య; శ్రీనాథశిష్య. ఆ శిష్యయం దాగురువున కధిక వాత్సల్యము. శ్రీనాథునకు యోగప్రజ్ఞయున్నది. మంత్రశక్తిప్రభావము, నిగ్రహానుగ్రహసామర్థ్యము గలవాఁడు శ్రీనాథుఁడు. ఇతనికి డిండిమభట్టారకునియందపారమైన గౌరవము. తన శిష్యురాలు మాచలదేవి, రాయలయాస్థానిలో బహుకృతి బొంది సభ్యసమధికు నర్చింపవలెనన్న సూచనము రాగా, శ్రీనాథుని బూజించినది. మాచల నప్పటికి శ్రీనాథుఁ డభినందించెను.

రాయలు విద్యావాదములో శ్రీనాథునియందుఁ బక్షపాతము చూపెనని విద్యానగరలోకమువ నొక యలజడి వెలువడినది. రాయలపైఁ గొందఱు కుట్రలుగూడఁ బన్నుచుండిరి. అవి శ్రీనాథునకుఁ దెలిసినవి. రాజకీయతంత్రములో బ్రవేశింప శ్రీనాథుని బ్రోత్సహించినది యాతని రాజభక్తి. తన ప్రజ్ఞాచాతుర్యమున రాయలరాజ్యస్థైర్యము సంపాదింపవలె ననియుఁ గుచ్చితులను నిగ్రహింపవలె ననియు శ్రీనాథుని సంకల్పము.

కొండవీటినుండి తాను వచ్చి చాలఁగాలమైనను నతఁడు తన సంకల్ప మీడేరువఱకు విద్యానగరమందే యుండనిశ్చయించుకొనెను. రాజకీయములలో జిత్తము కేంద్రీకరించెను. అతనికిఁ గవితాగోష్ఠి తగ్గినది. శిష్యుల కాతఁడు పాఠములుగూడ పరిగఁజెప్పుట మానినాఁడు. దుగ్గన కది సమ్మతముగ లేదు. అయినను బావ బుజ్జగించి తన కార్యమునందు సావధానుఁడై యుండెను. డిండిము నెవరో యపహరించిరి. వారిని వెదకుటకై శ్రీనాథుఁడు దుగ్గనభీమనల నియమించెను. శ్రీనాథనియోగమున వా రరణ్యముల వెదకుచు నొక సైనికుని బంధించి తెచ్చిరి. కలబరిగెసుల్తాను ప్రతాపరాయలకు వ్రాసిన గుప్తలేఖనుగూడ వారు సంపాదించిరి. ఆ యత్నము చేయించుటకై మహామంత్రి తాను తిక్కనతో మంతనము లొనర్చుచుండెడివాఁడు. సాటికవియు మిత్త్రియును నైన వినుకొండ వల్లభరాయఁడు గూడ శ్రీనాథోద్యమమునే నిర్వహించుచుండెను; రాయలకడ కొక పత్త్రిమును బంపినాఁడు.

"డిండిమకుమారుఁడు రాజనాథుఁడు రాజవిప్లవము సాగించు చుండెను; ఆతనిని బంధింపవలెను; కలబరిగెసుల్తాను విజయనగరరాజప్రముఖులతో ద్రోహచింతనములు చేయుచున్నాఁడు; అతని విధానము పరిశీలింపవలె"నని వల్లభదేవుఁడు సూచించెను. "రాయ లప్పుడే ప్రతాపుని బంధించుట యుక్తము గానేరదు; అప్పుడు శత్రువు లందఱు నణఁగియుండి గూఢవిప్లవము చేయుదురు. నెమ్మదిగ శత్రుకార్యములు గూఢచారుల ద్వారమున గుర్తింపవలె''నని సమయమున శ్రీనాథుఁడే ప్రబోధించెను.

"క్రీడాభిరామ" గ్రంథమును శ్రీనాథుఁడు రచించెనా? వల్లభరాయఁడా? శ్రీనాథుఁడని ప్రతీతి యున్న దేఁయని రాయలును మహామంత్రియు సందేహించినపుడు తన నిశ్చయమును జెప్పక శ్రీనాథుఁడు దాఁటవేసిన చతురుఁడు. అప్పుడు తానే దానిని రచించినట్లు జెప్పినచో, వల్లభదేవునిపై రాయల కభిమానము తగ్గునేమో? ఆ పరిస్థితులలో నాతనిపై విశ్వాసము నతిశయింపఁజేయుట యుక్తము. ఈ భావముతో శ్రీనాథుఁ డావిషయము నప్పటికిఁ దప్పించెను. రాజుని కాప్తవర్గమువారే ద్రోహము తలపెట్టిరి. రాజరక్షణము కర్తవ్యము. అందులకై విశ్వాసపాత్రులైన భటులను, భీమనశక్తివర్మలను శ్రీనాథుఁడు నియమించెను. మాచలయే శక్తివర్మ. ఆమె ప్రతాపుని గూఢముగఁ బ్రేమించినది కూడ. ఆ ప్రతాపుఁడే మోసకారులలో ముఖ్యుఁడు. అతనిని బ్రేమించిన మాచల శ్రీనాథుని శిష్యురాలు. ఆమె నిటు రాయలకార్యము నకు వినియోగింపక పోయినచో, "శ్రీనాథుని శిష్యురాలు ప్రతాపసంబంధము కలది; దీనికి శ్రీనాథసమ్మతి యుండియుండును; ప్రతాపునకు శ్రీనాథునకును రాజకీయపుఁ గుట్రలో సంబంధ మున్నదేమో!"యని యనుమానించుటకు లోకమున కవకాశ మున్నది.

అంతయు నాలోచించిన శ్రీనాథుఁడు, కర్తవ్యము నిశితముగ నూహించెను. మాచల కారాగారమునుండి విడుదలపొంది వచ్చి శ్రీనాథునకుఁ దాను బ్రతాపుని బ్రేమించు చుండుటనుగూర్చి చెప్పితీరవలసి చెప్పినపుడే శ్రీనాథుఁడు గుర్తించె నన రాదు. అంతకుఁ బూర్వమే శ్రీనాథుఁ డభ్యూహించినాఁడు. మాచలముఖమున నా యంశము స్పష్టముచేయించి కార్యకారణసంబంధముగ సాధకముల నిర్ధారించి ప్రతాపుని బ్రేమించిన యామెకు దేహసుఖముకంటె ధర్మనిర్వహణమే ప్రధానమని శ్రీనాథుఁడు ప్రబోధింపఁగలిగెననుట యుచితము.

ఈ నవలయం దీ ఘట్టమే ముఖ్యమైనది. మాచల తన మాటపైనుండఁగల ధీర. రాయల రక్షణమున సమర్థ; ధర్మతత్పర. ఇఁక శ్రీనాథుని శీలసంపద సందే హించువా రుండరు; రాయల రక్షణము జరుగును; ప్రతాపుని దుశ్చింతలు సమసిపో గలవు. ఇంతటి కథాసంవిధానమును సాధింపఁగలిగినది శ్రీనాథుఁడే. మాచల శక్తి వర్మయై రాయలరక్షణమున శ్రీనాథాజ్ఞతో సావధాన యైనది. శ్రీనాథుఁడు కుట్ర లన్నిటిని గుర్తించెను. ప్రతాపరాయల నూత్నగృహప్రవేశమున విప్లవ ముదయించు నని మాచల వచనమున శ్రీనాథుఁడు గుఱుతించి సావధానుఁడైనాఁడు; ముందుగ నచటి కేఁగ లేదు; మహామంత్రితో జెప్పి వేయి యాశ్వికులను సిద్ధముచేయించెను; వల్లభరాయని రప్పించెను; ప్రతాపభవనమును ముట్టడించెను. కుట్రలో నెల్లవా రోడి పోయిరి. రాయలు సురక్షితుఁడైనాఁడు. ప్రతాపుఁడు నశించెను. పాపము మాచల మాత్రము సన్న్యాసిని యైనది. ఇంతగా నుపకరించిన మాచల యిట్లగుటకు శ్రీనా

థుఁడు తానే హేతువవని కోమల హృదయమునఁ గుమిలిపోయెను. శ్రీనాథుని కన కాభిషేకము ప్రజల కనకాభిషేకమైనది. మహాకవి సార్థకజన్ముఁడైనాఁడు.

ప్రధాన స్త్రీపాత్ర : మాచలదేవి :

ఈమె శ్రీనాథుని శిష్యురాలు; సకలకలాప్రవీణ; అగుటకు వేశ్యయైనను నియత వ్యవహారము కలది; రూపవతి; గుణవతి; సకలరాజాస్థానములయందును సంచరించి తన సంగీతనాట్యకళాప్రాభవమును విశదముచేసి భూరిసన్మానములు పొందినది; జనాదరము సంపాదించెను. శ్రీనాథుని శిష్యరూపమున వాసిఁగాంచినది. శ్రీనాథమాచలల విష యమై లోక మెన్ని విధములఁ దలపోసి గుజగుజలువోయినను మాచల శ్రీనాథవిష యమై పవిత్రతతోగూడిన గురుభావము గలది. ఆమె శ్రీనాథుఁ డున్న విద్యానగరము నకు వచ్చినదనఁగానే శ్రీనాథభార్య లోలోన నేమేమో యనుకొనెను. శ్రీనాథుఁ డా ఘట్టమునఁ దన మనఃప్రవృత్తిపవిత్రతను దుగ్గనభీమనలతో స్పష్టీకరించినాఁడు. మాచల యీ నవలయందు సర్వప్రాధాన్యముగల కార్యభారమును నిర్వహించినది.

శ్రీనాథుఁడు కనకాభిషేకగౌరవము పొందిన యా రాయలయాస్థానిలోనే మాచలకూడఁ దన విద్యాప్రాభవములు వెలయింపఁజేసి మెప్పుపొందెను. రాయ లపార ముగ సంతసించి సన్మానము చేసినాఁడు. తాను సన్మానము పొందిన మహాసభలో మాచలకు యుక్తముగఁ దోఁచిన వ్యక్తిని గౌరవింపవలసినదని మహామంత్రి, రాయల సంకల్పమును సూచించెను. అపు డామె శ్రీనాథునకుఁ దాంబూలమిచ్చి పూజాసత్కా రము లొనర్చినది; రాయల కట్లుఁ జేయలేదు; తాను ప్రేమింపఁదలఁచిన ప్రతాపున కా యర్హసభ్యసత్కార మీయలేదు. ఆమె స్వభావములో ప్రేమప్రవృత్తికంటె ధర్మ ప్రవృత్తి ముఖ్యము. శ్రీనాథుఁడు గురువు; ధర్మమూర్తి; బ్రాహ్మణుఁడు. ఆమె గురుభక్తి కెల్ల రభినందించిరి.

ఈమె ప్రతాపుని యాస్థాని కేఁగినది; అచ్చట నర్హ సత్కారము పొందెను; ప్రతాపుని ప్రేమించినది; కాని ప్రతాపుని ప్రేమించుట యొక రాజకీయతంత్రమా? యనియు ననిపించును. ఈమె యాతనిని ప్రేమించుటలో శ్రీనాథుని ప్రేరణ మేమియు లేదు. తాను ప్రతాపుని ప్రేమించిన ట్లామె కారాగృహవిమోచనమునొంది వచ్చి సూచించువఱకు శ్రీనాథునకుఁ దెలిపినట్లులేదు. మాచల తన యంతటఁ దానే రాజకీయ తంత్రము నూహించి ప్రతాపుని ప్రేమించెనని మనము భావించుట కవకాశము లున్నవి. మాచల మందారతో మాటలాడునపు డీ యంశ మెకింత ద్యోతిత మయినది. ప్రతా పుఁడు మాచలదేపి యంతటివనిత ప్రేమ కర్హుఁడు కాఁడు. అతఁడు దుష్టుఁడని యామె యెఱుఁగును; అయినను ప్రేమించినది. ఇది యంతయునిగూఢము. మాచల, తాను బట్ట ణము ప్రవేశించుచునే పరిస్థితులఁజూచి యవగాహనము జేసికొనెను; కనకాభిషేక మాదిగ రాజ్యమునఁ జెలరేఁగిన రాజద్రోహకరచర్యలను భావించినది; ఈ విప్లవోద్యమములో

దన గురుదేవుఁ డెదిరిపక్షమువాఁ డైనాఁడు. ఇటు గురుభక్తి; రాజభక్తి; అటు ప్రేమ; ఈ భావములనడుమఁ ద్రొక్కఁబడినది. గురువునకుఁ బ్రభువునకుఁ దాను జేయవలసిన సాహాయ్యమంతయుఁ జేసికాని యామె తృప్తి వహింపఁజాలదు.

శ్రీనాథుని శిష్యురాలైన యామె, తన బుద్ధివిశేషము నుపయోగించి కుత్సితుల కుట్రలను గుర్తింపవలెను. అందులకై యామె రాజకీయరహస్యములలో జిక్కుకొనక తీరదు. ప్రతాపుఁడు రాయలపై ద్రోహ మూహించుచున్నాఁడు. అతని నా దుర్వృత్తి నుండి మఱలింపవలెను. రాజద్రోహము నింద్యము; సహింపరానిది. ప్రతాపుఁడు ప్రాసాదనిర్మాణము చేయించుచుండెను. గృహప్రవేశమునాఁడు రాయలనుగూడ నాహ్వానింపఁగలఁడు. ఇంతగా బర్యాలోచనముచేసి మాచల ప్రతాపుని బ్రేమించినది. అతఁడు ప్రేమించుచుండెనో లేదో తనకుఁదెలియదు. మాచల తానితరుల ప్రేమ తెలియక ప్రేమించునంతటి దుర్బల కాదు. అయ్యును బ్రేమించును. ఆ ప్రేమ యొక రాజకీయఁపుఁ బెత్తు. ప్రేమ విషము నమృతముచేయును; దుర్గమమును సుగమముచేయును; కంటకితమార్గమును ఘంటాపథముచేయును. మాచల ప్రేమించినది. ప్రతాపుని కుట్రతో దనకేమిపని యని భావింపలేదు. ఆమె తత్త్వము నిగూఢము; నిత్యసన్నిహిత యైన మంథారకైన నది బాగుగఁదెలియదు. ఆమె ప్రేమకై ధర్మమును బలిచేయునా? తుచ్ఛవాంఛాపరిపూర్తికై ప్రజలను దండ్రివలెఁ గాపాడు రాయలకుఁ గలుగు నాపదను నివారింపక యుండఁజాలునా? తన ప్రేమ వ్యర్థమైనను దానే నశించినను బ్రేమకై ధర్మ ధ్వంసము చేయఁజాలదు.

అటు ప్రతాపుని బ్రేమించుటయు నిటు రాయలను రక్షించుటయు రెండును విరుద్ధములు గావా? కాని మాచల సంబాళించుకొనఁగలదేమో! అతనిని బ్రేమించి, యాతని రహస్యములను గుర్తించి రాయలకుఁ దెలియునట్లుఁ జేయుచున్నచో, దన ప్రేమ కెట్టి యంతరాయమును రాకపోవచ్చును. దురదృష్టవశమునఁ బ్రతాపుని జాగరూకతచే నది కుదురలేదు. అతఁడు మాచల సమీపమున శయనించి నిద్రించెను. మాచల మేలుకొని యతని గుప్తలేఖ నింకొకచో నుంచినది. ప్రతాపుఁడు మేల్కొని మాచల నిద్రింపకుండుటను గమనించినాఁడు. ఏదో యనుమానము; లేఖలను సవరించుకొనెను. ఆ యనుమానమే మాచలా మందారలను గారాకూపమునఁ బడఁద్రోసినది.

తిరిగి తననుండి లేఖ నెవ రపహరించి యట్లుజేసిరోకూడ మాచలకుఁ దెలియ లేదు. చెలిసాల యామెకుఁ దప్పదయ్యెను. అందుచే దా నాకళించుకొనిన కుత్సితుల రహస్యములను శ్రీనాథాదులకు సూచింప వలనుపడలేదు. వీరి యునికి శ్రీనాథాదుల కును దెలిసినది కాదు. మాచల తాను వేశ్యయగుటచే నవ్వుఁబువ్వులఁజల్లి, చూపుఁ దూపులనేసి సోములు వీరనలనుండి కొంత విషయమును సేకరించెను. ప్రతాపుఁడే తనను బంధించెనని తెలిసినది. కాని యేల బంధించెనో తెలియఁజాలదయ్యెను. వివ్రుటుపాయ మేమి? విముక్తి పొందవలెను వీరనను వశపఱచుకొన్నచో గొంత యనుకూలము.

సోములుతో జెప్పినది. వాఁడు వీరనకుఁబలికెను. వీరనమనసు మనసులోలేదు. కారాగారమున కేఁగి మాచల మాటలవాగురములో బడినాఁడు. వారి కచట స్వేచ్ఛకలిపించి తాను గొన్నినాళ్ళకు విడిపింతు ననెను. మాచల కది యొక మంచి యుపాయము. ఆ ప్రక్కగదియందే డిండిమభట్టారకుని ప్రతాపుఁ డవహేళనము చేయుటయు డిండిముఁడు శపించుటయు విన్నది. సర్వమంగళను ప్రతాపుఁడు బలాత్కరించునేమో యనియు మాచల భావింపవలసివచ్చెను.

ఒకనాఁటిరాత్రి మాచల సర్వమంగళను జూచి యామెకు డిండిమదర్శనము గలుగఁజేసినది. అది వారల కమితానంద మొసఁగెను. తగిన సమయమున మాచల ప్రతాపుని శపింపవలదని కోరినది. కాని యంతకుఁ బూర్వమే డిండిముఁడు శపించినాఁడు. అనుగ్రహము కోరినది. సర్వమంగళకూడ మాచలపక్షమునఁ దండ్రితో బలికినది. ఒకవిధముగ నొక హంసపాదుతో నాతఁ డనుగ్రహము పలికినాఁడు.కాని, దానిని మాచల వినియోగించుకొను దృష్టితో నున్నట్లుఁదోఁచదు. శాపానుగ్రహము చూపఁగలవాఁడు శ్రీనాథుఁ డున్నాఁడు. శ్రీనాథుని దా నందులకై కోరదు. 'ఆదివారము నాఁడు కదలకున్నచో' నను నంశము నేని మాచల వినియోగించు కొనలేదు. తదవకాశముకూడ లేకపోయెను. ఆమె కట్టి దృష్టియు లేదా? ఉన్నచో నెట్లేని ప్రతాపునకు సూచించి యాఁపలేకపోవునా? యనియు ననిపించును. మాచలకుఁ బ్రేమకంటె ధర్మము ముఖ్యము. అగుచో డిండిము నిట్లుఁగోరిన దేమి?

ఇది యంతయు నొక రాజ్యతంత్రము. మాచల యా విషయమునఁ బ్రవీణ. తనకుఁ బ్రతాపునిపై వల పున్నదని డిండిమునకుఁ దెలియవలెను. ఇది కపటనాటకముగఁ గనిపించినమాత్రమేమి? ప్రతాపుని యాస్థానిలో గౌరవాదరము లందుకొను డిండిమునకుఁ దనవిషయమై యిట్టి భావముగలుగుట యావశ్యకము. మాచల కారాగార మంతయుఁ దిరుగఁగలదు. మద్యఁపుఁగైపులో రహస్యము వెలువరించిన వారి విషయము గ్రహించినది. మాచల కారాగారమునుండి చాతుర్యముతో సంపాదింపవలసిన యంశములు సంపాదించినది. అంతమాత్రమున లాభమేమి? వానిని గార్యాచరణమునఁ బెట్టవలెను. కారావాసమున నున్నచో నవి సాధ్యములు గావు. కారనుండి వెలువడుటకుఁ దన చాతుర్య ముపయోగించి యుండును. వీరన యిదివఱకే విడిపించు యత్నము చేయుదు ననినాఁడు. మాచల నచటినుండి సాగనంపుటకుఁ జంచలయు యత్నము. మోహనాంగియుఁ జంచలావిముక్తి నాలోచనలోబెట్టుకొని యున్నది. ఎవరో వచ్చి కన్నులకు గుడ్డలుకట్టి తీసికొనిపోయి దేవాలయముకడ విడిచిరి. ఈ విడిపించినవా రెవరో యెవ్వరికిని బట్టలేదు. అది యంత యావశ్యకమును గాదు.

తన కార్యసాధనకు మాచలయున్న బాగుండునని శ్రీనాథుఁడు భావించు సమయమునందు మాచల వచ్చిచేరినది. మాచల కొంత చెప్పెను. చెప్పినదానికంటె నధిక

ముగ శ్రీనాథుఁడు తెలిసికొనినాఁడు. అంతయుఁ గార్యకారణసుబద్ధముగ భావించెను. అన్నియుఁ గుదిరినవి. ఇది సమయము. మాచల కార్యరంగమునఁ బ్రవేశింపవలయును. కాకున్న నిఁక నవల లేదు. అతఁడు కర్తవ్యము బోధించినాఁడు; ధర్మముఖ్యతఁ బ్రతిపాదించినాఁడు. గురుప్రబోధముచే మాచల కుద్రేకము కలిగినది; ప్రతిజ్ఞచేసినది. శ్రీనాథుఁడు 'జయ' యనినాఁడు. ఆమె మగవాఁడైనది. చంచలపే రిప్పుడు శక్తివర్మ.

శక్తివర్మ రాయల రక్షణకార్యమునందు నియుక్తుఁడయ్యెను. శక్తి రాయలకు సర్వకార్యములలోను సన్నిధియందే యుండును. సభారంగమున నంశుమంతుఁడను ధానుష్కుఁడు హస్తలాఘవము ప్రదర్శించి సంతోషాశ్చర్యములతో సభ్యు లన్యచిత్తులై యున్న సమయమున రాయలపై బాణము ప్రయోగించెను. శక్తియే యా బాణమును మధ్యమార్గమున భిన్నము చేసెను. రాయలకు రక్షణ కలిగినది.

అంశుమంతుని చేష్ట కుత్సితుల కుట్ర. అది శక్తిచే బ్రతిఘటితము. నాఁ డాదిత్యవారము. ప్రతాప నూతనభవన ప్రవేశమహోత్సవసమయమున నస్వస్థముగా నున్నందున రాయ లచటికేఁగలేదు. ప్రతాపుఁడు స్వయముగ నాహ్వానించుటకు వచ్చిరాయ లొంటరిగ నున్నాఁడని బాకుతో బొడచుట కుద్యమించెను. శక్తివర్మ లేకున్నచో రాయలు గతించెడి వాఁడు. శక్తి ప్రయోగించిన బాణము వచ్చి ప్రతాపునిహస్తమును నరకెను. ప్రతాపుఁ డిఁక లేఁడు. తన రక్షణము చేసిన యీ వ్యక్తి యెవరు? నిండు సభలో రాయలు తన్ను రెండుమారులు రక్షించిన శక్తివర్మ నభినందించి యైదగ్రహారముల బహూకరింతు ననెను;కోరుకొను మనెను.మాచల కవి సమ్మతములు గావు. ఇఁక నామె కేమి కావలయును? సన్యాసిని యైనది; దానధర్మము లొనరించినది; విరూపాక్షనాథుని సేవించినది. శ్రీనాథ డిండిమభట్టారకు లాశీర్వదించిరి. ఇట్లుఁగాక యిక నేమియైనను మాచలకు గౌరవము లేదు.

కొన్ని కువిమర్శనలు : వానికి సమాధానములు :-

చారిత్రకమైన యంశమును రచయిత సావధానముగ నన్వేషణముచేసి 'కనకాభిషేకము'ను నిర్మించెను. ఇప్పటికి రమారమి యేబది సంవత్సరములనుండి వెలువరింపఁబడుచున్న నానావిధములైన నవలల సంస్కారబలమీ రచనయందుఁ గొంతలోఁగొంతకనిపించుచున్నది. విప్లవాత్మకములు, సాంఘికములు, కళారూపములు, చారిత్రకములు, పరిశోధనాత్మకములు, రాజకీయస్వరూపములునైన నవలలఁ బఠించిన సంస్కారవిశేష మీ నవలాకర్తకుఁ గలదు. వానివాని సన్నివేశములను భావించి రచయిత యిందుఁ బాత్రపోషణము నుద్దేశించి దీనిని గొంత నవ్యముగ గ్రథించెను. స్థూలముగ నిందలి గుణము లిట్లుండగ, దోషములుగ నూహింపఁబడినవి, కొన్ని యంశములు గలవు. ఆ సంశయములను, నవలాశిల్పధర్మదృష్టితో వానికి సమాధానములను, నిచ్చుటఁగూర్చుట విధ్యుక్తము.

శ్రీనాథుఁడు డిండిముని వాదములో గెలిచెను. ఏ విషయములో వా రిరువురకు వాదము జరిగినది? తద్రూపమేమి?యని పాఠకులకుఁగలుగు ప్రశ్న యసమాధేయముగనే యుండిపోవలసివచ్చినదని కొందఱవిమర్శనము. ఆ వాదమును వివరించుటకిది నవలకాని శాస్త్రగ్రంథము కాదు; విజ్ఞానసంపాదనము నవల కవాంతర ప్రయోజనము. తద్విషయములు పాఠకు లెల్లరకుఁబఠనాకౌతూహలోద్దీపకములుగాఁ జాలవు. వానిని జెప్పినచో గొంత బాగుండవచ్చును. కాని చెప్పకపోవుట లోపము గాదు.

వాదానంతరము డిండిమ శ్రీనాథులు సామరస్యముతో రాయల యాస్థానినుండుట కవకాశమును రాయలు కల్పింపకపోయినాఁ డేమి? ఆ కల్పింపకపోవుటయే కథావస్తువు. దీని నేల వస్తువుగా స్వీకరింపవలె ననుట విమర్శన కాదు. మఱియు నట్లు గల్పించుట రాయల స్వభావమునకు విరుద్ధము. అతఁడు సచివాయత్తసిద్ధి. ఇది రాయల గుణశీలములను గ్రహింపనెంచకయే యడుగు ప్రశ్న; రచయితకుఁగల వస్తుస్వీకరణస్వాతంత్ర్యము నెఱుఁగని ప్రశ్న.

ప్రతాపుని యాస్థానమున వాదానంతరము డిండిముఁడు సంచరించినాఁడు; మాచల నచటఁ జూచెను. శ్రీనాథుఁడు ప్రతాపుని యాస్థానిలో నడుగు పెట్టనేలేదేమి? రాయల యాస్థానమున నంతగా సమ్మానితుఁడైన శ్రీనాథునకుఁ బ్రతాపుఁడింత వ్యక్తముగ ననాదరముచూపుట రాయలకు సహ్యమే యైనదా? వీరన దండనాథుఁడు రాయల యాస్థానమునఁ గనఁబడనే లేదు. రాయల పుత్త్రి లెవ్వరుగాని, యొక్కసారియైన శ్రీనాథున కభివాదమైనఁ జేయలేదా? దుగ్గన తన ఛాందసము చూపినాఁడే? రాజనాథుఁడు తన యుడుకుఁబోతుదనము వెల్లడించినాఁడు; ఇతరు లేమియుఁ జూపలేదేమి? రాజనాథుఁడు తుద కేమైనాఁడు? వినుకొండ వల్లభరాయఁడు మన కగపడనే లేడేల? సోము లేమిదండనఁ బొందినాఁడు? చంచలామోహనాంగుల గతి యేమైనది? కలబరిగె సుల్తానుఁడు చేయించిన విప్లవవిధానము లెవ్వి? అవి యెట్లు విఘాతము పొందినవి? ఇట్టివే యనేక ప్రశ్నలు.

వీనికి సరియైన సమాధానము లుండకపోవుట యొక లోపము కాదు; ఇన్ని శంకలు పొడముటయందే గుణ మున్నది. ప్రౌఢులైన పఠితల నపేక్షించు గూఢపదములుగల దీనవల. మఱియు నే గ్రంథమునందైన నున్నవిషయములకు గతి కల్పించువారేగాని, లేనివానికి సమాధానములు చెప్పువారు కారు విమర్శకులు. పల కొన్ని యంశములు నా యిష్టానుసారముగ జరుగలేదనుట పాఠకధర్మము గాదు. ఎల్లప్పుడును జీవిత మొక యుపక్రమణోపసంహారములుగల సుషమాన్వితకథ కాదు. బలాత్కారముగ నంగాంగిసాంగత్యము సాధించుట దృఢబంధ మనిపించుకొనదు. జీవితోపమము గావలె నన్నచో నవల యెప్పుడు నంత పరిష్కృతముగ నుండఁబోదు. జీవితమును శిథిలబంధములేని కావ్య మనఁగలమా? జీవితదర్పణముగదా కావ్యము? గ్రంథనిర్దేశము

పొందిన పాత్రల కుపసంహారములో నేదేని పర్యవసాన మున్నఁగాని కొండఱకు సంపూర్ణతృప్తి యుండకపోవుట, జీవితవిధానము నెఱుఁగఁగోరకపోవుట; నానావిధశిల్ప నైపుణ్యముల నెఱుఁగవలె ననినలక్ష్యము లేకపోవుట. చాలమంది జీవితమున నున్న నా రున్నట్లే యెదుగుబొదుగులేక మిగిలిపోయిన వ్యక్తు లగపడుట యసంభావ్య మనలేము. నవ్యశిల్పవిశేషములు పెక్కుపాత్రల నున్నవాని నున్నట్లే నిల్పివేయును.

**ప్రౌఢరాయలు : విశిష్ట నాయకుఁడు:—**

ఈ నవలయందు నాయకుఁడైన ప్రౌఢదేవరాయలు సర్వవిధముల నన్యాధీనుఁడై యున్నట్లుఁ గనఁబడును. అట్లు చిత్రించుటయే నవలాకర్త యుద్దేశము. అది యా పాత్రయందలి విశిష్టత. దానిని మనము ప్రశ్నింపరాదు. నవలాకారున కా స్వాతంత్ర్య మున్నది. ఇది ప్రాతిపదికగా నీ పద్ధతిపైఁ బెంపుదలఁ జూపినవారు నున్నారు. 'రాజశిల్పి' నవలలో 'కుమారగిరిప్రభు' వొక్క మాటయు మాటాడఁడు. అతఁడు కొండవీటి రాజు; మహాశిల్పి; మృదుహృదయుఁడు; అమృతస్వరూపుఁడు. అతనినిబట్టియే యా నవలకు నామసార్థక్యము. ఆతనిని గ్రుంగి కృశించిపోవు వ్యక్తిగ, నధరస్పందనము చేయని పాత్రగనేల సృజింపవలయు ననుటకూడఁ బాఠకధర్మము కాదు.

నాయకులు మూఁడువిధముల నుందురు. ఒకఁడు స్వాయత్తసిద్ధి; తన వ్యవహారముల నన్నిటిని దానే నిర్వహించుకొనును. ఇతరుల సాహాయ్య మాతని కంత దవేక్షితము కాదు. మఱియొకఁడు సచివాయత్తసిద్ధి; తన కార్యముల నన్నిటిని మంత్రి మొదలగువారే సాధింతురు; తన విధానము నంతయు వారి యధీనమునవే యుంచును. వేఱొకఁ డుభయాయత్తసిద్ధి; తన కార్యానుకూలమునకు సచివాదుల సాహాయ్యముగూడ నందుకొనును; తన నిర్ణయముల నాధారముగఁ జేసికొనును.

ఈ నవలలో రాయలు కేవలము సచివాయత్తసిద్ధిగా నున్నాఁడు. మహామంత్రి శ్రీనాథుఁడును మాచలయు సమకూర్చిన వానినే తాను స్వీకరింపవలసినవాఁడైనాఁడు. మహామంత్రియే కలబరిగె సుల్తానుపై విజయము సాధించెను. వల్లభరాయఁడు శత్రుగూఢకార్యముల నివేదించెను. శ్రీనాథుఁడు శత్రులేఖల సంపాదించెను. మాచల రాయల నంశుమంతుని బారినుండియు బ్రతాపుని బారి నుండియు రక్షించినది. రాయ లే విషయమునఁగూడఁ దానేమియుఁ జేసికొనుటకు సమర్థుఁడుగ నిరూపితుఁడు కాలేదు.

సచివాయత్తసిద్ధిగ నీతనిని జిత్రించుటవలననే రాజపక్షమువారిలో నిగూఢ కార్యాచరణపద్ధతి నవలంబింపవలసివచ్చెను. ఇది గ్రహింప నొల్లనివారి కెన్నియో శంకలు. ప్రతాపు డంతగా మహాభవనమును, గత్తులబావిని నిర్మించుచుండ రాయ లేల యుపేక్షించెను? ఆ భవననిర్మాత లెవ్వరును దన నగరమువారు కారా? కానప్పుడు క్రొత్తవారిపైఁ దానేల చారచతువు కాలేదు? రాయల చారులేమి చేసిరి? కలబరిగెవాని

పనివారే యిది యంతయుఁ జేసిరా? దీనినేల గుర్తింపలేదు. ఇట్టి ప్రశ్నల నెన్నిటినో యఃభ్యూహచేసికొని సన్నివేశసంధానము వెలితిగ నున్నదనుకొనినవారు గలరు. ఇంకను నక్కఱలేనంత ముందునకుఁబోయి రాయల కుపకరించినా రన్నమాటయేకాని మంత్రి యేని శ్రీనాథుఁడేని మాచలయునేని చేసినముఖ్యకార్యములు పొడగట్ట వనినవారును గలరు.

రాయలు, తదనుయాయులును విరూపాక్షస్వామివారి కైంకర్యములనైన నధికముగఁ జేసినట్లు గనఁబడదు. రాయల రాణివాసఁపు బ్రసక్తి నవలలో మృగ్యము. వారి మనోవేదన యయినఁ గూర్పు పొందలేదు. ప్రతినాయకపక్షమువారి పరాక్రమాదులే యిందుఁ బ్రధానము లైనవి. వారి యుద్యమవ్యాప్తియే ముఖ్యముగ వర్ణితమైనది. తత్పక్షమువారి విశేషములే యెక్కువ. వారిపై విజయము వీరు సాధించిరి. కావునఁ బరోక్షపద్ధతిని వీ రెక్కుఁడైనారు. ఆకస్మికముగ విజయము కలిగినట్లుండియు విజయసాధనోపాయములు సముచితముగఁ గూర్పుపొందనట్లుండుటయు నెల్ల రాజకీయముల గూఢతను కాపాడుట; సర్వమును బహిర్గతముచేయక సూచించుట. అది యొక శిల్పవిశేషము; ఔచితీపోషణము. పరోక్షపద్ధతియగు పాత్రపోషణము గుర్తింపఁగల ప్రౌఢులు చదువరులగుచో బ్రతినాయకపక్షపరాక్రమాతిశయముల నభివర్ణించుట, నాయకపక్ష విజయమున కుత్కర్షఁ గూర్చుటకొఱకని గ్రహింపకపోరు.

కవకాభిషేక ప్రాశస్త్యము

అగుటకు నవలయే యైనను నిది యొక కావ్యము. కావ్యము రసమయముగా నుండవలెను. ఇందు వీరరసము ముఖ్యము. వీరమున కనేకభేదములు కలవు. ఇందలిది ధర్మవీరము. రాయల రాజ్యస్థిరీకరణము ఫలము. పాలకుఁడైన రాయలును, పాల్యులైన ప్రజలును దర్పాలభాజనులు. శ్రీనాథునియం దున్నది ధర్మదీక్ష. అది మాచలకు సంక్రమించెను. మంత్రి తగినరీతిగ వినియోగించినాఁడు. రాజ్యశ్రీసంవిధానము సాంప్రదాయకము. దానిని భగ్నముచేయ సంకల్పించిన కుత్సితుల కధినాయకుఁడు, ప్రతాపుఁడీ వీరకావ్యమునఁ బ్రతినాయకుఁడు. వీరనాదు లనుయాయులు. తమలో దమ కైకమత్యము లేనందున వారికార్యము భగ్నమైనది. ప్రతివీరుల కార్యభంగమే ప్రకృతఫలము. చంచలామాచలల ప్రణయముగా గోచరించు శృంగారము, డిండిముని విషయమునఁ బ్రతాపుని క్రోధము, నాయా సందర్భములయందుఁ బొందుపడిన నాట్యనృత్యఖేలనములు, సంగీతగోష్ఠులు, శ్రీనాథడిండిములయందు గోచరించిన శాంతాత్మకచిత్తవృత్తులును బ్రధానమగు ధర్మవీరమున కంగములై భావుకులకు శోభాసంపాదకము లగుచున్నవి.

## కీలుబొమ్మలు 1

ఇది నేఁటి పరిస్థితుల ప్రభావమునుగూర్చి చెప్పు డా॥ జి. వి. కృష్ణారావు నవల. ఇందు పుల్లయ్యకుఁ గూఁతురు సీత; చిన్నకొడుకు రామారావు. సీత పట్టణమున స్త్రీల కళాశాలలో ప్రవేశపరీక్షకుఁ జదువుచున్నది. రామముకూడఁ బట్టణములో నేయుండును. పుల్లయ్య యొక మారువాడిదగ్గఱఁ జంద్రశేఖరమునకై యైదువేలరూప్యము లకుఁ బూఁటపడినాఁడు. ఈ సంగతి వినినసీత లోకు లిట్లనుకొనుచున్నారని యడుగఁగా వారి కిఁకఁ బనిపాట లేమున్నవని నిరసనగా బలికినాఁడు తండ్రి. ఈ మాటల నర్థముచేసికొనలేనిసీత తనతండ్రి యేమియుఁ దెలియఁగఁడని బసవాచారియొద్ద నన్నది. ఆ యాచారినోట నువ్వుగింజ నానదు. సంఘమున నన్నర్థము లిట్టివారివలనఁ జెప్పరానన్ని.

ఆచారి యామాట నూరంతటఁ జాటునేమో యని పుల్లయ్యకు భయము. సత్యనారాయణ పుల్లయ్యయొద్ద నౌకరు. పుల్లయ్య పూఁటయున్న ట్లీతఁడెఱుఁగును. చంద్రశేఖరము తనభర్త కన్యాయముచేయఁగోరి ఋణపత్త్రముపుట్టించెననెడి కోపము వలనఁబుల్లయ్యభార్య తన యన్నకొడుకైన న్యాయవాది శేషగిరిచేతఁ జంద్రశేఖరము నకు లేఖవ్రాయించినది. అది తెలిసిన పుల్లయ్య శేషగిరియొద్దకుఁబోయి నిజము నొప్పు కొనుటకుఁగాని చంద్రశేఖరము నొద్దకుఁబోయి తప్పిదము నొప్పుకొనుటకుఁగాని యభిమానపడి యానాఁటి కెళ్లెట్లో యూరటఁ జెందినాఁడు.

అమ్మాయమ్మగారు హరిజనాశ్రమమును నిర్వహించుచుండును. మల్లయ్య యా యూరికెల్లఁ బెద్దసెట్టి; పుల్లయ్యకు విరోధి. వీరయ్య, మాధవయ్యయనెడియాయన యొద్ద నాలుగేండ్లు పాలేరుగా బనిచేసినాఁడు. ఈ కథాకాలమునాఁటికి మాధవయ్య చని పోవును. మల్లయ్య వీరయ్య నడుగఁగా జంద్రశేఖరమునకుఁ బుల్లయ్య పూఁటపడి నట్లును దాను సాక్షిగ వ్రాలు చేసినట్లును మాధవయ్య తనతో ననెనని వీరయ్య చెప్పి నాఁడు.

ఇంతలో గ్రామమున బంతులుగారియిల్లు, మల్లయ్యగడ్డివాము, హరిజనాశ్రమ మును దగులఁబడినవి. పుల్లయ్యకొడుకు రామమునకుఁ దల్లి లక్ష్మమ్మ యీ దొంగ వ్రాలునుగూర్చి యుత్తరము వ్రాయించినది. తండ్రి పూఁట పడితినని తనతో నన్నట్లు గుఱుతున్నరామము తండ్రికి లేఖవ్రాయును. రామమున కీ సంగతి యేమాత్రము తెలియదనియుఁ గొన్నినాళ్లవఱకు నతఁడు గ్రామమునకే రావలదనియుఁ దల్లిలక్ష్మమ్మ

1. రచన క్రీ.శ. 1951; ముద్రణము 1953. 'బోజర్' రచించిన 'ది పవర్ ఆఫ్ ఎర్తె' యనెడి రచనయొక్క ప్రభావ మీ నవలపైఁ గలదు.

వ్రాయుమనినట్లు తండ్రి రామమునకు వ్రాసినాడు. రామమా లేఖను లెక్కచేయలేదు; గ్రామమునకు వచ్చివేసెను; తండ్రికి నిజము చెప్పినాడు. పుల్లయ్యకుఁ గోపము వచ్చి కొడుకును గొట్టఁబోయి యింటినుండి పంపివేయును.

మల్లయ్య అమ్మాయమ్మయొద్దకు వచ్చి పుల్లయ్యకొడుకును రామమును జెఱసాలకుఁ బంపవలెననియుఁ దా నందుకు నాల్గువందలరూప్యముల విలువగల తాఁడిచెట్లను లంచముగ నిత్తుననియు జెప్పినాఁడు పుల్లయ్యయొద్ద గూడ లంచము లాగవలెనని వెళ్లిన అమ్మాయమ్మ పుల్లయ్య తన కొడుకును దనచేతులతో రాజభటుల కప్పగించున ట్లొప్పించి వచ్చినది.

ఆ యూరివైద్యుఁడు వాసుదేవశాస్త్రి చంద్రశేఖరమునకుఁ బుల్లయ్యకును వివాదపరిష్కారమునకై ప్రయత్నించి విఫలుఁడగును. చంద్రశేఖరమునకు మూఁడేండ్లు దండన విధింపఁబడినది. పుల్లయ్యనూరివా రందఱు సన్మానించి యాతని చిత్రము నావిష్కరింతురు. ఇంతలో దన పిత్రార్జితమైన యిల్లు చంద్రశేఖరము పిల్లలకు వ్రాసియిచ్చి యావైద్యుఁడు పొరపాటునఁ జేసిన యొక చీకటితప్పునకు సిగ్గిలి తా నాయూరు వదలి వెళ్లిపోవును. చెఱనుండి విడుదలయైవచ్చిన రామముకూడ వైద్యునితో గలిసి యా యూరు వదలి పెట్టును.

రాజకీయపక్షముల యావేశములను సాధ్యమైనంతవఱకు మఱచి చదివినప్పుడే యీ రచనలోని కళానుభూతి ప్రాధాన్యమును గుఱుతింపఁగలమని రచయిత ప్రస్తావనలో నిందుఁ జెప్పినాఁడు. అయినను దీనిని రాజకీయములతో ముడివడిన మనస్తత్త్వనవల యనకతీరదు. నేఁడు జీవితము వేఱు; రాజకీయములు వేఱు కావుగదా! కావున నీ నవల మన మనస్తత్త్వముల ఛాయాచిత్రణము; ఆశానిరాశలతోడి మన జీవితముల ప్రతిబింబము.

## అంశుమతి

తెలుఁగు నవలావాఙ్మయమును బోషించినవారిలో శ్రీ అడవి బాపిరాజుగా రొకరు. కళాకారుఁడు, కవులునైన వీరు నవలలుగూడ వెలారించుటవలన మన కథాసాహిత్యము నూత్నశోభావహమైనది. ఆయన కళాదృష్టితో ననేకప్రాంతములను దేశాంతరములనుగూడ సందర్శించిరి. 'బాపిబావ' యనఁగా జిత్రకళలో నజంతా యమరావతుల సంప్రదాయములనే గాక సింహళమునఁగల బౌద్ధసంప్రదాయములఁగూడ జీర్ణించుకొన్న మనీషి. ఆయన గీసినదెల్ల బొమ్మ; వ్రాసినదెల్ల నవల. ఆ వ్రాయుటలో గూడ స్వానుభవము కొంత గోచరించుచునే యుండును. సాధారణ మానవుల యను

ఫణమున కందనిదాని నాతఁ డెక్కడనోతప్ప 1 నవలలో నిబంధింపలేదు. కొన్ని కథానికలలో నట్లుఁ జేసెను. అవి శిల్పపుముద్దలు; ఉత్తమాధికారులకై నిర్దేశింపఁబడినవి. అందుచేతనే మాతని యనుభూతి మిక్కుటము. అనుభవమున కందనివానిని వర్ణింపఁ బోయినచో, రసాభాసము వాటిల్లుననుట, ప్రసిద్ధవంగరచయిత తారాశంకర బెనర్జీయు ఇల్యాఎహ్రెన్‌బర్గ్ 2 పండితప్రభృతులును జేసిన నిష్కర్ష. ఈ సందర్భమున మన 'అడవి వారిచిన్నవాఁడు' తెలుఁగునవలారచయితలలో గడు గడుసరి.

బాపిరాజుగారు రచించిన నవలలు పదికిఁ బైఁబడియే యున్నవి. వానికి స్థూలముగఁ జారిత్రకము లనియు సాంఘికము లనియు ద్వివిధాకరణ మున్నది. తిరిగి వానిలో రెండు తెగలు; కొన్ని నవలికలు; నవలలు మఱికొన్ని.

'అంశుమతి' నవలికలలో నొకటి. ఇందుఁ దూర్పుచాళుక్యసామ్రాజ్యస్థాపకుఁడైన కుబ్జవర్ధనుఁడు కథానాయకుఁడు. ఇతఁడు శాస్త్రోక్తముగ నాయికను జూచుట, వారి యిర్వురి నడుమ ననురాగము పొటమరించి కొనసాగుట మఱివానితో గథా కాయమాన మల్లిబిల్లిగొనఁగా, నా నీడలో దదనుగుణముగ వివాహము వర్తిల్లును. ఇది సాధారణమైన కథ. కాని శిల్పిచేతులచే జికిలి చేయఁబడినది. కంటికి జిగేలు మని పించును.

విష్ణుకుండిన మంచనభట్టారకుని కొమార్తయైన యంశుమతిని కుబ్జవిష్ణువర్ధనుఁడుద్వాహ మగుటయుఁ గళింగరాజైన దానార్ణవుని విష్ణువర్ధనుఁడు జయించుటయు, జారిత్రకవిషయములే! దానార్ణవుని జయించుటకుఁ బోవునప్పు డాతనిచే రహస్యముగఁ గొనిరాఁబడిన యంశుమతిని జూచుట మొదలైనవి మాత్రము కల్పితములు. కాని ప్రధానకథ కవరోధములు గల్పింపక, మార్పులు ఘటింపక, చారిత్రకాంశములకు విధేయతతో లఘుమనోజ్ఞకల్పనలను మాత్రము పొదిగి, యీ నవలికను నిర్మించి రచయిత కృతకృత్యుఁ డయ్యెను. ఇట్టి రచనలో బ్రధానాంశములయందుఁ జరిత్రకు విధేయతఁజూపుట బాపిరాజుగారి నియమము.

కళింగజైత్రయాత్రాదినములలో నప్పుడప్పుడా బాలిక, యంశుమతి యాతని మనఃపథమున మెఱయుచుండెడిది. ఆమెను గుఱించిన భావముల నాతఁడు వెంటవెంటనే 'సాలెపురుగు తన గూటిదారములను' నులిమివేయునట్లు నులిమివేసి కొనెడివాఁడు. నులిమివేసినను నాలెగూడు తిరిగికట్టుట గమనార్హము. మనోహరమైన యీ యుపమానమువల్లనే నాయికానాయకుల ప్రణయమెల్ల రచయిత వెల్లడింపఁగలిగెను. వీరశృంగారములకుఁగల యథోచితస్థానముతోబాటు మన జాతికి సంయమనము నేర్పుటయే యీ నవలాప్రయోజనము.

---

1. 'హిమబిందు'లో విషకన్యాప్రయోగాదికము ప్రసక్తము.
2. ఈయన విమర్శకుఁడు మాత్రమేకాదు; ఈయన నవలపేరు 'బాగోగులు'.

## శుద్ధాంతకాంత[1]

ఈ నవల సురవరము ప్రతాపరెడ్డి విరచిత మైనది; అముద్రితము; నాలుగు వ్రాఁతసంపుటములలో గలదు. రైనాల్డ్స్ "లండను న్యాయస్థానరహస్యముల"[2] సంపుటముల వలె సాగిన దీ రచన[3]. దీని రచనాకాలమును నిర్ణయించుట బహుకష్టము. శ్రీ రెడ్డిగారు 'గోలకొండపత్రిక'కు సంపాదకులుగ నుండి[4] కేవలము సాహిత్యకముగను సాంస్కృతికముగను మాత్రమేగాక రాజకీయముగఁగూడఁ దెలంగాణమున కపారమగు సేవచేయుచు నాఁటి నిరంకుశప్రభుత్వమున కెదురొడ్డి నిలచిన దినములలోని రచన మిది యనిపించుచున్నది[5]. ఆంతరంగికప్రమాణములుగూడ నిందులకే ప్రోద్బలకములు. కాని హైదరాబాదులోని 'పోలీసుచర్య'పిమ్మటఁ గొన్ని సవరణ లీ నవలలో రెడ్డిగారు చేసినట్లుండిరి[6]. అందుచే కాలమునుబట్టి యిది యీప్రకరణమునఁ బరిశీలింపఁబడుచున్నది.

---

1. క్రీ. శ. 1957లో దీనిని నాకు డా. బి. రామరాజు (రీడరు– ఆంధ్రశాఖ – ఉస్మానియా విశ్వవిద్యాలయము)ఒక పర్యాయ మిచ్చిరి.
2. The Volumes of 'The Mysteries of the Court of London' by Rynolds.
3. 'The Mysteries of Hyderabad' అని యీ నవల కాంగ్లములో నామాంతరము.
4. క్రీ. శ. 1925-1948.
5. ఈ నవల రచనాకాలమునుగూర్చి డా. బి. రామరాజుగారేమియు వ్రాయరైరి. (తెలుగు విజ్ఞానసర్వస్వము- మూడవసంపుటము- తెలుఁగుసంస్కృతి, పుట 939)
6. ముఖపత్రముపై 'సురవరము ప్రతాపరెడ్డిచే రచింపఁబడినది– కర్నూలు,' అని యుండుటయు నాలుగుసంపుటములును బహుశిథిలావస్థలో నుండి కాగితము లంటినచో బొడిబొడియైపోవుచుండుటయు, శైలిచాల నపరిష్కృతమై కథ శిథిలబంధము గలిగియుండుటయువంటి కారణములచే నిదికనీసము పాతికముప్పది యేండ్లనాఁటి నీరసరచనము. తుది నాళ్ళలో వారికే యిది నచ్చియుండదు; లేకున్న నచ్చువేయించెడివారు గారా? ఆ నాలుగు సంపుటముల వివరములు నీ క్రింద నీయఁబడుచున్నవి :—

| సంపు | ప్రకరణములు | పుటలు | విశేషములు |
|---|---|---|---|
| ౧ | ఒకటవ ప్రకరణమునుండి పదునొకండవ ప్రకరణములో :— | ౮౩ | పుట 82 తరువాత పుట 84 మాత్రమే కలదు. కావున 83 పుటలే యన్నమాట. |
| ౨ | పదునొకండవ ప్రకరణమునుండి ఇరువదిరెండవ ప్రకరణము పూర్తియగువఱకు :— | ౩౬ | శుద్ధాంతకాంత– The Mysteries of Hyderabad (DN) అని యట్టపైఁ గలదు. |
| ౩ | ఇరువదిమూఁడవ ప్రకరణమునుండి ఇరువదియెనిమిదవ ప్రకరణమువఱకు :— | ౬౫ | కాగితములు పలుచనివి; కాని కొంచెము మంచివి. |
| ౪ | ఇరువదితొమ్మిదవ ప్రకరణమునుండి ముప్పదినాల్గుప్రకరణముల సంపూర్తివఱకు :— | ౪౬ | వెరసి 270 పావుటావుల గ్రంథము. |

ఈ నాలుగు సంపుటముల నవలలోను1 నాఁటి ప్రభువునుగూర్చిన ప్రత్యక్షదూష ణమే ప్రధానాంశము; ఆ ప్రభువు దుశ్శీలము, లోభిత్వము, నతని బారినిబడిన సౌశీల్య వతుల దురదృష్టమును వర్ణింపఁబడినవి. నవలగా జక్కని పాత్రపోషణముగాని, చారుసన్నివేశములుగాని యిందులేవు. కొన్ని వర్ణనలుమాత్ర మున్నవి. భాషయు బహు దోషములు గలది. వ్యక్తిగతమైన ప్రభునిందయే యిందుఁ బ్రధానము. కాని నాఁటి సాంఘికసాంస్కృతికరాజకీయాదివిషయములపై నిది చాల వెలుఁగు బ్రసరింపఁగల నవల. రాజాంతఃపుర మన్న నెంత దుశ్శీలాగారమో యిట్టివానివలననే విదితము కాఁగలదు. మతదుస్సహానపరులవలనఁ బతివ్రతలకును ధర్మములకును గలుగుహానియే దీని సారాంశము. నాఁటి తెలంగాణములోని ప్రజాజీవితదుర్భరత్వమున కీ నవలకాని నవల నొక మణిదర్పణ మనవచ్చును.

## పరీక్ష

విద్యార్థుల కుపయోగించు విశ్వనాథవారి నవలిక. రామయ్య బీదపరిస్థితులు, గోపాలము పట్టణములో బహుకష్టముల కోర్చి చదువుకొనుట, పిదప వ్యర్థుఁడై యాత్మహత్యచేసికొనుటవంటి విషయములకుకంటె నేఁటి విద్యావిధానవైయర్థ్యనిరూప ణమునకే యిందుఁ బ్రాధాన్యము.

నేఁటి విద్యావిధానము వ్యవహారజీవితమున కెప్పుడును బనికిరాని విషయము లను బోధించుట, పెక్కు శాస్త్రములను కళలనుగూర్చి చదివించుట, పరీక్షలో నుత్తీ ర్ణులైనవారి కుద్యోగములు లభింపకపోవుట, యెల్లరకు ధనార్జనదృష్టియేగాని జ్ఞానో పార్జనదృష్టి లేకపోవుట, చదు వనఁగా నాంగ్లమే యన్నభావము పాతుకొనిపోవుట మున్నగునాధునిక విద్యావిషయములపై రచయితకుఁగల యభిప్రాయము లిందుఁ జర్చింపఁబడినవి.

---

1. మొదటిరెండు సంపుటములను నల్లని దట్టమైన కాగితములవి: అవి యంటినచో బొడి బొడియైపోవుచున్నవి. కొట్టివేతలు రచనలో నెక్కువ. నైజామునుగూర్చిన ప్రత్యక్ష దూషణములే కొట్టివేయఁబడిన యంశములు. కథను దూషణకావ్యముగఁజేయక నవలగ రూపొందించుటకై జరిగినప్రయత్నమే యీసవరణలరూపమున నగపడుచున్నది. మూఁడు నాలుగు సంపుటముల కాగితములుగూడ నల్లనివే; కాని పలుచనివి; ఇంచుక నయము. కొట్టివేఁతలుగూడ నీ రెంటిలో దక్కువ. అక్షరము లన్నిటను స్ఫుటము. మూఁడవ సంపుటములో నలువదియవపుట నగమునుండియు, నాల్గవ సంపుటి పూర్తియగువఱకు పైలెట్ సిరా వాడుకచేయఁబడినది. ఒకటిరెండు సంపుటములది నల్లసిరా; వ్రాఁతయు వించుక జిగికలది. మూఁడు నాల్గు సంపుటములయందువలె నక్షరములు విడివిడిగ వ్రాయఁబడిలేవు. 'శ్రీ రెడ్డిగారిదియా యిది' యనిపించు శైలి.

ఒక్కొక్కవ్యక్తి కొక్కొక్కవిషయములో ప్రజ్ఞయుండునేగాని యన్నివిషయములలో నుండఁజాలదు. అట్లుండవలెనని కోరుట సరియైనది కాదని విశ్వనాథవారి విశ్వాసము. నేఁటి చదువు లీ నవలికలోని గోపాలమువంటివారి నెందఱనో సృష్టించుచున్నవని కవిగారిభావము.

## జా జి మ ల్లె[1]

ఇది అడవి బాపిరాజుగారి నవల. దీనిని నవలిక యన్నను దప్పురాదు. ఇందు పద్మాలు, బుచ్చివెంకన్నలు నాయికానాయకులు. వీ రగ్నికులక్షత్రియులు. వివాహమైన తరువాత యుద్ధమునకుఁబోయి, బాగుగా సొమ్ము సంపాదించుకొనివచ్చి బుచ్చి వెంకన్న వెంకటరావై పోయి చెన్నపట్టణములో గాఁపురముపెట్టి, రొయ్యపప్పు మొదలైన వానితో వ్యాపారము నెలకొలుపును. సొమ్ము రాఁబడితో పద్మాలు పద్మయైపోయినది. చేఁపలవాసన యలవాటుతప్పిపోయినపద్మ యొకదినమునఁ దమ చేఁపలయంగడి దగ్గఱ మూర్ఛపోయినది.

ఇరువురు చదువుకొందురు. ఆమెది సహజముగ మధురమైన కంఠము. చెన్నపట్టణముచేరి యామె సంగీతము నేర్చుకొని గానసభలుచేయును. ఇంతలో నొక చలనచిత్రదర్శకునితో నామెకు స్నేహము. ఆ దర్శకున కొకభార్య. ఈ చలనచిత్ర వ్యక్తులకు సాధారణగృహస్థులకువలె సంభాషణలలోను స్పర్శలలోను నెట్టి బట్టింపు లుండవు. ఈ నూత్నప్రపంచములో రుచిమరగినపద్మకు వెంకటరావన్నచో నించుక వెగటు ప్రారంభమైనది.

వెంకటరావు చలనచిత్రనిర్మాణమున కుపక్రమించినాఁడు. సంగీతదర్శకుని భార్య వెంకటరావున 'కన్నెర్ర్యాగా' నుండలేకపోవుటచే నితనిలో గల్లోలము రేఁగును. ఎట్టకేలకుఁ బద్మావతీవెంకటరావులు ఢిల్లీలో రాజఘాట్ కడఁ గలిసికొందురు. తమ యిరువురి చరిత్రములు సందేహముల కాస్పదము లగుటచే, నిఁకనైన వారు జాగరూకతతో బ్రతుకవలె నని నిర్ణయించుకొనిరి. కాని యా యమునానదియొడ్డును వట్టి 'దాలిగుంట'గా జేసి, వీరు తిరిగి చలనచిత్రపరిశ్రమవిషయములలో నిమగ్ను లగుదురు.

మన భాషకుఁ బ్రత్యేకధర్మమైన ముద్రణస్ఖాలిత్యముల విషయ మటుండనిచ్చి దీనిని బరిశీలింపవలెను. అప్పు డీ కథలో గ్రొత్తఁదనమేమియు లేకపోఁగా, దానిని జెప్పుటలో రచయిత క్రొత్తఁదన మేమియుఁ జూపలేదు. చలనచిత్రవ్యవహారము లీ

1. 27–2–1952 [Vide. Reg No. 388 on Page 17, Ft. st G. G: dated 22 oct, 1952]
ప్రకాశకులు, కవితాపబ్లికేషన్స్, బకింగ్‌హామ్‌పేట. విజయవాడ_2.

నవలలో గొన్ని చిత్రింపఁబడినవి. అవి ప్రాయశః బాపిరాజుగారి యనుభవముసైతె యుండును. వీరా రంగమునఁ బనిచేసిన కళావేత్తలు. ఈ నవలలోనికథ మహాత్ముఁడు మరణించిన దినములలో జరిగినది.

అచ్చముగ జాతీయవాదియైన బాపిరాజుగారి దృక్పథ మఖిలభారతీయసంస్థ యెడ నెట్లు మాఱినదో వారి భావములఁ బరికించినచో బోధపడును.

మహాత్ముఁ డవతారపురుషుఁడు. దుఃఖార్తులైన సర్వమానవుల బాధలను హరించి తన బ్రతుకులో నాస్వాదించుకొనినాఁడు. బీదతనమువలనఁ గడుపున కొక కణమైనను లేని దౌర్భాగ్యులకొఱకై బాష్పబిందువునైన రాల్పనివానిబ్రతుకు వ్యర్థము. అది హింసాపూరితము. ఇట్టివి మహాత్ముని బోధనలు. ఆయన శిష్యులే నేఁడు రాజ్యభారము వహించి దీనుల కన్నులనుండి రక్తాశ్రువుల మహోర్ఘులుగఁ బ్రవహింపఁజేయుచున్నారని యీ నవలలో నరసింహమూర్తిగారి యుపాధ్యాయుఁడు కంపించిపోయెను.

నరసింహమూర్తిదంపతులకు సంగీతసాహిత్యములు చెప్పుటకై వారి యూరి నుండివచ్చిన యాతఁ డీ యుపాధ్యాయుఁడు.

జాజిమల్లి సుమముల సువాసన పద్మావెంకటరావులలో గుప్తమై, సుప్తమై యున్న సంబంధసువాసనలను గుబాళింపఁజేసి, మైత్రిని మేలుకొలిపి యిరువుర నొక టిగఁజేయఁగలిగెను. జాజిమల్లెయనఁగా జాజికిని మల్లెకును గట్టినయంటని బాపిరాజు గారి భావము. ఆ రెండు వేనికవి వేఱయినను, నంటుమాత్ర మొకటియే యైనట్లు మొదటఁ గొన్ని బేధము లున్నను నాయికానాయకులు చివర కేకత్వము నొందిరని నవలపేరు స్ఫురింపఁజేయు చున్నది. భిన్నభిన్నగుణములు గలవారైనను సాంగత్య బలముచే నిందలి నాయికానాయకు లొక్కటియైపోవుటవలననే యీ నవలకు నామ సార్థక్యము.

## నాగరాజు[1]

ఈ నవల యొక విషాదగాథ. శ్రీ మహావాది వేంకటరత్నముగారు దీనికర్త. ఇందలి విషాదవృత్తము శీలజన్యము, పరిస్థితిజన్యమును. ఇట్టినవలయందుఁ బదకమున కున్న ప్రాధాన్యము పాత్రలకు నుండఁజాలదు. వారు పదకమున కధీనులు; కదలుచు మెదలుచు నుందురు; కాని పరిస్థితుల నదుపులోనికిఁ దీసికొను కార్యశీలురుగా నుండరు.

౧. నాగమణి:—

ఈ నవల పదకములో నాగమణి నాయకమణి. ఈమె మంగపతిరావునాయని

---

1. Thomas Hardy's 'The wood Landers' [1887) is the source of inspiration for this Novel; but we can not call this a translation or an adoptation.

కేకైక పుత్త్రి; ప్రపితామహుఁడు లక్ష్మణస్వామినాయఁడు; తన పేరుమీఁదుగ 'నాయుడుపేట' వెలయఁజేసిన విఖ్యాతి యాయనది. మంగపతిరావు సుసంపన్నుఁడు, కాన, నాగమణి సంపదయు మానమర్యాదలును గల వంశమున జన్మించినది.

తలిదండ్రు లామెను గారాబముతో బెంచి బాగుగఁ జదివించిరి. ఆంగ్లవిద్యాభ్యాసమునకై యామెకుఁ జెన్నపురి నివాస మయ్యెను. విద్యాపారంగతతోఁబాటు, నాగరకప్రవర్తనము, హృదయసౌకుమార్యము గూడ నీమె కలవడినవి.

నాగమణి కిప్పుడు పెండ్లియీడు. బాల్యమునుండియు నామెకు రాజయ్యయం దనురాగము. అతఁడు తమ యింటనే యుండి పెఱిగిన తన మేనత్తకుమారుఁడు. ఇతని కాంగ్లవిద్యాసంస్కారము పూర్ణానుస్వారము; తనవలె నాధునికనాగరకమర్యాదలు తెలియవు; తనవలె తల్లి కాతనియం దభిమానము లేదు. అయినను నాగమణి రాజయ్యనే వరించెను; తండ్రి త న్నాతని కిత్తునని చెప్పినపు డానందించినది. ఆమె యనురాగ మవ్యాజము, పవిత్రమునని చెప్పఁదగును.

పాశ్చాత్యవిద్యానాగరకతావ్యామోహాదికమునందుఁ దనకంటె భిన్నదృక్పథము గల రాజయ్య మనోభావముల నభినందించి యాదరించిన సహృదయురాలు నాగమణి; ఆయన దర్శనపథమునుబట్టి తన యభిరుచులను దిద్దుకొన్నది; స్వకీయవేషభాషాభిమానము నలవఱచుకొనెను. ఎట్లుఁ బ్రవర్తించిన రాజయ్యహృదయమున కానందము కలుగునో యట్లుప్రవర్తించినది. 'జమీందారిణి' మందిరమునకుఁ దన్ను దండ్రి రమ్మన్నను రాజయ్య యనుమతిలేనిదే యామె పోనొల్ల ననుటయం దీ యర్థమెల్ల విశదము.

రూపలత భారతదేశపర్యటనమునకై తనతో రమ్మన్నప్పుడు నాగమణిమనస్సు వెళ్ళుట కువ్విళ్ళూరెను. అయినను దనతండ్రి యంగీకారమును బొందవలెనని తప్పించుకొనుటలో రాజయ్యయభిప్రాయమునుగూడ సంప్రదింపవలెననియే యూహ. తన తండ్రి రూపలతతో భాషించిన పిమ్మట నాతని ముఖమునందుఁ గల్గిన మార్పు నాగమణి గమనించినది; కాని కారణముమాత్రము గ్రహింపలేకపోయెను.

నాగమణి జానకిపూరింటికిఁ బోయి యక్కడనుండి రాజయ్యతోగూడఁ దోఁటకుఁ బోయినది. అనుచరసహితుఁడై తోఁటకు వచ్చిన మంగపతి, రాజయ్యను దూషించి, తన కూఁతును గఠినముగ శాసించుటచే నామె ప్రణయప్రవాహమున కడ్డగాలు వడెను. జానకి రాజయ్యను ప్రేమించుట యొకటి; గృహత్యాగముచేసి యతఁడు తన కాశాభంగము గలిగించుట మఱియొకటి. ఈ రెండును గలిసి నాగమణిమనస్సు వికలము గావించినవి. తన్మనోవైకల్యముచే నామె తీవ్రతాపమునకు గుఱియై మాతాపితరుల కాతురతఁ గలిగించినది. ఈ ఘటన యామె హృదయసౌకుమార్యమును విషయీకరించి వ్యక్తమొనర్చెను.

రాజయ్యయెడ మంగమ్మ యదివఱకే విముఖురాలు; ఇప్పుడు మామ మంగపతియు విముఖుఁడు. నాగమణిమాత్ర మాతనిని ప్రేమించుట మానలేదు. అతఁ డింకను దిరిగివచ్చును; గృహపరిత్యాగవిషయమును జానకిప్రేమవిషయమును దగినకారణము లుండుటచే దన కాతఁడు చెప్పియుండలేదని యామె విశ్వాసము. అందుమూలమునఁ దలిదండ్రులు సేయు వివాహసన్నాహముల కామె సుముఖతఁ జూపలేదు. ఎట్టకేల కామె తలిదండ్రుల యనునయముచే డాక్టరు మధుసూదనరావును వివాహమాడుట కియ్యకొనెను. ఆమె యీ యంగీకారమునందు స్వార్థచింతకాని, రాజయ్యయెడఁ బ్రతీకారచింతకాని యిసుమంతయు లేదు. తండ్రికి వార్ధకమున మనశ్శాంతికలిగించుట యొక్కటియే యామెధ్యానము.

నాగమణి తన వివాహానంతరము మధుసూదనునితో గొన్ని నాళ్ళు సుఖముగ గాఁపురము జేసెను. రాజయ్యనుగూర్చిన మనోవిచార మొకవంకను, దా నాతనియెడ మహాపచార మొనర్చితి నను విశ్వాస మొకవంకను నామెకు మనోవ్యాధిని దెచ్చిపెట్టినవి. దానితో నామె కృశించి మరణోన్ముఖురా లయ్యెను. భర్తచేసిన చికిత్సలు వ్యర్థమైనవి. ఘనవైద్యు లొక రామెకుఁ గ్రొత్తరక్త మెక్కింపవలె ననిరి. భర్త తనరక్తమిచ్చుట కంగీకరింప లేదు. సన్న్యాసివేషమున రాజయ్య వచ్చిచూచి తన రక్తమునొసఁగి ప్రాణదానము చేసినాఁడు.

తేరుకొన్న పిదప నాగమణికి రాజయ్య రక్తదానముసంగతి తెలిసెను. ఆతని యవ్యాజానురాగమునకుఁ దన యపచారమునకు నామె కుమారిలినది; తన భర్తకు రాజయ్యయం దసూయ యేర్పడెను. అది యెఱిఁగియు నీమె రాజయ్యను దర్శింప నేఁగినది. తన తప్పిదము నొప్పుకొని యాతని క్షమాభిక్ష వేఁడుకొనుటయే యామె యుద్దేశము. ఈ సంఘటనమువలన నామె సౌశీల్యమును బశ్చాత్తాపమును వ్యక్తమైనవి.

రాజయ్యకుటీరమున రూపలత కావించిన కుట్ర పూర్తిగఁ దెలిసికొని నాగమణి యెంతయో చింతించెను. తన తలిదండ్రుల సంతుష్టికై రాజయ్యకు శాశ్వతద్రోహము చేసితినని యామె దుఃఖము; గురుదేవుని యుపదేశముచే గొంత మనశ్శాంతి చేకూరఁగా జానకితోబాటు తాను నిప్పుడు గురుశుశ్రూషాపరాయణ.

తన భార్య రాజయ్యను సంభావించుట మధుసూదనరావునకు దుస్సహము. అయ్యు నాతఁ డా పరిస్థితిని నివారింప లేఁడు. ఆతఁడు రూపలతవలలో జిక్కుకొని నాగమణి ననాదరముచేయఁ దొడంగెను. అంతకుఁ బూర్వమే భర్తదుశ్శీలము నాగమణికి దుఃఖహేతు వైనది. ఇప్పు డిల్లుపట్టక దివారాత్రము లతఁడు కోటలోనే యుండుట యామెకు మఱియు సంతాపకరము. ఇట్లుండ మంగపతి తన యల్లుని దుర్వర్తనమునకు దూషించెను. మామగారిపైఁ గోపగించుకొన్న మధుసూదనుని

నాగమణి యనునయింపఁబోయినది. మధుసూదనుఁడు నాగమణిని మంగపతిని గురు దేవునికూడ దూషించి యనరానిమాటలని నాగమణిని గొట్టి పోద్రోసినాఁడు. ఆమె యింతపడియు గురుదేవు నాజ్ఞానుసారముగ శాంతను వీడ దయ్యెను; పతి నే మాత్రము నిందింపక సహనశక్తిని బ్రదర్శించుచు; ఆతని యక్రమప్రవర్తననునకుఁ దిరస్కారముగ మాత్ర మా యపవిత్రప్రణయరంగమునుండి నిష్క్రమించుచున్నా నని చెప్పి వెడలి పోయినది.

ఆ మరునాఁటి ప్రాతఃకాలమున మధుసూదనుఁడు గృహత్యాగవేళ వ్రాసిపెట్టిన లేఖ యామె చూచి మిక్కిలి ఖేదపడెను. భర్త తన శీలమును శంకించినందులకంటె గురుదేవుని దూలనాడినందుల కామె పరితాపము: భాషామందిరమున కేఁగి జానకీమాత సమాశ్వాసమునొంది కొంతవఱకు స్వస్థచిత్త యయ్యెను. తాను గూడ జానకీమాతతో బాటు భాషామందిరసేవ చేయుట కామె కిప్పుడు గురుదేవు ననుమతి ముఖ్యము.

అందులకై యొకనాఁడు నాగమణి పోవుచు గురుదేవు నాశ్రమసవిధస్థలిఁగల గుట్టలలో దారితప్పెను; కడు దడవు తిరిగి తిరిగి యా కుటీరమును సమీపించినది. ఇంతలో నా ప్రాంతమందలి పొదయందుండి గాండ్రించిన యొక పెద్దపులిని జూచి భయ భ్రాంతయై యామె యార్తనాదము గావించెను. అది విని గురుదేవుఁ డీఁటెతో వచ్చి యా పులిని హతమార్చి దానిచేత నిహతుఁడగుటవలన నాగమణి మూర్ఛలో మునిఁగి పోయినది. తుదకు మూర్ఛ దేరుకొని, తన రక్షణార్థము ప్రాణపరిత్యాగమునకుఁ గూడ జంకని యా ప్రణయతపస్వికై యామె విలపించెను. ఇది యామె నిష్కలంకా నురాగమునకును బవిత్రశీలమునకును దార్కాణము.

గురుదేవుని సమాధిచేసిరి. పిదప భాషామందిరము 'రాజమందిరమ'యినది. ఇప్పుడు నాగమణి ప్రతిదినమును గురుపూజయందుఁ బాల్గొనును; విద్యామందిరనిర్వ హణమున జానకీమాతకుఁ దోడ్పడును. ఐహికచింతానిమగ్నవిరక్తజీవిత మామెది, నేఁడు పారమార్థికముగ దేశసేవావినియుక్త మైనది. గురుదేవుని యడుగుజాడల యందు జానకీమాత మార్గదర్శకురాలు కాఁగా, నేఁడు నాగమణి నిష్కామజీవన పరాయణ యయ్యెను.

రూపలతహత్యా నంతర మొకనాఁడు మధుసూదనుఁడు మామగారిపేరఁ దన తప్పిదముల నొప్పుకొని క్షమవేఁడుచు నొకలేఖ వ్రాసినాఁడు. అందులకు నాగమణి తలిదండ్రులు సంతుష్టులైరి. కాని యామె యూరకొన్నది. ఎల్లరుఁగలిసి జానకీమాత కడ కొకసారి యరిగిరి. 'మధుసూదనుఁడు నిజము తెలిసికొని పశ్చాత్తప్తుఁ డైనాఁడు; కాన పతనిని రావించుట ధర్మ'మని జానకీమాత చెప్పెను. నాగమణి యంగీకరించెను. మధుసూదనుఁడు వచ్చినపిమ్మటఁగూడ నాగమణి యతనిని బలుకరింపఁజాలదు. అతఁ

డండఱ యెదుట క్షమవేఁడినను మాటలాడలేదయ్యెను. కడకు రాజమందిరమున కేఁగి గురుదేవుని సమాధికిఁ బ్రణమిల్లి గురుదేవుని జానకీమాతను దనను క్షమాపణమును జూచి మాత యనుమతితో నాతని నామె క్షమించినది. ఎంతటి యనుచితవర్తనుఁడైనను బతి గావున నాతనినిక్షమించుటలో విద్యాగుణశీలసంపన్నయగు నాగమణిచూపిన యౌదార్యము భారతస్త్రీత్వాదర్శము; ప్రశంసార్హము.

**రా జ య్య :—**

ఈ నవలయందు నాయిక నాగమణియగుచో నాయకుఁడు రాజయ్య. నాయికకు ప్రేమపాత్రుఁడై యయోగశృంగారమువలన విరక్తుఁడై ప్రేమతపస్వియై కథయందలి ప్రధానపాత్ర లన్నిటికిని గురుదేవుఁడై నెగడి ధర్మప్రబోధము గావించిన రాజయ్య నిశ్చయముగఁ గథానాయకుఁడు.

ఇతఁడు మంగపతి నాయని మేనల్లుఁడు; మాతాపితృదత్తమాతులుఁడై వారి వాంఛాపరిపూర్తికి మేనమామయింటనే పెరిఁగి పల్లెటూరిచదువునం దారితేరి యాతనికి వ్యాపారములో దోడ్పడుచున్నాఁడు.

రాజయ్య రూపరి; ఆంధ్రసాహిత్యవిద్యావిశారదుఁడు. గాంధిమహాత్ముని యసహాయోద్యమమునం దీతని కభిమానము మెండు; భారతీయసంస్కృతియెడలను వేషభాషల యెడలను గడు నాదరము; సత్యధర్మపరాయణతయు వ్యాపారదక్షతయు మేదురము. ఈ యీ హేతువులచే మంగపతిరావు తన మేనల్లుఁడైన రాజయ్యకు నాగమణి నీయఁ దలఁచెను. ఆ మామ కిందువలన మూఁడుకోర్కెలీడేరఁగలవు. మేనల్లున కిచ్చినచో గూఁతురు నల్లుఁడు దనయింటనేయుండుట యొకటి; బావమఱఁదికి వ్యాపారములో భాగ మిత్తునని యాశగొలిపి వంచించిన పాపమున కిది నిష్కృతియగు ననుకొనుట రెండు; దివంగతులైన చెల్లెలియు బావయు నాత్మల కిది శాంతి యనుకొనుట మూఁడు. భర్త తలఁపు లిట్లున్నను భార్యమంగమ్మ యందుల కంగీకరింపదు. తనకొమార్తె విద్యావతి; రాజయ్య యాంగ్లవిద్యాశూన్యుఁడు; పరమదరిద్రుఁడు; పదవీరహితుఁడు. ఈతఁడు తన కూఁతునకుఁ బతికారాదు; మంగమ్మ యీ విముఖత స్త్రీసహజమైనదని నాయఁడు ముందు లక్ష్యపెట్ట లేదు.

అంతేగాక నాగమణి రాజయ్యను వలచి వివాహమాడుటకు సమ్మతించెను. చిన్ననాఁటినుండియుఁ దా మొకచోట బెరుఁగుటచే నాతనియం దామె కనురక్తి;అతని పరిణాహిపరిణామదర్శితయెడలను వాఙ్నైపుణ్యమునెడలను నాదరము; అతని ధర్మ పరాయణతకును శీలసంపన్నతకును గౌరవము. ఆతఁ డాంగ్లవిద్యాశూన్యుఁడగుట పెండ్లికూఁతుదృష్టిలో నొక లోపము కాదు.

గుణగణము నేగాని, యార్థికసాంఘికగౌరవముల నామె లక్ష్యపెట్టలేదు. రాజయ్య తన కనర్హుఁడని నాగమణి భావింప లేదు. అతఁడును దా నామె కనర్హుఁడ ననుకొనఁడు. వీరి పరస్పరప్రణయము సాధారణలౌకికమర్యాదల కతీతము.

రాజయ్య ధీరుఁడు; నిర్వికారుఁడు; తన ప్రణయమును నాగమణికే యవగత మొనర్చినవాఁడుకాఁడు ఇఁక మంగమ్మమంగపతిరావుల సంగతిఁ జెప్పనేల? మామ నాగ మణిని దన కిత్తునన్నపుఁ డాతఁడు పొంగిపోయెను. పిదప నాశాభంగముచే గృహ త్యాగము గావించి విరక్తుఁడై సన్న్యసించినను నాతనిది నీ లీరాగము. అది విషయ దూరము. కావుననే నిష్కామబుద్ధితో నతఁడు రక్తదానముచేయుట; పులి కాహారమై యామెకుఁ బ్రాణదానముచేయుటయు.

అతనిది జాలిగుండె. జానకి దీనస్థితి కాతఁ డెంతేని కరుణఁబూనెను. ఆ దాక్షి ణ్యమునే లోకు లపార్థము చేసికొనిరి. చివరకు నాగమణికూడ నాతనిని శంకించినది. జానకి తన్ను బ్రేమించుట యెఱిఁగియు నాతఁడు నిష్కామపరుఁడై యామెను జూడఁగల్గుట యాతని యాత్మనిగ్రహశక్తికి నిదర్శనము. ఒకప్పుడు వ్యక్తిగతమైన ప్రేమ, పోనుబోను విశ్వవ్యాప్తమై పరమార్థమునందు లగ్నమగుట యనునదియాత నిపాత్ర పొందిన పరిణతి.

రాజయ్యకు వర్ణాశ్రమధర్మములయెడ గౌరవము; ప్రాచీనాచారమర్యాదల యందుఁ బట్టింపు; బాల్యమునుండి బ్రహ్మచర్యము పాలనీయము. ఒక్క నాగమణి యందే మనస్సు లగ్నమయ్యెను; అది సన్న్యాసమునకు దారితీసివేసెను. తదాశ్రమ స్వీకారానంతరము నిర్మముఁడు, నిరహంకారుఁడు, ద్వంద్వాతీతుఁడునై ప్రవర్తించు టచే నాతని కా యధికారము లభించిన దనవచ్చును. నాగమణికై యంత త్యాగము జేసియుఁ జేసితినని తలంపఁడు. సన్న్యసించిన పిమ్మటఁ దనకుఁగాని జానకికిఁగాని యెట్టి రహస్యములు నుండరాదని యాతని తలఁపు. రూపలత వృత్తాంత మతఁ డందఱకును విశదపఱచినాఁడు. తన మనస్సు పంకిలము గాదని ఋజువుచేసికొని వారితో దనకుఁ గల లౌకికసంబంధమును ద్రెంపుకొనెను.

జానకి రాజయ్యకుఁ బ్రథమశిష్యురాలు; ఆ పిమ్మటివాఁడు పెద్దిరెడ్డి. ఈ యిర్వురు సర్వకాలములయందు నాతనిని బవిత్రునిగ భావించిరి. అందువల్లనే వారికి 'భాషామందిర రాజమందిరముల'కుఁ గార్యకర్తలగుట కా యోగ్యత. ఈ యిర్వురి తరువాత రాజయ్యయెడ నాగమణికి భక్తితాత్పర్యములు. ఈమె తొలుత నాతనిని బ్రేమించి శంకించి వంచించి పరునిఁ బెండ్లియాడి పశ్చాత్తప్తయై భక్తురాలైనది. ఈమె తలిదండ్రులును బ్రాయశ్చిత్తార్థ మాతని శిష్యబృందమునఁ జేరిరి. మధుసూదనునకుఁ దొలుత నీతనియం దీర్ష్య ;పిమ్మట రూపలత దురోభలచే ద్వేషము; ఈ యీర్ష్యాద్వేష వివశుఁడై రాజయ్యను నాగమణిని హీనముగ భావించి నిందించెను. పిమ్మట రూప

లత నిజరూపము నాతఁడు పున్నమ్మవలనఁ దెలిసికొనినాఁడు. తొలుత నెట్టివాఁడైనను రాజయ్య సమాధికడ మోకరిల్లి క్షమాభిక్ష వేఁడుకొని తుదకుఁ బాపక్షాళనము నొందుటచే మధుసూదనరావుగూడ గురుదేవుని శిష్యవర్గమునఁ జేరె ననఁ జెల్లును. ఈ రీతిగ నీ నవలయందలి ప్రధానపాత్రలన్నియు రాజయ్యయెడ భక్తిమంతములు. రూపలతయు పున్నమ్మయు దుష్టపాత్రలు. వారికిఁ బశ్చాత్తాపము లేదు; పాపక్షాళనము లేదు; గురుదేవు నాశీర్వచనమును లేదు.

ఈ నవలయం దిట్లు మరణపర్యంతము ప్రత్యక్షముగను మరణానంతరము పరోక్షముగను ప్రాముఖ్యము వహించినది రాజయ్యపాత్ర; అంతేగాక కథయం దాద్యంతముగ నుండును. ఆసాంతము నిం దాతనిని గూర్చినదియే ప్రసక్తి. ఈ కారణముచే నతఁడే యీ నవలకు నాయకుఁ డగుచున్నాఁడు.

3. జా న కి ; —

ఈమె తోఁటమాలిసింగయ్య కూఁతురు; దురదృష్టబాలిక; బాల్యమునఁ దల్లిని సంప్రాప్తనవయౌవనయై తండ్రిని గోల్పోవుటయేగాక, దారిద్ర్యదుఃఖమునకుఁగూడ నాస్పదు రాలైనది. దురదృష్టమువిషయమున నీమె కన్నివిధములచేతను రాజయ్యయే సాటి. సౌజన్యసౌకుమార్యాదిస్వభావశీలములచేగూడఁ దాను రాజయ్యనాగమణులకుఁ గల యనురాగమున కడ్డు రారాదని స్వీయసౌఖ్యవాంఛావిసర్జనపరిపూరితనిస్స్వార్థపరురాలైనది జానకి. తొలుత నిరాకరించియుఁ బిదప నీమె తన మనోజ్ఞకేశపాశమును గత్తిరించి పున్నమ్మ కిచ్చివేయుట యిట్టి విరక్తిచిత్తసమున్నతితోడనె యగును. రాజయ్య తనకేశఖండనమును విమర్శించినపుడు పేదరాలి కంత సౌందర్యమేల? యనియుఁ దనకు వివాహేచ్ఛ లేదనియు నీమె సమాధానించుటయం దీ యర్థము సువ్యక్తము.

తన గృహత్యాగానంతరవృత్తాంతమును జానకికిఁదప్ప నితరులకుఁ జెప్పవలదని రాజయ్య పెద్దిరెడ్డికిఁ కట్టడిసేయఁగ, నది యెఱిఁగి ధన్యురాల ననుకొన్నది జానకి. రాజయ్యవలెనే తానును సన్న్యసించుట కర్తవ్యమని నిశ్చయించుకొనుటనుబట్టి మనఃపరిపక్వతయందుకూడ నీమె కాతనితోఁగల తుల్యత విశదము కాఁగలదు.

విరక్తయు సంసారసౌఖ్యవిదూరయు నైన జానకి తన జీవితమును గురుసేవకు వినియోగింప సంకల్పించి రాజయ్య స్థాపించిన భాషామందిరము నాతఁడు గ్రామవిసర్జన మొనర్చినదాదిగఁ దానే సర్వబాధ్యతలు వహించి నడుపుచున్నది. ఆతఁడు తిరిగి వచ్చినపిదప తనకున్న యాస్తిని భాషామందిరమునకు దత్తమొనర్చి యాతనినే దానికి ధర్మకర్తను గావించి జానకి యోగినీదీక్షఁ గైకొనెను. పిమ్మట గురుదేవుని నియతి ననుసరించి యామె తన జీవితమును భాషామందిరసేవ కంకిత మొనర్చినది. గురుదేవుని మరణానంతర మాయన భౌతికదేహము నచ్చటనసమాధిచేయించి దానికే 'రాజమందిర'

మని పేరిడి యామె యావజ్జీవితము నిర్వహించెను. ఆమె యకుంఠితదీక్ష కిది నిదర్శ నము. విద్యార్థివిద్యార్థినుల కామె ధర్మోపదేశములు మనశ్శాంతికరములు. బాలబాలిక లకేగాక వయోజనులకుఁగూడ విద్యగఱపి వారిని జానకి విజ్ఞానసంపన్నులను జేసెడిది.

ఈమె క్షమాగుణమునకు సీమాభూమి. రాజయ్యయుఁ బెద్దిరెడ్డియు వినా యీ నవలయం దామె కుపచారముచేయనిపాత్ర లేదు. తొలుత నామె శీలమును శంకించి తుద కామె క్షమాభిక్షవేఁడనివా రిందు లేరు. ఆమె నిర్హేతుకకారుణ్యమునకుఁ బాత్రులుగానివారు లేరు. పున్నమ్మయు రూపలతయు నామె సౌశీల్యము నెఱుఁగుదురు. తన్నెఱిఁగియు దుష్ప్రచారము చేసినవారినిసైత మామె నిర్వ్యాజదాక్షిణ్యముతో మనఃపూర్వకముగ క్షమించినది. ఈ క్షమాగుణముచేతసైతము జానకి రాజయ్యతో దులఁదూఁగినది. అతఁడు గురుదేవుఁడు; ఈమె యోగినీమాత.

జానకీపాత్రచిత్రణము భారతీయాదర్శదృష్టి గలది. విశేషించి వివాహానుబంధముల విషయమునం దీ దృష్టి దృశించును. భారతీయుల వివాహము పూర్వజన్మానుశయము. భర్త యే యాశ్రమమునందున్న భార్య యా యాశ్రమమునందే యుండును. జానకీయోగినీదీక్షాస్వీకృతియందలి రహస్య మిది. ఒకనిని వీడి మఱొకనిని గూడుట భారతీయసంప్రదాయవిరుద్ధము. కావుననే రాజయ్య తన కలభ్యుఁడైనప్పుడీమె విరక్తినొందుట. ఈమె యనురాగమెంత పునీతమో యంత యాదర్శప్రాయము. స్త్రీకిఁ గన్యగా గృహిణిగా మాతగా భారతదేశములో మన్నన. కన్యాత్వమున నస్ఖలితబ్రహ్మచర్యము, గృహిణీపథమునఁ బతిసేవ, మాతృత్వమున శిశుపోషణమును నామెకుఁ బరమ ధర్మములు. ఈ దశాత్రయమునందు మఱల మాతృత్వమే ప్రశస్తము. జానకి గృహిణి కాలేదు; పతిసేవ యెఱుఁగదు; మాతకాదు; కాని, యాశాస్త్రీయమైన మాతృత్వాదరమును బొందగలిగి 'జానకీమాత' యగుటయందలి ప్రత్యేకత, యామె వ్యక్తివిశేషము.

రాజయ్య వైయక్తికమైన తన ప్రేమ విశ్వవ్యాప్తమై పరమార్థమునందు సంలగ్నమైనదని చెప్పినపలుకులు, జానకిపక్షమునఁగూడఁ బ్రత్యక్షరసత్యములు. ఈ నవలలో ప్రథమప్రకరణము జానకి కష్టదశతో బ్రారంభించి యంతిమప్రకరణ మామె యాశీస్సులతో ముగిసెను. ఇట్లాద్యంతము ప్రముఖపాత్రయై రాజయ్యపాత్రతో దుల్యమగుచున్నది, జానకీమాతపాత్ర.

ఈ నవలలో నాయకుఁడగు రాజయ్య శీలమునందలి ప్రేమకు ద్విరూపప్రవృత్తి కల్పించి, యొకదాని నాత్మికముగ[1], మఱియొకదానిని భౌతికముగ[2] నుపలక్షించినచో మొదటిదాని కాలంబము జానకియు, రెండవదానికి నాగమణియు నగుదురు. భౌతిక ప్రణయము కష్టప్రదమనియు, నాత్మికప్రణయము శాంతి పదమనియు, నట్లే భౌతిక ప్రేమ యశాశ్వతము, నాత్మికప్రేమ యనశ్వరము ననియు నీ నవలాకారుఁ డిచ్చు సందేశము.

4. రూ ప ల త:—

ఈమె రాజంపేట జమీందారిణి; తండ్రి కేకపుత్రిక; అందుచే పితృమరణా నంతరము దాయాద యైనది; చిన్నతనమునందుఁ జెన్నపురిలో జదువునపుడు మధుసూద నుఁడను నొక విద్యార్థిని వలచెను. అతఁ డీమెను బ్రేమించినాఁడు. కాని తల్లిదండ్రు లీమె కన్యథా పెండ్లిచేసిరి. ఆకోపముచే రూపలత పతికి మందుపెట్టినది. వెఱ్ఱియెత్తి యాతఁడు దేశములపాలయ్యెను.

ఇట్లు జరిగిన కొంతకాలమున కామె తండ్రియాస్తికి సర్వాధికారిణి యైనది. తల్లితో జెన్నపురి స్థిరనివాసముగా జేసికొని రైతులయొద్ద పైకమునకై యేఁటేఁట వేసవిలో రాజంపేఁట వచ్చుచుండెడిది.

ఈమె చలనచిత్రములలో నభినయించును; స్వయముగా నొక చలనచిత్ర పరి శ్రమ నెలకొల్పినది; సార్థకాభిధ; దర్శనీయ యయ్యుఁ జలనచిత్రకళాభినేత్రిగావునఁ గృత్రిమాలంకారము లన్నచో జెప్పరానంత వెఱ్ఱి. ఆమెకుఁ దలకట్టు లేదు. తా నెన్నో పన్నుగడలు పన్నగా జానకి విరక్తయై చేసినకేశదానముచే రూపలత తన సౌందర్యము నకు గణుతి ఘటించుకొనెను.

రూపలత నైజముచే దుష్టురాలు. భర్తృపరిత్యాగము, చలనచిత్రపరిశ్రమలో స్వచ్ఛందవర్తనాదులు నీమె దౌష్ట్యమునకు, స్వైరితకును దృష్టాంతీకరింపఁ దగినవి. రాజయ్య యొకప్పుడు తన శకటమునకు దారియిచ్చి గౌరవము కాపాడలేదని యాత నిపై నామె కాగ్రహము. ఆ పగ సాధించుట కీమె యొకవంక జానకికిఁ గేశఖండనము చేయించెను; వేఱొకవంక నాగమణి కుటుంబమువారికి రాజయ్యపై విరక్తిఁ గల్గించెను.

ఒక్క రాజయ్య వివాహము తప్పిపోయి సన్న్యసించుటయేగాదు; ఈ నవల లోని యుత్తమ పాత్రలు దుష్ఫలితముల నొందుట యెల్ల నీమె దుస్తంత్రఫలితము. మధుసూదనునియం దీమె తన చిన్ననాఁటి మిత్త్రుని గుర్తించి, యతనిని దనకోట కనత్య

1. Spiritually. 2. Physically.

కల్పనచే రప్పించుకొని. నాగమణి కాఁపురము పాడుచేయుట, యవినీతికిని స్వార్థ పరతకును బరకోట.

ఈమెకుఁ బ్రేమకుఁ జాలదూరము. జానకికి రాజయ్యయందుఁ బూజ్యభావమని యీమె యెఱుఁగును; కాని మధుసూదనునకు వారిపై ననుమానము గలిగించి, యప కారము చేయ నెంచినది. తన ద్యూతక్రీడాసక్తికిని మధుపానసక్తికిని విముఖుఁడైన హేతువుచే మధుసూదనునే వెడలిపొమ్మనెను.

ఇన్ని దుర్గుణములకుఁ గూటమియైన యీమెయందు బుద్ధిపటుత్వమను గుణ మొకటి యగపడుచున్నది. ఆ నంత దుష్టురాలయ్యు, జానకిరాజయ్యలకుఁగల పవిత్ర ప్రేమనుగుఱించి ముచ్చటించుటకుఁగూడ మధుసూదనున కధికారములేదని పలికి, సజ్జనుల సౌజన్యము గ్రహింపఁగల శక్తిని బ్రకటించినది, రూపలత. తాను జేయునవి మహాపాపములని తెలిసియు నామె ధైర్యముతో వానిని జేయ దొరకొనెను. స్వభా వతః దుష్టురాలగుటయే యిట్టి ప్రవర్తనకుఁ గారణము. ఈమె కిష్టభృత్యురాలు పున్నమ్మ చివర కామెసైతమీమె ప్రవర్తనము నొప్పుకొనదు.

ఎవ్వఁడో యసంతుష్టుఁడైన ప్రియుఁ డీమెను దుపాకితో గాల్చి చంపినాఁడు. తన పాపములకుఁ బశ్చాత్తాపముగాని, ప్రాయశ్చిత్తముగాని లేక రూపలత యిట్లు మరణించుటయే యుచితము. పున్నమ్మ యట్లుగాదు. పశ్చాత్తప్తయై దండనము నొంది పాపనాశనము చేసికొన్నది. ఆకస్మికహత్యవలన నిట్టి యవకాశములు రూప లతకు లభింపకపోవుట యనునది కవిసాధించిన కావ్యధర్మము. దుర్మార్గురాండ్రలో నొకరి కొక దండనము, వేఱొకరి కింకొక దండనము, విధింపఁబడుటయందలి యౌచితి పరిశీలనార్హము. స్వార్థచింతయు, స్వశరీరసుఖానుభూతియు రూపలత పాపాచరణ మునకు హేతువులు. యజమానురాలికి మనఃప్రీతిగూర్చుట యను సేవాధర్మమును కౌటుంబభర్యమును బున్నమ్మ చేసినపాపములకుఁ గారణములు. పాపాచరణముల యందుఁగల యంతరమును ఫలానుభవమును విధించు విషయములోసైతము నవలా కర్త పాటించుట కీ లెఱిఁగి వ్రాతపెట్టుట.

సంఘచిత్రణము :—

ఈ నవలలో దాత్కాలిక సాంఘిక పరిస్థితులు ప్రతిబింబించినవి. ఈ శతాబ్ది పూర్వపాదమునందలి యాంధ్రసంఘ మిం దభివర్ణితము. అవి గాంధిమహాత్ముని యుద్యమము వ్యాపించిన దినములు. నాగమణి స్నేహితురాలు ఖద్దరు ధరించు

వారిపై విసరినవిసరు లీ శతాబ్దిలో రెండవపది ప్రాంతమున్నాఁటివి 1. అప్పటికి నాగమణి వయ స్సిరువదియేండ్లు 2. రాజయ్య వయ స్సిరువదియైదేండ్లు. అనఁగా నిందలి నాయికానాయకు లిరువదియవ శతాబ్ద్యారంభమున జన్మించినవారు. రాజయ్య పులిచేఁబడి మరణింపఁగా రూపలత హత్యగావింపఁబడఁగా మిగిలిన పాత్ర లన్నియు నేఁటికిఁగూడ సజీవములై యుండఁదగినవి. కథ కేవలము కల్పితము గానిచో సజీవవ్యక్తు లను పాఠకులు మన సంఘములో వెదకిపట్టుకొనఁదగిన పరిస్థితి.

ఉద్యానపాలనము, దారువ్యాపారము, చలనచిత్ర వైద్యవృత్తులు భూస్వామ్యములో కర్షకులజీవితము మున్నగునవి 'నాగరాజు'నందు వర్ణింపఁబడినవిషయములు వీనియం దన్నిటికంటె తోఁటలపెంపకము నవలాకర్త కెక్కువ యిష్టము. తక్కిన వృత్తుల నవలంబించినవారైహికాముష్మికములకుఁ జెడిరి. తోఁటమాలి సింగయ్య కొమార్తయైన జానకి యైహికము నుజ్జగించి యాముష్మికచింతలో దాను దరించి యొరులఁ దరింపఁజేయుట యిందులకు సాక్షీభూతము. వ్యాపారము స్వార్థచింతకు బంధుద్రోహమునకును గారణమగు ననుటకు మంగపతిరావు తార్కాణ. వైద్యవృత్తి యవినీతికి దగ్గఱమార్గ మనుటకు మధుసూదనరావు సజీవోదాహరణము. చలనచిత్రపరిశ్రమ పాశవికతకు దారితీయు ననుటకు రూపలతాదేవి నిదర్శనము. ఈ రీతిగఁ బ్రత్యక్షప్రమాణములఁజూపి నేఁటి కొన్ని ప్రధానవృత్తులను నవలాకర్త విమర్శించినాఁడు.

సందేశము :—

ఆంధ్రుఁడైన ప్రతివ్యక్తికి నాంధ్రత్వాభిమాన ముండవలెను. కట్టులో బొట్టులో మాటలో మంతిలో దెలుఁగుఁదనము తొనికిసలాడవలెను. భాషలో, వేషములో, భావనలో రాజయ్య నట్లుసృష్టించి, నవలాకారుఁడు తన యాదర్శమును సందేశమును బఠితల కందఁజేసినాఁడు. ఆంగ్లవిద్యయందు ముక్కాకలుదేరిన నాగమణీమధుసూదన రావులకు రాజయ్య సలిపిన గంభీరోపన్యాసము లిందులకు దృష్టాంతములు. ఈయవ యుపన్యాససారము, పాశ్చాత్యనాగరకతావ్యామోహితులై, భారతీయదర్శనపథ మలవడని మన జాతిస్త్రీపురుషు లెల్లరకునుగూడ నవలాకర్తయిచ్చు సందేశమని, నిదర్శించిన వారికి దోఁచును. స్వస్థానవేషభాషాభిమానమే యీ సందేశసారము.

విద్యావ్యాప్తి గ్రామోద్ధరణమునకుఁ బ్రధానసాధన మని నవలాకర్త ప్రబోధను. ఆయన యుద్దేశించిన విద్య స్త్రీపురుషుల శీలములను బెంపొందించుచున్నది; వ్యక్తిస్వాతంత్ర్యమును గాపాడునది; చిన్నచిన్న చేతిపనులను నేర్పి జీవనోపాధి కుదు

1. " ఈ రోజులలో– చదువుసంధ్యలు లేకపోయినా– అద్దరుకట్టినవా రంతా పెద్దమనుష్యులే" ('నాగరాజు'-పుట 17.) 2. Ibid, Page 9- 3. Ibid, Page 12.

ర్పఁగలది. ఇట్టి వానివ్యాప్తికై యిందలి భాషామందిరము కృషిచేసెను. మొదట రాజయ్యయుఁ జానకియు దీనిని నిర్వహించిరి.

మనదేశమున కాంగ్లవిద్య కూడదని యీ నవలాకారుని యుద్దేశము. దాని నభ్యసించిన నాగమణీరూపలతామధుసూదనులు తాము చెడినదేగాక వనమెల్లఁ జెఱచిరి. జాతీయదృష్టిగలిగి శీలసంపదను బెంపొందించు 'వార్థావిద్యావిధానము'వంటి దొకటి మన కావశ్యకమని యీ రచయిత యభిప్రాయము. ఇందలి విద్యామందిర మట్టిదానికే ప్రత్యక్షనిదర్శన మనఁజెల్లును.

భారతీయనారికి గృహమే స్వర్గము; ఆ స్వర్గమును జక్కఁదిద్దుకొనుటయే తరుణోపాయము; పుట్టినింటిని మెట్టినింటిని సంతోషపెట్టుటయే జీవిత పరమార్థము. ఈ పరమార్థసిద్ధికొఱకే యామె ప్రయత్నింపఁదగును. భర్త తన్ను ప్రేమింపకపోయినను భార్య చలింపరాదు; మలినము కారాదు; ఆమెకు భర్తృత్యాగము కూడదు; చేతనైనంతవఱ కామె తన పతిని మంచిత్రోవలో బెట్టనగును.

పురుషులు స్త్రీలపై సర్వాధికారములు చెలాయించుచున్నారు. యువతులను గూర్చిన లఘుభావమే పురుషుల పతనమునకు మూలకారణము. భారతమహిళల చరిత్రయు శీలపవిత్రతయు నతులితములు. మన కీర్తిసౌధమునకు నారీలోకమే పునాది.

ఇట్టి యుత్తమభావసంపుటీకరణమగు నీ నవల కేవలము వినోదమునకేగాక విజ్ఞానకర్తవ్యబోధలకుఁగూడ సమర్థము. నాగమణిపేరును రాజయ్యపేరును మేళవించి యీ నవలకు 'నాగరాజ'ని పేరిడుటయు నుచితముగ నున్నది. పాశ్చాత్య సంస్కారముపైఁ బ్రాచ్యసంస్కారమును దాంభికతపై నిర్దాంభికతయు నీర్ష్యాద్వేషములపై శాంత్యహింసలును సాధించిన విజయమే యీ నవల.

**పరిస్థితిజన్యవిషాదాంతనవల 1 :—**

ఈ నవల యొక విషాదవృత్తము. ఈ విషాదాంతనవలకు నాయకుఁడు రాజయ్య. ఇతఁడు సములలో నున్నతుఁడు; ఉదారవ్యక్తి; రసస్వరూపుఁడు; శీలసంపన్నుఁడు. ఈతనియం దొక్క దోషమేని లేదు. అనఁగా, దోషములేకపోవుటయే యొక దోషమై విషాదాంతపరిస్థితికి దారితీసెను. కావున నీ నవలలోని విషాదాంతపరిణామమును శీలజన్యము; పరిస్థితిజన్యము ననుట లగ్గు. రూపలతాదేవి దుస్తంత్రము, పున్నమ్మ దురాలోచనమును నవల నింతవఱకుఁ దెచ్చినవి. మంగపతిరావు నవిచారితవర్తనము, నాగమణి యస్థిరస్వభావమును దీనికిఁగొంతవఱకు హేతువులు. ఆదినుండియు మంగమ్మ

1. A Novel resulting in Tragedy.

చూపునట్టి ప్రాతికూల్యముకూడ నిందలి దుష్ఫలమునకుఁ గారణము. ఉత్తములు, యోగ్యులునైన వ్యక్తులు పరిస్థితి పరాధీనులై తమ జీవితపుష్పములను వాడఁజేసి కొనినగాథ యీ నవలయందు రసవంతముగఁ జిత్రింపఁబడెను.

గద్యకథావాఙ్మయమునకు శీలప్రధాననవల [1] యొకశాఖ. ఇందలి పాత్రలు నవలాపదకమునం దంతర్భూతములుగ భావితములు గావు. వాని కొక స్వతంత్ర మైన యునికి యుండును. అట్టి శీలప్రధాననవలలో గార్యము పాత్రల కధీనము.

కార్యప్రధాననవలల [2] యం దట్లుకాదు. ప్రత్యేకమైన సంఘటనలు నిర్దిష్టప్రయోజనములు గలవి. శీలప్రధానములయం దన్ననో సన్నివేశములు ప్రత్యేకములైగాని సాధారణములైగాని యుండి పాత్రలశీలములనుగూర్చి చెప్పుటకై ముఖ్యముగ నుద్దేశింపబడును; లేదానూతనపాత్రలఁ బ్రవేశపెట్టునవై నెగడును. అనఁగా గార్యప్రధానములలో సంఘటనలకును శీలప్రధానములలో బాత్రలశీలములవెల్లడించు సన్నివేశములకును బ్రాముఖ్యము. సన్నివేశము లిట్టివై నంతవఱకు ప్రాయోభావమునకు భంగమురాని సంఘటన లెవియైన జరుగఁగలవు. కథ సాగుచున్నకొలఁదియు నవలాకర్త పదకము వన్నుకొనుచుఁబోవచ్చును. ఇట్టి నవలలయందుఁ గార్యము, పాత్రల యాంతరమైన యభివృద్ధినుండిగాని తాత్త్వికమైన పరిణామమునుండిగాని యావిర్భవింప నక్కఱలేదు. పదక మావిష్కరింపఁబడునపుడు పాత్రలయం దెట్టి నవ్యగుణముగాని మనకుఁ జూపఁబడను నక్కఱలేదు. పదకము పాత్రల భిన్నభిన్నగుణములఁ బ్రదర్శించినచో నంతియే చాలును. ఆ గుణము లాదినుండియు నా పాత్రలకుఁగల గుణప్రదర్శనమునకుఁ నిర్దేశింపఁబడినట్టివిగా మాత్రమేయుండుటకు హేతు వాయా పాత్ర లచంచలములై పరిణామశూన్యము లగుటయే. చిరపరిచితమయ్యు నొకానొకదృశ్యము, వెలుఁగునీడల ప్రసరణమువలనఁగలుగు ప్రత్యేకఫలముచే మాఱిపోయినట్లగపడి చూపఱ నెడనెడఁ జకితులనొనర్చురీతిగ, నీ పాత్రలునైతము మనలఁ జకితుల నొనర్పఁగలవు.

ఈ 'నాగరాజు'నందు శిష్టపాత్రలలో జానకిరాజయ్యలవంటివారును, దుష్టపాత్రలలో రూపలతవంటివారును నంతగా మార్పుఁజెందరు. శిష్టపాత్రలలో నాగమణియు దుష్టులలో మధుసూదనరావును బొందు పరివర్తనము గమనార్హము. మార్పునకు లోనుగానిపాత్రలు తమ దౌర్బల్యములను దాంభికత్వములను సౌజన్య సౌమనస్యములను మొదటి నుండి తుదివఱకుఁ బ్రకటించుచునే యుండును. యథార్థమునకు మున్నుఁజెప్పఁబడినట్టివారిలో బరివర్తనఁజెందునది వారినిగుఱించిన మన జ్ఞానమేగాని వారి స్వభావముగాదు.

1. Novel of Character. 2. Novel of Action.

'నాగరాజు'నందు జానకీరూపలతలును రాజయ్యయుఁ బరివర్తనరాహిత్యమునకు ప్రసిద్ధిఁగన్నవారు; అనఁగా దొంటినుండియు మంచికిఁగాని చెడ్డకుఁగాని వీరు పరిపూర్ణ ప్రకృతులు. ఇందు మూలముననే యీ నవలను శీలప్రధానమనుట. ఈ పరివర్తనరహితత్వము నొకదోషముగ వగచుటయుఁగలదు. ఏలన, నీ గుణముచే నివి యయథార్థ్యములుగఁ దోఁచి సజీవముల ట్లగపడకపోవుట యని విమర్శకులు వాదింతురు. శీలప్రధాన నవలలలో నట్టివి పెక్కుఁబాత్ర లుండుటనుబట్టియే వానికిఁగలస్థానము, కర్తవ్యమును, విశదపడఁగలవు. వాని పరిపూర్ణత్వ మొకదోషముకాదని నిరూపించుటకు ముందుగ నేల నిట్టిపాత్ర లుండరాదని మనము ప్రశ్నించుకొనినచో మొదటఁదోఁచునది విమర్శకుల యభిరుచి నేఁడు పరివర్తనముగల పాత్రలయం దభిమానము చూపుచున్నదికనుక నని సమాధానము. జీవితమునుగూర్చి యొకానొకదర్శనమునే యిప్పింపనెంచు శీలప్రధాననవలాకర్తల కిట్టి పరిపూర్ణప్రకృతులైన పాత్ర లేకైకసాధనములనియు త్తరోత్తర నిరూపింపఁబడ గలదు.

ఇట్టి పాత్రలను బెట్టుకొని నవలాకర్త కథాపదకము నెట్లు నిర్వహించునో మాత్ర మిప్పుడు పరిశీలింపఁ బడును. స్వయముగ సంపూర్ణములగుటచే రచయిత కీ పాత్రలను బోషించుట యను శ్రమ యుండదు. అవి యిటునటు కదలియాడు పాత్రలుగాని, కార్యము నిర్వహించునవి కావు. నవలాకారు లెన్ని తెఱఁగులుగ వీనిని సృజింపఁగలరో యన్ని తెఱఁగులుగ నిట్టి పాత్ర లుద్భవించుచున్నవి. సంపూర్ణపాత్రలయందు వైవిధ్యముచూపుట యనఁగా, గథాసంవిధానమును సాధ్యమైనంతవఱకు వదులుగ నుంచుట. అట్లని యొక్క దృఢబంధరాహిత్యమేకాదు; నాటకీయముగ నవల ముగియవలె ననునట్టి నియమముకూడ రచయితను నిర్బంధింపరాదు. క్రియాప్రధానములగు నవలలలో బదకమున కనుకూలించురీతిగఁ బాత్రలు సృజింపఁబడునట్లే శీలప్రధానములగు నవలలలో బాత్రల గుణశీలముల విశదీకరణమున కనుకూలించురీతిగమాత్రమే కథాపదకము పన్నఁబడును. మొదటిదానియందు కథాసంవిధానము నిర్ణీయమానము; పాత్రలు నిర్ణీయమానములు గావు. రెండవదానియందు పాత్రలశీలములు నిర్ణీయమానములు; సన్నివేశములు నిర్ణీయమానములు గావు.

రెండు తెఱఁగులుగ నవలల నిట్లు విభజించుట యనుష్ఠానమునందుకంటె సిద్ధాంతమునందు సులభము. ఒక్కొక్కప్పుడు విజయము సాధించినవని చెప్పఁదగు కొన్ని పాత్రలు కథలలోని ప్రధానకార్యముతో సంబంధములేక స్వతంత్రములై యుండును. ఆపాత్రల ప్రవర్తనాదికము ప్రయోజనకరమై యుండుటకంటెఁ బ్రత్యేకమైయుండుట గమనార్హము. అట్టి కథ లటు కార్యప్రధాన నవలలకుఁ గొంతయు, నిటు శీలప్రధాననవలలకుఁ గొంతయు సంబంధించియుండఁగలవు. ఇవి యుభయతారకములు. వీనిది మధ్యేమార్గము. చదువరుల కివి యుపకారకముగ నుండును. యథార్థమనిపించు

భ్రాంతి, యాసక్తిప్రేరకత్వము, పునఃప్రతిశ్రుతముచేయు నుపసంహారమువంటి లక్షణము లన్నియు నిందుండఁగలవు. కొంత సత్యాధారణముకూడ వీనిలో నుండును. దుశ్శీలరతుల సాహసోపేతకార్యాచరణము నాధారముగాఁగల్గి యిట్టివి నవలా వాఙ్మయమునం దొక ప్రత్యేకశాఖగా విలసిల్లినవి 1.

పఠనకౌతుకముఁగొలుపు ప్రత్యేకగుణముచే నిట్టి నవలలు విశిష్టములు. వైవిధ్యముతోఁగూడిన తాత్కాలికసంఘచిత్రణమే యిట్టివాని ప్రధానోద్దేశము. శీలచిత్రణము వీని యాశయము కాదు.

ఇట్లే మఱలఁ గార్యప్రధానశీలప్రధాననవలల కాశయమునందుఁగూడ నిదే భేదమున్నది. మొదటివాని ముఖ్యోద్దేశము సంఘజీవనవిశదచిత్రణము; రెండవవానిది పాత్రల శీలావిష్కరణముతోఁగూడిన సంఘచిత్రణము. ఈ వ్యత్యాసముమూలముననే 'నాగరాజు'ను శీలప్రధాననవల యనుట. కార్యప్రధాననవలయందువలె యోగ్యులు నుత్తములు నగువ్యక్తులు పరిస్థితిపరాధీనత్వక్లిష్టులై తమ తమ వాంఛాలతాంతలుంచన క్రియాక్లిష్టులైన వృత్తాంతము రసవత్తరముగ, విషాదాంతముగ నిం దభివర్ణితముగాకపోలేదు. అయ్యును నాశయమునందు భేద మున్నది. కేవలము సంఘచిత్రణమనుటకంటె శీలావిష్కరణపురస్కారకమగు సాంఘికపరిస్థితిచిత్రణమే యీ నవలా కర్తకుఁగల యాశయ మనుట యుచితము.



## —: తెలుఁగు వీరుఁడు 1 :—

### (సదాశివరెడ్డి)

ఇది డా॥ బిరుదురాజు రామరాజు(గారి) చారిత్రక నవలిక. తొలుతనుండియుఁ దెలుఁగుదేశము వీరభూమి. తెలుఁగుతల్లి తన చలువచేతులతో వీరమూర్తుల కెందఱకో పురుడుపోసినది. అవక్రపరాక్రములగు ధారుణీపతులు, నీ తెలుఁగుమాగాణమునఁ బ్రభవించి తమ దేశమునకుఁ దమ జాతికిఁ దమ భాషకును గర్వకారణులైరి.

ఈ నవలలోని నాయికానాయకులుగూడఁ బైవారినిఁ దలఁపింతురు. మెతుకు సంస్థానాధీశ్వరుఁడగు సదాశివరెడ్డియు నాతని సహధర్మచారిణియగు పార్వతమ్మయుఁ దెలుఁగాణెమున జన్మించిన వీరమూర్తులు; మాతృదేశవిముక్తికై తురుష్కులతో బోరి యసువుల నర్పించిన త్యాగధనులు. ఆనాఁటివారి స్వాతంత్ర్యసమరము నేఁటికి సఫ

---

1. Picaresque Novel is a class in fiction.
1. క్రీ. శ. 1952 ప్రచురణము.

లమై తెలుఁగునేలపై శాంతి యవతరించినది. తెలుఁగు లందఱేకమైరి. దేశవిముక్తికై తన సర్వస్వము ధారవోసిన సదాశివుని చరిత్ర రచించుటయందలి రచయితయొక్క యుద్దేశము చాలవఱకు సఫలమైనది. మఱి యది యొసఁగు సందేశమునకుఁ గాలావధి యని యుండదు. ఇది వీరులు, దేశభక్తులు, ననువా రుండునంతకాలము నుండు గాథ.

అవి భారతావనిని ఫిరోజిషా చక్రవర్తి పరిపాలించెడి దినములు. రైతు రామిరెడ్డి రామానేయుఁడగుటతో నారంభించిన యీ నవల నాయకుఁడగు సదాశివరెడ్డి యుద్భవించు పర్యంతము పది పండ్రెడు పురుషాంతరముల చరిత్రను వర్ణించినది. దీనిని నవల యనుటకంటెఁ జరిత్రయనుటయే యుచితము. సంఘటనములు, సన్నివేశములు. కల్పితములయ్యు సత్యములవలె నుండుట యిం దుద్దేశింపఁబడలేదు. అన్నియు సంపూర్ణ సత్యములు. దానితో నీ నవలిక చరిత్రకుఁ బ్రమాణీకరింపఁ బాత్రమైనది. పాత్రలు సన్నివేశ సముద్భూతము లైనవి కావు.

చాల నుచ్ఛ్రియపతనములలో గూడిన సదాశివరెడ్డి జీవితవీరగాథ చారిత్రకాధారము 1 లున్నంతవఱకుఁ దొంబదివంతులు చరిత్రకాఁగా, మిగిలిన కొలఁదిపాటి కల్పనయందును వాస్తవికత్వభ్రాంతికొఱకై 2 యించుక యవధానతఁ జూపియున్నచో బాగుగ నుండెడిది.

నిర్బంధ మందున్న పార్వతీసదాశివుల దుర్భరజీవితగాథ వా రగ్నిప్రవేశమొనర్చుటతో బరిసమాప్తి నొందియుండినయెడల నుదాత్తతకును దానవీరమునకును బ్రమాణింపఁదగును. తన తండ్రిని జంపినఁ పగదీర్చుకొనుటకై సిద్ధిబిలాలుఁడు మహోశూరునివలె వచ్చి నిగళబద్ధుఁడైన సదాశివుని తలకోసినాఁడు. ప్రాణనాధుని శిరము తెగిపడుటతో శృంఖలాబద్ధయగు పార్వతి కాళికవలె శాత్రవునికంఠము నులిమివేసినది. అతఁడు బాకుతో నామె వక్షమునఁ బొడిచెను3. ఆమె ప్రాణనాథుని ఖండితమస్తకమును కౌఁగిలించుకొని ప్రాణమును వీడినది. కథాంత మెంతయు బీభత్స పోషకము.

---

1. 'మెదకుసంస్థానచరిత్ర', 'ఖుర్షీద్‌జాహీ', 'హైందవధర్మవీరులు', 'Our faithful ally, the Nizam' వంటివి.

2. "మీరాలం స్వయముగా పార్వతిపైఁబడి ఈటెతో పొడిచెను. కాని పార్వతి లఘువుగా తప్పించుకొని గుఱ్ఱమును వెనుకకాళ్ళపైలేపి ఎగిరి మీరాలం మంత్రి బొచ్చపై చిన్నప్పటి దొండాకుపసరు పరునట్లు తన్నెను." ('తెలుఁగువీరుఁడు',) పుట 112—పంక్తులు 18—21 (1952).

3. 'తెలుగువీరుఁడు'— పుటలు 116, 117. (1952).

అన్నిటిని మించి యీ నవలికలో జెప్పఁదగినది యిందలి శైలి; ముఖపత్రముపై నున్నట్లుగ నీ నవల యున్నతవర్గములవారికై యుద్దేశింపఁబడెను. ఇందలి నుడికారము సొంపు, జాతీయములయింపును మెచ్చఁదగినవి. "తెలంగాణపు వీరగడ్డ1 వృద్ధాప్యము2," వంటివి కేవల మనవధానతవలన వాటిల్లిన ప్రమాదములు.

---

## తంజావూరు పతనము[3]

దీని రచయిత్రి కుమారి మల్లాది వసుంధర. ఇది యామె తొలిరచన; ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారిచే బహుమాన మందుకొన్నది: ఎంత చారిత్రకమో యంత కల్పితము. కల్పితాంశములే కథాసంవిధానమున కెక్కుడు తోడ్పడినవి. వానిలో ముఖ్యమైనది రంగాజమ్మ జన్మరహస్యసంగతి. చారిత్రకాంశములు తాత్కాలిక మత సాంఘికరాజకీయపరిస్థితుల నవగాహన చేసికొనుట కధికముగ సాహాయ్యపడును. మొత్తముమీఁద విజయరాఘవుని పతనమును తంజాపురీపతనమును వర్ణించుటయే యీ నవలకు లక్ష్యము. వెంకన్న వంటివారు ప్రత్యక్షముగను, భార్యాపుత్త్రిలు, సోమయాజులు వంటివారు పరోక్షముగను సాధకములుకాఁగా విజయరాఘవనాయకుఁడు, స్వయంకృతదోషానలదగ్ధుఁడు, ప్రతీకారవాంఛారతుఁడు, రాజనీతిదూరుఁడు. మూర్ఖుఁడునై యాత్మనాశనముతోబాటు రాజ్యనాశనమునకును గారణభూతుఁడైనట్లుఁ జిత్రించుటయే యీ నవలకుఁ బరమోద్దేశము.

**౧. విజయరాఘవనాయకుఁడు :—**

ఇతఁడు తంజావూరు నేలిన శ్రీ రఘునాథరాయల[4] పుత్త్రుఁడు; కవిపోషకుఁడు; కళారాధకుఁడు; కర్మానుష్ఠానపరుఁడు; కాని కాలక్రమమున నీతని కళారాధనపరత్వము కామారాధనముగమాఱి సోదరీసంగమలోలత్వపాపినిఁజేసి, తంజావూరు పతనమునకుఁ గతముఁ గల్పించెను.

---

1. Ibid P. 113 (1952). 2. Id P. 114 (1952).

3. రచన క్రి. శ. 1952. చరిత్రవిషయకమైన నవలల పోటీలో 1952 రచనలయం దాంధ్రవిశ్వకలాపరిషత్తువారి బహుమతిపొందిన గ్రంథము. ప్రవేశపరీక్షల కాంధ్రవిశ్వకలాపరిషత్తునం దుపవాచకముగఁ బఠితము.

4. రఘునాథరాయలు' అను పేరిఁట సీరాజుచరిత్రను నవలగా డా॥ కాకర్లవేంకటరామనరసింహము(గారు) క్రీ.శ. 1951నాఁటికే రచించిరి. వారిది తంజాపురమును జూచి యందు నివసించి చేసినరచనము.

సూర్యోదయాత్పూర్వమే నిద్ర మేల్కాంచి, కాల్యములఁదీర్చుకొని యాదిత్య హృదయము, నష్టోత్తరీమంత్రము జపించి, భాగవతరామాయణములనుండి కొన్ని భాగములువిని, దానధర్మము లొనరించి బ్రాహ్మణ్యమును జందనతాంబూలాదుల గౌర వించి, సభఁదీర్చి, కవిపండితగాయకగోష్ఠివినోదములఁ బ్రొద్దుపుచ్చి, భుజించుట విజ యరాఘవునకు నిత్యకృత్యము. 'రాజగోపాలవిలాస'కారుఁడు కాళకవియు 'మన్నారుదాసవిలాస'కర్త్రి రంగాజమ్మయు నీ మహారాజు నాస్థానిలో బ్రసిద్ధి గల వారు.

విజయరాఘవనాయకుఁడు బహుపత్నీకుఁడు. ఆయన కష్టమహిషులు. రాజ గోపాలాంబిక వారిలో బట్టఁపుదేవి. ధీరాంబికా జ్ఞానాంబికలు తరువాతఁ బ్రసిద్ధలు. బహుపత్నీత్వదోషము రాజునకు నాశకారణమైనది. ఇందఱు భార్య లుండుటవలన నెవర్తుకనుగాని రాజు సరిగా జూడఁజాలకపోయెను. అందుచే నొకరిరువురకుఁదక్క నందఱకు రాజన్నచో గోపమే. రంగాజమ్మయం దనురక్తుఁడై రాణిని సరిగఁ జూడక పోవుటచేత రాజునకేగాక రాజ్యమునకును ముప్పు తప్పలేదు.

ఈతని కళాప్రియత్వమును లోకువగా జేసికొని చంద్రరేఖ నీతని యాస్థాని యం దుంచుట కేర్పాటుచేసి వెంకన్న, విజయరాఘవుని కొలువులో బ్రవేశించి కుట్రలు పన్ని తుదకు రాజ్యనాశనమునకుఁ గారణభూతుఁ డయ్యెను. చంద్రరేఖపైఁ గల వ్యామోహముచేతనే రాఘవుఁడు మిత్త్రులగు మధుర చెంజి నాయకులకు ద్రోహముచేసి తాను రంగరాయలతో జెలిమికారము పాటించి యుద్ధమధ్యమునఁ దన మిత్త్రిద్రోహమును బ్రదర్శించినాఁడు. నాఁటినుండి మధురనాయకున కీతఁడన్నచో మిక్కిలి యక్కసు. ఇది క్రమక్రమముగ రగిలి చొక్కనాయకుని కాలమున మధుర తంజాపురనాయకుల క్రూరమరణమునకుఁ గారణమైనది.

విజయరాఘవనాయకుఁడు స్వతంత్రాలోచనఁగాని వివేకముగాని లేనివాఁడు. వెంకన్నమాటలు నమ్మి కన్నకొడుకును బంధించుట, రంగాజమ్మ యెంతచెప్పినను వినక రాణితో ననావశ్యకముగ విరోధము పెంచుకొనుట మొదలైన విందులకు దృష్టాంతములు.

ఇతఁడు దానశీలియే గాని యా దాన మెక్కువగ స్త్రీలకు నట్టువరాండ్రకుఁ బోయెను. కోనేటి దీక్షితులవంటి క్షుద్రులను నమ్మి యాతఁడు పెద్దిదాసువంటి మహా భక్తులను జెడనాడుకొని పరాభవించి, తత్ప్రతికృతముగఁ దుదకుఁ దానే నశించి నాఁడు. ఎత్తువారిచంకబిడ్డయై తా నింతచేసినమాట నిజము. కాని ఫలిత మాతనినే కట్టికుడిపినది.

బ్రాహ్మణసంతర్పణములుచేయుట, యొకప్పు డందులకు వంటచెఱకు లోపిం పఁగా. నొక భవనమును బడఁగొట్టించి వాసములను లాగించి వంటచెఱకుగా నుపయో

గించుట, యమ్మవారి ముక్కరపోఁగా బంగ్రెండుముక్కరలు చేయించి సగౌరవ ముగ దేవికిఁబంపించుట, మున్నగునవి విజయరాఘవనాయకుని బ్రాహ్మణదేవతా భక్తులను దెల్పును. కాని యాతఁ డొక్కొక్క విషయమున వివేకమును గోల్పోవు టయుఁ గలదు. పెద్దిదాసునెడ నీతని ప్రవర్తనమే యీ విషయమును ధృవపఱచు చున్నది. వానలో దడిసిముద్దయైన రాజునకు గుబురుగానున్న చెట్టుక్రింద నిలిచిన గొల్లవాఁడు, తన స్థానమిచ్చి తాను వానలో నిలఁబడిన కారణమున రా జాతని కొక గ్రామ మిచ్చుట కృతజ్ఞతకు నిదర్శనము.

దుర్మార్గుల మాటలు వినుటయేగాక, విజయరాఘవుఁడు మంకుపట్టును గల వాఁడు. మన్నారుదాసు, పెద్దిదాసులనుగూర్చి వెంకన్న నూరిపోసిన దురాలోచనము తలకెక్కి రాజు వారిపేరు విన్నంతనే మండిపడును; పట్టమహిషివచ్చి వాకిట నిలచి నను బలుకరింపక తృణీకరించును. ఎదిరివా రెంతటివారైనను నిట్టి పరాభవమునకు గుఱిచేయు దుస్స్వభావమే యీతని పతనమునకుఁ బ్రధానహేతువు.

విజయరాఘవనాయకుఁడు తుద కొక భీరువుగ మాఱెను. రాణి స్వతంత్రించి యన్ని కార్యములు చేయుచు రంగాజమ్మ యనుభవించుచున్న గ్రామములను వశపఱచుకొన్నను నీతఁ డామె నేమియు ననలేకపోయినాఁడు.

ఈతనికిఁ బ్రతీకారవాంఛయు మిక్కుటము. తన్నుఁగాదని యన్నిపనులు చేయు చున్న రాణిపైఁ గసికొలఁది యీతఁ డామె కసూయాస్థానమగు రంగాజమ్మకుఁ గనకాభిషేకము చేసినాఁడు; పదియూళ్ళు వ్రాసియిచ్చినాఁడు; అంతటితో నూఱ కుండ లేదు. పెద్దిదాసునకుఁ బరాభవ మనుకొని గాడిదకుఁ బంగనామము లిడి, పెద్ది దాసు తోఁటయందుఁ జిఱుతలతో నూరేగించినాఁడు. ఇందువలన రాణి కాత్మగౌరవ హానియని రాజు తలపోఁత.

రంగాజమ్మ తనకు సహోదరి యని తెలిసినది మొదలు రాఘవుఁడు పడినపరి తాప మింతింత యనరానిది. దీనివలన నాతని పాపభీతియు, పశ్చాత్తాపబుద్ధియు విదిత మగుచున్నవి. తిరునాళ్ళలో నొకరాత్రి యంధకారమునం దెవ్వరో సోదరీసోదరులు తాము పరస్పర మెఱుఁగకచేసిన చీకటితప్పును వెలుఁగులో దెలిసికొని, దానికిఁ దగిన దండన విధింపుమని ప్రభువుదగ్గఱకు రాఁగా, ధర్మశాస్త్రవేత్త లట్టిదానికి నాత్మ హత్యయే దండనమని నిర్ణయించినపుడు, విజయరాఘవుని దుఃఖభారము వర్ణనాతీత మయ్యెను.

ఇన్ని కలవరములు తన్ను జుట్టుముట్టినవి; అయినను అచ్యుతాంబను భార్యగా నిమ్మని చొక్కనాథుఁడు వార్తనంపినపు డామాట వినక రాజు తన యాభిజాత్య గౌరవమును బ్రకటించుట కష్టసహిష్ణుతకుఁ బరాకాష్ఠ. మొత్తముమీఁద విజయరాఘ

వునియందుఁ గొన్ని సద్గుణము లున్నవి. దుర్గుణములలో నెల్ల ప్రధానభూతమైన బహుపత్నీకత్వముచే దనతోబాటు తంజాపురీరాజ్యమునుగూడఁ జేచేతుల నశింపఁజేసి కొనిన పరమమూర్ఖుఁడు విజయరాఘవుఁడు.

౨. మన్నారుదాసు :-

ఇతఁడు విజయరాఘవునకు రాజగోపాలాంబికయందుఁ గలిగిన కుమారుఁడు. యువరాజు; సుగుణవంతుఁడు; సౌమ్యుఁడు. ఈతని మంచితన మపాయము తెచ్చి పెట్టుకొను నంతటిది. తండ్రియందైననుసరే లోపమున్నచోదానిని సహింపలేకపోవుట యీతనిలోని ముఖ్యలక్షణము. ఈతఁడు మంచి యాస్తికుఁడు; నిష్కళంక హృదయుఁడు; దైవభక్తియు సర్వజనవిశ్వాసమునుగలవాఁడు.

మన్నారుదాసు పెద్దిదాసున కంతేవాసి. పెద్దిదాసన్న నీతనికి మహాగౌరవము. తండ్రియగు మహారాజువిషయమును సునిశితముగ విమర్శించుటయే యీతని పాత్ర లోని కీలకము. 'మహారాజు తమ వయస్సునఁ జేయరాని కార్యము లొనర్చు చున్నారు. రంగాజమ్మ నగరప్రవేశమే యీ దుఃస్థితి కంతకుఁ గారణము; మహారాజు తా మొనర్చిన ఘోరపాతకములనుండి విముక్తినొందుటకై దానధర్మములు చేయు చున్నారు.' ఇట్టివి మన్నారునకుఁ దండ్రియెడఁగల నిశ్చితాభిప్రాయములు; సత్యము లయ్యు నాపదలఁ గొనిరాగలిగినయంతటి సత్యములు.

మన్నారుదా సమాయికుఁడు; ఎచ్చట నేమాటయన్న నేమి ప్రమాదము సంభవించునో యెఱుఁగని పసిప్రాయమువాఁడు. అందుమూలముననే తండ్రినిగూర్చి తనకున్న తీవ్రాభిప్రాయమును వెంకన్నముందుఁ జెప్పివేసెను. దీని నమాయికత యనుట కంటె వయోనుకూలమైన జాడ్యతనెఱుఁగకపోవుట, బుద్ధివిశేషము లేక పోవుట యనిననుఁ దప్పురాదు. ఇతఁడు నిర్భీకుఁడు. భావతీవ్రతయే యీతనిని నడ పించుశక్తి. దీనితో వెంకన్నకుసందుదొరికినది. యువరాజునుగూర్చి రాజుమదిలో బేర లుకఁ బుట్టించుట కనువగునట్టి చాడీలుచెప్పి వెంకన్న, తండ్రికొడుకులమధ్య మహావైర మును సృజింపఁగలిగినాఁడు.

మన్నారునకు మాతృభక్తి మెండు. రంగాజమ్మయందుఁగల వ్యామోహముచే దన తండ్రి తల్లిని దిన్నఁగఁ జూచుటలేదని యాతనికిఁ దెలియును. ఆ తల్లి నిజస్థితి నంగీ కరింపక తన్ను భర్త సరిగనే జూచుచున్నాఁడని పుత్త్రునితో నబద్ధ మాడినపుడాతఁడు సహింపలేక చరచర వానలోనే వెడలిపోయినాఁడు. ఆమె దినదినము కృశించిపోవు చున్నందుల కాతఁడెంతయో విచారించి 'మహాపతివ్రత, మాయమ్మగారిని జూచిన నాగుండె తఱుగుకొనిపోవుచున్నద'ని వాపోయెను. ఇవి యన్నియు నాతని భావ తీవ్రతకు నిదర్శనములు.

వెంకన్నకుట్ర ఫలించినది. అతఁడు మన్నారును బంధించుటకు రాజాజ్ఞఁబొంది యర్ధరాత్రమున రాజును గలిసికొనుమని మన్నారునకు వార్తఁబంపినాఁడు. ఆ లేఖ చూచుకొన్న మన్నారు 'నా తండ్రి వర్తమాన మంపుటకుయు నేను వెళ్ళ కుండుట యునా? వెళ్ళితీరెద'నని నిశ్చయించుకొనెను. దీనివలన నిజముగ నాతనికి రాజ ద్వేషమే లేదనియు నీతఁడు తండ్రిమాట జవదాఁటని సుగుణపుంజ మనియుఁ దెలియు చున్నది. అన్నిటిని మించిన యాతని భావావేగమున కిదియొక యుదాహరణ. తన్ను బంధించిరని మన్నారు తెలిసికొని "నాయందెట్టి దోషమును నిరూపించినార"ని యడు గుట పితృతిరస్కారము, దూషణమును గాదు; కాని భావతీవ్రత కాకపోదు.

'ఇది రాజాజ్ఞ; తండ్రి దైవము; కానిమ్మ'ని మన్నా రూఱకుండి బందీకృతుఁ డగుట, నిరుద్ధావేశుఁ డనుటకై చేయుప్రయత్నము. కావలివా రీతనిని జూచి శిర ములు వంచి, భక్తితాత్పర్యములు ప్రకటించి రాజునాజ్ఞఁ బాటించిరి. మన్నారు జీవి తము తుదివఱకుఁ జెఱయందే కడచినది. కథాంతమునఁ జొక్కనాథునితో దండ్రికైన యుద్ధమునం దీతఁడు తీవ్రముగఁ బోరి యశశ్శేషుఁ డగును.

దైవగురుమాతాపితృభక్తులు, నమాయికతయుఁ బరవిశ్వాసమును గల యీతఁ డుత్తముఁడు; నిష్కలంకహృదయుఁడు. తన భావతీవ్రతయు రాజు దుర్మార్గులకుఁ జెవి యొగ్గుటయు నీతని దుఃస్థితికేగాక తంజాపురీరాజ్యలక్ష్మి దురదృష్టమునకుఁగూడఁ గారణభూతము లైనవి.

౩. పెద్దిదాసు :—

పెద్దిదాసు శ్రీ రాజగోపాలస్వామికి మహాభక్తుఁడు. అతఁడు సహ్యజానది నానుకొని యున్న యారామమునందు నొక కుటీరమును నిర్మించుకొని, స్వామిసేవ, స్వామిసంకీర్తనము, స్వామిధ్యానము, స్వామివివశతయుఁ దక్క నన్యము నెఱుఁగ గోరని మహనీయసంయమశీలి; ఆజన్మబ్రహ్మచారి; గొప్ప యద్వైతవాది. అట్లని విశిష్టాద్వైతులను ద్వేషింపఁడు. శిరోముండనాది విహితధర్మానుష్ఠానపరుఁడై నిష్ప్ర హుఁడై, కావులుధరించి యుత్తమాదర్శ జీవితమును గడపుచు బంచసప్తతిశరద్వయ స్కుఁడయ్యుఁ దరుణునివలెనే గోచరించు తపస్సంపన్నుఁడు, పెద్దిదాసు. ఇన్ని యేండ్లు పైఁబడినను గూడ నితఁడు వ్యాయామ కర్కశకాయమును దీర్ఘాయుర్దాయమును బరి పూర్ణారోగ్యమును సంపాదించినవాఁడు.

ఈతనికి రాజసభాగౌరవములపై వాంఛ యించుకయు లేదు. తన జీవితమును యదుస్వామిసేవయందే యంకిత మొనర్చిన ధన్యజీవి యితఁడు. కాళకవియు, విజయ రాఘవనాయకుఁడు నెంతో ప్రాధేయపడిరి; కాని యతఁడు రాజసభకు రాలేదు; ఒక్క క్షేత్రయ్య వచ్చినప్పుడుమాత్రము వచ్చి, క్షేత్రయ్యభక్తిమార్గము తంజాపురీసంప్ర

దాయమునకు భిన్నమైనదని నిరూపించి, తన స్వాతంత్ర్యమును వెల్లడించినాఁడు. ఈతని యీ నిర్భీకత యెల్లరకుఁ గష్టముకలిగింపక పోలేదు. మన్నారుదాసు కా నిర్భయత్వ మీ గురువునుండి యలవడినదేమో !

పెద్దిదాసన్నచో, రాజగోపాలాంబికకు, మన్నారుదాసునకు నధిక గౌరవము. ఎల్లైనను వారి యోగక్షేమము లీయనకు విడువరాని వైనవి. యువరాజు నాతఁ డెన్నఁడును గౌరవించినపాపమునఁబోలేదు. యువరాజు పెద్దిదాసుని గౌరవించెనే గాని, యాతని గౌరవమును గోరలేదు.

తపోధనుఁడగు పెద్దిదాసునకు దూరదృష్టి యుండుట యుచితము. మనుష్యుని జూడఁగనే యాతని హృదయమును గనిపట్టఁగల దిట్ట యగుటయు నీతనికిఁ జెల్లును. వెంకన్నను మొదటినుండియు ననుమానించుట యీతని పరేంగితావగాహనశక్తి యుక్తికి నిదర్శనము. ఆతని రాక తంజాపురికి ధూమకేతువని ముందుగ గ్రహించిన వాఁడే పెద్దిదాసు. వెంకన్న కుత్సితుఁడు, కయ్యాలమారి, వక్రబుద్ధి, కుటిలాలోచన పరుఁడు నని యీతఁడు మన్నారుతో బల్కుట, స్వపక్షభద్రతకొఱకుఁగాని పరపక్ష దూషణమునకు గాదు. మఱియు "వెంకన్న తేనెపూసినకత్తి"; పైఁకి సాధువువలె గనిపించును. వానివంటి దుర్మార్గుఁడు లేఁడని పెద్దిదాసు మన్నారుదాసుతో బెక్కుమాఱు లనుటయు నుచితముగనే యున్నది. శిష్యునియం దతిస్నేహము నీ పునః పునరుక్తికి హేతువుగాఁ జెప్పఁదగును. కాని, మఱియొకప్పుడు వెంకన్నతో, "నీవు నియోగివి. నీవు గుండెయందు విషముంచుకొని పైఁకి నవ్వుచు మాటాడఁగల"వని పెద్దిదాసువంటి సంయమి పలుకుట నిర్భయత్వమునకు కంటె, భావతీవ్రతకే యుదాహరణము కాఁగలదు. ఈ గుణమును గూడ యువరాజగు నా శిష్యుఁ డీ గురువునుండి నేర్చుకొన్నదే యనక మానలేము.

అంత భక్తిపారవశ్యము, తన్మయతయుఁ గల సాధువున కింత వాక్పారుష్యము వ్యసనము నంటఁగట్టుట, జీవితసత్యమును జిత్రింపలేకపోవుట యగుచున్నది. తలవిలువ నోడ తెలుపు నందురు. లోకానుభవముచాలని రచయిత జీవితసత్యమును బ్రతిపాదింప లేఁడు. ఒక వాచంయమియం దింతటి పలుకుఁబరుసుఁదనమును బ్రతిపాదించుట యీ యువరచయిత్రియొక్క శ్రుతపాండిత్యమునకు నుదాహరింపఁదగినది. వృద్ధసేవగాని గురుబోధ గానిలేని శిష్యురాలికిఁ గేవలము లోకానుభవశూన్యతవలన దొరలునట్టి దోష మిది యనలేము. లౌకిక వ్యాపారమునఁ గడిదేఱి గడుసు వడిన యెవ్వరివో పలుకుల నౌచిత్యమెఱిఁగి పొందు పఱపలేకపోవుటచే, పెద్దిదాసు పాత్రలో గుణవైషమ్యదోష మేర్పడెను. జీవితసత్యప్రతిపాదనలేని కథనుగాని పాత్రను గాని విషయమునుగాని పఠితలు విశ్వసింపరు. తన్మూలమున దానికి నిర్జీవత్వము

సిద్ధించును. మన నడుమ జరుగుచు, మెలఁగుచు సజీవములై యుండు నిర్దుష్టాంశములను పాత్రలను సృజించుట లోకానుభవశాలురకే దుస్సాధము.

ఇంకొక ముఖ్యవిషయము. పెద్దిదాసునకుఁ దెలుఁగుభాషయనినఁ బట్టరాని గౌరవావేశము. 'ఇది తెలుఁగువారి రాజ్యము. నేను తెలుఁగువాఁడను. నా భగవత్సంకీర్తన మంతయుఁ దెలుఁగుననే జేసితిని. నా యేలిక తెలుఁగువాఁడు'; అని యాతఁడు భాషాభిమానావిష్టుఁడగుట యనుచిత మనలేము. ఎంత నిర్మమునకైనను స్వదేశవేషభాషాభిమానము లుండవచ్చును. తన భాషపై రెత్తినచో నా యావేశ మొడలెఱుఁగని శివముగాఁగూడఁ బరిణమింపవచ్చును. కాని తెలుఁగుభారతి మధురభారతి. అట్టి తెలుఁగునకుఁ జేటొనర్ప యత్నించిన నీవు వికృతఁపుఁజావు చచ్చెదవు సుమీ !' యని పెద్దిదాసు వెంకన్నను దిట్టుట యేమంత బాగుగ లేదు. నిస్సంగుఁడైన యొక మహాభక్తుని, యదుకులస్వామిసేవానిరతుని జిత్రించుటకు సంయమచిత్తత, సముచితత్తయువంటి లక్షణము లెన్నో యలవడవలెను. పాత్రల గుణశీలముల నామూలాగ్రముగఁ బరిశోధించినపు డెందుఁగాని వైషమ్యము తోఁపరాదు. పొందిపొసఁగని యంశములతో నవలయందు జీవనసత్యప్రతిపాదన మెట్లు జరుగును? తదంశము సత్యమే యన్న భ్రమ చదువరుల కెట్లుఁగలిగింపఁగలము?

పెద్దిదాసునిది నిర్భయతత్వము కావచ్చును. రాజు నెదుటనైనను రాణువ యెదుటనైనను దా ననుకొన్నది పచ్చికుండ పగులఁగొట్టినట్లు మాట్లాడఁగలవాఁ డతఁడనవచ్చును. రాజు నెట్టయెదుటఁ దృణీకరించినాఁడు; వెంకన్నను మొగమువాచునట్లు కడిగివేసినాఁ డనవచ్చును. కాని క్షేత్రయ్యభక్తిమార్గము శృంగారదూషిత మగుటవలనఁ దంజాపురీసంప్రదాయమునకు సరిపడనిదియు నీతనిభక్తిమార్గ మఖిలాపదూషిత మగుటవలనఁ దంజాపురీసంప్రదాయమునకు సరిపడునదియునా? ఈయన వైశిష్ట్యము తిట్టుటయందు మెఱయును. అసమర్థునికోపము రోషమగుట నిజము. పెద్దిదాసు మన్నారుదాసు లధికారము లేనివారు; కోపించి చేయఁగలది లేదు; రోషము నొందుదురు. ఆ రోషము నిర్భయత్వమునకు, భావతీవ్రతకును దిగఁజారి వారి కష్టములకు దారి దీయును.

పెద్దిదాసు భక్తివివశుఁడు. 'రాజగోపాలా!జగదేకసుందరా!'యని యాతఁడు సమాధిగతుఁ డయ్యెడి వాఁడు. భక్త్యావేశమున నృత్యము చేయువాఁడు. అట్టి మహాభక్తుఁ డొరుఁడు లేఁడని కాళకవియు రాజగోపాలాంబికయు మన్నారును మున్నగు వారు విశ్వసించిరి. దానిని మనముగూడ విశ్వసింపవలెనన్న నంతటి భక్తునకు వెంకన్న వంటి యల్పునిపై నంతపగ యుండరాదు. అతని పేరెత్తినచో నీతఁ డంతయడఁచి పడఁగూడదు.

మహాత్ముఁడగు పెద్దిదాసునకుఁ బరాభవము చేయుదమని సంకల్పించుకొనిన నాఁడే రాజు తన్నుగట్టఁద్రాళ్ళు తాఁ దెచ్చుకొనినాఁడు. దైవభక్తి రాజభక్తి దేశ భక్తివంటి వెన్నో భక్తిభావములు రూపుదాల్చిన పెద్దిదాసు, తన్ను రాజు పరాభవింప నెంచి గాడిదకు నామములు పెట్టించి చిఱుతలతో నూరేఁగించు చుండఁగా, దాను గూడఁ బోయి దానిపై గూర్చుండు ననినాఁడు. ఇందుచే మానావమానాది ద్వంద్వా తీతునిగ మహాజ్ఞానిగ నీతనిని జిత్రించుట రచయిత్రి యుద్దేశము.

ఇట్టివానికి సన్మానమని రాజు వార్తనంపెను. నిండు సదమునకు వచ్చి తనకట్టి యర్హత లేదని పెద్దిదాసు మొఱపెట్టుకొనినాఁడు. రాజసభాభవనమున రసస్వరూప స్వభావనిరూపణపూర్వకముగ నప్పుడు పెద్దిదా సిచ్చిన యుపన్యాసము, మహోత్తమ భక్తిప్రతిపాదకమై యుండియు నవస్థానుకూలముగ లేకపోవుటచే పాండిత్యప్రకర్షకై రచయిత్రియో, యామెచాటున నున్న యొక మహాకవియో యిచ్చిన ట్లున్నది.

దుర్మార్గుఁడై రాజు పెద్దిదాసునకుఁ బరాభవము గావించెను. దానితో, సోదరీసంగమమహాపాపాకృతియగు భూతము, విష్ణుభక్తపరాభవమనెడి భూతముతో జతయై రాజునేగాక రాజ్యమునుగూడ మ్రింగివేసినది. అప్పుడు తంజావూరుపతనము పూర్తియయ్యెను.

ఈ నవలలో పెద్దిదాసు పాత్రము ప్రధానమైనది. భక్తిజ్ఞానవైరాగ్యములతో బాటు దేశభక్తి స్వామిభక్తి వంటివికూడ తనలో మేళవింపఁబడిన యీతని స్వభావశీల ములు మహోజ్జ్వలములు. నీతని గాథతో నారంభించి, యీతని కలతో నంతమొం దించిన రచయిత్రి యిం దీతని విశిష్టస్థానమును సూచించుటకే యుద్దేశించెను. కాని. తమ యనుభవమునకు సుదూరములైన యంశములను బ్రతిపాదింపనెంచు వారెల్లరుఁ జేయు తప్పిదమునే పాత్రపోషణ విషయాదికమున నీ రచయిత్రియుఁ జేసినది. తన్మూలమున పెద్దిదాసు పాత్ర మనలను జీవితమున వెన్నాడు సజీవపాత్ర కాఁజాలకపోయెను.

౪. వెంకన్న :—

"కేన కే నోపాయేన ప్రసిద్ధః పురుషోభవే" త్తనెడి యార్యోక్తికిఁ దార్కాణ మైనవాఁడు, వెంకన్న. శ్రీరంగరాయల దండనాథుఁడగు తాడిగోళ్ళ రామరాజునకు నమ్మినబంటు; యుక్తిశాలి; ఐనను స్వార్థపరుఁడు. త్రాఁచుపామువంటి దీతని పగ. ఏ యెండ కా గొడుగు పట్టుట యీతనికి వెన్నతోబెట్టినవిద్య. కొన్ని విషయములలో నెల్లు సోమయాజి కీతనితో వ్యత్యాసమును నిరూపింపవచ్చును. కేవల మట్టి తారతమ్య పరిశీలనమునకే యీ రెండుపాత్రలును నిర్మింపఁబడెనేని యీ ప్రయత్న మెంతవఱకు విజయమునొందెనన్న విషయమే ప్రచ్ఛ్యము. ఏలనఁ దన ప్రభువగు రామరాజునకు విశ్వాసపాత్రుఁడైన వెంకన్న రాజద్రోహి కాఁడు. సోమయాజులు ముందే యట్టివాఁడు

గాఁడు. కాకున్నచో, వెంకన్నకుఁ బరరాజద్రోహసామర్థ్య మున్నది. అది యాతని స్వామిభక్తి యుక్తికి నిదర్శనము. అట్టి సామర్థ్యము లున్నట్లు నిరూపింపఁబడుటకే యుద్దేశింపఁబడనిది ఎల్లు సోమయాజులు పాత్ర. కావున నీ రెండుపాత్రలకును సర్వథా ప్రతియోగము నిరూపించుటయే రచయిత్రి యుద్దేశ మనరాదు.

తన యేలికయగు రామరాజు నియోగమున వెంకన్న తంజాపురీవిజయరాఘవ నాయకునకుఁ జంద్రరేఖయందు మోహము పుట్టించినాఁడు. పిమ్మట నామెను దంజా వూరు పంపునట్టి పద్ధతిపై విజయరాఘవుఁడు మిత్త్రద్రోహియై శ్రీరంగరాయల పక్షము వహించు నేర్పాటుగూడ వెంకన్నవలనఁ జరిగెను. ఇట్టిది దుర్ఘటమైన పని. ఈ యసాధ్యమును నిర్వర్తించిన వెంకన్న రాజనీతియు బుద్ధిబలమును ప్రభుభక్తియుఁ దేటతెల్ల మగుచున్నవి. విజయరాఘవనాయకునకు మధురనాయకునిపైఁగల వంశ క్రమాగతద్వేషమును జ్ఞప్తికిఁదెచ్చి దానిని రేకెత్తించి వెంకన్న తన కుటిలరాజనీతి తంత్రమునఁ గృతకృత్యుఁ డైనాఁడు.

ఇతఁడు స్వార్థపరుఁడు, సాహసికుఁడు, బింకములమారి; పొగడ్తలకు నుబ్బి పోవురకము. అందువలన నీతని నెవ్వరు నెన్నఁడును బూర్తిగ విశ్వసించి యుండ లేదు. రామరాజే యీతనినిగూర్చి సంశయాత్ముఁడై యుండువాఁడు. "ప్రశంసించు నంతకాల మాతనినుండి తన కెట్టి హానియుఁ గలుగద"ని రామరా జెఱుఁగును.

ఔనుగాక: వెంకన్న యన్నియు నగునుగాక; కాని నిర్మముఁడు, నిస్సంగుఁడు, నిరీహుఁడునగు దా నతనినిగూర్చి 'కుత్సితుఁడు, కయ్యములమారి, వక్రబుద్ధి. తలఁచు కొనినచో గూడుకొనుకాఁపురములఁ గూలఁద్రోయఁగలఁడు, తేనెపూసినకత్తి'యని పదింబదిగఁ బెద్దిదాసు వాగ్వ్యయము చేసికొనరాదు. అట్లని వెంకన్నను గేవలము సజ్జనుఁ డనఁజాలము. వెంకన్న ధీరాంబికభవనమున కేఁగి యామెను నామె పుత్త్రిఁ డగు చంగమలదాసును మిక్కిలి పొగడి, చంగమల దాసుఁడే యువరాజగునని 'భుక్తి జోస్యము'చెప్పి, యా మాతాసుతులిర్వురకును మన్నారుపై నసహ్యాభావము పురి కొల్పినాఁడు. పిదప రాజుకడ కేఁగి మన్నారుపై జాడీలుచెప్పి యంతటితో నూఱ కుండక యువరాజు రాజద్రోహియని యెన్నెన్నో నూఱిపోసి యాతని బంధించుటకై రాజాజ్ఞఁ గైకొన్నసంగతులు వెంకన్నదుశ్శీలమును వెల్లడించు చున్నవి.

వెంకన్నకును బెద్దిదాసునకును గల పరస్పరసదుద్దేశముల విషయములలో నీ యూరికా యూ రెంతదూరమో యా యూరి కీ యూరు నంతే దూరమనఁ జెల్లును. లేదా, పెద్దిదాసునిది క్రోధము; వెంకన్నది యసూయయు ననుట సము చితము. తాను రాజు నాశ్రయించి యేదో బాధపడుచుండఁగా పెద్దిదాసు స్వతం త్రుఁడై రాజును నిర్లక్ష్యముచేయుచుఁ గూడ నందఱచేతను నుతింపఁబడుచుండుట వెంకన్న కీర్ష్యాస్థాన మయ్యెను. వెంకన్న విజయరాఘవునకు ద్రోహముచేయ నెంచి

నట్లు పసిపట్టిన పెద్దిదా సాతనిని నీచముగఁ దూలనాడి తన యుల్లఁపుమొల్లము నెల్లఁ జూపుకొనినాఁడు. దానిపై వెంకన్న కోపముపట్టలేక, పెద్దిదాసునిది భక్తియా, దుఃఖమా యని యధిక్షేపించెను.

వెంకన్న బుద్ధిజాతి గొప్పది. దీనివలననే యాతఁడు స్వకార్యనిర్వాహకుఁడై విజయరాఘవుని యాస్థానిలో రాయసముపని సంపాదింపఁగలిగెను.

తా నెంతటివాఁడుగాకున్నచో, చంద్రగిరి తంజాపురీకోటలయందును మధుర సభలోను నీతని నడ్డగించువా రొక్కరును లేకుందురు? మధురలో విజయరాఘవునకు ద్రోహకార్యములు తీర్చుకొని తంజాపురివచ్చి 'యిన్నాళ్లెచ్చటనుంటి' వని రాజడుగఁగఁ దన తల్లి యస్వస్థత సంభవింప స్వర్గస్థురాలైనదని నిరాఘాటముగా నబద్ధమాడుటకు సందేహింపనివాఁడు వెంకన్న. బొంకులు, వంచనములు, నీతనికి మంచినీళ్లప్రాయము.

ఇంతటి వెంకన్నయు మఱల భీరువు. మహారాణి రాజుపై దిరుగఁబాటు ప్రారంభించి తన కార్యము లన్నియుఁ దానే నిర్వర్తించుకొనుచు వెంకన్నకు బాకుచూపి బెదరింపఁగనే యాతఁడు భయపడిపోయి యామెచెప్పిన చొప్పుననే ప్రవర్తింతునని మాటయిచ్చినాఁడు. ఇఁకఁ దనకు తంజానగరమునఁ దావులేదని నిశ్చయించుకొని యాతఁడు మధురనాయకునితో మంతనములు నెఱపుచుండఁగా, జ్ఞానాంబికాపుత్రిక యచ్యుతాంబిక వివాహప్రసంగము వచ్చినది. ఇదే సమయమనుకొని వెంకన్న మధురా తంజాపురనాయకులనడుమ విరోధాగ్ని కింధనములు గొలిపెను. మధురరాజు చొక్కనాథుఁడు. ఆతఁ డచ్యుతాంబను దనకిమ్మని యామెతండ్రి విజయరాఘవునకు వార్త నంపునట్లు వెంకన్న పన్నాగముపన్నెను. ఇందుల కాభిజాత్యప్రతిష్ఠగల యా తండ్రి యంగీకరింపకపోఁగా దుదకు వారి నడుమ యుద్ధమునడచి తంజావూరుపతనము సిద్ధించినది.

రాణియగు రాజగోపాలాంబిక చెప్పినయొప్పునఁజేసి, వెంకన్నయర్ధ రాత్రివేళ మధుర పాఱిపోఁగా గోపించియు విజయరాఘవుఁ డేమియుఁ జేయఁజాలకపోయి నాఁడు.

ఏ విధముగఁ బరిశీలించినను వెంకన్న తంజావూరుపతనహేతువై, తన స్వామి భక్తివిశ్వాసములను బ్రకటించుకొనిన రాజనీతిచతురుఁడు.

౫. రాజగోపాలాంబిక:—

ఈమె విజయరాఘవుని పట్టమహిషి; మన్నారుదాసు కన్నతల్లి; చిరకాలము రాజుప్రేమఁ జూరఁగొన్నది. ఆతఁడు రంగాజమ్మ నభిమానించుచున్నకొలఁదియు నీమెకు సహనము సన్నగిల్లెను. ఈర్ష్యవలన నీమె భరింపరాని యావేదనమునకుఁ గుఱి

ప్పైనది; పోనుబోను భర్తను నిర్లక్ష్యముచేయును. ఇందులకసూయాగ్రహములు కారణములు. ఇవి యీామెను నడపించిన శక్తులు. కపర్దిని, సోమయాజులు, పెద్దిదాసు మన్నారుప్రభృతు లా కారణములకు సాధనమాత్రులు. భర్త యెంతదుర్మార్గుఁడైనను బతివ్రతయగుభార్య సహనము గోల్పోయి, సంసారముగుట్టు రట్టుచేసికొనరా దనుట నిక్కమేని, రాజగోపాలాంబికను నవలాకర్త్రి పరిపూర్తిగ సాధుశీలయట్లుఁ జిత్రింపవలసినది. దాని కెంతో సంయమనము, లోకానుభవము నావశ్యకములు. రాణియొకప్పు డుగ్రరూపిణియై రాజుముందునకు దుమికెను. అనుభవముచాలని రచయిత్రికి కీవిగల రాణియాగ్రహమును జిత్రించినపుడు గజ్జెలగుఱ్ఱము తలఁపునఁ బాటియుండును. మొత్తముమీఁద సుగుణముల రాశిగా జిత్రింపనెంచియు రాణి చిత్తరువును విస్పష్టరేఖలతో విశదపణితిలో సజీవవర్ణములతో నవలాకర్త్రి వర్ణింపఁజాలకఁ బోయినది.

పరిస్థితులు పరికింపనప్పుడు రాజగోపాలాంబిక నైజముగ గంభీరురాలు. తన మనోవేదనను గుమారునకు వ్యక్తముచేయక కొన్నాళ్లు గుట్టుగ నుంచెడిది. తన యవస్థకై కొడుకు బెంగపెట్టుకొనె నని పెక్కుమాఱులు వెల్లడించిన యపరిమితానుమానమునుబట్టి యీామె గాంభీర్యమునకుఁగల కారణములలో బుత్త్రివాత్సల్యము ప్రముఖస్థాన మాక్రమించును.

కపర్దిని యనిన రాజగోపాలాంబికకుఁ బంచప్రాణములు. కపర్దిని, సోమయాజులును రాణితో బుట్టింటినుండి యరణముగ వచ్చినవారు. వారి కీమె సౌఖ్యమే సదా వాంఛితము. కాన నీమె వారితో దన కష్టసుఖములు చెప్పుకొను చుండెడిది. వారు నీమెకుఁ దగిన యుపాయములు చెప్పుచు నిష్కల్మషులై యీామె శ్రేయమునే కాంక్షించెడివారు. తన ప్రభువగు రామరాజు నియోగమున వెంకన్న విజయరాఘవునకుఁ జంద్రరేఖపై మోహము కలిపింప, సోమయాజులు స్వయముగఁ జంద్రరేఖను రాణికి సుముఖురాలుగ నొనర్చినాఁడు. సోమయాజులే రంగాజమ్మపుట్టుపూర్వోత్తరములను దెలిసికొనివచ్చినది. పట్టమహిషికిఁ బెద్దిదా సనినచో మిక్కిలి భక్తి. ఆశ్రితులకు రాణియం దభిమానము; రాణి కాశ్రితులయందు గౌరవము ననుట కివి యుదాహరణములు. తన్మాత్రముగ నీ యభిమానగౌరవాదు లాఁగిపోయినచో గథాప్రసంగమింకొక మార్గము పట్టెడిది. వీనినిగూర్చి భర్తృద్రోహరాజద్రోహములుగ విజయరాఘవుఁడు వగచున ట్లివి కూర్పఁ బడుటతో గథ సంశ్లిష్టరూపము దాల్చెను.

రాజును సోమయాజులు తనయెడ సుముఖునిగ నొనర్పఁగలఁడని రాణికి గంపెడాస. అది సాధ్యపడని కారణమున నామె కొడలు మండినది; రాజుధోరణి కామె యసహ్యించుకొన్నది. భార్యాపుత్త్రిలు తన వశము తప్పుచున్నకొలఁదియు రాజు కసి కెక్కుచున్నాఁడు. దీనిని బరిస్థితిజన్యమగు నపోహ మనుకొందము. కాని, తన

పుత్త్రుఁడు రాజద్రోహి యగుచున్నాఁడనియు నందులకు రాణి దోహద మిడుచున్న దనియు రా జపరిమితముగ ననుమానించుచుండఁగా 'నిదిగో!' యీమెనుగూడ బంధింపు మని రాణి ముందున కుఱుకుటయు నుగ్రరూపమును దాల్చుటయు స్వాతంత్ర్యప్రకట నమునకు మార్గములు గావు. ఉడ్డీన ప్రతిష్ఠలేని రచయిత్రిభావనలోని దారిద్ర్యమున కిది యుదాహరణము కాఁగలదు. ఐనను భర్తృవైముఖ్యమును సైరింపలేని రాణి, స్వాతం త్ర్యము ప్రకటించి సాధించిన ప్రయోజన మేమి? రాజపతనము, రాజ్యపతనమునే గదా!

స్వాతంత్ర్యము ప్రకటించి తన వ్యవహారము లెల్లఁ దానే జూచుకొనుచు సర్వ కార్యనిర్వహణధురంధర, మహాపౌరుషవంతురాలు రాణి యనిపించుకొనుట రాజగోపా లాంబిక యాశయమే యైనచో రంగాజమ్మ యనుభవించుచున్న రెండు గ్రామములు నాక్రమింపనేల? తన సొమ్ము రాజు వ్యయించియుండుట యెఱిఁగినవెంటనే రాణి యా సొమ్ము చెల్లింపుమని వార్తపంపి, యట్లు సొమ్ము సంపాదించుట భర్తను వశ పఱచుకొనుట కనుకొనవలెనా? లేక వైకమున కిబ్బంది కలిగి యనుకొనవలెనా? మహో దారమైన రాణిపాత్రను సృజింపవలె నన్నచో నెంతటి మహోదాత్తమైన భావనాపటిమ కావలెను? సాధారణస్త్రీవలె నాస్తులను స్వాధీనపఱచుకొనుట, బాధ్యతగల రాణి దైన ప్రధానాశయమునకు సాధనము గాదు.

వెంకన్నను బెదరించి రాణి యాజ్ఞావిధేయుని జేసికొన్నది. అనేకులగు గూఢ చారులను నియమించి యాతని యాటకట్టించినది. ఫలమెఱుఁగని కార్యాచరణశీలముగల రాజగోపాలాంబికనీతిరి రాణినీతి యనఁదగునా? ఎక్కువ తక్కువ లన్న భేద మొక్క టియేగాని రాజ్యపతనమునకు వెంకన్నతోఁబాటు సోమయాజులును బాధ్యుఁ డగు చున్నాఁడు. ఒక్కరు ప్రత్యక్షకారణ మగుచో మఱియొకరు పరోక్షకారణము. అట్లే రాజునాశనమునకు రంగాజమ్మతోఁబాటురాణియుఁ గాకతీరుటలేదు. రా జెట్టివాఁడై నను బట్టమహిషి కసూయ లేకున్నచో నింత చేటువాటిల్లదు. కాని యామెకు సహన ముండునా? రాజు రంగాజమ్మ యాకర్షణమును నిల్వరించుకొనఁగలఁడా? అందుచే నాతని మూర్ఖతాహుతాశనకీ కీమె యసూయయను నేయి పోయఁగా తంజాపుర రాజ్యము దరికొనెను.

ఇన్నిచేసిన రాణి సుతుని జెఱసాలనుండి విడిపించుట భర్తృప్రతిష్ఠకు భంగకర మని యూరకొన్నదఁట! పాత్రపోషణమున నిట్టిదాని నౌచిత్యముగ భావించుట యొక వైచిత్రి.

రంగాజమ్మ జన్మరహస్యము తెలియుటచే రాజుమనస్సు మఱలినది; రాణి సఫలీ కృతురాలైనది. కాని యా సాఫల్యము రాజునకును రాజ్యమునకును బతనము నాపా

దించిన సాఫల్యము. రాణి సర్వతంత్రస్వతంత్రత యిప్పట్టున నేమియు నాశయసాధకము కాలేదు. 'స్త్రీబుద్ధిః ప్రళయంకరీ!'

ఇట్లు రాజగోపాలాంబిక యెంత యుత్తము రాలైనను కులసతియై రాజునకుఁ గల ద్వేషమే యీతని పతనమునకుఁ గొంత హేతువైనను కులకాంత యోర్మిఁదక్కి పర్యవసాన మూహింపలేని యాత్మబుద్ధితో బ్రవర్తించుట కూడఁ దంజాపురపతనమునకుఁ గారణ మైనది.

౬. రంగాజమ్మ :—

ఈమె సుప్రసిద్ధ విద్వాంసురాలు; మహాకవయిత్రి; అతిలోకసౌందర్యవతి; ఉషాపరిణయప్రబంధకర్త్రి. విజయరాఘవుఁడే కృతిభర్త. కృతిప్రదానమహాసభలో నామె తన కావ్యమును జదివి యెల్లర ముగ్ధుల నొనర్చినది. రాజు మెచ్చుకొని సభాసదుల యనుమతినిబట్టి 'శృంగారరసతరంగితకవిత్వమహనీయస్ఫూర్తి' యని యామెకు బిరుదమునిచ్చినాఁడు.

రంగాజమ్మసంగతి విచిత్రమైనది. ఈమె జన్మరహస్యమును బయలుపెట్టినవాఁడు సోమయాజులు. విజయరాఘవుని తండ్రియగు రఘునాథరాయలకు మంగమ్మయను వారవనితయందుఁ జక్కని చుక్కయై జన్మించిన కూఁతురు రంగాజమ్మ. తల్లి చనిపోవుటకుఁ బెనుగొండయం దుండి తదుపరి నీమె తన మేనమామల యింటికిఁబోయెను. అచట విద్యాబుద్ధులఁగఱచి తన్మూలమున సౌందర్యము నినుమడింపఁజేసికొని కవయిత్రియై యీమె విజయరాఘవుని ప్రాఁపునఁ దంజావూరు చేరినది. ఈ జన్మవృత్తాంత మేమియుఁదెలియని రాజీమె సౌందర్యమును గవిత్వమును మెచ్చుకొని తెచ్చి ప్రత్యేకమందిరమున నుంచుకొని యీమెయందు బద్ధానురక్తుఁడై మెలఁగుచుండెను.

ఈమె కళలలో గాణాచి; అందకత్తెలలో నందకత్తె; రాజును క్షణములో బాదాక్రాంతు నొనర్చుకొన్నది. రాజదిమొదలు మహారాణిమొగము చూచుటయే మానుకొనినాఁడు. శ్రీరంగనీతులు చెప్పు సోమయాజులుకూడ రంగాజమ్మ సౌందర్యమునకు ముగ్ధుఁడై యీమెవిషయమున రాజుతప్పిద మేమియు లేదనుకొనెను. మహారాణు లన్నివిధముల నీమెముందుఁ దీసికట్టే!

రంగాజమ్మ కులటకాదు. ఈమెయం దేదేని దోషమున్నచో నది యీమె సౌందర్యదోషము. రాణిపక్షము వహించి రాజుతో నీమె వాదించినది; ఆమె నుపేక్షింప వలదన్నది. కాని రాణిపై రాజున కాకర్షణములేదు. అది రంగాజమ్మనేరము గాదు. రాణి యవలంబించిన పద్ధతులకు రోసినరాజు రంగాజమ్మనుగానిచో నింకొక

యమ్మను జేపట్టెడివాఁడు. ఎందఱో రాజదంపతు లుండఁగా, రంగాజమ్మ వీరినే విడదీయ వలెనా? చంద్రరేఖపంపున సోమయాజులు వచ్చి రాణిపక్షముపూని యీమెను జాల నిందించినాఁడు. రంగాజమ్మ కిది శుభముగాదనియు రాణి మహాపతివ్రత యనియు నామె యును రీమెకుఁ దగులఁగలదనియు రాజును రాణియెడఁ బ్రసన్నునిగాజేయుట యీమెపని యనియు లేనిచో నీమెకు మంచిదికా దనియు నాతని వాక్సారము. రంగాజమ్మకు రోషమువచ్చినది; దాసికూడ నదేమాట; అప్పుడు :—

ఉ. "ఏ వనితల్ మముందలఁప నేమిపనో! తమ రాఁడువారుగా
రో; వలపించునే ర్పెఱుఁగరో! తమ కౌఁగిటిలోననుండఁగా
రా విదియేమిరా; విజయరాఘవయం చిలుదూరి బల్మిమైఁ
దీవరకత్తెనై పెనఁగి తీసుకవచ్చితినో తలోదరి!"

యని రంగాజమ్మ యాశువుగఁ బద్యముచెప్పినది. ఈమె యాశుకవితానిధి యనియేగాక యందలి రసభావము, భాష, భావము, రీతి, శయ్య యన్నియు రసికులగువారియెల్లర తలల నూఁపించినవి. రంగాజమ్మ సౌందర్యమున కాత్మాభిమానము మెఱుఁగులు తుఱఁగలించు చున్నది.

ఈమె యెంత సౌందర్యరాశియో యంత రసస్వరూపిణి. ఈ కవయిత్రి పలుకు లమృతనిష్యందులు; ఈమెను గన్నవారును విన్నవారునుగూడ నొక క్షణమేనియు విడువలేరు. అట్టి యందముల రాణి యగుటయే యీమెదోషమన్న వారి కొక నమస్కారము.

రంగాజమ్మ రాణియసూయకు, రాణిపక్షమువారి యాగ్రహద్వేషములకు నిష్కారణముగా గుఱియయ్యు జలింపక తన ధర్మమును నిర్వహించిన వీరనారి. రాజగోపాలాంబిక స్త్రీసహజమైన ప్రవృత్తిచే రాజును రంగాజమ్మను విడఁదీయ విశ్వ ప్రయత్నము లొనరించినది. సోమయాజులు రాణికి లోనివాఁడై రంగాజమ్మ పుట్టుక గుట్టు నెఱిఁగి రాణిచే వెంకన్నను బెదిరింపించి యతిథిచే బావును జంపించున ట్లాతని మూలమున నా రహస్యమును బయలుపెట్టించినాఁడు. నాఁటినుండియే రంగాజమ్మ జాతకమునందు శనిప్రవేశము. అయ్యు నామె వీరాంగనవలెఁ దన యదృష్టముతో బోరాడినది. అది యొకరితోడ బోరాటము కాదు; అంతర్ద్వంద్వము, లోలో గుమిలి పోవుచుఁ బ్రాణముపై వచ్చు పోరామితో బోరితము.

ముం దీమె స్వయంప్రతిభవలన రాజుహృదయమును జూఱగొన్నది. స్త్రీసహజమైన కొంత యసూయయుఁ బట్టుదలయు నీమెకు లేవనలేము. రాజు తనకిచ్చిన గ్రామములనురాణి కైవసపఱచుకొనఁగా నీమె యవియే కావలెనని పట్టుపట్టినది. తుదకు "నీవు శ్రీనాథునిమించిన కవయిత్రివి; నీకుఁ గనకాభిషేకము చేయింతు"నని రాజూఱ

డింపఁగఁ దన యంతస్తున కనుగుణముగ ననూయాశీతురాలగుటకుఁ బ్రయత్నించెను. కనకాభిషేకమహావైభవ మట్టి యుదాత్తత కర్హమనక తప్పదు.

రాజీమెపుట్టుక సంగతి తెలిసి తెంగతో గ్రుంగి కృశీభూతుఁడై నాఁడు. ఈమెయుఁ జిక్కి శల్యావశిష్టయైనది. అతఁ డీమెను జూడరాఁడు. ఈమె యాతనిని మఱవలేదు. అంత సుందరాంగి, యంతటి మహాకవయిత్రి యట్లుఁ గ్రుళ్ళగించుచుఁ గ్రుస్సి డస్సియు నణువణువు వీరోచిత మరణము నొందెను. ఈమె యస్తమయము స్త్రీలోకప్రతిభాప్రతిష్ఠల కస్తమయము.

నాఁటిసాంఘికస్థితిగతులు :—

నాఁడు దేశము రాజన్యంతము. మనస్స్వార్థలకు, విరోధములకుఁ గారణ మయ్యెడి బహుపత్నీత్వ మా కాలమున రాజాదరణము నొందెను. రాజులు తమ పుత్రికలవెంట నత్తవారియింటికి నుత్తమబ్రాహ్మణుల నరణముగా బంపుటకలదు. రాజసభలే నాఁడు వినోదస్థానములు. అప్పుడు స్త్రీలునైతము చక్కని కవిత్వ మల్లెడివారు. వారి కది సాంఘికముగ గొప్ప గౌరవము కూడ. నాఁడును స్వార్థపరాయణులు, మహాభక్తులు, గలరు. అట్టివారియెడ ననూయాపరులు నున్నారు. మిత్రద్రోహములు, రాజద్రోహ ములు, గూఢచర్యలు నాఁడు నున్నవి.

సుందరాంగులగు కళాప్రియలకు వశులై రాజులు యుద్ధములకు దిగి సర్వనాశ నము తెచ్చిపెట్టుకొనెడివారు. తిరునాళ్ళలో నవినీతియు, దానికిఁ బ్రాయశ్చిత్తములు నుండెడివి. ప్రజలలోను రాజులలోను బశ్చాత్తాపబుద్ధి యొకటి యగపడును. చేసినపాప ములు పోవుటకు దాన ధర్మములు సంతర్పణములు చేసెడివారు. ప్రజాసాధారణజీవిత మునకును రాజకీయములకును సంబంధములేకపోవుటచే మొత్తముమీఁద నాఁటి సంఘము ప్రశాంతసుఖజీవనము గడపుచుండెడిది.

మతపరిస్థితులు :—

ఆ కాలమునఁ బ్రజలకు రాజులకును పాపభయము, దైవభీతి, రెండునున్నవి. క్షేత్రయ్యవంటివారి శృంగారరూపములగు పదముల ప్రచారము ననహ్యించుకొను వారు నుండిరి. మతసంబంధములగు దోషముల నొనరించినవారిని న్యాయపండితులచే బరిశీలింపించి రాజులుదండనవిధించెడి వారు. ఆత్మహననమే యిట్టి దోషములకుఁ దఱచుగ దండనము. ప్రజలు పాపభీతిచే దమంతటఁ దామే రాజాస్థానికి వచ్చి దండన మర్థించి పొందుట పరిపాటి. వైష్ణవమే నాఁడు రాజుల కభిమానమతము.

**తాత్కాలిక రాజకీయ పరిస్థితులు :—**

చక్రవర్తులక్రింద సామంతరాజు లుండిరనుటకు శ్రీరంగరాయలక్రిందఁ జెంజి మధుర తంజావూరునాయకు లుండుటయే తార్కాణ. కాలక్రమమున నా సామంత రాజులు స్వాతంత్ర్యము వహించి కప్పములు కట్టుట మానివేయఁగా రామరాజు వంటి దండనాథులపై నాధారపడి, యొదుదుడుకులు రాకుండఁ జక్రవర్తులు రాజ్యము చేసికొనెడివారు. ఆ దండనాథులుకూడ సాధ్యమైనంతవఱకు సామదానభేదములే యుప యోగించి యెదురుతిరుగు తంజాపురీప్రభువులవంటివారిని వశపఱచుకొందురు. వారు వెంకన్నవంటి రాజనీతిజ్ఞులను చంద్రరేఖవంటి నట్టువరాంగ్రడను గూడ నట్టిపనులలో నియోగించుట కలదు.

సామంతులు తఱచు స్త్రీలోలురై స్వతంత్రబుద్ధికలవా రయ్యు శత్రువుల యుపా యములలో బడిపోయి, మిత్త్రద్రోహులై యుద్ధమధ్యమున శత్రువుల పక్షముఁ జేరుట యొక యాచారము. ఇట్టి ద్రోహములకు మిగిలినసామంతరాజులు పగఁబూని సమయమువచ్చినప్పు డిట్టివారికిఁ దగు బుద్ధిచెప్ప నూహింతురు. యుద్ధములయందు యోధు లారితేరిరి. సేనలు సమీకరింపఁబడెడివి. విల్లమ్ములు, బల్లెములు, కటారులు, బాకులు మొదలైనవి యుద్ధసాధనములు.

రాణులు రాజ్యపాలనాధురీణలై యావశ్యక మగుచో భర్తలపై నెదురుతిరు గుట యొక యాచారము. రాజులును యువరాజులును మూర్ఖులై పరస్పరము ద్వేషించుకొనుట యింకొకటి. సామంతరాజులయందుఁ దమలోదమకు మఱల హెచ్చుతగ్గులు. కొందఱకు గొప్పవారమని గర్వములు; అందుచే నసూయాద్వేష ములు; యుద్ధములలో దన్మూలమునఁ దల లెగిరిపోవుటయు; సామంతు లెచ్చట నెదురు తిరుగుదురో యని చక్రవర్తికి నిరంతరభీతి మఱియొకటి. సింహాసనమునకై సామంత రాజులలో దాయకలహములు తీరనన్ని. కొందఱు కుచ్చితులు రాజ్యపతనమునకు హేతువు లగుటయు, రాజులస్త్రీలోలుపత, రాణులలో నంతర్ద్వేషములు, నిందులకు సాయపడుటయుఁ గల నాఁటిపరిస్థితు లెటుజూచినను గల్లోలముగనే యుండెడివి. ప్రజాసాధారణ్యమునకును రాజకీయములకును సంబంధములేమిచే ప్రజాసాంఘికజీవితము మాత్రము సుఖప్రద మనకతీరదు.

**తంజావూరు పతనహేతువులు: —**

తంజాపురీపతనమునకుఁ గారణము లనేకములు. అందు కొన్ని సన్నిహిత హేతువులు; మఱికొన్ని దూరదూరకారణములు.

సన్నిహితకారణములలో ప్రధానమైనది, విజయరాఘవనాయకుని స్త్రీలోలత. ఈ లోలుపత కాతఁడు బానిసయై, వెంకన్నచేతిలో గీలుబొమ్మయై, స్వీయరాజ్యపతన హేతువైనాఁడు. ఈ స్త్రీలోలతయే రంగాజమ్మ యెవ్వరైనదియు నాలోచించుట కాతని కవకాశము నీయలేదు. యథార్థమెఱిఁగి పశ్చాత్తాపపడినాఁడు. కాని, యా పాపమునకుఁ బ్రాయశ్చిత్తము లేకపోయెను. శత్రుస్థానమైన మధుర ప్రక్కలోని బల్లెమువలె నున్నదని యెఱిఁగియు వెంకన్నకల్లబొల్లిమాటల నమ్మి యువరాజుపగను రాణివిరోధమును గొనుకొన్నవాఁడు విజయరాఘవుఁడు. ఇతనిది ముఖ్యముగ స్వయం కృతాపరాధము. 'తంజావూరుపతన' మనఁగా విజయరాఘవుని యనుచిత కళా ప్రియత్వమన్న ననవచ్చును.

ఈ పతనమునకు రెండవకారణము రాణి 'రాజగోపాలాంబిక'యారనిపగ. రంగాజమ్మ జన్మవృత్తాంతమును దెలిపించి భర్త్రరాజకార్యవిముఖత కీమె మఱింతదోహద మొనర్చినది. ఇంతేగాక వెంకన్నతో 'నీవుచేయుపని నేనేయొనర్చెద' ననిపలికియామె రాజ్యపతనము నపేక్షించెను. పగసాధించుటయే యామెకుఁ బరమావధి; రాజ్యరక్షణము గాదు. రాజసందర్శన మొనర్చినప్పు డీమె తీవ్రతఁ బ్రకటింపక సాధువిలక్షణ మును బ్రదర్శించినచో గథ మఱియొకతీరుగ నుండెడిది. అన్నివిధములఁ బట్టుబట్టి, భీష్మించి పతిపైఁ బగఁదీర్చికొన్న యామె తమోగుణసంపన్నత, తంజావూరుపతన ముఖ్యహేతువులలో నింకొకటి. అనఁగా రాజుల మనఃప్రవృత్తుల నవగాహనముచేసి కొనునౌదార్యములేని స్వార్థనిరతలగు రాణుల తమోగుణమును బరార్థప్రాపకరాహిత్యమును గలిసి 'తంజావూరుపతన' మైన దన్నచో దప్పురాదు.

పిదపఁ బేర్కొనఁదగినది వెంకన్నచర్య. తుదకుఁ దనకే ప్రమాదము వాటిల్ల నున్నదని గ్రహించి రాణికి లోఁబడి, రంగాజమ్మ వృత్తాంతమునకు సాక్ష్యము నిర్మించి ప్రభువునకు నివేదించి తంజాపురీపతనమునకు హేతువైనవాఁడు, వృథాస్వార్థభంగ కారి వెంకన్న.

మిగిలినవ్యక్తులలో మధురనాయకుఁడు, మన్నారుదాసు, పెద్దిదాసు, రంగాజమ్మ, చంద్రరేఖ, కవులు మొదలగువారిచర్యలు దూరదూరకారణములు.

మన్నారు యువరాజయ్యు వెంకన్నయెదుటఁ దన తండ్రిచర్యలు ఖండించినవాఁడు. మధురనాయకుఁ డవకాశవాది. ఇఁక రంగాజమ్మకు సౌందర్యమే శత్రువు. తాఁ జెప్పినటుల నీమె 'రా విది యేమిరా! విజయరాఘవ'యని యిలుదూరి బల్మిమై పెనఁగి ప్రభువును వశపఱచుకొనలేదు. ఈమె సౌందర్యము, రసికతయు గవితయుఁ బ్రభునివశపఱచుకొనినవి. బుద్ధిపూర్వకముగ రంగాజమ్మ రాజ్యపతనమున కేమియుఁ జేయదు. అట్లుఁ జేయుట తా గూరుచుండినకొమ్మను దానే నఱకుకొనుట. అయినను రా జామెగుణములకు లోఁబడి చెడిపోవుటచే నీ కథ యిట్లయ్యెను.

చంద్రరేఖ ప్రవీణయగు నట్టువరాలు. ఈమె నృత్యమునకు రాజు ముగ్ధుఁ డగును. ఈ యగుటవలన, మధురవారితో జేసికొనిన యొప్పందమునకు భంజకముగ రాఘవుఁడు రంగరాయలపక్షముచేరి యుద్ధభూమిలో కార్యభంగ మొనర్చి మధురను మోసగించినాఁడు. ఆ వంచనయను నగ్ని రగిలెను. అది మధురదండయాత్రారూప మున వ్యాపించి తంజావూరును గబళించినది.

ముఖస్తుతు లొనర్చు కవులమాటలు నమ్మి రాజు పెద్దిదాసు మున్నగువారి కప చారము లొనర్చుటగూడఁ బరోక్షముగ రాజ్యపతనహేతు వయ్యెను.

ఇటుల సన్నిహిత దూరదూరకారణములు పరస్పరము కుట్రచేసి తంజాపురీపత నము నొనర్చినవి.

అందును రాజు లలితకళాప్రియత్వము రాణి భర్తృవైరము నను నీ రెండును ప్రధానములు. రాజదంపతుల యన్యోన్యద్వేష మని వీనినే యొక్కమాటలో జెప్ప వచ్చును. ఇందు రాజు తన భర్తృధర్మమునుగాని రాజగోపాలాంబిక యెంతభార్య యైనను దన రాజ్ఞీధర్మమునుగాని యించుక యేమరనివారైనచో నీ నవలకు మూలా ధారశిల గ్రక్కదలిపోయెడిది. ఇందు రాణి దుర్దమేర్ష్యాసూయలుగల భార్యభావమును రాజు శీలసంపదనెఱుఁగని కళారాధనమును జేపట్టుట ప్రజల కరిష్టము, రాజ్యనష్టము నయ్యెను. ఈ రచయిత్రి గురువర్యులు 'ఏకవీర'లో గామేచ్ఛలేని భార్యాభర్తృ సంబంధమును ప్రేమలేని వివాహవిధిని నిరూపింపఁగా నీమె యీ తన నవలలో భర్తృ ధర్మ మెఱుఁగని ప్రభువు, ప్రభ్వీధర్మ మెఱుఁగని భార్యయు నారాధించిన యదమ్య కామేచ్ఛల విషపరిణామమును జిత్రించె ననవచ్చును. 'భువనవిజయము'లోని రాయల వధూప్రసాదనరాసిక్య మిందు రాఘవునకు లేదు; ఆ తిరుమలదేవి యౌదార్యసహన శీలము లీ రాజగోపాలాంబికకు లేవు. పతిశ్రేయఃకాంక్షగల యామెది సత్త్వప్రవృత్తి; పతిపై తీరనిపగగల యీామెది కేవలము తమఃప్రవృత్తి. ఆ నవల మోదాంతము, నిది ఖేదాంతము నగుట కివి యివి కారణములు.

**నాటకీయత:—**

ఈ 'తంజావూరుపతనము'నందు నాటకీయత యధికము. నాటకోచిత నవలయందు పదకమువేఱు పాత్రలువేఱు ననెడి వ్యత్యాస మగపడదు. పదకమును బన్నుటకుఁ గావలసిన సామగ్రివిశేషములలో నొకటిగఁ బాత్ర లిందు భావింపఁబడవు. అట్లే పాత్రల చుట్టు నల్లఁబడు ప్రాచీరము వంటి దానినిగఁ బదకము నిట్టివానియందు భావింపము. పాత్రలనుండి పదకమును వేఱుచేయరానంతటి సుదృఢబంధ మీ నాటకోచితనవలల కుండును.

పాత్రల దత్తశీలము లిట్టి నవలలో గార్యనిర్ణయమున కనుకూలపడఁగలవు. తిరిగి యా కార్యము క్రమాభ్యుదయముచే బాత్రల పరిణతికిఁ దోడ్పడఁగలదు. ఈ రీతిగఁ బదకము, పాత్రలు, కార్యము, సమస్తమును రచయితృధ్యేయమున కభిముఖముగఁ గొనసాగును. అత్యుత్కృష్టమగు నాటకీయనవలకు విషాదాంతరూపకము తోడనే సాదృశ్యము. శీలప్రధాననవలలలో శ్రేష్ఠమైనదాని కిక్లే మోదాంతరూపకముతో బోలిక. తీవ్రకార్యవేగముగల సన్నివేశములలోని సంవాదము లుదాత్తకవితాంశశోభిత ములు. కాని నాటకీయనవల, యన్నివిధములచేతను విషాదాంతరూపకమునే పోలితీర వలయు ననిలేదు. ఇట్టి నవలారచనమందుఁ బ్రథమముగ నింగ్లాండులో విజయము సాధించినయామె జేన్ ఆస్టీనుసతి. ఈమె శిల్పమునకు 'ఫీల్డింగ్,థేకరీ'లతోకంటె 'హార్డి' శిల్పముతో నెక్కుడు సామ్యమున్నది. ఆ శిల్పము ననుసరించి గ్రహింపఁదగిన లక్షణములకు 'తంజావూరిపతనము'నందు లక్ష్యములు చూపనగును.

ఇందు సంశ్లిష్టజీవితవిధానముగల యొక పక్షమువారిపై ముందుగఁ గథ కేంద్రీ కరింపఁబడును. తన్మూలమున సహజముగఁ బ్రధానభూతమగు నిట్టి కార్యతీవ్రత 'తంజావూరు పతనము'లో రాణిపక్షము వారియందుఁ గలిగెను. పాత్రసృష్టికిఁ బ్రయోజన సిద్ధియే యిందుఁ బరమోద్దేశము. ప్రయోజనరహితమైన పాత్రలుండుట నాటకీయ నవలకు గిట్టదు.

మన 'తంజావూరుపతనమున'ఁ బ్రతిపాత్రయు నేదోయొక ప్రయోజనమును సాధించినదేయగుట సత్యము. అంతేకాదు; పాత్రలు తమ ప్రభావముచే సంఘటనలను దాఱుమాఱుచేయుటయు గమనింపఁదగును. అవి క్లిష్టసమస్యల సృష్టించుటయు వానిని పరిష్కరించుటయుతో నవల యంతమగుచున్నది. రాజుపక్షావలంబులు చేయుపనుల యందు రాణిపక్షావలంబులు జోక్యము కల్పించుకొనుటవలనఁ గథాకార్యము సర్వ్యాప్త తీవ్రతతో గొనసాగును. విజయరాఘవుఁడు రామరాజుగూఢచారియగు వెంకన్నను నమ్ముటచే గథ యొక మార్గమునఁబోవుచుండఁగా నతఁడు చేయుపనులు రాణిపక్షము వారియందు విరోధభావమును బ్రజ్వలింపఁజేయుటతో, గథాంశములు నానాముఖముల విస్తరిల్లు చున్నవి. శక్తివంతములగు నీ కథాంశముల నేకోన్ముఖముచేయఁగల సమతా సామర్థ్య మీ నవలలో గథాసంవిధానమును దీర్చి దిద్దుకొనుచున్నది.

ఇట్లు రూపొందిన కథయేగాని, యిందు వేఱుగఁ గథాపంజరమని లేదు; పాత్రలతో నంటియుండని కేవలపదకమని లేదు.అంతయుఁ బాత్రచిత్రణము. ఆ పాత్ర చిత్రణమే కథాకార్యాచరణచిత్రణము. ఎంత తాఱుమాఱయ్యుఁ గాలతీవ్రత ప్రధానాశయమున కభిముఖముగ ధావనతో జెలఁగును. అందే యుత్కర్షబిందువు నంటుట యుఁ గనఁబడుచున్నది. రాణిపక్షము వహించిన సోమయాజులు నెఱపిన యేర్పాటుల వలన వెంకన్న, రంగాజమ్మయు విజయరాఘవుఁడును సోదరీ సోదరు లన్న వృత్తాంత మును బహిర్గత మొనర్చినాఁడు. దానితో నవలాప్రధానోద్దేశమగు వారి పతనమును

దద్రాజ్య పతనమును గూడ నేకతఃసూత్రితము లైనవి. ఇందు రంగాజమ్మ జన్మరహస్య మనెడి యాంతర హేతుపురస్కృతితో నవలాపర్యవసానము ముడిపడియున్నది.

అందుచే నాంతర హేతుపురస్కరణమనునది, క్రియాప్రధాననవలా పదకమునుండి నాటకీయనవలాపదకమును వేఱుపఱచు లక్షణ మనఁ దగును. రంగాజమ్మయు విజయ రాఘవునియుఁ బరస్పరసమాగమవేళావిశేషమునుబట్టి వారి యనురాగ మనివార్యము. వారివారి గుణశీలవిస్పష్టత యట్టిది. లలితకళారాధనమునం దిర్వురి హృదయములు నొకే స్థాయిలో శ్రుతిఁగలిపినవి. వారి పరస్పరప్రణయహృదయావరణ మొనర్పఁగల శక్తి యొక యా జన్మరహస్యఘటనకే గలదు. అత్యావశ్యకము, ననుల్లంఘనీయము, ననివార్యమునగు కారణములచే నిరువాగులుగ నేర్పడిన రాజగోపాలాంబికావిజయ రాఘవనాయకుల పక్షావలంబులగు పాత్రల శీలములవలన నిచ్చట నవలలో గార్యము కల్పింపఁబడి, ఘటనాచక్రపరిభ్రమణములవలనఁ బోనుపోను తత్తత్పాత్రలు నూతన స్ఫూర్తితో నావిష్కృతమగుట గమనార్హము.

నాటకీయనవలయందు కార్యమునకును బాత్రలకును దుల్యయోగిత యత్యావశ్యకము. పరిస్థితులలో బరివర్తనమనఁగా, బాత్రలలో బరివర్తనమే యనునంతటి తుల్యభావము కార్యమునకుఁ బాత్రలకు నుండును. నాటకీయముగాని, మనస్తత్త్వసంబంధమైనదిగాని, బాహిరము నాంతరము నైనదిగాని, ప్రతిపరివర్తనమును బాత్రలయందో పరిస్థితులయందో కలుగు వైకృతమువలన నేర్పడఁగలదు. కార్యప్రధాన శీలప్రధాననవలావిశేషములకును నాటకోచితనవలలకును గల విభేద మిట్టిది. ఆ రెంటియందును బాత్రలు.పదికము, నడుమవ్యవధాన ముండును. నాటకీయనవలయం దిట్టి దేమియు నుండరాదు. దాని ప్రాధాన్యమునకుఁ దోడ్పడు లక్షణములలో బదక మొకటి. మన ప్రస్తుతనవలయందు పరిస్థితిపరివర్తనములో శీలపరివర్తన మంతర్భూతమైయున్నంతవఱకుఁ గథాసంవిధానపురోగతియందలి యౌచిత్యమునకు, సత్యమునకును నత్యధికప్రాధాన్య మున్నది. ఈ పురోగతి రెండువిధములుగ ననివార్యము. పాత్రోన్మీలనమును సూచించు మేరవఱకు నిఁదొక యాంతరమైన సత్య మిమిడియుండును; కథాకార్యాభివృద్ధి సూచకముమాత్రమే యగుచో నందు బాహిరమైన సత్య ముండును. ద్వైవిధ్యముగల యీ సత్యముయొక్క యభిన్నత్వము 'తంజావూరుపతనము'నందుఁ బరిపూర్ణమగుట, యది నాటకీయనవల యగుటవలననే యవకతీరదు.



## చివరిరాత్రి 1

కవిరాజమూర్తి విరచితమైన ఉర్దునవల దీనికి మూలము. ఆంధ్రీకర్త ఊటుకూరు రంగారావు. నవలేతివృత్త మగ్రజాతికిఁ జెందిన యొకస్త్రీ పతనగాథ. ఇందలి విషయమున నవ్యత లేదు. ఆధునికసమాజములో జెల్లుబడియగుచున్న పురుషవృత్తి నడుగడుగునను దీవ్రముగ విమర్శించుచు నవలాకారుఁడు సంఘదుఃస్థితిని వాతావరణ ప్రభావమును గడు రమ్యముగ వర్ణించినాఁడు. అయినను దుద కొకపురుషుని యాదరణమే యిందలి యీ స్త్రీవిముక్తికి హేతు వయ్యెను.

లోకమునకు సంబంధించిన యార్థికసాంఘికసామాజికసాంస్కృతికనైతికవిషయములతో బెనఁగొన్న దీ సమస్య యని నవలాకర్త గుఱుతింపనే గుఱుతించెను. అట్టిచో పద్మానరేనులను దహరాకాశమున వ్రేలాడు జీవాత్మపరమాత్మ లన్నట్లుగ 2 రచయిత చెప్పుట విచిత్రమైన సంగతి. ఆశయముల యాడంబరమును జలనచిత్రముల పొల్లు మాటలును నవలాపరిసమాప్తికిఁ దోడైనట్లున్నవి.

ఈ రచయితను గేవలము సాహిత్యోపాసకుఁడే యనవీలులేదు. నవల యట్టపై నున్న విషయములనుబట్టి రాజకీయములతో బ్రత్యక్షసంబంధ మున్నట్లుఁ దెలియును. 3.

నవలయందుఁ జివరిరాత్రికిఁ గారకుఁడైన 'నరేన్' గొప్పఁ యాదర్శవాదిగను బలితురాలైన పద్మ సమాజపు టినుపపాదముల త్రొక్కిళ్ళచే జైతన్యమునొందిన స్త్రీ వలెను మన కడుగడుగునను నగపడుచుందురు. అయ్యును బద్మ పతనమునకై దారి తీసిన దుష్టవాతావరణమునకుఁ బునాదియైన సమాజవ్యవస్థను గూలద్రోయుటకుఁ గాని, సంస్కరించుటకుఁగాని యాతఁ డుద్యుక్తుఁ డైనట్లు దోఁపదు.

నవలాకర్త ప్రాఁతవిషయమును దీసికొనినను నిర్మాణయుతమార్గమును సూచించినచో నతనిశ్రమ ఫలించి యుండెడిది. కారణముల నెఱుఁగకపోవుటచే గష్టములను సహించుట సహజము. కాని కారణముల నెఱిఁగియుఁ గండ్లుమూసికొని

---

1. ప్రచురణము, ప్రజాసాహిత్యపరిషత్తు, ఖమ్మం.

2. "బ్రహ్మానందములో మునిగిపోయిన భక్తుఁడు భగవంతుఁడి హృదయానికి హత్తుకున్నట్టే శరీరాత్మనా నరేన్ గుండెలో కలిసిపోయింది పద్మ ... ... ఆవిడ పాపజీవితంలో ఇదే చివరిరాత్రిగా గడచిపోయింది " 'చివరిరాత్రి'— తుది వాక్యము.

3. "రాజకీయరంగములోకూడ రచయిత పాల్గొన్నారు. ... పర్శ్రిజాఉద్యమాలతో ప్రత్యక్ష సంబంధాన్నిపెట్టుకొని పీడితప్రజానీకంకోసం పాటుపడ్డారు. ప్రస్తుతము ప్రజాసోషలిస్టు పార్టీలో బాధ్యతకలిగిన పదవిని నిర్వహిస్తున్నారు. " 'చివరిరాత్రి'వెనుకవైపుటట్టమీఁద.

కూర్చుండుట యసహజము. ఈ నవల కేవలము సాహిత్యోపాసకుఁడే వ్రాసియున్నచో నే విధమైన యాక్షేపణయు నుండకపోయెడిది. కాని నవలాకారులు రాజకీయవేత్తలునై యున్నప్పుడు పాఠకు లెంతో నిర్మాణకార్యక్రమసూచన మాశింతురు. అట్టివారి కిది నిరాశఁగొల్పును.

నవలాకర్త తన రచనలో జొప్పించిన భావములు, నాదర్శములు నడుగడుగున నెదురుతగులుటతో గొందఱకు విసుగు కలిగెడి యవకాశ మున్నది. రచయితను సమాజములోని లోఁతుపాఁతులను బాగుగఁ దఱచి యాకళించుకొనిన యనుభవశాలిగా నీ నవల చాటును. అనువాద మనిపించుకొననంతటి సరళముగ సాగిపోయినది.

మొత్తముమీఁద వలసతగల వ్యక్తులు తమకు వాటిల్లిన దుర్గతికిఁ గారణమని సంఘమును దూషించి సంతుష్టిపడు మనస్తత్త్వము మనలో బాగుగఁ బ్రబలుట కిట్టి యనువాదములు తోడ్పడినవి. వీని ప్రభావము మనపై నామేరవఱకుఁ బ్రసరించిన దనుట రూఢము.



## ప్రతీకి లి[1]

విక్టర్ హ్యూగో మహాశయుఁడు రచించిన '93'అను పేరుగల ఫరాసువిప్లవ[2] కథ యీ నవలకుఁ బ్రాతిపదిక. ఇందలిది భారతదేశకథయైనను జాలవఱకుఁ బరాసు విప్లవకాలమునాఁటి పరాసుదేశవ్యవహారములే యిం దుచితమైన వాతావరణమునఁ బ్రదర్శితము లైనవి.

ఫ్రెంచ్ విప్లవము నాధారముగఁగైకొని పలువురు పలురచనలు గావించిరి. వారిలో ఛార్లెసు డికెన్సు పండితుఁ డొకఁడు. ఆంగ్లనవలలలో సాధారణముగ మానవుల యూహల కతీతములైన యభూతకల్పన లుండవు. సంఘమున కాదర్శప్రాయము లగు నైసర్గికకథావస్తువులతో నవి యలరారు చుండును. అట్టి వానిని రచించిన వారిలో స్కాటు, డికెన్సుమహాశయులు ముఖ్యులు. డికెన్సు మహోదయుఁడు "రెండుపట్టణములగాథ"[3] యనెడి నవల నొకదానిని గూర్చెను. అది యాతని రచనలలో నగ్రస్థానము వహించినది.

---

1. రచన— 1953నకుఁ బూర్వము. క్రీ. శ. 1954ప్రథమముద్రణము. 2. క్రీ. శ. 1789.

3, " The Tale of two Cities. "

ఆ నవలయందలి కథాంశముల నాధారముగఁగొని యాంధ్రమున మఱలఁ బెక్కు నవలలు వ్రాసిరి. అందు 'ఉత్తరగోపుర' 1 మనునది యొకటి 2. ఇందలి వాతావరణము, పాత్రలు, నన్నియు బరాసువిప్లవమునకు జెందినవే! 'వ్రతశీలి'వలె నిది భారతదేశచరిత్రచిత్రణము కాదు. ఇందలి "కార్టను"పాత్ర మహోదారమైనది. పరార్థప్రాపకతకై స్వార్థపరిత్యాగమును బ్రాణముల బలిదానమును జేయ "కార్టను" పడినపాట్లెట్టివేని నెగ్గినను, నింతింత యనరానివి. క్రమక్రమపరిణామముచే నీతఁ డుదారుఁడై సౌజన్యమున వాసికెక్కను. డిఫార్జిదంపతుల పాత్రలు కేవల మీతనికి విరుద్ధమైన సృష్టి. భూస్వాముల యమానుషకృత్యములకు బలియైన కుటుంబములో సజీవురాలై మిగిలిన డిఫార్జిసతి యొక్క తెయుఁ దాను పోనుపోను భర్తనుగూడ నిర్దయు నొనర్చి ప్రతీకారవాంఛాపరతచే దౌర్జన్యమున వన్నెగాంచినది. 'ఉత్తరగోపురము'నందలి కథకుఁ బ్యారిసునగరములోని 'బాస్టలు'కారాగృహమునఁగల 'యుత్తర గోపురమ'నెడి ప్రదేశము మూలాధారశిల. అందుచే నా నవల కా పేరు పెట్టఁబడెను.

స్వర్గీయ తెన్నేటి సూరి డికెన్స్‌నవలను 3 రెండు మహానగరాలు'అను పేరిఁట నిటీవల 4 యథాతథానుసారవాదముచేయుట యింకొక యుదాహరణము. ఫ్రెంచి విప్లవమును బురస్కరించుకొని రచింపఁబడిన యీ మూఁడు ప్రసిద్ధనవలలలోను భయం కరమైన విప్లవవాతావరణము 'వ్రతశీలి'యందు ముమ్మరము. 'ఉత్తరగోపురము'నందలి కార్టను. వ్రతశీలియందలి విష్ణుగుప్తుఁడును స్వార్థత్యాగమున కూహావధితమస్వరూప మహోదారులైనను మఱల వారిలో వ్యత్యాస మున్నది. కార్టనుప్రకృతి లలితము; వ్రతశీలియగు విష్ణుగుప్తునిప్రకృతి కఠోరము. ఒకరిలో స్త్రైణ మెక్కువ; వేఱొకరిలో పౌరుష మెక్కువ. ఒకరు స్త్రీప్రణయమునకై బలిదాన మగుదురు; మఱియొకరు శిష్యవాత్సల్యమునకు, నిష్ఠురధర్మమునకు బలి యగుదురు. ఒకరిది దయావీరము; మఱి యొకరిది దానవీరము. కార్టను చేసినది ఫలాభిసంధివిరహితమైన ప్రాణత్యాగము. అతనిది మధురసుకుమారప్రకృతులకు నచ్చును; ఇతనిది తేజశ్శాలురకు, దృఢశీలుర కును నచ్చును.

పీడితప్రజానీకముపై ననుకంపవిషయమునను విప్లవకారుల దౌర్జన్యవిషయ మునను నీ రెండునవల లొకదాని కొకటి తీసిపోవు. 'ఉత్తరగోపురము' ఫ్రాంసుదేశ

1. రచయిత ఉభయభాషాప్రవీణ శ్రీ శిష్లాలక్ష్మీకాంతశాస్త్రి. ప్రథమముద్రణము 1950. బి.ఏ., పట్టపరీక్ష కిది యాంధ్రకళాపరిషత్తునందు క్రీ. శ. 1954లో నుపవాచకముగఁ బఠితము.
2. "రెండు మహానగరాలు" అను స్వర్గీయ తెన్నేటి సూరి యనువాద మింకొకటి; ఆంధ్ర గ్రంథమాలప్రచురణ; (1953).
3. 'The Tale of two Cities'. 4. ఆంధ్రసచిత్రవారపత్రికయం దిది తొలుదొలుత క్రీ. శ. 1957లో ప్రకటితము.

కథ యగుటయు 'వ్రతశీలి' భారతీయకథ యగుటయు నొక ముఖ్యభేదము. 'ఉత్తర గోపురము'కథయే మనదేశమునకుఁ జెందియున్నచో, మెత్తనిహృదయముగలవారు దానిని జదివి యశ్రునేత్రావరణశీలురు గాకుండలేరు. 'వ్రతశీలి'కథయే విదేశములకుఁ జెందియున్నచో, విప్లవభావోద్దీపితులై చదువరులు కదనమునకుఁ గాలుద్రవ్వక యుండలేరు.

*వ్రతశీలికథాకాలము : రాజకీయాదిపరిస్థితులు:—*

భరతదేశమునఁ గ్రీస్తుశకమునకుఁ జాల పూర్వమే జరిగిన సంఘటన లీ నవల యందలి యంశములు. నవనందుల కాలము, మగధసామ్రాజ్యవిచ్ఛిన్నప్రారంభ కాలము. మగధసామ్రాజ్యమునకు సంబంధించిన రాష్ట్రములలోఁగూడఁ బ్రజాస్వామికవాదులు బయలుదేఱిరి. ప్రజాస్వామికవాదులకును రాజపక్షమువారికిని బోరాటములు మెండయ్యెను. పట్టనవాసులు పెక్కురు ప్రజాస్వామ్యమునం దభిమానము కలిగియుండఁగా, జానపదులు రాజభక్తిపరులై యుండిరి.

మహారాజు నిరంకుశపరిపాలనమునఁబడి నలిగిపోవు ప్రజలయందు విప్లవ ఛాయలు పొడచూపినవి. స్వాతంత్ర్యప్రకటనమున కదే యదను. ఔత్తరాహులు ప్రజాస్వామికము నేర్పఱచుటకై ప్రబలప్రయత్నములు చేయసాగిరి. నగర పట్టనములనుండి విప్లవప్రచారము పల్లెలకుఁ బ్రాఁకసాగినది. కాని గ్రామణులు రాజాశ్రితులు; వారి యనుయాయులు గ్రామీణులు. కావున నాగరకులకుఁ బల్లీయులకు నిందు పోరాటము.

సామ్రాజ్యవాదులకు రాజభక్తివలన నేకనాయకత్వము. వీరు యుద్ధమున సుశిక్షితులు. సుదృఢదుర్గములు, కవచశిరస్త్రాణములు, ఖడ్గబాణబాణాసనములును వీరి కున్నవి. ప్రజాస్వామ్యవాదుల కవిలేవు. వారిలో బహునాయకత్వము. తన్మూలముననే యభిప్రాయభేదములు. ఎట్టకేలకుఁ బ్రజాస్వామ్యపక్షమునఁ బ్రతినిధు లేర్పడిరి. వారు కార్యనిర్వాహకవర్గమును, నా వర్గము నియంతయగు సర్వాధికారిని నేర్పఱచుట తటస్థించెను. ఈ సర్వాధికారిపేరు విష్ణుగుప్తుఁడు.

ఆ నాఁడు యుద్ధములచే దేశమంతయు నట్టుడికిన ట్లుడికిపోవుచుండెను. అశాంతి ప్రబలినదేశమున ఢామపిశాచతాండవమువినా యేమి యుండఁగలదు? ప్రజానీకము దారుణహింసాకాండకు గుఱియైనది. సామ్రాజ్యసైనికుల యుద్ధపద్ధతి కడు భీతావహమై యుండెను. విద్రోహుల నాబాల స్త్రీవృద్ధముగఁ జంపుట, బంధితుల నురిదీయుట, గ్రామములను బరశురామప్రీతి యొనర్చుట, బిడ్డపాపల నెత్తికొనిపోవుట, క్షతగాత్రులనైన వధించుట, వీరికి నిత్యకృత్యములు. అయినను బ్రజాసైనికులు దయాదాక్షిణ్యములు కలిగి స్త్రీవృద్ధశిశువుల నాదరించు చుండిరి. వారి నాయకులు శత్రువులను మిత్రులనుగా జూచుటకుఁగూడ వెనుదీయలేదు.

ఏకకుటుంబములోని యన్నదమ్ములు, తండ్రికొడుకులు విభిన్నపక్షములయం దా దరముకలిగియుండుటయుఁ గలదు. వా రొండొరులను గ్రూరముగ దండించుటకుఁగూడ వెనుదీయ కుండిరి. నందివర్ధన నాగదత్తు లన్యోన్యము దండింపఁజూచుకొనుట యిట్టిదే! సామ్రాజ్యసంరక్షణ మీశ్వరసంకల్పమని సామ్రాజ్యవాదుల విశ్వాసము. వారి యుద్దేశమున రాజద్రోహులు, దేశద్రోహులు నీశ్వరద్రోహులుగూడ. ప్రజాస్వామ్య వాదులు, 'ప్రజారాజ్య మీశ్వరసంకల్పము; అది యనయము సిద్ధించు'నని సుదృఢ విశ్వాసముతో నుండిరి. వారు న్యాయసభల నేర్పఱచి, శిక్షాస్మృతుల ననుసరించి ప్రవర్తించుచు దేశక్షేమార్థము కఠోరశాసనములకుఁగూడఁ దలయొగ్గుట యీ నవల యం దభివ్యక్తము.

కావున యుద్ధవాతావరణము భయంకరమై దేశమెల్లెడ నలముకొనెను. దానిచే దానవత తాండవించినది. అనద లరణ్యములుపట్టిరి. భార్యాభర్తలు, మాతాశిశువులు, తండ్రికొడుకులు విడిపోయిరి. నిద్రాహారశూన్యులైన రాజ్య ప్రజల తల్లడమునకు మితిమేరలు లేవు. 'ఉత్తరగోపురము'న కే విధమునను 'వ్రతశీలి' వాతావరణచిత్ర ణమునందు దీసిపోవునది కాదు. ఇట్టి విప్లవాత్మక నవలలకు వాతావరణము ప్రాణా ధారము. ఈ విషయమునందు సంస్కారచ్యుతిరసానుభూతికి భంజక మగును.

వ్రతశీలి: విషాదాంత నవల:-

ఈ నవలయందలి ప్రముఖపాత్ర విష్ణుగుప్తుఁడు. అతఁడు లేని నాఁడీ గ్రంథమే లేదు. నవలయందు సాధారణముగ నెట్టి పాత్రలైన సృజింపఁబడవచ్చును; కాని కఠోర నియమబద్ధులై, విధినిర్వహణదీక్షాదక్షులై, యాదర్శములకును ననురాగమునకును సంఘర్షము ఘటిల్లిన సందర్భమున నిష్పాక్షికముగ నిరభిమానముగఁ గర్తవ్యమును బాలించియు నభిమానమును విస్మరింపలేక నిరాశోద్వేగోపహతులై ప్రాణపరిత్యాగ మొనర్చిన విషాదాంతనాటకనాయకులవంటి పాత్రలు సృజింపఁబడుట యరుదు. అది, బహుకష్టసాధ్యమైన పని. అందువలననే విష్ణుగుప్తునకును నవలకునుగూడ 'వ్రతశీలి' యన్న పే రన్వర్థ మగుచున్నది.

ఆదినుండియు విష్ణుగుప్తుఁడు ప్రముఖపాత్రమును దాల్చినవాఁడే! శిశునాగవంశీ యులకుఁ బురోహితుఁడై, యాచార్యుఁడై ప్రజలయు బ్రభువులయు మన్ననలు వడ సెను; సాంగోపాంగముగ వేదములఁ గఱచి, సర్వశాస్త్రములఁ బఠించి, విద్యలలోసరస్వతి మాత్రమేకాక యాతఁడు శ్రీమంతుఁడై కూడ విరాజిల్లెను; చోద్యముగొల్పునట్టి సుం దరుఁడు. ఆతని సువిశాలఫాల మనన్యసామాన్యప్రతిభను బ్రకాశింపఁజేయును; బ్రహ్మ తేజము రూపొందిన సత్యమును బ్రకాశన మొనర్చును; ఆకర్ణాంతవిశాలములైన నేత్రములు దీక్షాత్యాగములఁ బరిస్ఫురించును. సర్వవిధముల నాకర్షించు నాతనియందుఁ జూపఱకు గౌరవాభిమానములు.

అతఁడు స్వార్థరహితుఁడు; సంపదలను సుఖసంపదలను బరిత్యజించి బ్రహ్మచారియై, విరాగియై మానవసేవయే మాధవసేవ యని ప్రజాసేవయందు కాలము గడపఁజొచ్చెను. అనుకంపాప్రపూర్ణమైన మనస్సుతో నసహ్యాములేక రోగులకు సేవ చేయుచు, దీనులఁ గాచుచుఁ బ్రజలకుఁ దలలోనినాలుక యైనాఁడు.

పరపీడన మాతనికిఁ బరమాసహ్యాము. దానసే ప్రజాపకారచర్యల నొనర్చు రాజులయెడను, రాచరికము నెడను వైముఖ్యముగలిగి యాతఁడు ప్రజాపక్షమగు ప్రజాస్వామ్యపక్షమునకుఁ ద్రికరణశుద్ధిగ సేవకుఁడయ్యెను; స్వధర్మనిరతిఁగలిగి స్వార్థరహితుఁడై ధర్మస్వరూపుఁడై ప్రజాస్వామ్యపక్షమునకు నియంత కాఁగలిగినాఁడు. అతఁడు సహింపనిది ధర్మచ్యుతి; సరిపెట్టుకొనలేనిది వ్రతభంగము.

ఇట్టి విష్ణుగుప్తుఁడు తాను విశ్వమానవశ్రేయఃకామియయ్యు, నాగదత్తునియెడ నపారవాత్సల్యము వహించెను; ఈ పరస్పరవిరుద్ధములగు నాశయవాత్సల్యములకు సంఘర్షము రాఁగా నాగదత్తున కురిశిక్ష విధించియు నా దుఃఖమునకుఁ దాళఁజాలనివాఁడై నిజాసువులను దృణప్రాయముగఁ ద్యజించినాఁడు.

ఈ వ్రతశీలి యాయుధములు ధరింపని పరివ్రాజకుఁడై యుద్ధములఁ బాల్గొనెను. ప్రేమించిన వ్యక్తుల కీతఁడు తానే కవచము; అరివీర భయంకరుని ఖడ్గమున కాహుతికానున్న నాగదత్తున కడ్డముగ నిలఁబడి యా ప్రహరణమును దా ననుభవించినాఁడు; నిజప్రాణములఁ బరిత్యజించియైన శాంతిసంస్థాపనకై సర్వదా సంసిద్ధుఁడై యుండెను; పాటలియందలి శత్రువులు లొంగిపోయినచో వారి యధీనమగుటకుఁ దా వెనుదీయువాఁడు కాఁడు.

విష్ణుగుప్తుని వ్రతము కఠోర మైనది. శత్రువులయెడఁ గరుణఁజూపుట యాతని దృష్టిలో బ్రజాద్రోహమే; శత్రువున కే విధముగఁ దోడ్పడినను జాలును;వాఁ డెంత ధర్మాత్ముఁడైనను, బ్రజారంజకుఁడైనను, దన కెంతప్రేమపాత్రుఁడైనను వాఁడు వధార్హుఁడే. ఇట్టి వ్రతశీలికి మానసికసంఘర్షము సంభవించెను. ఒకవంకఁ బరమప్రేమాస్పదుఁడైన నాగదత్తుఁడు, నందివర్ధనుని రక్షించిన ప్రబలదోషము; ప్రజాపక్షము వారికిఁ దన వాగ్దానము. తత్సంబంధమైన నిష్ఠురవిధియు వేఱొకవంక. తమ ముప్వురిలో నొక న్యాయదాయి నిందితునకు మరణదండనమును, వేఱొక న్యాయమూర్తి క్షమను విధించుటచే, నంతిమనిర్ణయభారము తనపైఁబడినపుడు తా బ్రధానన్యాయమూర్తియై, పరమప్రేమాస్పదుఁడును బుత్త్రనిర్విశేషుఁడును బ్రాణతుల్యుఁడును నగు నాగదత్తున కీతఁడు మరణదండనము విధించినాఁడు. ప్రేమమూర్తియయ్యు నిట్లు సద్ధర్మానుష్ఠానమునందు వెనుదీయక వ్రతశీలియై విష్ణుగుప్తుఁడు ప్రాణపరిత్యాగ మొనర్చి యన్వర్థబిరుదాంకితుఁ డయ్యెను. అందుచే నీ నవల కీ పేరు సార్థక మైనది. ఈతని

ప్రాముఖ్యమే యీ నవలానామౌచిత్యమును నిరూపింపఁగలదు. ఈతఁడు పొందిన చిత్తక్షోభము, నాంతరద్వంద్వము, నీ నవలను విషాదాంతనాటకముల పంక్తిలో నిల్పఁగలుగుచున్నవి.

*వ్రతశీలి: కార్యప్రధాన శీలప్రధాన నవలా లక్షణములు :—*

ఈ నవలయందు సుభద్రయు, నామె ముప్వురుబిడ్డలును జాల ముఖ్యపాత్రలుగఁ బరిణమించిరి. దారుణవిప్లవఫలితముగ సామ్రాజ్యసైనికులు చెలరేఁగి స్త్రీబాలవృద్ధులనుసైతము దారుణమారణకృత్యములకు గుఱికావింపుచుండగ, మఖపురినివాసిని యగు సుభద్ర, భర్తయు మామయుఁ దండ్రియు సామ్రాజ్యవాదులచే నిహతులు కాఁగా, గృహదాహముచే గ్రామమును వీడి పసిపాపల ముప్వురితోడ నరణ్యముపట్టినది. అట ప్రజాస్వామికపక్షము వారిచే రక్షింపఁబడియామెయు బిడ్డలును బ్రథమవిహారమునకుఁ గొనిపోఁబడఁగా, నందివర్థనునిసైన్యము ప్రజాస్వామికసైన్యముతో బోరాడి దానినోడించెను. అందుసుభద్ర మృతకల్ప యైనది. నందివర్థనుని యానతినిబట్టి సామ్రాజ్యసైనికులామెబిడ్డల మూగుర నెత్తికొనిపోయి చివరకు వారిని పాటలీనగరము చేర్చిరి.

సుభద్రయు మనస్వి చేసిన చికిత్సచే గాయములు మానఁగా, నారోగ్యము వడసెను; కాని, బిడ్డ లపహరింపఁబడిరని విని మనస్సుచెదఱ వీఁడిడియెత్తి వారి నన్వేషించుచుఁ బాటలీదుర్గమును సమీపించినది; అచ్చట దుర్గము దహన మగుచుండ నా వెలుఁగులో దగులఁబడుచున్న యొక మేడయందలి పైభాగమునఁగల తన పిల్లలఁ గాంచి కెవ్వు మన్నది. ప్రేమార్ద్రమును దుఃఖప్రపూర్ణమును హృదయవిదారకమును నైన యా యాఁడుఁగూయి, కోటవీడి పాఱిపోవుచున్న జాలిగుండియలు గల నందివర్థనునిగూడ గలఁచివైచెను. అతఁడు నిజప్రాణరక్షణప్రయత్నమును విడిచి, సామ్రాజ్యరక్షణప్రయత్నమునుగూడ మఱచి, శత్రుసైనికులకు భయపడక, భీకరాగ్నిజ్వాలలకును వెఱవక వెంటనే శిశుప్రాణత్రాణదీక్ష నెప్పుడుతాల్చెనో, యప్పుడే కథాగమనమును దానితోబాటుగ నతనిప్రకృతియుఁ బరివర్తన శీలములైనవి.

ప్రాసాదోపరితలమున నున్న శిశువుల రక్షించి నందివర్థనుఁడు దాను శత్రువులకు దొరికిపోయినాఁడు. అతని దయాప్రపూర్ణహృదయమునకు, వీరసాహసకృత్యమునకు నాగదత్తుఁడు ముగ్ధుఁడై గురునాజ్ఞనుగూడ ధిక్కరించి యాతనిని బందిగమునుండి విడిచిపుచ్చెను. అదియే నాగదత్తున కురిశిక్షయు, వ్రతశీలికి నిజహత్యయును ఘటింపజేసి కథాగమనమును మలఁచినది.

ఇట్లు సుభద్రయు నామె ముగ్గురుబిడ్డలు నెచ్చటికచ్చటనే కథను సరళమార్గమున జరుగనీయక, దానికి నరాళగతిఁ గల్పించిరి. మొదట వారు ప్రజాస్వామిక

వాదుల దయాదాక్షిణ్యములను వివృత మొనర్చినారు. అట్లే ప్రథమవిహారమున సామ్రాజ్యసైనికుల దయాదాక్షిణ్యవిరహితమును క్రౌర్యసహితము నగు ప్రవర్తనలను విశదపఱచుట జరిగెను. మఱియుఁ గరడుగట్టిన సామ్రాజ్యవాదియు శత్రువుల దారుణమారణమునకుఁ బాలొనర్పఁ సంశయింపని క్రూరుఁడును స్త్రీబాలవృద్ధుల యెడనేని నిష్కరుణుఁడును నగు నందివర్ధనునియందు నిగూఢమైయున్న దయామరందబిందువును వెలికిఁగొనివచ్చి మానవునిలో దానవుని లక్షణములతోఁబాటు దివ్యజ్యోతియుఁ గలదని నిరూపింప వీలైనది.

ఆ ముప్పురుబిడ్డలును వారి రక్షణప్రసక్తియు లేనినాఁడు వ్రతశీలిని బరీక్షించు సన్నివేశమే ఘటిల్లెడిది కాదు; నాగదత్తుని మెడ నురిత్రాడు వ్రేలాడవలసిన యావశ్యకము, విష్ణుగుప్తుని యాత్మహననఘటనమును లుప్తము లయ్యెడివి. కథ యప్పుడు సహజము సరళమునై సాగిపోయెడిది. కాని యా ముప్పురుపాపలవలన నీ నవల యెంతయు హృదయవిదారకములగు కరుణాపూర్ణ సన్నివేశములతోడ ననూహ్యము నత్యద్భుతము నగు బరిసమాప్తితోడను వెలసినది.

వ్రతశీలి: దృఢబంధము, పాత్రల యన్యోన్య సంబంధము:—

ప్రాణాధికముగ నాగదత్తుని విష్ణుగుప్తుఁడు ప్రేమించెను. పరులకపరకాలుఁడైన విష్ణుగుప్తుఁడీతనికి శీతభానుఁడు. ప్రజాస్వామికమునకుఁ బ్రబలవిరోధి యగు నందివర్ధనుని విడిచిపుచ్చుటచే నీతనికి మరణదండన తప్పలేదు. కాని తన ప్రియశిష్యున కీ దండన విధించిన విష్ణుగుప్తుఁడే చిత్తసంక్షోభమునకు నిల్వలేక స్వవధము గావించుకొనినాఁడు. కావున నాగదత్తుఁడు చివరకు గురుమరణమునకు హేతువయ్యెను.

విష్ణుగుప్తుఁడు:—

వ్రతశీలి యగు నీతఁడు నందివర్ధనుని నాగదత్తుఁడు విడిచిపుచ్చినప్పుడు శపథభంగము చేయనిష్టములేనివాఁడై నాగదత్తున కురిశిక్ష విధించి నిజప్రాణాధికుని నిండుప్రాణము హరించుటకుఁదానే కారకుఁడైన హేతువుచే, జీవములతోనుండ నిచ్చగింపక కత్తితోఁబొడుచుకొని మరణించెను. ఒక్క విష్ణుగుప్తుఁడుగాక వేఱెవ్వరైన నియంతయైనచో గథాపరిణామ మీ విధముగ నుండెడిది కాదు. గురుశిష్యు లొకవిధముగఁ బరస్పరమరణములకుఁ గారణభూతులైరి.

నందివర్ధనుఁడు:—

ఇతఁడు శిశునాగవంశీయుఁడు; మహాపద్మనందుని కాలముననే శిశునాగవంశము రాచరికమును గోలుపోయెను. మగధసామ్రాజ్య మల్లకల్లోల మైనపుడు నందివర్ధనుఁడు

సర్వసైన్యాధ్యక్షుఁడుగా నియమింపఁబడి సామ్రాజ్యరక్షణదీక్షాకంకణుఁడై దయా దాక్షిణ్యముల వీడి ప్రజాస్వామికవాదుల మట్టుబెట్టఁజొచ్చినాఁడు.

మొదటినుండియు నితఁడు రాజకార్యనిర్వహణముననే నిమగ్నుఁడై యుండు టచే, భీకరసమరసన్నివేశముల కలవాటుపడి హృదయశాంతికి దయాదాక్షిణ్యములకు దూరమైపోయెను. కఠోరశాసనములవలన, భీషణప్రతిహింసాస్వభావమువలన, భయం కరసంఘటనా సమన్వితమగు సామ్రాజ్యరక్షణభారమువలనను గ్రుంగి యీతఁడు లోకు లకు గ్రూరుఁడై భయంకరుఁడై కాన్పించుటయం దాశ్చర్యము లేదు.

తుదకుఁ జిత్రమేమన, నీతఁడు సుభద్రశిశుత్రయమును రక్షింప స్వరక్షణమును సామ్రాజ్యరక్షణమునుగూడ మఱచి వెనుదిరిగి, భయంకరాగ్నిజ్వాలలనుండి యా బిడ్డలఁగాపాడి, నాగదత్తునకుఁ దాను బందిగ దొరకిపోయినాఁడు. అట్లని యీతఁడు ధైర్యస్థైర్యములను గోల్పో లేదు. ప్రచండహింసాకాండతోగూడిన రక్తపంకిలగాత్రుఁ డగు నీతఁడు రమణీయకృపాసాగరుఁడుగఁ బరిణమించుటయందుగల నాటకీయత గమ నార్హము. ఇతనిది పరివర్తనసహమైన యసంపూర్ణపాత్ర; కావుననే నవ్యతను స్వీకరింపఁ గలఁడు. ఈ నూతనతచేతనే మనము నవలా పఠనాకౌతుకితుల మగుట. ఏ నాఁ డీతని జాలిగుండియలు ద్రవించినవో, యా నాఁడే లోకమునకుఁ బ్రజాపీడానివారకుఁడగు నేకైకప్రజాస్వామ్యనాయకుఁడు దొరకెను. ఇఁక, నాగదత్తవిష్ణుగుప్తులతో బనిలేదు. వారి నిద్దరి నొకటిగాజేసి నియంతయు సైన్యాధ్యక్షుఁడును దయాదక్షుఁడునునగు నంది వర్ధనుని గ్రొత్తవానినిగ విధి మనకుఁ బ్రసాదించినది.

ఈతని సాహసోపేతములగు దయాదాక్షిణ్యములకు ముగ్ధుఁడై నాగదత్తుఁ డీతనిని స్వేచ్ఛగ విడచినాఁడు; నేలమాళిగయం దీతని స్థానమును దాను స్వీకరించినాఁడు. అంత వఱకును బ్రజాస్వామికమునందలి లోపములను బోధించు నీతఁడు శీలస్వభావ మునఁ బరిణామమునొంది స్వతంత్రుఁడై వెడలిపోవును. తొలుత దారుణకృత్యములచే బ్రతినాయకుఁడయ్యును ధైర్యగాంభీర్యసాహసాదులచే శ్లాఘనీయుఁడై తుద కీతఁ డనుకంపామూర్తి యగుటవలనఁ గథాప్రవాహగతికి నిరోధముగలిగి యది కుటిల గామినికాఁగా, నాగదత్తవిష్ణుగుప్తు లొండొరుల మరణమునకుఁ గారణభూతులైరి.

మనస్వి ప్రయోజనము:—

మనస్వి వైశాలియందలి భిక్షువు. ఈతఁడు రక్షించుటచేతనే నందివర్ధనుఁడు ప్రథమవిహారమునందలి శిశువుల నెత్తుకొనిపోవుటయు, సుభద్ర పునర్జీవితయై బిడ్డల నన్వేషించుటయుఁ బాటలి కేఁగి యాక్రోశించుటయు దానివలనఁ గథయంతయు వేఱొక చిత్రమార్గమునఁ దిరుగుటయు జరిగినది.

మన కథాకాలమున మనస్వివంటి బౌద్ధభిక్షుకు లటనట రాజకీయములతో సంబంధములేకుండ మానవసేవ చేయుచుండిరని యిందు నిరూపితము. వా రొనర్చిన యవి వక్షితోపకారము లొక్కొక్కప్పుడు ప్రజాపీడకుఁగూడఁ గారణము లయ్యెడివి.

మనస్వి కొన్ని సార్వజనీనయథార్థవిషయములను బ్రవచించియున్నాఁడు. దారిద్ర్యము, నైశ్వర్యము నీ రెండును జగత్తును జలింపఁజేయునవి. భాగ్యవంతుఁడు దరిద్రుఁడు కాఁగోరఁడు. వ్యత్యస్తములగు క్లిష్టపరిస్థితుల కన్నిటికి నిదియేమూలకందము. ప్రజలకు రాజభక్తి శ్రేయస్కర మైనది. కాని రాజులకుఁగూడఁ బ్రజలయందు ప్రేమాభిమానము లుండవలెను. తోడేలును రక్షించినవాఁడు గొఱ్ఱెలను జంపినట్లే !

**నౌకాభంగము ( విప్లవము )–తత్పరిణామము :–**

బాహ్యదృష్టికి వస్త్రకఁపుటోడవలెఁ గన్పట్టుచు, యథార్థమునకు నానావిధశస్త్రపరికరములతో నాయుధసామగ్రితో సజ్జితమైన పెద్దనౌకపేరు 'జలజ'. సుశిక్షితులగు నావికులు, సైనికోద్యోగులు వెంటరాఁగా నధికారనిష్ఠీవమాననేత్రుఁడగు నందివర్ధన మహారాజు గంగాఘట్టమునుండి బయలుదేరి యందు మగధరాజధాని కేఁగుచుండెను. అప్పుడే వారణాసియందలి రాజపక్షఁపుస్కంధావారమునకు, నావ వెడలినది; జయము నిశ్చయము; వారము దినములలో బ్రజాస్వామ్యసైన్యములు నాశనము కాఁగలవని వార్త చేరినది. అంతకు నాలుగు దినముల పూర్వమే ప్రయాగయందలి ప్రజాస్వామ్య పక్షఁపు లిచ్ఛవీసైన్యాధ్యక్షునకు రహస్యముగ నొక వేగువచ్చెను. 'జలజ'మీఁద నొక వృద్ధుఁ డధికారమునువెల్రిగక్కు గంభీరవదనముగలవాఁడు, సప్తమీప్రభాతమునఁ బ్రయాగతీరమును జేరుకొనఁగలఁడు. అతనిని బట్టుకొని యురిదీయవలెను.

కాని విధివిధాన మనతిక్రమణీయమై, 'జలజ' యొక కొండకొమ్మునఁ గొట్టుకొని, తుఫానుతోడ్పడఁగా భంగపడి జలగర్భమున లీనమైపోయినది. పరియాసముతో నందివర్ధనుఁ డొక నావికుని దోడ్పాటునఁ గొండమీఁది కుఱికి ప్రాణములరక్షించుకొనెను. కాని, యా నావకుఁ గర్ణధారి యగునాతనితమ్ముఁడైన యమృతాఖ్యుఁడు నందివర్ధనుని రక్షింప వచ్చినట్లు నటించి, తన సోదరుని జంపిన యాతనిపైఁ బగఁదీర్చుకొననెంచినాఁడు. అయ్యు మఱల నందివర్ధనుని బ్రభావమునకు లోనై యతని మాటలయందలి యాథార్థ్యమును గ్రహించి, రాజభక్తుఁడై యాతనికి సర్వవిధములఁ దోడ్పడుటతో గథయం దింకొక మెలికపడినది.

నందివర్ధనుఁడు పాటలీదుర్గముననుండి నాగదత్తునితో యుద్ధముసేయుచు, విధివశమున నోడిపోయి వీరస్వర్గ మలంకరింపఁ గృతనిశ్చయుఁడై నప్పు డా సౌధమునందలి

రహస్యద్వారమున నమృతాళ్వుఁ డేతెంచి నందివర్ధనుని, హతశేషులగు నాతని యను చరులను సురక్షితముగా నా సొరంగ మార్గమున బయటకుఁ గొనిపోయినాఁడు. ఇట్లు నౌకాభంగపరిణామముగ నందివర్ధనుడు బ్రదుకుట తరువాతికథ విచిత్రముగా జరు గుట కే యనక తీరదు.

—:పాటలీదుర్గము—తత్ప్రాముఖ్యము:—

ఈ నవల యందుఁ బాటలీగ్రామము ప్రతశీలురకుఁ బుట్టినిల్లు; భయంకరసన్ని వేశములకుఁ గేంద్రస్థానము; దారుణప్రవిదారణములకుఁ బ్రధానరంగము. కథా కాలమునాఁటి కిది పురాణగ్రామమేకాని దుర్గముమాత్రము సుదృఢ మైనది. అచ్చటనే విష్ణుగుప్త నాగదత్త నందివర్ధనులు జన్మించిరి. శైశవమంతయు నచ్చటనే గడపిన నాగదత్తున కాగ్రామముపై నభిమానము మెండు; కాని చిన్ననాఁటఁగో తె రాజకార్యనిర్వహణమునఁ బరస్థలముల జీవించిన నందివర్ధనున కాగ్రామమున్న నుదాసీనత. అవసరశీలియగు నీతఁడు తనకుఁ గావలసివచ్చినప్పుడు దానిని బల పఱచెను; లేనినాఁడు పరున కుపయోగింపకుండ దగ్ధ మొనర్చెను.

నందివర్ధనుఁడుగూడ నెఱుంగని యొుక సొరంగ మా ప్రాసాదమునకుఁ గలదు. దానినుండియే యమృతాళ్వుఁ డీతనిని రక్షించును. కాని యీతఁడు సుభద్రాశికురక్షణ వ్యసనరసికుఁడై నాగదత్తుని యభినందనములకుఁ బాత్రుఁడగుట, నాగదత్తుని ప్రాణము లకు ముప్పుదెచ్చి విష్ణుగుప్తుని ప్రాణములకుఁ జిచ్చుపెట్టుటయైనది. ఇట్టిఘోరమారణము లకుఁ ద్రుతగామిప రాంతకాదుల ప్రాముఖ్యతారతమ్యనిరూపకవిచిత్రసన్నివేశములకును పరమాద్భుతఫలితములకును గ్రీడారంగమైనది పాటలీ దుర్గము. నవలలోని యాధికారిక కథ కిది రంగముకానిచో నీ నవల యీ నవల యయ్యేడిదికాదు. ఏ దేశమునకుఁగాని రాజధానీనగరమువంటి ప్రసిద్ధము ప్రధానమునైన యొుక రంగముండుట యాదేశపు నవలలవిజయమున కెట్లు తోడ్పడఁగలదో ద్వితీయప్రకరణమునకుఁ జెందిన యను బంధములో "జర్మనునవల"నుగూర్చి చెప్పునప్పుడు[1] వివరింపఁ బడినది.

## పలనాటి వీరకథ:-[2]

ఇది పలనాటిసీమకుఁ జెందిన యొుక వీరగాథ; ఒక విధముగఁ బ్రాంతీయము; ఒకానొకకాలమునకుఁ జెందిన చరిత్ర. నాటి సాంఘికపరిస్థితులపై నెక్కువగ వెలుఁగుఁ

1. చూడుఁడు: ద్వితీయసంపుటము అనుబంధము. 2. క్రీ. శ. 1950.

ప్రసరింపఁగలది. ఒక కాలమునకు సంబంధించిన చరిత్రను జిత్రించుచున్నకారణముచే నిది కాలపరిమితికిని గేవలము చరిత్రకును గట్టుపడియుండు నవలకాదు. అట్లుండువానిని సమకాలీననవలలు,1 చరిత్రలు2 ననఁజెల్లును. అటులనని, యీ నవలయందు సమకాలీన జీవితచిత్రణము లేదనికాని యిది చరిత్రకాదనికాని చెప్పలేము. దేశకాల వ్యవస్థాతీతమై యీ శృంఖలలకుఁ గట్టువడక విశ్వజనీనత బాగుగ సాధించుటచేనిది చారిత్రకనవలల కోరవడి దిద్దఁగలుగుచున్నది. ముందిది కాలీనసంఘజీవితము నెట్లుఁ జిత్రించెనో పరిశీలింపవలెను. పదప నిందలికథ ప్రాంతీయత నెట్లతిక్రమించెనో యన్వయింపవలెను. కేవలము సమకాలికతయుఁ బ్రాదేశతయు లేకున్నను నిది చారిత్రక నవలలలో నగ్రస్థితి నెట్లధిగమించెనో నిరూపించుట మఱియు ముఖ్యము.

—:ఇందలి సాంఘిక పరిస్థితులు:—

సంతానములేని తనకు సద్గతు లుండవని శోకముతో నలుగు భూపతి కుమిలిపోయెను. అందుచే, దన మంత్రి దొడ్డనాయని జ్యేష్ఠపుత్త్రుఁడైన బాదనాయని జేరఁదీసి పెండ్లికూడఁ జేసినాఁడు. అట్లే కన్నమదాసుని బ్రహ్మనాయఁడు నభిమాన పుత్త్రునిగ స్వీకరించుటయు జరిగినది. బిడ్డలకై రామిరెడ్డి దంపతు లటమటించి నాగమ్మదొరకుట కానందపరవశులైరి. కావున ‘ లేబరముకాదె బిడ్డలులేనిబ్రతుకు ’ అనుట నాఁడును నిజమన్నమాట. బాదనాయని బెంచుకొన్న పిదప నలుగురాజునకును గన్నమదాసుని జేరదీసినపిమ్మట నాయనికిని బుత్త్రిసంతతి కలిగెను. నిస్సంతయిన కొందఱకు దత్తస్వీకారము పిమ్మట సంతతి కలుగవచ్చు నన్నది నాఁటినుండి నేఁటిదనుక గల నమ్మకము. ఈ పెంచుకొనుటలోగూడఁ గులము పాటించెడివారు కారు. ప్రేమానుబంధమే ప్రధానము. కాని, కొందఱు స్వార్థపరులు కులతత్త్వము నస్త్రముగా బ్రయోగించి కృతార్థులగుట యెందునుగలదు. మాచెర్లకు సేనాధిపతిగఁ గన్నమదాసుని నాయఁడు నియోగించి వర్ణధర్మమును ధ్వంసముచేయుచున్నాఁ డని మలిదేవునకు నాయనిపై నాగమ్మ ద్వేషముగొలుపుట యిందులకు నుదాహరణము.

జాతిగుండెలుగల తల్లులు తమ రహస్యసంతానమును బురిటిపొత్తిళ్ళనుండి ముళ్ళపొదల పాలుచేయుట, మనలో నాఁడునుగల దురాచారము. చోరులు ధనవంతుల బిడ్డలను దొంగిలించి, నగ లొలిచికొని పొదలలో వదలివేసి, పాఱిపోవుటయుఁగలదు. పై రెండు దురాచారములలో నే యొక దానివలననోగాని రామిరెడ్డికి నాగమ్మ యపవిద్ధపుత్త్రిక యైనది.

బ్రహ్మనాయఁడు ప్రసిద్ధ విష్ణుభక్తుఁడు. నాగమ్మ వీరశైవదీక్షను గొన్నది. మొత్తముమీఁద శైవవైష్ణవముల స్పర్థ సంఘమున నంతఃప్రవాహముగా సాగుచుండె

(1) The Period Novels (2) The Chronicles.

ననవచ్చును. అందువలననే బ్రహ్మనాయనికి సంఘసంస్కరణాభిలాష మేర్పడినది. అది హరిజనబాలుఁడైన కన్నమదాసుని జేరఁదీసి పెంచుటగా బరిణతినొందెను.

యువకుల జీవితములను ధ్వంస మొనరింపనెంచిన దుర్మార్గులకు ధనలోభముచే గొందఱు వేశ్యలు, సుందరులు, నాట్యకల తమ సొమ్మైనవారు నుపకరణము లగు చుండిరి. శ్యామాంగివృత్తాంతమువలన నిది నిరూపితము.

సంక్రాంతివిశ్రాంతిదినములలో గోడిపందెములు వినోదముగూర్చుట యీ కాల మునం దొక కర్షకశ్రామికులకేగాదు; రాజాంతఃపురములలోగూడఁ గోడిపందెముల కార్యక్రమము ప్రఖ్యాతము. దీనికి నుదాహరణము గురిజాలకోట. బొంగరముల యాటలకుఁగూడ నానాఁడు కులవయోభేదములని లేవు. క్షత్రియయువకుఁడగు బాల చంద్రునకును బ్రాహ్మణకుమారుఁడగు ననపోతునకును బాలవీరు లందఱకును క్రీడాసక్తి సమానము.

పండుగలలో గోడిపందెములవంటి వినోదక్రీడలకు సాటిరాజులచే నాహూతుఁడై యే రాజుగాని రా ననకుండుట నాఁటి యాచారములలో నింకొకటి.

మాచర్లవారు సుఖదుఃఖములలోగూడ దేవాలయప్రతిష్ఠలు జరిపిరి. పవిత్రోత్సికా దశీదినమున వీరు చెన్న కేశవుని బూజచేసి యాయుధముల భక్తితో నారాధించి వీరగం ధము దేహమున నలఁదుకొని ఫాలభాగముల రక్తతిలకములఁ దీర్చిదిద్ది కార్యమాపురి కదనరంగమునకుఁ గదలుచూపిరి; రక్తసిక్తమగు నరసింహుని ఖండితశిరమునకు భక్తితో గర్పూరనీరాజన మిచ్చిరి. నదీస్నానశౌచములు, దైవతముల రథుఁగోరుట, సూర్య భగవానున కంజలులు, మాచర్ల చెన్న కేశవస్వామికిఁ బూజలు, గురిజాల మల్లికార్జున దేవునకుఁ బ్రణామములును బుష్కలముగ వర్ణింపఁబడినవి. తన సైన్యమును గదలించు నప్పుడును సేనకు రణరంగమున నుత్సాహముగొలుపునపుడును, 'మానవి కాదది' దానవి యని చెప్పఁదగిన నాగమ్మయే మల్లికేశ్వరునకు బంటుతనము చూపి, పలుమాఱు లాతనిని ధ్యానించె నన్నచో, నిఁక మన నవలలో బ్రతివ్యక్తికిని గల భక్తిని వేఱుగ వర్ణింపనక్కఱలేదు. ఆ కాలమున రాజులు మంత్రులు ప్రజలునుగూడ, ఆస్తికులు,సద్ధర్మ పరాయణులునై యుండిరనుట విశదము. మాంచాల పాతివ్రత్యమును, బేరమ్మ సహగ మనమును, ననపోతరాజు నాత్మహత్యయు, నాఁటి ప్రియులయు మిత్రులయు దృఢ ప్రణయానుబంధములకు నిదర్శనములు. అల్లే యలరాజునకుఁ జేసిన విషప్రయోగము, ద్వేషమునకు నిదర్శన మనకతీరదు.

ఆ నాఁటి పలనాటి సాంఘికజీవితముపైఁ దన వివిధప్రచారములను భారతకథ బాగుగ ముద్రించె ననుట కుదాహరణములు పెక్కుఁగలవు. నాలుగు పురుషార్థములను

సమన్వయించి సాధించుటయే వారి జీవితపరమావధి యని యొక్కవాక్యములో జెప్పినఁజాలును.

బాలచంద్రుని రణమునకుఁ బంపుటనుగూర్చి యైతమ్మ ముందుగా దన యత్త గారగు శీలమ్మను, పిదపఁ గోడలగు మాంచాలనుగూడ సంప్రతించెను. గండువారి యింటికి వియ్యఁపురాలు కాఁబోవుచుండుటచే నామె భూషణములు, ఫలములు, పసపుఁ గుంకుమలు పట్టించుకొనిపోయినది. తాను మఱలివచ్చి మాంచాల శుభాభినందనములఁ బడసిరమ్మని బాలునకుఁ జెప్పెను. అత్తవారింట నడుగిడినబాలునకు విప్రకాంతలు జయహారతు లిచ్చిరి. మాంచాలయు నభినందనపూర్వకముగ భర్తకు ఫాలమున రక్త తిలకము దిద్ది జయహారతి నొసఁగినది. కులాచారసంప్రదాయముల యెడ నిట్టి పక్షపాతము పెక్కుచోట్ల దావులయందు మన నవలలో నెలకొనెను.

లోనికర్తవ్యభారము భర్తకు వ్యక్తముగాకుండ మాంచాల నగుమోముతో వినోదములతో నాటపాటలలో నెట్లో యాఁజేయి గడవఁబెట్టుచున్నది. ఇంతలో బాలుఁడు మోహావిష్టుఁడై మాంచాలను జేరఁదీసికొనఁబోఁగా నామె మెడలోని ముత్యాలహార మాతని చేతికిఁదగిలి తెగిపోయెను. గళహారము తెగుట యశుభసూచకమని గ్రహించి యొక్కసారిగ మాంచాల చెన్నుదరిగి చిన్నపోయినది. తరువాతఁ దెల్లవారఁగా బాలుఁడు కదనమునకుఁ గాలుకదపెను. ఇంతలో మాంచాల యతనిని వెనుకకుఁ బిలిచి, బ్రాహ్మణుఁడుగావున ననపోతుని రణమునుండి యెట్లైన మఱలింపుఁడని ధర్మబోధ చేసినది. తన ముత్యాలహారమును ముద్దుటుంగరమును మఱచితి నని చెప్పి, బాలచంద్రుఁడు తాను వెనుచనుట కపళకున మనెడి నెపముజూపి యనపోతును మాంచాలకడకు మఱలించినాఁడు. రణరంగమున నెల్లరు భుజించుచుండఁగా, బాలచంద్రాదుల కనపోతు మరణవార్త చేరినది. వారెల్లరు నన్నములువిడిచి లేచి యాకులను 'గంగధార'లోఁగలిపి కనులు తుడుచుకొనిరి. అట్టి యశ్లీలములను నశ్లీలభీతులను జిత్రించి మన నవలాకర్త తాత్కాలికసంఘజీవితము నెఱుకపఱచి కృతకృత్యుఁడయ్యెను.

నాటకోచిత శీలప్రధాన చారిత్రక నవలలు:—

సంకుచితక్షేత్రమును, విస్తృతకాలమును గలది నాటకీయనవల. సంకుచితకాలమును, విస్తృతక్షేత్రమును గలది శీలప్రధాననవల. నాటకోచిత నవలయందు సంఘర్షకు దీవ్రత నొసఁగి, కాలవిస్తృతికి గమకమిడెడి శక్తి క్షేత్రసంకుచితత్వమున కుండుట, కొంతవఱ కిది యట్లగుటకు హేతువు.

ప్రశస్తకళాకృతియందును స్థూలముగ రెండువిషయము లుండును. అం దొకటి సాధారణవిషయము; రెండవది విశేషవిషయము. కళాతపస్వి తన కావ్యముచే గేవలము

విశేషవిషయమునే వర్ణింపఁ గడఁగుచున్నాఁడు. అందు సామాన్యవిషయము ప్రత్యక్షముగఁగాని, తక్షణముగఁగాని స్ఫురింపదు. అయ్యది యుద్భవించుటకుమాత్ర మది విశేష విషయముతోడనే యుద్భవించు చున్నది. సమకాలీనముగ నెట్లుద్భవించు నన్నరహస్యముమాత్రము మనకు స్పష్టము గాదు.

కథాసాహిత్యముగూడ నొకకళ. అందును నది సాధారణీకరణమువలన నేర్పడు కళ. సాధారణీకృతి కింకొకపేరు విశ్వజనీనత. సమస్తకళారూపావళియందును వెల్లడియగు విశ్వజనీనత యీ కథాసాహితియందును వెల్లడి కావలెను. విశ్వజనీనతాసాధకములగు సూత్రములు నవలయం దంతగా వెనువెంటనే గోచరింప నక్కఱయు లేదు. కాని వాని ప్రభావముద్రదే యంతిమ నిర్ణయము.

ఇట్టి విశ్వజనీనతయనెడి భావమున కర్థమును వ్యతిరేకపద్ధతిలో సులభముగఁ జెప్పవచ్చును. ఆ దృష్టితో బరిశీలించునప్పు డొక శిలావిగ్రహమువిలువ కేవలము దాని కాలాతీతత్వసామర్థ్యమునందే యున్నది. గానమువిలువ దేశాతీతత్వసామర్థ్యమునందే యున్నది. ఇట్లు బహిర్దృష్టి కగపడు నీ యతీతత్వము నిజమున కతీతత్వము కాదు; తద్భిన్నమైనది. దేశకాలాతీతత్వ మనుదానియందు వ్యతిరేకత్వభావము లేదు; కష్టసాధ్య మనెడి భావ మున్నది. దేశకాలాతీతత్వ మనఁగా, దేశకాలములఁ బరిగణింపకపోవుటచే సాధ్యపడునది యనుకొనరాదు. అది దేశకాలములపై నసాధారణవ్యగ్రత నిలుపుటచేతనే సుసాధ్యపడునది.

విగ్రహమునందు కాలాతీత్వము, గానమునందు దేశాతీతత్వము ననునవి నిజమునకుఁ గాలప్రదేశము లనువానిని నిరపేక్ష్యములుగఁ జేయుటవలన సాధ్యపడిన కార్యములు. ఈ యతీతత్వమునకే సాధారణీకరణము, విశ్వజనీనత యని నామాంతరములు. పిలుచుట కేపేరఁ బిలిచినను నిరభ్యంతరముగఃఁ గళాతపస్వి దేశకాలాదులకంటె భిన్నమైన యొకానొక ప్రత్యేకవిషయముపై నేకాగ్రచిత్తమును నిలువఁగలిగినపుడే యిది సాధ్యమగును. అది పరోక్షముగ నొక విజయము; తాను స్వీకరించిన యా ప్రత్యేకవిషయము ప్రసరించునట్టి యనంతమైన ఛాయ; తాను సాధించిన కార్యమునకుఁ బ్రత్యేకవిజయసూచకమగు వైజయంతి. అనఁగా నొకానొక కళావిశేషరూపము విశ్వజనీనత సాధించి నిరపేక్ష్య ముగావలెనన్నచో, ననంతత్వ శాశ్వతత్వముల పూర్వరంగ ప్రభావముగాని, వీనిలో నొకదానిని సూచించు నేదిగాని, యావశ్యకమనకతీరదు.

ఇట్లనుటచే నొక చిత్రము సాధించు విశ్వజనీనత, కేవల మది కొలుపు కాలవిస్మృతియందే యిమిడియున్న దనిగాని, సంగీతము సాధించు విశ్వజనీనత కేవల మది కొలుపు దేశవిస్మృతియందే యిమిడియున్న దనిగాని భావింపరాదు. కాలదేశాది విస్మృతులు సాధారణీకరణ సాధనముల తత్త్వములు; లేదా, చిహ్నములు. విశ్వజ

నీనత తా నొకసారి సాధింపఁబడవలెనేగాని, యిఁక నచ్చముగ నది యదియే! ఒక మహనీయకళారూపమునం దన్నియు విశేషములుగనే కనుపట్టఁ గలవు. ఒక్కొక్కపరి సాధింపఁబడినచో, నా విశ్వజనీనత యిఁక తన ప్రభావము నన్నిభాగములపై నను ముద్రింపఁగలదు; యావత్కళా సృష్టియందుగాని దాని గమనమునందుగాని ప్రస రింపనుగలదు.

ఈ సందర్భమునఁ జిత్రలేఖన సంగీతకళలతో నుపమానము చూపుట, వాని లక్షణములు నవలాలక్షణములకంటె నిష్కృష్టమై యుండుటవలననే గాదు; శీలప్రధాన నవలతో జిత్రలేఖనమునకును, నాటకీయనవలతో సంగీతమునకును గొంత సామ్య ముండుటకూడ నిందుల కొక హేతువు. ఈ రెండు నవలావిశేషములను నిష్కర్షించు నెల్లలే నిజమునకు వానివాని విశ్వజనీనతా సాధనకారణములు.

శీలప్రధాననాటకోచితనవలలకంటె నించుక తక్కువప్రాముఖ్యముగల మూఁ డవజాతి నవలావిశేషమునుగూర్చి పరిశీలించుటయే మనకుఁ బ్రస్తుతకర్తవ్యము. పైవా నితో బోల్చినప్పు డంత ప్రధానముగఁ దోఁపకపోయినను జరిత్రాత్మకనవల గుణాఢ్యత మైనది. ఇందు దేశకాలములు రెండును సమప్రాధాన్యముగల వానివలెఁ గనిపించును. కాని, కాలమునకే ప్రాముఖ్యము. అనఁగా గథావస్తువును బాత్రలను దేశకాలము లతో నన్వయించి చెప్పుచున్నట్లుఁ దోఁచినను, జారిత్రకనవలయం దొకానొక కాల విశేషమునకుఁ జెందినట్లుగ నా యంశముల నన్వయించుటయే యథార్థముగ జరుగు చున్నది. పాత్రలవలె రంగస్థలులును మాఱుచుండును.

అవి యట్లు మాఱుట క్రమక్రమముగఁ గాలముయొక్క విలక్షణత్వమువలన నని తెలియఁ గలదు. ప్రారంభమున నవి ప్రజలు లేక పాత్రలు నివసించు ప్రదేశములు; పోనుపో నవి పాత్రలొకప్పుడు నివసించిన ప్రదేశములు. జడమైన సంఘముతో బ్రారంభించినను బరిణామశీలముగల సంఘముగఁ బర్యవసించునట్టి చిత్రణమునందు పాత్రలు సర్వదా సర్వత్ర యొక్కటిగ నగపడునట్లుఁ గథావస్తువు నన్వయింతురు.

అయ్యు నిట్టి చారిత్రకనవలలయందు కాలమునకే యెక్కువవిలువ; నాటకీయనవ లలయందు కంటెఁగూడ వీనియందు దానికి విలువయెక్కువ. ఏలన, నాటకీయనవల యందు సాధింపఁబడినది యేకైకకార్యము. అందుచే నది మార్పులేని యొక స్థిరమైన పూర్వరంగవృత్తముగ గోచరింపవచ్చును. కాని, చారిత్రకనవలయం దొకదాని నొకటి వెన్నాడు నిరంతరకార్యపరంపర యుండును; పూర్వరంగములుగూడఁ బరివర్తనఁ జెంద కతీరవు. కావున నాటకోచితనవల సాధించు విశేషవిషయమునకు సామాన్యవిషయ భూతమగుచుఁ బూర్వరంగముగఁ దోడ్పడునది దేశము. చారిత్రకనవల సాధించు విశేష విషయమునకు సామాన్యవిషయభూతమగుచుఁ దోడ్పడునది పరివర్తనము; లేదా, తత్రత్య

మము. నాటకోచితనవలయందు కాలము, తన కుపాధిగఁ గూర్పఁబడిన దేశమువలన వన్నె కెక్కుచున్నది. చారిత్రకనవలయందు చిత్రింపఁబడిన యొకదేశము, దాని కుపాధియగు కాలము, నను భేదము అంతగ నగపడవు సరికదా, క్రమక్రమమున దేశము కాలముగఁ గరఁగి రూపొందును.

చారిత్రకనవలలో సంఘర్షము మానవజీవితమునకును మానవజీవితమునకును నడుమఁ గూర్పఁబడుచున్నది; నాటకోచితములయందువలె వ్యక్తిజీవితమునకును బూర్వకర్మ యనఁబడుదానికిని గాని, శీలప్రధానములయందువలె వ్యక్తికిని సంఘమనఁబడు దానికిని గాని, సంఘర్షము కూర్పఁబడదు. వ్యక్తుల జీవితములనడుమ సంఘర్షమును గూర్చుట యనఁగా నిరంతరపరివర్తనశీలముగల మానవజీవితమునకు, లేదా-పరివర్తనమునకు, లేదా-కాలస్వభావమునకుఁ బ్రాధాన్య మిచ్చుట.

ఇందుచే నాటకీయనవలాకర్తకు సంవిధానచాతుర్యమునందుఁ బ్రధానభూతమైనది ప్రారబ్ధసంచితకర్మ. శీలప్రధాననవలాకర్తకు నట్లే ప్రధానమైనది సంఘము. మొదటియాతనికి సంఘమును, రెండవయాతనికిఁ గర్మపరిపాకమును గౌణములు. మానవజీవితము, లేదా-తత్పరివర్తనము ననునది మాత్ర మా యిర్వురిలో నొక్కరికిఁ గూడఁ బ్రధానము గాదు. సంవిధానసామర్థ్యమును వెల్లడించుట కిదియొక చారిత్రకనవలాకర్తకే ముఖ్యముగఁ దోడ్పడును. జీవితము, లేదా-పరివర్తనము ననుదాని యందు ముందు సంవిధానసామర్థ్యప్రదర్శన మనునది చాల దుర్గ్రాహము. బహువిస్తృతము, సమస్తవిషయగర్భితము నగుటవలన జీవిత మెప్పుడును సంవిధానముల కధీనమై యుండఁజాలదు. కావుననే చారిత్రకనవలలలో సుదృఢబంధ మున్నట్లు సాధారణముగ నగపడుట దుర్ఘటము. నాటకోచిత శీలప్రధాననవలలకంటెఁ జారిత్రకనవల, యందువలననే యీ విషయమునందు లొచ్చిపోవును.

చారిత్రకనవలలలోని కార్యవిధానము స్థూలదృష్టికిఁ జాలవఱకు హఠాత్సంభవముగఁ దోఁచును. కాని సూక్ష్మముగఁ బరిశీలించినచో నందలి విషయము లొకనిర్దుష్టము నిష్కృష్టము నగు పంజరమున సుసంఘటితములని విదితము గాకపోవు. ఒక నిశ్చితమైన చట్టము,[1] స్వచ్ఛందము నవిచారితమునైన ప్రగతియు, ననునవి రెండును రసరూపమగు చారిత్రకనవల కనివార్యములు. చట్టము లేనియెడల నా నవల రూపరహితము. ప్రగతి లేనియెడల నది జీవరహితము. చారిత్రకనవల కీ పంజర మనునది సర్వసామాన్యమైన యాథార్థ్యమును, బ్రగతియనునది విశేషమైన యాథార్థ్యమును బోంచుపఱచు చున్నవి. చారిత్రకనవలకుఁ గాల మనెడిది మూలాధారశిల. కావునఁ గథా

1. Frame work.

పదకము[1]నకు రూపాంతరములగు పంజరము[2], ప్రగతి[3]యు నను నవి కాలముయొక్క రూపద్వితయము. పంజరమును గాలముయొక్క యాకస్మికావిష్క్రియ యనియు ననవచ్చును.

నాటకీయనవలయందును జారిత్రకనవలయందునుగూడఁ గాలముయొక్క క్రమపద్ధతినిబట్టియే పాత్రోన్మీలనములో మఱల ద్వైవిధ్యము గలదు. పాత్రోన్మీలనములో జారిత్రకునిది దశాబ్దవిభజనదృష్టి; లేదా, బాల్యకౌమారయౌవనవార్ధకాదిదశావిశేషవిభజన దృష్టి. అనఁగా జారిత్రకనవల కాలపరిణామమును గొల్చునది, పాత్రలజీవితఘటనలను వానివాని పరిణామమును బట్టికాదు. పాత్రలబుద్ధి, కర్మానుసారిణియగుటయుఁ దత్కర్మ క్రమక్రమపరిపాకమునకు వచ్చుచుండుటయునుబట్టి నాటకీయనవల, కాలపరిణామమును గొల్చును.

చారిత్రకనాటకోచితనవలానిర్మాణములయందలి భేదమునుగూడఁ బరిశీలించుట యావశ్యకము. నాటకీయనవలయందలి పదకము, సక్రమము, సహేతుకమునగు పరిణామరూపము. చారిత్రకనవలయందలి పదకము మాలాపరంపరితములుగాని వృత్తాంతముల సంకలనము కాని, యా వృత్తాంతము లొక విధముగ దిటమైన బాహ్యాభివర్ధనముగలవి. ఈయభివర్ధనమునే మానవబుద్ధి కాల మను పేరిట వ్యవహరించు చున్నది. ఈ బాహిరంపుజగత్సంబంధమైన పరిణామమే విశేషవిషయములకు భిన్నభిన్నార్థములను, మూల్యములను గల్పించును. అనఁగా నిది నాటకీయనవలయందలి ప్రత్యేకవిషాదాంత పరిస్థితిని, జారిత్రకనవలయందలి సార్వజనీనకరుణా సమన్వితపరిస్థితిగ మార్పఁగలదు; నాటకీయనవలదైన యనివార్యపర్యవసానమును జారిత్రకమునందలి యాకస్మిక ఘటనగ మార్పఁ గలదు; నాటకీయమైనదానిలోని నిరపేక్ష్యమును జారిత్రకమైన నవలలోని సాపేక్ష్యముగ మార్పఁగలదు. ఈ మార్పునుగూడఁ గడు సహజము, ననివార్యము నన్నట్లుఁ జేయును. ఇంతకునొక్కమాటలో జెప్పినచో నాటకీయనవల జగద్వ్యాప్తముగ సర్వథావిస్తరింపఁబడినయెడల నొకవిధముగఁ జారిత్రకనవల యగుచున్నది.

చారిత్రకనవల సాధించుకార్యము హఠాత్సంభవమటుల నుండవలెను. అన్నిటియందుకంటె మానవప్రాణప్రయాణవిధానమునం దిది యవలంబించు స్వేచ్ఛానిరంకుశత్వములు నిరుపమానములు. నాటకీయనవలయం దన్ననో పాత్రలు చమత్కారముగ సకాలమునఁ బంచత్వమునొందును; కర్మ విస్పష్టము, ప్రత్యక్షము, స్థూలమునైన రూపముదాల్చి జగద్వ్యాప్త మగుచున్నట్లుండును. చారిత్రకనవలయందు కర్మ మార్మికముగఁ దోఁచును; అనఁగా, మతసంబంధమగు రూపమును దాల్చును. చారిత్రకనవలా కర్తృదృష్టియందు కర్మ మతపరమైనది. నాటకీయనవలాకర్తకుఁ గర్మపరిపాకము,

---

1. Plot. 2. Frame work. 3. Pro-gres'sion.

కార్యకారణసంబంధజన్యము; చారిత్రకనవలాకర్త కది యలౌకికము, మానవాతీతము నగు కారణములవలనఁ గలుగు ఘటన. ఒకేసత్యమును వీరు భిన్నదృక్పథములనుండి వ్యక్తీకరించు చున్నారు.

ఇంతకుఁ జారిత్రకనవల నిట్లు నాటకోచిత నవలాదికముతో దారతమ్యముచేసి పరిశీలించుట, దాని ప్రాశస్త్యమును నిరూపించుటకేగాని యన్యముగాదు. విశేషించి యాంధ్రనవలాసాహిత్యములో జారిత్రకనవలకుఁగల స్థాన మద్వితీయము. కాని యీ చారిత్రకనవలావిశేషములలో వాస్తవికత కధికముగఁ బ్రాధాన్య మిచ్చునట్టి 'తాత్కాలికనవలా'1 రూపములు కొన్ని యిమిడి యున్నవి. ఈ తాత్కాలికనవలకును జారిత్రకనవలకును గల భేదముల నిట్లు నిరూపింపవచ్చును.

ఒక్కగుణమునందేగాక, సాహిత్యప్రక్రియగాగూడఁ దాత్కాలికనవల, చారిత్రకనవలకంటె భిన్నమై యున్నది. అది యొక సత్యమును, మానవజీవితసత్యముగ, సార్వకాలికమైన దానినిగఁ జిత్రింపఁజూడదు. ఒకానొక పరిణామదశావిశేషమునకుఁ జెందిన సంఘచిత్రణముతో దానికి సంతృప్తి. తత్సంఘమునకుఁ బ్రాతినిధ్యము వహించునంతవఱకే యా పాత్రలు సత్యమైనవి; అస్తిత్వమును గలవి. తాత్కాలికనవల, సమస్తమును విశేషవిషయముగ సాపేక్ష్యముగఁ జారిత్రకముగ భావించును. ఇది విశ్వజనీనసామర్థ్యముగల భావనాశక్తితో జీవితమును బరామర్శింపదు; ఎంతసేపును సిద్ధాంతీకరించుబుద్ధి తోడ్పడుచుండఁగా విజ్ఞానమునకై వెదకులాడు చూపులతో బరామర్శించును.

తాత్కాలికనవల, వాస్తవికతపేరిటఁ దాత్కాలికపరిస్థితులకుఁ గట్టువడి బంధితమగుట చారిత్రకనవలకు న్యూనత నాపాదించుటయే యనకతీరదు. సార్వకాలికములగు కొన్ని విమర్శనసూత్రములనుగూడ నిది తాత్కాలికముగ మోఘీభూత మొనర్చినది. ఆ సంకుచితసిద్ధాంతము లచ్చటచ్చట నేఁటికిని వేరూరి యున్నవి. విపులభావనాశక్తినిరూపణయొక్క నిర్దుష్టతకంటె, విపులసమకాలీనవిషయనిరూపణయొక్క నిర్దుష్టతకుఁ బ్రాధాన్యము పెఱిగిపోయెను. విషయముల ఛాయాచిత్రగ్రహణశక్తియుక్తులకును దచ్ఛ్రద్ధాశ్రమలకును విశేషించి యీ నవలాకర్తలు గర్వింపసాగిరి. వీరి దృష్టిలో భావచిత్రముల నిర్మాణము బహుసుకరము, లాఘవమును గూడ. రసస్వరూపమగు కావ్యప్రక్రియగాఁ నవల కింతకుమించి యధఃపతన ముండఁబోదు.

---

1. ' The period Novel ' or ' The Contemporary Novel '.

స్థూలముగ నవలకును దాత్కాలికనవలకును విభేదముల నిట్లుఁ జేర్కొన వచ్చును:—

నవలయందు ప్రాయోభావ ముండును. అనఁగా నందలి కథ జరుగఁగలది. తాత్కాలికనవలలోని కథ జరిగినది. దానికి భవిష్యముపై నాశ. దీనికి భూతమునందు సంతుష్టి. ఆ భవిష్యత్తు వర్తమాన మెప్పుడైనఁ గావచ్చును. అతురతః వర్తమానము గా నక్కఱలేదు. మానసికముగనైనఁజాలును; ఆనంద మనుభూతికి రాగలదు. గతము మఱల వర్తమాన మగునను నాశకంటె భవిష్యము వర్తమాన మగునను నాశ యెక్కువ సహేతుకము.

మొత్తముమీఁదఁ దాత్కాలికనవలకు వాస్తవకతపై ననే దృష్టిగాని రససంపాదనముపై దృష్టి లేదు. అందుచే దాని నన్ని నవలలవలె రసరూప మనలేము. తాత్కాలికనవలారచయితలు విశ్వజనీనతాలక్షణములను బాటించుటచేగాక, ధిక్కరించుటచే దానిని సాధించు చున్నారు. ఈ విధమైన నవల, భావియుగమువారికిఁ గేవలము చారిత్రకకౌతూహలము నాపాదించు నంశములయందును దత్త్వమునందును శ్రద్ధనిల్పు చున్నది. ఒక ప్రత్యేకవాతావరణమో యొక ప్రత్యేకయుగమోమాత్రమే, దానికి లక్ష్యము.

భావనాశక్తిగల రచయిత యొక సంఘమును జిత్రింపఁగలఁడు; కాని చరిత్రకారుఁడుమాత్రమే యొక సంఘమును బునస్సృష్టి చేయఁగలఁడు, లేక పరిణామశీలమగు సంఘమును జూపఁగలఁడు. కృత్రిమములు, కపటములు, మృషలు నగు విషయములతోనిండినచరిత్ర నడుమనడుమఁ గల్పనలతో సమ్మిశ్రిత మైనప్పు డుద్భవించునది తాత్కాలికనవల. అది చరిత్రగానగుట యథార్థమైనచో నవలయగుట యయథార్థము. అట్లే నవలయగుట యథార్థమైనచో జరిత్రయగుట యయథార్థము. అది సాంఘిక చరిత్రవిద్యార్థికిఁ దోడ్పడునప్పుడు విమర్శకునకుఁ గొఱగాదు; విమర్శకునకుఁ దోడ్పడుట యనఁగా, సాంఘికచరిత్రవిద్యార్థికిఁ గొఱమాలుట. అట్టిది పైరెండు విషయములకు నతుకులబొంత వంటిది; ఆ విషయముల సంగ్రథన మనరాదు. ఆదిమవాసుల నాఁటి గాథలలో, దీనియందుకంటె, భావనాతత్త్వపటిమ మెక్కువ. వర్తమానకాల మిచ్చు ప్రాధాన్యమునుబట్టి తాత్కాలికనవలనుగూర్చి యింత చెప్పవలసి వచ్చెను.

కాఁగా, నెంత ప్రాదేశనిష్ఠమైనను సమకాలికప్రాధాన్యముమాత్రమే గలదియైనను, దాత్కాలికనవలసైత ముత్తమచారిత్రకనవలల స్థాయి నందుకొన వీలున్నది. అది యెట్లన, విశ్వజనీనత సాధించుటవలన నని సమాధానము. అగుచో మన 'పలనాటి వీరకథ' విశ్వజనీనత సాధించి యుదాత్తచారిత్రకనవలలలో నగ్రస్థాన మెట్లు సంపాదించినదియు నిరూపించుట యిందు ముందు కర్తవ్యము.

*"పలనాటి వీర కథ" : అపర భారతకథ :—*

తెలుఁగునాట 'కారెమపూడి' యపరకురుక్షేత్ర మయ్యెను. ఈ యర్థమును నిరూపించుటకే మొదటినుండియు నీ నవలాకారుఁడు విషయములను బన్నుకొనుచు వచ్చినాఁడు. కావుననే యాతఁడు కొన్ని యంశముల నీ చరిత్రలో జేర్చుటయు మార్చుటయుఁ గలిగినది. అందుచేత స్థూలముగ నిది మహాభారతకథ ననుసరించుచున్న దని నిరూపింపవచ్చును. తాత్కాలికనవలయయ్యు నిట్లు విశ్వజనీనతను సాధించుట వలననే యిది యుత్తమచారిత్రకనవల యగుట.

ధార్తరాష్ట్రపాండవులకు మహాభారతకథలో దాయబంధువిరోధముకలిగి, తొలుత రాజ్యవిభజనగా బరిణమించినది. మన నవలలోఁగూడ నలగామసోదరుల విరోధము మాచెర్ల విభజనతో బ్రారంభించినది.

దుష్టచతుష్టయమువలనఁ బాండవకౌరవులద్వేషము లెట్లుఁ బ్రబలెనో, యట్లే నాగమ్మ నరసింగరాజాదులవలన, నలగామ మలిదేవాదుల ద్వేషములును బ్రబలెను.

అందుగల రెండు మాయదురోదరములు నిందుగల రెండునాళ్ళ కుక్కుట మాయా యుద్ధములతో సాటియనిచెప్పఁ దగి విషమపరిస్థితులకు దారిదీసినవి. ఈ రెండు కథలలోను గెలుపు తొలుత వంచకులనే వరించినది. కాని తుదకు వంచితులే నెగ్గి శాంతి సుఖముల ననుభవించిరి. ఈ రెండును లోకధర్మము లని యీ నవలవలన సమానముగ సూచింపఁబడెను. పాండవులవలె మనకథలో మాచెర్లవారును బందెమున నోడిపోవుటచే బ్రవాసజీవితము గడపిరి. నదీపర్వతప్రాంతారణ్యములయందు నివసించుటలో దుర్గమ మార్గములయందు ప్రయాణించుటలో, బరిమితపరివారముతో నిరాడంబరముగఁ బ్రశాంతజీవితము సాగించుటలో, రెండుకథలయందలి పాత్రలకును సాదృశమున్నది. ప్రవాసులలోనొకరు దేవాలయాది నిర్మాణముచేతను మఱియొకరు తపోయజ్ఞయా గాదినిర్వహణముచేతను నూఱట నొందిరి. పలనాటివీరులకుఁ గందమూలాదులేభుక్తి. ఇందుగల మందాదిగోగ్రహణ మందుగల రెండు గోగ్రహణములను దలఁపించుచున్నది.

భారతకథలో బాండవకౌరవు లిరుపక్షములవారును శ్రీకృష్ణు సంజయు రాయ బారముల నడపుదురు. 'పలనాటివీరకథ'లోఁగూడ నలరాజ కేతరాజాదులవి రాయ బారములు సాగినవి. సంధియత్నములు విఫలమగుటయందుకూడ రెండింటను సామ్య ములు కుదురుకొనెను. అటు, కౌరవపాండవులఁ బొందుపఱుప నేఁగిన సంధాత యిరు పక్షములవారికి నాప్తబంధువు, శ్రీకృష్ణుఁడు; అయ్యును భగవానుఁడు కావున నాతనిని బంధించు ప్రయత్నములుమాత్రమే జరిగినవి. ఇటు నలరాజుకూడఁ గులీనుఁడు; ధీరుఁడు; వీరుఁడు; ఇరువాగులవారిని గూర్చువాఁడు; చెన్నకేశవుని భక్తుఁడు; కాని మానవమాత్రుఁడు. అందుచే విషప్రయోగమునకు గుఱియయ్యెను.

ఇఁక సమరసన్నాహములకు దిగినపుడు కౌరవపాండవులకు నానాదేశాధీశుల సాహాయ్యము సమకూరినది. నలగామునకుఁ బ్రతాపరుద్రాది సహాయత కలదు. మలిదేవునకు గండు కన్నమనాయనియుఁ గొమ్మరాజాదులయుఁ దోడ్పాటున్నది. వీరారెడ్డి మున్నగువారు వీరకిని, బ్రహ్మనాయఁడు మున్నగువారు వారికిని, మహాయోధులు పలనాటికథలో గలరు. భారతగాథలో భీష్మద్రోణాదిమహారథు లొకరికిని ధర్మజ భీమార్జునాది యోధు లింకొకరికిని గలరు.

సుభద్రార్జునుల కేకైకపుత్త్రుఁడైన యభిమన్యుఁ డందు మహాపరాక్రమశాలియై వీరవిహారము సలిపెను. ఐతాంబకును బ్రహ్మనాయకునకును సర్వస్వమని చెప్పఁదగిన బాలచంద్రుఁ డిందు రణోత్సాహము చేత విలయతాండవముచేసి విజృంభించినాఁడు. ఈ రెండుకథలలో వీ రిరువురిసామ్యమును జాలఁ బ్రధానమై యెల్లవారి నాకర్షించుచున్నది. యౌవనప్రాంగణమున నున్న యీ యిద్దరు వయసున సమానులు. ఇరువురి భార్యలును ముగ్ధలు; వీరపత్నులు. పరపక్షముల కీ వీరు లిరువురును సమానముగఁ బ్రళయసంహారము గలిగించిరి. కాని తమతమ వీరవిలయతాండవమునకును, బ్రతాపమునకు, ననుగుణముగాని, వంచనతోడి మరణ మిర్వురకును బొందుపడుట కడుఁ గరుణ గొలుపు యదృచ్ఛాసంఘటనము.

ఇరుతెగలవారును నడుమనడుమ జ్ఞాతిబంధువధాభీతివలన విషాదయోగముల నొందుచుండియు, సర్వనాశన మగువఱకుఁగూడ సమరము సాగించుటలో నీ రెండు కథలును దమకు దామె సాటి. యుద్ధముచే బ్రాయశ్చిత్తము జరిగి, పశ్చాత్తాపము గలిగి శాంతిసమాప్తికి నిరుపక్షములు నంగీకరించుటలో నీ రెండును మెండుకొన్న కావ్యములు.

కౌరవపాండవులు తమలోఁదాము కలహించి పడిన కష్టములు, శ్రీకృష్ణురాయబారము, బాలచంద్రాభిమన్యులసామ్యము నరసింహబాలచంద్రులు కురుక్షేత్రమునందలి కర్ణార్జునులఁ దలఁపించిరను పోలికయు, విజయలక్ష్మిని స్వీకరించికూడ ధర్మజుఁడు పొందిన నిర్వేదము, మున్నగువిషయములు తగు తావులందు బ్రాసంగికముగ మన యీ నవలలో బ్రస్తావింపఁబడినవి. మహాభారతకథకు మన దేశమున మహాజనముపై నెంత ప్రభావముగలదో, యంత ప్రభావమును బలనాటి ప్రజానీకముపై నీ నవలకుఁ గలదు. కావున ముఖ్యముగఁ బలనాటివారికిఁ గార్యమాపురి కురుక్షేత్ర మైనది. అందుచే నీ వీరకథ యపరమహాభారతకథ యైనదనుట దృష్టారము.

*చారిత్రకనవలలలో "పలనాటి వీరకథ"కుఁగల స్థానము :—*

ఆఖ్యాయిక, కథ యని గద్యకావ్యములు ముఖ్యముగ రెండుతెగలు. అందు నిజముగ జరిగిన కథను జెప్పెడి గ్రంథ మాఖ్యాయిక. ఇతరకల్పితగాథలను జెప్పెడి

వచనకావ్యము పేరు 'కథ'. "పలనాటివీరకథ"ను దాను కర్త చారిత్రకనవల యని పేర్కొనెను. దాని కొకేమాట యాఖ్యాయిక. ఆఖ్యాయికకుఁగల ప్రధానలక్షణముల నెంచి, వాని నీ 'పలనాటివీరకథ'యను చారిత్రకనవలలో సమన్వయించుట కర్తవ్యము.

కథావస్తువును బాత్రలను నొకానొక కాలవిశేషమునకుఁ జెందిన ట్లన్వయించి చూపుటయే చారిత్రకనవలకుఁ బరమలక్ష్యమని మున్ను నిర్ధారితము. కాని, దీనిలో రెండుతెగలు గలవు. ఒకజాతినవలలో దేశకాలములతోపాటు పాత్రలుగూడఁ దొల్లిటివై యితిహాసప్రసిద్ధములై యుండును. ఇట్టివానిని 'విశుద్ధచారిత్రకనవల' లనుట సమంజసము. మఱికొన్నిటియందు దేశకాలములు చరిత్రసంబంధములై యుండఁగా, బాత్రలుమాత్రము వాని కనుగుణమైయుండియుఁ గవికల్పితములై నెగడును. వీనిని "గాల్పనిక[1]చారిత్రకనవల"లనుట యుక్తము. ఈ కాల్పనికములు చాలవఱకుఁ జరిత్ర యనెడి చట్టములో నమర్చిన నవ్యచిత్రములు. మన "పలనాటివీరకథ" మాత్రము విశుద్ధచారిత్రకనవలల తెగలోనిది.

అన్ని చారిత్రకనవలలయందువలె నితివృత్తము, పాత్రశీలచిత్రణము, దృశ్యకావ్యపద్ధతియు, నిందుకూడ నావశ్యకమైయైనను విశుద్ధజాతికిఁ జెందిన యీ నవలను బ్రత్యేకముగా నెన్నవలసిన కారణము గలదు. దీని గౌరవమును నిర్ణయించు కొలత బద్దయే వేఱు. దీనియం దుండు విశేషగుణ మితరవిధములైన చారిత్రకములయందు గోచరింపదు. ఇందలి దేశకాలచిత్రణమే దీని కా విశిష్టత నాపాదించును. దేశకాలచిత్రణము లన్ని చారిత్రకనవలలలో నుండవచ్చును. కాని, వాని కందు లభించు స్థానము గౌణము; ప్రధానమైనది కాదు. కాఁగా విశుద్ధనవలలను సమీక్షించునపుడు వానిలో నిమిడియున్న యితరతత్త్వముల చింతనముపైకంటె, నీ దేశకాలచిత్రణముల చింతనపై నెక్కువ ధ్యాన ముంచవలెను. దేశముకూడఁ గాలముగాఁ గరఁగిపోయిన ట్లగపడు నంతటి ధ్యానమని మున్నె నిరూపింపఁబడినది. ఈ చిత్రణ మట్టి విశుద్ధచారిత్రకనవలలకు జీవాతువు; అదియే ప్రత్యేకస్థానమును సంపాదించు విశిష్టలక్షణము. ఇది వినా, దానిపేరున కర్థమేయుండదు.

మన యీ విశుద్ధచారిత్రకనవలయందలి యాకర్షకము, సాహిత్యమూల్యమును గూడఁ జాలవఱకుఁ దెలుఁగుసీమవర్ణనముపైనను, నా చరిత్రఖండమునాఁటి సాంఘిక సైనిక రాజకీయ వైజ్ఞానికమతసంబంధి పరిస్థితుల సజీవచిత్రణముపైనను నాధారపడియున్నవి. ఆ జీవితచిత్రణము నందలి శ్రేష్ఠతకూడ, నా యా విషయముల వర్ణనములలోని తాదర్థ్యమును, దాద్రూప్యమును, బ్రభావమును నాశ్రయించి యున్నది. ఆ కోడిపందెములు, నా బొంగరములయాటలును, నాఁటి సాంఘికజీవిత

(1) Romantic.

మందలి నిజమగు వినోదక్రీడావిశేషములను జిత్రించి చూపుచున్నవి. సాటిరాజులచే బందుగవినోదముల కాహూతులై యే రాజులును రాకుండమాన రనునది వారి సంప్రదాయమును బేర్కొనును. రాజకీయవిద్వేషము లాప్తబంధుత్వమునుగూడఁ బాటింప నీయక విషప్రయోగములను జేయించెడి వనుటకు నలరాజుమరణవృత్తాంత మనురూపమై యున్నది. మాంచాలవీరపత్నీత్వము, పేరమ్మసహగమనము మున్నగునవి, వారి వారి యింటికట్టడులను గన్నులకుఁగట్టు సత్యములగు సజీవచిత్రములు. మన నవలాకారుఁ డతీతకాలమందలి జీవితమును దన యుత్పాదనశక్తిచే జిత్రించుటలో ననౌచిత్యమును బరిహరించి, యౌచిత్యమును బాటించినాఁడు. అందుచేతనే యిది జీవితోపమమగు వాస్తవికసృష్టియై సర్వాంగసౌష్ఠవము, పరిపూర్ణతయు నేకత్వమును సంగ్రహించుకొన్న కళాకృతియైనది.

పురాతత్త్వజ్ఞానము, పాండిత్యము, భావనాశక్తి, యౌచిత్యము నను నాలుగు ప్రధానసాధనములు చారిత్రకనవలాకర్తకుఁ దాత్కాలికసంఘజీవితమును జిత్రించుటలో నుపకరించును. ఇందు మొదటిరెంటినిగూర్చి యొకమాట. ఇవి యొకానొక యతీత యుగమందలి జీవితమును స్ఫురింపఁజేయుటకు మిక్కిలి యావశ్యకములేగాని, కేవల విజ్ఞానప్రదర్శనమునకు బాండిత్యప్రకర్షకు నైనచో, నా కళాసృష్టికి భంగకరములు. వాని నుచితముగ నుపయోగించుకొనుటనుబట్టి చారిత్రకనవల వన్నెకెక్కఁగలదు. ఉదాహరణకు మన 'పలనాటివీరకథ' ననుశీలించినచో, నిందలి శైలి సులభము. సరళము, సుగమము నని తోఁపకపోదు. ఇందలి విజ్ఞానము మనోహరము. ఈ రెండు నిందలి కావ్యకళాసృష్టికి భంజకములుగాక సంగతములై యనువుపడుచున్నవి; దీని యుత్కృష్టతకుఁగూడఁ దోడ్పడుచు నున్నవి.

ఇక మూడవ యుపకరణము భావనాశక్తి. ఇది చాల ముఖ్యమైనది. ఇదిలేని సాంఘికజీవితచిత్రణము కేవలము చరిత్రలోనికి దిగజారును. చరిత్రలో భావనాశక్తి సమ్మిశ్రితమగుట చారిత్రకనవల కావశ్యకలక్షణము. అనఁగా, చారిత్రకవిరుద్ధములైన యనుచితవిషయములను బరిహరించుకొనుట, యీ జాతి నవలాకారుని బ్రథమకర్తవ్యము. ఒక్కొక్కప్పుడు కల్పితవిషయములనైనను స్వీకరించుట కార్యము. కాని యాకవ్యకల్పన, చారిత్రకసత్యమునకు లోఁబడవలెను. అనఁగా,నది సంభవింపఁదగిన దిగనైనను౦డవలె నన్నమాట. ప్రాయోభావ ముండవలెనని మున్ననుట యిదియే.

మన నవలనుండి క్రమముగ నీ రెండు సంగతులను నుదాహరింపవలెను. చరిత్రవలన నాగమ్మ యనూనుషి యని తెలియుచుండఁగా, గల్పనవలన నామెను సచ్చరితఁగా జిత్రింపఁజూచుట చారిత్రకవిరుద్ధము.

అయ్యును బాత్రల గుణదోషములను స్పష్టీకరించుట కనువగు కొన్ని క్రొత్త ఘట్టములను రచయిత కల్పింపవచ్చుననుట ప్రకటము. నన్ని వేశములు చరిత్రాత్మక

ములు గాకపోయినను దోషము రాదు. ప్రవాసమున కేఁగునపుడు కృష్ణవేణినిదాఁటిన బ్రహ్మనాయఁడు నిజముగఁ జెన్నకేశవుని దలఁచుకొని నిట్టూర్చి వెడఁదకన్నుల సీరు నించెనో, లేదో! 'చంద్రవంక' జలపాతమును జూచుచుఁ గడపిన సాయంసంధ్యల తలఁపుచే బాలచంద్రుని హృదయము బరువెక్కెనో లేదో! కాని యివి యసంభవము లనుటకు వీలుకానివి. అట్లే నాగమ్మవి కొన్ని కుట్రలు కల్పితములైనను బ్రాయోభావము కలిగి పొందిపొసఁగి యున్నవి.

కాని, యేదైన నైతిహాసికఘట్టమును బరిగ్రహించినచో దాని వర్ణనమందు నవలాకర్త చరిత్రాధారముగల సత్యమునే నిరూపింపవలెను. లేదా, చరిత్రప్రసిద్ధికి భంగము. ఆ రచన విరుద్ధ మగుటచే గార్హ్యము. అం దౌచిత్యము లేదన్నమాట.

అందువలననే సాంఘికజీవితచిత్రమునకు నాల్గవసాధన మౌచిత్య మనుట. 'సంగత'మని దీనికే మఱియొక పేరు. ఈ 'పలనాటివీరకథ'లో నసంగతమను దోషమే లేదు. ఈ గ్రంథశ్రేష్ఠతకుఁ గారణములలో నిది యొకటి. ఆ కాలమున కనుగుణమగు నాచారములు, ప్రకృతులు, స్వభావములు, మతసాంఘికరాజకీయపరిస్థితులు నిందు సహజరీతిని బొందుపఱుపఁబడినవి. ఆ నాఁటి స్థితిగతులను దచ్చరిత్రఖండమునందలి యంశములను బూర్తిగ నాకళించుకొనుటచేత మన రచయిత సఫలతాప్రాప్తి నొందెను.

ఇతరరచయిత లందఱికంటె జారిత్రకనవలాకర్తకుఁగల యాంతలను, నాటంకములను నితఁడు గుఱుతించెను; గుఱుతించుటయే కాదు; ప్రతిభతో వానిని దాఁటుకొనినాఁడు. పిదపఁ బైనఁజెప్పిన సాధనచతుష్టయము నేకోన్ముఖముగఁజేసి యానాఁటి వాతావరణప్రభావమును, బరిసరప్రభావమును నవలయం దంతటను వెదజల్లెను. అసాధారణప్రజ్ఞతో నా కాలమునందుచొచ్చి నివాసము గల్పించుకొనినాడు. ఇట్లధివసించుటవలనఁ బరిస్థితులకుఁ బాత్రలకు నడుమ సామంజస్యము పొసఁగించెను. ఆ సామంజస్యము, రచనయందు విశ్వాసమును గొలుపుచున్నది. విశ్వాసనిధాన మగుటచే నీ నవల రసనిధాన మయ్యెను; రసనిధాన మగుటచే నాఁటి చారిత్రకనవలలలో నుచ్చస్థితి నందుకొన్నది. కావున నిది చిరస్థాయి.

( ప్రథమ భాగము — సమాప్తి )



# సూచి 1

( ఉపశీర్షికల క్రమము )

పంచమప్రకరణము :-

షష్ఠప్రకరణము :—

## సప్తమప్రకరణము

స్వాతంత్ర్యానంతరయుగము ౧.

———•———

# సూచి 2

## ౧. అకారాది-వ్యక్తుల క్రమము

వ్యక్తులు — పుట



### భ



### మ



వ్యక్తులు — పుట



### య



### ర

## ౨. అకారాది - గ్రంథాదిక్రమము

# (3) అకారాది - విషయాదిక్రమము

# శోధనపత్రము

## [కొన్ని ముఖ్యమైన సవరణలు]

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| I | 13 | బడినవి | బడినవి |
| II. | 11 | వెఱు | బడుటవేఱు |
| | 22 | అర్థా | అర్థా |
| VII | 4 | భ్యాయి | ఖ్యాయి |
| 1 | 4 | ఆభ్యాన | ఆఖ్యాన |
| | 25 | Culcutta | Calcutta |
| | 29 | Cotophon | Colophon |
| 2 | 8 | యందుఁగూడ | యందుకూడ |
| | 17 | burg | berg |
| | 21 | పద్యమయియని | పద్యమయమని |
| | 29 | Marchen | Maerchen |
| 3 | 1 | విథానము | విధానము |
| | 2 | ప్రథానాంగ | ప్రధానాంగ |
| | 24 | స. వి. అ. స | స. వి. అ. న |
| | 39 | Lannean | Lanneman |
| 4 | 21 | నారాశంసులు2 | నారాశంసులు3 |
| | 27 | Satapadha | Satapatha |
| 5 | 36 | Shedien | Studien |
| 7 | 7 | బోధించుచు | బోధించు |
| | 15 | సహితములు, | సహితములు; |
| | 32 | a | |
| | 33 | Oriertal | Oriental |
| 10 | 22 | అపభ్రంశ | అపభ్రంశ |
| 11 | 4 | ఖానుహుని | ఖామహుని |
| | 27 | కథావి | కథాహి |
| 13 | 24,25 | ఇతివుపేక్షితం | ఇత్యుపేక్షితం |
| 14 | 12 | విప్రలంభో | విప్రలంభో |
| | 26 | Bandarkar | Bhandarkar |
| | 30 | ఓసరాది రవ | ఆసారాదీ న్యవ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 15 | 10 | చతుర్ధ | చతుర్థ |
| | 22 | వక్రంచ | వక్త్రంచా |
| | 26 | సంస్కృతసంస్కృతా | సంస్కృతం సంస్కృతా(?) |
| | 27 | అన్యైః | అన్యైః |
| | 27 | తాస్యాం | తస్యాం |
| | 29 | భానమహః | భామహః |
| 16 | 2 | శబ్దార్ధ | శబ్దార్థ |
| | 6 | కథార్ధ | కథార్థ |
| 16 | 15 | జీనానంద | జీవానంద |
| **16** | **25** | **Sea** | **See** |
| 18 | 28 | దోషావా | దోషోవా |
| 19 | 24 | కారణమ్ | లక్షణమ్ |
| 20 | 27 | భవిష్యతీతి | భవిష్యంతీతి |
| | 28 | ప్రతిపాదనం | ప్రతిపాదనం |
| 23 | 20 | నృపేవ | నృపేచ |
| | 21 | మచిదధ్యాత్ | మభిదధ్యాత్ |
| 24 | 31 | త్రిధా | త్రిధా |
| | 32 | ధ్వన్యాలోకాము | ధ్వన్యాలోకము |
| 25 | 29 | ఏవాన్యవా | ఏవాన్యోవా |
| 31 | 37 | ఉపరిథ | ఉపరికథ |
| **31** | **24** | **Sangralaha** | **Sangraha** |
| 32 | 1 | గొన్నిఁటి | గొన్నిటి |
| 32 | 11 | వక్రావరద | వక్త్రావర |
| 41 | 26 | చ్ఛందో | చ్ఛందో |
| 42 | 11 | భాణుఁడు | బాణుఁడు. |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 43 | 24 | కృత్తె | కృత్తై |
| 44 | 13 | సుంబంధుని | సుబంధుని |
| 45 | 2 | గః | గఁ |
| | 5 | వలనారంభించి | నారంభించి |
| | 24 | భామహం | భామహు |
| 46 | 6 | రథము | రథము |
| 51 | 12 | బ్రప్రథమ | బ్రప్రథమ |
| 54 | 28 | 1ఆ-వ | 1ఆ, 15వ |
| 56 | 26 | నిడదవోయి | నిడుదవోలు |
| 58 | 19 | బాత్రలుము | బాత్రలు |
| | 23 | Id స్వీయచరిత్రము, | రెండవభాగము |
| 59 | 28 | 1 | 2 |
| 60 | 18 | ప్రవర్ధిల్ల | ప్రవర్తిల్ల |
| 62 | 20 | గల్పింట | గల్పించుట |
| 62 | 3 | నిర్బరత | నిర్భరత |
| | 23 | కధ | కథ |
| | 29 | కాదు | కాదు. |
| 63 | 4 | వీధుల | వీథుల |
| | 5 | యెట్లు ? | యెట్లు"? |
| | ,, | ఆప్రధాన | అప్రధాన |
| | 24 | ఆనఁగా | అనఁగా |
| 64 | 11 | సూహితత్వ | సూహితవ్య |
| | 15 | గ్లప్త | గప్త |
| | 21 | ఆనఁగా | అనఁగా |
| | 24 | శతాబ్ధులు | శతాబ్దులు |
| 78 | 17 | నిగ్రహాము | నిగ్రహము |
| 80 | 26 | విలాస | చరిత్ర |
| 82 | 28 | మథుకర | మధుకర |
| 105 | 1 | కధలను | కథలను |
| 111 | 18 | పాత్రోన్మీలన | పాత్రోన్మీలన |
| 122 | 15 | గాదనిను | గాదని |
| 123 | 10 | నుండట | నుండుట |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 125 | 24 | 1804 | 1894 |
| 133 | 24 | రెడ్డి | రెడ్డి4 |
| | 31 | శురవరము | సురవరము |
| | 32 | **Mystaries of London.** | **Mysteries the Court London** |
| 136 | 26 | తతనము | పతనము |
| 141 | 28 | **urudu** | **urdu** |
| 148 | 23 | నారదసంభాషణ | నారదవిలాస |
| 181 | 4 | డాక్టరు బ్రౌన్ | బ్రౌన్ |
| | 20 | ఆటలపాటల | ఆటలపాటలు |
| 183 | 30 | కవులు | కవులచరిత్ర |
| 187 | 11 | థర్మవరపు | ధర్మవరపు |
| 194 | 9 | జగన్నాథశాస్త్రి | జగన్నాథస్వామి |
| 258 | 20 | కొనఁగగెను | కొనఁగలిగెను |
| 260 | 30 | రియనిజం | రియలిజం |
| 261 | 7 | ప్రథాముగ | ప్రధానముగ |
| | 25 | లిఖైన | లిఖ్తైన |
| 300 | 23 | సందర్భ | సందర్భ |
| 301 | 11 | ప్రస్మిద్ధ | ప్రసిద్ధ |
| 311 | 30 | యథార్థ | యథార్థ |
| 312 | 5 | వరిణమించి | పరిణమించి |
| 307 | 18 | యేండ్లు | ఏండ్లు |
| | 24 | పిలిపించుకొనన | పిలిపించుకొనిన |
| | 31 | నీమె | లీమె |
| 309 | 8 | నయోమము | వమోఘము |
| | 9 | బిరనోత్కంఠత | బరనోత్కంఠత |
| | 12 | నానర్శ | నాదర్శ |
| 310 | 1 | బాల | బాల్య |
| | 13 | శరద్ధర్శనము | శరద్దర్శనము |
| | 19 | మాగధులను | మాగధులును |
| | 22 | బ్రహత్వ | బ్రహ్మత్వ |
| | 27 | సామధానము | సమాధానము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 5 | స్వికరించు | స్వీకరించు |
| 319 | 23 | ధామస్ | థామస్ |
| 326 | 2 | యెవ్వతెఱుఁగరు | యెవ్వరెఱుఁగరు |
| 339 | 4 | బానిసత్యము | బానిసత్వము |
| | 20 | దదమ్యు | దదదమ్యు |
| 340 | 5 | సన్నిహిత్వ | సన్నిహిత |
| 343 | 6 | పమ్మతి | సమ్మతి |
| 344 | 2 | అర్ద | అర్ధ |
| 348 | 1 | గనిసి | గలిసి |
| | 4 | బుస్సు | బుస్స |
| | 7 | ద్రవ్యి | ద్రవ్వి |
| 393 | 6 | చివరను | చివరకు |
| 404 | 22 | పునర్ముద్రరణ | పునర్ముద్రణ |
| 406 | 1 | మూఁర్ఖుఁడు | మూర్ఖుఁడు |
| | 4 | సన్నివేశముల్లు | సన్నివేశముల |
| 425 | 24 | Satisty | Satisfy |
| 457 | 22 | కడపటికు | కడపటికి |
| 467 | 23 | నైహీక | నైహిక |
| 499 | 5 | తాకిక | లౌకిక |
| | 27 | బ్రాహీ | బ్రాహ్మీ |
| 500 | 2 | డైనాఁడు | డైవ |
| | 7 | పంపాదించెను | సం. |
| 505 | 25 | నంశమంతు | సం |
| 553 | 21 | ద్వేగోహతు | ద్వేగోపహతు |
| 563 | 18 | కాలాతీత్వ | కాలాతీతత్వ |
| 567 | 21 | మ్యోఘిభూత | మోఘీభూత |
| | 24 | గ్రహణకక్తి | గ్రహణశ |
| 568 | 9 | వాస్తవకత | వాస్తవికత |
| vii | 8 | విష్ణువరనుఁడు | విష్ణువర్ధనుఁడు |
| vii | 23 | దేఆర్యవుఁడు | ఆర్యదేవుఁడు |
| ix | 12 | దగ్గుబల్లి | దగ్గుపల్లి |
| ix | 19 | ధీరొద్ధతాది | ధీరోద్ధతాది |
| ix | 36 | కంకిటి | కంకంటి |
| x | 49 | రసగంగాధరకారుడు | రసగంగాధర కారుఁడు |
| xi | 20 | రైనాలు | రైనాల్గు |
| xi | 26 | పులుగురు | పులుగుర్ర |
| xii | 37 | శ్రీనివాస | శ్రీనివాసా |
| xiii | 8 | సుబంధుడు | సుబంధుఁడు. |
| xx | 28 | ఉచ్ఛాన్యము | ఉచ్ఛ్వాసము |

---

**Wrong Points,** వ థ ల వినిమయమువంటి యనివార్య దోషములను క్షమింపఁ బ్రార్థన.